# శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

## ఆఱవ సంపుటము


సంపాదకులు :

సాహిత్యభూషణ, విద్యాసాగర

ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఎం.ఏ., బి.ఎల్., బి.టి.పి. గారు.






శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

మదరాసు శ్రీరామకృష్ణమఠాధ్యక్షునిచే ప్రకటింపబడినది.



తొలికూర్పు—3,300

మార్చి, 1962





అట్టబైండు వెల : రూ. 5-00
కాలికోబైండు ,, రూ. 6-50

ది జ్యూపిటర్ ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు-18

## వి జ్ఞ ప్తి

భగవంతుని కటాక్షమువలన శ్రీ వివేకానందసంపూర్ణ గ్రంథావళిలోని ఆఱవ సంపుటమును మా చదువరుల కందజేయ గలుగుచున్నందులకు మేము విశేషానందము నందుచున్నాము.

ప్రతీచీఖండములందు విజయయాత్ర ముగించి, స్వీయసీమకు తిరిగి వచ్చిన పిమ్మట శ్రీ వివేకానందస్వామిజీ యొసగిన మహోజ్జ్వలభావసందీపితప్రసంగములు ప్రస్తుతగ్రంథమున పరిఢవిల్లుచున్నవి.

స్వామిజీ తొలుత కొలంబోలో దిగిరి; అందుండి రామేశ్వరము బోయిరి. ఆ దివ్యక్షేత్రమునుండి వా రుత్తరదిశగా పయనించి, హిమాలయములందలి ఆల్మోరా జేరుకొనిరి. స్వామిజీ యొసగిన ఆంగ్లోపన్యాసములు శ్రీ వివేకానందసంపూర్ణగ్రంథావళిలోని మూడవ యాంగ్ల సంపుటమున విశేషభాగమున వెలయుచున్నవి. "కొలంబోనుండి ఆల్మోరావరకు సలుపబడిన ఉపన్యాసములు" అను శీర్షికతో ప్రత్యేకగ్రంథముగా నవి ప్రకటింపబడినవి.

కీ॥ శే॥ శ్రీ తత్త్వానందస్వామిజీయును, కీ॥ శే॥ శ్రీ కె. మల్లికార్జునముగారును ఆ యుపన్యాసముల నాంధ్రీకరించిరి. "సందేశతరంగిణి" అను నామముతో రెండు సంపుటములుగా నవి మాచే ప్రచురింపబడినవి. వారికి మే మెంతయు కృతజ్ఞులము.

మూఢవిశ్వాసములందును, దారిద్ర్యమందును, బహుళ దురాచారములందును మునిగియుండిన భారతదేశమును పునరుద్ధరించుటకై శ్రీ స్వామిజీ నిర్ణయించిన బహుళోపాయములును, ప్రణాళికలును ఈ మహోపన్యాసములం దుల్లేఖింపబడినవి; ఆయన ప్రేమశరధి. మహాప్రవక్త. గభీరహృదయసముద్భవసూత్రములును

దూరదృష్టి సమన్విత సూక్తులును పాఠకుల యంతరంగములందు ఆధ్యాత్మికోద్వేగమును బుట్టించును; వారి శరీరములు విద్యుత్ప్రవాహముచే స్పందించును; ఆత్మ లుత్తేజితములగును. ఈ శక్తులు శ్రీస్వామిజీ సొమ్ములు. ఈ సంపుటముపై ప్రత్యేకదృష్టి సారించి, పఠిత లందలి పరమార్థమును గ్రహింతురుగాకయని మేము ప్రత్యేకముగ ప్రార్థించుచున్నాము.

ఆ కాలమున అమెరికా పత్రికలందు ప్రకటింపబడిన స్వామిజీ మహోపన్యాసవిషయములనుగూడ నిందు జేర్చితిమి.

ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎం. ఏ., బి. యల్., బి. టి. పి. గారు ఈ గ్రంథమును సంపూర్ణముగ పరిశోధించి, సంస్కరించిరి.

శివరాత్రి }
మార్చి, 1962 }

ప్ర కా శ కు లు.

# విషయసూచిక

# సందేశతరంగిణి

## ప్రాచ్యభూమియందు శ్రీ వివేకానందస్వాములవారొసగిన ప్రప్రథమోపన్యాసము

(కొలంబోనగరము)

పాశ్చాత్యఖండములందు మతప్రచారముచేసి విఖ్యాతి గడించినపిమ్మట శ్రీ వివేకానందస్వాములవారు 1897-వ సంవత్సరము జాన్యువరి 15 తేది మధ్యాహ్నవేళ కొలంబోనగరమున ఓడదిగిరి. అప్పుడు ఆ నగరమందలి హిందువులు శ్రీవారికి ఘనమగు స్వాగత మిచ్చిరి. ఆ సందర్భమున ఈ క్రింది స్వాగత పత్రము శ్రీవారి కర్పింపబడినది.

శ్రీమత్ వివేకానందస్వాములవారికి—

పూజ్యులగు నో స్వామీ!

ఈ కొలంబోనగరమందలి హిందువులు బహిరంగసభలో చేసిన తీర్మానము ననుసరించి మీకు హృదయపూర్వకముగా ఈ ద్వీపమున స్వాగత మొసగుచున్నారము. పాశ్చాత్యదేశములందు మహాప్రచారము కావించి స్వదేశమునకు తిరిగివచ్చు సమయమున మీకు స్వాగతమర్పించుటలో ప్రథములమగుట మాకు గొప్ప గౌరవముగా భావించుచున్నాము.

మీరు కావించిన ప్రచారము ఈశ్వరానుగ్రహమువలన ఎటుల విజయవంత మయ్యెనో మేము ఆనందముతోడను కృతజ్ఞతతోడను కనుపెట్టి చూచుచుంటిమి. సమస్తమతసంప్రదాయములకును సామరస్యమును కూర్చుచు, ప్రతిజీవికిని వానియవసరములనుబట్టి ఆధ్యాత్మికాహారమును పెట్టుచు, వాత్సల్యపూర్వకముగ భగవంతుని దాపునకు నడపునట్టి విశ్వవిస్తృత హిందూ

విశ్వమతాదర్శమును యూరపు అమెరికాఖండజాతుల వారికి ప్రకటించి తెలిపితిరి. అతిపురాతనకాలమునుండి ఋషిపరంపరలు వారి పావనపదస్పర్శచే భారతభూమిని పవిత్రము గావించి యుండిరి. వారు తమదర్శనముచేతను, ప్రబోధముచేతను సమస్త అవస్థాంతరములందును భారతభూమిని లోకమునకు జ్ఞానదాయినిగ నొనర్చి యుండిరి. ఆ గురుపరంపరనుండి ప్రసరించిన ప్రభావమువలన భారతధరిత్రి విశ్వజ్యోతియైనది. ఆ మహనీయులచేత నుపదేశింపబడిన సత్యధర్మమును మోక్షమార్గమును మీరు ప్రచారము గావించితిరి.

శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణపరమహంసదేవుని వంటి సద్గురుని దివ్యావేశము మూలమునను, మీ నిర్హేతుకజాయమానకటాక్షమువలనను, స్వార్థత్యాగసంజనితమహోత్సాహమువలనను, ప్రబోధమువలనను పాశ్చాత్య జాతులు భారతదేశపు ఆధ్యాత్మిక ప్రతిభతోడి అనుసంధానము పడయునట్టి అమూల్యవరప్రసాదమునకు పాత్రులు కాగలిగిరి. మన దేశీయులలో పాశ్చాత్యనాగరికత యొక్క వ్యామోహమునబడి తెప్పిరిలిన అనేకులు మన ప్రాచీన సంప్రదాయముల మహిమను గ్రహింపగల్గిరి.

మహనీయమగు మీ కృషివలనను, మార్గదర్శకత్వమువలనను, మానవజాతిని తీరరానిరీతిని కృతజ్ఞతాబద్ధుల గావించితిరి. మన మాతృభూమిని అపూర్వతేజోవిరాజమానముగా నొనర్చితిరి. భగవదనుగ్రహమువలన మీరు ఇటులనే శ్రేయస్సుల పడయుచు, మీ పూనిన మహోద్యమమును కొనసాగింపగల్గుదురు గాక యని ప్రార్థించుచున్నారము.

ఇట్లు మీ కృపాపాత్రమగు కొలంబో హిందూసంఘముపక్షమున
పి. కుమారస్వామి,
సింహళ శాసనసభా సభ్యుడు, సమావేశాధ్యక్షుడు,
ఏ. కులవీరసింహము,
కార్యదర్శి.

కొలంబో
జాన్యుకరి 1897

శ్రీ స్వాములవారు తమకర్పించిన యీ స్వాగతముగూర్చి తమ సంతసమును వెలిబుచ్చుచు, సంగ్రహముగ ప్రత్యుత్తర మొసగిరి. నాటియుత్సాహమంతయు ఒక రాజకీయపరిజ్ఞాతను గాని, ఒక మహారణవీరునిగాని, ఒక కోటీశ్వరునిగాని, కీర్తించుటకు గాక, బిచ్చమెత్తుకొను ఒక సన్న్యాసిని గౌరవించుటకై నది కావున, అది హిందువుల మనస్సునందు మతమునెడ ఎట్టి ఆదరణ గలదో తెలుపుచుండెనని చాటుటకు శ్రీవారు ఆ అవకాశమును వినియోగించుకొనిరి. హిందూజాతి సజీవమై నిలిచియుండ గోరు నేని, ఆ జాతియొక్క జీవనమునకు మతము బ్రహ్మదండమై నిలుచు టెంతయు అగత్యమని నొక్కి చెప్పిరి. తాము అందుకొనిన స్వాగతమునకు వ్యక్తిత్వేన తమకర్హత యేమియు లేదనియు, అద్దానిని ఒక ఉదారసూత్రమునెడ మన్నన చూపుటగ ఎంచ వలయుననియు పలికిరి.

16-వ తేదీ సాయంత్రము, ఫ్లోరల్ హాలులో శ్రీ స్వాముల వారీ క్రిందిరీతిని ఉపన్యసించిరి :—

నేను చేసిన యీ అల్పకార్యము నాలో స్వతస్సిద్ధముగ నున్న శక్తివలన జరిగినదికాదు. ఈ నా ప్రియతమమును పరమ పవిత్రమును అగు మాతృభూమినుండి వెడలి పాశ్చాత్యదేశము లందు నన్ను సదా అనుగమించుచు వచ్చిన ప్రోత్సాహమును, అభిమానమును, ఆశీస్సులును, కారణముగా జరిగినదే! ఈ పర్యటనవలన కొంత మంచి పనియే జరిగినది, నిజమే. కాని, దానివలన నాకే ముఖ్యముగా ఉపకారము జరిగినదని చెప్పవల యును. ఏలయనగా ఇదివఱకు బహుశః నాకు సహజమగు చిత్తో ద్రేకమువలన కలిగిన అభిమానము ఇప్పుడు నిశ్చితాభిప్రాయము యొక్క స్థిరత్వమును, ప్రత్యక్షానుభవమువలని పటుత్వమును, బలమును పడసినది.

గౌరవనీయుడగు ఈ అధ్యక్షుడు తెలిపినటులే — ప్రతి హైందవుడును తలంచుతీరున నే— ఈ దేశము కర్మక్షేత్రమును, పుణ్య

భూమియు నని పూర్వమునుండి నేనును తలచుచుంటిని. ఈనాడు ఇచ్చట నిలిచి ఆమాట యెంతయు సత్యమేయని యథార్థమగు నిశ్చితాభిప్రాయముతో దృఢవిశ్వాసముతో చాటుచున్నాను. ధన్య పుణ్యభూమియని పిలువబడుటకు అర్హతగల దేశమేదైన భూలోకమున గలదేని, కర్మపరిపాకమును గూర్చుకొనుటకై సకల జీవులును చేరవలసిన స్థలమేదైన భూతలమునగలదేని, భగవత్సాన్నిధ్యమును పొందుటకై యాత్రలుసాగించుచు, ఆ పరమ పదమును బొందుసమయమున, ప్రతిజీవాత్మయు విధిగా చేరవలసిన తావు పుడమిని ఎచ్చటనైన యుండునేని, మానవసంఘము సాధు శీలమును ఔదార్యమును పవిత్రతను శాంతి జీవనమును అలవఱచు కొనుటలో పరమోన్నతపథమును అందికొనజాలెడి దివ్యక్షేత్ర మెచ్చటనైన కలదేని, హృదయపరిశీలనమును పురికొలిపి, సము న్నత ఆధ్యాత్మిక పీఠమున జేర్చు మేలిసీమ ఎందైనగలదేని అది మన భారతదేశమే! అంతేకాదు. అన్నిటికంటెను దివ్యదృష్టిని ఆధ్యాత్మసిద్ధిని ప్రసాదించు పుణ్యతీర్థము ఈ భారతదేశమే అనక తప్పదు. ఇట అత్యంతపురాణకాలమునుండి మహామతకర్తలు బయలుదేఱి యున్నారు. పెక్కుతడవలు వారీ భూలోకమునెల్ల వినిర్మలములును శాశ్వతములు నగు ఆధ్యాత్మిక ధర్మప్రవాహ జలములతో నింపి పవిత్రీభూతము చేసియున్నారు. తూర్పు పడమర ఉత్తరము దక్షిణము నలుదిశలసంతటను పుడమిని ముంచివేసిన వేదాంతసాగరతరంగరాశి ఈ దేశమునుండియే వెలువడినది. భౌతికమును అనీశ్వరమును అగు నేటి ప్రాపంచికనాగరికతను మరల ఈశ్వరోన్ముఖము గావింపనున్న ఆధ్యాత్మిక మహాప్రవాహము ఇక్కడనుండియే ఉద్భవము కావలసియున్నది. ఇతర దేశములందు వేలకొలది మానవహృదయములను కాల్చి నాశనము చేయుచున్న జడవాదభీకరజ్వాలలను చల్లార్పవలసిన జీవజలనిధి ఇచ్చోటనే కలదు. మిత్రులారా! నామాట నమ్ముడు. ఇది జరిగితీరును.

ఇదంతయు నేను స్పష్టముగ గ్రహించియున్నాను. మీలో వివిధజాతిచరిత్రల పఠించినవారుకూడ ఈ విషయము గ్రహించియే యుందురు. ఈ ఉపకారమునకై లోకము మనమాతృభూమికి మిక్కిలిగ ఋణపడి యున్నది. వేఱువేఱుగ ఒక్కొక్క దేశమును తీసికొని విచారించునెడల, లోకము ఈ క్షమామయుడగు హైందవు నెడల ఋణపడియున్నంతగా మఱేజాతికిని ఋణపడి యుండలేదు. హైందవునిలోని యీ మెత్తదనము ఆతని దోషముగా కొన్ని సమయములందు హేళనచేయబడుటయు కలదు. కాని యెందేని హేళనయందును మహాద్భుతసత్యము గర్భితమైయుండునేని అది సదా – ఆశీర్వాదపాత్రుడైన ఈశ్వరపుత్రుడై ఈతనిని 'శాంత స్వభావ విశిష్టుడైన హిందువు' అనుటయాందే యున్నది. ప్రపంచ మందలి యితరభాగములందును నాగరికతలు వెలసినవి. ప్రాచీన కాలమందేకాక, ఆధునికకాలమందు సైతము, శక్తిమంతములగు గొప్పగొప్ప జాతులయందు మహాద్భుతభావములు వెలువడి యున్నవి. నాడును నేడును కూడ అద్భుతభావరాశి ఒక జాతి నుండి మఱొకజాతికి ప్రసరించియేయున్నది. పురాతనకాలము లందును, ఈ దివములందును కూడ పరదేశములపై దాడులు వెడలు బలవంతములగు జాతులు మహాధర్మములయొక్కయు దివ్యమహిమలయొక్కయు అంకురములను దూరప్రదేశములందు నాటుచు వచ్చినమాటసత్యమే. కాని ప్రియమిత్రులారా! నాపలు కులు గుర్తుపెట్టుకొనుడు. ఆ ప్రచారము సర్వమును రణభేరుల ఘోషతోడను, యుద్ధభటవ్యూహముల అట్టహాసములతోడను సాగినది. ఒక్కొక్క ధర్మభావము నెత్తుటి వెల్లువలలో మునిగి తేలుచు వెడలినది. ప్రతిదివ్యసంకల్పమును లక్షలకొలది సోదరుల రక్తప్రవాహముల మీద తేలియాడుచు నడచినది. ప్రతి మహా వాక్కును వెంబడించి కోట్లకొలది ప్రజల ఆర్తనాదములును, పసిబిడ్డల ఏడ్పులును, వితంతువుల కన్నీటివెల్లువలును చెలరేగ వలసివచ్చెను. దాదాపుగా ఇతరజాతుల ధర్మప్రచారమంతయు

ఇట్లేయున్నది. కాని భారతభూమియే యుగయుగములనుండి శాంతిమయజీవనమును సాగించుచున్నది. గ్రీకుదేశము తల యెత్తకపూర్వమే, రోమునగరము ఊహాక్షేత్రమున పొడచూపక మునుపే, నేటియూరపుజాతుల పూర్వపురుషులు ఒడలెల్ల పచ్చల పొడిపించుకొని అడవుల తిరుగాడుచుండిన కాలముననే, ఈ భారత దేశమునుండి ధర్మప్రచారములు సాగినవి. అంతకు పూర్వము నుండి—అనగా చారిత్రక గ్రంథయోచనయే లేనికాలమునుండి—దుర్జ్ఞేయప్రాచీనాంధకారములోనికి పురాణగాథలు తొంగిచూడ సాహసింపజాలని కాలమునుండి—నేటివఱకును, దివ్యభావపరంపర లెన్నియో ఈ దేశమునుండి ప్రచారమై వెడలియున్నవి. కాని ఆ ప్రతిపలుకునకును ముందు శాంతియు, వెనుక దీవనయు, సహ చరులుగా ప్రవర్తిల్లినవి. ప్రపంచమందలి అన్నిజాతులలోను, మనము మాత్రమే ఎన్నడును పరులమీదికి దాడి వెడలి యెఱు గము! అట్టి మహాభాగ్యము కొల్పుటవలననే మనము సజీ వులమైయున్నాము.

గ్రీసుదేశపు పటాలముల దాడివలన పుడమి వడకి పోయిన కాలముకలదు. ఆ పురాతనగ్రీకుల సామ్రాజ్యము — అట్టి వీర భూమి—నేడు నామరూపములులేకుండ తుడిచిపెట్టుకొని పోయినది. తుదకు—దానినిగూర్చి చెప్పుకొనుటకు నేటికొక పిట్టకథకూడ మిగులలేదు. లోకమున కొంచెము పచ్చపచ్చగనున్న ప్రాంతముపై నెల్ల రోమనుపతాకము ఎగిరిన కాలముకలదు. చతుస్సముద్ర పర్యంతము వారు తమ కబంధహస్తములు చాచిరి. వారి అధికార దుర్మదాంధత మానవజాతిశిరముపై తాండవమాడినది. రోము నామము విననమాత్రమున పుడమి గజగజలాడినది. కాని ఇప్పుడో! ఒకప్పుడు రాజప్రాసాదములతో కళకళలాడిన క్యాపిటోలీన్ పర్వత మిప్పుడు జాడయెఱుంగరాక పాడుపడియున్నది. వారి సీజరుబిరుదాంకిత ప్రభువులు రాజ్యమేలినచోటుల సాలెపురుగులు

బూజుపెట్టి గూడులల్లుచున్నవి. ఇటులనే, తళుక్కుమని మెఱసి చనిన ఇతరవిఖ్యాతజాతులును కొన్ని కలవు. కాని, ఏదో కొన్నాళ్ళపాటు విజయగర్వముతో ఒడలు తెలియక మిడిసిపడి నీటిపైని చెఱలాడు చిన్నిఅలలతీరున అవియన్నియు మటు మాయమై పోయినవి. ఆ జాతు లీ రీతిగ నరలోకమున తమ జాడలను మాత్రము చూచాయగా నిలుపుకొని చనినవి. కాని మనమో, సజీవులమైయున్నాము. మనువు మఱల ఈనాడు దిగి వచ్చెనేని ఆతడు వెఱగుపడి క్రొత్త ప్రదేశమునకు వచ్చినటుల ఎంచబోడు. వేలకొలది సంవత్సరములు జిజ్ఞాసచేసి కూర్చిన ఆ శాసనములే ఈనాడును ఉన్నవి. తరతరములనుండి ఆచార ముగ వచ్చిన వివేకఫలములుగా, అనేకశతాబ్దముల అనుభవ సారమును తమలో జీర్ణించుకొని, నిత్యములై సనాతనములై చూపట్టు ఆ సిద్ధాంతములే నేటికిని గోచరించును. దినములు గడచిన కొలదిని ప్రతిబంధములు దెబ్బమీదిదెబ్బ తీసినకొలదిని అన్నియు ఒకే ఉద్దేశ్యమును నెరవేర్చినటుల, అనగా ఆ ఆచార మర్యాదలనే పటుతరములుగను సుస్థిరములుగను ఒనర్చినటుల తోచుచున్నది. దీనికంతకును కేంద్రమేదియో, సమస్తరక్తనాళ ములకును మూలమౌ హృదయమేదయో, మనజాతీయజీవితము నకు మూలకందమేదియో, కనుగొనుట ఈ దేశమునసే సాధ్యమగునని స్వానుభవముచేత చెప్పుచున్నాను; నామాట నమ్ముడు.

ప్రపంచమున ఇతరజాతులవారికి మతము అనేక జీవన వ్యాపృత్తులలో ఒకానొకటిగా నున్నది. వారికి రాజకీయము లున్నవి. సాంఘికసౌభాగ్యములున్నవి. ఐశ్వర్యము సమకూర్చి పెట్టగలిగినవన్నియు నున్నవి. అంధకారముచే సాధించుకొనగలవి కూడ అన్నియు నున్నవి. ఇక ఇంద్రియభోగములకు కొదువలేదు. ఈ వివిధజీవనవ్యాపృత్తుల లోలతచే చొక్కిన తమ ఇంద్రియము

లకు ఇంకను కొంత ఉద్రేకము గొలుపజాలున దేదేని కలదా యను దేవులాటల మధ్య ప్రాయశః మతము అనునదియు ఒక స్వల్పాంశమై యుండనోపును. కాని ఇక్కడ హిందూదేశమున నన్ననో మతము విశిష్టమగు ఏకైకపురుషార్థమై పఱగుచున్నది. చైనా జపాను యుద్ధము సంఘటిల్లినదని మీలో ఎందఱెఱుగుదురు? ఎఱిగినవారున్నను ఏ కొలదిమందియో యుందురు. పాశ్చాత్య ఖండములందు సంఘమును పరివర్తనము గావింపజూచు భయంకర రాజకీయప్రచారములును సాంఘికోద్యమములును పెక్కులు కలవు. అవి మీలో ఎంతమందికి తెలియును? 'చాల కొలది' మందికే తెలిసియుండును. అయినను అమెరికాలో సర్వమత పరిషత్తు ఒకటి జరిగెననియు, అక్కడికి ఒక హిందూసన్న్యాసిని పంపిరనియు ఇచ్చటి కూలివానికి సయితము తెలిసిపోవుట గాంచి నేను వింతపడితిని. మన సహజవాసనలు ఎటుల నడచునో మన జాతీయజీవనగతి ఎటులున్నదో ఇందువలన గుర్తింపవచ్చును. ప్రాచ్యఖండవాసుల అజ్ఞానమును గూర్చి జాలిచెందు లోకసంచారులు—అందును ముఖ్యముగా విదేశీయులు—వ్రాసిన పుస్తకములను నేను చదువుచుండెడివాడను. ఒకదృష్టితో చూచిన వారి వ్రాతలు కొంతవఱకు సత్యములేయైనను వేరొకదృష్టితో తిలకించిన అవి వట్టి అసత్యములని నాకు తోచినది. ఇంగ్లాండులో గాని, అమెరికాలోగాని, ఫ్రాన్సులోగాని, జర్మనీలోగాని మామూలురైతును పిలిచి 'నీవు ఏ పార్టీవాడవు?' అని అడిగిన తోడనే తనది రాడికల్ పార్టీ అనియో లేక కన్సర్వేటివ్ పార్టీ అనియో తెలిపి తాను ఆ పార్టీవారికే 'వోటు' నిచ్చెదననియు చెప్పివేయును. అమెరికాలోని రైతు తాను రిపబ్లికన్ పార్టీ, డెమోక్రాటిక్ పార్టీలలో దేనికి చెందినది వక్కాణించును. వెండి వ్యాపారపుసమస్య మొదలైనవానిని గుఱించికూడ కొంత వివరించి చెప్పగలుగును. కాని వాని మతమేదో అడిగిచూడుము. తాను చర్చికి పోవుదుననియు, ఏదోసంప్రదాయమునకు చెందినవాడ

ననియు మాత్రము చెప్పును. వానికి తెలిసినదంతయు అంతే. అంతేచాలునని ఆతడు తలచును.

ఇక మనరైతును పిలిచి "నీకు రాజకీయము లేమైన తెలియునా?" అని అడుగుడు. అతడు "రాజకీయములా? అవేమిటిబాబూ?" అని తిరిగి మనలనే అడుగును. వానికి సామ్యవాదమేమో తెలియదు. పెట్టుబడికిని పరిశ్రమకును గల సంబంధము తెలియదు. అతడు అటువంటి విషయములను గుఱించి తనజన్మలో ఎన్నడు వినియుండడు. అతడు పొట్టకూటికై చెమటోడ్చి కష్టించుటమాత్ర మెఱుగును. అయినను 'నీ మతమే'మని వానినడుగుడు. అతడు "బాబూ, ఇదిగో ఇటు చూడు; దానిని నా ముఖమునీదనే ముద్రవేసియుంచినాను" అని చూపును. మతవిషయమును గురించి ఆతడు ఒకటి రెండు ధర్మవాక్యలను కూడ చెప్పగలడు. ఇది నా అనుభవవిషయము. మన జాతీయ జీవనము ఆ తీరున నడచుచున్నది.

మనకు కర్మసిద్ధాంతముపై గాఢమగు విశ్వాసము కలదు. మానవుల చిత్తవృత్తులను పరికింపుడు. ఎవనితీరు వానిది. అట్లే ఎవని ఆత్మపరిణతిమార్గము వానిది. అనంతమగు పూర్వజన్మ పరంపర వలనను పురాకృతకర్మవిశేషము వలనను మానవుని ప్రస్తుతజీవితవైఖరి నిర్ణయింపబడియుండును. ప్రతివాడును తన పురాభవఫలమును తలదాల్చి ఈ లోకములోనికి వచ్చుననియు, అనంతములగు తన పూర్వజన్మలు ఇప్పటిజన్మకు మూలమనియు, ఈ జన్మను తాను వినియోగించుకొను విధము ననుసరించియే రాబోవుజన్మ నిర్ణయింపబడుననియు ప్రతిహిందువు తలచును. ఈ రీతిగా ఈ ప్రపంచమున పుట్టెడి ప్రతిమానవుడును నిర్వహింప వలసిన ధర్మమును, జీవితమున అనుసరింపవలసిన నిర్ణీతమార్గమును ఉండును. ఈ సూత్రము వ్యక్తులవిషయమున ఎటుల సత్యమో జాతివిషయమునను అంతే. ప్రతిజాతికిని ఒక విభిన్నజీవనవైఖరి,

ఒక ప్రత్యేకజీవనోపపత్తి, ప్రపంచజీవనమున అది నిర్వహింప వలసిన ఒక విశిష్టకర్తవ్యము కలదు. ప్రతిజాతియు దాని జీవన ఫలితార్థమును అనుభవించును. అది తన నిర్ణీతకర్మను నిర్వహించి తీరవలెను. రాజకీయోద్ధతిగాని సైనికబలోన్నతిగాని సాధించుట మనజాతికి సహజధర్మము కాదు. ఎన్నడును అది అట్లుండి యెఱుగదు. నా మాటను మనస్సున పెట్టుకొనుడు. అట్టిది మన కెన్నడును సహజము కాబోదు. ఐనను వేఱొకకర్తవ్యము మనపాలిట నున్నది. మనలోని ఆధ్యాత్మికశక్తినంతను చక్కగా సంఘటితపఱచి సంరక్షించి, పోషించి, భారతజాతిని ఒక ఆధ్యాత్మికమహాశక్తిస్వరూపముగ తీర్చి దిద్దవలసియున్నది. అట్టి దుర్వార మహాశక్తి, పరిస్థితులు అనుకూలముగా నున్నప్పుడెల్ల ప్రపంచమును ముంచెత్తివేయవలయును. పరిషియనులో, గ్రీకులో, రోమనులో, అరబ్బులో, ఆంగ్లులో, ఎవరైననుసరే, తమ సేనలతో దాడివెడలి ప్రపంచమును జయించి వివిధజాతులను ఏకము చేయుదురు గాక. హైందవుల వేదాంతము, ఆధ్యాత్మికవిద్య, అప్పుడీనూతనావకాశమును పురస్కరించుకొని ప్రపంచజాతుల రక్తనాళముల లోనికి ప్రవేశించును. సమష్టిమానవజాతి అభ్యున్నతికై భారతీయుని శాంతిమయ ధీశక్తి తనవంతు తాను సమర్పణము చేయవలసి ఉండినది. హిందూదేశము ప్రపంచమునకు ఒసగనున్న కానుక ఈ ఆధ్యాత్మిక తేజమే!

ఈ తీరున పూర్వము ఒక్కొక్కజాతి మహోద్ధతముగా విజృంభించి ప్రపంచమందలి వివిధజాతులను ఏకము చేయుచు వచ్చెను. సహజముగా ఏకాంతవాసము నిచ్ఛగించు భారతదేశమునకు ఆయా సందర్భములందెల్ల, ఇతర జాతులతోడి సంసర్గము కలిగెను. అయినను ఈ భారతజాతి మరల ఇతర ప్రపంచజాతులనుండి విడివడి ఏకాంతములోనికి పోవుచుండుటే పెక్కుమాఱులు జరిగినది. కాని భారతీయులకు ఇతరజాతులతోడి

సంసర్గము కలిగినప్పుడు మాత్రము తత్ఫలితార్థముగ భారతీయుల ఆధ్యాత్మికధర్మప్రవాహములు ప్రపంచ మంతటను వ్యాపించుచు వచ్చినవి. వేదములకు పురాతనమగు పారశీకభాషానువాద మొకటి కలదు. అది అంత నిర్దుష్టమైనది కాదు. దానినే మరల నొక పరాసు యువకుడు లాటినుభాషలోనికి అనువదించినాడు. జర్మనీదేశపు మహాతత్త్వవేత్తలలో నొకడగు 'స్కోపెన్హారు' దానిని ఈ శతాబ్దారంభకాలమున (అనగా క్రీస్తుశకము 1800 సం॥ ప్రాంతమున) చదివి "ఉపనిషత్తుల అధ్యయనమువంటి ఉదాత్త విద్య, ఆత్మవికాసమును కలిగించు వ్యావృత్తి ఈ లోకమున మఱియొకటిలేదు. అది నా జీవితమున చిత్తశాంతిని ప్రసాదించినది. నా మరణకాలమునందును అయ్యది నిరవధికమగు శాంతినే ప్రసాదింపగలదు" అని నుడివెను. అంతేకాదు. "పూర్వపు గ్రీకుల విజ్ఞానపునరుద్ధరణమహోద్యమమునకంటె శతాధికముగ విశాలమై శక్తిమంతమై మానవుని మానసికవ్యాపారమును పూర్తిగా పరివర్తనమొనరించు అత్యద్భుత పరిణామములను ప్రపంచము చూడనున్నది" అని ఆ జర్మను తత్త్వవేత్త జోస్యము కూడ చెప్పియున్నాడు. ఈనాడు వానిజోస్యము ఫలించుచున్నది. నెమ్మదినెమ్మదిగ నిరంతరము వ్యాప్తినొందుచున్న హైందవ తత్త్వమువలన, ప్రపంచపు జీవకళయందును, గమనమునందును, ఆచారములందును, సారస్వతమునందును ఎంతటి మహాపరివర్త నము జరుగుచున్నదో యోచనాపరులైన ప్రపంచచారిత్ర పరిశీలకులకును, కండ్లు తెఱచి ఆయా పాశ్చాత్యజాతులవారి మనస్సులలో జరుగు సంచలనమును పరికించువారికిని తెలియవచ్చును.

నే నిదివఱకే సూచించినటుల ఇంకొక విశేషముకూడ కలదు. మన మెన్నడును అగ్నిని ప్రయోగించియు, ఖడ్గమును ఝుళిపించియు, ధర్మప్రచారము చేసియుండలేదు. భారతదేశము ప్రపంచమునకు ఒసగిన ఈ వరప్రసాదమును వర్ణించుటకు ఆంగ్ల

భాషలో ఏదేని శబ్దము ఉన్నయెడల, భారత వాఙ్మయము మానవజాతియందు కల్పించిన పరివర్తనమును తెలుపుటకు ఆంగ్ల భాషలో అనువగు పదము కలదేని, అది 'మోహినీశక్తి లేక ఆకర్షణశక్తి' అనునదే. దీని అర్థము ఆకస్మికముగా మీపైని ఏదేని వచ్చిపడి భ్రాంతుని చేయుట అనికాదు. 'మీకు తెలియరాకుండ మెల్లమెల్లగా మిమ్ము ఆకర్షించివేయుట' అని దాని కర్థము. చాలమందికి మొట్టమొదట భారతీయుల భావములన్నను, భారతీయుల మర్యాదలన్నను, భారతీయుల ఆచారములన్నను, భారతీయుల వేదాంతమన్నను, భారతీయుల వాఙ్మయమన్నను వెగటుగనే యుండును. కాని వారు ఓపికపట్టి మన గ్రంథములను చదువవలయును; మనభావములకు మూలాధారములగు మహాసూత్రముల పరిచయము చేసికొనవలెను; అప్పుడు నూటికి తొంబదితొమ్మిదిమందిమీద ఈ సమ్మోహనశక్తి చక్కగ పారును. ఇంక ఫలితార్థమో, పారవశ్యమే. వేకువజామున కంటికి కానరాకుండ చెవికి వినరాకుండ వర్షించి, తెల్లవారుసరికి మెలమెల్లగా రోదసినెల్ల ఆవరించు కోమలశిశిరమువలె, పరమశాంతమును, నిరాడంబరమును, సహనశీలమును, అధ్యాత్మపరాయణమును అగు భారతజాతి ప్రపంచప్రజల భావవసుంధరపై తన ప్రభావమును ప్రసరింపజేసినది

చరిత్రయందు లోగడజరిగినదే మరలమరల జరుగనున్నది. ఈనాటి ఆధునికశాస్త్రమువలన గాఢములును, సుస్థిరములును అనుకొనిన పురాతనవిశ్వాసములు పూర్తిగ హతమై పోవుచున్నవి. మానవజాతియంతయు లొంగి మన్ననచేసితీరవలయునని ఆశించిన సాంప్రదాయక గౌరవాధిక్యములు నలినలిగా చితుకకొట్టబడి గాలిలో కానరాకుండ ఎగిరిపోవుచున్నవి. ఈనాటి ప్రాచీనవస్తుపరిశోధన లనెడు పెద్దసమ్మెటపోటులకు తాళజాలక పురాతనాచారవిశ్వాసములు గాజుముక్కలవలె పొడిపొడియై పోవుచున్నవి. మతము పాశ్చాత్యదేశములందు పామరులచేతు

లలో చిక్కుకొనిపోయినది. పండితులు మతసంబంధమగు ప్రతి దానిని చీదరించుకొనుచున్నారు. ఇట్టిపట్టున భారతీయుల వేదాంతమునందలి ఆధ్యాత్మికమహాశయములు భారతహృదయము ముందునకు సాగివచ్చుచున్నవి. అత్యున్నతవేదాంతధర్మములు సామాన్యభారతప్రజలకు నిత్యానుష్ఠానమర్యాదలు. ఈ సర్వమును ఒకే పదార్థమనెడు అద్వైతమార్గము, వేదాంతము బోధించు నిర్గుణతత్త్వభావము, నరుని ఆత్మ అనశ్వరమనెడు అద్భుత సిద్ధాంతము, జీవయాత్ర తెగిపోక సర్వకాలము సాగివచ్చు మహాప్రస్థానమనెడు తలంపు, ఈజగము అనంతమను విశ్వాసము, నేటి ప్రపంచమును గొప్ప ఆపదనుండి రక్షింపబూనినవి. ఈప్రపంచము ఒక మురికికూపమనియు, కాలమనునదే నిన్ననో మొన్ననో ప్రారంభమైనదనియు ప్రాచీన విదేశసంప్రదాయులు భావనచేసిరి. మన గ్రంథములలో — అసలు మన గ్రంథములలోమాత్రమే— అనంతమై పరగు దేశ, కాల, నిమిత్త భావనకాన్పించుచున్నది. మన గ్రంథములలోమాత్రమే నరుని ఆత్మయొక్క అఖండవిభూతి మతాన్వేషణకెల్ల పరమగమ్యమని ప్రకటితమగుచున్నది. ఆధునిక కాలమున—పరిణామసిద్ధాంతము, అక్షయశక్తి సిద్ధాంతము మున్నగునవి బయలుదేరి, నానావిధతుచ్ఛదేవతారాధనలను రూపుమాపుచున్న ఈ సమయమున — నరుని ఆత్మాన్వేషణఫలమును, భగవంతుని అద్భుతవాణియునగు వేదాంతము బోధించు ఉదాత్తమహితములును, ఉదారపావనములును అగు దివ్యభావములు గాక మఱెయ్యది ప్రాజ్ఞులకు సంసేవ్యమై నిలువగలదు?

ఇక్కడ నేనొక విషయమును వివరించి చెప్పవలసియున్నది. అన్యజాతుల పరివర్తనమునకు హేతుభూతమగు 'మన మతము' అనినప్పుడు, మన హైందవమతమునకు పునాదులగు మూల సిద్ధాంతములనియే నా అభిప్రాయము. అనేకశతాబ్దములుగా, సంఘావసరములను పురస్కరించుకొని ఈ మతమునందు వచ్చి

చేరిన ఆచారములకును, ఇతర స్వల్పవిషయములకును, మతము యొక్క మూలసూత్రములతోపాటు అగ్రస్థానమిచ్చి గౌరవింప జాలము. అది న్యాయ్యమేగదా! మన గ్రంథములందు రెండు విధములగు ధర్మములు ప్రతిపాదింపబడియున్నవి. వాని విభేదము కూడ స్పష్టీకరింపబడియున్నది. అందొక విధమగునవి సనాతనములు; అవి నరుని గుణముల ననుసరించియు, ఆత్మలక్షణముల ననుసరించియు, జీవపరమాత్మల సంబంధము ననుసరించియు, భగవంతుని లక్షణముల ననుసరించియు, జీవుని పరమగమ్యము ననుసరించియు నిర్మింపబడినవి. సృష్టిక్రమము, సృష్టియొక్క ఆద్యంతరహితత్వము (అనగా శూన్యమునుండి ఈ ప్రపంచము సృజింపబడలేదనియు, నిరాకారనిర్గుణ బ్రహ్మమునుండి ఆవిష్కరింపబడినదనియు చెప్పెడు సిద్ధాంతము) మున్నగునవి ఈ మొదటి రకపు ధర్మములలో చేరును. ఇవి ప్రకృతిలోని సనాతనధర్మముల పైని ఆధారపడి నిర్మింపబడిన శాశ్వతసూత్రములు. ఇక రెండవ వర్గమునకు చెందినవి అనుదిన జీవయాత్రను గూర్చిన సాధారణ సూత్రములు. అవి పురాణములకు, స్మృతులకు సంబంధించినవి కావు. వీనికి మొదటిరకపు సిద్ధాంతములతో సంబంధములేదు. మనజాతియందుకూడ ఇవి ఆయాకాలములందు మారుచు వచ్చినవి. ఒక యుగపుటాచారములు మఱొక యుగము నందు లేవు. యుగములు గతించుచున్నకొలది, అవి ఇంకను మారుచుండును. మహాఋషులు పుట్టి క్రొత్త పరిస్థితులకు అనుకూలములగు ఆచారమర్యాదలు నెలకొలిపి మనలను నడపుచుందురు.

జీవుడు, బ్రహ్మము, జగత్తు: వీనినిగూర్చి అద్భుతములును, అనంతములును, ఉదాత్తములును, ఉదారములునగు ధర్మసూత్రములను ఈ పవిత్రభారతదేశము రచించినది. "నా దేవుడు సత్యము; నీ దేవుడు వట్టిబూటకము. కాదందువా, రమ్ము, సవాలుచేయుచున్నాను. కత్తిదూసి నిలబడుము. నీవో నేనో

ఒక్కరే మిగులవలెను'' అనుచు ఆయా కులదేవతలపైని దురభిమానము పూని దెబ్బలాటలకు దిగుట హిందూదేశమున లేదు. తుచ్ఛదేవతలకై తగవులాడవలయునను ఉద్రేకము ప్రబలనిది ఈ ఒక్క దేశమునందే. మానవుని పరాప్రకృతిమీద ఆధారపడి రూపొందిన ఈ మహాధర్మసిద్ధాంతములు, విశ్వమానవశ్రేయమునకు వెయ్యేండ్లనా డెట్లు ఉపయోగపడెనో, నేడును అట్లే ఉపయోగపడుచున్నవి. నేడే కాదు, ఈ పుడమి నిలుచునంత కాలమును అవి అటులనే యుండగలవు. కర్మసిద్ధాంతము పాటింపబడునంత కాలము, మనము వ్యష్టిజీవులమై పుట్టుచు స్వశక్తిపైని ఆధారపడి మన తరణోపాయమును మనము చూచుకొనుచుండునంత కాలము అవి చెక్కుచెదరక అటులనే నిలిచియుండును.

అన్నిటిని మించి భారతదేశము లోకమునకు ముఖ్యముగా ప్రసాదింపవలసినది ఇది: ఆయాజాతుల మతములయొక్క ఉత్పత్తి వృద్ధిపరిణామములను కనుపెట్టి చూచినయెడల, ప్రతిశాఖకును మొట్టమొదట ఒక్కొక్క దేవతయుండునని తెలియవచ్చును. అంతశ్శాఖలు ఒకదానితో నొకటి మైత్రినెఱపునెడల, ఈ దేవతలందఱును ఒక్క సామాన్యజాతీయనామముతో వ్యవహరింపబడుదురు. ఉదాహరణగ బాబిలోనియనుల దేవతల పేరులను చూడుడు. బాబిలోనియను జాతివారు వేర్వేఱు ఉపజాతులుగ అనగా వేర్వేఱు శాఖలుగా విడివడియున్నను, వారి దేవతలకు ''బాల్'' అను సామాన్యజాతీయనామము వాడబడుచుండెడిది. యూదియా జాతిలోని ఉపజాతులవారి దేవతలకును ''మోలోక్'' అను సామాన్యనామముండెడిది. ఇట్లుండ ఆ ఉపజాతులలో ఏదో ఒకటి తక్కినవానిపై ఆధిపత్యమును సాధించి, తమ రాజే అందఱికిని రారాజని చాటును. అంతట సహజముగా తమ దేవుడే తక్కిన ఉపజాతుల దేవుడనియు వాదనచేయును. 'బాల్ — మెరొడాక్' అత్యధిక మహిమోన్నతుడనియు, తక్కిన దేవత

లందఱును వానికంటె తక్కువవారనియు బాబిలోనియనులలో ఒకశాఖవారు చెప్పుదురు. అన్ని "మోలోకు"లలోను 'మోలోక్ యూవా' అత్యధికుడని యూదులలో ఒకతెగవారు వాదింతురు. ఈ వివాదములను యుద్ధముచేసి తేల్చుకొందురు. ఇట్టి తగవులు పూర్వ మిచ్చటను ఉండెడివే. ఇచ్చటకూడ దేవతలు పోటీపడి, ఆధిక్యతకొఱకు పోరాటములు సాగించియుండిరి. కాని ఈదేశపు అదృష్టమువలనను, ప్రపంచపు అదృష్టమువలనను, ఈ రణగుణ ధ్వనినుండియే—ఈ గందరగోళమునుండియే—"ఏకం సత్ విప్రా బహుధావదన్తి" (ఉండునది ఒక్కడే, వానిని ప్రాజ్ఞులు అనేక నామములతో పిలుతురు) అను దివ్యవాణి వెలువడినది. 'శివుడు విష్ణునికంటె ఘనుడు' అనుటగాదు; 'విష్ణువే మహా ఘనుడు, శివుడు కొఱగానివాడు' అనుటయు కాదు. ఉన్నది ఒక్కడే దేవుడు, వానిని శివుడనుడు, విష్ణుడనుడు, లేక లక్ష పేరులుపెట్టి పిలుచుకొనుడు. పేరులు భిన్నములుగ నుండుగాక, ఉన్నది ఒక్క దేవుడే. భారత దేశచరిత్రయొక్క పర్యవసానమంతయు ఈ రెండు ముక్కలలో ఇమిడియున్నది. చరిత్రయంతయు ఈ ఒక్క ప్రధాన సూత్రమునే, అద్భుతశక్తితో—గంభీరభావతో—కథనముచేయుచున్నది. దేశమంతటను ఈకథనము సాగినది. ఫలితార్థ మేమి? ఈ భావము భారతీయులరక్తనాళములలో ప్రవహించు ప్రతి నెత్తుటిబొట్టునందును నిండినది; వారి ప్రతి రక్తకణమునందును జీర్ణించిపోయినది; వారిజీవితములో కలిసిపోయినది; వారి స్వరూపోపాధియందేకమై యిమిడిపోయినది. అందువలన, ఈదేశము సహనమునకు పెట్టినపేరై వివిధమతములను వివిధజాతులను ఆహ్వానించి, తల్లివలె కౌగిట చేర్చి తన హృదయమునకు హత్తుకొనినది.

ఒకదానికొకటి కేవలము భిన్నముగ గోచరించు అనేక జాతులు, అనేక మతములు, పరస్పరసౌహార్దముతో భారత దేశమున కలిసిమెలిసి జీవింపగల్గుట ఎట్లు సాధ్యమయ్యెనో ఇందు

వలన తెలియగలదు. ఇట్టి యద్భుతదృశ్యము భారతదేశమందే గోచరించుచున్నది. 'నీవు ద్వైతివి కావచ్చును; నేను అద్వైతిని కావచ్చును; నీవు దేవుని నిత్యసేవకుడవని విశ్వసింపవచ్చును, నేను భగవంతునితో అభిన్నుడనని వాకొనవచ్చును. అయినను ఇరువురము ఉత్తమ హిందువులమే.' ఇదెట్లు సాధ్యము? "ఏకం సత్ - విప్రా బహుధావదన్తి" (ఉండు దైవము ఒక్కడే. వానిని ఋషులు బహునామములతో పేర్కొందురు) అను వేదవాక్యమును పఠించిన తెలియును. భారతీయసోదరులారా? అన్నిటికంటె ముఖ్యముగ ఈ దివ్యభావమునే మనము లోకమునకు ఉపదేశింప వలసియున్నది. ఇతర దేశములలో మహావిద్యాధికులు సైతము ముఖములు చిట్లించుకొని మనమతము వట్టి "ప్రతిమోపాసన" అని వెక్కసముగా మాట్లాడుచుందురు. నేనది కాంచియున్నాను. కాని తమ తలలలో ఎంతటిమూఢభావము పేరుకొనియున్నదో వారు తెలిసికొనుటే లేదు. ప్రతిలావుననను ఇట్లే యున్నది: స్వమతదురభిమానము! క్షుద్రసంకుచితభావన!! కటా! తనకుగల ఐహికభాగ్యమే, జన్మమెత్తినందులకు మానవుడు సాధింపదగిన యోగ్యవస్తువట! ధనాధిదేవతను పూజించు అతని వ్యర్థజీవనమే ఉత్తమ జీవనమట! వానికున్న సంపదయే గడింపదగిన సంపద యట! ఇంక నేదైనను కొఱగానిదే! అత డేదేని ఒక పిచ్చి మట్టి బొమ్మనుచేసెనా, లేక ఒకయంత్రమును నిర్మించెనా, మహోత్తమ సంపదలను మించి అదియే మిగుల గణనీయమగుచున్నది!! ఎంత చదువున్నను, ఎంత విద్య యున్నను, ప్రపంచమంతటను ఇదేస్థితి కాన్పించుచున్నది. కాని సత్యమగు విద్య యింకను తలసూప లేదు; నాగరికతయందుమా, సత్యమగు నాగరికత ఇంకను ప్రారంభము కావలసియేయున్నది. మానవజాతిలో వేయింటికి తొమ్మిది వందల తొంబదితొమ్మిదిమంది, యీనాటికిని పశువులుగనే యున్నారు. ధర్మములను మనము పుస్తకములందుచదువవచ్చును. సహనమునుగూర్చి మతబోధలందు వినియుండవచ్చును. కాని

లోకమునందు ఈ ధర్మముగాని సహనముగాని తరచుగా కాన వచ్చుటలేదు. ఈ విషయములో నా అనుభవము చెప్పుచున్నాను: నూటికి తొంబదితొమ్మండ్రు దానిని తలపెట్టనైన తలపెట్టరు. నేను వెళ్ళివచ్చిన ప్రతిదేశమునందును, మతముపేర ఇంకను ఘోర హింసలు జరుగుచునే యున్నవి. క్రొత్తవిషయములను నేర్చుకొనుటకు పురాతనపు కాతలనాటి ఆక్షేపణలనే ఇప్పటికిని వారు తెలుపుచున్నారు. అన్యమతములయెడ సహనము, పారలౌకిక చింతనముపై ఆసక్తి అంతో యింతో ఈ ప్రపంచములోనికెల్ల మన ఆర్యభూమియందే కనుపట్టును. ఇంకెక్కడను లేదు. మహమ్మదీయుల కొఱకును, క్రైస్తవుల కొఱకును హైందవులు ప్రార్థనాలయములు కట్టుట ఇక్కడనే; మఱెచ్చటను కానరాదు. మీరు ఇతర దేశములకు పోయి, మహమ్మదీయులను గాని, మరే యితరమతస్థులను గాని మీకొక దేవాలయమును కట్టిపెట్టుడని కోరిచూడుడు. సాయముచేయుట అటుంచి వారు మీకున్న దేవళములతోసహా మిమ్ము సైతము మ్రింగివేయజూతురు. కాబట్టి హిందూదేశము వలన ప్రపంచము నేడు నేర్చుకొనవలసిన గొప్ప గుణపాఠము కేవలము సహనభావమే కాదు, సానుభూతికూడ. మహిమ్న స్తోత్రములోని ఈ భావమును గమనింపుడు. "ఆ యా పర్వతముల నుండి బయలుదేఱి నదులన్నియు తిన్నగనో వంకరగనో పోయి పోయి తుదకు సముద్రముననే కలియు రీతి, శంభో! తమ తమ సంస్కారముల ననుసరించి నరులు అవలంబించు సాధనలు భిన్న భిన్నములుగా కాన్పించినను, వక్రముగనో నిర్వక్రముగనో సాగి సాగి, తుదకు నిన్నే పడయును. వేర్వేఱు త్రోవల నడచినను, అందఱును నీ మార్గముననే యున్నారు". కొందఱు కొంచెము చుట్టు తిరిగిపోవుదురు. మఱికొందఱు సూటిగా పరువెత్తుదురు. కాని తుదకు ఎల్లరును ఒక్క సదాశివుని దాపునకే చేరుదురు. ఆ దేవదేవుని నీవు లింగమునందు దర్శించుటకేగాక, సర్వత్ర చూడజాలినప్పుడే — అప్పుడు మాత్రమే — నీ ఈశ్వరభక్తి

ధన్యము కాగలదు! శ్రీహరిని ఎల్లతావులందు ఎల్లరియందును చూడజాలిన వాడే హరిభక్తుడు! అతడే నిజమగు ఋషి!! నీవు సత్యముగ శివభక్తుడ వైనయెడల, ప్రతిదానియందును, ప్రతివాని యందును, నీకు శివుడు ప్రత్యక్షమై గోచరింపవలయును. నామములు రూపములు ఎట్టివైనను సరియే, సమస్తపూజలును శివునికే చెల్లునని నీవు గ్రహింపవలయును. 'కాబా' వైపు తిరిగి చేయు నమాజులును క్రైస్తవచర్చిలోని మోకరింపులును, బౌద్ధాలయ మందలి ప్రణతులును, శివుని గుఱించియే. వారికి ఆ మాట తెలియవచ్చును, తెలియకపోవచ్చును; వారి కా భావము ఉండ వచ్చును, ఉండక పోవచ్చును. ఏ రూపముపెట్టి, ఏ నామము చెప్పి, అర్పణచేసినను ఆ పువ్వులన్నియు ఈశ్వరుని పాదములకు అంకితమైనవే. ఏలయందువా? ఆయనయే సర్వేశ్వరుడు, ఆయనయే పరమాత్మ. నీకంటెను నాకంటెను బాగుగ ఈ లోక మునకు ఏది అవసరమో ఆయన ఎఱుగును. భిన్నత్వమెల్ల అంత రించిపోవుట అసంభవము. అది ఉండియే తీరవలెను. నానాత్వము లేనిది అసలు బ్రతుకే లేదు. ఈ సంఘర్షణమే, ఈ భిన్నభిన్న భావనయే, సమగ్ర విజ్ఞానమునకును, సమస్త సంచలనమునకును, సర్వ శ్రేయమునకును దారి జూపుచున్నది. పరస్పర విరుద్ధము లగు భిన్నభావనలు ఉండియే తీరవలెను. కాని భిన్నత్వమున్నంత మాత్రమున మనము ఒకరినొకరము ద్వేషించుకొనవలసినపని లేదు.

ఈ ఏకైకసత్యమును మనమందఱమును మఱల గ్రహింప వలయును. ఈ మహాధర్మము ఇక్కడనే—మన మాతృదేశము నందు మాత్రమే—అనుష్ఠింపబడి ప్రచారము గాంచినది. అది ఇంకొకసారి ఈ భారతదేశమునుండియే ప్రపంచమునకెల్ల ప్రసా రముకావలసి యున్నది. ఈ మహాకార్యమును చేయగలిగినది ఒక్క భారతదేశమే. ఆ ధర్మరహస్యము మన వేదములయం దున్నది, మన వాఙ్మయ మందున్నది, మన జాతీయ జీవితమునం

దెల్ల నిండియున్నది. ఇక్కడనే—ఇక్కడమాత్రమే—అది అను దినమును ఆచరింపబడుచుండుట! కండ్లు తెఱచి చూచు ప్రతి వానికిని ఈ విషయము రుజువుకాగలదు. కావున లోకమునకు మనము మతధర్మములను బోధింపవలసియున్నది. మనము బోధింపవలసినవి ఇంతకంటె మించిన ఉత్తమధర్మములు కూడకలవు. కాని అవి విద్యావంతులకు మాత్రమే అక్కఱకు వచ్చును. పురుషుడు గాని, స్త్రీగాని, పసిబిడ్డగాని, చదువు వచ్చినను చదువు రాకున్నను, జాతివర్ణసంప్రదాయ భేదములు లేక, సౌజన్యము, నమ్రత, ఓరిమి, సహనము, సానుభూతి, సోదరభావము మున్నగు ధర్మములు మాత్రము ప్రతివాడును నేర్చుకొనవచ్చును. "తత్త్వజ్ఞులు నిన్ను అనేక నామములతో సంబోధింతురు గాక! కాని నీవు ఒక్కరుడవే!"



# వేదాంతమతము

జాఫ్నానగరమునందలి హిందువులు శ్రీ వివేకానంద స్వాములవారికి సమర్పించిన స్వాగతపత్రము :

శ్రీమత్ వివేకానందస్వాములవారికి—

పూజ్యులగు స్వామీ!

హిందూమతమును అవలంబించు జాఫ్నానివాసులమగు మేము, ఈ సింహళద్వీపమున హిందూమతమునకు ప్రధానస్థానమగు మా పురమునకు హృదయపూర్వకముగా మిమ్ము ఆహ్వానించుచున్నాము. లంకలోని ఈ ప్రాంతమున దర్శన మిచ్చుటకై దయతో మా ఆహ్వానమును అంగీకరించినందులకు మీ యెడల మే మెంతయు కృతజ్ఞులము.

రెండు వేల సంవత్సరములకు పూర్వము మా పూర్వులు దక్షిణభారతదేశమునుండి వచ్చి యిక్కడ నివాసముల నేర్పఱచు కొనిరి. వారితోడ వారిమతముకూడ వచ్చినది. అప్పటి జాఫ్నా నగరపు తమిళ రాజులు ఆ మతమును ఆదరించిరి. వారిరాజ్యము పోయి పోర్చుగీసు, డచ్చివారల ప్రభుత్వములు రాగానే మా మత ధర్మాచరణమునకు అవరోధము కల్గినది. బహిరంగపూజలు బహిష్కరింపబడినవి. మహాప్రఖ్యాతములగు రెండు మందిరముల తోపాటు అనేక పవిత్రదేవాలయములు నేలమట్టము గావింప బడినవి. ఆ జాతులవారు క్రైస్తవమతములోనికి మా పూర్వులను బలాత్కారముగా లాగికొనవలెనని ఎంత పట్టుపట్టినను, వారు చలింపక హైందవమత సంప్రదాయమును నిలబెట్టిరి. అంతేకాదు. పరమపూజ్యమగు పిత్రార్జితసంపదగా దానిని వారు మా కొసగి పోయిరి. ఇప్పుడు బ్రిటిషువారి పరిపాలనమున, సముచిత సమగ్ర మతపునరుద్ధారణము జరుగుటేగాక, పూర్వపు పవిత్రదేవాలయ ములు తిరిగి నిర్మింపబడినవి; ఇంకను నిర్మింపబడుచున్నవి.

వేదప్రతిపాదితమగు సత్యతేజమును సర్వమతపరిషత్తునందు ప్రపంచజాతులకెల్ల ప్రదర్శించుటకును, భారతీయుల దివ్య వేదాంత ధర్మములను ఇంగ్లండులో ప్రచారము చేయుటకును, పశ్చిమ ప్రపంచమునకు హిందూమతధర్మముతోడ పరిచయము కలిగించు టకును, తద్ద్వారా ప్రాక్పశ్చిమఖండములకు సౌహార్దము కలిగించు టకును, మీరు కావించిన మహనీయమగు అవ్యాజపరిశ్రమను గుఱించి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను సమ ర్పించుచున్నాము. భక్తి నశించి పారలౌకికచింతపై నిరసన మేర్పడిన జడవాదబంధుర ప్రస్తుతకాలమున, మన ప్రాచీనమత మును పునరుద్ధరించుకొనుటకు మీ రొక మహోద్యమమును చేయ[illegible] దేఱదీసితిరి. అందుకై మా వందనములను అర్పించుచున్నాము.

మన మతము విశ్వశరణ్యమని ఉదాత్తసంస్కృతధర్మమని మీరు పాశ్చాత్యప్రజలకు తెలిపితిరి. పాశ్చాత్యతత్త్వశాస్త్రములు



చివరకు ఊహింపనైన ఊహింపజాలని అనేక నిగూఢరహస్యములు హైందవవేదాంతమునందు కలవని పాశ్చాత్యధర్మవిచారపరుల మనస్సులందు నాటునటుల ఉద్ఘోషించితిరి. అందులకు మా కృతజ్ఞతను తగురీతిని తెలుపజాలకున్నాము.

పశ్చిమఖండమున మీ మహోద్యమము గావించుచున్న పురోగమనమును జాగరూకులమై కనిపట్టుచున్నామనియు, మీ ధర్మపరాయణతకును, మీ నిరంతరకృషికిని, మీ విజయపరంపరలకును, మేము పరమానందమును పొందుచున్నామనియు మీకు వేరుగా చెప్పవలయునా? పాశ్చాత్యదేశములందు విద్యావ్యాసంగమునకును, ధర్మప్రచారమునకును, మతవిచారణకును, ప్రసిద్ధిగాంచిన ప్రధాననగరములందలి వార్తాపత్రికలెల్ల మిమ్ములగుఱించియు, మన మతవాఙ్మయప్రదర్శనమున మీరు గావించిన అద్భుతప్రచారమును గుఱించియు వ్రాసిన స్తోత్రవాక్యములే మహనీయమగు మీ ఉదాత్తకృషికి ప్రబలసాక్ష్యములై యున్నవి.

మీరు మా ప్రాంతమున దర్శనమిచ్చినందులకు, హృదయపూర్వకముగ ధన్యవాదములను అర్పించుచున్నాము. మీ తోపాటు సత్యమగు పారమార్థికవిజ్ఞానమునకు వేదములు మూలాధారములని విశ్వసించు మేము, మిమ్ములను మా మధ్యమున దర్శించు అవకాశములు మరల మరల లభించుగాక యని ఆశించుచున్నాము.

ఇంతవఱకును మీ ఘనతరోద్యమమునకు అద్భుతవిజయము నొసగి ధన్యముచేసిన పరమేశ్వరుడు, మీ ఈ మహోద్యమమును ఇంకను సాగించుకొఱకై మీకు చిరాయువును జవసత్త్వములను సంపూర్ణముగనిచ్చి ప్రోచుగాత మని ప్రార్థించుచున్నాము.

చిత్తగింపుడు,

ఇట్లు

జాఫ్నానగర హైందవసంఘము.

శ్రీ స్వాములవారు ఈ అభినందనపత్రమునకు ఉచితరీతిని ప్రత్యుత్తరమిచ్చుచు, ఆ మరుసటిదినమే సాయంకాలమున 'వేదాంతమతము'ను గుఱించి ఈ క్రిందితీరున ఉపన్యసించిరి :

విషయమా చాల పెద్దది; సమయమా చాల కొద్ది. హిందువుల మతమును గుఱించిన పూర్తివివరములను తెలుపుట ఈ ఒక్క ఉపన్యాసములో సాధ్యముకాదు. కాబట్టి మనమతము యొక్క ప్రధానవిషయములను మాత్రము నా చేతనైనంత తేలిక భాషలో మీకు నివేదింతును. మనము హిందువులమని చెప్పు కొనుట ఆచారమై పోయినది. కాని 'హిందువు' అను మాట ఈనాడు కేవలము అర్థహీనమైనది. ఏలయన, "సింధునదికి ఆవలి ఒడ్డున నివసించువారు" అనియే ఈ మాటకు అర్థము. 'సింధు' అను సంస్కృతపదమును పాడుచేసి పారసీకులు 'హిందు' గా మార్చిరి. వారున్నతావునుండి సింధూనదికి ఆవలియొడ్డున నివసించు ప్రజలను వారు 'హిందువులు' అని పిలుచుచుండిరి. ఆ పిమ్మట ఈ మాట పరంపరంగా వాడుకలోనికి వచ్చినది. మహమ్మదీయుల పరిపాలనకాలమున ఈ మాట చివరకు మనవ్యవహారములోనికి కూడ ప్రాకినది. ఈ పదమును ఉపయోగించుటవలన హానిలేదు. కాని నేను చెప్పినటుల అది అర్థహీనమైపోయినది. ఏలయందురా, సింధునదికి ఈవలిఒడ్డున నివసించు ప్రజలందఱును పూర్వకాలము నందువలె ఈనాడు ఒకేమతమును అవలంబించువారుకారు. కావున ఈ మాట కేవలము హిందువులకేకాక ఇండియాలో నివసించు మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు మున్నగు సర్వమతములవారికిని చెల్లును. కాబట్టి 'హిందువు' అను పదమును నేను వాడను. మఱి ఏ పదమును వాడవలయును ? మనము ఉపయోగించుకొనదగిన పదము లనేకములున్నవి. వేదధర్మము లను అనుసరించువారు అను అర్థమిచ్చు "వైదికులు" అను పదమునుగాని, లేక వేదాంతమును అనుష్ఠించువారు అను అర్థ

మిచ్చు "వేదాంతులు" అను పదమునుగాని ప్రయోగింపవచ్చును. కొన్ని గ్రంథములను భగవంతుని పలుకులనియో, లేక యే మహా పురుషుని సూక్తులనియో చెప్పుచు వానిని తమ మతములకు పరమప్రమాణములుగను పునాదులుగను తలదాల్చుట సాధారణముగా ప్రపంచములోని అన్ని మతములవారికిని పరిపాటి. ఇట్టి పుస్తకములు అన్నిటిలో నవీనపాశ్చాత్యపండితుల అభిప్రాయము ప్రకారము, హిందువుల వేదములు అత్యంతప్రాచీనములు. కావున వేదములను గుఱించి కొంత తెలిసికొనుట ఆవశ్యకము.

వేదములు అపౌరుషేయములు. అవి మానవప్రోక్తములు కావు. వాని కాలము ఇంతవఱకు నిర్ణయింపబడలేదు. ఇక ఎన్నటికిని నిర్ణయింపబడజాలదు. వేదములు అనాదులని మన నమ్మకము. ఒక్క ముఖ్యవిషయము మీరందఱు జ్ఞప్తియందుంచుకొనవలయునని కోరుచున్నాను. ప్రపంచమున గల యితర మతములన్నియు, ఒక సాకారదైవతమో, కొందఱు మహాత్ములో, దేవదూతలో, లేక భగవంతుడు ప్రత్యేకముగ పంపిన ప్రవక్తలో, అనుగ్రహించి ఎవరో కొందఱు వ్యక్తులకు ప్రసాదించినవే. ఆ ప్రసాదించినవారి గొప్పదనమునుబట్టి తమ తమ మతములు ప్రమాణములని ఇతరులు చెప్పుకొనుచున్నారు. ఇక హిందువులకో వేదములే పరమప్రమాణములు. ఆ వేదములు ఎవని ప్రామాణ్యముపైనను ఆధారపడుట లేదు. అవి సనాతనములై, బ్రహ్మజ్ఞాననిలయములగుటచేత వానికవియే ప్రమాణములు. అవి ఎన్నడును ఎవరిచేతను రచింపబడలేదు. అవి అనాదికాలమునుండి యుండినవే. ఆద్యంతములులేక ఈ సృష్టి శాశ్వతమై సనాతనమై యుండువిధమున, ఈశ్వరజ్ఞానముకూడ, తుదిమొదలులేనిదై పఱగుచున్నది. వేదము లనగా ఈ జ్ఞానరాశియే, 'విద్' అనగా తెలిసికొనుట లేక ఎఱుగుట అని యర్థము. వేదాంత మనబడెడు ఈ జ్ఞానపుంజమును మహాపురుషులగు

ఋషులు ప్రకాశమునకు తెచ్చిరి. 'ఋషి' అనగా మంత్రద్రష్ట, భావమునెఱిగినవాడు అని యర్థము. భావమును తెలియుటే ఆతడు చేసినది; భావముమాత్ర మాతనిదికాదు. ఏదేని ఒక వేదవాక్యము ఒకానొక ఋషివలన లభించినది అని మీరు విని నప్పుడు, దానిని ఆయన వ్రాసెననిగాని, మనస్సులోనుండి సృష్టించె ననిగాని తలపకుడు; అదివఱకే ఉండియున్న భావమును ఆయన దర్శించెను. అంతే. అది అనాదిగా జగమున ఉండినదే. ఈ ఋషి దానిని కనిపట్టెను. మహర్షులు పరమార్థసత్యములను కనిపట్టు చుండిరి.

వేదమనెడు ఈ మహాగ్రంథరాశి ముఖ్యముగా 'కర్మ కాండ', 'జ్ఞానకాండ' అని రెండు భాగములుగా విభజింపబడి యున్నది. కర్మకాండ కార్యకలాప సంబంధమైనది. జ్ఞానకాండ ఆధ్యాత్మికవిచార సంబంధమైనది. కర్మకాండ అనేక యజ్ఞము లను గుఱించి తెలుపును. వానిలో అనేకములు ఇప్పటి పరిస్థితు లలో సాధ్యము కావని వదలివేయబడినవి. అయినను తక్కినవి యేదో యొకరూపమున నిలిచియున్నవి. బ్రహ్మచారి (విద్యార్థి) ధర్మములు, గృహస్థుని ధర్మములు, సన్న్యాసిధర్మములు ఈవివిధ జీవితదశలయొక్క భిన్న భిన్న ధర్మములు కర్మకాండయందు ముఖ్యముగా తెలుపబడెను. అవి నేటివఱకును కొంచెము హెచ్చు తగ్గుగా ఆచరణలోనే యున్నవి. కాని మన మతముయొక్క ఆధ్యాత్మభాగము జ్ఞానకాండము లేక వేదాంతము అను రెండవ భాగమునందు కలదు. వేదాంత మనగా వేదములయొక్క అంతము లేక సారాంశము లేక పరమావధి అని భావము. వేదములలోని జ్ఞానసారమునకు వేదాంతమని పేరు. ఇది ఉపనిషత్తులయం దున్నది. భారతదేశములోని అన్ని సంప్రదాయములవారు — ద్వైతులు, విశిష్టాద్వైతులు, అద్వైతులు, శైవులు, వైష్ణవులు, శాక్తేయులు, సూర్యోపాసకులు, గాణాపత్యులు, ఇంతేల, హిందూ మతావరణములోనికి రావలెనని సాహసించు ప్రతిసంప్రదాయ

మును — వేదములందలి ఉపనిషత్తులను ఒప్పుకొనియే తీరవలెను. వానికి స్వంతవ్యాఖ్యానములను చేసికొనవచ్చును; తమ తమ సంప్రదాయములను అనుసరించి అర్థము చెప్పుకోనవచ్చును. కాని వాని అధికారమునకు లోబడియే తీరవలయును. ఈ కారణముచేతనే, హిందువు అను మాటకు బదులుగా 'వేదాంతి' అను మాటను మనము ఉపయోగించుకొనగోరుట. సనాతనులగు హైందవ తాత్త్వికులందఱును వేదాంతము పరమప్రమాణమని అంగీకరించిరి. ఈ నాటి మన మతములన్నియు, అవి ఎంతమోటుగ కనబడినను, వాని ఆదర్శములు ఎంత గూఢముగానున్నను, జాగరూకతతో పరిశీలించి అర్థముచేసికొన్నచో, అవి అన్నియు ఉపనిషద్ధర్మముల పైననే ఆధారపడియున్నట్లు విశదమగును. చివరకు హిందువులలోని అతిమూర్ఖసంప్రదాయముల యొక్క ప్రతీకములను లేక విగ్రహములను పరిశీలించినను, ఈ ఉపనిషత్తుల భావములు మన జాతిలో ఎంతలోతుగ నాటుకొనిపోయినవో తెలిసికొనవచ్చును. ఈ ఉపనిషత్తులు కొంతకాలమునకు విగ్రహములు మొదలగు వానిరూపమున సాంకేతిక చిహ్నములుగ ఏర్పడినవి. ఉపనిషత్తులలోని పారమార్థిక తాత్త్విక మహాభావములు నేటి మనఇండ్లలోని విగ్రహపూజారూపములుదాల్చి కనుపట్టుచుండును. ఇట్లు మనము ఉపయోగించుకొను వివిధములగు సాంకేతికచిహ్నములు అన్నియు వేదాంతమునుండియే వచ్చియున్నవి. ఏలయన వేదాంతమందు అవి భాషాలంకారములుగా వాడబడినవి. ఆ భావములన్నియు జాతి యందు వ్యాపించి, మన ఆరాధ్యదేవతా రూపములను పొంది నిత్యజీవితమునందు కలిసిపోయినవి.

ఈ వేదాంతమునకు పిమ్మట స్మృతులు వచ్చును. ఇవియు ఋషులు వ్రాసిన పుస్తకములే; కాని వీని ప్రామాణికత వేదాంతముయొక్క ప్రామాణికతకన్న తక్కువ. ఇతర మతస్థులకు వారి వారి మతగ్రంథములతో ఎట్టి సంబంధముగలదో, ఈ స్మృతులతో

మనకును అట్టి సంబంధమే కలదు. ఈ స్మృతులు ఆయా ఋషుల చేత వ్రాయబడినట్లు మనము ఒప్పుకొందుము. ఆ అర్థమున అవి యితరుల మత గ్రంథములవంటివే; కాని యీస్మృతులు పరమ ప్రమాణములుకావు. వేదాంతమునకు విరుద్ధమగునది ఏదేని ఒక స్మృతియందుండిన యెడల, ఆ స్మృతిని త్రోసివేయవలసినదే. దాని ప్రామాణికత అంతరించును. ఈ స్మృతులు ఆ యా కాలములందు మారుచుండునని మన మెఱుగుదుము. కొన్ని కొన్ని స్మృతులు సత్యయుగమునందును, కొన్ని కొన్ని త్రేతాయుగమునందును, కొన్ని ద్వాపరయుగమునందును, మఱికొన్ని కలియుగమందును ప్రమాణములుగ నుండుచు వచ్చెనని మనకు తెలియును. కాలముమాఱి కాలముతోబాటు పరిస్థితులు మాఱినపుడెల్ల ఆచారమర్యాదలును మాఱవలసి యుండును. జాతియొక్క ఈ ఆచారమర్యాదలను సంస్కరించు స్మృతులును ఆ యా సమయములందు మాఱి తీరవలయును. ఈ విషయమును మీరు ముఖ్యముగా జ్ఞప్తినుంచుకొనవలయునని కోరుచున్నాను. వేదాంతమందలి మతధర్మములు మాఱునవికావు. ఏలయన, అవి ప్రకృతి పురుషులందుగల సనాతనధర్మములపైని ఆధారపడినవి. జీవుడు స్వర్గమునకు పోవుట మొదలగు భావములు ఎన్నడును మాఱజాలవు. వేలకొలది సంవత్సరములకు పూర్వము అవి ఎట్లుండెనో యీనాడును అట్లేయున్నవి. కొన్ని వేలయేండ్లు గడచినను, అవి అటులనే యుండును. కాని పూర్తిగా మన సంఘస్థితిగతులపై ఆధారపడియుండు మతాచారములు, సంఘములందు గలుగు మార్పులతోబాటు మాఱవలసి యుండును. ఒక శాసనము ఒకానొక కాలమునందు క్షేమకరమయి ధర్మమయి యుండును; మఱియొక కాలమునందు అది అటుల నుండదు. ఒక విధమగు ఆహారము ఒక కాలమునందు సరిపడి వేఱొక కాలమునందు సరిపడదు. ఏమన, ఆ ఆహారము ఆ కాలమునకుమాత్రమే యోగ్యమైనది. శీతోష్ణస్థితులును ఇతరవిషయములును మాఱినప్పుడు ఆయాసంద

ర్భమును అనుసరించి ఆహారమును మాఱుచుండును. కావున ఆహారాదివిషయములందు కూడ ఆ యా కాలములందు స్మృతి ధర్మములు మాఱుచున్నవి. ఈ విధముగా నవీనకాలమునను సంఘమునందు మార్పు లవసరమేని, వానిని అంగీకరించి తీర వలయును. వానిని మార్చువిధానమును ఋషులు ఏర్పడి మనకు చూపుదురు. కాని మన పరమార్థధర్మములలో ఒక్క లేశమైనను మాఱుటకు వీలులేదు. ఆ ధర్మములు చెక్కుచెదరక అటుల ఉండవలసినవే.

ఇక పురాణములున్నవి. 'పురాణం పఞ్చలక్షణమ్' అని పురాణములు అయిదులక్షణములు కలవిగా నున్నవి. చరిత్ర, సృష్టిక్రమము, వేదాంతధర్మములు, ఆదర్శసంకేతములు మొదలగువానిని పురాణములు తెల్పును. ఇవి వేదములందలి మత ధర్మములను ప్రజాసామాన్యమునకు బోధించుట కొఱకయి వ్రాయబడినవి. వేదములలోని భాష చాల పురాతనమయినది. పండితులందు సైతము బహు కొలదిమంది మాత్రమే వేదము లెప్పుడు వెలువడినవో, ఆ భాష ఎట్టిదో గ్రహింపగలరు. పురాణములన్ననో ఆకాలపు ప్రజలభాషలో వ్రాయబడినవి. దానినే యిప్పుడు సంస్కృత మనుచున్నాము. కావున ఈ పురాణములు పండితులకొఱకు గాక సామాన్యప్రజలకొఱకు ఉద్దేశింపబడినవి. ఈ ప్రజాసామాన్యమునకు తత్త్వశాస్త్రము అర్థముకాదు. అట్టి తత్త్వవిషయములు ఋషులయొక్కయు, రాజులయొక్కయు, మహాపురుషులయొక్కయు జీవితముల సాహాయ్యమునను, జాతికి సంభవించిన చారిత్రకసంఘటనల సాహాయ్యమునను, స్థూలరూపమున ప్రజలకు బోధింప బడుచున్నవి. మతముయొక్క సనాతనసూత్రములను నిదర్శనపూర్వకముగా తెలుపుటకు అట్టి విషయములను ఋషులు పురాణములందు ఉపయోగించుచు వచ్చిరి.

తంత్రములు అను ఇతరగ్రంథములు కూడ కొన్ని కలవు. కొన్నివిషయములలో వీనికిని పురాణములకును చాల పోలిక

గలదు. కొన్నితంత్రములలో కర్మకాండకు సంబంధించిన యజ్ఞ యాగాదుల ఆచారములను పునరుద్ధరింపవలెనను ప్రయత్నము చూపట్టును.

ఈ గ్రంథములన్నియు హిందువుల శాస్త్రసముదాయము. తత్త్వవిచారణయందును, ఆత్మశోధనయందును, తమ శక్తిలో అత్యధికభాగమును వినియోగము చేసిన జాతియందు ఇట్టి శాస్త్ర గ్రంథసముదాయము పెరుగుచు వచ్చును. ఇటుల ఎన్నివేల సంవత్సరములు జరిగెనో ఎవరి కెఱుక ? అట్టి హిందూజాతియందు అనేక శాఖాసంప్రదాయము లుండుట సహజమే. ఇంకను కొన్నివేల శాఖలు బయలుదేరకుండుటయే విచిత్ర విషయము! కొన్ని కొన్ని అంశములందు ఈ శాఖలు మిక్కిలి భిన్నములుగ నున్నవి. ఈ శాఖాసంప్రదాయములందును, వాని ఆధ్యాత్మిక భావములందును గల భేదములు విచారించుటకు మనకు కాలము చాలదు. కాబట్టి యీ శాఖలవా రందఱును ఒప్పుకొను సామాన్యప్రమాణములను, ప్రధానధర్మములను విచారింతము. వీనిని ప్రతిహిందువు తప్పక విశ్వసించును.

మొట్టమొదట సృష్టిక్రమమును తీసికొందము. ఈ సృష్టి, లేక ప్రకృతి, మాయ, అనంతమును అనాదియునై ఉన్నది. ఈ ప్రపంచము నిన్న మొన్న సృష్టింపబడినది కాదు. దేవుడు వచ్చి యీ లోకమును సృజించి, పోయి పరుండి నిద్రపోవుచున్నా డనుట కేవలము అసంబద్ధము. సృజనశక్తి సదా పనిచేయుచునే యున్నది. భగవంతుడు నిరంతరము సృష్టిచేయుచునే ఉన్నాడు. ఎన్నడును విశ్రాంతి తీసికొనడు. "నేను ఒక్కక్షణము కర్మ చేయక ఊరకుందునేని ఈ జగత్తు సర్వనాశనమై పోవును" అని గీతయందు శ్రీకృష్ణుడు పలికిన వాక్కులను జ్ఞప్తినుంచుకొనుడు. మనచుట్టును రేయింబవళ్లు పనిచేయుచున్న సృష్టిశక్తి ఒక్కనిమిష మూరకుండినయెడల, సమస్తమును నేల కూలిపోవును. ఈ విశాల

జగత్తులో సర్వత్ర, సర్వదా, ఈ శక్తి పనిచేయుచునే యున్నది. కాని కల్ప, విలయ, నియమము కలదు గదా. సంస్కృతభాషలో 'సృష్టి' అను మాటకు 'శూన్యములోనుండి కల్పన' అని అర్థము కాదు; 'ఆవిష్కరణము' అని మాత్రమే అర్థము. ఆంగ్లభాషలో 'క్రియేషన్' అను పదము 'ఏమియు లేనిదానినుండి కల్పించుట' అనెడు భయంకర మూఢభావమును సూచించును. శూన్యము నుండి కల్పన జరుగుట, అభావమునుండి భావము వచ్చుట అను దానిని విశ్వసింపుడని కోరుట మిమ్ము అవమానించుట యగును. ఆ పని నేను చేయజాలను. కావున 'క్రియేషన్' అను మాటకు 'ఆవిష్కరణము' అనియే అర్థము చెప్పుకొందము. ఈ జగమంతయు ఎప్పుడును ఉండునదే; కాని అది ఒకప్పుడు సూక్ష్మరూపము తాల్చి అవ్యక్తమై అణగియుండును. విశ్రాంతి తీసికొనుచున్నదో యన్నట్లు కొంతకాలము అటుల అణగియుండును; సమస్తమును దానినుండి ఆవిష్కరణమగును; అనగా ఉబికి పైకివచ్చి గోచరించును. పూర్వపు సంఘటనలే, పూర్వపు పరిణామములే, పూర్వపు ఆకృతులే, మరల కలుగును. కాని కొంతకాలము ఈ ఆట సాగి, మరల అంతయు విచ్ఛిన్నమై, నలిగియై, ధూళియై, సూక్ష్మదశనుపొంది, అదృశ్యమై అణగిపోవును. ఆ అణగిపోవుట తిరిగి మఱొకసారి ఆవిష్కరణము పొందుటకే! ఈ విధమున తరంగగతితో ముందుకు, వెనుకకు, ఇది అనంతకాలమును నడచుచునే యుండును. 'కాలము' 'దేశము' 'నిమిత్తము' అనునవన్నియు ఈ సృష్టిలోనివే. కాబట్టి దీని కొక ఆది కలదనుట వట్టి వెఱ్ఱిమాట. దీని ఆదిని గుఱించిగాని, అంతమును గుఱించిగాని ప్రశ్నించుటకే వీలులేదు. కాబట్టి మన శాస్త్రములలో ఆది, అంతము అను పదములు ఉపయోగించునప్పుడు అవి ఒక్క ప్రత్యేకకల్పమును గుఱించి వాడబడినవే యని గ్రహింపవలయును. అంతకుమించినవ్యాప్తి వానికి లేదు.

సరే, సృష్టిని చేయునది ఎవరు? 'గాడ్' (ఈ ప్రసంగము జరగుచున్నది ఆంగ్లములోగదా.)'గాడ్'అను ఈ ఇంగ్లీషుమాటను నే నేయర్థమున వాడుచున్నాను? ఇంగ్లీషులో మామూలుగా వాడు అర్థమునకాదు. రెంటికిని చాల భేదము కలదు. నా భావమును సరిగా తెలుపు పదము ఆంగ్లభాషలో లేదు. కావున 'బ్రహ్మము' అను సంస్కృతపదమును వాడుట నాకు ఇష్టము. ఆతడు ఈ సమస్త దృశ్యవస్తుజాలమునకును మూలకారణము. బ్రహ్మము అనగా ఎట్టివాడు? ఆతడు నిత్యుడు, నిత్యపవిత్రుడు, నిత్యజాగరూకుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, కృపాళుడు, నిరాకారుడు, నిరవయవుడు. ఆతడు ఈ జగమును సృష్టించును. ఆతడు ఈ జగత్తును నిరంతరము సృష్టిచేయుచు రక్షించుచునే యుండు ననుటలో రెండు చిక్కులు తటస్థించును. ఈ జగమున ద్వంద్వము లున్నవని మనకు తెలియును. ఒకడు సుఖంచుచుండ వేఱొకడు దుఃఖించుచుండును. ఒకడు ధనికుడు, ఇంకొకడు దరిద్రుడు. ఇది పక్షపాతమును చూపుచున్నది. మఱియు ఇందు క్రౌర్యమును కలదు. ఒకదాని బ్రతుకునకు మఱొకదాని మరణము ఆధారముగ నున్నది. ఒకజంతువు ఇంకొక జంతువును ముక్కలు ముక్కలుగ చీల్చివేయుచున్నది. ప్రతి నరుడును తన సోదరుని అణచివేసి తాను మించిపోవలయునని చూచుచుండును. ఇట్లు స్పర్థ, క్రౌర్యము, భయము, నిట్టూర్పులు, హృదయవేదనలు, ప్రపంచమున సర్వత్ర అనుదినమును కనబడుచునే యున్నవి. ఇదంతయు ఒక దేవుని సృష్టియగునెడల, ఆ దేవుడు క్రూరుడే కాదు, మహాక్రూరరాక్షసునికంటెనుకూడ అధముడు అనవలయును. సరే, వేదాంతము చెప్పునదేమి? ఈ భిన్నత్వము, ఈ స్పర్థ ఉండుట భగవంతుని దోషము కాదు. ఇక వీనిని కల్పించునది ఎవరు? మనమే. మేఘము పొలములన్నింటి మీదను సమానముగనే వర్షించును. అయినను బాగుగ దున్నిన పొలమే ఆ వర్షముయొక్క లాభమును పొందును; దున్నక నిర్లక్ష్యము

చేయబడిన పొలము ఆ లాభమును పొందజాలదు. అది మేఘము యొక్క దోషముకాదు. భగవంతుని కరుణ నిత్యము, నిర్వికారము. మనమే భేదమును కల్పనచేయుచున్నాము. అయితే కొందఱు సుఖవంతులుగను కొందఱు దుఃఖవంతులుగను ఉండుట యను భేదమునకు సమాధాన మేమి? వారు ఈ భేదములకు ఎంతమాత్రమును కారకులుకారే, ఏపాపమును ఎఱుగరే అనిన, ఈ జన్మలోకాదు; కాని గతజన్మలో కారకులైరి. అనవలయును. పూర్వజన్మములందలి కర్మ ఈ భేదమునకు సమాధానము కూర్చుచున్నది.

ఇక రెండవసూత్రమును గుఱించి విచారింతము. ఈ విషయమున హిందువులేగాక బౌద్ధులును, జైనులును, అందఱును ఏకాభిప్రాయులగుచున్నారు. జీవము నిత్యమని అందఱమును అంగీకరింతుము. అది శూన్యమునుండి కలిగినది అనుట తగదు; అట్లగుట పొసగదు. అటువంటి జీవము ఎందునకును కొఱగాదు. కాలములో దేనికి ఆది కలదో, కాలములో దానికి తుదియును ఉండును. జీవము నిన్న ప్రారంభమైనచో, రేపు అంతరించి తీరవలయును. అప్పుడు సర్వనాశనమే ఫలితార్థమగును. జీవము శాశ్వతమై వచ్చునదే! దీనిని గ్రహించుటకు పెద్ద మేధాశక్తి అవసరములేదు. ఈనాటి ప్రకృతిశాస్త్రములన్నియు మనకు తోడ్పడుచున్నవి. అవి మన ధర్మశాస్త్రములలోని సూత్రములకు భౌతికప్రపంచములో నిదర్శనములను చూపుచున్నవి. మనలో ప్రతివాని స్థితియు అనంతమగు పూర్వజన్మములయొక్క ఫలితార్థమే యని మీరు ఎఱిగియే యున్నారు. లోకములో ఒకబిడ్డ పుట్టెననుకొనుడు. అతడు ప్రకృతియొక్క చేతిలోనుండి తళుక్కుమని తటాలున ఊడిపడుటలేదు. కవులు అటుల వర్ణించి ఆనందించిన ఆనందింతురుగాక! కాని, ఆ బిడ్డ నెత్తిమీద అనంతమగు పూర్వకర్మభారము ఉన్నది. మంచియో, చెడ్డయో, తన పూర్వకర్మలను పరిష్కరించుకొను నిమిత్తమే ఈ లోకమునకు

అతడు వచ్చుచున్నాడు. ఇదియే కర్మసూత్రము. మనలోని ప్రతివాడును, తన అదృష్టమునకు తానే కర్తయగుచున్నాడు. ఈ సూత్రము 'విధి వ్రాత', 'దైవసంకల్పము' అను వాదములను ఎగురగొట్టివేయుచున్నది. ఈ సూత్రమే భగవంతునకును మానవునకును సమాధానమును కూర్చుటకు ఆధారమగుచున్నది. మన దుఃఖములకు మనమే బాధ్యులము; ఇంకెవరును కారు. కార్యరూపఫలము మనమే; కారణమును మనమే. అందువలననే మనము స్వతంత్రులము అనుట. నేను దుఃఖినైన యెడల, ఆ దుఃఖము నేను తెచ్చిపెట్టుకొనినదే. నేను తలచుకొనినయెడల సుఖవంతుడనుగ మాఱగలననుటకు అదియే నిదర్శనము. నేను దుష్టుడనైనయెడల అదియు నా కర్మఫలమే. కావున నేను తలపెట్టునెడల పవిత్రుడను కాగలననుటకు రుజువును అదియే. నరుని ఇచ్ఛాశక్తి పరిస్థితులన్నింటికిని అతీతమై పరగుచున్నది. దీనిముందు అనగా, నరునందుగల బలిష్ఠమును, మహత్తరమును, అఖండమునగు ఇచ్ఛాస్వాతంత్ర్యముల ఎదుట, ప్రకృతియు జోహారనవలసినదే; తలవంచి దాస్యము చేయవలసినదే. కర్మసూత్రము యొక్క మహిమ యిట్టిదిసుడీ!

తరువాతి ప్రశ్న: జీవుడు అనగా నేమి అనునది. 'జీవు' డనగా నేమో గ్రహింపనిది మన శాస్త్రమునందలి 'దేవు' డనగా ఏమో తెలిసికొనలేము. బాహ్యజగమును పరిశీలించుమూలమున దానికి పరమందేమి కలదో కనిపట్టుటకు భారతదేశమునందును, ఇతరదేశములందును ప్రబల ప్రయత్నములు సాగియున్నవి. కాని చివరకు ఆ ప్రయత్నములన్నియు ఎట్లు వ్యర్థములయ్యెనో మన కందఱకు తెలిసిన విషయమే. పరమార్థమును కనుగొనుటకు మాఱుగా, మనము ఈ జడప్రపంచమును పరిశీలించిన కొలది, మనమే జడమతులమైపోవుట తటస్థించుచున్నది. ఈ జడప్రపంచముతో విశేష జోక్యము కలిగించుకొనిన కొలది, మనలో మిణుకు మిణుకు మనుచున్న పారమార్థికత కూడ ఎగిరిపోవుట

తటస్థించుచున్నది. కాబట్టి పారమార్థికతకు, పరమసత్యమును, గ్రహించుటకు, అది మార్గము కాదు. అది హృదయద్వారమున, జీవాత్మద్వారమున మాత్రమే లభింపవలసియున్నది. బాహ్య కర్మలు పరమార్థమును గుఱించి, ఆ అఖండబ్రహ్మమును గుఱించి, ఏమియు బోధింప జాలవు. ఆంతర్యసాధనము మాత్రమే అటుల చేయగలదు. ఆత్మద్వారమున, అనగా జీవాత్మ విచారణద్వారమున మాత్రమే మనము దేవుని గుఱించి తెలిసికొనగలము. ఈ జీవాత్మయొక్క స్వభావమును గుఱించి హిందూదేశములోని ఆ యా సంప్రదాయముల మధ్య భిన్నాభిప్రాయములు గలవు. కాని వారందఱును ఏకీభవించు అంశములును కొన్ని గలవు. ఆత్మలు ఆద్యంతములులేక, స్వభావముచేతనే నిత్యములని మన మందఱమును ఒప్పుకొందుము. మఱియు సర్వశక్తులును, ఆనందమును, పరిశుద్ధతయు, సర్వవ్యాపకత్వమును, సర్వజ్ఞత్వమును, ప్రతి ఆత్మయందును నెలకొనియుండుననియు మనము నమ్మెదము. ఇది యొక మహనీయమగు భావమని జ్ఞప్తి నుంచుకొనవలయును. కొద్ది గొప్ప అను భేదములేక, పుణ్యాపాపముల భేదములేక, ప్రతి మానవునందును ప్రతిజీవియందును సర్వవ్యాపకమును సర్వజ్ఞత్వమును అగు ఒకే ఆత్మ వసించుచుండును. భిన్నత్వము ఆత్మయందు లేదు. దాని బాహ్యాకారమందుండును. నాకును ఒక అత్యల్పజీవికిని మధ్య గల భేదము ఆత్మ ప్రకాశమందే. మూలతత్త్వమున ఆ జీవియు నావంటిదే. అతడు నా సోదరుడే. నాయందున్న యాత్మయే వానియందును కలదు. హిందూదేశము ప్రబోధించిన మహాతత్త్వ రహస్యమిది. మానవ భ్రాతృత్వము అనగా హిందూదేశమున సర్వజీవభ్రాతృత్వము అగుచున్నది. చిన్న చీమ మొదలు బ్రహ్మదేవుని వఱకు అన్నిశరీరములును మనవియే. శాస్త్రమునందు ఈ భావము గలదు: "ఒకేప్రభువు సమస్త శరీరములందును అధివసించుచునని తెలిసి యోగి ప్రతి శరీరమును ప్రభు మయముగ భావించి పూజించును." అందువలననే

భారతదేశమున బీదవారిని గుఱించియు, పశువులను గుఱించియు, ఇంతేల ప్రతిజీవిని గుఱించియు, ప్రతివస్తువును గుఱించియు మహోదారభావములు వెలయుచున్నవి. ఆత్మను గుఱించిన మన భావములలో సర్వాంగీకారము పడసినది ఇది యొకటి.

దేవుఁడు అన నెట్టివాఁడు? అను ప్రశ్న ఇప్పుడు సహజముగా కలుగుచున్నది. ఆత్మను గురించి ఇంకొక విషయము చెప్ప కొందము. ఇంగ్లీషుభాష నేర్చుకొన్నవారు 'సోల్', 'మైండ్' అను మాటలను అర్థము చేసికొనుటలో తబ్బిబ్బుపడుచున్నారు. మనము 'ఆత్మ' యనునదియు ఇంగ్లీషులో "సోల్" అనునదియు విభిన్నములు. మనము 'మనస్సు' అను దానినే పాశ్చాత్యులు "సోల్" అందురు. సుమారు ఇరువదిసంవత్సరములక్రిందట, సంస్కృతభాషాద్వారమున 'ఆత్మ' అను మాటను వారు విను వఱకును, వారికి ఆ భావమే లేదు. ఇది స్థూలశరీరము. దానిని దాటిపోయినయెడల మనస్సు కలదు. కాని ఈ మనస్సు ఆత్మ కాదు, సూక్ష్మశరీరము. అది జననమరణములను పొందుచు పోవు సూక్ష్మాణువులతో ఏర్పడినది. ఈ మనస్సును దాటిన పిమ్మట ఆత్మ యుండును. అదియే నరునందుగల 'అహంత': దానిని "సోల్" అనిగాని, "మైండ్" అనిగాని అనువదింపదగదు. కాబట్టి మనము ఆత్మ అను పదమునే వాడవలెను; లేదా పాశ్చాత్యతత్త్వవిదులు పేర్కొనుతీరున "సెల్ఫ్" అనవలెను. మనము ఏ పదమును ఉపయోగించినను 'ఆత్మ' అనగా 'మనస్సు' కాదనియు, ఈ శరీరము కాదనియు, వీనినుండి అది వేఱనియు, జ్ఞప్తినుంచుకొనవలయును. ఈ యాత్మ సూక్ష్మశరీరమని పేర్కొన బడు మనస్సును వెంట తీసికొని జననమరణములను పొందుచు పోవును. అది సమస్త జ్ఞానమును పొంది పరిపూర్ణవికాసము పడసిన పిదప ఈ రాకపోకలు అనగా జననమరణములు ఆగి పోవును. అట్టి దశయందు ఆత్మ తన సూక్ష్మశరీరమును ఇచ్ఛాను సారము నిలుపుకొనవచ్చును; లేదా పూర్తిగ వదలివేసి స్వతం

త్రమై, శాశ్వత ముక్తిని పొందవచ్చును. ఈ ముక్తియే ఆత్మకు పరమగమ్యము. ఇది మన మతమునకు గల విశిష్టలక్షణములలో నొకటి. మనకును స్వర్గములు నరకములు గలవు. కాని అవి శాశ్వతములు కావు. అవి శాశ్వతము లనుటకు వీలులేదు. ఇవి యట్లు కాజాలవని ఈ విషయావగాహమువలన గ్రహింతుము. ఎన్ని స్వర్గము లున్నను, అవియు మన ఈ లోకమువంటివే; కాని భూలోకము కంటె అవి చాల పెద్దవిగా నుండవచ్చును. అందలి సౌఖ్యము కొంచెము హెచ్చుగా నుండవచ్చును. అందలి భోగములును కొంచెము ఎక్కువగానే యుండవచ్చును. కాని ఇది యంతయు జీవునికి నష్టమే. స్వర్గములు చాల నున్నవి. ప్రతిఫలము నాసించి, ఇక్కడ సత్కర్మలుచేయు నరులు మరణించునపుడు, ఈ స్వర్గములలో దేవతలై పుట్టి, ఇంద్రుడు మొదలగు పదవులను పొందుదురు. ఈ దేవతానామములు కొన్ని పదవుల పేళ్లుగ నున్నవి. ఇప్పటి దేవతలు ఒకప్పుడు మానవులుగా నుండి, తమ సత్కర్మల వలన దేవతలైరి. మనము ఇంద్రుడు మొదలగు పేళ్లను గ్రంథములందు చూచునపుడు, అవి ఒక్కొక్క వ్యక్తియొక్క పేరులు అనుకొనరాదు. వేలకొలది ఇంద్రులు ఉండగలరు. "నహుషుడు" అను రాజు కలడు. అతడు మరణించినపుడు ఇంద్రుడైనాడు. అది ఒక పదవి. ఒక జీవాత్మ ఉన్నతిని సాధించి ఇంద్రపదవిని పొందవచ్చును. ఆ పదవిలో కొంతకాలము మాత్రమే అతడుండగలడు, ఆ గడవునకు పిమ్మట అతడు మరణించి నరుడై పుట్టును. కాన ఈ నరదేహమే అన్నిటి లోను ఉత్తమమైనది. కొందఱు దేవతలు ఇంకను గొప్పవారు కా గోరి స్వర్గభోగములపైని వాంఛలనుగూడ త్యజించి వేయుదురు. ఈ లోకములో అనేకులు ధనము, అధికారము, భోగము మొదలగువాని మోహమునకు లోబడుదురు; అటులనే దేవతలలో కూడ అనేకులు వీని మోహమున బడుదురు. అందుచేత తమ సత్కర్మఫలము వ్యయము కాగానే, క్రిందికి దిగి వచ్చి మఱల

మానవులై పుట్టుదురు. అందువలననే ఈ లోకమునకు కర్మభూమి యని పేరు వచ్చినది. ఈ లోకమునందుండియే మనము మోక్షమును సంపాదించుకొనవలెను. కావున స్వర్గములు సైతము వాంఛనీయములు కావు.

ఇక వాంఛనీయమగునదేది? ముక్తి, ''బంధరాహిత్యము''. మహోన్నతస్వర్గమునందు సైతము నీవు బద్ధుడవే, బానిసవే అని మనశాస్త్రములు చెప్పుచున్నవి. నీవు ఇరువదివేల సంవత్సరములు రాజుగానుండినను ఏమి లాభము? నీ కొక శరీర మున్నంతవఱకు నీవు భోగములకు దాసుడవే. నీవు కాలమునకు లోబడియున్నంత వఱకును, తావునకు లోబడియున్నంతవఱకును, నీవు బానిసవే; కాబట్టియే బాహ్యప్రకృతియొక్కయు అంతరప్రకృతియొక్కయు బంధమునుండి విముక్తులము కావలెను అనునది ఆదర్శము. ప్రకృతి నీ పాదములకడ పడవలయును; నీవు దాని కతీతుడవై, ముక్తుడవై, తేజస్వివై, ప్రకాశింపవలెను. ఇక నీకు జన్మముండదు; కావున మరణమును ఉండదు; నీకు సుఖముండదు; కావున దుఃఖమును ఉండదు. అయ్యది సర్వాతీతమగు అనిర్వచనీయమగు నిత్యానందపదవి. మన మీ లోకమున సుఖము, శుభము అనునవి అట్టి నిత్యానందముయొక్క అత్యల్పరేణువులు అనవలెను. అట్టి నిత్యానందమే మన పరమగమ్యము.

జీవాత్మకు లింగభేదము, అనగా స్త్రీ పురుష నపుంసక భేదము లేదు. ఆత్మ స్త్రీ యని గాని పురుషుడని గాని చెప్పుటకు వీలు లేదు. లింగభేదము కేవలము శరీరమునకు సంబంధించినది; కాబట్టి స్త్రీ, పురుషుడు, అను భావములన్నియు ఆత్మసంబంధముగా చెప్పుట భ్రాంతి. అవి శరీరమును గుఱించియే చెప్పఁకోదగినవి. అటులనే వయస్సును గుఱించిన భావములును. ఆత్మకు వయస్సనునది లేదు. ఆ సనాతనుడు సర్వకాలము ఒకే తీరున నుండును.

ఆత్మ భూలోకమునకు ఎట్లు వచ్చినది? ఈ ప్రశ్నకు మన శాస్త్రములు ఒక్కటే సమాధానమును చెప్పుచున్నవి. అజ్ఞానమే ఈ బంధనమున కంతకును హేతువు! అజ్ఞానము మూలమున బద్ధులమైతిమి. జ్ఞానము ఆ దోషమును నివారణచేయును; మనలను ఉద్ధరించును. అట్టి జ్ఞానము లభించుటెట్లు? అది భక్తిద్వారమున లభించును; భగవంతుని పూజించుటవలన, సమస్త జీవులను భగవంతుని ఆలయములుగ భావించుట వలన లభించును. భగవంతుడు సమస్త భూతములందును వసించుచున్నాడు. కాబట్టి గాఢభక్తిద్వారమున జ్ఞానము లభించును; అజ్ఞానము అంతరించును; బంధనములు తెగిపోవును; జీవుడు ముక్తుడగును.

భగవంతుని గుఱించి రెండు విధములగు భావములు మన శాస్త్రములందు గలవు. ఒకటి సగుణము, రెండవది నిర్గుణము. భగవంతుడు సర్వవ్యాపి, సృష్టికర్త, రక్షకుడు, సర్వసంహారకుడు, ఈ జగత్తునకు శాశ్వత జనకుడో జననియో, యని భావించుట సగుణదైవత భావము. అతడు మననుండి వేఱుపడియుండును. సమస్త జీవులకు సదా పరుడై యుండును. క్రమముగా వానిని సమీపించుట, వాని యందు వసించుట, 'మోక్ష' మనబడును. ఇక నిర్గుణభావమును విచారింతము. అందు విశేషణము లన్నియు అనవసరములును అసమంజసములును అని త్రోసివేయబడి, సర్వవ్యాపియు, నిర్గుణుడును అగు పురుషుడు మిగులుచున్నాడు. వానిని జ్ఞాని అనుటకు వీలులేదు. ఏలయన జ్ఞానము మనుష్యమానసమునకు సంబంధించినది. అతడు హేతుశక్తి సమన్వితుడని పలుకుటకు వీలులేదు. అట్లనుట ఆతనిని కొద్దిచూపుతో చూచుటగును. వితర్కము నీరసస్థితికి గుర్తు. అతడు సృష్టించు ప్రాణికాడు. ఏలయన బంధనము లేనివాడు దేనిని గాని సృష్టింపబోడు. భగవంతునికి బంధనమేమి కలదు? వాంఛాసాఫల్యము కొఱకు తప్ప, ఎవడును కర్మ చేయడు. దేవునికి ఏమి వాంఛలుండును? ఏవేని

కొఱతలుండిన వానిని తీర్చుకొను నిమిత్తము కాక, ఎవఁడును పనులు చేయఁడు. పరమాత్మకు కొఱత యేమి కలదు? వేదములందు దేవునిగూర్చి 'వాఁడు' అను పదము ప్రయోగింపబడలేదు; 'అది' అనెడు నిర్గుణసూచక మగు పదమే ప్రయోగింపబడినది. వాఁడు అనగనే భగవంతుఁడు ఎవరో ఒక పురుషుఁడు అను భేదభావము కలుగును. వేదము నిర్గుణ మగు పరమాత్మనే బోధించుచున్నది. ఈ సిద్ధాంతమును అద్వైత సిద్ధాంత మందురు.

ఈ నిర్గుణతత్త్వముతో మనకుగల సంబంధము ఎట్టిది? మనము ఆ తత్త్వమే; మనమును అతఁడును ఒక్కటియే. ప్రతివాఁడును ఆ నిర్గుణమూర్తి యొక్క వ్యక్తరూపమే. అదియే సమస్తమునకును మూలాధారము. ఇట్టి యఖండనిర్గుణతత్త్వమునుండి మనము వేఱని భావించుకొనుటవలననే దుఃఖము కలుగుచున్నది. ఈ యద్భుతనిర్గుణతత్త్వముతోడి మన ఐక్యమును తెలిసికొనుటయే మోక్షము. నేనిప్పుడు సంక్షేపముగ భగవంతుని గుఱించి చెప్పిన ఈ రెండుభావములును మనశాస్త్రములందు గోచరించుచున్నవి.

వీనినిగూర్చి ఇంకను కొంచెము వివరముగా చెప్పుకొందము. ఈ నిర్గుణదైవతముయొక్క భావనపైని ఆధారపడియే, యేనీతిశాస్త్రములుగాని నిర్మాణముకాగలవు. ప్రతి జాతియందును, 'నీతోడి నరులను నీవలె ప్రేమింపుము' అని అత్యంతప్రాచీన కాలమునుండి బోధింపబడుచున్నది. కాని భారతదేశమున 'సమస్తజీవులను నీవలె ప్రేమింపుము' అని బోధింపబడినది. నరులు, పశువులు అను భేదమును మనము పాటింపము. అయినను మనవలె ఇతర జీవులను ప్రేమించుట యెందువలన ధర్మమో, ఎవరును చెప్పుటలేదు; ఎవరికిని తెలియదు. కాని ఆ కారణము 'నిర్గుణ బ్రహ్మమును' గుఱించిన భావనయందిమిడియున్నది. ప్రపంచమంతయు ఒక్కటని, సర్వచైతన్యమును ఏకముకాగా విశ్వము అభిన్నమై భాసించుననని, నీవు తెలిసికొని నప్పుడు, ఒకనికి అపకా

రము చేసినయెడల నీకు నీవే అపకారము చేసికొంటివనియు, ఒకనిని ప్రేమించుటవలన నిన్ను నీవే ప్రేమించుకొంటివనియు గ్రహింతువు. దీనినిబట్టి మనము ఇతరులను ఏల హింసింపరాదో తెలిసికొనగలము. ఇట్లు 'నిర్గుణబ్రహ్మము' అనెడు ఆదర్శమే నీతి శాస్త్రమునకు ఆధారమని స్పష్టమగుచున్నది. సరే. అందు సగుణ బ్రహ్మమునకు తావెక్కడ? 'సగుణబ్రహ్మ' మనెడు భావము నుండియే అద్భుత ప్రేమప్రవాహము ఉద్భవిల్లుచున్నదని నే నెఱుగుదును. భక్తిమహిమ ఆ యా కాలములందలి పరిస్థితులకు అనుగుణముగా మానవులపై తన అద్భుతప్రభావమును ప్రసరింప జేయుట నాకు బాగుగ అనుభవమే. అయినను మన దేశములో ఇప్పుడు అంతగా కావలసినది భక్త్యనుతాపము కాదు. మనకు పరాక్రమము కొఱవడియున్నది. ఆహా! ఈ నిర్గుణబ్రహ్మ భావము ఎంత వీర్యవంతమైనది! సమస్తభ్రాంతులను వెడజిమ్మివైచి "నేను ఈ విశ్వమునందు అంతర్యామినై పరగు నిర్గుణ బ్రహ్మమను" అను జ్ఞానముతో సాహసియై మానవుడు నిలబడగలడు. ఆతనికి భయముకలిగించునది ఇక నేమున్నది? ప్రకృతి శాసనములను సైతము ఆతడు లెక్కసేయడు. మరణమన్న ఆతనికి పరిహాసముగ తోచును. అతడు తన ఆత్మయొక్క ప్రభావముపైని ఆధారపడి నిలుచును. ఆ ఆత్మ అనంతమై, అఖండమై, అవినాశియై ప్రకాశించుచున్నది. ఆ ఆత్మను కత్తులు నరకజాలవు; గాలి ఆర్పజాలదు; నిప్పు కాల్పజాలదు; నీరు తడుపజాలదు. అది తుది మొదలులేనిది; దానికి చావు బ్రతుకులులేవు. ఆద్యంతములులేని ఈ ఆత్మతో పోల్చినయెడల, చంద్రులును సూర్యులును నక్షత్ర మండలములును సముద్రములోని నీటిచుక్కలను పోలియుండును. ఆత్మప్రభావము నెదుట ఆకాశము శూన్యమైచనును. కాలము అభావమైపోవును. ఇట్టి మహిమాఢ్యమగు ఆత్మయందు మనకు విశ్వాసము కుదురవలయును. అందుండి మన కెంతేని బలము చేకూరగలదు. నీ వేది కాగోరిన అది కాగలవు. నీవు

దీనుడవు అనుకొనిన దీనుడవే అగుదువు; బలాఢ్యుడను అను కొనిన యెడల బలాఢ్యుడవే కాగలవు. నీవు పాపిని అనుకొని నచో పాపివి అగుదువు; పుణ్యశాలి ననుకొంటివా పుణ్యశాలి వగుదువు. మనము దీనులము అనుకొన దగదని ఇది మనకు నేర్పు చున్నది. బలాఢ్యులము, సర్వశక్తిమంతులము, సర్వజ్ఞులము అని మనము సంకల్పముచేయవలెను. ఆశక్తియంతయు ఇప్పుడు నా యందు ప్రకాశమునకు వచ్చియుండక పోవచ్చును. కాని అది నాయందున్నది. సమస్తజ్ఞానమును నాయందున్నది; సర్వశక్తియు నాయందున్నది; నేను పరమపవిత్రుడను; నిత్యముక్తుడను. ఈజ్ఞాన మును నేను ప్రకటింపజాల కుండుటే? నాకు దానియందు విశ్వా సము కుదరలేదు కనుకనే. దానియందు నాకు విశ్వాసముకుదిరిన తోడనే అది ప్రకాశమునకు రాగలదు. వచ్చియేతీరును. నిర్గుణ బ్రహ్మముయొక్క భావన ప్రబోధింపగలది ఇదియే. మీబిడ్డలను పసితనమునుండియే పరాక్రమవంతులుగ చేయుడు. వారికి దైన్య మును నేర్పకుడు. మీ ఆచారములను నేర్పకుడు. వారిని వీర్య వంతులనుగా జేయుడు. ధీరులై, సర్వదమనులై, తితిక్షావంతులై, సర్వస్వతంత్రులై నిలుచునటుల ప్రోత్సహింపుడు. మొట్టమొదట వారికి ఆత్మయొక్క మహిమను తెలుపుడు. అదిమీకు వేదాం తము నందు మాత్రమే లభింప గలదు. ఇతర మతములందు కాన్పించు భక్తిప్రపత్తులు మొదలుగాగల భావములును, ఇంకను విశేషభావములును అందుకలవు. కాని ఈ యాత్మభావనయో ఉజ్జీవనప్రదమగుభావన; అత్యద్భుతమైనది! ఈ ప్రపంచమును తలక్రిందులు చేయగల భావనాపటిమ వేదాంతము నుండియే బయలుదేఱగలదు. అది జడప్రకృతిశాస్త్రములకును మతమున కును సామరస్యమును కూర్పగలదు.

ఈ విధముగా మన మతమును గుఱించిన ప్రధానాంశ ములను, అనగా ముఖ్యసూత్రములను మీకు దెలుప ప్రయత్నిం

చితిని. ఇక దాని అనుష్ఠానమును గుఱించి నాలుగుమాటలు చెప్పవలసియున్నది. ప్రస్తుతము హిందూదేశములోనున్న పరిస్థితులలో అనేక శాఖాసంప్రదాయములు బయలుదేఱుట సహజమే. నిజమునకు భారతదేశమున అనేక శాఖాసంప్రదాయములు ఉండనే యున్నవి. కాని అవి ఒకదానితో నొకటి పోరాటములు సలుపకుండుట విడ్డూరము. శైవుడు ప్రతివైష్ణవుడును నరకముపాల బడవలసినదే అనుట లేదు. వైష్ణవుడును ప్రతిశైవుని నరకమున కూలుదువుగాక యని శపించుటయు లేదు. "ఇది నా మార్గము; నీ మార్గమున నీవు పొమ్ము. తుదకు మనమందఱమును కలసికొన గలము" అని ప్రతి దైవభక్తుడును పలుకును. భారతదేశమున ఈ విషయమును అందఱును ఎఱుగుదురు. ఇదియే 'ఇష్టదేవతా' సిద్ధాంతము. భగవంతుని పూజించుటలో అనేకవిధానములు కలవని మన ప్రాచీనులు ఎప్పుడో గ్రహించిరి. వివిధ స్వభావ గుణములకు సరిపడునటుల వేర్వేఱుమార్గము లుండవలయునని వారు తెలిసికొనిరి. భగవంతుని చేరుటలో మీ మార్గము నా మార్గము కాకపోవచ్చును. ఒకవేళ అది నాకు అపకారమును చేయవచ్చును. కాని ప్రతివాడును ఒకేమార్గమును అవలంబించి తీరవలయునను భావమే మిగుల అనర్థకము, అర్థశూన్యము. అట్టి భావమును పూర్తిగా త్యజింపవలయును. అందఱును ఒకేమతాభిప్రాయమును కలిగియుండి ఒకేమార్గమున నడువవలసివచ్చెనో లోకము మునిగిపోవును. అప్పుడు మతములన్నిటి బుద్ధివికాసమంతయు నాశనమై పోవును. వైవిధ్యమే జీవితమునకు మూలాధారము. అది అంతరించినపుడు సృష్టి పూర్తిగా విలయమందును. భావమునందు ఈ వైవిధ్యమును కాపాడుకొనునంతవఱకే మనము సజీవులమై యుందుము. వైవిధ్యమున్నంతమాత్రమున మనము కొట్లాడుకొననక్కఱలేదు. నీ మార్గము నీకు మంచిది, నా మార్గము నాకు మంచిది. నా మార్గమునకు సంస్కృతమున నా 'ఇష్టదైవము' అని పేరు. ప్రపంచములోని ఏ మతముతోడను మనకు వైరము

లేదని మీరు ముఖ్యముగా జ్ఞప్తి నుంచుకోవలయును. మనలో ప్రతివానికిని వాని 'ఇష్టదైవ' మున్నది. కాని యితరులు వచ్చి 'మా మార్గమే ఏకైకమార్గము' అని పలుకుచు తమ సంప్రదాయ మును మనకు బలాత్కారముగా అంటగట్టజూచుచో మనము వారిని మందలింపవలసియున్నది. వారి మాటలు విన్నచో మనకు నవ్వువచ్చును. భగవంతుని చేరుటకు వేఱొకమార్గమున పోవు చున్నారను కారణమున సోదరులను నాశముచేయజూచు ఇట్టి ప్రజలు ప్రేమనుగూర్చి బోధలు చేయబూనుట పరిహాసాస్పదము. వారిప్రేమ అంతగా పాటింపదగినదికాదు. తమ మార్గమునకు భిన్నమగు మార్గమున నడచు ఇంకొక మానవుని చూచి సహింప లేనివారు ఏమి ప్రేమను బోధింపజాలుదురు? వారిదే ప్రేమ అయినయెడల ఇక ద్వేషమనగా ఎట్టిది? క్రీస్తునుగాని, బుద్ధుని గాని, మహమ్మదునుగాని మఱే ప్రవక్తనుగాని పూజింపుడని బోధించు ఏ మతముతోడను మనకు వైరము లేదు. "సోదరా! స్వాగతము. నేను నీకు సాహాయ్యము చేసెదను; కాని నీవు నన్ను కూడ నా మార్గమున పోనీయవలెను. అది నా 'ఇష్టము'. నీ మార్గము చాల మంచిదే, సంశయములేదు. కాని అది నాకు అపాయకరము కావచ్చును. నాకు ఏ ఆహారము సరిపడునో నా అనుభవమునుబట్టి నాకు తెలియును. ఎంతమంది డాక్టరులైనను నాకు సరిపడు ఆహారమును నిర్ణయించి చెప్పజాలరు; నన్ను శాసింపనుజాలరు. అటులనే "నా స్వంత అనుభవమువలన నాకు ఏ మార్గము ఉత్తమమో నే నెఱుగుదును. ఒక దేవాలయమో ఒక ప్రతీకమో ఒక విగ్రహమో ఏదో యొకటి నీలోని దైవాంశను ప్రత్యక్షము చేసికొనుటకు నీకు సాయపడునెడల, నీవు దాని ననుసరించుట నాకు సమ్మతమే" అని హైందవుడు చెప్పును. మీ కిష్టమగునేని రెండువందల విగ్రహములు పెట్టుకొనుడు. ఏవేని కొన్ని రూపములు, కొన్ని మంత్రతంత్రములు ఆత్మసాక్షా త్కారమునకై మీకు సహకారకము లగునేని తప్పక వానిని

అవలంబింపుడు. ఏయే విగ్రహములు, ఏయే దేవళములు, ఏయే కర్మకలాపములు భగవంతుని సమీపించుటకు మీ కవసరము లగునో వానిని యథేచ్ఛగా అనుసరింపుడు. కాని వానిని గుఱించి వాదములు మాత్రము సలుపకుడు. మీరు వివాదములకు దిగితిరా దైవోన్ముఖముగ సాగు మీ పయనము ఆ క్షణముననే ఆగిపోవును; అధోగతినంది పశుప్రాయు లగుదురు.

మన హైందవమతములోని అభిప్రాయములు ఈ విధముగా నున్నవి. మన మతము ప్రతివానిని తనలో ఇముడ్చుకొనును గాని ఎవరిని బహిష్కరింపదు. మన కులములును మన సంప్రదాయ ములును మన మతముతో సంబంధించినటుల కాన్పించినను, వానికి అట్టి సంబంధము లేదు. ఈ సంప్రదాయములు మన జాతీయతను రక్షించుటకు ఒకప్పుడు అవసరమైనవి. మనరక్షణకు ఆవశ్యకము కానినాడు అవి నిలువవు. స్వభావసిద్ధముగా అవి శిథిలమైపోవును. కాని నేను పెద్దవాడనైనకొలది హిందూదేశములోని ఈ ప్రాచీ నాచారములను గుఱించి నాకు గౌరవభావము కలుగుచున్నది. ఒకప్పుడు నేను వీనిలో అనేకములు తుచ్ఛములనియు నిష్ప్రయో జనములనియు తలచియుంటిని. కాని నేను పెద్దవాడనైన కొలదిని వానిలో దేనినిగాని నిందించుటకు జంకుచున్నాను. ఏలయన వానిలో ప్రతిదానియందును శతాబ్దముల కొలది గడించిన అను భవము ఇమిడియున్నది. నిన్న మొన్న పుట్టి, రేపు చావనున్న ఒక కుఱ్ఱవాడు నా కడకువచ్చి నా పద్ధతులనన్నిటిని తప్పను ననుకొనుడు. నేను వానిబోధను ఆలకించి వాని అభిప్రాయముల ప్రకారము నా ఆచారవ్యవహారముల నన్నిటిని మార్చుకొందునేని నేనే మూఢుడను కావలసియుందును. ఆయా దేశములనుండి మనకు వచ్చుచున్న బోధ చాలవఱకు ఇట్టిదిగా నున్నది. ఈ పండితమ్మన్యులతో ఇటుల చెప్పుదముగాక! "మీరు సుస్థిరముగా మీ సంఘనిర్మాణమును చేసికొన్నప్పుడు మేము మీ మాటను

అలకింతుము. రెండుదినములవఱకేని ఒక్క అభిప్రాయమును మీరు నిలుపుకొనజాలకున్నారు; వివాదములకు దిగుచున్నారు; ఓడిపోవుచున్నారు. తొలకరిలో పుట్టు మిడుతలవలె మీరు పుట్టుచున్నారు; వానివలెనే అయిదు నిమిషములలో చచ్చుచున్నారు. నీటిబుడగల రీతిని పైకిలేచుచున్నారు; ఆ బుడగలవలెనే తెప్పపాటులో చిట్లిపోవుచున్నారు. మీరు మా సంఘమువంటి ఒక సుస్థిరసంఘమును మొట్టమొదట నిర్మాణము చేసికొనుడు. ఇరువదేసి శతాబ్దములు గడచినను చెక్కుచెదరక, మహిమాఢ్యములై నిలిచియుండగల శాసనములను సంప్రదాయములను మొట్టమొదట మీరు నెలకొల్పుకొనుడు. ఆ పిమ్మట అట్టి విషయములనుగూర్చి మీతో మాట్లాడుటకు అవకాశము దొరకునులెండు. కాని అంతవఱకును మీరు ఆలోచనలేక పైత్యోద్రేకమున తలతిరిగి మాట్లాడు బుడుతలే యని చెప్పుచున్నాము.''

నేను మన మతమును గుఱించి చెప్పవలసిన దానిని ముగించితిని. నేడు మనకు అవసరమగు ఒకటి రెండు విషయములను మీకు జ్ఞప్తికి తెచ్చి విరమించెదను. ఈ కలియుగమునకు మహాభారతమువంటి ఉత్తమగ్రంథమును ప్రసాదించినందులకు శ్రీ వ్యాసమహర్షికి నమస్కరింతముగాక. ఇతరయుగములందు ఆచరింపబడిన తపస్సులును, కష్టభూయిష్టములైన యోగమునకు నేడు ఉపకరింపవు. ఈ యుగమున ఆవశ్యకమైనది దానము; అనగా పరోపకారము. పరమార్థజ్ఞానమును ఒసగుట అత్యుత్తమదానము; దాని తర్వాత వ్యావహారికజ్ఞానదానము; ఆ పిమ్మట ప్రాణరక్షణము; తుదిది ఆహారపానీయాదుల నిచ్చుట; ఇవి దానములగును. పరమార్థజ్ఞానము నొసగు నతడు అనేక జన్మలలో పడకుండ జీవుని రక్షించును. వ్యావహారికజ్ఞానదాతయు పరమార్థజ్ఞానమువైపునకు నరునిదృష్టిని త్రిప్పగలడు. వీని తరు

వాత అత్యల్పములైన ప్రాణరక్షణము మొదలగు ఇతర దానములు లెక్కలోనికి వచ్చును. కావున పరమార్థజ్ఞానమును బోధించుట కంటె ఇతరవిధములగు కర్మలన్నియు తక్కువ యని మీరు గ్రహించుట అవసరము. ఇట్టి అధ్యాత్మజ్ఞానప్రచారమున తోడ్పడుటయే అత్యుత్తమసాహాయ్యము. మనశాస్త్రములందు అనంతమగు పరమార్థజ్ఞాననిధి కలదు. ఈ త్యాగభూమియందుతక్క పుడమిని మఱెచ్చోటను తత్త్వవిజ్ఞానము ననుష్ఠానరూపమున ప్రకటించు ఆదర్శమూర్తులను చూపజాలము. నాకు కొంచెము ప్రపంచానుభవము కలదు. ఇతర దేశములందు ప్రగల్భములు కొట్టువారు చాలమంది కలరుకాని మతానుష్ఠానపరులై ఆధ్యాత్మికజ్ఞానమును జీవనచర్యలలోనికి ప్రవేశపెట్టిన పురుషవరులను ఇక్కడనే, ఈదేశమందు మాత్రమే కనుగొనగలము. మతమనగా మాటలు చెప్పుట కాదు. చిలుకలు మాట్లాడగలవు. ఈ దినములలో ప్రసంగింప యంత్రములు సయితము మాట్లాడుచున్నవి. కాని వైరాగ్యయుతమైన, ఆధ్యాత్మికధర్మసహితమైన, తితిక్షావంతమైన, యాతనబంధురమైన అఖండప్రేమపూరితమైన జీవనము నాకు చూపుడు. అట్టి జీవనము మాత్రమే ఆత్మజ్ఞానికి లక్షణము. మనదేశములో ఇట్టి భావములును, ఆదర్శమూర్తులగు ఇట్టి మహానుష్ఠానపరులును అసంఖ్యాకముగా ఉన్నారు. ఆ మహాయోగుల మేధలందును హృదయములందును కూర్పబడియున్న భాగ్యరాసులను పైకితీసి, గొప్పవారనక, కొద్దివారనక, ధనికులనక, దరిద్రులనక సర్వజనులకును సమముగా పంచిపెట్టవలయును. భారతదేశముననే గాక ప్రపంచమంతటను వానిని వెదజల్లవలయును.

అట్లు కానిచో, అది శోచనీయమైన విషయమగును. ఇది మనయుత్కృష్టధర్మములలో నొకటి. ఒరులకు మీరు తోడ్పడుకొలది, మీకు మీరే తోడ్పాటొనరించుకొందురు. మీరు నిక్కముగా మీ మతమును ప్రేమించితిరేని, మీరుయదార్థముగా మీదేశమును ప్రేమించితిరేని, మీరు తప్పనిసరిగా నిర్వహింప

వలసిన ప్రధానకర్తవ్యమిది: మూయబడియుండిన మీ గ్రంథము లందిలి ఖజానాను వెలుపలికిదీసి వానినందుటకు హక్కుగల వార సులకు దానిని ప్రసాదింపవలెనను ఆశయ చరితార్థతకై మీరు శక్తివంచనలేక కృషిసలుపవలయుననునదే ఈకర్తవ్యము.

అన్నిటికంటెను ఒక విషయము మీకు తెలుపుట ఆవశ్య కము. యుగయుగాంతరములనుండి ఓర్వలేనితనము మన హృద యములందు ఇంకియున్నది. మనము ఒకరినిచూచి ఒకరము అసూయపడుచున్నాము. "ఆతనికి ఆధిక్యము ఎందు కుండవల యును? నాకే ఏలయుండరాదు?" అనుకొను చుందుము. దేవతా పూజలందు సైతము 'నేనుముందు; నేనుముందు' అనుచుందుము. అట్టి దౌర్భాగ్యదాస్యమునకు మనము దిగినాము. దీనిని ముందు వదలించుకొనవలసియున్నది. ఈ కాలమున హిందూదేశమునగల మహానర్థకరమగు పాపము ఈ క్షుద్రదాస్యభావమే. ప్రతివాడును నాయకత్వము వహించి నడపగోరును; విధేయుడై సహచరించుట కెవ్వడును ఒప్పుకొనడు. పూర్వకాలపు అద్భుత బ్రహ్మచర్య ధర్మము ఈనాడు అడుగంటి పోవుటయే దీనికి కారణము. మొట్ట మొదట విధేయతను నేర్చుకొనుడు. నాయకత్వము దానంతట అదియే వచ్చును. మొట్టమొదట సేవకుడవుగా నుండుట నేర్చు కొనుడు; ఆపిమ్మట స్వామిగానుండు అర్హత నీకు లభించును. ఈ ఓర్వలేనితనమును బాపుకొనుడు. ఇంకను చేయవలసియున్న మహా కార్యములను అప్పుడు మీరు చేయగలుగుదురు. మనపూర్వులు అత్యద్భుత కార్యములు చేసియున్నారు. వారి ఘనకార్యములను గుఱించి భక్తిప్రపత్తులతో సగర్వముగా చెప్పుకొనుచున్నాము. సరే, మనమును ఘనకార్యములు చేయబోవుచున్నాము. ముందు రానున్నవారు వెనుదిరిగిచూచి తమపూర్వులగు మనలనుగుఱించి ధన్యవాదములు చేయుచు సగౌరవముగా ప్రస్తుతింతురుగాక! మన పూర్వులు మహాఘనులును మహిమాఢ్యులును ఐనను, వారికీర్తిని అతిక్రమించునంతటి మహాకార్యములను ఇచ్చట నున్నవారిలో

ప్రతి యొకరును చేయగలుగునటుల పరమేశ్వరుడు అనుగ్రహించు గాక!



## పాంబన్‌లో సమర్పింపబడిన స్వాగతపత్రమునకు ప్రత్యుత్తరముగా నొసగిన ఉపన్యాసము.

అనంతరము పాంబన్ పట్టణమునకు శ్రీ వివేకానంద స్వాములవారు చేరగనే రామనాడురాజాగారు శ్రీవారిని కలిసికొని భక్తిపూర్వకముగా స్వాగత మొసగిరి. సముద్రతీరమున శ్రీవారు పడవ దిగినతావున స్వాగతసత్కారములకొఱకు ప్రత్యేకముగా నిర్మింపబడి చిత్ర విచిత్రముగా అలంకరింపబడిన పందిరియందు పాంబన్ పట్టణవాసుల పక్షమున ఈ క్రింది అభినందనపత్రము వారికి సమర్పింపబడెను.

పరమపూజ్యులగు యతివర్యా!

గాఢతమకృతజ్ఞతతోడను, పరమపూజ్యభావముతోడను, శ్రీవారికి స్వాగత మర్పింపగలిగినందులకు మేము మిగుల సంతసించుచున్నారము. అనేకములగు ఆహ్వానముల ఒత్తిడియున్నను, ఒక్కసారి మాకు దర్శనమిచ్చుటకు కరుణతో సంతోషముగా మీ రంగీకరించినందులకు మే మెంతయు కృతజ్ఞులమగుచున్నాము. మీయందలి మహనీయ సద్గుణరాశికిని, ఔదార్యపు పెంపున మీరు నిర్వహింపబూనుకొని, అవమాన శక్తితోడను పరిపూర్ణోత్సాహముతోడను, అచంచలదీక్షతోడను కొనసాగించుచున్న మీ పవిత్రోద్యమమునకును ఇవే మా శ్రద్ధాంజలులు!

పాశ్చాత్యసభ్యజాతుల మనస్సులందు మీరునాటిన హిందూ తత్త్వబీజములు అంకురించుచుండుట చూచుచున్నాము.

అవి పెరిగి అవ్వారిగా సత్ఫలములనిచ్చు సూచనలను ఇప్పుడిప్పుడే కనుగొని మహానందము పొందుచున్నాము. శ్రీవారు ఈ ఆర్యావర్తములో సంచారము చేయునప్పుడు పాశ్చాత్యదేశములలో కంటె మిన్నగా, ఈ మన మాతృభూమియందలి సోదరులను జన్మాదిగా ఆవరించిన నిద్రనుండి మేల్కొలిపి, చిరకాలము మఱచియున్న బ్రహ్మవిద్యను వారి జ్ఞప్తికి తెచ్చి సుప్రబోధము కల్పింప ననుగ్రహింతురుగాక యని మనవిచేయుచున్నాము.

మా హృదయములు మా సద్గురువులగు శ్రీవారియెడల సత్యభక్తితోడను, పూజ్యభావముతోడను, పవిత్రాభిమానముతోడను నిండి పరవశములై పోవుచున్నవి. కావున మా భావములను తగురీతిని వ్యక్తముచేయజాలకున్నాము. శ్రీవారికి దీర్ఘాయురారోగ్యముల నొసంగి, చిరకాలముగా లోకమున కొఱవడియున్న విశ్వభ్రాతృభావమును పునరుద్ధరించుటకు వలసిన సమస్తశక్తులను సర్వేశ్వరుడు ప్రసాదించుగాక యని పూర్ణభక్తితో మేమందఱము ప్రార్థించుచు విరమించుచున్నారము.



తదనంతరము శ్రీ రాజాగారు తమ స్వపక్షమున పూర్ణభక్తివిశ్వాసములను తెలుపుచు స్వీయస్వాగతమర్పించిరి. శ్రీవారు ఈ క్రిందివిధమున ప్రత్యుత్తర మొసగిరి :—

మన పవిత్ర మాతృభూమి మతమునకును తత్త్వశాస్త్రమునకును ప్రధానక్షేత్రము; మహాఋషులకు జన్మస్థానము; తీవ్రవైరాగ్యమునకు ఆలవాలము. మానవుడు సాధింపవలసిన మహోన్నతపరమాదర్శము అత్యంతప్రాచీనకాలమునుండి నేటివఱకును విరాజిల్లుచు వచ్చినది ఇచ్చటనే!

నేను పాశ్చాత్యదేశములకు పోయివచ్చితిని. అనేకజాతుల వారిమధ్య అనేకదేశములలో సంచారముచేసితిని. ప్రతిజాతియు

ప్రతిసంఘమును ఒక్కొక్క విశిష్టాదర్శముతో ఒప్పుచున్నటుల నాకు కాన్పించినది. ఒక ప్రధానాదర్శము వారిజీవితమునంతను ఆక్రమించుచున్నది. ఈ ఆదర్శము వారి జాతీయజీవనమునకు పట్టుకొమ్మయై పరగుచున్నది. హిందూదేశమునకును అట్టి పట్టుకొమ్మ ఒకటి కలదు. అయ్యది రాజనీతికాదు; సైనికబలముకాదు; వాణిజ్యాధిక్యతకాదు; యంత్రనిర్మాణకౌశలముకాదు; మతము. మతమే మనజీవననిధి; మనకున్న భాగ్యసర్వస్వము. మనము కోరుకొనునదియు అదియే. అట్టి వేదాంతము మన హిందూదేశమున సర్వదా వర్ధిలుచు వచ్చినది.

కండరబలము నిజమునకు గొప్పదే. ప్రకృతిశాస్త్రప్రయోగములవలన నిర్మించిన యంత్రజాలమందు ప్రకటితమగు బుద్ధిమహిమ చాల అద్భుతమైనదే. అయినను ప్రపంచముమీద వేదాంతమునకుగల ప్రభావము వానికి లేదు.

భారతదేశము చిరకాలముగా కార్యదీక్ష గలిగి మెలగుచున్నటుల మనజాతిచరిత్రయే తెలుపుచున్నది. ఈనాడు యథార్థము నెఱుగనివారు బయలుదేఱి, భారతీయుడు స్తబ్ధుడని, మందమతి యని ప్రచారముచేయుచున్నారు. ఇతరదేశప్రజలకు ఇదే వాడుకపదమై పోయినది. భారతదేశము ఎన్నడైనను మందమతియై పడియుండెననుభావమును నేనొప్పుకొనజాలను. మన ఈ పుణ్యభూమియందుకంటె ఎచ్చోటను కార్యదీక్ష ప్రస్ఫుటముగ ప్రకాశించుటలేదు. అత్యంతప్రాచీనమును, మహామహిమాఢ్యమును అగు మనజాతి యింకను సజీవమై యుండుటే మనజాతి కార్యదక్షతకు ప్రబలసాక్ష్యము. ప్రతిదశాబ్దియందును మనజాతి నూతనయౌవనమును పడయుచు, అక్షీణమును అవినాశియునై, దివ్యజీవనగతితో ప్రకాశించుచున్నది. ఈ కార్యపరత మన దేశమున మతమునందు గోచరించును. కాని ప్రతివాడును తన వృత్తిని ప్రమాణముగ పెట్టుకొనియే యితరులను విమర్శించు

చుండుట మానవస్వభావమనుసత్యమును ముఖ్యముగ గమనింప వలయును. ఉదాహరణకు, ఒక చెప్పులుకుట్టువానిని పరామర్శిం పుడు. వానికి చెప్పులుకుట్టుట మాత్రము తెలియును. ఆతనికి చెప్పులు తయారుచేయుటను మించిన యోగ్యతరకార్యము తోచదు. ఒక తాపీపనివాడున్నాడనుకొనుడు. ఆతనికి ఆ తాపీ పని మాత్రము తెలియును. ఇతర లౌకికజ్ఞానము సున్న. దీనికి మఱొక కారణముకూడ నున్నది. కాంతి మిక్కిలి తీక్ష్ణముగ నున్నప్పుడు మనకన్నులు చూడలేవు. మనదృష్టిశక్తి పరిమితిని దాటి మనకన్నులు చూడనేరవు. వాని నిర్మాణము అటులున్నది. కాని అంతరవలోకనప్రభావముగల యోగి అట్లుకాదు. పామరు లను ముసుగువేసి కప్పియుంచు అనాత్మావరణమును ఛేదించుకొని పోయి ఆతడు చూడగల్గును.

నేడు ఆధ్యాత్మికపుష్టినిచ్చు ఆహారముకొఱకు ప్రపంచము వేయికన్నులతో భారతదేశమువైపు చూచుచున్నది. ఈ భారత దేశము సమస్తజాతులకును ఆ భిక్షను పెట్టవలసియున్నది. మానవకోటికి కావలయు పరమాదర్శము ఇక్కడమాత్రమే లభింప గలదు. పాశ్చాత్యపండితులు ఇప్పుడిప్పుడే ఈ విషయమును గ్రహింపగల్గుచున్నారు. ఈ ఆదర్శము మన సంస్కృతవాఙ్మయము నందును వేదాంతశాస్త్రమునందును సురక్షితమై యున్నది. యుగయుగములనుండి ఇయ్యది భారతీయుల ప్రత్యేకసంపదమై విలసిల్లుచున్నది.

చరిత్రదృష్టి ప్రసరించినంతవఱకు హైందవసిద్ధాంతములను, తత్త్వసూత్రములను ప్రచారముచేయుటకై ఏ ప్రబోధకుడును ఇంతవఱకు హిందూదేశపు పొలిమేరలు దాటిపోయినట్లు కాన్పిం పదు. కాని ఇప్పుడు అద్భుతమగు మార్పొకటి మనయందు కలుగుచున్నది. "ఎప్పుడెప్పుడు ధర్మము అణగిపోయి అధర్మము పెచ్చుపెరుగునో, అప్పుడెల్ల లోకమును రక్షించు నిమిత్తము

నేను అవతరించుచుందును" అని శ్రీకృష్ణభగవానుడు చెప్పి యున్నాడు. ఏ దేశమందేని శ్రేష్ఠమగు నీతిశాస్త్రము కలదేని అది మనదేశమునుండి పరిగ్రహింపబడినదిగనే యున్నదనియు, జీవుని నిత్యత్వమునుగూర్చిన ఉత్తమభావములుగల మతము ఎందున్నను, అది ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని, మన యొద్దనుండి గ్రహింపబడినదిగనే యుండుననియు మతపరిశోధనల వలన తెలియవచ్చుచున్నది.

ఈ పందొమ్మిదవ శతాబ్దాంతభాగమున జరుగుచున్నంతగా దుర్బలురపైబడి దోచుకొనుటయు, దౌర్జన్యము చేయుటయు, పీడించుటయు ప్రపంచచరిత్రయందు ఏకాలమునను జరిగి యుండ లేదు. వాంఛలను జయించుటవలన తప్ప ముక్తి చేకూరదనియు, విషయభోగములకు దానిసయైయుండునంతకాలము ఎవనికిని మోక్షము అలవడ దనియు ప్రతివాడును గ్రహింపవలసియున్నది. ఈ మహాసత్యమును సకలజాతులవారును నెమ్మది నెమ్మదిగ తెలిసికొని ఆమోదించుచున్నారు. శిష్యు డీ సత్యమునుగ్రహించు నర్హతను పొందినతోడ్తోడనే, గురువుయొక్క బోధ వానిని రక్షింప వచ్చుచుండును. భగవంతుడు అనంతదయా సముద్రుడుగాన, తన బిడ్డలకు—వారేమతము వారైనను—కరుణజూపుచునేయుండును. ఈ కారుణ్యశరధి ఎన్నడును ఎల్లిపోవునదికాదు. మన ఈశ్వరు డును సమస్తమతములవారి ఈశ్వరుడును ఒక్కడే. ఈ అభిప్రా యము భారతదేశమునందు మాత్రమే గోచరించుచున్నదిగాని ప్రపంచములోని మరే యితర మతగ్రంథమునందును కానరాదని నేను బాహాటముగా చాటి చెప్పుచున్నాను.

హిందువులమగు మనము ఈశ్వరేచ్ఛవలన బహుబాధ్యతా యుత క్లిష్టపరిస్థితిలో నున్నాము. పాశ్చాత్య జాతులవారు ఆధ్యాత్మసాహాయ్యముకొఱకు మన దాపునకు వచ్చుచున్నారు. మానవజన్మకు సంబంధించిన సమస్యలను గుఱించి ప్రపంచమునకు జ్ఞానదానము చేయుటకు తగిన సామర్థ్యమును సంపాదించు కొన

వలసిన మహాబాధ్యత నైతికముగ భారత పుత్రులకు ఏర్పడినది. ఒక్క విషయముచూడుడు. కొండకోటలలో నివసించుచు అప్పు డప్పుడు వెలువడివచ్చి బాటసారులను దోచుకొనుచుండిన ఎవడో ఒక దొంగలరాయని సంతానమని చెప్పుకొనుటకు ఇతర దేశము లందలి ఘనులును, మహాపురుషులును గర్వపడుచుందురు. కాని హిందువులమో, కొండలందును గుహాలందును ఫల మూలములు తిని జీవించుచు పరమాత్మధ్యానమునందు కాలముగడపిన ఏఋషి యొక్కయో, ఏ సాధుపురుషునియొక్కయో సంతానమని చెప్పు కొని గర్వపడుచుందుము. ఈ నాడు మనము అధోగతిపాలై పసచెడి యుండవచ్చును. కాని మన మతమును గుఱించి శ్రద్ధ పూని, సరియైన మార్గమున పనిచేయ ప్రారంభించినయెడల మనము తిరిగి మహత్తరపీఠము నలంకరింపగలము.

అత్యంతాదరముతో హృదయపూర్వకముగ మీరు నా కొసగిన స్వాగతమునకు వందనముల నర్పించుచున్నాను. ఈరామ నాడు మహారాజాగారు నాయెడల చూపుచున్న ప్రేమకు తగు రీతిని నాకృతజ్ఞతను తెలుపగలుగుట నాకు సాధ్యముకాదు. నేను స్వయముగాగాని, యితరులద్వారాగాని ఏదేని సత్కార్యము చేసి యుండినయెడల అందుకై హిందూదేశపు కృతజ్ఞత ఈసత్పురుషు నికే చెందవలసియున్నది. ఏమన, అసలు నేను "షికాగో" నగరమునకు పోవలయునని మొదట సంకల్పముచేసినది వీరే. ఆభావమును నాకు సూచించి దానిని నిర్వహింప బట్టుపట్టి ప్రోత్స హించినదియు వీరే! ఇప్పుడు నాచెంతనే నిలుచుండి నేనింకను పనిచేయవలయునని వెనుకటి యుత్సాహముతోడనే ఆయన సదా ఆశించుచున్నారు. మన ప్రియమాతృభూమియెడల అభిమానము వహించి ఆధ్యాత్మమార్గమున దేశజనయిత్రి నుద్ధరించుకొఱకై పాటుపడుటకు ఇట్టి రాజన్యులు ఇంకను అరుగురు దొరకుదురుగాక యని నే నభిలషించుచున్నాడను.



## శ్రీ రామేశ్వరాలయము నొద్ద శ్రీవారు "సత్యమగు ఈశ్వరార్చనము"ను గురించి ఒసగిన ఉపన్యాసము

తరువాత శ్రీస్వాములవారు శ్రీరామేశ్వరాలయమును సందర్శించిరి. అచట సమావేశమైన ప్రజలు కొలది వాక్కులను చెప్పవలసినదని శ్రీ వివేకానందస్వాములవారిని ప్రార్థించిరి. వారి వేడికోలును మన్నించి శ్రీవారిట్లు ప్రసంగించిరి:

మత మనునది ప్రేమలోను, భక్తిలోను కలదుగాని బాహ్యార్చనములందు కాదు. అది హృదయమునందు పూను నిర్మలమును నిష్కపటమును అగు ప్రేమయందుండును. నరుడు శరీరమునందును మనసునందును పరిశుద్ధుడైననేగాని, దేవాలయమునకు వచ్చుటవలనను, శివుని పూజించుటవలనను ఫలితము కలుగదు. మనస్సునందును శరీరమునందును పరిశుద్ధులగు వారి ప్రార్థనలకు శివుడు ప్రతిఫలము నొసంగును, తాము అపవిత్రులుగ నుండియు ఇతరులకు ధర్మబోధ చేయజూచువారు తుదకు అపజయమునే గాంతురు. బాహ్యపూజ, ఆంతరంగిక పూజయు పరిశుద్ధతయు మాత్రమే వాస్తవముగ కావలసినవి. అవి లేని యెడల బాహ్యపూజకు ఫలముండదు. కాబట్టి మీరందఱు దీనిని జ్ఞప్తి యుంచుకొనుడు.

ఈ కలియుగములో జనులు తాము ఏమి చేసినను సరియే, ఒక పుణ్యక్షేత్రమునకు పోయినమాత్రమున తమ పాపములన్నియు క్షమింపబడునని నమ్మునంత అధోగతిని పడిపోయినారు. కల్మష హృదయముతో దేవాలయములో అడుగుపెట్టినవాడు అదివఱకు వానికున్న పాపములు ఇంకను పెరిగి మఱింతపాపియగును. తీర్థ మనగా పవిత్రవిషయములతోడను, పవిత్రపురుషులతోడను, నిండియున్న స్థలమని అర్థము. కాని ఒకస్థలమున పవిత్రజనులుండి, అచ్చట దేవాలయములేకున్నను అది తీర్థమే అగును. నూఱు దేవా

లయములున్న స్థలమున దుష్టజనులుచేరినచో తీర్థము అచ్చట నుండి అదృశ్యమగును. తీర్థక్షేత్రమునందు కాపురముండుట చాల కష్టము. ఏలన, సామాన్యస్థలములలో చేసినపాపమును సులభ ముగా పోగొట్టుకొనవచ్చును. కాని తీర్థక్షేత్రమున చేసినపాప మును తొలగించుకొనలేము. నిష్పాపులుగనుండి పరోపకారము చేయుటయే పూజ లన్నిటియొక్క సారము. దరిద్రునందును, దీనునందును, రోగియందును, శివుని చూడగలుగువాడు నిజముగా శివపూజచేసిన వాడు. విగ్రహామునందుమాత్రమే శివుని చూచు వానిపూజ ప్రారంభదశలోనిదే. ఒక దరిద్రునియందు — వాని జాతినిగాని మతమునుగాని కులమునుగాని మఱి దేనినిగాని పాటిం పక — శివునిచూచి, వానికి సాయపడి ఉపచారములు చేసిన వానిపై శివున కెక్కువప్రీతి; తన్ను దేవళము లందుమాత్రమే చూడగలుగునట్టి మనుజునిపై దేవునకంత ప్రీతియుండదు.

ఒక ధనికునకు ఇద్దఱు తోటమాలీలు ఉండిరట. వారిలో ఒకడు చాలసోమరి; పనిచేసెడివాడుకాడు. కాని యజమాని తోటలోనికి వచ్చినప్పుడెల్ల లేచి చేతులు జోడించుకొని 'ఆహా, మా దొరగారి ముఖము ఎంత సుందరముగ నున్నది!' అని పొగడుచు వానియెదుట తన్మయత్వము నటించెడివాడు. రెండవ తోటమాలి విశేషముగ మాటలాడువాడుకాడు; కష్టపడి పనిచేసి అన్నిరకముల పండ్లను, కూరగాయలను పండించెడివాడు. వానిని నెత్తిని మోసికొనిపోయి దూరముననున్న యజమాని ఇంటికి చేర్చెడివాడు. ఈ ఇరువురు తోటమాలీలలో ఎవరిని యజమాని ఎక్కువగ మెచ్చుకొనునో ఆలోచింపుడు. శివుడే అట్టి యజమాని; ఈ ప్రపంచమే వానితోట; ఇక్కడ రెండు తీరులగు తోటమాలీ లున్నారు. ఒకడు సోమరి, మాయలమారి, మోసకాడు, ఏమియు పనిచేయడు. కాని శివునికన్నుల సొగసును, ముక్కుయొక్క చక్కదనమును, ఇతరావయవముల సౌందర్యమును ఊరక

అభివర్ణించుచు స్తోత్రములు చేయుచుండును. రెండవవాడు శివుని సంతానమగు దరిద్రులను, దీనులను, సమస్తజంతుజాలమును, అది యిది యననేల—సమస్తసృష్టిని—కనుపెట్టుచు, సేవించుచుండును. ఈ యిరువురిలో శివునకు ఎక్కువప్రియుడెవడు? అతని బిడ్డలకు సేవలుచేయువాడే అనుటకు సంశయములేదు. తండ్రికి సేవచేయగోరువాడు, మున్ముందు వానిబిడ్డలకు సేవచేయవలయును. అట్లే శివుని సేవింపగోరు నతడు ప్రథమమున వానిబిడ్డలకు—సమస్తజంతుజాలమునకు—సేవచేయవలయును, శాస్త్రములలో భగవద్భక్తులను సేవించువారు భగవంతుని సేవకులలో పరమోత్తములని చెప్పబడియున్నది. కావున దీనిని సదా జ్ఞప్తి నుంచుకొనుడు.

పరమపవిత్రులుగనుండి, మీ శక్తికొలది సాహాయ్యముకోరి వచ్చు ఎవ్వనికైనను ఉపకారముచేయుచుండవలయునని మీకు మఱల చెప్పుచున్నాను. ఇదియే సత్కర్మ. దీనిమహిమవలన చిత్తశుద్ధి లభించును. అప్పుడు ప్రతివానియందును వసించుచున్న శివుడు ప్రత్యక్షముకాగలడు. ఆయన ప్రతివాని హృదయము నందును సదా వసించుచునే యున్నాడు. అద్దముమీద మురికిగాని దుమ్ముగాని ఉండినయెడల మనస్వరూపము అందు ప్రతిఫలింపదు. అటులనే మనహృదయములనెడు అద్దములమీద అజ్ఞానమను మురికి, దుర్మార్గమను దుమ్ము పడుచుండును. ముందుగా మన మేలునే చూచుకొను స్వార్థపరత పాపములలో మహాపాపము. ఎవడు తాను ముందుతినవలయునని, ఇతరులకంటె ఎక్కువ డబ్బు సంపాదింపవలెనని, లోకములోని సమస్తసంపదలను పొందవలెనని ఆశపడునో, ఎవడు తాను ఇతరులకంటె ముందుగ స్వర్గమునకు పోవలెనని, ఇతరులకంటె ముందుగ మోక్షమును పొందవలెనని అపేక్షించునో వాడే నిజమగు స్వార్థపరుడు. నిష్కామియగు నరుడు 'నేను తుదివఱకు ఆగియుందునుగాక; స్వర్గమునకు పోవలయు

నని నేనారటపడను; నా సోదరులకు ఉపకారము కలుగగలదేని అందులకై నేను నరకమునకైనను పోవుటకు సంసిద్ధుడనై యుందును' అని పలుకును. ఇటువంటి స్వార్థరహితవృత్తియే మతమునకు గీటురాయి. ఇటువంటి నిష్కామబుద్ధి ఒకనియందు ఎంతెంత హెచ్చుగా నుండునో, అతడు అంతంతగా ఆధ్యాత్మపరుడును, శివసాన్నిధ్యముపొందినవాడును అగును. అతడు చదువరియైనను లేక నిరక్షరకుక్షియైనను శివునకు ఇతరులకంటె సమీపముగ నున్నవాడే! అతనికి ఆ సంగతి తెలియవచ్చును, తెలియకపోవచ్చును. కాని స్వార్థపరుడగు నరుడు సమస్తదేవాలయములను దర్శించుచు, సర్వతీర్థములను సేవించుచు, చిరుతపులి వలె శరీరమంతయు బొట్లు ధరించియుండియుగూడ శివునకు చాల దూరముననే యుండును.



## రామనాడునం దొసంగిన స్వాగతపత్రమునకు శ్రీ స్వాములవారి ప్రత్యుత్తరము

రామనాడునందు రాజాగారు శ్రీ వివేకానందస్వాములవారికి ఈ క్రింది స్వాగతపత్రమును సమర్పించిరి :

పరమపవిత్రమూర్తీ, శ్రీపరమహంసా, యతిరాజా, దిగ్విజయ కోలాహల సర్వమతసంప్రతిపన్నా, పరమయోగీశ్వరా, శ్రీమత్ భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసకరకమలసంజాతా, రాజాధిరాజసేవితా, శ్రీ వివేకానందస్వామీ! అవధారు.

సేతుబంధరామేశ్వరము, రామనాథపురము, రామనాడు అని పేరుగాంచిన ఈ చారిత్రకప్రసిద్ధమగు ప్రాచీనసంస్థానపు ప్రజలమగు మేము ఈ మన మాతృభూమికి హృదయపూర్వక

ముగా మిమ్ములను ఆహ్వానించుచున్నాము. విదేశయాత్ర ముగించుకొని మీ రీ భారతభూమిపై అడుగిడినతోడనే తమ చరణకమలములను మనసార అర్చింపగలిగిన మహాభాగ్యము లభించుట నిజముగ మా అదృష్టవిశేషమే. అందును, పురాణ పురుషుడును, మన ఇష్టదైవమును అగు శ్రీరామచంద్రమూర్తి పాదస్పర్శచే పావనమైన ఈ తీరమందు మీకు మున్ముందుగ పాదార్చనముచేయగలుగుట మా పురాకృతసుకృతప్రాప్తముగా భావించుచున్నాము.

అతిప్రాచీనమును, పరమపావనమును అగు మనమతము యొక్క శ్రేష్ఠత్వమును, మహిమను పాశ్చాత్యపండితవరుల మనస్సులకు నచ్చజెప్పు మీ మాన్యతరప్రయత్నములకు చేకూరిన అసమానవిజయప్రాప్తిని వినిర్మలాభిమానముతోడను పరమ సంతుష్టితోడను గమనించుచుంటిమి. హిందూమతము విశ్వజనీన మతాదర్శమనుటకు తగి, సర్వలక్షణవిరాజమానమై, సమస్తజాతు లందును, సర్వసంప్రదాయములందును గల స్త్రీపురుషుల చిత్త వృత్తులకును, అవసరములకును ఉపకరింపగలదై యున్నదని, యూరపు అమెరికాలయందు పండితసభలలో సుస్పష్టముగా సవిమర్శముగా అసమానవచఃకౌశలముతో ప్రకటించి, వారికి నచ్చజెప్పితిరి. నిష్కామమగు ఉత్సాహముచే ప్రేరితులై పరమపవిత్రసంకల్పముతో పరవశులై అద్భుతస్వార్థత్యాగము పూని, శాంతిధర్మసందేశప్రవక్తలై భారతీయ వేదాంతవిజయ పతాకమును, యూరపు అమెరికాలయందలి ఉత్తమక్షేత్రము లందు నాటుకొఱకు, అంతులేని మహాసముద్రములనుసైతము యతివర్యులగు తాము దాటిపోతిరి. విశ్వసోదరత్వము ముఖ్యా వశ్యకమనియు, అది సుసాధ్యమేయనియు, శ్రీవారు ఆచరణ పూర్వకముగను, సదృష్టాంతము(?) సద్బోధలమూలమునను, ప్రచారముగావించితిరి. అన్నిటికంటెను పాశ్చాత్యదేశములందలి మీ పరిశ్రమ ఉపేక్షా

పరులగు భారతీయులను మేల్కొలిపి, వారి ప్రాచీనమతముయొక్క ఘనతను, మహిమను వారిదృక్పథమున బెట్టినది; అమూల్యమగు హైందవమతధర్మములను తెలిసికొని ఆచరింపవలయునను అకుంఠితాభిమానమును పరోక్షముగ వారిహృదయములందు పురిగొల్పినది.

పూర్వపశ్చిమవాసుల పారమార్థిక పునరుజ్జీవనమునకై శ్రీవారు ఔదార్యముతో పూని నిర్వహించుచున్న యీ మహోద్యమమునకు శ్రీవారియెడల మా హృదయములందు నిండిన సంతోషమును కృతజ్ఞతను ప్రకటించుటకు సమర్థములగు శబ్దములు మాకు స్ఫురింపకున్నవి. శ్రీవారి ప్రియశిష్యవర్గములో నొకరగు మా రాజాగారియెడల పరమపూజ్యులగు మీరు సదా చూపుచున్న వాత్సల్యమును, శ్రీవారు ప్రప్రథమముగా ఈ రాజ్యమునందే ఓడదిగి గౌరవించినందులకు రాజాగారు పొందుచున్న సంతోషమును, అభిమానమునుగూడ వర్ణింప నలవిగాకున్నదని మనవిచేయక ఈ యభినందనపత్రమును ముగింపజాలము.

శ్రీవారు ఎంతయో సమర్థతతో ప్రారంభించిన ధర్మప్రచారకార్యమును కొనసాగించుటకు వలసిన దీర్ఘాయురారోగ్యజవసత్త్వములను శ్రీవారికి ప్రసాదించుగాక యని సర్వేశ్వరుని వేడుకొనుచు విరమించుచున్నాము.

రామనాడు 25-1-1897 } ఇట్లు భక్తిప్రపత్తులతో నమస్కృతులర్పించు శ్రీ పూజ్యపాదులవారి ప్రియశిష్యులు, సేవకులు.

శ్రీ స్వాములవారీ క్రిందివిధమున ప్రత్యుత్తర మిచ్చిరి:

ఇక తెల్లవారిదనుకొన్న రాత్రి మెలమెల్లగా గడచి చనుచున్నట్లున్నది. భరింపరాని తీవ్రవేదన ఎట్లో ఉపశమించుచున్నట్లు తోచుచున్నది. ఇంతకుముందు శవముగ గోచరించిన ఆకృతి నిద్రనుండి మేల్కొనబోవుచీరున, సజీవముపోలె కానిపించు

చున్నది. అదిగో వినుడు, ఏదో శబ్దము వినవచ్చుచున్నది. చరిత్రగాని, పురాణగాథలుగాని గతకాలపు ఆ అంధకారములోనికి తొంగిచూడనైన సాహసింపజాలనంత దూరమునుండివచ్చు ఆ నాదము, ఎక్కడనుండియో కాదు, ఇక్కడనుండియే, భారతదేశమునుండియే, మన మాతృభూమినుండియే వెలువడి, అఖండ జ్ఞానశీతగిరియొక్క కర్మ భక్తి జ్ఞానశిఖరములందు మాఱు మ్రోగుచు మనకడకు వచ్చుచున్నది. ప్రశాంతమై సుదృఢమై, విస్పష్టస్వరకలితమై, దినములు గడచినకొలది పెరిగి పెరిగి వినవచ్చుచున్నది. అల్లదే చూడుడు; అప్పుడే ఆ నిద్రిత జనయిత్రి మేలుకొనుచున్నది. మంచుకొండనుండి వెలువడు పిల్లగాడుపులీల అది వట్టిపోయిన కండరములలోనికిని, ఎండిపోయిన ఎముకలలోనికిని, జీవము పోయుచున్నది. నిద్దురమత్తు తేటిపోవుచున్నది, అమ్మ మేలుకొనుచున్నది; మన దేశమాత దీర్ఘనిద్రనుండి మేల్కాంచుచున్నది. గ్రుడ్డివారు మాత్రము చూడజాలరు; కుత్సితమతులు చూడనొల్లరు. అయిననేమి? ఇంక నామెను ఎవరును ఆప జాలరు! ఇంక నామె నిద్రపోదు. ఇక నామెను అన్యులెవ్వరు నిరోధింపనోపరు. అదిగో, ఆ అఖండశక్తిస్వరూపిణి దిగ్గునలేచి నిలబడుచున్నది!!

రాజా, రామనాడు వాస్తవ్యులారా! మీరు నన్ను ఇంత ఆదరణతోడను ప్రేమతోడను సన్మానించినందుకు ఇవే నా వందనములు. నోటితో పలుకు భాషకంటె హృదయము హృదయముతో ముచ్చటించుట మిన్నయగును గావున మీ కింత ఔదార్యమును ప్రేమయు కలిగినవి. ఆత్మ ఆత్మతో నిశ్శబ్దముగ మాట్లాడగలదు; అయినను ఆ భాష సుస్పష్టమైనదే. నా అంతఃకరణమందు నేను దానిని గ్రహించుచున్నాను. రామనాడు రాజా! నా మాట నమ్ముడు. పాశ్చాత్యదేశములలో మన మతమును గుఱించిగాని, మన మాతృదేశమును గుఱించిగాని అల్పప్రజ్ఞుడనగు

నావలన ఏమేని ఉపకారము జరిగినదేని — మన యిండ్లదాపుననే మనకు తెలియరాక లోతుగ పూడ్చిపెట్టబడి తరతరములుగ పడియున్న అమూల్యరత్నరాసులవైపు భారతీయుల దృష్టిని మరల్ప యత్నించు నా ప్రయత్నము ఏమాత్రమేని సఫలమైనదేని— దాపున నీరుగలదని యెఱుంగక గ్రుడ్డివారై దప్పిచేత చచ్చుట కంటెను, ఎక్కడికోపోయి మురికిగోతుల నీరు త్రాగుటకంటెను, తమగృహముల ప్రక్కనే నిరంతరము ప్రవహించుచున్న స్వచ్ఛ జలధారలచెంతకేగి తృప్తిదీఱ గ్రోలుడని వారికి త్రోవజూపజాలితినేని — భారతదేశమున ప్రతివిషయమునందును మతమే, మత మొక్కటియే ప్రాణాధారమనియు, అది నష్టమైనచో, రాజకీయ తంత్రములెన్ని చేజిక్కినను, సంఘసంస్కరణములెన్ని సాగినను, ప్రతి భారతీయుని నెత్తిమీద కుబేరసంపదలు వచ్చి ఒరిగిపడినను కూడ, భారతమాతకు మరణము తప్పదని తెలిపి మన సోదరులను కార్యోన్ముఖుల జేయుటలో ఏమేని ఫలితము కాన్పించెనేని— భారతదేశమే కాక ఇట్టి కృషి జరిగిన ప్రతి ఇతరదేశముకూడ, ఓ రామనాడు రాజా! మీయెడ కృతజ్ఞత చూపవలసియుండును. ఏలయనగా ఇట్టి సంకల్పమును మొదట నాకు కలిగించినది మీరే; ఆ పనియందు నిరంతరము ఉత్సాహము పురిగొలిపినదియు మీరే; ఏమి జరుగనున్నదో దివ్యదృష్టితో మీరు గ్రహించినట్లుగా నా చేయిపట్టుకొని, ఎల్లెడల అండగా నిలిచి, నన్ను నిరంతరము ప్రోత్సహించుచు వచ్చితిరి. కావున నా విజయమును గుఱించిన ఆనందోత్సవము జరుపుటలో మీరు మొదటివారగుట ఉచితమే. నేను భారతదేశమునకు మరలివచ్చునపుడు మొట్టమొదటగా మీ సంస్థానపు పొలిమేరలపై అడుగిడుటయు సమంజసమే.

ఇప్పుడు గొప్ప గొప్ప కార్యములు జరుగవలసియున్నవి. విచిత్రశక్తులు పనిచేయవలసియున్నవి. మీరు ఇదివఱకే తెలిపినట్లు, ఇతరదేశీయులకు మనము చాల విషయములను నేర్పవలసి

యున్నాము. పారమార్థికతకును, వేదాంతమునకును, సంఘనీతికిని, సాధుత్వమునకును, ప్రియవర్తనమునకును, ప్రేమకును ఇదియే మాతృభూమి. అవి నేడును సజీవములై యున్నవి. ఈ విషయములలో ప్రపంచములోని అన్ని దేశములలోను భారతదేశము ప్రధానమనియు, మొదట నిలువదగినదనియు, ధీరుడనై నిలిచి సాహసముతో పలుకుటకు నా ప్రపంచానుభవము అర్హత నొసగుచున్నది. ఈ చిన్న సంఘటనమును గమనింపుడు. గడచిన నాలుగైదు సంవత్సరములలో గొప్ప రాజకీయసంస్కరణములు జరిగినవి. ఆయా దేశములందు ఇప్పుడున్న వ్యవస్థలను పూర్తిగా తలక్రిందులు చేయుటకు పూనుకొని, కొంతకొంతగా ఫలమును సాధించుచు, పాశ్చాత్యప్రపంచమందంతటను మహోద్యమములు పనిచేయుచున్నవి. వానిని గుఱించి ఏమైన వినియున్నారేమో, మన సోదరులను అడుగుడు; వానిని గుఱించి ఒక్కమాటయైనను వీరు వినియుండరు. ఐనను షికాగోనగరమున ఒక మహామతసభ జరిగెననియు, ఆ మహాసభకు భారతదేశమునుండి ఒకసన్న్యాసి వెళ్లెననియు, అక్కడ మిగుల ఆదరింపబడెననియు, అప్పటినుండి పాశ్చాత్యదేశములలో ప్రచారము సాగుచున్నదనియు ఇచ్చటి నిరుపేదయు ఎఱుగును. మన సామాన్యప్రజలు మూఢులనియు, వారికి విద్యయందు అభిలాషలేదనియు, ఏ విషయమైనను తెలిసికొన నిచ్చగింపరనియు, చెప్పగా వినుచు వచ్చితిని. ఒకానొకప్పుడు ఈ అభిప్రాయము నాకును కలిగియుండెను. గొప్ప గొప్ప ఊహాకల్పనలకన్నను, ప్రపంచసంచారులు, కువిమర్శకులు వ్రాసిన పుస్తకరాసులకంటెను, స్వానుభవము మహోత్తమ గురువని గ్రహించితిని. భారతీయులు మూఢులు కారనియు, మందబుద్ధులు కారనియు, ఏ ఇతరజాతికిని తీసిపోని జ్ఞానసముపార్జనాసక్తి కలవారే యనియు, నా అనుభవము నాకు తెలుపుచున్నది. కాని ప్రతిజాతికిని నిర్వహింపవలసిన కర్తవ్య మొకటి కలదు. ప్రతిజాతికిని స్వభావసిద్ధముగా పుట్టువుతో వచ్చిన వ్యక్తిత్వమును, ప్రత్యేక

లక్షణములును ఉండును. ఈ నానాజాతిరాగసమ్మేళనమున ప్రతి జాతియు ఒక్కొక విశిష్టస్వరము. ఆ విశిష్టతయే దాని ప్రాణము; దానికి ఆయువుపట్టు. అది ఆ జాతికి వెన్నెముకవంటిది. ఆ జాతి జీవసారమునకు అదియే మూలాధారము, ఉత్పత్తిస్థానము. ఇచ్చట మన పుణ్యభూమికి మతమే ఆయువుపట్టు, జీవనాధారము. ఇతరులు రాజకీయములను గురించి ప్రసంగింతురుగాక; వర్తకము వలన తమకు వచ్చెడు ధనరాసులను లెక్కించుకొని మురియు దురుగాక; వ్యాపారమూలమున తమకు చేకూరిన అధికార వ్యాప్తినిగూర్చి గర్వింతురుగాక; ఐహికస్వాతంత్ర్యసంపదను గురించి ప్రగల్భములు పలుకుదురుగాక. కాని ఇవి భారతీయునికి అర్థముకావు. అర్థము చేసికొనుటకును అతడు ప్రయత్నింపడు. వేదాంతము, మతము, భగవంతుడు, జీవుడు, బ్రహ్మము, మోక్షము మున్నగువానినిగూర్చి పరీక్షించినచో ఇతరదేశము లందు తత్త్వవిదులని పేరుగాంచిన చాలమందికంటె మనదేశము లోని మామూలు సేద్యగానికికూడ ఎక్కువ తెలిసియుండును. ఇది యథార్థము. ఆర్యులారా, మనము ప్రపంచమునకు కొంత బోధింపవలసియున్నామని చెప్పియుంటిని. ఈ కారణముచేతనే, ఈ ఈశ్వరేచ్ఛవలననే, మనజాతికి శతాబ్దములకొలది మహోప ద్రవములు తటస్థించినను, దాదాపు వేయిసంవత్సరములుగా విదేశీయుల పరిపాలనక్రింద పడియున్నను. పరదేశీయులు మనలను ఎంతగా అణగద్రొక్కుచున్నను, ఈ మనజాతి ఇంకను సజీవముగ నిలిచియున్నది. దీనికి చావులేదు, ఇది అమరము. ఇది భగవంతుని యెడల ప్రపత్తిగలిగి మతధర్మమునకును ఆధ్యాత్మికజ్ఞానమునకును కాణాచియై యుండుటే ఇందుకు కారణము.

పాశ్చాత్యజాతులును ఇతరజాతులునుకూడ, ఇప్పుడు మితిమీరిన రాజ్యాధికారవాంఛలతోడను, సాంఘిక కుతంత్రముల తోడను, విసిగి వేసారి, సగము చచ్చి, అధోగతిని పడియున్నారు.

వారికి ప్రాణముపోసి నూతనోజ్జీవము కల్పింపగల మహాశక్తి—ప్రపంచమంతటను వెల్లువలై ప్రవహింపవలసిన మతధర్మముల, సత్యాత్మతత్త్వముల మూలశక్తి ఇక్కడనే కలదు. భారతదేశ వాతావరణమెల్ల నిండి హోరున పైకెగయుచున్న యీ అనురూప విరూప నానావిధశబ్దఘోషలనుండి, ఒక్క పలుకు — పరమోత్కృష్టమును, ప్రస్ఫుటమును, పరిపూర్ణమునై వినవచ్చుచున్నది. అది "త్యాగము" అను శబ్దము. త్యాగము చేయుడు. భారతదేశపు మతధర్మము లన్నిటికిని ఇది మూలమంత్రము. ఈ ప్రపంచము మూడునాళ్లముచ్చట. ఈ ప్రస్తుతజన్మ క్షణభంగురము. ఆవల—ఈ బూటకపు ప్రపంచమును దాటి దూరముగా —అఖండబ్రహ్మము వెలుగుచున్నది. దానిని వెదకుదముగాక. ఈ విశాలజగమును సయితము చిన్నబురదగుంటగా భావించునట్టి సాహసులగు వీరులును, మనీషావంతులగు ఋషిప్రవరులును, ఈ ఖండమున తేజరిల్లిరి. వీరు ఈ విశ్వమునుదాటి ఆవల చాల దూరము పోయియుండిరి. అనంతమగు కాలము సైతము వారికి లెక్క లేదయ్యెను. కాలమును దాటి, కాలపరిమితులను అతిక్రమించి, వారు చాలదూరము పోయిరి. ఆకాశము వారికి లెక్క లేనిదయ్యెను. దానిని దాటియు వారు పోజూచిరి. ఈ వికారమయప్రపంచమునుదాటి ఇటుల పోవుటయే మతధర్మసూక్ష్మము. ఈ అతీతభావనయే—సర్వమును అతిక్రమించిపోవు ఈ పూన్కియే—ప్రకృతిముఖమును కప్పిపెట్టిన ముసుగును చిందఱవందఱగా చించివైచి, ఏమైనను సరియే, ఏమి వాటిల్లనున్నను సరియే, ఆ పరమందున్నదాని జాడను కనుగొని తీరవలయునను దీక్షయే—ఈ జాతికి విశిష్టలక్షణము. ఇది మన పరమధర్మము. కాని ఒక దేశములోని ప్రజలందఱును నిండు త్యాగము పూనజాలరనుటయు సత్యమే. అయినను త్యాగము పూనువారికి ఉత్సాహము గొలుపవలచితిరేని, అటుల చేయుటకు మార్గము కలదు. రాజకీయముల గుఱించి, సంఘపునరుద్ధరణమునుగుఱించి, మీరు చేయు ప్రసంగ

ములు, ధనార్జనమునకును వాణిజ్యమునకును ఉపకరించు మీ బోధలు—ఇట్టి వన్నియును, బాతుపీపుమీద పోసిన నీటివలె అప్పుడప్పుడే జారిపోవును. కావున మీరు ప్రపంచమునకు బోధింపవలసి యున్నది ఈ త్యాగతత్త్వమే. మనమును ఏమైన నేర్చుకొనవలసి యుండునా? ఈ ప్రపంచమునుండి మనము ఏమైన గ్రహింపవలసియున్నదా? బహుశః ఒకింత భౌతిక శాస్త్రజ్ఞానము, నిర్మాణకౌశలము, ప్రకృతిశక్తులను వశముచేసికొని ప్రయోగము లను చేయు విధానమును, స్వల్పాధారమునుండి ఘనతర ఫల మునుపొందగల యుక్తిని, మనము కొంచెము నేర్చుకొనవలసి యుండును! సరే, దీనిని కొంతవఱకు పాశ్చాత్యులనుండి నేర్చు కొందము. అంతియేగాని, ఈ భారత దేశమునకువచ్చి, 'తినుట, త్రాగుట, వినోదములతో కాలము గడపుటమాత్రమే' పురుషార్థ ముగా బోధింప నెంచువాడు, ఈ జడప్రపంచమును పరమదైవత ముగ రూపింప జూచువాడు — అట్టివా డెవడైనను మోసగాడే! ఈ పుణ్యభూమియందు వానికి తావులేదు. వానినుండి అటువంటి దానిని నేర్చుకొనుటకు భారతీయుని మనస్సొప్పదు. పాశ్చాత్య నాగరకతలోని మెఱపులు, తళుకులు కన్నులనెంతగా మిఱుమిట్లు గొలుపుచున్నను, దాని అధికార ప్రాబల్యము ఎంతవిశాలమైనను, అది సర్వము నిష్ఫలమే అని ఈవేదికపై నిలిచి మొగమోటములేక వారికి తెలుపుచున్నాను. అది అంతయును బూటకములలో బూట కము. భగవంతుడొక్కడే సత్యము; ఆత్మ ఒక్కటియే నిత్యము; అధ్యాత్మమే శాశ్వతము; దానిపట్టు వీడకుడు!

కేవలపరమార్థధర్మమును అవలంబించుట కింకను పక్వ దశకు వచ్చియుండనివారు మనలో అనేకులు కలరు. మన అవసర ములకు తగినట్లు కొంచెము సంస్కరించుచో, పాశ్చాత్యుల భౌతిక శాస్త్రవాదము అట్టివారికి కొంచెము ఉపయోగపడునేమో! ఒక పొరపాటు ప్రతి దేశమునందును, ప్రతి సంఘమునందును కనబడు చున్నది. ఆవిషయము బాగుగా తెలిసిన భారతదేశమునందు

సైతము ఆ పొరపాటే జరుగుట మిక్కిలి శోచనీయము. ప్రస్తుతము అర్హత గడించియుండని ప్రజలకు బలాత్కారముగ అత్యుత్తమ పారమార్థిక ధర్మములను ఉపదేశించుట ఇటీవల ఆచారమై పోయినది. నామార్గము మీ మార్గము కాకపోవచ్చును. సన్న్యాసము భారతజీవితమునకు పరమ ధర్మమని మీకందఱకును తెలిసియే యున్నది. ప్రతివానికిని మనశాస్త్రములు "త్యాగమును" విధించుచున్నవి. ఈ ప్రాపంచిక భోగములను అనుభవించిన ప్రతి హిందువును, తన జీవితాంత్యభాగమున వైరాగ్యము పూని తీరవలయును. అటుల చేయనివాడు హిందువే కాడు. తాను హిందువునని చెప్పుకొనుటకు వానికి అర్హతలేదు. ఈ ప్రపంచ భోగముల బూటకమును అనుభవపూర్వకముగా తెలిసికొనిన పిమ్మట, వానిని త్యాగముచేయుట పరమాదర్శమని మన మెఱుగుదుము. ఈజడప్రపంచము, లోపల డొల్లయనియు, దాని లోపల ఉండునది బూడిదయేయనియు గ్రహించి విడిచివేసి, వెనుకకు మరలవలయును. మనస్సు ఇంద్రియముల వెంటబడి సుడులు తిరుగుచు వెలుపలికి పోవుచున్నది. ఆమనస్సు అంతర్ముఖము కావలెను. ప్రవృత్తి ఆగిపోవలయును, నివృత్తి ఆరంభము కావలయును; అదియే ధర్మము. కాని ఈ ఆదర్శమున కొంత - అనుభవము కలిగిన పిమ్మట మాత్రమే గ్రాహ్యము - కాగల వైరాగ్య ధర్మమును పసివానికి నేర్పలేము. పసివాడు ఆవేశపరవశుడై జన్మించుచున్నాడు. వాని జీవితమంతయు వాని ఇంద్రియములలో నుండును. వాని జీవితమంతయు ఒక ఇంద్రియభోగరాశి. అటులనే ప్రతి సంఘమునందును పసివారినిబోలు పురుషులుందురు. వారికి కొంత అనుభవము కావలసియుండును. కొంత భోగమును అనుభవించిన పిమ్మటనే, వారు దానిని బూటకమని గ్రహింపజాలుదురు. అప్పుడు వారికి వైరాగ్యమబ్బును. అటువంటివారికి తగినంత అవకాశమును ఈయవలెనని మనశాస్త్రములు చెప్పుచునే యున్నవి. కాని ఇటీవల, దురదృష్టవశమున, సన్న్యాసి ఏధర్మములచే కట్టు

పడియుండునో, ఆ ధర్మములచేతనే ప్రతివాదును కట్టుపడి ఉండవలయునను వాదన బయలుదేఱినది. అదిచాల పొరపాటు. ఈ పొరపాటే లేనియెడల, మనదేశములో ఎల్లెడల గోచరించు దారిద్య్రమును, దైన్యమును చాలవఱకు తగ్గియుండెడివి. అతితీక్ష్ణమైన ఆధ్యాత్మిక నైతికధర్మములు పేదవానిజీవితమును అన్నివైపుల క్రమ్ముకొనియున్నవి. వీనివలన ఆ దరిద్రునకు ప్రయోజనములేదు. అట్టిబంధములను తొలగించివేయుడు. పాప మా దరిద్రుని ఒకింత సుఖమును అనుభవింపనిండు. అప్పుడతడు, తనంతట తానే ఉత్తీర్ణుడగును. ఆ పిమ్మట వైరాగ్యము దానంతట అదియే వచ్చును. ప్రాయశః ఈ విషయములో పాశ్చాత్యులనుండిమనము కొంత నేర్చుకొనవలెను. కాని ఇట్టి విషయములు నేర్చుకొనుటలో జాగ్రత్త చాల అవసరము. పాశ్చాత్యభావములను అలవఱుచు కొనినవారిలో కొందఱి ఆదర్శములు దాదాపు భ్రష్టమై యుండుటను చూచుచున్నానని తెలుపుటకు మిక్కిలి విచారపడుచున్నాను.

భారతదేశమున మన ముందంజను నిరోధించు భయంకరములైన రెండు విపత్తులున్నవి. ఒకటి పూర్వాచారపరాయణత: ఇది ఆరు తలల భయానకజీవివంటిది. రెండవది ఈ కాలపు యూరపు నాగరకత. ఇది లోతైన సుడిగుండమును బోలునది, నన్నడిగితిరా నేను పూర్వాచారపరాయణతనే ఒప్పుకొందును. యూరపువారి పద్ధతిని మాత్రము ఒప్పుకొనజాలను. ఏల యందురా, పూర్వాచారము ననుసరించువాడు తెలివితక్కువ వాడుగ నుండవచ్చును; మోటువాడుగ నుండవచ్చును; కాని వానియందు పురుషలక్షణ ముండును. వానికి భక్తి కలదు; వానికి బలము కలదు; అతడు తన కాళ్లపై తాను నిలుచును (అనగా స్వతంత్రుడు). ఇక యూరపియను పద్ధతిని అవలంబించువాడో చంచలుడు, అస్వతంత్రుడు, గాఢపరిజ్ఞానశూన్యుడు. అతడు

ఎందు దొరకిన అందు, తన చేతికందినభావములను ప్రోగుచేసికొని వికట స్వరూపియైయుండును. ఈ భావములను అతడు జీర్ణము చేసికొనడు. అవి వానిలో ఇముడవు. వానికి సరిపడవు. అతడు తన కాళ్లపై తాను నిలబడలేడు. వానితల గిఱ గిఱ తిరిగి పోవుచుండును. వానికర్మలకు సంకల్పశక్తి ఎక్కడిది? ఆంగ్లదేశీయులు దయచూచి వీపుతట్టినవానికి చాలును. యూరపియనుల మెప్పుకొఱకై ఏవియోకొన్ని సాంఘికదురాచారములను నోటికివచ్చినట్లెల్ల తిట్టి తనసంఘ సంస్కరణాభిమానమును ప్రదర్శించుకొనును. అతడు మన ఆచారములలో కొన్నింటిని చెడ్డవనుట, కేవలము యూరపియనులు అటుల చెప్పుచున్నారు గనుకనే, అతడిచ్చు సమాధానమును ఇంతే. నాకిట్టివి గిట్టవు. నీ స్వశక్తిపైని ఆధారపడి నిలిచి చచ్చినను మేలే. ప్రపంచములో పాపమేదేని ఉన్న యెడల, అది దౌర్బల్యమే. సర్వవిధములగు దౌర్బల్యములను తొలగించుకొనుడు; దుర్బలత పాపము. దుర్బలతయే మృత్యువు. ఈ దుర్బల చంచలాత్ములను మానవులనుటయే తప్పు. సరే, వారి నేమని పిలువవలయును? మీరే ఊహించుకొనుడు. కాని, పూర్వాచారపరాయణులో, పట్టుదల గలవారు; పురుషులు. ఉత్తమాదర్శపురుషులు ఎల్లప్పుడును ఉందురు. అట్టి ఒకరిని మీ కిప్పుడు చూపుదును. ఇదుగో, వారు మీ రామనాథపుర రాజాగారే. వీరిని మించిన శ్రద్ధావంతుడగు హిందువును మఱొకని ఈ దేశమున ఎల్లెడల వెదకినను మీరు కాంచబోరు. పూర్వపశ్చిమదేశముల రెండురీతుల విశేషములను సంపూర్ణముగ తెలిసికొనుటలోగాని, ప్రతిజాతినుండియు శ్రేష్ఠమగు విషయములను అవకాశమున్నంతవఱకును స్వీకరించుటలోగాని, ఈ దేశమున ఇంకెవరైనను మీ రాజును మించజాలడు. అట్టి రాజు మీకు లభించియున్నాడు. "ఉత్కృష్టజ్ఞానమును పూర్ణశ్రద్ధతో కనిష్ఠ జాతినుండియైనను స్వీకరింపుము. మోక్షమార్గమును పంచముని వలన లభింపనున్నను, వానికి శుశ్రూషలుచేసి తెలిసికొనుము.

కన్య రత్నసమానమైనచో అంత్యజాతిలోని హీనకుటుంబములో నున్నను ఆమెను పెండ్లిచేసికొనుము.'' అసమాన మహనీయ మూర్తియు ఉత్తమధర్మస్మృతికర్తయునగు మనువు శాసన మీ తీరున నున్నది. ఇది సత్యము. మీ కాళ్లపైని మీరు నిలువుడు. మీకు అలవియగుదానిని జీర్ణించుకొనుడు. ప్రతిజాతి నుండియు జ్ఞానమును స్వీకరింపుడు. మీకు శ్రేయము కూర్చు దానిని పరిగ్రహింపుడు; అయినను మనము హిందువులము గనుక సర్వమును మన జాతీయధర్మములకు లోబడియే జరుగవలసి యుండును. ప్రతి నరునకును ఒక జీవితపరమార్థము కలదు. అది వాని అనంతపూర్వకర్మఫలితార్థము. మీలో ప్రతివాడును అత్యద్భుతమగు పిత్రార్జితసంపదతో పుట్టియున్నాడు. అది మీ భవ్యజాతీయజీవనపు అఖండపూర్వార్జితకర్మఫలమే. లక్షలకొలది మీ పితరులు మీ ప్రతికార్యమును కనిపెట్టి చూచుచున్నారను కొని జాగరూకులై మెలగుడు. ప్రతి హిందూబాలుడును పుట్టు నప్పుడు తనతోడ తెచ్చుకొను నిర్ణీతకర్తవ్యమేది? బ్రాహ్మణ జన్మను గుఱించి మనువు ఏమని ధీరముగా ప్రతిజ్ఞచేసెనో మీరు చదివియుండలేదా? బ్రాహ్మణజన్మ ''ధర్మమను ధనాగారము యొక్క రక్షణకొఱకు'' అని ఆయన వ్రాసియున్నాడు. ఆ మాట ఈ పుణ్యభూమియందు జన్మించు బ్రాహ్మణునికేగాక, ప్రతివానికిని జీవితపురుషార్థమని నేను చెప్పుచున్నాను. ''ధర్మమను ధనా గారముయొక్క రక్షణకొఱకు'' అను మాటలను గుర్తుపెట్టు కొనుడు. మనజీవితమందలి యే యితర సమస్యయైనను, ఈ ఏకైక సూత్రమునకు లోబడియుండవలసినదే. సంగీతమునందు లయ కలుపుకొను సూత్రముకూడ ఇటువంటిదే. రాజకీయాధికారము ప్రధానజీవితధర్మముగా గల ఒక జాతి యుండవచ్చును. ఆ ముఖ్య జీవితధర్మమునకు, వారి మతమును, వారి సర్వమును లోబడి నడువవలసినవే. ఆధ్యాత్మజ్ఞానమును వైరాగ్యమును ప్రధానజీవన ధర్మముగా గలిగి, 'ఈ ప్రపంచమంతయు బూటకము; మూడు

నాళ్ల ముచ్చట' అనెడు ధర్మసూత్రముపై నడచుచున్న మహోక జాతి ఇక్కడ నున్నది! సర్వమును — ప్రకృతిశాస్త్రములుగాని, కళలుగాని, భోగములుగాని, అధికారములుగాని, సంపదలుగాని, పేరుగాని, ప్రతిష్ఠలుగాని—ఆ ఒక్క ధర్మమునకు లోబడి పోవలసినవే. భారతీయుని శీలముయొక్క రహస్యమిది. ప్రతి హిందూ శిశువునకును సహజమైన ఈ ఒక్క ప్రధాన ధర్మమునకు అనగా —పారమార్థికతకు, జాతిపవిత్రతకు—అతని సర్వస్వము లోబడవలసినదే. యూరపియనులవలన అతడు గ్రహించిన ప్రకృతిశాస్త్రవిజ్ఞానమేకాక తనకలిమి, పదవి, ప్రఖ్యాతి, సర్వమును దానికి లోబడితీఱవలెను. అదియే వాని జాతీయజీవనమునకు కీలకము! ఆధ్యాత్మికతయనెడు జాతీయజీవనస్రవంతిని తన సర్వస్వముగ పెట్టుకొనిన పూర్వాచారపరాయణుడు ఒకపక్షమునను, ఆధ్యాత్మికతయనెడు జీవనసూత్రమును జాఱవిడిచి పాశ్చాత్యుల నుండి బిచ్చముగాగొనిన కృత్రిమభావములను అమూల్యముగా నెంచి మనస్సున పాదుకొల్పినవాడింకొకపక్షమునను కలరు. వీరిద్దఱిలో పూర్వాచారపరుడగు మొదటి వానినే ఇక్కడనున్న ప్రతివాడును అభిమానించు ననుటలో నాకు సంశయము లేదు. ఏలయన వానియందు మనము విశ్వాస ముంచదగును. జాతిధర్మము అను పట్టుకొమ్మ వానికి కలదు. కావున, అతడు సజీవుడై నిలువ గలడు. కాని ఆ రెండవ పురుషునకో మరణమే గతి. ఒకని ఆయువుపట్టు చలింపనంతవఱకు, వాని జీవక్రియ సురక్షితముగా నున్నంతవఱకు, ఇతరములగు ఇంద్రియక్రియలకు హానికలిగినను, ప్రమాదములేక ఆ వ్యక్తి బ్రతికియుండగలుగును. వ్యక్తి జీవనవిధముననే, మన జాతీయజీవనధర్మము సురక్షితముగా నుండువఱకు మనజాతిని నాశనముచేయగల దేదియు నుండదు. కాని నా మాటలను గుర్తుపెట్టుకొనుడు: ఆధ్యాత్మధర్మమును జారవిడిచితిరేని, దానిని ఆవల త్రోసివేసి పాశ్చాత్యుల ప్రాపంచిక నాగరికత వెంటబడితిరేని, దాని ఫలితార్థముగా, మూడుతరము

లలో మీ జాతి వినాశము జెందును. మీ జాతీయభవనపు పునాదులు సడలిపోయి మీ జాతి సర్వనాశనము చెందును.

కావున స్నేహితులారా, దీనిని తప్పించుకొనుటకు మార్గము ఒక్కటే కలదు. ఈ ఆధ్యాత్మికధర్మమును మనము గట్టిగా పట్టుకొని యుండవలెను. మన ప్రాచీనులు మనకు కరుణించి ఒసగిన అమూల్యవరప్రసాదమిదియే. ఏ దేశమందైనను, మహాచక్రవర్తులుసైతము తమకు గోత్రపురుషులుగా, రాజులనుగాని, కొండకోటలలో నివసించు నిస్సహాయులగు మార్గస్థులను దోచుకొనుచు వచ్చిన దొంగదొరలనుగాని పేర్కొనక, సగము దిగంబరులై అడవులలో వాసముచేయుచు వచ్చిన సాధువులను పేర్కొనుటను మీ రెన్నడైనను వినియున్నారా? అటువంటి భూమియొక్క పేరును మీరు ఎన్నడైన ఆలకించితిరా? ఆ దివ్యభూమి ఇదియే సుడీ! ఇతర దేశములలో గొప్పమతగురువులు ఎవడో ఒక రాజు తమగోత్రపురుషుడని రుజువుచేయ ప్రయత్నింతురు. కాని ఇక్కడన్ననో, మహారాజులుసైతము ఎవడో యొక పురాణఋషిని తమ గోత్రపురుషునిగా చెప్పుకొందురు. కాబట్టి మీకు ఆధ్యాత్మికధర్మమునందు నమ్మకమున్నను లేకపోయినను, జాతీయజీవనముకొఱకైనను మీరు ఆధ్యాత్మికధర్మమును చేపట్టి దాని ననుసరింపవలసియున్నది. ఆ పిదప రెండవచేతిని చాచి ఇతర జాతులనుండి మీకు దొరకుదానినెల్ల సంపాదించుకొనుడు. కాని ఆ సర్వమును మీ యేకైక జాతీయధర్మమునకు లోబడునట్లు చేయవలసియే యుండును! ఆ మార్గమున అద్భుతముగా, మహిమాన్యముగా, భావిభారతభూమి ప్రకాశింపనున్నది. ఆ దివ్యప్రకాశచిహ్నములు ఇపుడే కన్పించుచున్నవని నా నమ్మకము. అది ప్రాచీనభారతముకంటె ఉజ్జ్వలమై ప్రకాశించును. పూర్వపు ఋషు లందఱికంటె గొప్పవారగు ఋషులు పుట్టనున్నారు. మీ పితృదేవతలు సంతృప్తులగుటయేగాక, తమ తమ లోకముల

నుండి క్రిందికిచూచుచు, తమ సంతానము మహాతేజోవంతులును, మహాపురుషులును నగుటకు వారెంతయు సగర్వముగా ఆనందింతు రని నా నిశ్చయము.

కాబట్టి మనమందఱమును శ్రమపడి పనిచేయుదుముగాక. ఇది నిద్దురపోవుటకు సమయముకాదు. భావిభారతోదయము మన చేతలపై నాధారపడియుండును. ఆ తల్లి సంసిద్ధముగా వేచి యున్నది. ఆమె కొంచెముగా కునుకుచున్న నేమి? లెండు! మేల్కొంచుడు!! అదిగో ఆ సనాతనధర్మసింహాసనమున నవ యౌవనముతో పూర్వముకంటె దేదీప్యమానముగ వెలుగుచు మన దేశమాత ఆసీనయై యున్నది. కన్నువిచ్చి చూడుడు. ఆ భగవత్ స్వరూపము మన మాతృదేశములోవలె ఇంత ప్రస్ఫుట ముగా మఱి యెచ్చటను ప్రకాశించియుండలేదు. మఱెచ్చోటను ప్రజలు భగవంతుని ఇట్టి రూపముతో భావనచేసి యెఱుగరు. ఒకవేళ నా ధీరోక్తులను విని మీరు అబ్బురపడవచ్చును. మనకు గల భగవద్భావనకు సమమగునట్టి భావనను ఇతరుల మతగ్రంథ ములలో ఎందేని చూపుడు. వారికి కలవి గోత్రదేవతలుమాత్రమే. యూదుల దేవుడు, అరబ్బుల దేవుడు, ఈ కులదేవతగనో ఆ కులదేవత గనో ఉన్నారు. పైగా ఒకరి కులదేవత తక్కినవారి కులదేవత లతో సదా పోరుసలుపుచుండును. కాని మనతండ్రియై, మన తల్లియై, మనమిత్రుడై, మనసఖులకు సఖుడై, మనఆత్మలకు పర మాత్మయై పరగు మనదేవుడు సర్వశుభంకరమూర్తి! అపార కరుణాస్వరూపి! ఇట్టి భగవద్భావన ఇక్కడనే—ఈ భారతదేశ మునమాత్రమే—చూపట్టును. శైవులకు శివుడును, వైష్ణవులకు విష్ణువును, కర్మపరాయణులకు కర్మదేవతయు, బౌద్ధులకు బుద్ధుడును, జైనులకు జినుడును, క్రైస్తవులకు యూదులకు యెహోవాయును, ప్రతిసంప్రదాయమునకు ఆ సాంప్రదాయక దేవతయు, వేదాంతులకు బ్రహ్మమునై యొప్పు ఆ సర్వేశ్వరుడు, ఈ దేశమునందుమాత్రమే పూర్ణతేజముతో సాక్షాత్కరించును. ఆ సర్వవ్యాపి మనలను

ఆశీర్వదించుగాక! మనకు అండమై నిల్చుగాక! మనకు బలమును ప్రసాదించుగాక! ఈ దివ్యభావమును ఆచరణలో పెట్టగల సాహసమును మనలకొసగుగాక! మనము వినినదియు, మనము చదివినదియు, మనలో సంస్కారరూపమున వెలయుగాక! అది మనకు సత్యమై యొప్పుగాక! మనము పరస్పరసాహాయ్యము చేసికొనుటకు అది శక్తిరూపిణియై చెలగుగాక!! మనము ఒకరిని గుఱించి ఒకరము అసూయాపరులము కాకుందుముగాక!!! శాంతి, శాంతి, శాంతి. హరినామమున శాంతి వెలయుగాక!



## పరమకుడియొద్ద అభివందన పత్రమునకు ప్రత్యుత్తరము

రామనాడు విడచిన పిమ్మట శ్రీస్వాములవారు ఆగిన మొదటిపట్టణము పరమకుడి. అక్కడ చాల గొప్పయుత్సవము జరిగెను. ఈ క్రింది స్వాగతపత్రము శ్రీవారికి అర్పింపబడినది.

శ్రీమత్ వివేకానందస్వాములవారికి :—

శ్రీవారు పాశ్చాత్యప్రపంచమున నాలుగుసంవత్సరముల కాలము జయప్రదముగా వేదాంతప్రచారము సాగించివచ్చు తరుణమున, పరమకుడిపట్టణవాసులమగు మేము శ్రీవారికి భక్తి గౌరవపురస్సరముగా స్వాగతము నర్పించుకొనుచున్నారము.

షికాగోనగరమున జరిగిన అఖిలమతమహాసభకు విజయము చేసి అతిప్రాచీనమగు మన కర్మభూమియందు నెలకొనియున్న నిగూఢపవిత్రజ్ఞానరాసులను, నానామతప్రపంచప్రతినిధులయెదుట ప్రదర్శించిన తమ యౌదార్యము మాకెల్లరకు ఆనందమును, గర్వమును కలిగించినది. వేదవాఙ్మయమునందు నిగూఢములై యున్న పవిత్రధర్మములను శ్రీవారు బాహాటముగా ప్రకటించి

మన హైందవమతముపై పాశ్చాత్యపండితులకుగల తిరస్కార భావమును తొలగించితిరి! సర్వకాలములందును సమస్తచిత్త వృత్తులకును వివిధమేధాశక్తిసంపన్నులకును ఉపకరించు తెఱగున, అయ్యది విశ్వానుగుణ్యమై విశ్వశరణ్యమై పరగుచున్నదని వారికి నచ్చజెప్పితిరి.

శ్రీవారి పాశ్చాత్యశిష్యవరులు ఇప్పుడిచ్చట మాయెదుట నిలుచుటయే, శ్రీవారి ధర్మబోధలు చక్కగా సిద్ధాంతరూపమున సుగ్రాహ్యములై, ఆచరణరూపమున ఫలప్రదములయ్యెననుటకు ప్రబలనిదర్శనముగా నున్నది. హృదయాకర్షకమగు శ్రీవారి దివ్యదర్శనప్రభావము, పూర్ణవైరాగ్యయుతులై, ఇంద్రియనిగ్రహ పరులై, బ్రహ్మసాక్షాత్కారసిద్ధులై, మానవజాతికెల్ల ఆత్మమార్గ దర్శులై గురుపీఠము నధిష్ఠించిన మన ప్రాచీనమహాఋషులను మా మనోనేత్రములకు ప్రత్యక్షము చేయుచున్నది.

మానవజాతిని కనికరించి ఆధ్యాత్మికమార్గమున నడపుటకు వలయు దీర్ఘాయురారోగ్యములను శ్రీవారికి ఆ పరమేశ్వరుడు ప్రసాదించుగాక యని వేడికొనుచు విరమించుచున్నారము.

పరమభక్తివిశ్వాసములతో ఇట్లు విన్నవించు,
శ్రీవారి శిష్యబృందము

ఈ అభినందన పత్రమునకు ప్రత్యుత్తరము చెప్పుచు శ్రీ స్వాములవారిటుల సెలవిచ్చిరి :

నాకు ఈ విధముగా స్వాగతమిచ్చుటలో మీరు చూపిన ఆదరణకును, ప్రేమకును, నా మనస్సులోని కృతజ్ఞతను తగురీతిని వెలువరింపగల్గుట అసంభవము. మీ ఆమోదమును పురస్కరించుకొని ఈ నాలుగు మాటలు మాత్రము చెప్పెదను. ఈ దేశీయులు ప్రేమపూర్వకముగ నన్నాదరించినను, ద్వేషభావమున

తరిమివేసినను, ఈ దేశముపైని, ఇందలి ప్రజలపైని, నా హృదయ మున వెల్లివిరిసెడి యీ అభిమానము, ఈ అనురాగము ఇట్లే శాశ్వతముగా నిలిచియుండును. 'నరులు కర్మకొఱకే కర్మ నాచరింపవలయును. ప్రేమకొఱకే ప్రేమజూపవలయును' అని గీతలో శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చియున్నాడు. పాశ్చాత్య ప్రపంచమున నేను నిర్వహించిన కార్యము అత్యల్పము. నేను చేసినదానికంటె శతాధికముగా కృషిసలుపగల శక్తి మీ కెల్లర కును గలదని నా విశ్వాసము. భారతదేశమునుండి వెలువడి, ధైర్యోత్సాహములతో చతుర్దిశాంతములకేగి, పారమార్థిక ధర్మ ప్రబోధము గావింప నుత్సహించు మహాధీరులును, పరమాత్మ తత్త్వవిదులును ఎన్నడు ఉదయింతురా యని నేను ప్రత్యాశతో ఎదురుచూచుచున్నాను. ఆ దివ్యభావములు హైందవతపోవన ములనుండి మనకు సంక్రమించినవి. అయ్యవియే భారతభూమికి సహజసంపదలు!

మానవజాతిచరిత్రయందు జాతులు జాతులే ప్రాపంచిక విషయములపై విసువుచెందుట అప్పుడప్పుడు సంభవించుచుండును. ఇందుకు కారణము ఆ సమయములందు, వారి వ్యూహములన్నియు చేజారి, ప్రాచీనసంస్థలు, సిద్ధాంతములు, శిథిలములై, ఆశలన్నియు గాలిమేడలుగా మారి, ఏదిచూచినను పట్టువదలి పోయినట్లు గోచరించుటే. ప్రపంచములో సంఘజీవనమును నిర్మించుటకు, రెండురీతుల ప్రయత్నములు చేయబడినవి: ఒకదానికి ఆధారము మతము; రెండవదానికి ఆధారము సంఘావసరము. ఒకదానికి పునాది ఆధ్యాత్మికధర్మము; రెండవదానికి ప్రకృతిశక్తి. ఒకదానికి మూలము పరమార్థచింత; రెండవదానికి ప్రత్యక్షభోగము. ఒకటి ఈ క్షుద్రప్రపంచముయొక్క దృ్బ్రహ్మాండలమును దాటి చాల దూరము దృష్టి సారించును; అది రెండవదానిని పూర్తిగా విడనాడియే జీవనారంభము చేయుటకుగూడ సాహసించును.

ఆ రెండవదో ప్రపంచవిషయములను ఆధారముచేసికొని నిలుచు టతో తృప్తిపడి, అందే శాశ్వతసుస్థిరాధారమును కల్పించుకొన వలెనని ఆశపడును. ఒకసమయమున మొదటిదగు ఆత్మపక్షము ఉన్నతిగాంచును; వెంటనే రెండవదగు జడప్రకృతి పైకిలేచును. ఈ తీరున తరంగగమనముతో ఇవి ఒకదానివెనుక ఒకటి నడచుచుండుట విచిత్రముగదా. ఒకేదేశములో ఈ భిన్నదశలు కాన్పించుచుండును. ఒకసమయమున జడవాదము వెల్లివిరియును. ఐహికసౌఖ్యమును, భోగానుభవమును సమృద్ధిగా నొసగు విద్యలు, సిద్ధాంతములు ప్రచండముగా వాయువేగమున ప్రచారము గాంచును; వెంటనే అవి క్షీణించి నశించిపోవును. వైభవముతోపాటు అసూయాక్రోధములుకూడ మానవజాతిలో కార్చిచ్చువలె చెలరేగును. స్పర్ధలు, ద్వేషము, హింస, ప్రళయతాండవము సలుపును. అంత ఇంపైనది కాకున్నను పామరులు చెప్పుకొను ఇంగ్లీషు సామెత ఒకటి కలదు: "ఎవనికివాడు ముందుకు దుమికినపుడు వెనుకవానిని ఎన్నమ్మ కబళించిందట" ఆ కాలమున ఇదేనీతి ప్రచారముగాంచును. జీవనిర్మాణతత్త్వమే వ్యర్థమైనదని ప్రజలు తలపసాగుదురు. పారమార్థికధర్మము అడ్డుపడనియెడల, మునిగిపోవుచున్న ఈ ప్రపంచమును అది చేపట్టి ఉద్ధరింపనియెడల, అట్టివేళలలో జగత్తే నాశనమైపోగలదు. ఈ ధర్మాభ్యుదయము వలన ప్రపంచమునకు మరల ధైర్యముకలిగి నూతననిర్మాణమునకు ఆధారమేర్పడును. అందుచే ఇంకొక ఆధ్యాత్మికరంగము వచ్చును. మరల ఇదియు అణగిపోవునదే కానిండు, పారమార్థిక ధర్మాభ్యుదయము కలుగు వెంటనే ప్రపంచశక్తులన్నియు తమచేతనే కలవనువారు కొందఱేర్పడుట వాడుక. వెంటనే దీనిఫలితార్థముగా ప్రజలలో అనాత్మవాదము బయలుదేఱును. జాతియొక్క మతాధికారములే గాక సమస్తభౌతికాధికారములు, పదవులు, ఏ కొలదిమందిచేతులలోనో చిక్కిపోవుటచే, వారు విజృంభించి ప్రజల నెత్తినెక్కి పిండిగొట్టసాగుదురు. సర్వాధికారములు తమవేయని

వాదింతురు. అప్పుడు సంఘము ఈ పీడ తొలగించుకొనుటకై గిజగిజలాడును. భౌతికవాదము వారికి అండయై రక్షణబూనును.

హిందూదేశస్థితిని విచారించినయెడల ఇదే విషయము ఇప్పుడుకూడ జరుగుచున్నట్లు గోచరింపగలదు. ఈనాడు మీారిచ్చుటచేరి, వేదాంతప్రచారముచేయుటకై పాశ్చాత్యదేశములకు పోయివచ్చిన ఒకవ్యక్తికి స్వాగతమిచ్చుటకు మూలకారణము యూరపుదేశమునగల అనాత్మవాదప్రాబల్యమే. కావున ఒక దృష్టితో చూచిన, ఈ భౌతికవాదము భారతభూమిని రక్షింప వచ్చినట్లే తోచును. అది జీవితావకాశములను అందఱికిని సమముగా కల్పించుచున్నది; కులముచే లభించు ప్రత్యేకాధికారములను, అర్హతలను ఎగురగొట్టివేయుచున్నది. తరతరములుగా ఏకొలదిమందిమాత్రమో తమచేతులలో నిముడ్చుకొని, తమకొఱకునైతము వినియోగముచేసికొనక, వ్యర్థముగా దాచిపెట్టుకొనిన అమూల్యజ్ఞానరత్నములను పైకిలాగి బహిరంగచర్చకు లోనుజేసినది. సగము దొంగలు అపహరించుటచేత ఎప్పుడో నష్టమైనది; తక్కిన సగము కుక్కలవంటి నీచుల చేతులలో చిక్కినది. వారు దానిని అనుభవింపజాలరు; ఇతరులను అనుభవింపనీయరు. నేను హిందూదేశములో మనము స్థాపింపవలయునని పెనుగులాడుచున్న రాజకీయవిధానములు యూరపులో తాతలనాటినుండి నెలకొనియున్నవే. కొన్నిశతాబ్దములుగా వానిని, స్వానుభవముచే పరీక్షించి, తుదకవి అన్నియు పనికిమాలినవని వారు కనుగొనిరి. ఒకదానితర్వాత నొకటిగా ఆ రాజకీయవ్యవస్థలు, విధానములు, వ్యర్థములని వారు కనుగొనిరి. ఇప్పుడు యూరపుఖండము ఎటుజూచినను గతికానక అల్లాడుచున్నది. భౌతికవ్యాపారపీడనము అచట విశేషఘోరముగా పరిణమించినది. దేశసంపద, అధికారము అంతయు ఏమాత్రమును పనిచేయని కొలదిమంది సోమరుల చేతులలో చిక్కినవి. వీరు

శ్రమపడరు; కాని లక్షలకొలదిజనముచేత పనులు చేయించు తంత్రములను పన్నుచుందురు. ఈ అధికారముతో వారు భూలోకమునెల్ల రక్తరాశిలో ముంచివేయగలరు. ఆస్తికసిద్ధాంతములను కాలరాచి నిరంకుశముగా ప్రభుత్వము సాగింతురు. నేడు పాశ్చాత్యప్రపంచము ఏపదుగురు ధనికపిశాచములచేతనో పాలింపబడుచున్నది. తమదేశములందలి ప్రజాస్వామ్యరాజ్యపాలనము, స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, శాసనసభలు అని వారు చెప్పుకొను గొప్పలన్నియు వట్టి బూటకములే, పరిహాసములే.

పాశ్చాత్యప్రపంచము ధనికపిశాచుల హింసలకు లోనై శోకములు పెట్టుచున్నది. ప్రాక్ప్రపంచము యాజకబ్రాహ్మణుల పీడనము సహింపలేక శోకములు పెట్టుచున్నది. ఇవి రెండును తమ హింసకులను అదపులో నుంపవలెను. ఒకరుమాత్రమే లోకమును ఉద్ధరింపగలరని తలపకుడు. పక్షపాత మిసుమంతయు లేని ఈశ్వరుడు సృష్టిలోని ప్రత్యణువును సమానముగనే చేసియున్నాడు. నీచాతినీచుడగు ఘోరకర్మనియందుసైతము మహాఋషియందు కొఱవడియుండు కొన్నిసుగుణములు కాన్పించును. అతిక్షుద్రమగు కీటకమునందుసైతము అత్యుత్తమపురుషునందు గోచరించని కొన్నిగుణములు కాన్పించును. అల్పభోగియని మీరు తలచు నిరుపేదయగు కూలివానికి మీకుగల బుద్ధిచాకచక్యము లేకపోయినను, వేదాంతతత్త్వమువంటి విషయములను అతడు గ్రహింపజాలకపోయినను, మీ శరీరమును వానిశరీరముతో పోల్చిచూచినయెడల, వానిశరీరమునకు మీశరీరమువలె తీవ్రానుభూతిశక్తిలేదనియు, వానిదేహమునకు తగిలిన గాయములు మీ గాయములకంటె త్వరితముగా మానిపోవుననియు, మీవలె అతడు చీటికి మాటికి మంచమునబడడనియు కనుగొందురు. వానిప్రాణము ఇంద్రియగతమైనది. వానిభోగము ఇంద్రియములందే. పైగా వాని జీవితము ఒడుదుడుకులులేక సమముగానడచును. భౌతికక్షేత్రమున

గాని, బుద్ధిక్షేత్రమునగాని, ఆధ్యాత్మికక్షేత్రమునగాని, ఎచ్చటనో పరిహారముకల్పించిభగవంతుడు సమత్వమును నెలకొల్పును. కావున మనమే లోకోద్ధారకులమని భ్రమింపరాదు! మనము లోకులకు అనేకవిషయములు నేర్పగలమనుట వాస్తవమేగాని, వారియొద్ద మనము అనేకవిషయములు నేర్చుకొనవలసికూడఉన్నది. లోకము దేనికొఱకు నిరీక్షించుచున్నదో దానినిమాత్రమే మనములోకము నకు బోధింపగలము. ఆధ్యాత్మికమగుపునాది లేనియెడల పాశ్చాత్య నాగరికత అంతయు ఇంకొక యేబది సంవత్సరములలో ఛిన్నాభిన్నమై పోగలదు. ఖడ్గబలముతో మానవజాతిని పరిపా లింపజూచుట కేవలము వ్యర్థము; అది యెన్నడును పొసగదు. అసలు బలాత్కారముగా పరిపాలించుటవంటి భావములకు ఏది ఉత్పత్తిస్థానమో అదియే వాని అధోగతికిని, క్షయమునకును, విచ్ఛిన్నతకును జన్మస్థానమగును. అనాత్మశక్తి ప్రదర్శనమునకు ప్రధానక్షేత్రమగు యూరపుఖండము తన స్థితిని మార్చుకొని, తన ప్రస్తుత సంప్రదాయమునుకూడ మార్చుకొని, తన జీవితము నకు ఆధ్యాత్మికధర్మమును పునాదిగాచేసికొనుటకై పూనిక వహిం పనియెడల, ఇంకొక యేబదిసంవత్సరములలో ముక్కలుముక్కలై దుమ్ములో కలసిపోవును. మన ఉపనిషత్తులు ప్రతిపాదించు ఆస్తిక ధర్మ మొక్కటే యూరపును నేటి దుఃస్థితినుండి ఉద్ధరింపగలదు.

మనదేశమునందలి సంప్రదాయములు, తత్త్వశాస్త్రములు, స్మృతులు భిన్నభిన్నముగానున్నను, వీని అన్నిటికిని మూలా ధారమై పరగు సిద్ధాంతమొకటి కలదు. "జీవుడు లేక ఆత్మ అనునదొకటి యున్నది" అను విశ్వాసము మనలోని అన్ని సంప్ర దాయముల వారికిని కలదు. ఈ భావమే ప్రపంచ చిత్తవృత్తి నంతను మార్చివేయగలదు. భారతదేశమున హిందువులు, జైనులు, బౌద్ధులు మున్నగు సర్వసాంప్రదాయకులును ఆత్మరూపియగు జీవుడు కలడను భావమును అంగీకరింతురు. అది సమస్తశక్తులకు

నిలయము. శక్తినిగాని, పవిత్రతనుగాని, పరిపూర్ణతనుగాని వెలుపల నుండి మీరు పొందగలరని బోధించు ఒక్క సిద్ధాంతమేనియు భారతదేశమున పెట్టలేదని మీకు బాగుగా తెలియునుగదా! ఈ లక్షణములన్ని స్వభావసిద్ధములని భారత సిద్ధాంతములెల్ల తెలుపుచున్నవి. అపవిత్రత కేవలము ఆగంతుకముగవచ్చి మీపైనిబడి మీసత్యస్వభావమును కప్పివేయుచున్నది. కాని మీ స్వస్వరూపము పవిత్రమై, శక్తిమంతమై సదా వెలుగుచునే యున్నది. మిమ్ము అదపులోపెట్టి నడపుటకై ఏ అన్యసాహాయ్యమును మీకు అక్కఱలేదు. మీరు ఆత్మనిగ్రహము కలవారే. మీకాసంగతి తెలియునా, తెలియదా అనునదే ప్రశ్న. మనకు ఉన్న ప్రతిబంధమును ఒక్కమాటలో చెప్పెదను: అది అవిద్య. నరునికి భగవంతునికి పుణ్యపురుషునకు పాపికి, గల భేదమేమి? అజ్ఞానము! మీ కాలిక్రిందపడి గిజగిజలాడు నికృష్టమగు పురుగునకును మానవజాతికెల్ల శిరోభూషణమనదగు పురుషోత్తమునకును గల భేదమేమి?—అజ్ఞానమే. అదియే ఈ భిన్నత్వమును కల్పించుచున్నది. ఆ ప్రాకులాడు పురుగునకుగూడ లోపల అఖండశక్తియు, జ్ఞానమును పావనతయు, సర్వేశ్వరుని అనంత పరిపూర్ణతయు కలదు! అది యిప్పుడు అవ్యక్తముగా నున్నది; ఇక వ్యక్తము కావలయును.

భారతదేశము ప్రపంచమునకు బోధింపవలసిన మహాధర్మము ఇదియే. ఈ ధర్మము ఇంకే దేశములోను కానరాదు. ఇదియే వేదాంతము. ఆత్మను గుఱించిన శాస్త్రము. పురుషుని నిలబడి పనిచేయునటుల చేయునదేది? బలము. బలమే యోగ్యత; దుర్బలతయే పాపము. ఆగ్నేయాస్త్రమువలె రివ్వునవచ్చిపడి, అజ్ఞానరాసులనెల్ల భస్మీపటలముచేయు మహాశక్తిని ఉపనిషత్తులు "నిర్భయత్వము" అని పేర్కొనుచున్నవి. మీరు బాగుగా ప్రచారము చేయవలసిన ఏకైకమతధర్మము ఈ 'నిర్భయత్వమే!'

వ్యావహారిక ప్రపంచమునగాని, ఆధ్యాత్మిక ప్రపంచమున గాని, 'భయ' మనునది మన పతనమునకును పాపమునకును మూలకారణ మనుట సత్యము. దుఃఖమును కల్పించునది 'భయము'; దౌష్ట్య మును పెంచునది 'భయము', సరే, భయమునకు మూలమేది? మన సహజతత్త్వమును గుఱించిన అజ్ఞానమే. మనమెల్లఱము, సకల సార్వభౌములకును సార్వభౌముడైన భగవంతుని వారసు లము. మనము సాక్షాత్తు భగవదంశసంభూతులమే. ఇంతేగాదు. మనము అల్పనరుల మనుకొనుచు, స్వస్వరూపములను మఱచి యున్నప్పటికిని మనము స్వయంబ్రహ్మమే. అట్టి ఉన్నతభావనా స్థితినుండి మన మిప్పుడు భ్రష్టులమైపోయితిమి. ఈ భ్రష్టతయే విభేదములను తెచ్చిపెట్టినది; నేను నీకంటె కొంచెము గొప్ప వాడను, లేక నీవు నాకంటె కొంచెము గొప్పవాడవు అను నిట్టి విభేదములు కల్పించినది. అద్వైతభావమే నేడు భారతదేశము నేర్వవలసిన గొప్పపాఠము. దీనిని మీరు గుర్తించుకొనుడు! ఇది గ్రహింపబడినపుడు సమస్తవిషయముల స్వరూపమును మాఱి పోవును. అప్పుడు మీరు మునుపటివలెగాక వేఱుదృష్టితో ప్రపంచమును చూతురు. ఆదృష్టికి ఈ ప్రపంచము — ప్రతి జీవియు ప్రతి ఇతర జీవితోడను పోరాడుటకే పుట్టి, బలాఢ్యుడు విజయము పొందుచుండగా దుర్బలులు మృత్యువువాతబడుచుండ వలసిన — ఘోర రణరంగముగా కన్పడదు; శ్రీహరి బాల రూపముదాల్చి మన మందఱము వాని చెలికాండ్రమై చుట్టును గుమిగూడియుండ లీలమెయి వినోదములుసల్పుచుండు నాట్యరంగ ముగా భాసించును. ఈ లోకము మిక్కిలి ఘోరముగను, బీభత్స ముగను, అపాయకరముగను, కన్పట్టినను, అంతయు ఒక నాటకమే అను సత్యము గోచరించును. ఆత్మస్వరూపమును తెలిసి కొనినప్పుడు దుర్బలునకుకూడ ఆశలు చిగిరించును. అథఃపతితు నకు, ఘోరపాపికికూడ నూతనాశలు అంకురించును. 'నిస్పృహ చెందకుడు' అని శాస్త్రములు ఘోషించుచున్నవి. మీరేమిచేసి

నను మీయాత్మస్వభావము మారదు. అది ఒకేరూపమున నిర్మల ముగా భాసించుచుండును. ప్రకృతిని ప్రకృతియే నాశము చేయునా ? మీది నిర్మలతత్త్వము. కోటియుగము లది మఱుగు పడియుండుగాక, తుదకది బయటపడితీరును; విజయశాలియై వెలువడివచ్చును. కావున అద్వైతము ప్రతివానికిని ఆశను పురి కొల్పునేగాని నిస్పృహతను గలుగ చేయదు. అది భయము నాధా రము జేసికొని బోధలుచేయదు. నీవు అడుగు తప్పు వేసితివేని నిన్ను పడలాగివేయుటకు పిశాచములు సంసిద్ధముగా నున్నవని అది చెప్పదు. దానికి పిశాచములతో పనిలేదు. మీ అదృష్టము మీ చేతులలోనే యున్నదని అది చెప్పును. మీకర్మయే ఈశరీర మును మీకు సృష్టించిపెట్టినది. మఱెవరును దానిని మీపై పడ వేయలేదు. సర్వవ్యాపియగు బ్రహ్మము అజ్ఞానమువలన మఱుగు పడి యున్నాడు. బాధ్యత అంతయు మీ మీదనే యున్నది. మీ ఇచ్ఛలేకయే మీ రీ లోకమునకు తీసికొనిరాబడి ఈ ఘోర ప్రదేశమున విడిచిపెట్టబడినటుల భావింపవలదు. ప్రతిక్షణమును కొంచెము కొంచెముగా మీ శరీరమును ఇప్పుడు మీరు పెంచు కొనుచున్న విధముననే, మీరే, పూర్వజన్మములో దీని నిర్మాణ మును చేసికొంటిరి. మీ ఆహారమును మీరే తినుచున్నారు. మీకొఱకై ఎవరును తినిపెట్టుటలేదు. మీరు తినినదానిని మీరే జీర్ణము చేసికొనుచున్నారు. మీ కొఱకు ఎవరును జీర్ణము చేసి పెట్టుటలేదు. ఆ ఆహారమునుండి రక్తమును, కండరములను, శరీరమును మీరే నిర్మించుకొన్నారు. మీకొఱకు ఎవరును నిర్మించిపెట్టుటలేదు. ఇటులనే సర్వదా మీరు ప్రవర్తించుచున్నారు. గొలుసులోని ఒక్కయుంగరమును పరీక్షించిన యెడల గొలుసు స్వభావమెల్ల తెలియును. మీ శరీరనిర్మాణమును మీరు చేసి కొనుటకు ఒక్క క్షణకాలము సత్యమగునేని, ప్రతిక్షణమునం దును మీరు అటులనే, పూర్వము చేసియుంటిరనియు, ఇకముందు కూడ వేయగలరనియు స్పష్టమగుచున్నది. మంచికిని చెడ్డకును

ఇటుల బాధ్యతయంతయు మీమీదనే పడుచున్నది. ఇదియే గొప్ప ఆశకు మూలము. నేను కూర్చుకొనినదానిని నేనే విప్పుకొనగలను. ఇట్లయ్యును ఈశ్వరుని కరుణ నరునికి అవసరము కాదని మన మతము బోధించుటలేదు. ఈశ్వరకరుణ సదా ఉండనేయుండును. అయినను ఈ భయంకర శుభాశుభప్రవాహమునకు దూరముగనే ఈశ్వరుడు నిలిచియుండును. ఆయన నిత్యముక్తుడు. ఆ కరుణానిధి ఈ ప్రవాహమును దాటించి మనలను ఆవలియొడ్డుచేర్చుటకు ఎల్లప్పుడును సంసిద్ధముగా నున్నాడు. ఆయనకరుణ అపారము. నిర్మలహృదయములకు అది నిరంతరము దొరకగలదు.

ఒక యర్థమున మీ ఆధ్యాత్మికధర్మమే మీ సంఘపునర్నిర్మాణమునకు పునాదులు వేయవలసి యున్నది. నాకు ఇంక కొంత అవకాశము ఉండిన యెడల పాశ్చాత్యులు మన అద్వైత సిద్ధాంతములనుండి ఇంకను ఎటుల నేర్చుకొనవలసియున్నారో తెలిపియుండెడి వాడను. ఏమన ప్రకృతి శాస్త్రములు ప్రబలిన ఈ దినములలో సగుణబ్రహ్మముయొక్క ఆదర్శమునకు అంతగా బలములేదు. ఐనను, ఒకని ఆధ్యాత్మికజ్ఞానము ప్రాథమికదశలో నుండి, వానికి దేవాలయములు, విగ్రహములు అవసరములగు నెడల, ఆతడు కోరుకొనినవన్ని ఇచటకలవు. వాని భక్తిసాధనకు సగుణ దైవము అవసరమగునెడల, ఆసగుణ దైవతముయొక్క పరమోత్తమ భావములుకూడ ఈ దేశమున అపారముగా గలవు. ప్రపంచములో మఱెచ్చోటను ఇంతటి వైవిధ్యముతో రూపకల్పనము చేయబడియుండలేదు. ఒకనరుడు తన తర్కదృష్టిని తృప్తిపఱచుకొని వివేకశీలియై యుండగోరునేని అత్యుత్తమ తర్కసాధ్యములగు నిర్గుణబ్రహ్మ భావములుగూడ వానికి ఇక్కడనే లభింపగలవు.



## శివగంగ, మానామదురపట్టణములవారు సమర్పించిన స్వాగత పత్రమునకు శ్రీ స్వాములవా రొసగిన ప్రత్యుత్తరము

మానామదురపట్టణమున, శివగంగ మానామదురపట్టణముల జమీందారులును పురజనులును శ్రీస్వాములవారికి ఈక్రింది స్వాగత పత్రమును సమర్పించిరి.

### శ్రీమత్ వివేకానందస్వాములవారికి

పరమపూజ్యులగు స్వామీ!

శివగంగ మానామదురపట్టణముల జమీందారులును, పురజనులును అగు మేము శ్రీవారికి పూర్ణహృదయముతో స్వాగత మర్పించుకొనుచున్నారము. మాజన్మలోని గాఢతర ఆశాప్రపూర్ణ సమయములందుగాని, మా అతివిస్మయకర స్వప్నములందుగాని, మాహృదయములకు అత్యంత సమీపవర్తులగు శ్రీవారు ఇటుల మాగృహములకు అత్యంత సమీపమున దర్శనమొసంగుదురని మేమెన్నడును ఊహించియుండలేదు. మీరు శివగంగకు రాజాలరని తెలిపిన మొదటి తంతివార్త మాహృదయములను నిబిడాంధకారమున ముంచివైచినది. తదుపరిచేరిన తంతివార్త ఆ అంధకారమేఘ పటలాంచలములను రజతకాంతులుతీర్చి యుండిన యెడల, మా నిస్పృహావస్థ దుర్భరమైయుండెడిది. శ్రీవారు మా పట్టణమున దర్శనభాగ్య మొసగుటకు అంగీకరించిరని మొదట వినినప్పుడు మాప్రత్యాశ లన్నియు ఫలించినటుల తలంచితిమి. గంగానది పిచ్చుకగూటిపై ప్రవహించి అనుగ్రహించినట్లైనది. మా ఆనందమునకు మితిలేదయ్యెను. కాని గంగాతీర్థము తన సమ్మతిని ఉపసంహరించుకొనవలసెనని తెలిసినప్పుడు మేమైనను ఆ తీర్థమునొద్దకు పోవుటకు వీలులేదయ్యెగదాయని మిక్కిలి

పరితపించితిమి. ఎట్లైననేమి శ్రీవారు మా ప్రార్థనలను ఆలించి మ మ్మనుగ్రహించితిరి. సముద్రప్రయాణమునందుగల దుర్భర సంకటములను సరకుగొనక అత్యద్భుత నిస్స్వార్థభావముతో, పాశ్చాత్యప్రపంచమునకు ప్రాచ్యప్రపంచముయొక్క ప్రపూత దివ్యసందేశమును గొనిపోయిన మీ ధైర్యమును, ఆ కార్యనిర్వహణమున మీరలు చూపిన అసమానదక్షతయు, మీరు పూనుకొనిన సర్వభూతహితధర్మమునకు లభించిన అసదృశమగు అఖండ విజయమును మీకు శాశ్వతవినిర్మలకీర్తిని గడించిపెట్టినవి. కుక్షింభరత్వమే పరమధర్మముగ బోధించు పాశ్చాత్య జడవాదము భారతీయ మతవిశ్వాసములమీదికి భయంకరముగా దండెత్తివచ్చుచున్న ఈ సమయమున, మన మహర్షుల సద్బోధలును దివ్యగ్రంథములును రూపుమాయనున్న ఈ కాలమున, శ్రీవారినిబోలు సద్గురునిప్రభావము మతధర్మప్రచారచరిత్రయందు నూతనాధ్యాయమును విప్పినది. క్రమముగా, ఆర్షతత్త్వశాస్త్రమనెడు స్వచ్ఛమగు అపరంజిమీద, కాలగతినివచ్చిపడిన కాలుష్యమునెల్ల కడిగివైచి, తమ విచక్షణాపటిమ మనెడు టంకసాలయందు శ్రీవారు సంస్కరించి, జగమునం దెల్లెడల సుగ్రాహ్యమగు నాణెముగా దానిని పరివర్తనముచేయుదురుగాకయని మేము నిరీక్షించుచున్నాము. హిందూవేదాంతధ్వజమును, మహామతసభయందు ఆసీనులైన నానాసంప్రదాయప్రచారకులసమక్షమున, విశ్వశరణ్యముగ ప్రకటించి ప్రతిష్ఠించిన మీ సాహసము, రాజకీయక్షేత్రమున మీ సమకాలికయగు మహారాణినిబోలి, సూర్యుడెన్నడును అస్తమింపని మహాసామ్రాజ్యమునకు మిమ్ము అచిరకాలములో సార్వభౌముని చేయగలదని అపేక్షించుచున్నాము. కాని ఈ రెంటికిని ఒక్క భేదముకలదు. ఆమె ప్రభుత్వము స్థూలప్రపంచమున వర్ధిలుచుండగా శ్రీవారి ప్రభుత్వము భావప్రపంచమున ప్రకాశింపగలదు. దీర్ఘకాలపరిపాలనముచేతను, ఉదారధర్మప్రచారముచేతను, ఆమె సర్వాతీతమై వెలయునటుల, అతులిత

నిష్కామముతో పూనిన ప్రేమప్రచారమును కొనసాగించి ఆధ్యాత్మికచరిత్రయందు పేరుగాంచిన పూర్వఋషివరుల నందఱిని శ్రీవారు అతిక్రమించి ప్రకాశింతురుగాక యని సర్వేశ్వరుని భక్తి పూర్వకముగా ప్రార్థించుచున్నాము.

పరమపూజ్యులరగు స్వామీ!

భక్తివినమ్రతలతో శ్రీవారి నర్చించు సేవకులము.



ఆ స్వాగతపత్రమునకు ప్రత్యుత్తర మొసగుచు శ్రీస్వాముల వా రిటుల పల్కిరి :

మీ రిప్పుడు నా కొసగిన సాదరస్వాగతమువలన ఎంతటి గొప్ప కృతజ్ఞతాభారమును నాపైన పెట్టితిరో నేను వ్యక్తీకరింప జాలకున్నాను. నే నెంతగా అభిలాషపడినను, దీర్ఘోపన్యాసము గావించుటకు తగిన స్థితిలో నే నిప్పుడు లేను. మన సంస్కృత పండిత మిత్రుడు పూర్ణప్రేమతో ఎన్ని మనోహరములగు విశేషణ ములను నాకు ప్రసాదించినప్పటికిని, నా కిట్లో ఒక దేహమున్నది గదా! ఈ శరీరము జడద్రవ్యసంబంధమయిన ప్రేరణలను, నియ మములను, ధర్మములను సదా అనుసరించుచునే యుండును. అట్లగుటచే ఈ స్థూలశరీరమునకు సంబంధించినంతవఱకు అలసట, ఆయాసము అనునవి ఉండితీఱును.

నేను పాశ్చాత్యదేశములందు కావించిన కొలదిపాటి కృషిని గూర్చి, యీ దేశపు నలుమూలల కానవచ్చుచున్న సంతోషము, ఆమోదము, అద్భుతావహముగానున్నవి. నేను కావించిన యీ స్వల్పకార్యమునకే ఈ జాతి ఇంతగా ప్రశంసించుచుండగా, మన తరువాత రానున్న మహర్షులును, లోకసంస్కర్తలును, ఈ జాతికి ఎంతగా సమ్మానపాత్రులు కానున్నారో! భారతదేశము

మతధర్మమునకు జన్మభూమి. భారతీయులు మతధర్మమును మాత్రమే గ్రహింపగలరు. ఆ మార్గములో వారి విద్యావిధానము నిరంతరముగా అనేకశతాబ్దములు నడిచినది. తత్ఫలముగా మత మొక్కటియే పరమపురుషార్థముగా వెలసినది. ఆ విషయము మీరందఱు ఎఱిగినదియే. ప్రతివాదును ఏ వర్తకుడో, బడి పంతులో, యుద్ధభటుడో కానక్కఱలేదు. కాని ఈ లోకము భిన్నభిన్న జాతుల కావాసమై, మొత్తముమీద సామరస్యభావ ముతో విరాజిల్లుచుండును.

ఈ నానాజాతిరాగసమ్మేళనమునందు, మనము ఆధ్యాత్మిక స్వరమును ఆలాపనచేయవలెనని బ్రహ్మదేవుడు వ్రాసిపెట్టెను కాబోలు! అద్భుతమహిమాఢ్యులగు మనపూర్వులనుండి మనకు పిత్రార్జితముగావచ్చిన ఆ దివ్యసంప్రదాయమును మనమింకను కోల్పోవలేదని నేను సంతోషించుచున్నాను. మనపూర్వులవంటి వారిని చూచుకొని ఏ జాతివారయినను గర్వోన్నతులుకాగలరు. ఈ జాతియొక్క భవిష్యదున్నతియందు నాకు అచంచలవిశ్వాసము కల్గుచున్నది. ఇప్పటి మీ ఆదరభావము వ్యక్తిత్వేన, నాయెడల చూపిన మన్ననగా కాక, మన జాతీయహృదయము అందు ప్రతి బింబించుచున్నదని తలచి, అది ఇంకను క్షేమముగా వర్ధిల్లు చున్నందుకు విశేషానందము నందుచున్నాను. భారతమాత యింకను జీవించియేయున్నది. ఆమె మరణించెనని చెప్పువా రెవరు? మనము కార్యశూరులముకాగా చూడవలెనని పాశ్చా త్త్యులు అభిలషించుచున్నారు. యుద్ధభూములయందు మనము కార్యశూరులమై నిలువగా చూడవలెనని వాంఛింతురేని, వారికి ఆశాభంగమే కలుగును. అది మనక్షేత్రముకాదు. ఒక యోధ జాతి ఆధ్యాత్మికక్షేత్రమునవిహరించుట చూడగోరితిమేని, మనకును అటులనే ఆశాభంగమగును. కాని వారిక్కడికివచ్చిచూచి, మనమును వారితో సమముగా కార్యోత్సాహులమైయున్నా

మనియు, మనజాతి బ్రతికియేయున్నదనియు, అది ఎప్పటివలెనే సంపూర్ణచైతన్యముతో మనుచున్నదనియు గ్రహింతురుగాక! మనము క్షీణించిపోయితిమను దురభిప్రాయము వారికి పోగొట్ట వలయును.

కాని మీకు ఇప్పుడు అప్రియవాక్కులను కొన్నింటిని చెప్పనున్నాను. వానికై మీరు కోపింపకుందురని నమ్మెదను. యూరపియనుల జడవాదమువచ్చి మనను దాదాపుగా ముంచి వేసినదని మీరిప్పుడు పల్కితిరి. అదియంతయు యూరపియనుల దోషముకాదు; చాలవఱకు మనదోషమే. వేదాంతులమగు మనము ఎల్లప్పుడును అంతర్ముఖదృష్టితో, ఆత్మపరిశీలనాపరులమై విషయములను గ్రహింపవలయును. మనకు మనమే హాని చేసి కొన్నపిదపగాని, మనకు హాని కల్పింపజాలుశక్తి జగత్తులో నెక్క డను ఉండజాలదు. ఇది వేదాంతులమగు మనము స్పష్టముగా నెఱుగుదుము. భారతదేశజనసంఖ్యలో అయిదవభాగము మహమ్మ దీయులలో చేరిపోయిరి. ఇంకను వెనుకకుపోయి చూచితిమేని, పూర్వయుగమున జనసంఖ్యలోని మూడింట రెండుపాళ్లు బౌద్ధులై పోయినట్లే, ఇప్పుడు అయిదవపాలు మహమ్మదీయులయిరి. ఇప్పటికే పదిలక్షలకుమించి క్రైస్తవులైనారు.

ఇది యెవరితప్పు? మన చరిత్రకారులలో ఒకరు అడిగిన సర్వకాలము సంస్మరణీయమైనభాషలో ఈ ప్రశ్న ఎన్నడును మఱవరానిది. అనర్ఘళజీవనది తమప్రక్కనే ప్రవహించుచుండగా, పాపము, ఈ దీనులు ఆకలిదప్పులతో చావనేల? తమ సొంత మతమును విడిచిపోవుచున్న ఈ ప్రజలకై మనము ఏమైన చేసితిమా? వారేల మహమ్మదీయులు కావలసివచ్చినది? ఇంగ్లాండులో వేశ్యావృత్తి నవలంబింప యత్నించిన ఒక ఉత్తమ బాలికను గుఱించిన ఉదంతమును నేను వింటిని. ఆమె అటుల చేయుటెందులకో అని ప్రశ్నించిన ఒక నారీమణితో ఆ బాలిక

"నాకు సానుభూతి లభించుటకు అది ఒక్కటియే మార్గముగా నున్నది. ఇప్పుడు నాకెవరును దిక్కు కాన్పించుట లేదు. నేను పతితనై హింసలపాలయితినేని, అప్పుడు ప్రాయశః కొందఱు కృపామతులగు నారీమణులువచ్చి నన్ను తమయింటికి తోడ్కొని పోయి నాకేదో ఉపాయము చూపుదురు" అనెనట! మనము ఈ మతభ్రష్టులనుగూర్చి ఇప్పుడేడ్చుచున్నామే; మునుపు వారి కొఱకు ఏమైనను చేసితిమా? ఇప్పుడైనను మనము ఏమి నేర్చు కొంటిమి? సత్యజ్యోతిని చేపట్టితిమా? చేపట్టినచో, ఎంతమేర దానికాంతులు ప్రసరింపజేసితిమి? ఈ ప్రశ్నలను మనలో ప్రతి యొక్కరమును వేసికొందము. నిజమారసినచో, ఇప్పుడు మతాంతరము నాశ్రయించిన మనసోదరులకు మనము ఎప్పుడును సాహాయ్యము చేసియుండ లేదు. మనమట్లు చేసియుండకపోవుట మనదోషమే! మనపాపమే! మనము ఎవరిని నిందింపనక్కఱ లేదు. మనకర్మమునే నిందించుకొనవలసియున్నది.

జడవాదముగాని, మహమ్మదీయమతముగాని, క్రైస్తవ మతముగాని, ఒక్కటి యననేల—ప్రపంచములోని సర్వమతము లును మీ ఉపేక్షవలన వర్ధిల్లినవే! దుష్టవర్తనము, మలినాహారము, దారిద్ర్యము, రోగము మొదలగువానిమూలమున చెడి పోయి క్షీణించియున్ననే తప్ప ఏ క్రిమియు శరీరమును తాక జాలదు. సంపూర్ణారోగ్యముగల పురుషుడు నిరపాయముగా విష క్రిములమధ్య చరింపగలడు. సరే! మనపద్ధతులను మార్చుకొను నవకాశము ఇంకను కలదు. వ్యర్థములు, అర్థహీనములు అగు విషయములనుగూర్చి మీ ప్రాతపోట్లాటలను, ప్రాతవివాదములను మానుకొనుడు. బుద్ధి తెలిసిన మానవులు వందలు వందలుగ కూడి 'నీరు త్రాగునప్పుడు మనము చెంబును కుడిచేతితో పట్టుకొన వలయునా, ఎడమచేతితో పట్టుకొనవలయునా? చేతిని కడుగుకొన వలసినది మూడుసారులా, నాల్గుసారులా? నీరు పుక్కిలింపవలసి

నది ఏదుతడవలా, ఆఱుతడవలా?' అను విషయములనుగుఱించి సంవత్సరములకొలది వాదనలుచేయుచు, ఇప్పటికి ఏదాఱువందల సంవత్సరములనుండి భ్రష్టులైపోవుచున్నారు. ఈపాటి ఘనవిషయములనుగూర్చి తర్కవాదములుచేయుచు, వానిపై బ్రహ్మాండమగు శాస్త్రగ్రంథములు వ్రాయుచు, కాలము, శక్తి, జీవితము వ్యర్థము చేయు మహానుభావులు ఉన్ననేమి, ఊడిననేమి? ఇట్టివారిచేతులలో మనమతము సర్వనాశనమైపోవును. మనము వేదాంతులము కాము, పౌరాణికులముకాము, తాంత్రికులమునుకాము. "నన్ను ముట్టకుడు" అను మహామతావలంబులమైపోయినాము! మన మతము పాకశాల ప్రవేశించినది. కూటికుండ మన 'ఇష్టదేవత'యై వెలసినది. 'నేను పరిశుద్ధుడను; నన్ను తాకకు' అను పలుకులే మతధర్మరాజములైపోయినవి. ఈ స్థితియే మఱొకశతాబ్దకాలము సాగునెడల మనలో ప్రతివాడును 'పిచ్చిఆసుపత్రి' చేరవలసి యుండును. మన మెదడు పాసిపోయి, మన మనస్సు ఉత్తమ జీవనవిషయములను గ్రహింపజాలని గతి పట్టినదనుటకు ఇది స్పష్టమైన గుర్తు. నూతనకల్పనాశక్తి అంతయు అడుగంటినది. మనోబలము ఉడిగినది. దానిప్రవృత్తి పాడైనది. ఆలోచనాశక్తి ఆరిపోయినది. అది యిప్పుడు తనకు దొరకిన చిన్నగిఱిలోపడి, గిరగిరతిరుగవలసినదే! ఇట్టి అల్పవిషయములను వెంటనే గంగలో త్రొక్కి, మనము సాహసముతో నిలబడవలయును; కార్యశూరులము కావలయును; ధీరులమై వర్తింపవలయును. అప్పుడే— మనపూర్వులు మనకు పిత్రార్జితముగా నొసగిపోయిన రత్నరాసులకు, లోకమెల్ల నిరంతరము ఆరాటపడుచున్న భాగ్యనిధులకు, వారసులమని చెప్పుకొను యోగ్యత మనకు కలుగును. ఈ ధనరాసులను మనము పంచిపెట్టనియెడల లోకము వినాశము గాంచును. వానిని వెలికితీసికొనిరండు! విరివిగా లోకమున వెదజల్లుడు!! దానమే కలియుగములో ప్రధానధర్మమని వ్యాసమహర్షులవారు చెప్పుచున్నారు. అన్నిదానములలో ఆధ్యాత్మిక

జ్ఞానదానమే అత్యుత్తమము. దీనితర్వాత లౌకికజ్ఞానదానమును, దానితర్వాత ప్రాణదానమును, తుదిని దరిద్రులకిడు అన్నదానమును గణనీయములగును. అన్నదానము చాలినంత చేయుచునే యున్నాము. ఇంకేజాతిలోను మనకంటె ఎక్కువగా బిచ్చము పెట్టువారలు లేరు. గుడిసెలో గుప్పెడన్నమున్నంతవఱకు బిచ్చగాడుసైతము మఱొకబిచ్చగానికి దానిలో సగము పెట్టబోవును. ఇట్టి స్థితి భారతదేశములో మాత్రమే కాన్పించును. మనలో ఈ ధర్మము కావలసినంత యున్నది. ఇక పై రెంటివిషయము విచారింతము. ముఖ్యముగా ఆధ్యాత్మికజ్ఞానదానము, లౌకికజ్ఞానదానము మనము చేయవలసియున్నది. ధైర్యముతో, సాహసముతో, ఆత్మవిశ్వాసముతో కార్యభారము వహించితిమా, ఇరువదియైదేండ్లలో ఈ సమస్య పూర్తిగా పరిష్కారమైపోగలదు. మన మిక దేనికొఱకును కీచులాడుకొనవలసిన పనియుండదు. హిందూప్రపంచమెల్ల మరల ఆర్యావర్తమై వర్ధిల్లగలదు; ఆర్యమతప్రదీప్తమై పరిఢవిల్లగలదు.

నే నిప్పుడు చెప్పవలసినదంతయు ఇదియే. నాకుగల పథకములను గుఱించి మాటలాడుట నా కంతగా అలవాటులేదు. ముందు చేసి చూపి, పిమ్మట ఆ పథకములను గుఱించి ప్రసంగించుట నా మార్గము. నాకు కొన్ని పథకములున్నవి. ఈశ్వరేచ్ఛ యున్న యెడల, నాకు ఆయువు చాలునెడల, వానిని ఆచరణలో పెట్ట నిశ్చయించుకొనియున్నాను. అటుల చేయగలుగుదునో లేదో నాకు తెలియదు. జీవితములో ఒక ఉత్తమాదర్శమును లక్ష్యములో నుంచుకొని, దానికై జీవితమును అర్పించుట ఘనకార్యము. మనము బ్రతుకుటవలన ప్రయోజనమేమి? అల్పమును, దీనమును, వ్యర్థమును అగు నరజీవితము ఎందులకు? ఒక గొప్పపురుషార్థమునకు జీవితమును అర్పించుటయే దాని ప్రయోజనము. భారతదేశములో వహింపవలసిన ఉత్తమ కర్తవ్యము ఇదియే. ఈ కాలపు

ఆధ్యాత్మికధర్మ పునరుద్ధరణమునకు నేను స్వాగతము చెప్పు చున్నాను. అనుకూలతరుణమును ఉపయోగపఱచుకొనకపోయితి నేని, అది నా బుద్ధిలోపమగును.



## మధురాపురమున నొసగబడిన స్వాగతపత్రమునకు శ్రీ స్వాములవారి ప్రత్యుత్తరము.

మధురాపుర హిందువులచే శ్రీ స్వాములవారికి ఈ క్రింది స్వాగతపత్రము సమర్పింపబడెను :

పరమపూజ్యులరగు స్వామీ!

ఈ మధురాపుర ప్రజలమగు మేము, సాంద్రభక్తి గౌరవ పురస్సరముగ, శ్రీవారిని ఈ మా పురాతనపుణ్యక్షేత్రమునకు ఆవాహనము చేయుచున్నాము. ఇంద్రియ భోగలంపటములందు గూల్చు సమస్త సంగములను సంపూర్ణముగ త్యాగముచేసి, కేవల పరోపకార జీవనమును పరమకారుణ్యభావముతో పూని, మానవ జాతియొక్క ఆధ్యాత్మికోన్నతికై పాటుపడుచున్న శ్రీవారియందు పవిత్రమా హిందూసన్న్యాసాదర్శమును మేము ప్రత్యక్షముగా కనుగొనజాలుచున్నాము. హిందూమతముయొక్క యథార్థ సారాంశము కర్మకలాపములతో కూడినది కాదనియు, దరిద్రులై సంకటములందు జిక్కినవారి కెల్లఱకును శాంత్యానందములను గూర్పగల్గు వినిర్మలతత్త్వసిద్ధాంతాచరణమనియు మీజీవితసరణి యందే ఋజువుచేసితిరి.

ప్రతినరుని, వాని పరిస్థితులకు అనుగుణముగను, వానిశక్తులకు అనుసారముగను ఉత్తమమార్గమున ప్రవేశపెట్టి ఉద్ధరింపగల వేదాంత సిద్ధాంతమును, మతధర్మమును అమెరికావారికిని,

బోధించితిరి. శ్రీ వారి ఉపదేశములు గత మూడువత్సరముల నుండియు పరదేశములందే చేయబడినవైనను, ఈ దేశమునందు సైతము విశేషాసక్తితోడ గ్రహింపబడుచు, పరదేశములనుండి వచ్చిపడిన జడవాద ప్రచారమును చాలవఱకు అరికట్టుటకు ఉపకరించినవి.

విశ్వమునందు ఆధ్యాత్మికధర్మమును ఫలప్రదముగావించు కర్తవ్యము మనమీదకలదు. కావుననే భారతదేశము ఈనాటికిని సజీవమైయున్నది. ఈ కలియుగకల్పాంతమున శ్రీవారినిబోలు మహాత్ము డుదయించుటవలన, ఆ పవిత్రకర్తవ్యమును కొనసాగించుటకు దక్షులగు మహాత్ములు పెక్కుమంది అచిరకాలముననే ఉద్భవింప నున్నారనుటకు నిదర్శనము కాన్పించుచున్నది.

పూర్వకాలమునుండి విద్యాక్షేత్రముగా ప్రసిద్ధిగాంచిన ఈ మధురానగరము, యోగులకు అభిమానతీర్థమగు ఈ పావన ద్వాదశాంతక్షేత్రము, శ్రీ సుందరేశ్వరుని ఈ ప్రియనిలయము, హిందూతత్త్వసిద్ధాంతమును ప్రకటించుటలో శ్రీవారుచూపిన దక్షతను, మానవజాతికి శ్రీవారు గావించిన మహోపకారమును అభినందించుటలో మఱేఇతర భారత నగరమునకు తీసిపోదు.

భగవంతుడు శ్రీవారికి పూర్ణపాటవమును, జవసత్త్వములను, దీర్ఘాయువును, ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాము.

## శ్రీ స్వాములవారీ క్రిందితీరున ప్రత్యుత్తర మొసగిరి :

మాననీయుడగు మీ సభాధ్యక్షుడు సూచించినటుల, ఈ నాలుగుసంవత్సరములును పాశ్చాత్యలోకమున నేను గడించిన అనుభవమును నా పరిశ్రమఫలితములను, వివరించుచు మీచెంత చాలదినములు గడపగల్గినచో మిగుల సంతోషించెడివాడనే. కాని దురదృష్టవశమున స్వాములకును శరీరములు కలవు. కడచిన మూడువారముల నుండి నిర్విరామముగా నేను గావించిన ప్రయా

ణమువల్లను, ఉపన్యాసములవల్లను ఇప్పుడు నేను దీర్ఘోపన్యాసము చేయుట సాధ్యపడకున్నది. కాబట్టి మీరు నాయెడల చూపిన ఆదరమునకు నా హృదయపూర్వకకృతజ్ఞతను తెలుపుటతో తృప్తిపడుచున్నాను. ఇప్పుడు మనకుగల కొలది అవకాశములో అనేక విషయములనుగూర్చి ఉపన్యసింపబూనక, ఎక్కువ అవకాశముగల మఱియొకదినమునకు వానిని వాయిదావేసి ప్రస్తుతము ఏవో ఒకటిరెండు అంశములనుగూర్చి మాత్రము ప్రస్తావింతును. మధురలోని పురప్రముఖులందు సుప్రసిద్ధులైన రామనాథపుర రాజుకు అతిథిగా ఉండుటనుబట్టి, ఒకవిషయము నామనస్సున ప్రస్ఫుటముగా తోచుచున్నది. షికాగో నగరమునకు వెళ్లు సంకల్పమును నామనస్సున మొట్టమొదట ప్రవేశపెట్టినది ఈ 'రాజా' గారే యని ప్రాయశః మీలో చాలమందికి తెలిసియే యుండును. తన పలుకుబడిని, ఉత్సాహమును, వినియోగించి ఆ సంకల్పమును పోషించినదియు వారే. ఈ స్వాగతపత్రములో నన్నుగూర్చి చేయబడిన అభినందనములో చాలభాగము ఈ దాక్షిణాత్య ప్రభువునకే చెందవలసియున్నది. వసుమతీరాజగుటకు మాఱుగా వీరు యతిరాజై యుండిన సముచితముగ నుండునని నేను తలచుచున్నాను ; నిజముగా ఈయన యతిరాజపదవికే అర్హుడు.

ప్రపంచములో ఏ ప్రదేశమేని ఒక విషయమున వెనుకబడి యున్నప్పుడు, ప్రకృతిశక్తులన్నియు అచ్చటికిచేరి దానికి నూతనోజ్జీవము కల్పించి తీఱును. ఇది స్థూల ప్రపంచమునందు వలెనే ఆధ్యాత్మికప్రపంచమునందును సత్యమే. ప్రపంచమున ఏభాగమందైనను ఆధ్యాత్మికధర్మము కొఱవడి, మఱొకచోట ఆ ధర్మము వర్ధిలుచున్నపుడు, మనము బుద్ధిపూర్వకముగా ప్రయత్నించినను, ప్రయత్నింపకున్నను, ఆఆధ్యాత్మికధర్మము కొఱవడియున్న తావునకు పోయి ఆ వ్యత్యాసమును సవరణగావించును. మానవజాతి చరితయందు ఒకటి రెండుసార్లు మాత్రమేగాక, మాటిమాటికి

ప్రపంచమునకు ఆధ్యాత్మికజ్ఞాన దానముచేయు నదృష్టము ఈ భారతభూమికి చిరకాలముగా కలదు. సైనిక విజయమువలనగాని, వాణిజ్యవిజృంభణమువలనగాని, ప్రపంచములో ననేకజాతులు ఒక్క-మహాజాతిగా మిళితము చేయబడినపుడెల్ల, ప్రతిజాతియు రాజకీయమో, సాంఘికమో, ఆధ్యాత్మికమో, ఏదో తనవంతు భాగమును ఇతరజాతులకు దత్తముచేయుచునే యుండును. ఈ మానవవిజ్ఞానరాశికి భారతదేశము తనవంతుగా చేర్చుచువచ్చినది పారమార్థికబలము, ఆధ్యాత్మికవిద్య. పర్షియాసామ్రాజ్య ముదయ మగుటకు ఎంతో పూర్వమే, భారతమాత వీనిని ఒకసారి ప్రపంచ మునకు ప్రసాదించియున్నది. రెండవ తడవ పర్షియాసామ్రాజ్యము వర్ధిలుచుండిన సమయమున జరిగినది. మూడవసారి గ్రీకులు విజృంభించిన కాలమున జరిగినది. ఇప్పుడు, ఈ ఆంగ్లేయ విజృం భణ కాలమున, నాల్గవసారి ఆ కార్యమే మరల నిర్వహింపబడ నున్నది. పాశ్చాత్యుల నిర్మాణకౌశలము, ఐహికనాగరకత, మన కిష్టమున్నను లేకున్నను, మనదేశమున చొరబడి, వ్యాప్తిగాంచు చున్నట్లే, భారతీయుల పారమార్థికతయు, వేదాంతమును పాశ్చాత్య భూములందు వెల్లివిరియుచున్నవి. దీనికి ఎవరును అడ్డుపడజాలరు. అట్లే పాశ్చాత్యులనుండి ఏదో ఒకవిధమగు భౌతికనాగరకత ఇచ్చటికి రాకుండకూడ మనము అడ్డుపడజాలము. అది కొంత లభించుటవలన మనకు మేలుకలుగవచ్చును. అటులనే కొంచెము పారమార్థికత్వము పాశ్చాత్యులకును మేలు చేకూర్చ వచ్చును. ఈ విధముగా పరస్పర వ్యత్యాసములు పోయి, సమ త్వము నెలకొనవచ్చును. అనగా, పాశ్చాత్యుల యొద్దనుండి ప్రతి దానిని మనము నేర్చుకొనవలయుననిగాని, లేక వారు మనవలన ప్రతిదానిని నేర్చుకొనవలయునని గాని అర్థముకాదు. ప్రతివారును తమకున్నదానిని భవిష్యత్సంతానములకు పిత్రార్జితముగా నొసగు చుండవలయును. ఇందువలన యుగయుగములుగా లోకులుకనిన కలలు నిజమై, వివిధజాతులమధ్య సామరస్యము ఏర్పడి భావికాల

మున ఒక ఆదర్శప్రపంచము రూపొందవచ్చును. ఆ ఆదర్శప్రపంచము ఎన్నడైనను సంభవమగునో కాదో నే నెఱుగను. అట్టి ఆదర్శమానవసమాజము ఎన్నడైన నిర్మాణమగునో కాదో నా అంతకునాకు సందేహమే. కాని అదివచ్చినను రాకున్నను, మనలోని ప్రతివ్యక్తియు ఆ భావము రేపే ఫలింపనున్నదో అనునట్లును, అయ్యది తన ప్రయత్నము మీదనే ఆధారపడియున్నదో అనునట్లును, పూనికతో పనిచేయవలసియుండును. లోకములో ప్రతివాడును తన కర్తవ్యమును నిర్వహించియే యున్నాడనియు, ప్రపంచమును నిర్దుష్టము చేయుటకు మనవంతు పనిమాత్రమే మిగిలియున్నదనియు, మన మెల్లరము భావించి పనిచేయవలయును. ఆ బాధ్యత మనయంతట మనమే గైకొనవలయును.

ఈ లోపుగా భారతదేశములో మహత్తరమగు మతపునరుద్ధరణము జరుగుచున్నది. అందుచే అపాయము కలుగవచ్చును. విజయగౌరవమును చేకూరవచ్చును. ఏలయన, మతపునరుద్ధరణము ఒక్కొక్కప్పుడు మూర్ఖావేశమునకు దారితీయును; హద్దులుదాటి పొంగిపొరలును. కొంతపరిమితి దాటినవెనుక దానిని ఎవ్వరును—ఆ యుద్యమప్రారంభకులు సైతము — నిరోధింపజాలరు. కాబట్టి ముందుగనే హెచ్చరికను పొందుటమంచిది. మనకు ప్రాచీన మూర్ఖాచారపరాయణత్వమనెడు ఆరుతలల భయంకరజీవి ఒకవైపుననున్నది. పాశ్చాత్యసభ్యతావిజృంభణమునందు అస్థిగతమై ఒడల జీర్ణించిపోయిన జడవాదము, అనాత్మవాదము, కృత్రిమసంస్కారము, అనెడు భయంకరమైన సుడిగుండము మఱియొకవైపున నున్నది. మన మీరెంటినడుమ చిక్కక పురోగమింపవలయును. ఈ రెంటిని దృష్టియందుంచుకొనవలయును. మనము పాశ్చాత్యులము కాలేము అని మొదట జ్ఞాపకముంచుకొనవలెను. వారిని అనుకరింప బూనుటవలన లాభములేదు. మీ రొకవేళ పాశ్చాత్యులను అనుకరింపగలిగితిరేని ఆక్షణమందే

మృత్యువు మిమ్మావేశించును. మీకింక ప్రాణము తక్కదు. రెండవది—అస లటు లనుకరింప గలుగుట అసంభవము. అనాది కాలమున పుట్టి, లక్షలాది యుగములుగా ప్రవహించుచున్న ఒక మహానదికి మీ రిప్పుడు అడ్డుపడి హిమగిరిశిఖరముపై దాని ఉత్పత్తిస్థానమును చేరునట్లు దానిని వెనుకకు నెట్టగలరా? అదియు సాధ్యమైనను, మీరు పాశ్చాత్యులుగా మాఱుటమాత్రము అసంభవము. పాశ్చాత్యుడు నిన్న కాక మొన్న పుట్టిన తనసభ్యతనే విడువజాలడేని, శతశతాబ్దములనుండి నిరవధికముగా ప్రజ్వరిల్లుచు వచ్చుచున్న మీ సభ్యతను మీరు త్రోసిపుచ్చుకొనగలరని తలతురా? అది పొసగదు. ప్రతి చిన్న గ్రామదేవత యందును, ప్రతి చిన్న మూఢాచారమునందును మతధర్మమని మనము చెప్పుకొను తత్త్వము గూఢముగా భాసించుచున్నదని జ్ఞప్తినుంచుకొనవలయును. ఐనను స్థానికాచారములు అనంతములును, పరస్పర విరుద్ధములునై యున్నవి. వీనిలో మనము అనువర్తింపవలసినవి ఏవి? అనువర్తింపతగనివి ఏవి? ఉదాహరణకుచూడుడు: దాక్షిణాత్యబ్రాహ్మణునకు వేఱొకబ్రాహ్మణుడు మాంసముదినుట కండ్లబడినతోడనే ఒడలుకంపించును. ఉత్తరదేశపు బ్రాహ్మణుడో అది మహా పవిత్రకార్యమని యెంచును. యజ్ఞములపేరిట వందలకొలది మేకలను అతడు వధచేయును. మీ ఆచారమును ప్రచారముచేయుటకు మీరు పూనుకొనినతోడనే, తమ ఆచారమును ప్రచారముచేయుటకు వారును సిద్ధపడుదురు. భారతదేశమునందంతటను ఎన్నో ఆచారములు భిన్నభిన్నములుగా నున్నవి. కాని అవి స్థానికములు; అనగా ఒక్కొక్క స్థలమునం దొక్కొక్క విధముగా నుండునవి. ఐనను పామరజనులు తమ స్థానికాచారమే తమ మతసారమని పొరపాటుగా తలచుచుందురు.

దీనిని దాటినను మఱింత కష్టతరమైన ఇంకొక ప్రతిబంధము కలదు. మనశాస్త్రములలో రెండువిధములగు ధర్మములున్నవి.

ఒకరకపు ధర్మములు నరుని శాశ్వతస్వభావముపైని ఆధార పడినవి. అవి ఈశ్వరునికి, జీవునికి, జగత్తునకు గల పరస్పర శాశ్వతసంబంధమును గుఱించి చెప్పును. ఇక రెండవరకపు ధర్మములు దేశకాలపాత్రలపై ఆధారపడి, ఆయాకాలపరిస్థితి, అప్పటి సంఘమర్యాదలు మొదలగువానికి సంబంధించియుండును. మొదటిరకపు ధర్మములు ముఖ్యముగా మనశ్రుతులందు గోచ రించును. రెండవరకపు ధర్మములు స్మృతులందును, పురాణ ములు మున్నగువానియందును గోచరించును. వేదములు పరమ గమ్యములు; త్రికాలాబాధితములు; సార్వకాలప్రమాణములు. పురాణములలోని ఏ భాగములైనను వేదధర్మములకు విరుద్ధముగా నున్నయెడల ఆ పురాణభాగములను నిర్దాక్షిణ్యముగా త్రోసి వేయవచ్చును. ఇక స్మృతులలోని ధర్మములో భిన్నభిన్నముగా నుండును. ఈ యుగములో ఈ ఆచారము నవలంబింపవలయు నని ఒకస్మృతి చెప్పును. ఇంకొక యుగములో రచింపబడిన వేఱొకస్మృతి ఇంకొకదానిని అవలంబింపవలెనని విధించును. ఈ ఆచారము సత్యయుగమున వాడుకలో నుండవలయును; ఈ ఆచారము కలియుగములో వాడుకయందుండవలయును అని పురాణములు చెప్పుచుండును. సనాతనధర్మములు నరుని ఆంతర స్వభావముపై ఆధారపడునవిగాన, నరజాతి జీవించియుండునంత కాలమును శాశ్వతములై యుండునవే. అవి సర్వకాలమును ఉపకరించు సర్వవ్యాపకములైన విశ్వజనీనధర్మములు. కాని, స్మృతులు స్థానికపరిస్థితులకు అనుగుణములైన విధులను తెలుపును. ఆయా స్థితిగతుల ననుసరించి నిర్మింపబడుటచే కాలక్రమమున అవి మార్పుచెందుచుండును. కావున ఒక్క చిన్న సాంఘికా చారము మార్పుచెందినచో, మతమే భ్రష్టమవునని మీరు తలంప రాదు. ఈ ఆచారములు ఇదివఱ కెన్నో మార్పులు చెందిచెంది, నేడు మన కీరూపమున కాన్పించుచున్నవని గ్రహింపవలయును. గోమాంసము తినకున్నచో ఏ బ్రాహ్మణునికిని బ్రాహ్మణత్వము

నిలువజాలదని మనస్మృతులు ఘోషించినకాలముకూడ కలదు. ఒకసన్న్యాసియో, రాజో, మహాపురుషుడో ఇంటికివచ్చినప్పుడు, ఉన్నవానిలో శ్రేష్ఠమగు కోడెదూడనుచంపి వండిపెట్టెడివారని వేదములు తెలుపుచున్నవి. మనము వ్యవసాయవృత్తిని ముఖ్యముగా అవలంబించువారమగుటచేత, శ్రేష్ఠములగు కోడెలను వధించుట జాతివినాశమునకు హేతువగునని కాలక్రమమున గ్రహించితిమి. కావున ఆ ఆచారము మానివేసితిమి. అంతట గోవధ కూడదని శాసింపబడినది. మనమిప్పుడు మహాఘోర కార్యములుగా భావించునవి ఒకప్పుడు సదాచారములుగానున్నట్లు ఇందుచే స్పష్టపడుచున్నది. ఇప్పటిస్మృతులుపోయి కాలక్రమమున ఇతరస్మృతులు రచింపబడును. అవి మరల తొలగింపబడి మఱికొన్ని క్రొత్తస్మృతులు పుట్టును. వేదములు సనాతనములగుటచేత ఏకరీతిగనుండి, అన్నియుగములకును పనికివచ్చునవియు, స్మృతులు కాలానుసారము పుట్టుచు అంతరించుచునుండవలసినవియు మనము గమనింపవలెను. కాలము గడవగా గడవగా పెక్కుస్మృతులు గతించిపోవును. ఋషులువచ్చి ఆ యుగమునకు వలసిన అవసరములనుబట్టి సంఘమును క్రొత్త మార్గములలో నడుపుదురు; క్రొత్తవిధులను క్రొత్తపద్ధతులను నెలకొల్పుదురు. అవి లేనిది అప్పటి సంఘము బ్రతుకజాలదు. ఈ విధముగా మనము మనమార్గమును ఎప్పటికప్పుడు సవరించుకొనుచు పైని పేర్కొనబడిన రెండు ప్రమాదములను తప్పించుకొని మెలగవలెను. ఇందుకై మనలో ప్రతివ్యక్తియు అపారమగు హృదయవైశాల్యమును, ఆత్మవిశ్వాసమును కలిగి, ప్రతిదానిని పరిగ్రహించుటేగాని, విసర్జింపరాదు అని గ్రహించునుగాక! హఠభక్తుని తీవ్రతతోపాటు, జడవాదియొక్క విశాలతగూడ ఉండుట అవసరము. సముద్రమువలె లోతును, అనంతాకాశమువలె విశాలమును నగు హృదయము మనకు కావలసియున్నది. పుడమిని ఎన్నడేని వెలసిన ఏజాతితోనైన సరిపోలజాలునంతటి పురోవృద్ధి

కాములముగను, హిందువులకు మాత్రమే సహజమై వెలయునంతటి పూర్వాచారపరాయణులముగను, ఉందుముగాక యని ముక్త కంఠముతో పలుకుచున్నాను.

ప్రతి విషయములోను ప్రధానాంశమును అప్రధానాంశమును వేఱుచేసి చూచుటను మనము నేర్చుకొనవలయును. ప్రధానమైన వనగా శాశ్వతములై నిలుచునవి; అప్రధానమైన వనగా కొంతకాలము మాత్రమే ఉపకరింపగలిగి, ఆ పిమ్మట తొలగించి వీని స్థానమున ప్రధానమగు దేనినేని నెలకొలుపని యెడల, ప్రత్యక్షముగా హానికరములగునవి. ఇట్లనుటచే, మీరు నడుములు బిగించి మీ పూర్వాచారములను, పూర్వ సంప్రదాయములను నాశనముగావింపవలెనని నా అభిప్రాయము కాదు; ఎంతమాత్రమును కాదు. వానిలో అతిదుష్టములైనవానిని సయితము మీరు తూలనాడ తగదు. దేనినిగాని తూలనాడవలదు. ఇప్పుడు ప్రత్యక్షముగా హానికరములై చూపట్టు ఆచారములు సయితము, పూర్వము ఒకానొకప్పుడు ప్రాణప్రదములై యుండినవే! ఈ నాడు మీరు వానిని త్రోసివేయ వలయునేని, శాప దృష్టితోమాత్రము ఆ పని చేయకుడు. పూర్వము ఒకప్పుడు అవియే మనజాతిని నాశము కాకుండ సంరక్షించి, మహోపకారము చేసియుండిన కారణమున వానిని దీవించుచు, వానియెడల కృతజ్ఞతను జూపుచు, వానికి వీడ్కోలీయవలెను. మన సంఘమును నడపిన నాయకులు ఎన్నడుగాని సేనాధిపతులును, చక్రవర్తులునుకారనియు, వారు మహర్షులనియు మనము జ్ఞప్తినుంచుకొనవలయును. ఈ ఋషులు ఎవరు? ఉపనిషత్తులు తెలుపునట్లు 'ఋషి' అనగా సామాన్యనరుడు కాడు. ఒక మంత్రద్రష్ట. ఆయన 'మతము'ను ప్రత్యక్షముచేసికొనిన వాడు. ఆయనకు 'మతము' అనగా పుస్తకపఠనముకాదు; వాగ్వాదమును కాదు; ఊహారచనయుకాదు; ప్రసంగప్రాగల్భ్యమును కాదు. ఆయనకు

'మతము' అనగా ప్రత్యక్షానుభవము; అపరోక్షానుభూతి; ఇంద్రియానుభవములకు అతీతములగు సత్యములను స్వయముగా ముఖాముఖి చూచుటవంటి ఒక మహానుభూతి! 'ఋషిత్వము' అనగా ఇటువంటిది. ఈ ఋషిత్వము ఏ యుగమునకును ప్రత్యేకముగా చెందినదికాదు; ఏకాలమునకుగాని, ఏ జాతికి గాని, ఏ కులమునకు గాని సంబంధించినది కాదు. "బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనవలసియున్నది" "సత్యసాక్షాత్కారమవసరమై యున్నది" అని వాత్స్యాయనఋషి చెప్పుచున్నాడు. మీరును, నేనును, ప్రతివ్యక్తియు ఋషులము కావలసి యున్నాము. మనకు నేడు ఆత్మవిశ్వాసము అత్యావశ్యకము. మనము లోకసంస్కర్తలము కావలసి యున్నది. అందుకు వలయు సర్వమును మనలో అజ్ఞాతముగా నున్నది. మనము 'మతము'ను ప్రత్యక్షముగ చూడవలయును. స్వానుభవమునకు తెచ్చుకొనవలయును. ఆ మార్గముననే మన సంశయముల నన్నింటిని తీర్చుకొనవలయును. మహాఋషిత్వముతో తేజరిల్లుచు, ధీరులమై నిలిచి, మనమెల్లరము మహాపురుషులము కావలయును. అప్పుడు మన పెదవులనుండి వచ్చు ప్రతిశబ్దమునకును వెనుక అనంత సత్యశక్తి వెలయుచుండును. పాపము మన ఎదుట నిలువలేక కాళ్లకు బుద్ధిచెప్పును. మనము ఎవరినిగాని శపింప నవసరములేకుండ, ఎవరిని దూషింప నగత్యము లేకుండ, ఈప్రపంచములో ఎవరితోడను పోరు సలుప నక్కఱ లేకుండ, చూచిన మాత్రమున సమస్తపాపములును ఎగిరిపోవును. మనము, ఇచ్చటనున్న మనలోని ప్రతివాడును, ఋషిత్వమును పొంది ఇతరుల ముక్తిని, మన ముక్తిని, సాధించుకొనగలుగునట్లు పరమేశ్వరుడు మనల ననుగ్రహించుగాక!

శ్రీ స్వాములవారు కుంభకోణము వేంచేసినప్పుడు, అచ్చటి హిందూసంఘమువారు ఈ క్రింది స్వాగతపత్రమును సమర్పించిరి.

పూజ్యులరగు నోస్వామీ!

అత్యంత ప్రాచీన పుణ్యక్షేత్రమగు ఈ కుంభకోణపట్టణము నందలి పురజనుల పక్షమున, మన పురాతనదేవాలయముల చేతను మహాఋషుల చేతను సాధుపుంగవుల చేతను పవిత్రీభూతమై వెలుగు పుణ్యభూమియగు మన దేశమునకు, పాశ్చాత్య ప్రపంచమునుండి శ్రీవారు మరలివచ్చు ఈ తరుణమున, మేము భక్తి పూర్వకముగా శ్రీవారికి స్వాగతమర్పించుకొనుటకు అనుజ్ఞ కోరుచున్నాము. శ్రీవారు పూనిన మతప్రచారమునకు అమెరికా యూరపు ఖండములలో అద్భుతవిజయమును చేకూర్చినందుకును, ప్రపంచమున నలుదెసలనుండి వచ్చి షికాగోనగరమున సమావేశమైన వివిధమతప్రతినిధిమహాశయులకు హిందూమతము, హిందూతత్త్వశాస్త్రము, నరునికిగల సమస్త భగవద్భావములను, ఆధ్యాత్మిక సాధనాదర్శములను ఉద్ధరించి, వారికి సామరస్యమును కూర్పజాలునంతటి విశాలములును, సహేతుకములును, విశ్వశరణ్యములునునై, ఒప్పుచున్నవని నచ్చచెప్పుటకు తగిన సమర్థతను శ్రీవారికి ప్రసాదించినందుకును భగవంతునియెడ మేమత్యంతము కృతజ్ఞులము.

విశ్వప్రాణుడును, విశ్వాత్మయునై యొప్పు పరమేశ్వరుని చేతులలో సత్యధర్మములు సర్వదా సురక్షితములై యుండునను విశ్వాసము, అనేక సహస్రాబ్దములుగా మన భక్తిప్రపత్తుల యందు లీనమైయున్నది. శ్రీవారు క్రైస్తవభూములందు సలిపిన పవిత్రప్రచారముయొక్క ఫలితముగా పరమార్థజీవులగు హిందువుల పిత్రార్జితసంపదమై పరగు ఆధ్యాత్మిక ధర్మముయొక్క

అగణితమహిమ భారతీయులయొక్కయు విదేశీయులయొక్కయు దృష్టిపథమున ప్రతిష్ఠింపబడినది గనుక మేము ఆనందమును పొందుచున్నాము. శ్రీవారి ఈ ప్రచారవిజయము, ఇదివఱకే సుప్రసిద్ధమై వెలసిన శ్రీవారి సద్గురుదేవుని కీర్తిప్రకాశమును ఇనుమడింప జేసినది; నాగరకప్రపంచముయొక్క దృష్టిలో మనకొక గౌరవ స్థానమునుకూడ కల్పించినది; మన పూర్వులొనరించిన మహా కార్యములను గుఱించి జాతిత్వేన గర్వపడుటకు ఆధారము కల దనియు, మన నాగరకతయందు పరపీడనోజ్జృంభణము లేకపోవుట మన అసమర్థత, దౌర్బల్యమువలన కాదనియు మాకు విశదము చేసినది. శ్రీవారివంటి సదసద్వివేకులును, దీక్షాపరులును, పూర్ణ నిష్కాములును అగు బోధకులు మాలో నుండుటచేత, హిందూ జాతియొక్క భావిభాగ్యదశ ప్రతిభావంతమును, ఆశాజనకమును అయితీఱును. జగత్ప్రభుండును, సకలజాతులకు ఏకైకదైవతమును అగు పరమేశ్వరుడు శ్రీవారికి దీర్ఘాయురారోగ్యముల నొసంగి, హిందూమత తత్త్వప్రచారకులుగా శ్రీవారు పూనిన మహాపవి త్రోద్యమమును జయప్రదముగా నిర్వహించుకొఱకు అధికాధిక ముగా ధీశక్తిని జవసత్త్వములను ప్రసాదించుగాక యని ప్రార్థించు చున్నారము.

మఱొక స్వాగతపత్రము ఆ పట్టణపు హిందూవిద్యార్థులు సమర్పించిరి. పిమ్మట శ్రీ స్వాములవారు "వేదాంతప్రచారమును" గుఱించి ఈ క్రింది తెఱగున ఉపన్యసించిరి :

"కొలదిపాటి ధర్మాచరణము సయితము గొప్పఫలము నొసగును" అను గీతావచనములోని సత్యము నా జీవితమునందు అనుదినము నాకు గోచరమగుచునేయున్నది. నేను నిర్వహించిన కార్యము నిజముగా గణనలోనికి రాదగినంతటిదికాదు. కాన, కొలంబో మొదలు ఈ నగరమువఱకు, అడుగడుగున, నాకొసగ బడిన స్వాగతసత్కారములందు చూపట్టు ఆ దయ, ఆ ప్రేమ,

ఇంత గొప్పగా నుండునని నేను ఎన్నడును ఊహించియుండలేదు. ఐనను ఈ యాదరము హిందువులమగు మనకు సంప్రదాయాను గుణముగనే యున్నది. మనజాతికిది సహజమే. ఏలయందురా, చూడుడు! మనది హిందూజాతి; మన ఆయువుపట్టు, మన జీవనిధి, ఇంతేల మన ఆత్మయే 'మతధర్మము'గా భాసించుచున్నది. ప్రాచ్యజాతులమధ్యను, పాశ్చాత్యజాతులమధ్యను, పర్యటించుచు ప్రపంచమెట్లున్నదో నేను కొంచెము చూచియున్నాను. ఒక్కొక్క మహాధర్మము ఒక్కొక్క జాతియొక్క వెన్నుముకగా కనబడు చున్నది. కొందఱికి రాజనీతి, కొందఱికి సంఘశిక్షణము, కొందఱికి బుద్ధిపరిశ్రమ—ఇట్లే వారి వారి జాతీయభావముల ననుసరించి ప్రాణభూతములగు జాతిలక్షణము లేర్పడుచున్నవి. మన యీ మాతృభూమికి 'మతమే' మూలాధారము; మతమే వెన్నుముక. మత మనెడు పెనుశిలమీాద మన జాతీయజీవితసౌధము నిర్మింపబడి యున్నది. చెన్నపురిప్రజలు ప్రేమతో నాకు అమెరికాకు పంపిన అభినందనపత్రమునకు నేనిడిన ప్రత్యుత్తరములో, 'హిందూ దేశములోని యొక పేదరైతునకు, పాశ్చాత్యప్రపంచములోని పెక్కుమంది విద్యాధికులకంటె, ఉత్తమమగు మతసంస్కారము కలదు' అను సత్యమును సూచించియుంటిని. ఈనాడు నామాటలు నిస్సందేహముగా సత్యములని నాకు రుజువగుచున్నది. మన జనసామాన్యమునకు ప్రపంచజ్ఞానము తక్కువనియు, దానిని సంపాదించుకొనవలయునను కోరికయే వారికి లేకున్నదనియు, పూర్వమొకప్పుడు నేను అసంతృప్తిపొందుచుండెడివాడను. ఇప్పుడు నాకు దానిరహస్యము తెలియవచ్చినది. వారికి ఏ విషయ ములందు అభిమానముకలదో ఆ విషయములు తెలిసికొనుటకు ఇతరదేశప్రజలకంటె ఎక్కువ ఔత్సుక్యమును వారు ప్రదర్శింతురు. యూరపులో జరుగుచున్న గొప్ప గొప్ప రాజకీయపరివర్త నములను గూర్చిగాని, యూరపియను సంఘములో జరుగు ఉద్య మాభివృద్ధులను గుఱించిగాని, మనపల్లెటూరివారిని అడుగుడు.

వారికేమియు తెలిసియుండదు; తెలిసికొనవలయుననెడు అపేక్షయు నుండదు! కాని హిందూదేశములో ఏ ప్రమేయము లేకుండ, ఎక్కడోయున్న సింహళద్వీపమునందలి పల్లెటూరి అమాయక ప్రజలుకూడ—అక్కడ పొలములో పనిపాటులుచేయు కూలి వాండ్రుసైతము—అమెరికాలో ఒక మతమహాసభ జరిగెననియు, ఒక హిందూసన్న్యాసి అక్కడకు వెళ్లెననియు, వానికి కొంత జయము చేకూరెననియు అప్పుడే తెలిసికొనియుండిరి.

కాబట్టి మన అభిరుచి ఎందున్నదో ఆ విషయములు తెలిసికొనుటకు ఇతరజాతులతో సమముగ మనవారును చొరవచూపుచునే యున్నారు. హిందూదేశములో ప్రజలకు రుచించు విషయము 'మతము' ఒక్కటే. ఒకజాతియొక్క అభిరుచి యంతయు మతాదర్శములందుండుట మంచిదా, లేక రాజకీయాదర్శములందుండుట మంచిదా అని నేనిప్పుడు తర్కింపబోవుట లేదు. మంచికో చెడ్డకో మన అభిరుచులు మతములో లగ్నమై యున్నవి. మీరు దానినిప్పుడు మార్పలేరు; దానిని నాశనము చేసి దానికి మాఱుగా ఇంకొకదానిని తెచ్చిపెట్టనుకూడ లేరు. బాగుగా పెరిగిన ఒక పెద్దచెట్టును ఒకచోటునుండితీసి, వేఱొక తావున నాటి, వెంటనే వేరూనునట్లు చేయుట సాధ్యముకాదు. మతధర్మప్రవాహము వేలకువేలుసంవత్సరములనుండి హిందూదేశమున పారుచున్నది; మంచికో చెడ్డకో భారతవాతావరణము అనేకశతాబ్దములనుండి మతాదర్శములతోనిండి మెఱయుచున్నది. మంచికో చెడ్డకో మనము మతాదర్శములలోపుట్టి అందులోనే పెరిగియున్నాము. అది మనరక్తములోనికి ఇంకిపోయినది. ప్రతి నాళములోని జీవకణములందును అది చొరబాఱినది. అది మన శరీరముతో సారూప్యము పొందినది. అది మనప్రాణములకే ఆయువుపట్టైనది. తాను మలచుకొన్న మార్గమువెంబడి యుగయుగములుగా ప్రవహించుచున్న ఈ మతవాహినిని పూడ్చివేయక

దానిని విడనాడుట సాధ్యమా? ఒకవేళ అట్లు పూడ్చివేసినను, దాని దుష్ఫలితములను అనుభవింపకుందురా? గంగాప్రవాహము వెనుకకు మరలి, హిమగిరిశిఖరములకు ఎగబ్రాకిపోయి, నూతన మార్గమును అవలంబింపవలయునని మీరు వాంఛించుచున్నారా? అదియే సంభవమైనను, ఈ భారతమాత తనకు సహజమైన ఆధ్యాత్మికజీవనమార్గమునుండి తొలగి, ఇంక ఏదో క్రొత్తమార్గమును—రాజకీయాదిమార్గాంతరమును — త్రొక్కుటమాత్రము అసంభవము. ఎవనికివాడు తనకు సుకరమైన ధర్మమేదో దానిని మాత్రమే చేపట్టును. భారతదేశమునకు ఆధ్యాత్మికమార్గమే సుగమమార్గముగా కన్పించుచున్నది. మతమార్గమును అనుసరించి నడచుటే హిందూదేశజీవనవిధానము.

ఇక ఇతరదేశములందో మతమనునది అనేక 'జీవితావసరములలో' ఒకటి. నాకలవాటైన ఒక చిన్నిదృష్టాంతమును తెలిపెదను. "ఒక దొరసాని భవంతిలో చాలవస్తువులున్నవి. భవంతులలో జపాను కూజాను అందముగా అమర్చుకొనుట ఒక 'ఫ్యాషను'. అదిలేకున్న అందమునకు కొఱత కావున ఒక జపానుకూజా కొనవలెనని దొరసాని మోజుపడినది. ఆ దొరకును, ఆ దొరసానికిని, ఇట్టిమోజులు చాలకలవు. వానిలో ఇంచుక మతావలంబనము ఒకటి." కావున వారాలోకించుక మతమును కూడ చేపట్టుదురు. వారికి ఈ లోకమే పరమగమ్యము. ఆ గమ్యము చేరుటకు సహకారులైననే దేవుడును, మతమును! వారికి 'దేవు' డనగా ఈ ప్రపంచమును తమకొఱకు పరిశుభ్రముచేసి, అమర్చిపెట్టు ఒక పరిచారకుడు. వారు దేవునకొసగు విలువ అంతగానే కనబడుచున్నది. ఎవరు సుజ్ఞానులుగా నుండవలయునో అట్టివారి పెదవులనుండి—పోనీ సుజ్ఞానులమని నటనచేయు పెద్దలనోటినుండి—ఒకటి రెండు శతాబ్దములుగా హిందూమతధర్మమును ఖండించుచు వెలువడుచున్న ఆక్షేపములు ఎట్టివో మీ రెఱుగు

దురుగదా! మన మతము ఐహికసుఖజీవనమునకు అనుకూలింప దట! అది మనఒడిలో బంగారపురాసులు కుమ్మరింపదట! ఇతర జాతులను దోచుకొనుటకు అది మనకు తోడ్పడదట! దుర్బలుర నెత్తినెక్కి, వారి నణగద్రొక్కు వీరులనుగా మనలను తయారు చేయదట! దీనుల జీవరక్తములను గ్రసియించు విద్యను మనకది నేర్పదట! నిజమే, మనమతము అటులచేయదు. జాతులను దోచు కొని, ధ్వంసముచేసి, రూపుమాపుచు, భూమి అదరిపడి దద్దరిల్ల నన్యదేశములపైకి దాడివెడలు సమరయోధులను మనమతము సిద్ధముచేయదట! కావున 'ఈ మతములో పస ఏమున్నది? అది మీ తిరుగళ్లకు కక్కు కొట్టిపెట్టదు. మీ కండరములకు బల మెక్కింపదు. అట్టి మతమెందులకు?' అని వారు ప్రశ్నించు చున్నారు.

వారి ఆక్షేపణలే మన మతముయొక్క యోగ్యతను రుజువుచేయుటకు ఆధారములని వారు తెలిసికొనలేకున్నారు. మన మతము ఈ ప్రపంచ భోగములకొఱకై ప్రాకులాడదు. 'మూడునాళ్లముచ్చట యగు ఈ క్షుద్రభోగమయప్రపంచమును మన సర్వస్వముగా భావింపరాదు. అదొక ఘనమగు గమ్యార్థ ముగా నుండతగదు' అని బోధించుచున్నది గనుకనే, ఈ మన మతమును సత్యమనుచున్నాము. ఏ నాలుగడుగుల వ్యాప్తియో గల ఈ చిన్నివసుధాచక్రము, మన మతదృష్టికి హద్దులుపెట్ట జాలదు. మన గమ్యార్థము చాల దూరముగా నున్నది. ఇంద్రియ ములనుదాటి, ఆకాశమును అతిక్రమించి, కాలమునకు అతీతముగా పోయి, తుదకు మనగమ్యమును చేరినపుడు, ఈ ప్రపంచము ఇసుమంతయు దృష్టిగోచరముకాదు. అచ్చట సర్వాతీతమై పరగు ఆత్మవిభూతిమహాసాగరమున ఈ బ్రహ్మాండమే ఒక చిన్నచుక్కయై గోచరించును! "బ్రహ్మసత్యము, జగత్తుమిథ్య; మీ యైశ్వర్య మంతయు బుగ్గి, మీ బలమంతయు క్షుద్రము, ఈ జన్మయే

దుఃఖము'' అని మనమతము తెలుపును; కాబట్టియే అది సత్యమైనది! వైరాగ్యమును ఉపదేశించి, యుగయుగములనాటి దివ్యజ్ఞానమును గఱపును గావుననే, మనమతమును సత్యమనుట! మనప్రాచీనులు సాధించిన ఆధ్యాత్మికపరిణతికి, ప్రజ్ఞానరాశికి, వారసులమగు మనతో పోల్చిచూచిన, ఇతరజాతులు నిన్న మొన్నటి పసిబిడ్డలు! వారినిచూచి ''ఓ బిడ్డలారా! మీరు ఇంద్రియదాసులుగ నున్నారు. ఇంద్రియభోగములు అశాశ్వతములు, ఆత్మవినాశకరములు. అవి యొసగు మూడునాళ్ల ముచ్చట తుదిని మిమ్ము భ్రష్టులను చేయును. దానిని విడిచివేయుడు; ఇంద్రియలోలురు కాకుడు; ప్రపంచమును పరిత్యజింపుడు'' అని హైందవమతాదర్శము ఎలుగెత్తి చాటుచున్నది. పరమార్థమును చేరు త్రోవ వైరాగ్యమే గాని, భోగము కాజాలదు. కాబట్టి మనదే సత్యమతము.

జాతి తరువాత జాతిగా, ఈ ప్రపంచనాటకరంగము మీదికి వచ్చి, కొలదినిమిషములు తమ విధిప్రకారము చక్కగనే నాట్యముచేసి, తుదకు రూపుమాసి చనుచున్నవి. మహాకాల సముద్రమున చిన్నఅలనుసయితము తమజాడచూపుటకై నిలుపజాలక, అవి మృతిచెందుచున్నవి. అట్టియెడ, ఇదిగో, మనము నిత్యజీవులమో యనునట్లు, సజీవులమై మెలగుచుండుట ఒక చిత్రవిషయముగాదా! ''అందఱును పడిపోగా, అర్హతములు మిగులుదురు'' అనెడు నూతనసిద్ధాంతములగూర్చి వారు ఏమేమో పలుకుదురు. మాంసకండరముల బలమే అర్హతములనొనర్చి నిత్యజీవము నొసంగునని వారియభిప్రాయము! వారియభిప్రాయమే సత్యమగునేని యోధాగ్రేసరవిఖ్యాతిగన్న ప్రాచీనజాతులలో ఒక్కటేనియు ఈనాడు సజీవమై వైభవోపేతమై యుండవలసినది గదా; ఒక్క అన్యజాతినిగాని, ఉపజాతినిగాని, ఎన్నడును జయించియెఱుగని, దుర్బల భారతజాతి ఈనాడు నిర్జీవమైపోయి

యుండవలసినదిగదా. కాని మన మిప్పటికిని ముప్పదికోట్ల జనసంఖ్యగలవారము! (ఒక ఆంగ్లయువతి నన్ను చూచి — "మీ హిందువులు ఏమి ఘనకార్యము చేయగలిగిరి? ఒక చిన్న ఉపజాతినైనను జయించియుండలేదే?" అని ప్రశ్నించినది.) అదిపోనిండు, మనజాతిబలమంతయు ఉడిగి, సర్వాంగవాతముతో ఊరకపడియున్నదని చెప్పుట సత్యముకాదు; ఎంతమాత్రమును కాదు. మనయందు కావలసినంత చైతన్యము కలదు; కాలము పండి, ఆవశ్యకత కలిగినప్పుడు అది ప్రళయసముద్రమువలె పొంగి, పొరలి, జగమును ముంచివేయగలదు.

అతిప్రాచీనకాలము నుండికూడ, ఈ సత్యమును మనము ప్రకటించుచునే యున్నాము. నరుడు ఎంత ఎక్కువ సంపదను కూర్చుకొనగలడు అను సమస్యను ప్రాశ్చాత్యప్రపంచము పరిష్కరింపజూచుచుండగా, ఇక్కడ భారతదేశమున నరుడు ఎంత స్వల్పముతో జీవింపగలడు అను సమస్యను పరిష్కరింపజూచుచున్నాము. ఈ పోరాటముతో శతాబ్దములు గడవవలసినదే; ఈ విభేదము సదానిలిచి ఉండునదే. 'ఆత్మనిగ్రహ సాధనపూని మితభోగులగువారు తుదకు జయశీలురై జీవింతురు. సుఖాభిలాషులై భోగముల గుడుచువారు, తాత్కాలికముగా ఎంత జవసత్త్వములు గలవారుగా పైకి చూపట్టినను, చివరకు నశింపవలసినవారే యగుదురు. వారి వంశములు త్వరలోనే అంతరించును' అని చరిత్ర గుణపాఠము నేర్పుచున్నది. వ్యక్తిజీవితమునందును, సంఘజీవితమునందునుగూడ, ప్రాపంచికభోగములపై రోతగలుగు సమయములు వచ్చుచునేయుండును. అట్టి భోగవిముఖత ఇపుడు పాశ్చాత్యప్రపంచమున వ్యాప్తిచెందుచున్నట్లు కాన్పించుచున్నది. అక్కడను జిజ్ఞాసువులున్నారు; వారును మహనీయులే. అధికారమునకు, ఐశ్వర్యమునకు ఆశపడి పరుగులిడుట వ్యర్థపుపనులలో వ్యర్థపుపనియని వారును కనుగొనుచున్నారు. అట్టి బుద్ధిశాలు

రలో చాలమంది—స్త్రీలును పురుషులునుకూడ—పోటీలన్నను, పోరాటములన్నను, వ్యాపారనాగరికత తెచ్చిపెట్టు ద్వేషములన్నను, వెగటుచెందుచున్నారు. వానిని తొలగించుకొను ఉపాయమును అన్వేషించుచున్నారు. యూరపునందలి అనర్థములన్నిటిని తొలగించుటకు రాజకీయసాంఘికపరివర్తనములే ఉపకరించునని, వానినే పట్టుకొని ప్రాకులాడువారలును గలరు. అయినను, ఉత్తమాలోచనాపరులు ఇతరమార్గములకై వెదకులాడుచునే యున్నారు. ప్రజలను రాజకీయముగను, సాంఘికముగను ఎన్నిరీతుల క్రింద మీదులుచేసినను, అనర్థములెన్నడును తొలగజాలవని వీరు గ్రహించిరి. హృదయముమాటి యోగ్యతరమైననే గాని, జీవితానర్థదశలు తొలగవు. ఎంత బలాత్కరించినను, ఎంతటి రాజకీయాధికారము చెలాయించినను, ఎన్ని క్రూరశాసనములు చేసినను, జాతిపరిస్థితి చక్కబడజాలదు. ఆధ్యాత్మికచింతనము, నైతికశిక్షణము మాత్రమే జాతిని సన్మార్గమునబెట్టి సంస్కరింపగలుగును. అందువలన, ఈ పాశ్చాత్యజాతులవారు ఏదేని క్రొత్తభావవైఖరిగాని, ఏదేని నూతనతత్త్వమార్గముగాని దొరకునాయని ఆతుర పడుచున్నారు. వారవలంబించుచున్న క్రైస్తవమతము చాలవఱకు శుభప్రదమును మహిమాన్వితమును అయినదే. కాని దానినివారు తిన్నగా అర్థముచేసికొనుటలేదు. ఇంతవఱకు వారు అర్థముచేసికొనగల్గిన విధమునుబట్టి, ఆ మతము అసమర్థమైనదని తేలినది. పాశ్చాత్యులలో జిజ్ఞాసువులగు బుద్ధిమంతులు ఏ నూతనభావస్ఫురణమునకై పరితపించుచున్నారో, ఆధ్యాత్మిక క్షుత్పిపాసలను తీర్పగల ఏ ఆహారపానీయములకొఱకు ఆరాటపడుచున్నారో, అవి యెల్ల మన ప్రాచీనతత్త్వశాస్త్రమునందు, ముఖ్యముగా వేదాంత సిద్ధాంతమునందు లభించుచున్నవి. ఇట్లగుటలో ఆశ్చర్య మేమియు లేదు.

లోకములో ప్రతిమతమునకును నానావిధములగు చిత్రవిచిత్ర ప్రభావములు కలవని ప్రచారము చేయుట నేను ఎఱుగు

దును. క్రైస్తవమతము ఒక్కటి మాత్రమే విశ్వశరణ్యమైనదనియు, విశ్వజనీనమత మనియు నాస్నేహితుడు డాక్టర్ బారోస్ చాటి చెప్పుట మొన్న మొన్ననే అందఱు వినియేయున్నారుగదా! ఈ విషయమును కొంచెము విమర్శనదృష్టితో విచారించిన మీదట వేదాంతమతము మాత్రమే విశ్వజనీనమతముగా వెలయగల దనియు, ఇంక ఏ ఇతరమతమునకును అట్టి యోగ్యత లేదనియు, నాకు దృఢముగా తోచినది. దానికి కారణములు ఏవియో మీకు తెలిపెదను. ఒక్క మన మతముతప్ప, ప్రపంచములోని గొప్ప మతము లించుమించుగా అన్నియు, ఆయామతస్థాపనాచార్యుల జీవితములతో అవినాభావసంబంధము కలిగియున్నవి. వారి మత సిద్ధాంతములు, మతోపదేశములు, మతబోధలు, నీతిశాస్త్ర ములు: అన్నియు వారి మతస్థాపకుని జీవితమును ఆధారముచేసి కొని నిర్మింపబడినవే! ఆ పురుషునిబట్టియే అవి ఆమోదము పడయుచున్నవి; ఆ మహాత్మునివలననే అవి మహిమాఢ్యములగు చున్నవి; ఆ ప్రముఖుని ఆధారముచేసికొనియే అవి ప్రమాణము లగుచున్నవి. ఈ విధముగా ఆయామతస్థాపకులు చారిత్రక పురుషులు అను భావమే పునాదిగా అనేక మతమహాభవనములు నిర్మింపబడుట చూడగా, నాకు నిజముగా ఆశ్చర్యమగుచున్నది. మతకర్తల జీవితవృత్తాంతములందు, దాదాపు సగభాగముకూడ ఈ కాలములో నమ్మెడువారుండరు; తక్కిన సగమును సందేహ ముతోజూతురు. ఆధునికపరిశోధనల వలన, అట్టి వారి జీవితో దంతములుకొన్ని చారిత్రకసత్యములు కావని సులభముగా రుజువు చేయవచ్చును. ఆదెబ్బతో వారి "చారిత్రకసత్యము" లెల్ల పుక్కిటిపురాణములై, వారి రాతిపునాదులెల్ల వట్టి యిసుక తిప్పలై, వారు కట్టుకొనిన భవనమంతయు శిథిలమై నేలగూలును. ఇక మరల ఎన్నడును పూర్వస్థితికి రాజాలదు.

మన మతమొక్కటితప్ప, ప్రపంచములోని ప్రతి మత మును అట్టి ఒకానొక చారిత్రకపురుషునిపై ఆధారపడి పైకి

వచ్చినదే! ఇక మనదో, ధర్మసూత్రములపై ఆధారపడియున్నది. వేదములను తానుసృష్టించితినని చెప్పుకొనగల స్త్రీగాని, పురుషుడుగాని లేడు. 'వేదములు' అనగా సనాతనధర్మముల జ్ఞానరాశి. ఋషులు ఆ ధర్మములనుకాంచిరి. అప్పుడప్పుడు ఈ ఋషులనామములు——నామములు మాత్రమే——పేర్కొనబడుటకలదు. వారు ఎవరో, ఎటువంటివారో కూడ మనకు తెలియదు. చాలమంది ఋషుల విషయములో, వారి తండ్రులు ఎవరైనది తెలియవచ్చుట లేదు. ఏ ఋషియొక్కయు జన్మదినముగాని, జన్మస్థానముగాని తెలియనేతెలియదు. ఈ ఋషులకు తమ పేరుప్రతిష్ఠల గొడవయే పట్టలేదు. వారు ధర్మబోధను మాత్రము చేసిపోయిరి. తాము బోధించిన ధర్మములకు తామే నిదర్శనములుగ నుండుటకు తమచేత నైనంతవఱకు ప్రయత్నించిరి. మన భగవంతుడు నిర్గుణుడయ్యును సగుణుడుగా కూడి నుండు తీరున, మన మతముకూడ అపౌరుషేయమైనదయ్యును (అనగా పురుషులపై గాక ధర్మసూత్రములపై ఆధారపడినదయ్యును) పురుషప్రచారమునకు గూడ అపారమగు అవకాశము నిచ్చుచున్నది. ఎట్లన, ఇన్ని యవతారములను, ఇందఱు ప్రవక్తలను ఋషులను మనకొసగియు, ఇంకను అట్టివారి ఆగమనముకొఱకు నిరీక్షించుచుండు మతమింకొకటి కలదా! అవతారములు అనంతములనియు, మీరు కోరినంతమంది వచ్చుటకు ఇంకను అవకాశమున్నదనియు భాగవతము చెప్పుచున్నది. కావున మన మతచరిత్రయందు పేర్కొనబడిన మహాపురుషులలో, అవతారములలో, ప్రవక్తలలో, ఎంతమంది చరిత్రపరిశోధన వలన నిజమగు వ్యక్తులు కారని ఋజువైనప్పటికిని, మన మతమునకు ఇసుమంతయు హానియుండదు. అది ధర్మములపై ఆధారపడినదే కాని, వ్యక్తులపై ఆధారపడినది కాకపోవుటచేత సర్వకాలము సుస్థిరమై నిలువగలదు. ప్రపంచ ప్రజలందఱును ఏ ఒక్క పురుషునో అనుసరించునట్లు కృషిసలుపుట కేవలము వ్యర్థము. వారినందఱిని సనాతనములును, విశ్వజనీనము

లును అగు ధర్మముల ననుసరించునట్లు చేయుట సైతము దుస్సాధ్యమే. కాని, ఎప్పటికైనను లోకజనులలో నెక్కువభాగమును ఒక్క భావవైఖరికి తేగలుగుచో, అది ధర్మసూత్రమూలమున కాగలదుగాని, పురుషులమూలమున కాజాలదు. ఐనను మన మతమునందు వ్యక్తుల పలుకుబడికిని అధికారమునకును చాల అవకాశముకలదని యిప్పటికే చెప్పితిని. ఈ మహాత్ములలోనుండి మన ఇచ్ఛానుసారము ఏర్చి తీసికొను నవకాశముకలిగించు 'ఇష్టదైవము' అనెడు అత్యద్భుత సిద్ధాంతము ఒకటి కలదు. నీకు గురువుగా, నీకు పూజార్హుడుగా ఈ ప్రవక్తలలోనుండిగాని, ఉపదేశకులలోనుండిగాని, ఎవరినైనను నీ యిష్టము చొప్పున ఎన్నుకొనవచ్చును. నీవు ఎన్నుకొనినవ్యక్తియే ప్రవక్తలలో అగ్రగణ్యుడనియు, అవతారములలో పరమపూజ్యుడనియు భావనచేయు నవకాశముకూడ నీకున్నది. దానివలన ఏ హానియులేదు. కాని దీనికంతకును వెనుక మూలాధారముగా సనాతన సత్యధర్మ సిద్ధాంతములను నిలుపుకొనవలసి యుండును. ఇక్కడ ఒక విచిత్ర విషయము గమనార్హము. మన వేదధర్మములకు నిదర్శనములుగా నున్నంతవఱకే మన అవతారములను మనము ప్రమాణములుగా పాటించుచున్నాము. మన సనాతనవైదికమతధర్మములను ఉపదేశించిన ఉత్తమగురుకును, భారతదేశమున బుట్టిన వేదాంత వ్యాఖ్యాతలలో ప్రథమగణ్యుడును అగుటచేతనే శ్రీకృష్ణుని మహిమ ఇంతగా ప్రకాశించుచున్నది.

వేదాంతము అత్యధికముగా ప్రపంచదృష్టిని ఆకర్షించుటకు రెండవ కారణము ఇది: బాహ్యప్రకృతి పరిశీలనకు పూనిన ఆధునికశాస్త్రములు ఇంతవఱకు కనిపెట్టిన విషయములకు, ప్రతిపాదించిన సిద్ధాంతములకు, మన వేదాంతసూత్రములెల్ల అనుగుణముగా నున్నవి. ఇది అద్భుతావహమగు విషయము. ప్రపంచ మందలి ఏ మతశాస్త్రమునందును ఆధ్యాత్మిక, భౌతిక సిద్ధాంత

ములకు ఇట్టి సామరస్యము కాన్పింపదు. అస్పష్టమగు ప్రాచీన కాలములో ఆకారమునందును, అనుభూతియందును, చిత్తాకర్షణ యందును, అక్క-సెల్లెండ్రవలె నున్న రెండు భావనాసంప్రదాయ ములు బయలుదేఱి రెండు భిన్నమార్గములను అవలంబించినవి. అందొకటి ప్రాచీన హైందవసంప్రదాయము; రెండవది ప్రాచీన గ్రీకుసంప్రదాయము. ఇందు మొదటిది ఆంతరంగిక ప్రపంచమును పరిశోధించుటతో ప్రారంభమైనది. రెండవది బాహ్యప్రపంచ పరిశోధనతో ప్రారంభమైనది. అయినను, రెండును సర్వాతీత మగు ఒక్క-పరమార్థమునే అన్వేషింపవలెనని బయలు వెడలెను. వీనికి వాటిల్లిన వివిధ దశాంతరముల చరిత్రను పరిశీలించుచు పోయిన, ఈ రెండు భావవాహినులును, ఆ పరమగమ్యమును గూర్చి, ఒక్క-విధమగు శ్రుతిలోనే గానముచేసినట్లు మనకు విదిత మగును. నూతనభౌతికశాస్త్ర సిద్ధాంతములు హిందువుల వేదాంతమతసిద్ధాంతములతో మాత్రమే సామరస్యము నందగల వని స్పష్టముగా కాన్పించుచున్నది. పాశ్చాత్యుల భౌతికవాదము తన ప్రత్యేకతను తాను నిలుపుకొనుచునే వేదాంత ధర్మసిద్ధాంత ములను అంగీకరించుటవలన, పరమార్థమును చేరగలుగునని నిస్సం దేహముగా చెప్పవచ్చును. ఈ నవీనశాస్త్రసిద్ధాంతములను యుగ యుగాంతరములకు పూర్వమే మనవేదాంతులు దర్శించియుండిరని మనకును—మనకననేల, కన్నులు తెఱచి సత్యమును చూడగోరు వారికెల్లరకును తెలియవచ్చుచున్నది. కాని భాషలో ఈరెంటికిని భేదము కలదు. నవీనశాస్త్రములందు ఆ సిద్ధాంతములు జడప్రకృతి పరముగా చెప్పబడియుండగా, వేదాంతమునం దవి అధ్యాత్మ పరముగా ప్రతిపాదింపబడియున్నవి. వేదాంతము పాశ్చాత్యజిజ్ఞా సువులను ఆకర్షించుటకు మఱియొక హేతువు కూడ కలదు. అది దాని యద్భుత తార్కి-కదృష్టి. వేదాంతమునందలి సిద్ధాంతములు ఎంతయో యుక్తియుక్తముగానున్నవని కొందఱు పాశ్చాత్య భౌతికశాస్త్రపండితులు నాతో స్వయముగా చెప్పియున్నారు.

వారిలో నొకరు, భోజనము చేయుటకుగాని తన పరిశోధనాలయ మును విడిచి వెలుపలికి పోవుటకుగాని, సరిగా తీఱిక చిక్కనివారు వేదాంతమును గుఱించిన నా ఉపన్యాసములను వినుటకై గంటల కొలదికాలము నిలువబడి యుండెడివారు. దీనికి కారణము నా ఉపన్యాసములు సమంజసముగానుండి, ఈ యుగజనుల మహాశయ ములతోను, నేటి విజ్ఞానశాస్త్ర పరిశోధనాఫలితములతోను చక్కగా సమన్వయపడుటేయని ఆయన నాకు చెప్పినారు.

ఇక వివిధమతములను శాస్త్రీయముగా పరిశీలించుటవలన తేలిన సిద్ధాంతములను రెంటిని మీకు ముఖ్యముగా తెలుపగోరు చున్నాను. ఒకటి, మతములన్నియు విశ్వజనీనములే అను భావమునకును, రెండవది, సమస్తవస్తువులును ఏకపదార్థవికార ములే అను భావమునకును సంబంధించినవి. బాబిలోనుల, యూదుల చరిత్రలు పరిశీలించినచో వారిమతమునకు సంబంధించిన ఒక విషయము మనకు గోచరించును. ఈ బాబిలోనుజాతియు, యూదియాజాతియు, ఒక్కొక్కటి పెక్కు ఉపజాతులుగా విడి పోయి యున్నవి. ప్రతి ఉపజాతికిని ఒక ప్రత్యేకదేవత గలదు. ఈ చిన్న చిన్న ఉపజాతి దేవతలకు సామాన్యముగా ఒక్క జాతీయనామమునే వాడుట కలదు. బాబిలోనుజాతీయుల దేవత లను 'బాలులు' (బాల్స్) అందురు. వీనిలో 'మెరోడాక్ బాల్' ప్రధానదైవము. కాలక్రమమున ఈ పెక్కు ఉపజాతులలో ఒకటి ఇతర ఉపజాతులను జయించి తనలో ఇముడ్చుకొనును. తత్ఫల ముగా ఈ జయశాలిని యగు ఉపజాతిదేవత తక్కిన ఉపజాతి దేవతలందఱి మీదను అధికారిణి యగును. బాబిలోనుజాతి సగర్వముగా తమలో కలదని చెప్పుకొనుచున్న ఏకేశ్వరారాధన ఈ తీరుగానే యేర్పడినది. యూదుల దేవతలకు 'మోలోక్' అను సామాన్యనామము గలదు. వీరిలో 'ఇస్రాయేల్' అనబడు ఉపజాతికి చెందిన 'మోలోక్'నకు 'మోలోక్‌యహ్వే' లేక

'మోలోక్ యవా' అనిపేరు. కాలక్రమమున ఇస్రాయేల్ అను ఉపజాతి తక్కిన ఉపజాతులను జయించి, వారి 'మోలోకు'లను నాశనముచేసి, తమ 'మోలోక్'ను అన్నిటిలో శ్రేష్ఠతమమని ప్రకటించిరి. మతము పేరిట గావింపబడిన ఈ యుద్ధములవలన ఎంతటి రక్తపాతము, ఎంతటి పరహింస, ఎంతటి ఘోరదౌర్జన్యము సంఘటిల్లెనో మీరు సులభముగా ఊహించుకొనవచ్చును. ఆ పిమ్మట కొంతకాలమునకు "మోలోక్ యహ్వా" యొక్క ఆధిపత్యమును నాశముచేయవలయునని బాబిలోన్ జాతివారు ప్రయత్నించిరి. కాని విజయము నొందజాలక పోయిరి.

మతవిషయములలో ఆధిక్యముకొఱకు, ఇట్టి ఉపజాతి యుద్ధములు హిందూదేశపు సరిహద్దులలోకూడ జరిగియుండునని నాకు తోచుచున్నది. ఇక్కడకూడ, ఆర్యులలోని ఆయా ఉపజాతులవారు తమతమ దేవతలను శ్రేష్ఠులుగా ప్రకటించుకొఱకై తమలోతాము యుద్ధములు చేసియుందురు. కాని, హిందువులచరిత్ర యూదులచరిత్రవంటిది కాక వేఱొకరూప మొందవలసియుండెను. సమస్తదేశములందును భారతదేశము ఒక్కటే శాంతిభూమియును, ఆధ్యాత్మికక్షేత్రమునునై భావికాలమున ప్రకాశింప నుండుటచే, ఆ ఉపజాతుల పోరాటములును, వారి దేవతల యుద్ధములును, చిరకాలము సాగియుండలేదు. ఇంతవఱకు ఈ పుడమిపై జన్మించిన మహర్షిశ్రేష్ఠులలో శ్రేష్ఠుడు— ఆ అతిప్రాచీనకాలమునందే, చరిత్రకు తెలియని ఆ అజ్ఞాతయుగమునసే, యుగయుగములుగా వచ్చుచున్న సంప్రదాయములు సైతము ఊరక తొంగిచూచుటకేని సాహసింపని ఆ తమోమయ కాలారంభమున నే—ఈ కర్మభూమిపై ప్రభవించి "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" (ఉన్నదొక్కటే, దానినే జ్ఞానులు అనేకవిధములుగా పేర్కొనుచున్నారు) అని ప్రవచించియున్నాడు. మానవముఖమునుండి ఇంతవఱకు బహిర్గతమైన వాక్యములలో

ఇంత ఉదాత్తమైనది మఱియొకటిలేదు. మన హైందవజాతీయ జీవితమునకు ఈ సత్యమే మూలాధారముగా నిలిచియున్నది. మన జాతీయజీవితమునందు అనేక శతాబ్దములుగా 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అనెడు మహాభావము పరంపరాగతమై వచ్చుచున్నది. అది విస్ఫురణము గాంచుచు మన జాతీయజీవితము నంతను ఆవరించినది; మనరక్తములో ఇంకిపోయినది; మనతో సారూప్యము పొందినది. ఆ మహాసత్యము మన ప్రతిరక్తనాళము లోను ప్రవహించుచు, ప్రియముగొలుపుచున్నది. అందువలననే మనదేశము మతసహనమునకు పట్టుగొమ్మయై లోకవిఖ్యాతి నార్జించినది; మన మతమును ఖండించి నాశనము చేయుటకు వచ్చియున్న అన్యమతములకు మసీదులను, చర్చిలను మన సంస్కృతి నిర్మించియిచ్చినది ఇక్కడనే, ఈ దేశముననే! లోకము మననుండి నేర్చుకొనుటకు నిరీక్షించుచున్న మహాధర్మ సూత్రము ఇదియే. అబ్బా! దేశాంతరములందెంతటి అసహన మున్నదో మీకు తెలియదు!! ఈ మతద్వేషము కారణముగా నా అసువులను పరదేశములపాలు చేయవలసివచ్చునని నాకనేక పర్యాయములు తోచినది. మతముపేరిట సోదరుని వధించుట వారికి అత్యల్పవిషయము. ఈనాడు వారొకవేళ ఇట్టి నరహత్య లకు తలపడకున్నను, రేపు పాశ్చాత్యనాగరికతాకేంద్రమగు మహాపట్టణపు నడివీథులందే వారా పనిచేయవచ్చును. పాశ్చాత్య దేశములలో ఎవ్వడైనను తమదేశ మంగీకరించిన మతమునకు విరుద్ధముగా ఒక్కమాట పలికెనా, మహాభయంకరమగు బహిష్కారాయుధము వానినెత్తిమీద పడినదన్నమాటే! వారు మన కులాచారములను విమర్శించుచు ధారాళముగా, చొరవగా, వానిని ఖండింతురు. కాని పాశ్చాత్యదేశములందలి మహాపండితా గ్రేసరులు సయితము ప్రజాభిప్రాయమునకు భీతిల్లి మతవిషయము లలో తాము సత్యమని విశ్వసించు దానిలో శతాంశమైనను బయటబెట్టుటకు సాహసింపక వట్టి పిఱికిపందలవలె పడియుందురు.

నావలె ఆ దేశములకుపోయి కొంతకాలము నివసించుచో మీకును ఈ విషయము తేటతెల్లమగును.

కాబట్టి లోకవ్యాప్తముగా మతసహనధర్మము ప్రతిష్ఠింపబడవలెనని ప్రపంచము ఆరాటపడుచున్నది. అది నాగరికతకే ఒక మహావరప్రసాదము! ఈ భావమును గౌరవింపని నాగరికత చాలకాలము నిలువజాలదు. మూర్ఖావేశము, రక్తపాతము, దౌర్జన్యము ఆగిపోకున్నచో, ఏ నాగరికతగాని అభివృద్ధినందదు. మనయెడల ఇతరులు ఔదార్యమును జూపగోరుదుమేని, ఇతరుల మతవిశ్వాసములయెడల సహనము, ఔదార్యము, దాక్షిణ్యము ముందు మనము చూపవలయును. ఇంతేకాదు; ఇతరుల మత విశ్వాసములును, భావములును ఎంత భిన్నముగా నున్నను వారియెడల సహనము చూపుటేగాక, ప్రత్యక్షముగా హృదయపూర్వక సహకారమును సయితము ఒసంగవలయునని ప్రపంచ ప్రజలెల్ల గ్రహింతురుగాక. భారతదేశములో మనము చేయుచున్నది సరిగా అదియే. ఇక్కడ, ఈ భారతదేశములోనే, క్రైస్తవులకు చర్చీలను, మహమ్మదీయులకు మసీదులను కట్టిపెట్టినాము; ఇంకను కట్టిపెట్టుచున్నాము. మనము చేయవలసినదదియే. వారెంతగా ద్వేషించినను, ఎంతగా దౌర్జన్యము చూపినను, ఎంతక్రూరులై వర్తించినను, ఎంతగా ద్రోహముచేసినను, ఎంతగా మనలను నిర్బంధించినను, ఎంతటి దూషణవాక్యములు పల్కినను, మనముమాత్రము ప్రేమచేతనే వారిని జయింపవలయును. తక్కిన వన్నియు జారిపోయినను, ప్రేమమాత్రము తుదివఱకును నిలిచియుండును; ద్వేషము నిలువజాలదు. సాధువర్తనమే చిరకాలము జీవించి, ఫలప్రదమగుటకు తగిన సత్త్వము కలది; దౌర్జన్యమునకును, హింసకును అట్టి శక్తి లేదు. ఈ సత్యమును ప్రపంచమునకు మనము రుజువుచేసిచూపువఱకును క్రైస్తవులకు చర్చీలను, మహమ్మదీయులకు మసీదులును కట్టిపెట్టుచునే యుందుముగాక!

ఆధ్యాత్మికదృష్టితోఁజూచిన ఈ జగమంతయు ఏకపదార్థ వికారమే యనెడు సనాతనదివ్యభావమే ప్రపంచము మననుండి నేర్చుకొనవలసిన రెండవభావము. ఉన్నతజాతులకంటె నిమ్న జాతులవారును, సభ్యజనులకంటె సామాన్యజనులును, చదువరుల కంటె చదువురానివారును, బలశాలురకంటె బలహీనులును, ప్రపంచమునందెల్లెడల దీనిని ఎక్కువగా కోరుచున్నారు. పాశ్చాత్త్యుల నూతనశాస్త్రపరిశోధనలు స్థూలసాధనలద్వారా విశ్వమంతయు ఒక్కటిగా, అఖండముగా నున్నదని ఋజువుచేయు చున్నట్లు మదరాసు విశ్వవిద్యాలయ పట్టభద్రులకు, విద్యార్థులకు, నేనీనాడు చెప్పనక్కఱలేదు గదా. స్థూలదృష్టితో మాట్లాడి నచో, మీరును, నేనును, ఈ సూర్యచంద్రనక్షత్రములును జడ ద్రవ్యమనెడు ఒకానొక అఖండసముద్రమధ్యమున చిన్నిచిన్ని తరంగములవలె నున్నారమనియే చెప్పవలెను. ఇట్లే 'శరీరము', 'మనస్సు' అనునవి సైతము ఆ సమష్టిమహాసముద్రమునందలి చిన్నతరంగములకు పెట్టినపేళ్లు మాత్రమే అని భారతీయుల వేదాంతశాస్త్రము పెక్కుయుగములకు పూర్వమే ఋజువుచేసి యున్నది. ఈ వేదాంతము ఇంకొక అడుగు ముందుకు పోయి, ఏకమై చూపట్టు ఈ విశ్వమంతటికి వెనుక, అద్వితీయమై, సర్వాధారమై, సత్యాత్మ వెలయుచున్నదని ప్రకటించినది. ఈ జగమంతటను విస్తరించి ఒక్కపరమాత్మయే కలదు. ''ఏకమేవాద్వితీయం''. ఈ విశ్వమంతయు సత్యమగు తాత్త్వికదృష్టిలో అభిన్నమే యనెడు మహాభావము ఈ దేశమునగూడ అనేకులను భీతిలజేయుచున్నది, ఈనాడు సైతము దీనిని ఆమోదించువారి కంటె, నిరాకరించువారే హెచ్చుమంది కలరు. ఐనప్పటికిని, ప్రపంచము ఈ దివ్యభావముకొఱకే పరితపించిపోవుచున్నది; భారతదేశమున నోరులేని ప్రజలు తమ్ము ఉద్ధరించునని దీనిపై ఆశాదృష్టులు ప్రసరించుచున్నారు. ఈ సిద్ధాంతమును దైనందిన

జీవితమున ఆచరణలో పెట్టుకున్నచో ఈ దేశమును పునరుద్ధరించుటకు మఱియొక మార్గము లేదు.

తార్కికశీలురగు పాశ్చాత్యులు తమ తత్త్వసిద్ధాంతములును, నీతిసూత్రములును ఎంతవఱకు తర్కసంబద్ధములుగా, యుక్తియుక్తములుగా నున్నవో కనుగొనుటకు ఇప్పుడు గట్టిగా పూనుకొనుచున్నారు. ఒక పురుషుడు ఎంతటి ఘనుడైనను, ఎంతటి మహాత్ముడైనను, వాని ఒక్కని ఆమోదము పడసిన మాత్రమున నీతిశాస్త్రమునకు పరమప్రామాణ్యము కలుగబోదని మీకందఱకు తెలిసియేయున్నది. నీతిసూత్రములకు ఏ ఒక్కని ప్రమాణముగా చూపిన మాత్రమున, ప్రపంచమునందలి ఉత్తమ జిజ్ఞాసువులెవ్వరును అంగీకరింపజాలరు. తమ నీతిసూత్రములకును, ధర్మశాస్త్రములకును ప్రామాణ్యమును సమకూర్చుటకు మానవుని అంగీకారముకంటె గొప్పదేదియో ఇంకొకటి ఉండితీఱవలెనని వారు కోరుదురు. నీతిశాస్త్రమునకు ప్రమాణముగా ఏదేని సనాతనధర్మసూత్రము కావలెనని వారు అభిలషింతురు. సరే; నీలోను, నాలోను, అందఱిలోను, ఆత్మలోను, జీవునిలోను, నిండియున్న ఆ అఖండబ్రహ్మమునకంటె సర్వోత్తమప్రమాణ మింకేముండును? ఆత్మయొక్క అఖండాద్వితీయత్వమే సమస్త నీతిధర్మమునకును, శాశ్వతాధారమయి వెలయుచున్నది. మీరును నేనును సోదరులమని మాత్రమే భావనచేయుట చాలదు. మీరును నేనును వేఱుగాక నిజమునకు 'ఒక్కరమే' అని తెలిసికొనవలయును. హిందూతత్త్వశాస్త్రము ఇట్లే పలుకుచున్నది. ఈ అద్వైతభావమే సమస్తనీతులకును, సర్వపారమార్థికసిద్ధాంతములకును పునాది. పరతంత్రమై కృశించిపోవుచున్న యీ భారతదేశమేకాక యూరపుఖండము సయితము, ఈనాడు అద్వైతమును కోరుకొనుచున్నది. ఈ దివ్యసూత్రము బాగుగా ప్రస్ఫుటముగాకున్నను, ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికాలలో తలయెత్తుచున్న నూతన రాజకీయ సాంఘికోద్యమములకు మూల

కారణమై యున్నది. మిత్రులారా, నా వాక్కులను గమనింపుడు. స్వాతంత్ర్యము కొఱకును, సర్వమానవవిముక్తి కొఱకును మానవజాతి యొనర్చు తీవ్రప్రయత్నములను వివరించు వాఙ్మయమునందంతటను, భారతీయవేదాంతాదర్శములు ప్రస్ఫుటములై గోచరించుచుండును. కొందఱు గ్రంథకర్తల విషయములో, వారి అంతర్యప్రేరణమునకు ఆధారమేమో వారికి తెలియకున్నది. మఱికొందఱు తామేదో అపూర్వకల్పనము చేసినట్లు స్వతంత్రప్రజ్ఞ ప్రకటించినట్లు నటింపజూచున్నారు. కాని ఆ మూలాధారమును ప్రకటించి, దానికి తమకృతజ్ఞతను తెలుపుకొనిన ఉచితజ్ఞులు కొలదిగా లేకపోలేదు.

అమెరికాలో ఉన్నప్పుడు నేను అద్వైతమునే అత్యధికముగను, ద్వైతమును అత్యల్పముగను బోధించుచుంటిననెడు ఆక్షేపణను ఒకతఱి వింటిని. పూజాసంసేవనాపరములగు ద్వైతభక్తిసిద్ధాంతములందు ఎంతటి మహిమగలదో, ఎంతటి భక్తిరాసులు గలవో, ఎటువంటి అఖండపారవశ్యమునుగూర్చు దివ్యానందవిభూతులు గలవో అనుభవమునుబట్టి నే నెఱుగుదును. కాని అట్టి ఆనందములోనైనను బాష్పములు విడుచుటకు మనకిది తరుణముకాదు. ఇదివఱకే కావలసినంత కన్నీరు కార్చి యున్నాము. మెత్తదనము చూపుటకు మనకింక అవకాశము లేదు. మనము దూదిపింజలవలె మెత్తబడి ప్రాణములు సైతము కోల్పోవువఱకు ఈ మెత్తదనము మనలను వెంటాడివచ్చినది. మనదేశమున కిప్పుడు కావలసినవి అప్రతిహతమగు ఇనుపకండరములు, ఉక్కునరములు, వజ్రసంకల్పము! మహాసముద్రాంతర్భాగమున అట్టడుగునకు మునుగవలసివచ్చినను, ముఖాముఖిని మరణముతో పోరాడవలసివచ్చినను, జంకక ఏ రీతినైనను జగద్రహస్యముల నెల్ల భేదింపగలది దృఢసంకల్పము. మనకిప్పుడు కావలసిన దదియే. అద్వైతాదర్శమును, అనగా సర్వమును

ఏకమనెడు భావమును అర్థముచేసికొని అనుభవమునకు తెచ్చుకొనుటద్వారా అభేద్యములగు దైహిక మానసికశక్తులను సాధించుటయే మనకిప్పుడు కర్తవ్యము. విశ్వాసము! విశ్వాసము! ఆత్మవిశ్వాసము! ఈశ్వరునందు విశ్వాసము!! ఈ విశ్వాసమే ఔన్నత్యమునకు కీలకము!! పురాణోక్తములగు ముప్పదిమూడు కోట్ల దేవతలందును, అప్పుడప్పుడు విదేశీయులువచ్చి మీయెదుట నిలబెట్టిన లెక్కలేని చిల్లరదేవతలన్నింటియందును మీరు విశ్వాసముంచినను, మీయందు మీకు విశ్వాసము లేనియెడల, అనగా మీకు ఆత్మవిశ్వాసము సున్నయైనచో, ఇప్పుడేకాదు ఎప్పటికిని మీకు ముక్తిలేదు, లేదు, లేదు. మీలో మీకు గాఢవిశ్వాసము కుదురవలెను. ఆత్మవిశ్వాసముతో రొమ్ము విరిచి నిలబడవలెను. అదే మనకిప్పుడు కావలసినది. మనము ఇద్దఱమా ముగ్గురమా, ముప్పదిమూడుకోట్ల ప్రజలముగదా! ఏ పదుగురు పరదేశీయులో గడచినవేయి సంవత్సరములుగా దౌర్జన్యముతో, రాక్షసత్వముతో, మనలను కాలరాచి మనపై ప్రభుత్వము చెలాయించుట ఎట్లు సంభవించినది? వారికి ఆత్మవిశ్వాస మున్నది; మనకు లేదు. ఇదియే కారణము! పాశ్చాత్య దేశములందు నేను కనుగొనిన విషయమొకటికలదు: నరుడు పతితుడై, నిరాశోపహతుడై పరమపాపియైపోయెనని క్రైస్తవమత బోధకులు ఎంత ప్రచారము గావించుచున్నను యూరపులోను, అమెరికాలోను, వారి జాతీయ హృదయాంతరాళమునందు మాత్రము ఆత్మవిశ్వాసముయొక్క మహాద్భుతశక్తి సుప్రతిష్ఠితమై యున్నది. ఇంగ్లండులో ఒక చిన్నపనివాడుసైతము "నేను ఇంగ్లీషువాడను, నేనేమైనను చేయగలను" అని మీతో సగర్వముగా చెప్పును. అమెరికాలో, యూరపులో, ఎక్కడైనను ఇంతే. వారికి ఆ ఆత్మవిశ్వాసము, ధైర్యసాహసములు ఉగ్గుపాలతో వచ్చును. ఇక్కడ మనబాలురో, క్రొత్తవారితో అసలు నోరు విప్పి మాట్లాడగలరా? లేదులేదు. పోనీ, బాలురసంగతి అటుండ

నిందు; మనపెద్దలు సైతము అట్లు పలుకగలరా? మనకు ఆత్మ విశ్వాసము పూర్తిగా లోపించినది. దానిని పునరుజ్జీవింప జేయ వలెను. అట్లు చేయగలిగినది అద్వైతసిద్ధాంత మొక్కటే. మానవుల హృదయములను మేల్కొలిపి, వారి ఆత్మప్రభావమును వారికి తెలుపవలెనన్నచో, వేదాంతములోని అద్వైతపక్షమును వారికి బోధించుట ముఖ్యావశ్యకము. ఆ కారణముచేతనే నేనీ అద్వైతబోధకు గడంగితిని. నేను పాక్షికదృష్టితో అటుల చేయుటలేదు. విశ్వజనీనములును, సర్వజనాంగీకార్యములునగు ఉద్దేశములను ఆధారము చేసికొనియే నాబోధలను సాగించు చున్నాను.

ద్వైతికిగాని, విశిష్టాద్వైతికిగాని ఆక్షేపణయుండని సమాధానమార్గము కనుగొనుట సులభమే. భగవంతుని దివ్యాంశము సమస్తవస్తువులందును వ్యాపించియుండుననెడు సిద్ధాంతమును అంగీకరింపని సంప్రదాయము ఒక్కటేనియు భారత దేశమున కానరాదు. ప్రతివేదాంత సంప్రదాయమును పవిత్రత, పరిపూర్ణత, సత్యము, జీవాత్మయందు పూర్తిగా కలవని ఒప్పు కొనుచున్నది. కొందఱి అభిప్రాయముననుసరించి ఈపరిపూర్ణత ఒక్కొక్కప్పుడు 'సంకోచము' పొందుచు, ఇంకొకప్పుడు తిరిగి 'వికాసము' పొందుచునుండును; కాని అది సర్వదా ఉంటియే యున్నది. అద్వైతమతానుసారము, అది సంకోచమునుగాని వికాసమునుగాని పొందుటే లేదు. కాని మరల మరల వ్యక్తమగుచు అవ్యక్తమగుచు నుండును. ఎట్లున్నను పర్యవసానమున ఒక్కటే. ఒక విధముగా చెప్పుట మఱియొక విధముగా చెప్పుట కంటె లెక్కసమ్మతముగా నుండవచ్చును. కాని పర్యవసానమున రెండుసిద్ధాంతములును దాదాపుగా ఒకటియే యగును. ఈఒక్క కేంద్రభావమే ప్రపంచమునకు ఆవశ్యకముగా ఉన్నది. ఇతర దేశము లన్నిటికంటెను మన మాతృభూమియందు దీని ఆవశ్యకత ఎక్కువగా కనబడుచున్నది.

మిత్రులారా, ఇప్పుడు మీకు అప్రియముగా తోచుకొన్ని యథార్థవిషయములను చెప్పవలసి యున్నది. మన దరిద్రసోదరు లలో నెవడేని ఒక ఆంగ్లేయునిచే అవమానింపబడినప్పుడుగాని, హత్యజేయబడినప్పుడుగాని దేశమెల్ల ఎట్లు గగ్గోలు పెట్టునో వార్తా పత్రికలలో నేను చదువుచుందును. నేను చదువుదును, దుఃఖిం తును. ఆ మఱుక్షణమే, దీని కంతకును బాధ్యులెవరు అను ప్రశ్న నామనస్సునకు తట్టును. వేదాంతి నగుటచేత ఆప్రశ్నను నాకు నేను వేసికొనక తప్పదు. హిందువు అంతర్దృష్టిగలవాడు. అతడు సర్వవిషయములను తనలోనే, తన ద్వారానే, సాక్షిదృష్టితో చూడనెంచును. కాబట్టి బాధ్యులెవరు అని నన్ను నేను ప్రశ్నించు కొందును. 'ఆంగ్లేయులు కారు' అను సమాధానమే ప్రతిసారియు అంతర్వాణి చెప్పుచుండును! నిజము; వారు బాధ్యులుకారు! మన దౌర్భాగ్యమున కంతకు, మన పతనమున కంతకు బాధ్యత మనదే. సర్వమునకు మనమే బాధ్యులము. మన పూర్వులలో ఉత్తమకులీనులు ఇతరసామాన్యజనులను కాల ద్రొక్కి నేలరాచి నారు; వారిని దిక్కులేని వారినిగా చేసినారు. ఈ హింసలవలన ఆ నిర్భాగ్యులు తాము మానవజీవులమను మాటయే దాదాపుగా మఱచిరి. ఇట్లు అనేక శతాబ్దముల కాలము, గతిలేక, వారు కట్టెలు కొట్టియు, నీళ్లు మోసియు, చెప్పులుకుట్టియు, కూలినాలి చేసికొనియు ఎట్లో బ్రతుకులు కొనసాగించిరి. తాము సేవకులుగా, బానిసలుగా జన్మించితిమని భావించి వారల్లే దుర్భర దారిద్ర్య మును, అవమానమును భరించుచు కాలము వెళ్లబుచ్చిరి. ఈ కాలపు విద్యాధికతను గూర్చి మనమేదో గొప్పగా చెప్పుకొను చున్నాము. కాని, యీ దౌర్భాగ్యజీవులపై దాక్షిణ్యము వహించి ఎవ్వడేని వారి నుద్ధరింప యత్నించుచున్నప్పుడైనను, ఈ విద్యాధికులు ముందుకువచ్చి అట్టివారితో సహకరింపరు. ఇంతయేకాదు. ఈ దీనజనులను ఇంకను ఎక్కువగా హింసించి పీడించుకొఱకు, పాశ్చాత్యుల "వంశపరంపరా సిద్ధాంతము"ను,

అట్టివే మఱికొన్ని అసంబద్ధ సూత్రములను ప్రోవుచేసి నానావిధ పశువాదములను, రాక్షసతర్కములను సలుపుచుండుట నేను కనుగొనుచున్నాను. అమెరికాలోని మతమహాసభకు ఒక యువకుడు, నీగ్రోజాతివాడు — సౌతాఫ్రికా నీగ్రోజాతివాడు— ఇతరులతో కలసి వచ్చియుండెను. అతడొక దివ్యోపన్యాసము కూడ చేసినాడు. ఎట్లో నాకా యువకునియందు అభిమానము గలిగినది. అప్పుడప్పుడు వానితో మాట్లాడెడి వాడను. కాని అతడెవరో నేను తెలిసికొనలేకపోయినాను. కాని, ఇంగ్లాండులో ఒకదినమున కొందఱు అమెరికనులను కలిసికొంటిని. వారునాతో చెప్పినదిది : ఆ పిల్లవాడు ఆఫ్రికామధ్యభాగమున నివసించు ఒక నీగ్రోజాతి నాయకుని కొడుకు. ఒక దినము వేఱొక నాయకుడు ఈ పిల్లవాని తండ్రిపై ఆగ్రహముపూని వానిని వధించెను. వానినే కాదు, తల్లినిగూడ నఱికివేసెను. శత్రువులు వారి కళేబరములను వండుకొని తినిరి. విరోధినాయకుడు ఈ పిల్లవానినికూడ చంపివేయవలయుననియు, వండి తినవలయుననియు ఉత్తరువుచేసినాడట. కాని ఈ పిల్లవాడు ఎట్లో తప్పించుకొని పాఱిపోయినాడు. అనేక కష్టములుపడి, వందలకొలది మైళ్లు ప్రయాణముచేసి, సముద్రతీరము చేరినాడు. ఒక అమెరికా ఓడవారు వీనిని తమనౌకలో నెక్కించుకొని, అమెరికాకు తీసికొని వచ్చిరి. ఆ చక్కని ఉపన్యాసము చేసినది ఈ పిల్లవాడే! అది తెలిసిన పిమ్మట, మీ వంశపరంపరా సిద్ధాంతమునుగూర్చి నేనేమి అభిప్రాయపడవలసి యుండునో విచారింపుడు!

ఓ బ్రాహ్మణులారా, బ్రాహ్మణుడు పారంపర్యధర్మము చేతనే మాలవానికంటె హెచ్చు బుద్ధివైభవము కలవాడైయుండు నెడల, బ్రాహ్మణుని చదువుకొఱకు ఇక డబ్బు ఖర్చుచేయవలదు. దానినంతయు మాలవారి కొఱకే ఖర్చుచేయుడు. ఆ దుర్బలులకే దానముచేయుడు. అది వారికేకదా అవసరము. బ్రాహ్మణుడు

బుద్ధికుశలత గలవాడుగనే పుట్టినెడల, ఆతడు ఇతరుల సాహాయ్యములేకుండ తనంతట తానే విద్యను ఆర్జించుకొనగలడు. ఇతరులు బుద్ధికుశలత లేనివారైన యెడల, వారి విద్యాశిక్షణకై తగు ఉపాధ్యాయులను ఏర్పాటుచేయుడు. నాకు తెలిసినంతవరకు ఇది న్యాయముగను సహేతుకముగను కాన్పించుచున్నది. ఈ దీనజనులు, ఈ పీడితసోదరులు, ఈ ఆజన్మదరిద్రులుతమ యథార్థ తత్త్వమును తెలిసికొనవలసియున్నది. బలవంతులకు బలహీనులకు అండయై, ఉత్తములకు నీచులకు ఆధారమై, ప్రతివానియందును ఒక్క అఖండాత్మయే ప్రకాశించుచున్నది. యోగులును మహర్షులును అగుటకు తగిన అనంతావకాశమును, అఖండశక్తియు, అందఱి యందును కలవు. ప్రతి స్త్రీయును, ప్రతిపురుషుడును, ప్రతిబాలికయును, ప్రతిబాలుడును, జాతిభేదములేక, జన్మభేదములేక, సుబల దుర్బలతారతమ్య విచారణలేక, విశ్వమానవకోటియంతయు దీనిని ఆలకించి యోచనచేయునుగాక. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత!" 'లెండు, మేల్కొంచుడు, పరమార్థము చేరువఱకు ఆగకుడు' అని ప్రతిజీవికిని చాటిచెప్పుదుముగాక! "లెండు! మేల్కొనుడు! దుర్బలతనుండి, సమ్మోహమునుండి తెప్పఱిల్లుడు." నిజముగా ఎవడును దుర్బలుడు కాడు! ఆత్మ అఖండము; సర్వశక్తిమంతము; సర్వజ్ఞము. లేచి నిలబడుడు! మీ స్వస్వరూపమును ప్రకటింపుడు! మీలోనున్న బ్రహ్మమును ప్రకాశింపజేయుడు! వానిని నిర్లక్ష్యము చేయకుడు! మితిమీఱిన సోమరితనము, మితిమీఱిన దౌర్బల్యము, మితిమీఱిన మోహజాలము, శనిదేవతవలె మన నెత్తిపై నెక్కి చిందులు త్రొక్కుచున్నవి. ఓహో! నవభారతపుత్రులారా! మీ సమ్మోహమును విదిల్చివేసికొనుడు. దానికి వలయు మార్గము మీశాస్త్రములందే కలదు. మీ సత్య స్వరూపమును మీరు తెలిసికొనుడు. ప్రతివానికిని వానిస్వస్వరూపము బోధింపుడు. నిద్రలో పడియున్న జీవుని ఎలుగెత్తిపిలువుడు. ఓహో! ఆతడెటుల మేల్కొనునో మీరేచూడగలరు. ఆ సుప్తజీవి

మేల్కాంచి, స్వస్వరూపజ్ఞానముతో కార్యపరుడగునప్పుడు ఆతనికి శక్తివచ్చును ; తేజము వచ్చును ; శుభము గలుగును ; పవిత్రతయు వచ్చును. ఉత్కృష్టమగునదెల్ల అతనిని వరించును. ఆహా! గీతలోనాకు అత్యంత ప్రియమైన శ్లోకములు రెండు కలవు. అవి శ్రీకృష్ణభగవానుని ప్రబోధమునకు సారమై, ముఖ్యపర్యవసాన మైనట్లు నాకు స్పష్టముగా గోచరించుచున్నవి :

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం ।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం ।
న హిన స్త్యాత్మనాఽత్మానం తతో యాతి పరాంగతిం ॥

(XIII-౨౭-౨౮)

అనగా సకలభూతములందును సమముగా నిలుచు పరమే శ్వరుని, అశాశ్వతపదార్థములందుగల శాశ్వతబ్రహ్మమును చూచువాడే సత్యముగా "తెలిసినవాడు". సర్వత్ర సమభావ ముతో నుండు పరమేశ్వరుని చూచువాడు, ఆత్మను ఆత్మచేత హింసింపడు గావున, అతడు పరమగతిని, అనగా మోక్షమును పొందుచున్నాడు.

ఈ విధముగా చూచిన యెడల, ఇక్కడనేగాక దేశదేశాం తరములందుసైతము ధార్మికపునరుజ్జీవనోద్యమము సాగించు నవ కాశము వేదాంతమునకు కలదని స్పష్టమగుచున్నది. పరమేశ్వ రుడు సర్వత్ర సమముగా వ్యాపించియున్నాడు. నేడీ యద్భుత భావమును మానవజాత్యుద్ధరణమునకై ఇచ్చుటను, ఇతరదేశము లందును ప్రచారము గావింపవలసియున్నది. మన శాస్త్రములు చెప్పినటుల ఎచ్చటెచ్చట కీడుగలదో, ఎచ్చటెచ్చట జ్ఞానము కొఱవడినదో, ఎచ్చటెచ్చట అజ్ఞానము ప్రబలినదో, అదియెల్ల భేదభావముననుసరించి కలుగుచున్నదనియు, ఎచ్చటెచ్చట మేలు

కలదో అదియెల్ల సమత్వమునందును సర్వభూతముల ఏకత్వము నందును, అభిన్నత్వమునందును గల విశ్వాసమువలన చేకూరు చున్నదనియు అనుభవపూర్వకముగా నేను తెలిసికొంటిని. ఇదియే వేదాంతము బోధించు పరమాదర్శము. ఆదర్శమును గ్రహించుట ఒక విషయము ; దానిని అనుదినజీవితమునందు సర్వత్ర అనుష్ఠించుట వేఱొకవిషయము. ఆదర్శమును చూపుట చాలమంచిదే. కాని, దానిని సాధించుటకు ఆచరణయోగ్యమగు మార్గమేది?

అనేక శతాబ్దములనుండి మనప్రజల మనస్సులలో ప్రధానముగా కాన్పించుచున్న క్లిష్టమును, బాధాకరమును, అగు కులభేద సమస్యయు, సంఘసంస్కరణ సమస్యయు, మనలను ఈసందర్భమున ఎదుర్కొనుచున్నవి. నేను మర్మము విడచి చెప్పుచున్నాను. నేను కులవిధ్వంసకుడను కాను ; కేవల సంఘసంస్కర్తను కాను. మీ కులభేదములతో కాని, మీ సంఘసంస్కారములతో కాని ప్రత్యక్ష సంబంధము నాకేమియు లేదు. మీరు మీ కిష్టమైన కులమున నుండుడు. అంతమాత్రమున మీరు వేఱొక వ్యక్తినిగాని కులమునుగాని ద్వేషించుటకు కారణము లేదు. ప్రేమను—ప్రేమను మాత్రమే — నేను బోధింతును. విశ్వాత్మ యొక్క అభిన్నత్వమును సర్వవ్యాపకత్వమును ప్రతిపాదించు వేదాంతసత్యము నాధారముచేసికొని నా ప్రబోధమును సాగింతును. దాదాపు నూఱుసంవత్సరములనుండి మనదేశము సంఘసంస్కర్తలతోను, నానావిధ సంఘసంస్కరణ తీర్మానములతోడను, ఉక్కిరిబిక్కిరియై ఉట్టూతలూగిపోవుచున్నది. ఈ సంస్కర్తలయందు నామట్టుకు నాకు దోషములు కాన్పించుటలేదు. వారిలో చాలమంది యోగ్యులే ; మంచి ఉద్దేశములు గలవారే. కొన్నివిషయములలో వారిలక్ష్యములు కూడ చాల మాననీయములే. కాని ఈ నూఱుసంవత్సరముల సంఘసంస్కరణ ప్రచారము ఈదేశమం దెక్కడను ప్రశంసనీయముగ సుస్థిర గణనీయఫలితార్థమును

సాధించియుండలేదు. ఉపన్యాసవేదికలమీద వేనవేలుగా ప్రసంగములు చేసినారు. హైందవజాతిని, హైందవనాగరికతను తూర్పారబట్టి, వానితలపై ఖండనగ్రంథముల నెన్నియో కురిపించినారు. ఐనను చెప్పుకొనదగినంతగా కార్యరూపము తాల్చిన ఫలితార్థమేదియు లేదు. దీనికి కారణ మెక్కడనున్నది! ఆ కారణము కనుగొనుట అంత కష్టముకాదు. ఖండనోద్రేకమునందే ఆ కారణముకలదు. నే నిదివఱకు చెప్పినటుల ఒక మహాజాతిగా చరిత్రప్రసిద్ధులమైన మనము మన శీలమును ఆత్మధర్మమును సురక్షితముగా నుంచుకొనుటకు మున్ముందుగా ప్రయత్నింపవలయును. ఇతర జాతులవలన మనము నేర్చుకొనదగినవి చాలవిషయములు కలవనియు, అన్యులనుండి మన మనేకపాఠములు నేర్వవలయుననియు, నే నంగీకరింతును. కాని మన నవీనసంఘసంస్కరణవిధానములు పాశ్చాత్యపద్ధతులకు, కార్యోపాయములకు చాలవఱకు అంధానుకరణములుగానే సాగుచున్నవి. అందువలననే ఇటీవలి సంస్కరణోద్యమములు ఫలశూన్యములగుటతటస్థించినది.

ఇంకొక విషయమును కలదు. కేవలఖండనము ఎప్పుడుగాని శ్రేయోదాయకముకాదు. మన సంఘములో దోషములు కలవని పసిపిల్లవానికి కూడ తెలియును. సరే. దోషములు ఏ సంఘమున లేవు? లోకములో నేను కలసిమెలసి తిరిగి కనుగొనిన ఆయా జాతులను ఉపజాతులను సరిపోల్చిచూడగా, మొత్తముమీద మనదేశప్రజలే మిక్కిలి నీతిపరులనియు, అత్యంత భక్తిపరాయణులనియు, మన సంస్థలే — వాని యేర్పాటునుబట్టి చూచినను, వాని గమ్యార్థమునుబట్టి చూచినను — మానవజాతి అభ్యుదయమునకు బాగుగా తోడ్పడుననియు నేను నిర్ధారణ చేసికొంటినని అస్మద్దేశీయులారా, ఈ తరుణమున మీకు చాటి చెప్పుచున్నాను. కాబట్టి మనసంఘమునం దెట్టి పునర్నిర్మాణమును నేను కోరుటలేదు. వృద్ధి, వికాసము, జాతీయవిధానముల ననుస

రించు పురోగమనము నా ఆదర్శమైయున్నది. నా దేశముయొక్క పూర్వచరిత్రను తడవి చూచునప్పుడు, మానవబుద్ధివికాసమునకు ఇంతగా తోడ్పడిన దేశము ఈ ప్రపంచములో వేఱొకటి నాకు కానవచ్చుటలేదు. కాబట్టి నా జాతిని దూషించుటకు నాకు నోరాడదు. నేను మనవారితో 'మీరుచేసినది బాగున్నది; ఇంకను బాగుగా వర్తించుటకు ప్రయత్నింపుడు' అనియే చెప్పుదును. ఈదేశములో పూర్వకాలమున మహాకార్యము లెన్నియో చేయబడినవి; ఇంకను ఘనతరకార్యములు చేయుటకు వ్యవధియు అవకాశమునుగూడ కలవు. మనము ఎట్లును కదలక నిలిచియుండ జాలమని మీ రెఱుగుదురుకదా! మన మట్లు కదలకుండ నిలిచియుంటిమేని, మనకు మరణమే సంభవించును. మనము ముందునకు సాగిపోవలయును; లేదేని వెనుకకైనను పోవలయును. అభివృద్ధిని పొందవలయును; లేదా క్షీణింపవలయును. మనపూర్వులు మునుపు మహాకార్యములను చేసియున్నారు; అయినను మన మింకను పూర్ణతరజీవనమును సాధించి, వారి ఘనకార్యములను అన్నింటిని దాటిపోవలయును. కావున, మనము వెనుకకుపోయి క్షీణించు టెట్లు? అది యెన్నటికిని పొసగదు. ఎన్నడును అట్లు కాకూడదు. వెనుకకుపోయినయెడల జాతి క్షీణించి నాశనమై పోవును. కాబట్టి మనము ముందునకేపోయి, యింకను ఘనతరకార్యములను సాధింతుముగాక. నేను మీకు చెప్పవలసినది అదియే.

ఎట్టి తాత్కాలికపు సంఘసంస్కరణమును నేను బోధించువాడను కాను. నేను దోషములను సవరింప ప్రయత్నించుట లేదు. మీరు ముందుకు సాగిపోవుచు, మన పూర్వులచేత నిర్దిష్టవిధమున నిర్మింపబడియున్న మానవపరిణామపథకమును ప్రత్యాహారణమువలన పూర్తి గావింపుడని మాత్రమే విజ్ఞప్తి చేయుచున్నాను. మానవజాతియొక్క ఏకత్వము, నరునియం దంతర్గతమై వెలుగు దివ్యాంశయు, పరమగమ్యమై వెలయు వేదాం

తాదర్శమును, ఇంకను, ఇంకను హెచ్చుగా స్వానుభవమునకు దెచ్చుకొనుటకై పాటుపడుడని మాత్రము మిమ్ము హెచ్చరించు చున్నాను. నాకు వ్యవధియేయున్న యెడల, మన మీనాడు చేయ వలసిన సర్వమును అనేకసంవత్సరములకు పూర్వమే మన ప్రాచీన స్మృతికర్తలచేత ఎట్లు నిర్ణయింపబడియున్నదో, మన జాతీయ జీవితమున సంభవించిన, ఇంకను సంభవించుచున్న, పరిణామముల నన్నింటిని ఆ నాడే వా రెట్లు ఊహించియుండిరో, వివరముగా మీకు తెలిపెడివాడను. వారుసైతము కులవైరవిధ్వంసకులే; అయి నను ఆధునికపురుషులవలెకాదు. కులభేదనిర్మూలన మనినంతనే ఊరివారందఱును కలిసి కూర్చుండి గోమాంసయుత భోజనము చేయవలయుననికాని, సారాయము సేవింపవలయుననిగాని, దేశము నందలి ఉన్మత్తులును మందమతులును అందఱును తమకిష్టమై నప్పుడు, ఇష్టమైనచోటున, ఇష్టమైనవారిని పెండ్లి చేసికొనవచ్చు ననిగాని, ఆ విధమున దేశమును ఒక పెద్ద పిచ్చివాండ్ర శరణా లయముగా మార్చి వేయవలయుననికాని, మనపూర్వులు ఆశించిన వారుకారు. మఱియు, ఒక దేశపు సౌభాగ్యము, అందలి వితంతు వులలో ఎందఱికి భర్తలు దొరకిరో అను లెక్కపై ఆధారపడు నని నమ్మినవారునుకారు. అట్టి వైభవముతో వెలిగిపోవు దేశ మెన్నడైన నుండగలదేమో చూడవలసి యున్నది!

మన పూర్వుల దృష్టిలో బ్రాహ్మణుడే ఆదర్శపురుషుడు. మన గ్రంథములన్నింటను, ఈ బ్రాహ్మణాదర్శము ప్రస్ఫుటముగా గోచరించుచుండును. యూరపులో మఠాధిపతులెల్లరును తమ పూర్వుల ఘనతను రుజువుచేసికొనుటకు, వేలకువేలు ఖర్చుపెట్టి మిక్కిలి తంటాలు పడుచుందురు. ఎచ్చటనో ఒక కొండలో కాపురముండి, దారిపోవువారిని కనుపెట్టిచూచుచు, వీలుచిక్కి నప్పుడెల్ల వారిపైబడి దోచుకొనుచు, 'సుప్రశస్తి' గడించిన ఘోర చోరాగ్రేసర చక్రవర్తియొద్దకు ఎట్లో తమ వంశమూలమును

లాగికొని పోవుచున్నను వారికి నిద్రపట్టదు. కులీనతాప్రదాతలగు ఆ మూలపురుషుల వృత్తి అంతదారుణముగానుండ, నేటి పీఠాధిపతి అట్టివారిలో ఒకనిని తన గోత్రపురుషునిగా నిరూపించుకొనుటకు సంతృప్తుడు కాజాలకున్నాడు. ఇక హిందూదేశమునందన్ననో, మహారాజులు సైతము కౌపీనధారులై కందమూలములు తిని, వేదపారాయణము చేయుచు అడవులలో నివసించుచుండిన ఏ ప్రాచీనఋషినో తమ గోత్రపురుషునిగా నిర్ధారణచేసికొనజూతురు. భారతరాజన్యులు తమ వంశవృక్ష మూలములను కనుగొనుటకై పోవునది అక్కడికి! మన గోత్రపురుషుడు ఋషియైననే, మనది ఉత్తమకులమగును. వేఱువిధముగా కాదు.

మన ఉత్తమకులీనతకు నిదర్శనము ఇతరుల నిదర్శనము కంటె భిన్నముగనున్నది. ఆధ్యాత్మికవిద్యకలిగి వైరాగ్యశీలుడగు బ్రాహ్మణోత్తముడు మనకు ఆదర్శపురుషుడు. బ్రాహ్మణాదర్శ మనగా నా అభిప్రాయమేమియో తెలియునా? ప్రపంచవిషయాసక్తిశూన్యమైన, సత్యజ్ఞానప్రపూర్ణమైన బ్రాహ్మణత్వము!! అదియే హిందూజాతికి ఆదర్శము! బ్రాహ్మణుడు రాజశాసనమునకు అతీతుడనియు, వానిని బంధించు శాసనమే లేదనియు, రాజులకు వానిపైని అధికారము లేదనియు, వానిశరీరమును ఎన్నడును హింసింపదగదనియు విధించు ప్రమాణములను మీరెన్నడును వినియుండలేదా? అది యెంతయు సత్యము! స్వలాభపరులును జ్ఞానహీనులును చేయు వ్యాఖ్యానముల ననుసరించి కాక సత్యములును, మూలానుసరణములును అగు వేదాంత భావముల ననుసరించి మీరు ఈ విషయమును అర్థముచేసికొనవలయును. బ్రాహ్మణుడనగా, స్వలాభాపేక్షను పూర్తిగా చంపుకొనినవాడును, జ్ఞానమును భక్తిప్రపత్తులను తాను సంపాదించి ఇతరులకు ప్రసాదించుటే వృత్తిగా పెట్టుకొని జీవించువాడును అని భావనచేసినయెడల, అటువంటి బ్రాహ్మణులతో—అనగా ఆధ్యాత్మికవిద్యాపరాయణు

లును నీతిమంతులును ధర్మశీలురును అగు స్త్రీ పురుషులతో —
నిండిన దేశము కలదేని, అట్టిదేశము రాజశాసనమునకు అతీతమై
యుండునని భావించుట ఒక అబ్బురమా! అట్టివారిని అదపులో
నుంచుటకు రక్షకభటులును, యుద్ధవీరులును ఆవశ్యకమా?
వారిని ఎవరేని అదపులో నుంచవలసిన అవసరము కలుగునా?
వారు ఏ ప్రభుత్వముక్రిందనేని జీవించుట యెందులకు? వారు
ఉత్తములు, పూజ్యులు, దైవాంశసంభూతులు గదా! మన ఆదర్శ
బ్రాహ్మణులు ఇట్టివారు! సత్యయుగమునందు ఒక్క-కులమే
ముండెడిదనియు, అది బ్రాహ్మణకులమేయనియు మనము చదువు
చున్నాము. సృష్టి ఆరంభమునందు ప్రపంచమంతయు బ్రాహ్మణు
లతో నిండియుండెనని మహాభారతము తెలుపుచున్నది. వారు
క్రమేణ పతితులు కాగా వేలువేలు కులములుగా చీలిపోయిరట.
యుగచక్రము తిరిగివచ్చునప్పుడు సృష్ట్యాదియందువలె అందఱును
మరల బ్రాహ్మణులగుదురు. ఈ యుగచక్రము ఇపుడు తిరిగిపోవు
చున్నది. అందుచేతనే ఆ విషయములను మీాజ్ఞప్తికి తెచ్చు
చున్నాను. కాబట్టి వర్ణసమస్యను పరిష్కారముచేయుటకై,
ఇదివరకు ఉన్నతిలోనున్నవారిని క్రిందికి దిగలాగజనదు. ఆహార
పానీయముల విషయములో హద్దుమీారి ఇష్టమువచ్చినట్లు ప్రవర్తింప
దగదు. అధికాధికముగా సుఖములను అనుభవింపవలయునని
పరిమితులను దాటిపోగూడదు. అది మార్గముకాదు. మనలో
ప్రతివాడును వేదాంతముతాదర్శముల నందుకొనుటవలననే
ఆ సంస్కరణము సిద్ధింపగలదు; అందుకు మనము ఆధ్యాత్మిక
తేజమును సంపాదించి, ఆదర్శబ్రాహ్మణులము కావలయును.
మనము ఆర్యులమైనను అనార్యులమైనను, బ్రాహ్మణులమైనను
శూద్రులమైనను, మనకందఱకు ఒకేశాసనము వర్తించును.
మనము ఎచ్చటను ఆగక ముందునకు నిరంతరము సాగిపోవుచుండ
వలయునని ఆ శాసనాదేశము! అతినికృష్టుడగు పంచముడు
మొదలు మహాపురుషునివఱకు, ఈ దేశములోనున్న ప్రతివాడును

ప్రయత్నించి ఆదర్శబ్రాహ్మణుడు కావలయును. ఈ వేదాంత సిద్ధాంతము ఈ దేశమునకే కాక ప్రపంచమునకెల్ల వర్తించును. మానవసంఘమునందలి ప్రతివ్యక్తియు అప్రతీకారి, శాంతుడు, స్థిరచిత్తుడు, భక్తితత్పరుడు, నిర్మలుడు, ధ్యానపరాయణుడు అయి ఆదర్శపారమార్థికజీవిగా పరిణమించునట్లు నెమ్మదిగను జాగ్రత్తగను నడపుటయే కులవ్యవస్థయొక్క పరమావధి! ఆ ఆదర్శమునందు భగవంతుడు ప్రత్యక్షమై యుండును.

ఈ ఫలితార్థములు చేకూరుట యెట్లు? శపించుట, తిట్టుట, దూషించుట ఏమాత్రము ఉపకారకరములు కావని నేను మఱల మఱల మీకు చెప్పుచున్నాను. అనేక సంవత్సరములు వానిని ఉపయోగించి చూచినారు. చెప్పుకొనదగిన ఫలము ఇసుమంతయు చేకూరలేదు. సత్ఫలములు ప్రేమద్వారమునను సానుభూతిద్వారమునను మాత్రమే చేకూరగలవు. ఇది చాల గొప్ప సమస్య. నా దృష్టిలో నున్న పరిష్కారమార్గముల నన్నింటిని, దినదినము నా మనస్సునకు తట్టుచున్న ఊహల నన్నింటిని విశదము చేయుటకు అనేక ఉపన్యాసములు ఒసగవలసియుండును. కాబట్టి ఓ హిందూ సోదరులారా! మన హైందవధర్మనౌక యుగయుగాంతరముల నుండి లోకోపకారము చేయుచు యాత్ర సలుపుచున్నదనిమాత్రము మీకు జ్ఞప్తి చేయుచు ఇప్పటికి నా యుపన్యాసమును ముగింప దలచితిని. ఈనాడు బహుశః మన నౌకకు చిల్లుపడియుండ వచ్చును. ప్రాయశః ఇప్పుడది కొంచెము ఓటిదై పోయి యుండ వచ్చును. అటులగునేని మీరును నేనును గట్టిగా ప్రయత్నించి ఆ బెజ్జమును, పగుళ్లను పూడ్చివేయుట ధర్మము. రానున్న అపాయమునుగూర్చి మనదేశీయులను హెచ్చరింతముగాక. వారు మేల్కొని మనకు తోడ్పడుదురుగాక. చిరనిద్రలో మునిగి మృతులవలె పడియున్న భారతీయులను నిదురనుండి లేపి, ప్రస్తుత స్థితిని, కర్తవ్యమును వారికి తెలుపుటకై మదేశమునం దెల్లెడల

సంచారముచేసి నా శక్తికొలది ఎలుగెత్తి ప్రబోధింతును. వారు నా పలుకులను పెడచెవి పెట్టుదురుగాక; వారిని నిందింపను. ప్రాచీనకాలమున మన పూర్వులు బహుళ ఘనకార్యములను చేసి యున్నారు. మనము భవిష్యత్కాలమున వారికంటెను ఘనతర కార్యములను సాధింపలేనియెడల, అందఱము ఒకటిగా మునిగి, మనశ్శాంతితో మరణించితిమను తృప్తినైన సాధింతుము గాక! దేశాభిమానులుగ నుండుడు; గతకాలమున మనకొఱకై అంతటి ఘనకార్యములు చేసిన ప్రాక్తనమహనీయులను సంస్మరింపుడు. సోదరులారా, నేను తారతమ్య విచారణ చేసిన కొలదిని, మీపై ప్రేమ అధికమగుచున్నది. మీరు యోగ్యులు, పవిత్రులు, సాధువులు. తరతరములుగా మీరు హింసల పాలగుచున్నారు. ఈ మాయామయ కలియుగములో మన గతి ఇట్టులైనది. పోనిండు. తుదకు ఆత్మ జయించితీరును. ఈ లోపుగా మనము నిరంతరకృషి సలుపుదుముగాక. మనదేశమును మనము నిందింప రాదు. కాలవైపరీత్యమున క్రుంగిపోయి, నిర్వీరామకార్యపరత్వ ముచే అలసటపొంది, మన సనాతనవ్యవస్థలన్నియు ప్రస్తుతము జడప్రాయముగా నున్నవి. అంతమాత్రమున వానిని శపించి తిరస్కారము చేయకుందుముగాక. అతిమూర్ఖములును వివేక శూన్యములును అగు సంప్రదాయములను సైతము నోరెత్తి నిందింపకుడు, పూర్వ మొకప్పుడు అవియును కొంత ఉపకారము చేసియే ఉండును. ఆదర్శములందును ప్రయోజనములందును ఈ దేశ సంప్రదాయములకంటె నిజముగా శ్రేష్ఠతర సంప్రదాయ ములుగల వేఱొండు దేశము ఈ ప్రపంచమున ఎక్కడను లేదని మీరు జ్ఞప్తి నుంచుకొనుడు. లోకములో దాదాపుగా ప్రతిదేశము నందును కులవిభాగములుండుట నేను చూచినాను. కాని ఇంకెచ్చ టను వాని గమ్యార్థము ఇందున్నంత మహనీయముగా లేదు. కులవిభాగము అనివార్యమే యైనయెడల, డబ్బువలన నేర్పడిన విభేదముకంటె, పవిత్రత సభ్యత త్యాగము మున్నగువానిపై

నాధారపడిన విభాగమునే నే నభిమానింతును. కాబట్టి దూషణ లకు దిగవలదు. పెదవులను మూసి పెట్టి, మీ హృదయములను తెఱువుడు. మీలో ప్రతివాడును భార మంతయు పూర్తిగా తన ఒక్కని నెత్తిమీదనే ఉన్నటుల భావించి, ఈ దేశముయొక్కయు ప్రపంచ మంతటియొక్కయు విముక్తికొఱకు పాటుపడవలయును. వేదాంతమునుండి ప్రసరించు దివ్యతేజస్సును, చైతన్యశక్తిని ఇం టింటికి కొనిపోయి పంచిపెట్టుడు. ప్రతిజీవియందును దాగియున్న దైవాంశమును మేల్కొలుపుడు. అప్పుడు మీకు చేకూరు విజ యము ఎంతపాటిదైనను, మీరు ఒక మహోద్యమమును చేపట్టి, దానికొఱకై పాటుపడి, దాని కొఱకే జీవితములను అర్పణము చేసిన సంతృప్తి మీకు లభించును. ఈ ఉద్యమవిజయము ఎటుల చేకూరినను, దానిమీదనే ఇప్పుడుగాని, తదనంతరమునగాని మానవజాతియొక్క మోక్షము ఆధారపడియున్నది.



చెన్నపురియందు సమర్పింపబడిన స్వాగతపత్రమునకు శ్రీ స్వాములవారొసగిన ప్రత్యుత్తరము.

శ్రీశ్రీశ్రీ వివేకానంద స్వాములవారు చెన్నపురి చేరి నప్పుడు శ్రీవారికొక స్వాగతపత్రము చెన్నపురి సన్మాన సంఘము వారివలన సమర్పింపబడెను. అది యిట్లున్నది :

పూజనీయులరగు నోస్వామీ!

శ్రీవారు పాశ్చాత్యప్రపంచమున మతప్రచారముసాగించి తిరిగివచ్చు నీ సమయమున చెన్నపురియందలి మన హిందూ మతస్థుల పక్షమున, తమకు మేము, మిగుల హృదయపూర్వక మగు స్వాగతమును అర్పించుచున్నాము. ఈ స్వాగతపత్రముతోడ

శ్రీవారిసమక్షమునకు మేమువచ్చుటలో మాఉద్దేశ్యము కేవలము అనుచానముగానుండు కార్యకలాపమును జరుపుటకు మాత్రమే కాదు. భారతదేశముయొక్క అత్యుత్కృష్ట మతాదర్శములను ప్రచారముచేయుటద్వారా శ్రీవారు కావించిన లోకోపకారమును గుఱించి మాహృదయములలో నిండియున్న భక్తిని అర్పణము చేయుటకును, మాకృతజ్ఞతను వెలిపుచ్చుటకును వచ్చియున్నారము.

అఖిల మతమహాసభ షికాగోనగరమున ఏర్పాటైన సమయమున, పూజనీయమగు మనప్రాచీనమతమును అమెరికాజాతి వారికిని, వారిద్వారమున విశాల పాశ్చాత్య ప్రపంచమంతటికిని, అర్హమార్గమున ప్రకటనము చేయు నిమిత్తము ఎవరు ప్రాతినిధ్యము వహింతురాయని మన దేశీయులలో కొందఱికి సహజముగా ఆందోళనకలిగినది. అదృష్టవశమున మేము మిమ్ములను కలిసికొనుటయు, అవసరమేతెంచునప్పుడు ధర్మసంస్థాపనయందు సాయపడవలసిన పురుషుడు ప్రత్యక్షమగునని నానాజాతి చరిత్రయందు తఱచుగా ఋజువగుచుండిన సత్యమును మఱొకసారి అనుభవమునకు తెచ్చుకొనగల్గుటయు, తటస్థించినది. అఖిల మత మహాసభయందు హిందూమతప్రబోధము గావించుటకు మీరు అంగీకరించినప్పుడు, మీ సామర్థ్యమును ఎఱిగియున్న కారణమున, ఆ ఘనతర అఖిలమతమహాసభయందు తన ప్రతినిధివలన హిందూమతము అతి సమర్థముగా ప్రతిపాదింపబడునని మాలో చాలమంది అభిప్రాయ పడితిమి. హిందూమత సిద్ధాంతములను మీరు ప్రకటించిన విధము సుస్పష్టమును, నిర్దుష్టమును. ప్రామాణికమునై, ఆ మతమహాసభయందుండినవారికి చక్కగా నచ్చుటే కాక, మన హైందవ తత్త్వశాస్త్ర జలనిధినుండి అమృతజీవరసములను ప్రేమరసములును మాటిమాటికి చేకొనసగునని, పరదేశములందలి స్త్రీ పురుషు లనేకులు గ్రహించునట్లు చేసినది. తత్ఫలిత

ముగా ఈ భూమండలమున ఇదివఱకెన్నడును సంభవించిన దాని కంటె, విశాలతరమును పరిపూర్ణమును పవిత్రమును అగు మానవ పరిణామము సంఘటిలగలదు. ఆ ప్రపంచమహామతసభయందు, ప్రతినిధులై చేరియున్న వారికి మత సమన్వయమునుగూర్చియు, విశ్వసౌందర్యమును గూర్చియు బోధించి విశ్వజనీనమై సర్వశరణ్యమగు హిందూమత సిద్ధాంతము దృగ్గోచరమగునట్లు చేసినందుకు మేము ముఖ్యముగా శ్రీవారియెడల కృతజ్ఞులమగుచున్నాము. సత్యమును పావనత్వమును ఏ ప్రత్యేక దేశమునకుగాని, జాతికిగాని, శాస్త్రసిద్ధాంతమునకుగాని, సంప్రదాయమునకుగాని, అనన్య సంపద అని పట్టుపట్టుటకును, ఏ మతముగాని ఏ తత్త్వసిద్ధాంతము గాని తక్కినవానినన్నిటిని తిరస్కరించి నాశనముచేసి ప్రత్యేకముగా వర్ధిల్లగలదని అభిప్రాయ పడుటకును, ఇకమీదట విజ్ఞానవంతులును శ్రద్ధావంతులును అగువారికి సాధ్యపడదు. శ్రీమద్భగవద్గీతాహృదయమునందు మనోహరమైయొప్పు సర్వసమాదరణ భావమును చక్కగా విశదముచేసిన మీ మృదుమధుర భాషణములనే ఇందు కాధారముగా ఉదాహరింతుముగాక: "సమస్త మతచరిత్రయు ఆయాభిన్న దశాంతరములందును, భిన్నపరిస్థితులయందును ఒకే పరమగమ్యముదెస మానవులు సాగించు ప్రస్థానముగా నున్నది."

మీ వశము గావింపబడిన ఉత్తమమును పవిత్రమును అగు కర్తవ్యమును మాత్రము నిర్వహించి మీరు సంతృప్తులైయున్నను గూడ, మీ ఘనకార్యములోని అమూల్య ప్రయోజనమును గుఱించి మన హిందూమతస్థులు సంతోషముతోడను కృతజ్ఞతతోడను మిమ్మును అత్యుత్సాహముతో అభినందించి యుందురు. కాని పాశ్చాత్యదేశములలో మీరు ప్రవేశించినపుడు, సనాతన హిందూమతమందలి ప్రాచీనబోధన నాధారము చేసికొని, అఖిల మానవజాతికిని విజ్ఞానశాంతిసందేశములను సైతము మీరు కొని

పోయితిరి. వేదాంతమతముపూర్ణప్రామాణికతను నిలువబెట్టుట యందు మీరు గావించిన మహోపకృతికై మీకు వందనము లర్పించు ఈ సమయమున, మన మతమును, మన తత్త్వశాస్త్ర మును ప్రచారముచేయు నిమిత్తము సుస్థిరమగు కేంద్రస్థానము లను నిర్మించి తీవ్రతర ప్రచారము సాగించుటయను మీ మహో ద్దేశ్యమును ప్రశంసించి ఆనందించుచున్నాము. మీ సర్వశక్తులను సమర్పణముచేయ సమకట్టిన ఉద్యమము, మీరు అభిమానించిన పవిత్రసంప్రదాయములకును, మీ జీవితమును మీ గమ్యార్థమును ఉద్బోధించిన మీ గురుసత్తముని దివ్యసంకల్పమునకును అనుగుణ ముగా నున్నది. ఈ పవిత్రోద్యమమునందు మీతో నిలిచి సహ కరించు మహాభాగ్యము మాకు లభించుగాకయని ఆశించుచున్నా రము. సర్వజ్ఞుడును సర్వకరుణామయుడును అగు సర్వేశ్వరుడు మీకు దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించి మీ పవిత్రోద్యమ శిరమున, సనాతనధర్మశీర్షమున ప్రకాశింప నర్హమగు భవ్యకిరీట మును శోభామయ విజయచిహ్నముగా ధరింపజేసి యనుగ్రహించు గాక యని మిగుల భక్తిపూర్వకముగా ప్రార్థించుచున్నారము.



పిమ్మట ఖేత్రిమహారాజుగారు పంపిన క్రింది అభినందన పత్రము చదువబడెను.

పరమపావనమూర్తీ!

శ్రీవారు చెన్నపురిచేరి స్వాగతసత్కారముల నందుకొను ఈ తరుణమున, శ్రీవారు భారతదేశమునకు సురక్షితముగా చేరుటనుగూర్చి నా సంతోషమును, ఆనందమును మున్ముందుగా తెలుపుకొనుచున్నాను. ప్రకృతిశాస్త్రము సత్యమతమునకు ఎన్నడేని ఎదురై నిలిచియుండకపోయినను, 'ప్రకృతిశాస్త్రము జయించిన ఒక్క అంగుళము నేలనైనను, మతము ఎన్నడును తిరిగి జయించుకొనజాలదు' అనుచు మేధావులగువారు డంబములు

పలుకు పాశ్చాత్యదేశములందు, శ్రీవారి నిష్కామప్రచారము సాధించిన అద్భుతవిజయమునుగూర్చి నా హృదయపూర్వకముగా అభివాదములను సమర్పించుకొనుచున్నాను. మన ఋషిసంతానమునకు తగిన ప్రతినిధియై, షికాగోనగరమున జరిగిన అఖిలమతమహామతసభకు విజయము చేయజాలిన మిమ్ము కనిన కారణమున మన భారతమాత ధన్యురాలైనది! హిందూదేశమున ఈ కాలములో సైతము అఖండబ్రహ్మజ్ఞాననిధి కలదని, పాశ్చాత్యప్రపంచము గ్రహింపజాలుట సర్వవిధముల మీ ధీసంపదవలనను, సాహసమువలనను, ఉత్సాహమువలనను సంభవమైనది. ప్రపంచమునగల వివిధసంప్రదాయముల పరస్పరభేదవాదములకు, విశ్వశరణ్యమగు వేదాంతవిజ్ఞానద్వారమున సమన్వయము కుదురునని మీ పరిశ్రమవలన నిస్సందేహముగా రుజువైనది. "ఏకతత్త్వము భిన్నరూపములనుదాల్చునే" ప్రకృతియొక్క విశ్వపరిణామ ప్రణాళిక యను మహాసత్యమును గ్రహించి, తదనుగుణముగ ప్రపంచమందలి సమస్తజాతులవారును ప్రవర్తింపవలసియున్నారు. సఖ్యమువలనను, విశ్వసోదరభావమువలనను, పరస్పరసహనమువలనను, పరస్పరసాహాయ్యమువలనను, విశ్వమానవజాతి కాంక్షించు పురుషార్థమును, పరమగమ్యమును, ఆయా మతములు సాధింపగలవని మీరు నిశ్శంకముగా నిరూపించినారు. మహోన్నతమును పరమపవిత్రమును అగు శ్రీవారి ప్రాపువలనను, శ్రీవారి ఉత్కృష్టబోధల మహిమమువలనను, మూఢావేశము, ద్వేషము, స్పర్థ సమసిపోయి, శాంతి, సానుభూతి, ప్రేమ మానవుల హృదయములందు రాజ్యముచేయు నూతనయుగము ప్రపంచచరిత్రయందు ప్రారంభమగుటను వీక్షించు మహాభాగ్యము ఈ తరమువారమగు మాకు లభించినది. నా ప్రజలతోబాటు నేనును శ్రీ పరమేశ్వరుని వరప్రసాదములు శ్రీవారిమీదను శ్రీవారి ఉద్యమములమీదను అవ్యారిగ వర్షించుగాతయని ప్రార్థించుచున్నాడను.



ఈ అభినందనపత్రములు చదువబడిన పిమ్మట, శ్రీ స్వాముల వారు పురమందిరమును వదలి, వెలుపల తమకై వేచి యున్న శకటమందెక్కిరి. శ్రీవారికి స్వాగతము తెలుపుటకై చేరియున్న ఆ విశాలజనసమూహము వ్యక్తీకరించిన అత్యంతో త్సాహమువలన, శ్రీవారొసగదలచిన ప్రత్యుత్తరమును మఱొక అవకాశముకొఱకై నిలిపియుంచి సంగ్రహముగా ఈ క్రిందిరీతిని సెలవిచ్చిరి :

తానొకటి తలప దైవమొకటి తలచును. స్వాగతపత్ర సమర్పణమును, దానికి ప్రత్యుత్తరమును ఇంగ్లీషువారి ఆచారము ననుసరించి జరుగవలయునని మీరు సంకల్పించినారు. కాని భగవంతుని సంకల్పము వేఱొక తీరున నున్నది. నే నిప్పుడు రథముపై నిలిచి భగవద్గీతాఘట్టమునందువలె అందందు చెదఱి కూర్చుండిన ఈ ప్రేక్షకుల నుద్దేశించి ఉపన్యసింపవలసివచ్చినది. దైవికముగా ఇట్టిది సంభవించుటచే మనము కృతార్థులమైతిమి. ఇందుచే నా ఉపన్యాసమునకు రుచియు నే జెప్పబోవుదానికి బల మును చేకూరును. నా కంఠధ్వని మీ కందఱకు వినవచ్చునో లేదో తెలియదు. కాని వినబడునట్లు నా శక్తికొలది ప్రయ త్నించెదను. పెద్దపెద్ద బహిరంగ సభలలో ఉపన్యసించు అలవాటు మునుదెన్నడును నాకు లేదు.

కొలంబో మొదలు చెన్నపురి వఱకు నాయెడల చూపబడిన అద్భుతమగు ఆదరణయు, గాఢమగు ఉత్సాహానందములును, భారతదేశమునందంతటను చూపబడునట్లే కాన్పించుచున్నది. అది నా ఊహాశక్తినికూడ మించిపోవుచున్న దనవచ్చును. అందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. ఏలయన, ప్రతిజాతికిని దాని చైతన్యసూచకముగా ఒక ఆదర్శమును, దాని నడకకు ప్రత్యేక మగు ఒక తెన్నును ఉండునని నే నిదివఱకు చాలసార్లు వచించి యుంటిని. మీ ఆదరము దానిని ఋజువుచేయుచున్నది. యుగ

యుగములుగా మతధర్మమార్గమున భారతీయుల బుద్ధి వికసించుచు వచ్చినది. ఇతరదేశములందు, మతమనునది అనేక జీవిత వ్యాపృత్తులలో ఒకటి. పైగా ఇతరవ్యాపృత్తులకున్న ప్రాధాన్యము దీనికి లేదు. ఇంగ్లాండులో వారి జాతీయ రాజకీయ తంత్రమున, మతము ఒక అల్పభాగముగా నున్నది. ఆంగ్లేయుల క్రైస్తవ మతవ్యవస్థ ఎప్పుడుగాని రాజ్యాధికారపక్షమునకు చెందినదిగానే యుండును. అందువలన వారికి దానియందు విశ్వాసమున్నను లేకున్నను, ఆ వ్యవస్థ తమది అను అభిమానముతో దానిని పోషింతురు. గౌరవముగల ప్రతి పురుషుడును, ప్రతి స్త్రీయును ఆ వ్యవస్థతో సంబంధము కల్పించుకొనవలెనని అపేక్షింతురు. మర్యాదకు అదొక చిహ్నము. అటులనే ఇతరదేశములందును జాతీయమగు ఒక్కొక మహాశక్తి ఆ జాతికి లక్షణముగా నుండును. ఆ మహాశక్తి రాజకీయతంత్రజ్ఞతగనో, రణనీతిజ్ఞతగనో, వ్యాపార కుశలతగనో, ఆయా జాతులయందు వ్యక్తమగుచుండును. దాని యందు ఆ జాతిహృదయము స్పందించుచుండును. పాశ్చాత్య జాతులకు మతమనునది గౌణమై, అలంకారమూల్యముగల బహుళ విషయములలో ఒకటి!

ఇక భారతదేశమునందన్ననో, మతము జాతీయహృదయము యొక్క గర్భస్థానమే! అది మన జాతీయభవనమునకు పునాది! ఆధారశిల! రాజకీయములు, అధికారపదవులు, చివరకు బుద్ధి చాతుర్యమును ఇచ్చట అప్రధానములుగనే యెంచబడును. కావున మతమొక్కటే భారతదేశమునందు ప్రధానవిషయముగా భాసించుచున్నది. భారతప్రజలందు ప్రపంచవార్తాజ్ఞానము మిక్కిలి కొఱవడి యున్నదని ఎందఱో నాతో చెప్పుచుందురు. అది నిజమే. నేను కొలంబోనగరమున దిగినప్పుడు, యూరపులో జరుగుచున్న రాజకీయ విప్లవములను గూర్చియు, మంత్రివర్గముల మార్పులు, పతనములు మున్నగు విషయములను గూర్చియు

అచ్చటివారిలో ఒక్కడేని వినియుండలేదని నాకు తెలిసినది. సామ్యవాదమననేమో, అరాజకత్వమననేమో కూడ వారికి తెలియదు. పాశ్చాత్య రాజకీయ వాతావరణమున కలుగుచున్న తీవ్రపరిణామములను వారు అర్థముచేసికొనుచుండుటలేదు సరి గదా, కనీసము వానినిగూర్చి వినినపాపమునైనను పోలేదు. కాని సర్వమతమహాసభకు భారతదేశమునుండి ఒకసన్న్యాసి వెళ్లెననియు, ఆయన ఏదో కొంత విజయము సాధించెననియు, సింహళములోని ప్రతిస్త్రీకిని ప్రతిపురుషునకును, చివరకు ప్రతి పసిబిడ్డకునుగూడ తెలిసిపోయెను. దీనినిబట్టి ఏమి ఋజువగు చున్నది? మన ప్రజలందు వార్తలు తెలిసికొనవలయునను అభి లాషకు లోటులేదు. కాని ఆ వార్తలు తమకిష్టమైనవిగను, అభిరుచికి సరిపడునవిగను ఉండవలెను, అంతే. రాజకీయాది విషయములు జీవితావశ్యకములుగా భారతీయులకు ఎన్నడును తోపలేదు. కాని మతము, పారమార్థికచింత మున్నగునవి మాత్రము ఈ జాతి జీవించుటకును, వికాసము పొందుటకును, అత్యావశ్యకములని గ్రహింపబడినది.

ప్రపంచజాతులెల్ల నేడు రెండు సమస్యలను పరిష్కరింప జూచుచున్నవి. ఇందు భారతదేశము ఒక్కటియు ఒకపక్షము; మిగత ప్రపంచమంతయు రెండవపక్షము. ఆ సమస్య ఇది; చిరజీవనలక్ష్యమును ఎవరు సాధింతురు? తక్కినజాతులెల్ల నశించు చుండగా ఒక్కజాతి సజీవముగా నిలుచుటకు కారణమేమి? చిరస్థాయిగా నిలువదగినది ప్రేమయా, ద్వేషమా? భోగలాలస తయా, వైరాగ్యమా? జీవనసంగ్రామమున పాంచభౌతిక పదార్థమా లేక ఆత్మయా ఏది శాశ్వతముగా నిలిచియుండును? వెనుక, చరిత్రకు అందని పూర్వయుగములందు ఈ సమస్యలను గూర్చి మనపూర్వులు ఎట్లు భావించిరో, నేడును మన మట్లే భావించుచున్నాము. అతి ప్రాచీనకాలమునందే పూజనీయులగు

మనపెద్దలు ఈ సమస్యలనుగూర్చి చర్చించి, కొన్నినిర్ణయములు చేసికొని, ప్రపంచమునంతను ధిక్కరించి నిలువబడిరి. మన పరిష్కారము వైరాగ్యము, త్యాగము, నిర్భయత్వము, ప్రేమ అను రూపముల నుండును. ఇవియే నశింపక నిలిచియుండనర్హమైనవి. ఇంద్రియభోగపరిత్యాగము జాతిని చిరస్థాయిగా నొనర్చును. ఇందుకు నిదర్శనము చూడుడు. శూన్యమునుండి పుట్టి నాల్గుదినములు వెట్టియాటలాడి, అంతలో[illegible]డించిపోవు కుక్కగొడుగుల వంటి జాతులు దాదాపు ప్రతి శతాబ్దమునందును తలయెత్తుచు, వెంటనే పడిపోవుచు నుండుట చరిత్ర తెలుపుచునే యున్నది. ప్రపంచములో ఏ ఇతరజాతినెత్తిమీదను పడని దారుణదురవస్థలు, ఘోర ప్రమాదములు తననెత్తిపై పడినను చలింపక, అతిక్లిష్ట సమస్యలతో యుగయుగములుగా పెనగులాడుచు వచ్చిన ఈమహా జాతి, వైరాగ్యపక్షము వహించుటచేతనే యిన్ని ముప్పులుగడచి ఇప్పటి కిట్లు నిలిచియున్నది. వైరాగ్యములేనిది మత మెట్లునిలువగలదు ? ఇక యూరపుఖండము రెండవపక్షమును వహించి, ఒక పురుషుడు ఎంత సంపదను ఆర్జింపగలడో, అతడు ఇంక ఎంత అధికారమును సవ్యమార్గమునగాని, అపసవ్యమార్గమునగాని, యేదో ఒకవిధముగా కైవసముచేసికొనగలడో పరిష్కారము చేయ పూనుకొనినది. స్పర్థ, క్రౌర్యము, నిర్దాక్షిణ్యత యూరపును ఈ నాడు నడుపుచున్న సూత్రములు. పోటీలను తొలగించి, పరపీడనము నడంచి, క్రౌర్యములను మాపి, ఈ మాయామయ జీవితమున నరుని జీవాత్మను సరళముగా నడపుట మనము చేపట్టిన సూత్రము!!

(ఇప్పటికి జనసమ్మర్దము మితిమీరిపోయినది. శ్రీస్వాముల వారి పలుకులు దూరమునకు వినబడకుండెను. అందువలన శ్రీవారు తమ ఉపన్యాసమును ఈ క్రింది మాటలతో ముగించిరి):

మిత్రులారా, మీ ఉత్సాహము నాకు మిగుల ఆనందము గొలుపుచున్నది. ఇది అద్భుతము! నేను కోపము చెందితినని

మీ రేమాత్రమును తలపకుడు. మీరు చూపుచున్న ఈ ఉత్సాహమునకు నేను మిగుల సంతోషించుచున్నాను. అహో! ఎంతటి నిర్భరోత్సాహము! అదే కావలసినది. దానిని సుస్థిరమొనర్చుకొనుడు. నిప్పును నుసిగట్టనీయకుడు. మనము పెక్కు మహా కార్యములు చేయవలసియున్నది. అందులకై మీ సాహాయ్యము నాకు కావలెను. ఇటువంటి ఉత్సాహము ఎంతయు అవసరమే. ఈ సభను ఇంకను సాగించుట అసంభవము. నాకు స్వాగత మర్పించుటలో మీరుచూపిన ఆదరణకును, ఉత్సాహమునకును నేను మిక్కిలి కృతజ్ఞుడను. శాంతముగా నుండునప్పుడు, మనము పరస్పరము తెలుపుకొనదగిన ఉత్తమసంకల్పములును, భావములును, అనేకము కనబడుచుండును. సరే, మిత్రులారా, ఇప్పటికి ఇంతటితో స్వస్తిచెప్పుదము.

నలువైపుల ఈ విధముగా కూడియున్న మిమ్ముల నుద్దేశించి యుపన్యసించుట సాధ్యమగుపనికాదు. కాబట్టి మీ రీ సాయంకాలము నన్నుచూచుటతోనే తృప్తి పడవలసియున్నది. మఱొక సమయమునకు నా ఉపన్యాసమును ఆపియుంచెదను. ఉత్సాహపూరితమగు మీ స్వాగత సత్కారమునకు నా వందనములు.



## నా ఉద్యమ ప్రణాళిక ఆశయములు

(చెన్నపురి విక్టోరియామందిరమున నొసగిన ఉపన్యాసము)

మున్నటి దినమున జనసమ్మర్దమువలన నా ఉపన్యాసము సాగింపలేకపోయితిని. కాబట్టి ఈ చెన్నపురిప్రజలగు మీరు నా

యెడల చూపుచున్న అక్షీణమగు ప్రేమకు మీకు నా వందనము లను తెలుపుటకు ఈ యవకాశమును తీసికొనుచున్నాను. మీ సన్మాన పత్రములయందలి ప్రియవచనముల యెడ నా కృతజ్ఞతను తెలుపుచు, నాపై మీరు చూపుచున్న ఆదరణకు నన్ను పాత్రు నిగా చేయుమని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. హైందవ మత ప్రచారమునకును మాతృదేశ సేవకును నా యావజ్జీవమును సమ ర్పించి నిర్విరామముగా కృషిసల్పుటకంటె శ్రేష్ఠతర మార్గము నాకు తోచుటలేదు. పరమేశ్వరుడు నన్నందుకు అర్హునిగా జేయుగాక!

నాయందు ఎన్నిదోషములున్నను, నాకుకొంత సాహసము కలదని నేననుకొందును. మన భారతదేశమునుండి పాశ్చాత్య ప్రపంచమునకు నేనొక సందేశమును కొనిపోవలసి వచ్చినది. ధైర్యముతో దానిని నేను అమెరికా ఇంగ్లాండు ప్రజలకు అంద జేసితిని. ఈ దినము నా ఉపన్యాసాంశమునకు దిగకపూర్వము, మీఅందఱకును కొన్ని సాహసవాక్యములు చెప్పబోవుచున్నాను. నాకు ఆటంకములు కల్పించుటకును, నా పని సాగనీయకుండ ఎదిరించుటకును, వీలగుచో నన్ను రూపుమాపుటకును కూడ కొన్ని ప్రయత్నములు జరిగినవి. ఈశ్వరకృపవలన అవి యన్నియు వ్యర్థమై పోయినవి. అట్టిప్రయత్నములు నిష్ఫలములగుచునే యుండును. కడచిన మూడుసంవత్సరములనుండి కొన్నికొన్ని అపోహలు వ్యాపించుచు వచ్చినవి. నేను పరదేశములందున్నంత కాలము ఈ విషయమై ఒక్కమాటయైనను పలుకక మౌనముగా నుంటిని. ఇప్పుడు నా మాతృభూమియందు నిలబడి, కొన్ని సమాధానవాక్యములు చెప్పకొనుచున్నాను. అటులచేయుట నా పలుకుల ఫలితార్థము ఏమగునాయని చూడగోరి కాదు; నా మాటలవలన మీలో ఎటువంటి అనుభూతిని కల్పింపగలనో అను కౌతుకము తోడనుకాదు. నేను ఇట్టివానిని లక్ష్యముచేయువాడను

కాను. ఏలయందురా, నాలుగుసంవత్సరముల క్రిందట ఒక దండ మును, కమండలువును మాత్రము చేబూని మీ నగరమును ప్రవేశించిన ఆనాటి సన్న్యాసినే ఇప్పుడును! ఆ సువిశాలప్రపం చమే ఇప్పుడును నా యెదుట కాన్పించుచున్నది. ఇంతకుమించిన ఉపోద్ఘాతములేకుండ నా యుపన్యాసము నారంభింతును.

మున్ముందుగా దివ్యజ్ఞానసమాజమువారిని గుఱించి కొన్ని మాటలు చెప్పవలసియున్నది. ఆ సమాజమువలన భారతదేశము నకు కొంతకొంత మేలు సమకూరెనని నేను వేఱుగా చెప్పనక్కఱ లేదు. అందులకు ఆ సమాజము నెడలను, ముఖ్యముగా బెసెంటు దొరసానిగారియెడలను, ప్రతి హిందువును కృతజ్ఞుడై యుండ వలయును. ఆమెనుగుఱించి నాకు తెలిసినది స్వల్పమైనను, నేనెఱిగి నంత వరకు ఆమె భారతదేశ శ్రేయోభిలాషిణి అనియు, ఆమె తనకు సాధ్యమైనంతవఱకు మనదేశము నుద్ధరించుటకు చిత్త శుద్ధితో పాటుపడుచున్నదనియు నాకు దృఢాభిప్రాయముకలిగినది. అందులకు నిజముగా భారతీయుడై పుట్టిన ప్రతివాడును ఆమెకు సదా కృతజ్ఞుడై యుండవలెను. ఆమెకును, ఆమె కృషికిని సర్వ శుభములు శాశ్వతముగా సమకూరుగాక! కాని, ఇది ఒక విష యము; దివ్యజ్ఞాన సమాజములో చేరుట మఱొకవిషయము. ఆదరమును, గౌరవమును, ప్రేమను చూపుట ఒకవిషయము; ఎవరేని చెప్పుదానిని తర్కింపకుండ, విమర్శింపకుండ, విచక్షణ చేయకుండ, శిరసావహించుట వేఱొకవిషయము. అమెరికాలోను, ఇంగ్లాండులోను, నేను సాధింపగలిగిన స్వల్పప్రయోజనమునందు దివ్యజ్ఞాన సామాజికులు నాకు తోడ్పడిరని ఒకవార్త ఎల్లో ఎల్లె డల ప్రచారమగుచున్నది. అందు ప్రతిపదమును పొరపాటే; ప్రతి మాటయు అనృతమే అని మీకు స్పష్టముగా చెప్పుచున్నాను. "విశాలభావములు," "అభిప్రాయభేదమునెడ సానుభూతి," అనుచు ప్రగల్భములు పలుకుట లోకమున తఱచు వినుచున్నాము.

ఆ సూత్రములు చాల మంచివే. కాని ఒకడుచెప్పుదానిని సర్వము ఇంకొకడు గ్రుడ్డిగా విశ్వసించువఱకే ఆ సూత్రములు ఆదరింపబడు చున్నవి. ఎదుటివాడు భేదాభిప్రాయమును తెలిపినతోడనే ఆ ఆదరణ, ప్రేమ ఎగిరిపోవుచుండుట మనము కనులార చూచు చునే యున్నాము. వీరికంటె ఘనులు కొందఱుకలరు. వారు స్వలాభపరులు. వారి స్వలాభసంపాదనకు ఏదేని అడ్డుతగిలెనేని వారికడుపు మండిపోవును. ఎంత ద్వేషమునైనను వారప్పుడు వెలిగ్రక్కుదురు. వారు చేయవలసినదేమో వారికే తెలియదు. హిందువులు తమయింటిని తాము చక్కబెట్టుకొనుచో, క్రైస్తవ మిషనరీలకు గలుగు నష్టమేమి? హిందువులు తమ్ముతాము సంస్కరించుకొనుటకు తీవ్రముగా కృషిసల్పుచో, బ్రహ్మసమాజము వారికిని, ఇతర సంస్కరణసమాజముల వారికిగాని వచ్చిపడు ఆపద ఏమున్నది? వీరందఱు ప్రతిఘటించి నిలువనేల? హైందవో ద్యమములకు వీరు పరమశత్రువులుగా నిలువనేల? ఎందు కొఱకు అని నా ప్రశ్న! వీరి ద్వేషము, వీరి ఉద్రేకము ఎందుకో! కార ణమును నామట్టుకునేను ఊహింపలేకున్నాను. ఏమైనను — వారి ప్రతీకారోద్యమము మాత్రము అతితీవ్రముగా విజృంభించుచున్నది.

నాలుగేండ్లకు పూర్వము పేరుప్రతిష్ఠలులేక నిరాధారుడ నగు సన్న్యాసిగా అమెరికాకు పోవునపుడు, అమెరికాలో స్నేహి తులుగాని అచటివారికి పరిచయపత్రములుగాని లేకయే మహా సముద్రములుదాటి పరదేశములకు పోనున్న సమయమున, దివ్యజ్ఞానసమాజనాయకుని దర్శింపబోయితిని. ఆయన అమెరికా దేశస్థుడు గావునను, హిందూదేశమునెడ అభిమానము కలవాడు గావునను, అక్కడ నెవరితోడనైనను నాకు పరిచయము కల్పించు టకు ఒక ఉత్తరమును వ్రాసియిచ్చునని సహజముగా నేను తలంచితిని. 'నీవు మా సంఘములో చేరుదువా?' అని న న్నాయన అడిగినాడు. 'చేరజాలను; నాకు మీ సిద్ధాంతములలో

చాలవానియందు నమ్మకములేదు. కావున నే నెట్లు చేరగలను?' అని నే నంటిని. 'అట్లులైనచో నే నేమియు నీకు సాహాయ్యము చేయజాలనందుకు విచారముగానున్నది' అని ఆయన నాకు జవాబు చెప్పినాడు. అట్లనుట నాకు మార్గము సరిచేసిపెట్టుటకాదే! నేను చెన్నపురిలోని కొందఱు మిత్రుల సాహాయ్యముననే అమెరికా చేరగలిగితినని మీ రెఱుగుదురుగదా! వారిలో చాలమంది ఇప్పు డిక్కడే ఉన్నారు. న్యాయమూర్తి సుబ్రహ్మణ్యఅయ్యర్‌గారు ఒక్కరుమాత్ర మిచ్చటలేరు. వారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను. ధీనిధికి తగు దూరదృష్టి వారికి కలదు. నా కీ జన్మలోగల ప్రాణ స్నేహితులలో వా రొకరు. సమయమునకు అక్కఱకువచ్చు నిజమైన స్నేహితుడు! యథార్థభారతపుత్రుడు! మతమహాసభ జరుగుటకు చాల నెలలు ముందుగనే నే నమెరికా చేరితిని. నాయొద్ద నున్న సొమ్ము చాల కొంచెము. అది త్వరలోనే వ్యయమై పోయెను. శీతకాలము వచ్చినది. నాకు ఉన్నవి వేసవికాలమున కుపకరించు సన్నని గుడ్డలు. ఆ చలిలో ఏమిచేయుటకును నాకు తోపలేదు. చలి దుర్భరముగనున్నది. నేను వీథులవెంట బోయి యాచించితినా, నన్ను జెయిలుకు పంపుదురు. అక్కడ చేరినప్పుడు నా జేబులో కొలదిడాలర్లుమాత్రమే మిగిలియుండెను. అప్పుడు చెన్నపురిలోని నా మిత్రులకు ఒక తంతివార్త పంపితిని. ఈ సంగతి దివ్యజ్ఞానసమాజమువారికి తెలియవచ్చెను. 'ఇప్పుడు ఆ పిశాచము చావనున్నది. భగవంతుడు మనల నందఱిని అనుగ్రహించుగాక' అని వారిలో నొకరు వ్రాసియున్నారు. అది నాకొఱకు మార్గమును సరిచేసిపెట్టుటయేనా? నే నిప్పు డా విషయమును తడవియుండెడి వాడను కాను. కాని నా దేశీయులకు ఈ విషయములు కొన్ని తెలిసియుండుట మంచిదని దానిని ప్రస్తావించితిని. మూడుసంవత్స రములకాలము ఈ విషయమునుగూర్చి నేను నోరెత్తలేదు, మౌన దీక్ష నవలంబించితిని. కాని ఈ దినము ప్రాసంగికముగా ఆ విష యము బయటికి వచ్చినది. ఇంతేగాదు. అఖిలమతమహాసభలో

కొందఱు దివ్యజ్ఞానసామాజికులను చూచితిని. వారితో మాట్లాడి వారితో కలిసియుండగోరితిని. అప్పుడు వారేదో దేవతలైనట్లు, నేనొక కీటకమైనట్లు నావంక తిరస్కారముతో చూచిరి. ఆ చూపులు ఇప్పటికిని నాకు స్పష్టముగా కనబడుచునే యున్నవి. అఖిలమతమహాసభలో నాకు పేరు ప్రతిష్ఠలు వచ్చిన పిమ్మట, నాకు తీఱిక లేని ఉపన్యాస కార్యక్రమ మేర్పడెను. కాని ప్రతిచోటను దివ్యజ్ఞాన సామాజికులు నన్ను అపనిందలపాలు చేయసాగిరి. వారెవ్వరును నా ఉపన్యాసములకువచ్చి వినకూడదని ఆ సంస్థ అధికారులు శాసించిరి. వచ్చి వినినచో వారు తమసంఘము యొక్క సానుభూతిని కోల్పోవుదురట! ఆ సంఘముయొక్క ఆంతరంగిక శాఖయందు చేరువారు 'కుతూమీ', 'మోరియో' అనువారియొక్క ఆజ్ఞలకు—అనగా, వారి ప్రత్యక్ష ప్రతినిధులగు జడ్జిదొరగారియొక్కయు, బెసెంటుగారియొక్కయునేగదా—లోబడి ప్రవర్తించుచుండవలెనని వారియొక్క ఆంతరంగిక శాఖానియమములు విధించుచున్నవట! కాబట్టి వారి ఆంతరంగిక శాఖలో చేరుటనగా స్వతంత్రతను వారికి అర్పణచేయుటయే! నే నట్టి పనిని ఎన్నడును చేయజాలను. అట్టి పనిని చేయువానిని హిందువనియే నేను పిలువజాలను. జడ్జిదొరగారియెడల నాకు చాల గౌరవము గలదు. ఆయన మహనీయుడు, నిష్కపటి, న్యాయశీలుడు, నిరాడంబరుడు. దివ్యజ్ఞానసమాజప్రతినిధులలో ఆయన ఉత్తమోత్తముడు. ఆయనయు బెసెంటమ్మయు తమ తమ మహాత్మునిదే సరియైన మాటయని పరస్పరము వివాదము పెంచుకొందురట! కాని ఆ విషయమును విమర్శించు యోగ్యత నాకు లేదు. అందలి విచిత్రమేమన, ఇరువురును ఒకే మహాత్ముని గుఱించి వివాదపడుచున్నారు! సత్యము దైవమునకే ఎఱుక; ఆయనయే ఇందు తీర్పు చెప్పగలడు. ఉభయపక్షములు సమానముగా నుండునప్పుడు ఇతరు లెవరును న్యాయనిర్ణయము చేయజాలరు! అమెరికాయం

దంతటను, వారు నాకు మార్గమును బాగుగా సిద్ధముచేసి పెట్టిన దిట్లే.

క్రైస్తవమిషనరీలతో కలిసి వారు నా వైరిపక్షమున చేరిరి. ఈ క్రైస్తవమిషనరీలు నన్నుగుఱించి కల్పనచేసియుండని ఘోరతరాసత్యనిందలను ఊహింపనేలేము. పరదేశములో దీనుడనై, దిక్కులేకయున్న నా ప్రవర్తనమును అతిహేయముగా చిత్రించి నగరనగరమున ప్రచారము గావించిరి. ప్రతిగృహమునుండియు నన్ను వెడలగొట్టించుటకు వారు ప్రయత్నించిరి. నాయెడ స్నేహభావముచూపిన ప్రతివానిని నా శత్రునిగా చేయుటకు ప్రయత్నించిరి. తిండిలేక నేను చచ్చుట కనులార చూడవలెనని వారి కోరిక. ఈ విధముగా పిశాచములవలె నన్ను అడుగడుగున వెన్నంటి బాధించినవారిలో నా స్వదేశీయుడే ఒకడు కలడని చెప్పుకొనుటకు నేను సిగ్గుపడుచున్నాను. ఇండియాలో సంస్కరణ పక్షమునకు చెందిన ఒక మహానాయకుడాయన. ఈ మహనీయుడు 'క్రీస్తు హిందూదేశమునకు దిగివచ్చె'నని ప్రతిదినము చాటి చెప్పుచుండును. 'క్రీస్తు హిందూదేశమునకు వచ్చుట' ఈ విధముగ నేనా? హిందూదేశమును సంస్కరించుమార్గ మిదేనా? ఈ మహాపురుషుని నేను బాల్యమునుండియు ఎఱుగుదును. ఈయన ఒకప్పుడు నా ప్రియస్నేహితులలో ఒకడుగా నుండెడివాడు. అచ్చట చాలకాలము నాకు నా దేశీయులు కాన్పింపకుండిరి. నేనీయనను కలిసికొనినప్పుడు ఎంతగానో ఆనందించితిని. కాని ఆయన నాయెడల చూపిన ఔదార్యము ఇట్లుండెను. మహాసభవారు నన్నభినందించిన దినమునుండి, షికాగోనగరమున నేను ప్రజాభిమానము చూఱగొనిన దినమునుండి, నాయెడల ఆయన వైఖరి ఈ విధముగా మాఱినది. కపటమార్గమున నాకపకారము చేయుటకై సర్వవిధముల ఈయన ప్రయత్నించినాడు. 'క్రీస్తు ఇండియాకు వచ్చుమార్గము' ఇదియేనా? క్రీస్తుపాదములచెంత ఇరువది సంవత్సరములపాటు కూర్చుండి ఈయన నేర్చిన గుణ

పారము ఇదియా? క్రైస్తవమతము, క్రైస్తవశక్తి, హిందూదేశ ప్రజలను ఉద్ధరించునని మన సంస్కరణమహాశయులు ప్రకటించుచుందురే, అది జరుగుట ఇట్లేనా? నేను సూచించిన మహనీయుడే ఇందు కొక దృష్టాంతమైనచో, ఈ ఉద్ధరణమునుగూర్చి నమ్మకము కలుగుట కష్టము.

ఇంకొకమాట. ఒక సంఘసంస్కరణ పత్రికయందు నన్ను శూద్రు డనుట చదివితిని. సన్న్యాసియగుటకు శూద్రునకేమి అధికారముకలదని వారు అధిక్షేపించిరి. "యమాయ ధర్మ రాజాయ చిత్రగుప్తాయ వై నమః" అను వాక్యము నుచ్చరించుచు ప్రతిదినమును ఎవనిపాదములచెంత ప్రతి బ్రాహ్మణుడును పుష్పముల నర్పించునో, ఎవని సంతతివారు పవిత్రక్షత్రియులో, అట్టి మహాపురుషుడు నావంశకర్తయని ప్రకటించుటయే వారికి నా ప్రత్యుత్తరము! తమ పురాణగ్రంథములయందును ప్రాచీన గాథలయందును ఈ సంఘసంస్కర్తలకు విశ్వాసముకలదేని — నా కులస్థులు ప్రాచీనకాలమున చేసిన ఇతరవిధములగు ఉపకారముల నటుంచినను, వారనేకశతాబ్దముల కాలము భారతదేశమున సగముభాగము పరిపాలించిరని ఈ 'మహనీయులు' తెలిసికొందురుగాక! నా కులస్థుల ప్రసక్తియేలేనిచో భారతీయనాగరికతయందు మిగులున దేముండును? నారక్తబాంధవుల నుండియే వంగదేశము తమ మహాతత్త్వవేత్తను, కవిశిఖామణిని, ఉత్తమ చరిత్రకారుని, ప్రాచీనవస్తుపరిశోధకాగ్రగణ్యుని, ఎందరో మాన్యతమ మతబోధకులను బడయగలిగినది. నారక్తమే ఆధునిక శాస్త్రవేత్తలలో ఉత్తమోత్తముని భారతదేశమునకు ప్రసాదించినది. ఈనిందాపరులు మనదేశచరిత్రను కొంచెము తెలిసికొనవలసియున్నది. మనలోని పై మూడుకులములను గుఱించి వీరు కొంత చదివిన బాగుండును. సన్న్యాసులగుటకు బ్రాహ్మణుడును క్షత్రియుడును వైశ్యుడును సమానాధికారము గలవారనియు,

వేదపఠనమునకు త్రైవర్ణికులును సమానార్హులనియు పాపము వీరికి తెలియదు. సరే, పోనిండు. ఇది యేదో మాటవరుసను చెప్పితిని. ఊరక ప్రస్తావించితిని. వారు నన్ను శూద్రుడు అనినారని నా కేమాత్రమును బాధలేదు. నా పూర్వులు దీనజనులను హింసించిన పాపమునకు అది కొంత పరిహారము కాగలదు! నేనొక మాలవాడనైనయెడల ఇంకను సంతసించియుందును. ఏల యందురా, బ్రాహ్మణులలో బ్రాహ్మణుడై, మాలవాని ఇంటిని అలికి శుద్ధిచేయ సమకట్టిన మహాపురుషుని శిష్యుడను నేను! ఆ మాలడు వారినటుల చేయనీయకపోవుట చిత్రమా! బ్రాహ్మణ సన్న్యాసి వచ్చి తన ఇల్లు శుభ్రపఱచుటకు అత డెటు లంగీకరించును? ఈ మహాసీయుడో అర్ధరాత్రమున లేచి, అతిరహస్యముగా ఆ మాలనియింట ప్రవేశించి వాని మరుగుదొడ్డిని శుద్ధిచేసెను! తన పొడుగాటి తలవెంట్రుకలతో ఆ స్థలమును తుడిచెను. సర్వ జనులకును తాను సేవకుడైయుండు నిమిత్తము దినదినము ఆయన అటుల చేయుచు వచ్చెను. ఆ మహాపురుషుని పాదములను నేను నా శిరస్సున ధరింతును! ఆయన నా మార్గదర్శి! ఆ మార్గదర్శి జీవితమునే నేను అనుసరింప ప్రయత్నించుచున్నాను. అందఱకును సేవకుడగుటద్వారా హిందువు తన్ను తా నుద్ధరించుకొనుటకు యత్నించును. హిందువులు జనసామాన్యమును ఉద్ధరింపవలసిన మార్గము అది. అంతేకాని యే యన్యులసాహాయ్యమునో యాచించి కాదు! పాశ్చాత్యనాగరికతతో ఇరువదిసంవత్సరముల గాఢపరిచయముగల ఒకపురుషుని ఉదాహరణము నా జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆ పురుషుడు పరదేశమునందున్న తనస్నేహితుడు తిండిలేక చచ్చుట చూడవలెనని కోరుకొనుచుండువాడు. ఎందులకో తెలియునా, ఆ స్నేహితుడు ప్రజల యాదరమును చూఱగొనినందువలన! తన ధనార్జనోపాయమునకు ఆ స్నేహితుడు ఆటంకముగా తోచుటవలన! నేను పేర్కొనిన ఇంకొక పురుషుడు యథార్థముగా పూర్వాచారముల ననుసరించు హిందువు మన

దేశమున ప్రవర్తించువిధమున కుదాహరణము. మన సంస్కర్త లలో ఒక్కనియందేని నిర్మలసేవాభావము గోచరించు నెడల, అతడు మాలవానికైనను నిష్కామముగా సేవచేయుటకు సిద్ధపడు నెడల, నేను వానిపాదముల చెంత కూర్చుండి వానిబోధను శిరసా వహింతును. అంతవఱకు నేను ఈ సంస్కర్తలను, గింస్కర్తలను లెక్కచేయను. కడవెడు కబుర్లకన్న గంటెడు ఆచరణ మేలు.

ఇక చెన్నపురి యందలి సంస్కరణసంఘములవారినిగూర్చి విచారింతము. వారికి నాయెడల మిక్కిలి ప్రేమ. వారు నన్ను గూర్చి చాల దయగా మాట్లాడుదురు. వంగదేశ సంస్కర్తలకును, చెన్నపురి సంస్కర్తలకును, తారతమ్యముకలదని వారు నాకు తెలిపిరి. ఇది నిజమే యని నేను మనస్ఫూర్తిగా ఆమోదించు చున్నాను. చెన్నపురి ప్రస్తుతము మనోహరమగు స్థితిలోనున్నది. వంగదేశమువలె చెన్నపురి "క్రియాప్రతిక్రియల" ఆటలోనికి దిగలేదు. ఇక్కడ సర్వరంగములందును సుస్థిరమగు నిరంతర పురోగమనము కాన్పించుచున్నది. ఇక్కడ ప్రతిజీవితాంశము ప్రవర్ధమానమగుచున్నది; ప్రతిక్రియలు అడ్డుటలేదు. అనేక విషయములలో వంగదేశమున కొంతవఱకు పునరుద్ధరణము గోచ రించుచున్నది. చెన్నపురిలో జరుగుచున్నది పునరుద్ధరణము కాదు, పెరుగుదల—సహజమగు పెరుగుదల. అందుచే ఈ రెండు రాష్ట్రములమధ్య, సంస్కర్తలు కలదని చెప్పు భేదము నిజముగా కలదని నేను పూర్తిగా ఒప్పుకొనుచున్నాను. కాని వారికిని అర్థముకానట్టి విషయము ఒక్కటి గలదు. ఇచ్చటి సంస్కరణ సంఘములలోని కొందఱు నన్ను భయపెట్టి తమలో చేర్చుకొన వలెనని, పాపము, తీవ్రముగా ప్రయత్నించుచున్నారు. వీ రిటుల ప్రయత్నించుట నాకు చిత్రముగా నున్నది. తన జీవితములో పదు నాలుగుసంవత్సరముల పాటు పస్తులు పడియుండుటకు అలవాటు పడి, రేపు తనకు ఎచ్చట తిండి దొరకునో యెఱుగక, ఎచ్చట

నిద్రింపవలసివచ్చునో తెలియక, తిరుగుచుండిన నరుని భయపెట్టి లోబఱచుకొనుట సులభమైనపని కాదు. శరీరము కొంగర్లుపోయి గడ్డకట్టెడు మంచుభూములయందు దిగంబర ప్రాయుడై తిరుగుచు, రేపు ఎట్లుగడచునో తెలయనిస్థితిలో అనేకసంవత్సరములు గడప సాహసించిన పురుషుని సులభముగా లొంగదీయుట భారతదేశ మున సాధ్యముకాదు. నేను వారికి తెలుపదలచిన మొట్టమొదటి విషయ మిది —— నాకు కొంత స్వకీయమగు ఇచ్ఛాశక్తి కలదు; కొంచెము లోకానుభవమును కలదు; నేను ప్రపంచమునకు చాటి తెలుప వలసిన సందేశముకూడ ఒకటి కలదు. నిర్భయముగ, ముందేమగునో అను ఆరాటములేకుండ, నేను దానిని ప్రకటిం చెదను. నేను తమ్మునందఱను మించిన సంస్కర్తనని ఈ సంస్క ర్తలకు తెలియజేయుచున్నాను. - వారు స్వల్పవిషయములను మాత్రము సంస్కరింపగోరుచున్నారు; నేనో సమూలసంస్కారము గావింపచూచుచున్నాను. మఱియు మాసంస్కరణ పద్ధతులయందు భేదము కలదు. వారిది నిర్మూలనపద్ధతి; నాది నిర్మాణపద్ధతి. నాకు సంస్కరణమందు నమ్మకములేదు. పెరుగుదలయందు నా నమ్మకము. నేను ఈశ్వరుని స్థానమునందు కూర్చుండి మన సంఘ మును శాసించుటకు సాహసించువాడను కాను. "ఈ మార్గమున నీవుపొమ్ము; ఆ మార్గమున పోవులదు" అనుచు అధికారికముగా శాసింపజాలను. తనకు చేతనైనన్ని ఇసుక రేణువులను తెచ్చి సముద్రమున దులుపుటతో పరితృప్తినంది శ్రీరామచంద్రుని సేతు బంధన మహాకార్యమున పాల్గొనిన ఉడుతవలె నుండగోరెదను. నాస్థితి అట్టిది! ఈ విచిత్రమగు జాతీయయంత్రము అనేకయుగ ములు పనిచేసినది. ఈ అద్భుతజాతీయ జీవననది మన యెదుట ప్రవహించుచున్నది. అది మంచిదో కాదో, అది యెటులపాఱ వలయునో, ఎవనికి ఎఱుక? ఎవడు చెప్పసాహసింపగలడు? అనేక పరిస్థితులు దానినిచుట్టుముట్టినవి. అవి దాని కొక ప్రత్యేక గతిని సూచించుచున్నవి. ఒకప్పుడు దానిని నెమ్మదిగను, మఱొకప్పుడు

వేగిరముగను నడపుచున్నవి. దాని గతిని శాసించుటకు ఎవనికి ధైర్యముగలదు ? గీత తెలుపునటుల ఫలాపేక్ష లేక పనిచేయుట మనవంతు. ఈ జాతీయజీవనాగ్నికి కావలసిన ఇంధనములు సమకూర్పుము. దాని వృద్ధిని అదియే చూచుకొనును. దానివృద్ధిని నిర్ణయించి శాసించువాడెవడునులేడు. మన సంఘములో కావలసినన్ని లోపములున్నవి నిజమే. కాని ప్రతి ఇతర సంఘమునందునుకూడ లోపములుకలవు. మనదేశము ఒక్కొక్కప్పుడు వితంతువుల కన్నీటి ధారలతో తడిసిపోవుచున్నది; అచ్చట, పాశ్చాత్యదేశములందు, పెండ్లికానిపడుచుల నిట్టూర్పులతో గాలి సుడులు తిరిగిపోవుచున్నవి. ఇక్కడ దారిద్ర్యము జాతి వినాశహేతువుగనున్నది; అచ్చట భోగలాలసత్వమునందలి వెక్కసపాటు జాతివినాశకారణముగానున్నది! ఇచ్చట తినుటకేమియు దొరకనికారణమున ప్రజలు ఆత్మహత్యచేసికొనుచున్నారు; అచ్చట తిండి వెక్కసమై ఆత్మహత్య చేసికొనుచున్నారు. ఇటు లెల్లెడల కీడుకలదు. అది జీర్ణించిన కీళ్లవాతపు నొప్పివంటిది. దానిని పాదమునుండి తప్పించినచో శిరస్సున కెగబ్రాకును. అక్కడనుండి తప్పించినయెడల మఱొకతావున చొరబడును. ఒక చోటునుండి మఱొకచోటికి దానిని మార్ప జూచుటే మనము చేయునది. అంతయే. పసిబిడ్డలు కీడును వారింప ప్రయత్నించుట సరియైన మార్గముకాదు. మంచిచెడ్డలు ఒకేనాణేము యొక్క ఇరుప్రక్కలవలె పరస్పరానుబద్ధములని మన వేదాంతముబోధించుచున్నది. నీవు వానిలో ఒకదానిని కోరుకొందువేని రెండవదికూడ వచ్చితీరును. సముద్రమున ఒక అల పైకిలేచుట మఱొకచోట పల్లమేర్పడుటవలననే గదా! ఇంతేల, జన్మయే అనర్థము. ఇతర జీవులను చంపకుండ గాలి పీల్చుటయే సంభవముకాదు! ఎవరికో ఒకరికి లేకుండ చేసినకాని, ఒక ముద్ద అన్నము నీ నోట బడుట లేదు. ప్రకృతి ధర్మమిట్లున్నది. ఇది జీవితతత్త్వము. కాబట్టి మనము కీడును ప్రతిఘటించుటకై చేయుకార్య మంతయు బాహ్య

క్రియారూపముగాక సంకల్పరూపమైనదేయని గ్రహించుచే! మనము ఎంతగా డంబములు పల్కినను, కీడు తొలగించుపని స్థూల క్రియారూపమైనది కాక బోధనరూపమైనదిగనే యున్నది. కీడును తొలగించు కార్యమునుగూర్చి మన మీ విషయమును మొట్ట మొదట గ్రహింపవలయును. అది మనలను ఎక్కువ శాంతచిత్తులనుగా చేయవలయును; అది మనరక్తములో పొంగిపడుచున్న మూర్ఖావేశమును తొలగింపవలయును. ఎచ్చటెచ్చట సంస్కరణములు దురావేశముతో సాగునో, అచ్చటనెల్ల అవి వ్యర్థములై పోయెనని ప్రపంచచరిత్ర మనకు తెలుపుచున్నది. అమెరికాఖండములో బానిసతనమును రూపుమాపుటకై జరిగినయుద్ధమునకంటె, ధర్మస్వాతంత్ర్యసంస్థాపనకొఱకు జరిగిన మహాప్రయత్నము వేఱొకటి లేదు. దానినిగుఱించి మీరందఱు ఎఱుగుదురుగదా! దానివలన సిద్ధించినదేమి? బానిసతనమున్ననాటికంటె, ఈ నాడు ఆ బానిసల ఇక్కట్టులు నూఱురెట్లు ఘోరతరముగానున్నవి! ఈ బానిసతనము పోవకపూర్వము ఈ దీనులగు నీగ్రోలు ఎవరో ఒకని సొత్తుగానైన నుండిరి. తనసొత్తు అగుటచేత వారిని సంరక్షింపవలసిన భారము ఆతనిమీద నుండెడిది. అందువలన వారి ప్రాణములు సురక్షితముగానుండెడివి. ఇప్పుడో వా రెవరి సొత్తును కారు. వారిప్రాణములకు విలువలేదు. ఏ మాత్రము మిషదొరకినను, వారిని నిలువునకాల్చి చంపుదురు. వారిని కాల్చి చంపు హంతకులను శిక్షించుచట్టము లేదు! వారు నల్లవారుగాన నర జీవులే కారట! పోనీ వారు పశువులైనను కారు. వారిగతి యిట్లున్నది. కీడును చట్టములసాహాయ్యమునగాని మూర్ఖావేశము చేతగాని బలాత్కారముగా తొలగించినయెడల ఫలితమిట్లుండును. లోకోపకారము కొఱకైనను సరే, దురావేశముతో సాగించు ఉద్యమములు ఇట్లు పరిణమించుచుండును. ఇది నేను స్వయముగా చూచితిని. నాస్వంత అనుభవమువలన నాకీ విషయము తెలిసినది. కాబట్టి ఈ ఆక్షేపకసంఘములలో దేనిలోను నేను చేరజాలను.

ఖండనమునకు ఎందుకు పూనవలయును ? ప్రతిసంఘమునందును లోపము లుండునని యెల్లరకును తెలియును. ఈనాడు చిన్నపిల్ల వాడుకూడ ఉపన్యాసపీఠమునెక్కి హిందూసంఘమునందలి దోష ములనుగూర్చి పెద్ద ఉపన్యాసమును ఈయగలడు. చదువు సంధ్య లెఱుగక లోకసంచారియై పరదేశములనుండి ఇక్కడికివచ్చు ప్రతి వాడును, రైలులోపోవుచు ఒకసారి సింహావలోకనముచేసి హిందూదేశములోని ఘోరదురాచారములనుగూర్చి గొప్పగొప్ప పండితోపన్యాసములను కురిపింపగలడు. మన సంఘములోదోషము లున్నవని మనము ఒప్పుకొనుచునేయున్నాము. దోషమేదియో, ప్రతివాడును చూపగలడు. కాని ఆ దోషములను పరిహరించు మార్గమును చూపువాడే ప్రజోపకారి. ఒకప్పుడు నీటమునుగు చున్న ఒక పిల్లవానికి దారినిబోవుచున్న ఒకవేదాంతి ఉపన్యాస మీయసాగినాడట. అందులకు పిల్లవాడు "ముందు నన్ను నీటి నుండి బయటికిలాగుము" అని అఱపులు పెట్టెనట. అటులనే "మేము ఉపన్యాసములు కావలసినన్ని విన్నాము, సంఘములు కావలసినన్ని యున్నవి. పత్రికలును వలసినన్నికలవు. మాకు చేయిఅందించి పైకిలాగు పురుషుడే కరవైనాడు. నిజముగా మమ్ముప్రేమించువా రెక్కడనైన నున్నారా ? మాయందు సాను భూతిగల దయాపరు డెందుగలడు ?" అని మనప్రజలు ఘోషించు చున్నారు. అవును, ఇప్పు డట్టి పురుషుడే కావలసియున్నాడు. ఈసంస్కరణోద్యమములతో నాకుగల అభిప్రాయభేదము అక్క డనే యున్నది. ఈ దేశమున నూఱుసంవత్సరములుగా ఉద్యమ ములు పనిచేయుచున్నవి. తిట్లాటలు సాగించుట, నిందాపూరిత గ్రంథములను రచించుట తప్ప చేకూరిన మే లేమున్నది ! ఈ రచనలు లేకున్న ఎంత బాగుండెడిదో ! వారు పూర్వాచారపరు లను విమర్శించిరి ; ఖండించిరి ; దూషించిరి. ఇంతలో పూర్వా చారపరులును ఆవైఖరినే అవలంబించి బదులుకు బదులు తీర్ప సాగిరి. తత్ఫలముగా ప్రతి దేశభాషలోను, జాతికి తలవంపులును,

దేశమునకు అవమానమును గలిగించు గ్రంథరాశి సృష్టియైనది! 'సంస్కరణ' మనగా ఇదియా? జాతిని వైభవోన్నతికి తెచ్చుట ఇటులనేనా? ఈ దోషమంతయు ఎవరిది?

సరే, ఇంకొకగొప్పవిషయమునుగూర్చి విచారింప వలసి యున్నది. హిందూదేశములో రాజులే సదా పరిపాలనము చేయుచు వచ్చిరి. రాజులే మన చట్టముల నన్నింటిని నిర్మాణము చేసినవారు. ఇప్పుడు ఆ రాజులు గతించిరి. ఆ ఉద్యమమును తలపెట్టువా రెవరును ఇప్పుడు లేరు. ఈ ప్రభుత్వమునకు సాహసము లేదు. ప్రజాభిప్రాయగమనమును అనుసరించి వీరు ఇప్పుడు తమ మార్గమును సవరించుకొనవలసి వచ్చినది. ప్రజలు తమ సమస్యలను తామే పరిష్కరించుకొనవలెననిన, బల సౌష్ఠవములు గల ప్రజా అభిప్రాయములు ఏర్పడవలెను; దానికి చాలకాలము పట్టును. ఈ లోపుగా మనము ఓపిక పట్టవలసి యున్నది. సంఘ సంస్కార సమస్యలెల్ల 'సంస్కారము కోరువారెక్కడ?' అను ప్రశ్నలో లీనమగుచున్నవి. మొదట వారిని నిర్మింపుడు. వారిప్పుడెక్కడ నున్నారు? లోకమున కానిపించు దౌర్జన్యము లన్నిటిలో అల్పసంఖ్యాకుల దౌర్జన్యమే ఘోరతమమైనది. కొన్ని విషయములు చెడుగు లని భావించు ఏ కొలదిమంది పురుషులో జాతిని కార్యోన్ముఖముగా చేయజాలరు. జాతి కార్యోన్ముఖము కాకుండుటకు కారణమేమి? దానికి విద్య లేదు. కావున మున్ముందు జాతికి విద్య నేర్పి, తరువాత శాసనసభానిర్మాణము చేసికొనుడు. ఆ పిమ్మట శాసనములు బయలుదేఱును. ఎందుండి శాసనములు బయలుదేఱవలయునో, అట్టి అధికారస్థానమును, మొదట సృష్టి చేసికొనుడు. మీ రాజులు గతించి పోయినారు. వారి స్థానమున క్రొత్తగా అధికారము పూనిన ప్రజాశక్తి ఎక్కడ? ముందు దానిని పెంపుచేయుడు. కావున సంఘసంస్కరణ విషయమున సైతము, ప్రజలకు 'ఎఱుక' గలిగించుట మీ మొదటి విధి. ఆ ఎఱుక

కలుగునంతవఱకు మీరు వేచియుండవలసినదే. దాదాపు నూరేండ్ల నుండి మీరు ప్రయత్నించి, సాధించిన సంస్కరణములలో చాల భాగము కేవలము అలంకారప్రాయముగనే ఉండిపోయినవి. ఈ సంస్కరణములలో ప్రతిదియు మొదటి రెండు వర్ణములకు మాత్రమే సంబంధించియుండెనేగాని, తక్కినవానిని తాకనేలేదు. భారతదేశస్త్రీలలో నూటికి డెబ్బదియైదుమంది విషయమున విధవావివాహప్రశ్నతో ప్రసక్తి లేనేలేదు. అట్టి ప్రశ్నలన్నియు హిందూదేశ ప్రజలలో ఉత్తమ కులములవారికి మాత్రమే సంబంధించినవి. వీరు ప్రజాసామాన్యపు ధనముతోనే తాము విద్యలు నేర్చుకొనిరని గ్రహింపుడు. వారి స్వంతగృహములను బాగుచేసికొనుటకు సర్వప్రయత్నములను సాగించుకొనుచున్నారు. కాని అది సమష్టిసంఘసంస్కరణ మనిపించుకొనదు. మీరు ఎప్పుడుగాని, సమస్య పునాదులకడకు, వేరులయొద్దకు, దిగిరావలయును. నేను పూర్ణసంస్కరణమని చెప్పునది ఇట్టిదియే. అగ్నిని అక్కడ ముట్టింపుడు, అక్కడనుండి దానిని పైకిరగిలి రానిండు. అటులనే భారతజాతి నిర్మాణము పూర్తికానిండు. అయ్యది విశాలమగు పెద్ద సమస్య అగుటచేత, దాని పరిష్కారము అంత తేలికమైనదికాదు. కావున మీరు ఆతురపడకుడు. ఈ సమస్య అనేక శతాబ్దముల క్రిందటనే మన పూర్వులు గుర్తించియున్నారు.

ఈ దినములలో, ముఖ్యముగా దక్షిణదేశమున, బౌద్ధమతమునుగూర్చియు, బౌద్ధుల అజ్ఞేయసిద్ధాంతమునుగూర్చియు, ప్రసంగములుచేయుట ఆచారమైనది. ఈనాడు మనకు సంక్రమించిన ఈ పతనదశ బౌద్ధమతమువలననే కలిగినదని వారు కలనైన గ్రహింపకున్నారు. బౌద్ధమతము మనకు ఒప్పగించిపోయిన పిత్రార్జితమే ఇది! బౌద్ధమతము ఎటుల ఉదయించినదో, ఎటుల పతనముగాంచినదో ఎన్నడును పరిశీలించి యెఱుగనివా రనేకులు బౌద్ధమతచరిత్రనుగూర్చి గ్రంథములువ్రాసిరి. వానిలో బౌద్ధ

మతము గౌతమబుద్ధుని అద్భుత నీతిధర్మముల వలనను, మహో త్తర ప్రభావమువలనను, సర్వత్ర వ్యాప్తి గాంచెనని వ్రాయబడి యుండును. ఈ గ్రంథరాజములనే మీరు చదువుచుందురు. బుద్ధ దేవునియెడల నాకు అత్యంత గౌరవమును, పూజ్యభావమును కలవు. కాని బౌద్ధమతవ్యాప్తి ఆ గురుదేవుని వ్యక్తివిశేష మహిమవలనను ధర్మసిద్ధాంతములవలనను కంటె, ఎక్కువగా, బౌద్ధులు దేవళములు నిర్మించుటవలనను; విగ్రహములను ప్రతి ష్ఠించుటవలనను, ఉజ్జ్వలకర్మకలాపములను అనుసరించుటవలనను కలిగినది; ఈమాటలను జ్ఞప్తియందుంచుకొనుడు. ఈ రీతిగా బౌద్ధమతము ప్రవర్ధిల్లినది. ఎవరి యిండ్లలో వారు ఆహుతులు వేయుచువచ్చిన చిన్న హోమగుండములు, ఈపెద్దపెద్ద దేవాలయ ములతో, కర్మకలాపములతో పోటీపడి నిలువలేకపోయెను. కాని కాలక్రమమున అదంతయును భ్రష్టమైపోయినది; దుర్నీతిమయ మయ్యెను. అది ఈ సభయెదుట మాటలాడదగని విషయము. దానినిగుఱించి తెలిసికొనగోరువారు ఈ దక్షిణ భారతదేశమున శిల్పవిశేషములతో నిండియున్న పెద్దపెద్ద దేవాలయములను పరిశీ లించినచో, కొంచెము గ్రహింపగలుగుదురు. బౌద్ధులవలన మనకు సంక్రమించిన ఉత్తరాధికారమంతయు ఇంతమాత్రమే.

ఆ పిమ్మట మహాసంస్కర్తయగు శంకరాచార్యులవారును, వారి అనుచరులును బయలుదేరిరి. హిందూదేశవాసుల నెల్లరను స్వచ్ఛమగు వేదాంతమతము వైపునకు నెమ్మదిగా మరల్చుకొని వచ్చుటకు వారు బ్రహ్మప్రయత్నముచేసిరి. ఆయనకు, ఆయన అనుయాయులకు మన యందున్న లోపములు పూర్తిగా తెలి యును. ఐనను వారు దూషణలు చేయుటకు పూనుకొనలేదు! "మీరవలంబించున దంతయు దోషము; దానిని దూరముగ నెట్టి వేయుడు" అని వారు అప్పటి ఆచారములను తిరస్కరింపలేదు; అటుల నెన్నడును కార్యసిద్ధి పొసగదు. మూడువందల సంవత్సర

ములలో, రోమను గ్రీకు మతముల పలుకుబడిని క్రైస్తవమతము పూర్తిగా కూలద్రోసెనని నా మిత్రుడు డాక్టరు బరోస్ చెప్పుచున్నటుల ఈ దినమే పత్రికలలో చదివితిని. అవి యూరపు, గ్రీసు, రోమునగరములను చూచిన వాని పలుకులు కావు. రోమను గ్రీకు మతముల పలుకుబడి యంతయు నిలిచియేయున్నది! ప్రాటెస్టెంటు మతవ్యాప్తిగల దేశములలో సైతము, మారుపేరులతోనో, క్రొత్తవేషములతోనో, ఆ ప్రాత దేవతలు నిలిచియే యున్నారు! ఆ స్త్రీదేవతలే మరియమ్మలైరి; దేవుళ్లు ప్రవక్తలైరి! ఆ ఆచారములు క్రొత్త రూపము దాల్చినవి. 'పాంటిఫెక్స్ మాక్సిమస్' అను ప్రాతబిరుదు సైతము ఇప్పటికిని నిలిచియే యున్నది. కావున ఆకస్మికమగు మార్పులు పొసగనేరవు. శ్రీ శంకరాచార్యుల వారికి ఈ విషయము తెలియును. శ్రీరామానుజాచార్యులవారికిని తెలియును. వారికిగల మహాశయము అప్పుడున్న మతమును నెమ్మదిగా పరమావధిని చేరునట్లు నడుపుటయే. దీనికి వ్యతిరేకమగు రెండవపద్ధతిని అవలంబించి యుండినయెడల వారును లోకవంచకులై పోయెడివారే! వారి మతమునందలి ప్రధానసిద్ధాంతము పరిణామము; మార్పు; ఆవశ్యకములును సహకారకములును అగు భిన్నభిన్న అవస్థలను, అవస్థాంతరములను పొందుచు మార్పుచెందిచెంది జీవుడు పరమావధిని చేరవలసియున్నాడనిగదా ఆ సిద్ధాంతము. కావున వారిపై దోషారోపణము ఎవరు చేయగలరు?

'విగ్రహారాధన దోషము' అని పలుకుట ఈ దినములలో అలవాటై పోయినది. ప్రతివాడును ఆలోచనలేకుండ ఆమాటను అంగీకరించుచున్నాడు. నేనును ఒకప్పుడు అటులనే భావించితిని. అందుకు ప్రాయశ్చిత్తముగా, విగ్రహారాధనమూలమున సర్వమును సాధించిన ఒక మహాపురుషుని పాదములను నేను సేవింపవలసి వచ్చినది. వారే శ్రీ రామకృష్ణపరమహంసగారు. విగ్రహారాధన

మూలమున అట్టి రామకృష్ణపరమహంసలు సిద్ధించియుండ, మీ కిపుడు కావలసినది ఈ సంస్కర్తల సిద్ధాంతములా, లేక పవిత్రములగు విగ్రహములా? మీ సమాధానమును తెలియగోరుచున్నాను. విగ్రహారాధనమూలమున రామకృష్ణపరమహంసలను కల్పనచేయగలుగుచో, మీరు ఇంకను వేలకొలది విగ్రహములను చేకొనుడు! భగవంతుడు మీ యత్నములను సత్వరము సఫలముచేయును గాక! మీకు సాధ్యమగు ఏ విధానముచేతనైనను సరియే, అటువంటి మహాపురుషులను సృజింపుడు. ఐనను, విగ్రహారాధనము దోషమనుచున్నారు. ఎందువలన? ఎందువలననో ఎవరికిని తెలియదు! కొన్ని శతాబ్దములకు పూర్వము యూదియాజాతిపురుషుడొకడు విగ్రహారాధనను ఖండించెనట. అనగా, తన ఆరాధ్యవిగ్రహమునుతప్ప, తక్కినవారి విగ్రహములన్నింటిని దూష్యము లనె నట! దేవునికి ఒకమనోహర రూపమునుగాని, చక్కనిచిహ్నమునుగాని కల్పించుట మహాదోషమని ఆ యూదుడనెను. ఒక పెట్టె యాకారముగా తయారుచేసి, దానిపైని ఇరుప్రక్కల ఇద్దఱు దేవదూతలు కూర్చుండినటులో, వానిపైని ఒక మబ్బు తేలియాడుచున్నటులో, చిత్రరూపకల్పనకూర్చి చూపినయెడల, అది పవిత్రమైన వానిలోనెల్ల పవిత్రమగునట! దేవుడు పావురము రూపమునవచ్చిన యెడల పవిత్రము! కాని ఆ దేవుడే గోరూపమున వచ్చినచో ఊఁహూఁ, పనికిరాదు. నాస్తికుని మూర్ఖమతమని దానినిఖండింప వలసినదే! ప్రపంచమిట్లు నడచుచున్నది! కావుననే 'మర్త్యులమగు మనము ఎట్టి మూర్ఖులమో!' అని ఒకకవివరుడు అన్నాడు. ఎదుటివానికండ్లతో ఏ విషయమునేని చూడగలుగుట మహాదుర్లభము. అదియే మానవజాతికి దాపురించిన అనర్థము. అదియే ద్వేషములకు, అసూయలకు, వాదులాటలకు, పోరాటములకు మూలకారణము! ఎన్నడును చెన్నపట్టణమును వదలి బయటికి అడుగిడని మీరు — మీసాలు వచ్చిన పాపలవంటి మీరు — నిలువబడి, ఈ ముప్పదికోట్ల జను

లకు, వేలకొలది పూర్వసంప్రదాయములతో వెలయు ప్రజాసం దోహమునకు, శాసనకర్తలు కాగోరుచున్నారా? మీకు లజ్జ లేదా? మరలుడు, అట్టి పరమ పాతకకార్యమునుండి వెనుకకు మరలుడు! గుణపాఠములను మీరు ముందుగ నేర్చుకొనుడు. మర్యాదనెఱుగని బాలురారా, మీరు నాలుగు బంతులు కాగితముపై గిలుకగానే, వానిని ప్రకటించు పిచ్చివాడొకడు దొరకినంత మాత్రముననే, మీరు జగద్గురువులమైతి మనుకొనుచున్నారా? మీ అభిప్రాయమే హిందూదేశ ప్రజాభిప్రాయమని తలచుచున్నారా? నేను చెన్నపురి సంఘసంస్కర్తలకు ఈ మాట చెప్పవలసియున్నది. వారియెడల నాకు మిక్కిలి గౌరవమును, ప్రేమయు కలదు. వారి విశాలహృదయములను చూచి; స్వదేశముపై, బిదలపై, దీనులపై, వారికిగల సానుభూతినిచూచి; నాకు వారియందు ప్రీతి యేర్పడినది. కాని, సోదరప్రేమతో వారికి ఒక్కవిషయము చెప్పదలచుకొన్నాను. వారి పద్ధతి సరియైనది కాదు. నూంతేడ్లపాటు దానిని పరీక్షింపగా అది వ్యర్థమని తేలినది. ఇంకొక క్రొత్తపద్ధతిని ప్రయోగించి చూతముగాక!

భారతదేశమున ఎన్నడేని సంస్కర్తలకు కఱవు గలదా? భారతదేశచరిత్రను మీరు చదివితిరా? రామానుజులవారెవరు? శంకరాచార్యులవారెవరు? చైతన్యదేవుడెవరు? కబీరు ఎవరు? దాదు ఎవరు? ఒకరితర్వాత ఒకరుగా ఉదయించిన ఈ బోధకులందఱు ఎవరు? ధగద్ధగితముగా ప్రకాశించు ఈ నక్షత్రరాశి ఎట్టిది? రామానుజులవారు నిమ్నజాతులయెడల కరుణపూన లేదా? బ్రతికియున్నంతకాలమును మాలవారిని సైతము తన మతములో చేర్చుకొనుటకు ఆయన ప్రయత్నించియుండలేదా? మహమ్మదీయులనుగూడ తనవారిలో చేర్చుకొనుటకు ప్రయత్నించియుండెనే! నానక్ మహాశయుడు హిందువులతోడను, మహమ్మదీయులతోడను సంప్రదించి పరిస్థితులు చక్కదిద్దలేదా? వారందఱును సంఘ

సంస్కరణప్రయత్నములు చేసినవారేగదా! వారికృషి ఇప్పుడును కొనసాగుచునే యున్నది. కాని ఉన్నభేదమిది· ఈనాటి సంస్కర్తలవలె వారు ఆర్భాటములు చేయలేదు, శాపనార్థములు పెట్టలేదు. సదా దీవనలే వారి పెదవులనుండి వెలువడినవి. వారెన్నడును ఖండనము చేసియెఱుగరు. 'జాతి నిరంతరము పెరుగుచు పోవలసినదే' అని వారు ప్రజలకు బోధించిరి. వారు వెనుదిరిగిచూచి "సోదరులారా, మీరు చేసినది యోగ్యమైనదే. కాని మనమింకను యోగ్యతరముగా ప్రవర్తింతము" అని పల్కిరి. "మీరు ఇదివఱకు దుష్టులు, ఇప్పుడు యోగ్యులుకండు" అని వారనలేదు. వీరి పలుకులకును మన సంస్కర్తల పలుకులకును అపారమగు తారతమ్యమున్నది. మన సహజశక్తి ననుసరించి మనము పెరుగవలయును. విదేశసంఘములు మనకు చూపిన కార్యమార్గముల నవలంబించుటవలన ప్రయోజనములేదు. అది సాగుట అసంభవము. మనలను నలిపి వంకరటింకరగా మెలిత్రిప్పి, విజాతీయరూపములు తయారుచేయుట సాధ్యముకాదు. భగవత్కృపవలన అది అసాధ్యము. ఇతరజాతుల వ్యవస్థలను నేను నిందింపబూనుటలేదు. అవి వారికి శుభప్రదములే కాని, మనకు మాత్రము కొఱగావు. వారికి పాయస మగునది మనకు విషము కావచ్చును. మనము మున్ముందుగా నేర్చుకొనవలసిన నీతిపార మిదియే. వారిశాస్త్రములు, వారివ్యవస్థలు, వారిపూర్వగాథలు మున్నగువానివలన వారి కీప్రస్తుత ఆచారపద్ధతి సిద్ధించినది. మనమో మన పూర్వగాథలతోడను, వేలకొలది సంవత్సరముల మన కర్మానుభవముతోడను మన వైఖరినే సహజముగా అవలంబింపగలుగుదుము. మన చాలు ననుసరించియే మనము పోగలుగుదుము. మనము చేయవలసినదియు అదియే!

ఇక నా ఉద్యమప్రణాళికనుగుఱించి తెలిపెదను. పూర్వమహాఋషుల అభిప్రాయముల ననుసరించుటయే నా ప్రణాళిక

నడచును. నేను వా రొనర్చిన కార్యమును పరిశోధించితిని. వారు అవలంబించిన క్రియావిధానముల రహస్యమును కనుగొను అదృష్టము నాకు లభించినది. వారు మహనీయసంఘనిర్మాతలు! శక్తిని, పవిత్రతను, చైతన్యమును ప్రసాదింపజాలిన మహామహులు. వారు మహాద్భుతకార్యములను సాధించిరి. అట్టి కార్యములను మనముకూడ సాధింపవలసియున్నది. పరిస్థితులు ఇప్పుడు కొంచెము మాఱినవి. ఆ కారణముచేత మన కర్మవిధానముకూడ స్వల్పముగా మాఱవలసియున్నది. కావలసినది అంతే. ఒక్కొక్క జాతియు ఒక్కొక్క వ్యక్తివలెనే, తన జీవితమునం దొక ప్రత్యేకజీవన పద్ధతి—ఒక విశిష్టమగు 'రాగము' కలిగి వర్ధిల్లుచుండును. ఈ ప్రధానరాగము ననుసరించి, తక్కిన స్వరములన్నియువచ్చి చుట్టును చేరి 'లయ' కలుపుకొనవలసియుండును. ఆంగ్లజాతికి రాజ్యాధికారము ప్రాణాధారవిషయముగా నున్నది. ఇట్లే ఇంకొక దానికి లలితకళామయజీవనమును, ఇంకొకదానికి ఇంకొకటియు, ప్రాణప్రదవిషయములుగా నుండును. భారతదేశములో ఆధ్యాత్మిక జీవనము కేంద్రవిషయముగానున్నది. ఈ ప్రధానరాగము ననుసరించియే ఈ జాతియొక్క జీవనగానమంతయు సాగవలయును. ఏ జాతియైనను, అనేకశతాబ్దములనుండి అనుస్యూతముగా వచ్చిన తన విశిష్టజీవనమార్గమునుండి తొలగి నడచెనా, అది సర్వనాశమై పోవును. కాబట్టి మీ మతమును త్రోసివేసి, రాజకీయములనో, సాంఘికవాదమునో, మఱేయితరవిషయమునో మీ జాతీయజీవనమునకు ప్రధానధర్మముగా గ్రహింతురేని, మీకను వినాశము తప్పదు. ఈ ఆపదను తప్పించుకొనవలెననిన, మతము అనెడు జీవస్థానమును ఆధారముచేసికొని మీ రెల్లరును నడవవలసియుండును. మీ మతమనెడు 'బ్రహ్మదండము' ననుసరించి మీ నాడులన్నియు స్పందింపవలసియున్నవి. అమెరికాదేశీయులకు 'సాంఘికజీవనము' అనునది జాతిధర్మము. అందుచే వారి సాంఘిక జీవితమున 'మతము' ఎట్టి ప్రత్యక్షఫలితమును కల్పించునో తెలుప

కుండ నేనా దేశమున మతబోధ చేయజాలనని గ్రహించితిని. వేదాంతమువలన ఎట్టి విచిత్ర రాజకీయపరివర్తనములు కలుగగలవో తెలుపకుండ, నేను ఇంగ్లాండులో మతబోధ చేయజాలక పోయితిని. అదేతీరున హిందూదేశములో నూతనసంఘనిర్మాణము వలన ఎట్టి ఆధ్యాత్మికజీవనాభివృద్ధి లభింపగలదో చూపుచునే సంఘసంస్కారప్రబోధమును సాగింపవలసియుండును. ఈ జాతికి ఏకైకవాంఛితార్థమగు ఆధ్యాత్మికజీవనము ఎంత చక్కగా వృద్ధికాగలదో చూపుచునే రాజకీయములను సైతము బోధింపవలసి యుండును. ప్రతిమనుష్యుడును తన ఈప్సితార్థమును తానే నిర్ణయించుకొనవలసి యుండును, అటులనే ప్రతిజాతియు. యుగాంతరములనాడే మన ఈప్సితమును మనము నిర్ణయించుకొంటిమి. కావున మనము దానికి తప్పక బద్ధులమై వర్తింపవలయును. మీలో అనేకులు ఈ నిర్ణయము దోషమేమోయని సందేహించుచున్నట్లున్నారు. అది యేమంత దోషమైనది కాదు లెండు! అనాత్మపదార్థమును విడిచి ఆత్మపదార్థమును, నరుడు విడిచి నారాయణుని, ధ్యానము చేయబూనుట అంత చెడ్డనిర్ణయమగునా? పరలోకమునుగూర్చి సుస్థిరవిశ్వాసము, ఇహలోకముపై తీవ్ర నిరసనభావము, గాఢవైరాగ్యబలము, భగవంతునియందు అచంచలభక్తి, జీవుడు నిత్యుడనెడు దృఢనిశ్చయము మీలో కలవు. వానిని మీలో ఎవరేని పూర్తిగా విసర్జింపగలరా యని నిలువదీసి అడుగుచున్నాను, చెప్పుడు. ఆ పని మీవలన కాదు. మీరు అనాత్మవాదము పూని, ఏ కొలది నెలలపాటో ఆ వాదమున కనుకూలముగా ప్రసంగము చేసినంతమాత్రమున, నేను మోసపోను. మీ ఆంతర్యము నాకు తెలియును. నేను మీచేయి పట్టుకొనినమాత్రముననే, ఎవరికిని తీసిపోని ఆస్తికాగ్రేసరులై మీరు మరలివచ్చెదరు! మీ స్వభావమును, జన్మవాసనలను మీరు ఎట్లు మార్చుకొనగల్గుదురు?

కాబట్టి భారతదేశములో అభ్యుదయకరమగు ప్రతి ఉద్యమమునకును వెనుక మతోత్సాహము పనిచేయుచుండవలెను. మన దేశమున సాంఘికవాదమునుగాని, రాజకీయభావములనుగాని, ప్రవేశపెట్టుటకు పూర్వము ఆధ్యాత్మికభావములతో దేశమును నింపివేయవలయును. మన ఉపనిషత్తులలోను శాస్త్రములలోను పురాణములలోను గుప్తపఱుపబడియున్న మహాద్భుత సత్యములను వెలికి లాగవలయును. మఠములనుండి వానిని బయటికి తీయవలయును; వనములనుండి తరలించుకొని రావలయును; ప్రత్యేక వర్గముల అధీనమునుండి గుంజుకొని తేవలయును. అవి దేశమందంతటను—ఆసేతు హిమాలయ పర్యంతము — దవానలమువలె వ్యాపింపవలయునని మనము పూనిక వహించితిమా, కార్యము సాధించితి మన్నమాటే. ఆ సత్యములను మనలో ప్రతివాడును తెలిసికొనియుండవలయును. ఏలయందురా? "దీనిని మొదట వినవలయును; పిమ్మట మననము చేయవలయును; తుదిని ధ్యానమున నిలుపవలయును" అని పెద్దలు ప్రవచించియున్నారు. వానిని ప్రజలకు మొట్టమొదట వినికిడి చేయవలయును; ప్రజలకు తమ శాస్త్రములలోగల ఈ మహాసత్యములను వినిపించు పుణ్యాశాలు రెవ్వరో! వారి యదృష్టమే యదృష్టము! నేడు దీనికి మించిన సత్కర్మ మఱియొకటిలేదు. కలియుగములో ఒక కర్మమాత్రమే మిగిలియున్నది—యజ్ఞములు, ఘోరతపస్సులు ఇప్పుడు ఫలప్రదములు కావు. కర్మలయందుకూడ ఒక్కటి మాత్రమే మిగిలియున్నది; అది దానకర్మ! "దానములలోకెల్ల ఆధ్యాత్మికవిద్యాదానము శ్రేష్ఠతమమైనది! దాని తర్వాతిది లౌకికజ్ఞానదానము; దానితర్వాతిది ప్రాణదానము; నాల్గవది అన్నదానము" అని మన వ్యాసులవారు చెప్పియున్నారు. ఆహా! మనది ఎట్టి విశిష్టదాతలతోగూడినజాతియో చూడుడు! శుష్కదరిద్రదశయందుండు ఈ దేశములో ఎన్నెన్ని దానధర్మములు చేయబడుచున్నవో చూడుడు! చేత చిల్లిగవ్వయైన లేని నిరుపేద సైతము ఆసేతు

హిమాచలము హాయిగా, సుఖముగా తీర్థయాత్ర చేయగలడు; ప్రియమిత్రునివలె ప్రతి వానివలనను ఆదరణపొందగలడు! ఎక్కడనేని ఒక పిడచ అన్నమున్నంతవఱకు ఈ దేశమున ఏ బిచ్చగాడును ఆకలిచే మరణింపడు. ఓహో, ఎట్టి ఔదార్యమో చూడుడు!

మొదటివిధమగు దానముయొక్క శక్తిని చేపట్టి ఈ ధర్మభూమియందు ఆధ్యాత్మికజ్ఞానమును ప్రచారము చేయుదముగాక. ఆ ప్రచారము హిందూదేశపు హద్దులలో నిలిచిపోకూడదు; లోకమంతటిని ఆవరింపవలయును. ఇట్లు లోకవ్యాప్తమగు ధర్మప్రచారమును మనపూర్వులు చేసిరి. హైందవవేదాంతము ఎన్నడును ఈ దేశమునుదాటి పోలేదని చెప్పువారును, మతప్రచారార్థము తొలిసారిగా పరదేశములకేగిన సన్న్యాసిని నేనే యని చెప్పువారును తమజాతి చరిత్రను ఎఱుగనివారే! ఇట్టి సంఘటనములనేకపర్యాయములు సంభవించియేయున్నవి. అవసరమైనప్పుడెల్ల భారతీయాధ్యాత్మికజ్ఞాన ప్రవాహము వెల్లువలై ప్రవహించి, లోకమును ముంచియెత్తుచువచ్చినది. రాజకీయ ప్రచారము రణధ్వనులతోడను, యోధులతోడను, సాగింపవచ్చును. అగ్నిని కురిపించియు, ఖడ్గమును ఝుళిపించియు, లౌకికజ్ఞానమును, సంఘనిర్మాణ విజ్ఞానమును విరివిగా ప్రచారము చేయవచ్చును. కాని ఆధ్యాత్మికజ్ఞానదానము కన్నులకు కానరాకుండ, చెవులకు వినరాకుండ కురియుచు, రోజాపుష్పరాసులను వికసింపజేయుమంచువలె నిశ్శబ్దముగా జరుగవలసియున్నది. భారతదేశము నిరాడంబరముగా లోకమునకు మఱలమఱల చేయుచువచ్చిన దానముఇదియే. ఏదోఒకజాతి విజృంభించి విజయయాత్రలు సాగించి, ప్రపంచములోని ఆయా జాతులను సమ్మేళనముగావించుచు వచ్చినప్పుడెల్ల, రాచబాటలను సిద్ధముచేసి రాకపోకలకు సౌకర్యములను కల్పించినపుడెల్ల, భారతదేశము వెంటనే మేల్కొని ప్రపంచముయొక్క

సమష్టి పురోభివృద్ధికి ఆధ్యాత్మికబలమనెడు తనవంతు దానమును ఇచ్చుచునే వచ్చినది. బుద్ధదేవుడు పుట్టుటకు అనేకయుగములకు పూర్వమే ఇట్టిది జరుగుచుండెను. చీనాలోను, ఆసియామైనరులోను, మలయాద్వీపరాశియందును, దాని గుర్తులిప్పటికిని శేషించియున్నవి. పూర్వము గ్రీసుదేశపు సమ్రాట్టు దిగ్విజయముచేసి, అప్పటికి తెలిసియున్న ప్రపంచము నలుమూలలను కలిపివేసినప్పుడును, ఇదే సంభవించినది. అప్పుడు హిందూదేశపు వేదాంతము వెల్లువలై ప్రవహించినది. పాశ్చాత్యులు గర్వముతో చూపుకొను నేటి నాగరికత, నాటి వెల్లువలలో శేషించినభాగమే. ఇప్పుడు అట్టి అవకాశము మరల వచ్చినది. ఇంగ్లాండుదేశముయొక్క బలప్రభావమువలన ప్రపంచజాతులకు మును పెన్నడునులేని పరస్పరసంబంధము నేడు కలిగినది. ఇంగ్లీషువారి వ్యాపారము కొఱకై ఏర్పడిన రోడ్లు, కాలువలు, ప్రపంచమంతటను నీరంధ్రముగా అల్లుకుపోయినవి. ఇంగ్లీషువారి తెలివితేటలవలన ముందెన్నడును జరిగియుండనిరీతిని, ప్రపంచజాతులు ఈనాడు ఒకదానికొకటి కలిపి ముడివేయబడియున్నవి. మానవచరిత్రయందు పూర్వమెన్నడును జరిగియుండని విధమున కేంద్రవాణిజ్యస్థానములు నెలకొలుపబడియున్నవి. వెంటనే హిందూదేశము ఎట్లో మేలుకొని, తన ఆధ్యాత్మికదానవర్షములను ప్రపంచముపై కురిపించుచున్నది. ఆ ధారలు ఈ రోడ్లు ఈ కాలువలు ఆధారముగా దశదిశాంతములకు పరువులువెట్టును. నేను అమెరికా వెళ్లుట నా ప్రయోజకత్వముగాని, మీ ప్రయోజకత్వముగాని, కాదు. భారతభాగ్యవిధాతయగు హైందవాధిష్ఠానదైవతమే నన్ను పంపియున్నాడు. ప్రపంచమునందలి అన్నిజాతులవారి కడకును, నావంటివారిని వందలకొలదిమందిని ఇంకను పంపనున్నాడు. ఈ కార్యమును అడ్డుపెట్టగల శక్తి లోకమున లేదు. మీ మతమును ప్రచారముచేయుటకు మీరు విదేశములకేగవలసియున్నది. లోకములో ప్రతిజాతికిని మీరు మీ మతధర్మములను

బోధింపుడు. ప్రతివానికిని నీతిసంశోభితమైన ఉపదేశము గావింపుడు. మీరు చేయవలసిన మొట్టమొదటి పని ఇదియే. ఇటుల ఆధ్యాత్మికబోధ చేసిన పిమ్మట, మీకు వలయు లౌకికజ్ఞానము, ఇతరజ్ఞానములు, దానితోపాటు తమంత తామే రాగలవు. కాని మతమును విడిచి మీరు లౌకికజ్ఞానముకొఱకు ప్రయత్నముచేసితిరా—నేను మీకు స్పష్టముగా చెప్పుచున్నాను—"ఈ భారతదేశములో అట్టి మీ ప్రయత్నము వ్యర్థముగాక తప్పదు! దాని యందు మీ ప్రజలకు ఎన్నడును అభిమానము పుట్టదు. కొంతవఱకు ఆ కారణముచేతనే బౌద్ధమతమహోద్యమము సైతము వ్యర్థమైనది.

మిత్రులారా, నేను అవలంబించు విధానమును తెలిపెదను, వినుడు. భారతదేశమునందును, ఇతరదేశములందును, మన పారమార్థికధర్మములను బోధించుటకు తగినవారుగా మన యువకులను తయారుచేయుటకొఱకు భారతదేశములో కొన్నిసంస్థలను నెలకొల్పవలయును. ఇప్పుడు కావలసినది పురుషులుమాత్రమే అని మున్ముందటికి గ్రహింపుడు. తక్కినదంతయు సిద్ధముగ దొరకగలదు. కాని బలిష్ఠులును, జవసంపన్నులును, ఋజువర్తనులును, ఆత్మవిశ్వాసపరులునునైన యువకులు కావలసియున్నారు. అట్టివారు నూరుమంది దొరకిరా ప్రపంచము సంపూర్ణముగా పరివర్తనము పొందగలదు!!! ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నింటికంటెను బలవత్తరమైనది. అది సాక్షాత్తుభగవంతునియొద్దనుండియే వచ్చునది గాన దానిముందు తక్కినదంతయు లొంగిపోవలసినదే. నిర్మలమును, బలిష్ఠమును అగు 'ఇచ్ఛ' (సంకల్పము) సర్వశక్తిమంతమైనది! దానియందు మీకు విశ్వాసములేదా? ఉన్నచో మీ మతములోని మహోన్నతధర్మములను ప్రపంచమునకు బోధించుటకై కంకణము కట్టుకొనుడు. ప్రపంచము ఆ ధర్మములకొఱకై ఎదురుచూచుచున్నది, అనేకశతాబ్దములుగా ప్రజలకు క్షుద్ర

సిద్ధాంతములు నేర్పబడుచు వచ్చినవి. వారు వ్యర్థులని, నరజీవులే కారని, ప్రపంచమునందు ఎల్లెడను బోధలు జరిగినవి. ఎన్నియో శతాబ్దములనుండి వారీ బోధలవలన భయభ్రాంతులై పశుప్రాయులై పోవుచున్నారు. తాము ఆత్మమయులను మాటను వినుటకైనను వారెన్నడును నోచుకొనలేదు. వారికి ఆత్మను గుఱించి తెలుపుడు. "మీలో నీచాతినీచునందును ఆత్మ కలదు. అది యెన్నడును పుట్టునదికాదు, చచ్చునదికాదు. దానిని కత్తి తెగవేయజాలదు; నిప్పు కాల్పజాలదు, గాలి ఎండింపజాలదు, అది ఆద్యంతములులేనిది, అమృతమైనది, పరమపవిత్రమును సర్వశక్తిమంతమును సర్వవ్యాపకమును ఐనది" అని వారికి వినిపింపుడు. వారికి ఆత్మవిశ్వాసమును ప్రసాదింపుడు. ఇంగ్లీషువారికిని మీకును భేదమెక్కడనున్నది తెలియునా? తమ మతమును గుఱించియు, తమ స్వధర్మమును గుఱించియు, ఎన్ని ప్రసంగములైనను చేయుదురుగాక. మీకుగల తారతమ్యము నాకు తెలియును: ఆంగ్లేయునకు తనయందు తనకు విశ్వాసము కలదు, మీకది లేదు. తానొక ఆంగ్లేయుడని, తానేదైన చేయగలడని, అతనికి విశ్వాసము దృఢముగా కలదు! ఈ యాత్మవిశ్వాసమువలననే వాని అంతర్యామునను భగవంతుడు వానికి ప్రత్యక్షమగును! అతడంతట తన యిచ్చవచ్చిన దానిని దేనినైనను సులభముగా చేయగలడు. మీరో, మీరేమియు చేయజాలరని, దద్దమ్మలని, మీవారే మీకు బోధించిరి. దానిని మీరు చక్కగానమ్మి దినదినము నిరర్థకులై పోవుచున్నారు!! మీకు కావలసినది బలము. కాబట్టి మీరు ఆత్మవిశ్వాసమును గలిగియుండుడు. మనము దుర్బలురమై పోయినాము. ఆ కారణముచేతనే "అతిప్రాకృతవాదములు", "అతీంద్రియవాదములు" మున్నగు మతధర్మములెన్నియోవచ్చి మనపై పడుచున్నవి! వానిలో గొప్పసత్యములే ఇమిడియుండవచ్చును. ఐననేమి? అవి మనలను దాదాపుగా నాశనముచేసినవి. మీ నాడులను దృఢమైనవానినిగా చేసికొనుడు. ఇనుపనాడులు,

ఉక్కు-కండరములు మనకు కావలసియున్నవి! మనము పెద్దకాలము శోకములు పెట్టియున్నాము, చాలును. ఇంక శోకించుట వలదు. లేచి మీ పాదములపై మీరు నిలువబడుడు! పురుషులుకండు! ఇప్పుడు మనకు కావలసినది పురుషులను సృజించు మతమే! మనలను పురుషులనుగాచేయు సిద్ధాంతములే యిప్పుడు కావలయును! మనలను పురుషులనుగాచేయు విద్యయే మనకు ఎల్లెడల ఆవశ్యకముగా నున్నది! సత్యమును గుర్తించు టెట్లందురా? కాయికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను, మిమ్ములను దుర్బలురనుగా చేయున దేదియైనను సరియే, దానిని విషప్రాయముగా త్రోసివేయుడు! దానియందు జీవశక్తి లేదు; అది సత్యము కాజాలదు. సత్యము బలవర్ధకమైనది; సత్యము పవిత్రమైనది; సత్యము సర్వజ్ఞము. సత్యము బలదాయకముగా నుండవలయును; జ్ఞానదాయకముగ నుండవలయును; జవసత్త్వదాయకముగా నుండవలయును. రహస్యోపదేశములందు కొన్ని సత్యరేణువులున్నను అవి సాధారణముగా మానవులను నిర్వీర్యులను చేయునవియే! నా మాట నమ్ముడు. నాకీ విషయమున యావజ్జీవానుభవము కలదు. అందుచే అది నిర్వీర్యులనుచేయు స్వభావముగలదని నేను నిర్ణయింపగల్గితిని. నేను భారతదేశమందంతటను పర్యటించితిని; దాదాపు ప్రతిగుహలోను దూరి చూచినాను. హిమాలయములలో నివసించినాను. తమ జీవితమునంతను అందే గడపిన మహనీయులను ఎఱుగుదును. నా జాతియనిన నాకు అభిమానము మెండు. మీ రిప్పటికంటె ఇంకను క్షీణించిపోయి నిర్వీర్యులగుట నేను చూచి సహింపజాలను. కాబట్టి మీకొఱకును సత్యముకొఱకును గూడ "ఇక ఆగుడు! నిలువుడు!" అని నా జాతి క్షీణగతిని ఆపుటకు ఎలుగెత్తి పలుకుచున్నాను. నిర్వీర్యులనుచేయు ఈ రహస్యమతములను త్యజింపుడు. బలము కూర్చుకొనుడు. మీ ఉపనిషత్తులపై, దివ్యమై, సత్త్వప్రదమై, తేజోవంతమై వెలయు మీ వేదాంతశాస్త్రముపై, మరల దృష్టి ప్రస

రింపజేయుడు. ఈ రహస్యవిషయములనుండి, మిమ్ము దుర్బలురను చేయు ఈ రహస్యబోధలనుండి దూరముగా పొండు. వేదాంత ధర్మమును చేకొనుడు. ప్రపంచములోని మహోత్కృష్టధర్మము లెప్పుడుగాని అతిసరళములుగనే యుండును; మీ జీవితములవలె నిరాడంబరములై యుండును. ఉపనిషత్తులు బోధించు ధర్మములు మీ ఎదుటనే యున్నవి. వానిని చేపట్టుడు. వాని ననుసరించి జీవింపుడు. అప్పుడు భారతదేశము మోక్షమొందుకాలము ఆసన్నమగును.

ఇంకొక మాటచెప్పి ముగించెదను. పాశ్చాత్యులు దేశాభిమానమునుగూర్చి తఱచుగా మాట్లాడుచుందురు. దేశాభిమానమునందు నాకును విశ్వాసముకలదు. దేశాభిమానమును గుఱించిన భావములు నాకును కలవు. ఘనకార్యములు సాధించుటకు మూడువిషయములు అవసరము. మొట్టమొదటిది హృదయపూర్వకమగు సానుభూతి. బుద్ధిలో గాని, తర్కములోగాని ఏ మున్నది? అది నాలుగడుగులు మాత్రము పోయి అక్కడ ఆగిపోవును. కాని హృదయద్వారమున దైవప్రేరణ కలుగును. ప్రేమ దుస్సాధ్యములగు ద్వారములనుకూడ తెఱచివేయగలదు. జగద్రహస్యము లన్నింటికిని ప్రేమయే సింహద్వారము. కాబట్టి సంస్కర్తలుకాగోరు మహాశయులారా, దేశాభిమానులుకాగోరు మహాత్ములారా, ముందు సానుభూతిని అలవఱచుకొనుడు. మీకు సానుభూతి గలదా? దేవతలయొక్కయు, మహాఋషులయొక్కయు, సంతానములో లక్షలకొలది జనము నేడు పశుప్రాయులై పోయిరేయని మీరు నిజముగా దుఃఖించుచున్నారా? లక్షలాది జనము తిండిలేక ఈనాడు మలమల మాడుచున్నారేయనిగాని, తిండిలేక కోట్లకొలది జనము అనేకయుగములనుండి చచ్చిపోవుచున్నారనిగాని మీరు పరితాప పడుచున్నారా? అజ్ఞానము నల్లనిమబ్బువలె దేశమును కప్పివేసెనని మీరు ఆరాటపడు

చున్నారా? అది మీ హృదయములను కలచివేయుచున్నదా? మీకు నిద్రపట్టకుండునట్లు చేయుచున్నదా? అది మీ రక్తమందు ప్రవేశించినదా? మీ గుండె దానితో స్పందించుచున్నదా? ఆ విచారముతోడ మీరు పిచ్చివారై పోవుచున్నారా? ఈతీరున అయ్యో, సర్వమును నాశనమైపోయెగదా యను చింత మిమ్మావహించినదా? మీ పేరు ప్రతిష్ఠలను, మీ ఆలుబిడ్డలను, ఆస్తిపాస్తులను, శరీరసౌఖ్యములను సమస్తమును మీరు మఱచిపోయితిరా? నిజము చెప్పుడు. అటుల చేయగలిగితిరా, దేశాభిమానులగుటకు మీరు మొదటి మెట్టును ఎక్కితి రన్నమాట! అసలు నేను అమెరికాకు పోవుట మతమహాసభకొఱకు కాదని మీలో చాలమందికి తెలియును. నా దేశమునకు నేను ఏ సేవయు చేయలేకున్నానే యను పరితాపము నన్ను దయ్యమువలె పట్టుకొనినది. ఆభావము నాలో చేరినది, నా ఆత్మలో దూరినది, నాదేశీయుల కొఱకై పనిచేయు మార్గము కనబడక పండ్రెండు సంవత్సరముల పాటు భారతదేశమంతయు కలయ దిరిగితిని. ఈ చికీర్షతోడనే, ఏమియుతోపక నేను అమెరికాకు పోయితిని. నన్నప్పుడు ఎఱిగియున్నవారికి ఈ సంగతులన్నియు తెలియును. ఆ మతమహాసభ ఎవరికి కావలసివచ్చెను? నా రక్త మాంసములు పంచుకొనిపుట్టిన నా సోదరులు ఇక్కడ క్షయించి పోవుచుండ ఆ సభగొడవ ఎవరికి పట్టినది? అదియే నా మొట్టమొదటి భావము.

మీకు ఆ పరితాపము కలదనుకొందము. సరే, నురుగును బోలి బుసబుసలాడు వ్యర్థపు ప్రసంగములతో మీ శక్తినంతను వ్యయము చేసికొనుటకు మారుగా, ఈ దుఃస్థితినుండి వెలువడు మార్గమును దేనినైనను, అనుష్ఠానయోగ్యమగు ఏ పరిష్కారమునైనను, మీరు కనుగొంటిరా? శాపనార్థములకు మారుగా కొంచెమైనను సాహాయ్యము చేయుమార్గ మేదైన కనిపట్టితిరా? వారి దుఃఖములను ఉపశమింప చేయుటకై, బ్రతికియుండగనే వారి

ప్రాణముల తీయు ఘోర హింసలనుండి వారిని తప్పించుటకై, ఏ ఉపాయము నైనను మీరు కనుగొన ప్రయత్నించితిరా?

ఇంతకూడ చాలదు! పర్వతములవలె లేచి అడ్డమై నిలుచు ఆటంకములను దాటుటకు తగిన సంకల్పశక్తి మీకుగలదా? ఖడ్గము చేతబూని ప్రపంచమంతయు మిమ్ముల నెదిరించి నిలిచినను, ధర్మమని తోచిన దానిని ఆచరించుటకు మీరు సాహసింతురా? మీ భార్యలు బిడ్డలు మీకు విరోధులై నిలిచినప్పటికి, మీ ఐశ్వర్యములు నాశమై పోయినప్పటికిని, మీ పేరు రూపుమాసినప్పటికిని, మీ సర్వస్వమును అదృశ్యమై పోయినప్పటికిని మీరు ధర్మమునే అంటి పట్టుకొని నిలుతురా? దానినే అనుసరించుచు మీ గమ్యమును చేరువఱకు స్థిరసంకల్పముతో పురోగమింతురా? "ఋషులు నిందింతురుగాక, స్తుతింతురుగాక; భాగ్యదేవత వచ్చుగాక, తన త్రోవను తాను పోవుగాక; ఈనాడే మరణము వచ్చిపడుగాక, నూరుసంవత్సరములు అగుగాక; సత్యమార్గమునుండి ఒక అంగుళమైనను తొలగనివాడే నిజముగా స్థిరచిత్తుడగు పురుషుడు!" అని భర్తృహరి చెప్పుచున్నాడు. అట్టి సుస్థిరత మీయందు కలదా? ఈ మూడు విషయములు మీకు లభించునెడల మీలోని ప్రతివాడును అద్భుతకార్యములు చేయజాలును. మీరు వార్తాపత్రికలలో వ్యాసములు వ్రాయనక్కఱలేదు; ఉపన్యాసములనిచ్చుచు అందందు తిరుగాడ నవసరములేదు. మీముఖమే దేదీప్యమానముగా తేజరిల్లును. మీరు గుహాంతరములందు నివసించుచున్నప్పటికిని మీ సంకల్పములు రాతిగోడలను ఛేదించుకొనిపోయి, శతాబ్దముల కొలది లోకమందంతటను స్పందించుచుండును. అవి ఎవని మేధయందో నాటుకొని, అక్కడనుండి మరల పనిచేయుచుండును. సంకల్పముయొక్క శక్తి అటువంటిది. ఋజుత్వముయొక్క మహిమ అటులుండును. నిష్కల్మషదీక్షకు అట్టి సమర్థత కలదు.

ప్రాయశః మీకు వేళ అతిక్రమించుచున్నది. ఇంకొక మాట మాత్రము వినుడు! నా దేశీయులారా! నా మిత్రులారా! నా బిడ్డలారా! ఈ జాతీయనౌక కోట్లకొలది జీవులను ఈ జీవన ప్రవంతిమీద దాటించుచు వచ్చినది. అనేక శతాబ్దములనుండి ఇది ఈ నదిమీద ఇటునటు తిరుగుచున్నది. దాని సాహాయ్యమున కోట్లకొలది జీవులు ఆవలియొడ్డునచేరి నిత్యానందమును బడయజాలిరి! కాని నేడు మీ దోషమువలననే కావచ్చును, ఈ పడవ కొంచెము ఓటిదైనది. దానికొక తూటుపడినది. అట్లని దానిని మీరు దూషింతురా! ప్రపంచములో ఏ ఇతర వస్తువు ఇంత ఎక్కువగా పనిచేయలేదని మీకు తెలియునుగదా! అట్టి ఈ నౌకపై కినిసి చెలరేగి దానినిగూర్చి అమంగళవాక్యములు పలుకుట మీకు తగునా! ఈ జాతీయనౌకలో — ఈమన సంఘములో — రంధ్రములున్నప్పటికిని, మనము దాని బిడ్డలమే కదా! రండు, మనము పోయి ఆ రంధ్రములను బాగుచేయుదము! మన హృదయరక్తమును ధారవోసి ఆనందముతో ఆ కార్యమును నిర్వర్తింతము! మనకు సాధ్యముకాదేని, ఆ పవిత్రకృషియందే మనము మరణింతుముగాక! మన మెదడుతో బిరడాలనుచేసి, ఆ పడవయొక్క రంధ్రములను పూడ్తుముగాక! అంతేకాని, నిందారోపణ చేయుటయా! వలదు వలదు! ఎన్నటికిని వలదు! ఈసంఘమును గూర్చి నిర్దాక్షిణ్యముగ ఒక్కమాటనైనను పలుకకుడు! దాని పూర్వౌన్నత్యమును గూర్చియైనను నేను దానిని ప్రేమించెదను. మీ రందరును దేవతలబిడ్డలు కావునను, మహిమాఢ్యులగు పితరుల సంతానము కావునను, మిమ్ములను నేను ప్రేమించెదను. నేను మిమ్మెట్లు దూషింపగలను? ఎన్నడును అటుల చేయను. సమస్త ఆశీర్వాదములును, సమస్తమంగళములును మీకగుగాక! నా బిడ్డలారా! నా కలలన్నియు మీకు తెలుపుటకై మీ కడకు వచ్చినాను. మీరు ఆలకింతురా, మీతో కలసి పని చేయుటకు నేను సిద్ధముగా నుందును. మీరు నా మాటలను

చెవిని పెట్టనియెడల, మీరు నన్ను తన్ని హిందూదేశమునుండి వెడలగొట్టినను నేను తిరిగి తిరిగి వచ్చి "అయ్యో, మనమందఱము మునిగిపోవుచున్నాము, లెండు, లెండు" అని మిమ్ము ప్రబోధించు చునే యుందును. నేనిప్పుడు మీతో మీ మధ్య కూర్చుండుటకు వచ్చియున్నాను. మనము మునుగవలసి యుండినయెడల అంద ఱము కలిసియే మునుగుదము. అంతేగాని ఎన్నడును మన పెద వులనుండి దూషణవాక్కులు వెలువడకుండుగాక!



# హైందవజీవితము : వేదాంతము

మన జాతిని పేర్కొనుటకును, మన మతమును తెలుపుట కును, సర్వసామాన్యముగా ప్రయోగింపబడు శబ్ద మొకటికలదు. అది "హిందువు". ఆ 'హిందూ' శబ్దమునకు — వేదాంతమును గుఱించిన నా భావమును వివరించు సందర్భమున కొంత వివరణ మును చెప్పవలసి యున్నది. 'హిందూ' అనెడు మాట, సింధూ నదిని పేర్కొనుటకు గాను ప్రాచీన పారశీకులు వాడుచు వచ్చిరి. సంస్కృతములోని 'స' అను అక్షరము అప్పటి పారశీకభాషలో 'హ' గ మాఱును. కాబట్టి 'సింధు' అను పదము 'హిందు' అయినది. సరే, 'హ' కారమును ఉచ్చరించుట కష్టముగానుం డుట చేత గ్రీకులు దానిని అసలే వదలి వేసిరని మీకు తెలిసియే యుండును. అందువలననే మనకు 'ఇండియనులు' అను నామము ఏర్పడినది. 'సింధూనదికి ఆవలియొడ్డున నివసించువారు' అని తెలుపుటకు ప్రయోగింపబడిన 'హిందూ' పదము పూర్వకాలమున నొకవేళ సార్థకమై ఉండి యున్నను, ఈ ఆధునికకాలమునందు దాని సార్థకత యంతయు పోయినది. ఏలయనగా, సింధూనది యొక్క ఈవలి యొడ్డున నివసించు జనులందఱు ఈ కాలమున

ఒకే మతమునకు చెందిన వారు కారు. ఇప్పుడు ఇక్కడ హిందువులు కాక, మహమ్మదీయులును, పార్సీవారును, క్రైస్తవులును, బౌద్ధులును, జైనులును కలరు. 'హిందూ' అను మాటయొక్క వ్యుత్పత్త్యర్థ ప్రకారము దానిలో వీరందఱును ఇమిడి యుండవలయును. కాని మతవిషయకముగా వీరినందఱిని హిందువులని పిలుచుట సరికాదు. మన మతమునకు సామాన్యనామమును కల్పించుట చాల కష్టమగు పని. ఈ మతము అనేక మతముల యొక్కయు, అనేక భావముల యొక్కయు, వివిధకర్మకలాపముల యొక్కయు, ఆచారముల యొక్కయు, సమ్మేళనమై యున్నది. వీనికన్నిటికి ఒకే పేరుగాని, ఒకే అర్చనావిధానముగాని, ఒకే వ్యవస్థగాని లేక అన్నియు ప్రోగుపడినవి. మన ఈ సంప్రదాయములన్నియు వేదప్రామాణ్యమును మాత్రము అంగీకరించుచున్నవి. వేదములు పరమప్రమాణములని ఒప్పుకొనని ఏవ్యక్తియు 'హిందువు' అని పిలుచుకొనుటకు అర్హుడు కాడని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈవేదములన్నియు కర్మకాండ, జ్ఞానకాండ, అనెడు రెండు భాగములుగా విభజింపబడియున్నవని మీ రెఱుగుదురు. కర్మకాండయందు యజ్ఞములు, క్రతువులు మున్నగు వానిని గూర్చి చెప్పబడియుండును. వానిలో చాలభాగము ఈకాలమునందు ఆచరణలోలేవు, 'ఉపనిషత్తులు' లేక 'వేదాంతము' అని పిలువబడు ఆధ్యాత్మికబోధభాగమునే జ్ఞానకాండ యందురు. మన ఆచార్యులందఱును, మన తత్త్వవేత్తలందఱును, మన గ్రంథకర్తలందఱును — ద్వైతులుగాని, అద్వైతులుగాని, విశిష్టాద్వైతులుగాని— ఈ వేదాంతమునే పరమప్రమాణముగా చూపుదురు. భారతదేశములోని ప్రతి తత్త్వసిద్ధాంతమునకు, ప్రతి సంప్రదాయమునకు, ఉపనిషత్తులలోనే ప్రమాణము చూపవలసి యున్నది. అట్టి ప్రమాణము చూపజాలని సంప్రదాయము వేదబాహ్యమై అసమ్మతమగును. కావున ఈకాలమున ఈదేశమందంతటను గల హిందువులందఱకు వర్తింపగల పేరు కావలెనన్నచో

వారిని 'వేదాంతు' లనిగాని 'వైదికు' లనిగాని పేర్కొనవలెను. ఈ యర్థముననే 'వేదాంతమతము', 'వేదాంతము' అను పదములను నేను సదా వాడుచుందును. దీనిని ఇంకను కొంచెము వివరించెదను. ఏలయన 'వేదాంత' మను పదమును వేదాంతదర్శనములోని అద్వైతమతము అను అర్థముననే చాలమంది వాడుట ఇటీవల ఆచారమైపోయినది. ఉపనిషత్తులను ఆధారముగా పెట్టుకొనిన ఆయా వేదాంతమతములలో, 'అద్వైత' మనునది ఒక శాఖ మాత్రమే యని మీ కందఱకును తెలియుననుకొందును. విశిష్టాద్వైతసాంప్రదాయులును, అద్వైతులతో సమానముగ ఉపనిషత్తులను గౌరవించెదరు. అద్వైతులవలెనే విశిష్టాద్వైతులును వేదాంతము ప్రమాణమని వాదింతురు. ద్వైతులును అట్లే యందురు. హిందూదేశములోని ప్రతి ఇతర సాంప్రదాయియు అట్లే చెప్పును. కాని ప్రజాసామాన్యమునందు 'వేదాంతి' అనగా అద్వైతి యని సాధారణముగా అభిప్రాయము ఏర్పడినది. అందుకు కొంత కారణముకూడ కలదనవచ్చును. వేదములే మనశాస్త్రములైనను, ఆ వైదికసిద్ధాంతములకు వ్యాఖ్యానోదాహరణములుగా తదనంతరము వ్రాయబడిన స్మృతులును, పురాణములునుకూడ ఏర్పడియున్నవి. వీనికి వేదములకున్నంత ప్రామాణికత లేదు నిజమే. ఈ పురాణములును, స్మృతులును శ్రుతికి విరుద్ధముగ నున్నచోట్లనెల్ల, శ్రుతినే అనుసరించి, స్మృతిపురాణములను త్రోసివేయవలెనని శాస్త్రవిధియు గలదు. అద్వైతవేదాంతియగు శ్రీ శంకరాచార్యులవారి వ్యాఖ్యానమునందును, ఆయనచే స్థాపింపబడిన సంప్రదాయమువారి రచనలందును ఉదాహరింపబడిన ప్రమాణములు చాలవఱకు ఉపనిషత్తులనుండి తీసికొనబడినవే. శ్రుతులలో సాధారణముగా కనబడని అంశము నేదేని విశదము చేయవలసినప్పుడు తప్ప, స్మృతులనుండి ప్రమాణములు తీసికొనబడలేదు. ఇతర సంప్రదాయము లన్ననో, వారు ఎక్కువగా స్మృతులను, కొంచెముగా శ్రుతులను, ఆధారముచేసికొనిరి.

ద్వైతసంప్రదాయములన్ననో, అధికాధికముగ స్మృతులనుండియే వారు ప్రమాణములు కైకొనియున్నారు. వేదాంతులమని చెప్పు కొనువారు ఇంతగా స్మృతిప్రమాణములపై నాధారపడుదురని మనము భావింపము; కాని వారటుల చేసిరి. వారింతగా పురాణములనుండి ప్రమాణములను ఎత్తిచూపుటచేతనే అద్వైతియే స్వచ్ఛమగు 'వేదాంతి' యగునను అభిప్రాయ మేర్పడియుండును.

అది యెట్లున్నను, వేదాంతమను శబ్దము భారతీయుల ఆధ్యాత్మికజీవనక్షేత్రమున కంతటికిని అనువర్తింపవలయును. అది వేదములయొక్క అంశమగుటచేత, మనకుగల అత్యంత ప్రాచీనవాఙ్మయమని అందఱచేతను అంగీకరింపబడుచున్నది. నవీనపండితుల అభిప్రాయమెట్లున్నను, వేదములలోని కొన్ని భాగములు ఒకప్పుడును, మఱికొన్ని భాగములు మఱొకప్పుడును వ్రాయబడి యుండెనని హిందువులు అంగీకరింపజాలరు. వేదములన్నియును ఏకకాలమునందే రచింపబడెనని వారు దృఢముగా విశ్వసించుచున్నారు. ఇవి ఎన్నడును రచింపబడినవే కావనియు, బ్రహ్మదేవుని హృదయమున అనాదిగా ఉండియున్నవే యనియు కూడ వారి నమ్మకము. వేదాంతము ద్వైతముయొక్కయు, విశిష్టాద్వైతముయొక్కయు, అద్వైతముయొక్కయు క్షేత్రము నంతను ఆవరించు నను భావముననే నేను వేదాంతశబ్దమును వాడుదును. ఈ ఆవరణములోనికి వచ్చుట కిష్టపడునేని, బౌద్ధ జైనమతములలోని కొన్నికొన్ని భాగములనుసైతము మనము స్వీకరింపవచ్చును. మనహృదయములు అందుకు తగినంత విశాలములుగనే యున్నవి. కాని మనలోనికి వచ్చుటకు ఇష్టపడకున్నది వారే. మనము సంసిద్ధముగనే యున్నాము. తీవ్రదృష్టితో పరిశోధించినయెడల, బౌద్ధమతసారమంతయు ఉపనిషత్తులనుండియే గైకొనబడినదని స్పష్టమగును. బౌద్ధమతములోని మహోదార నీతిసూత్రములన్నియు మన ఉపనిషత్తులందు, 'తు, చ' తప్పకుండ

మాటలు మాటలుగ, అట్లే కాన్పించుచున్నవి. అదేవిధముగ జైనుల సిద్ధాంతములు సైతము వారి స్వకీయభ్రాంతికల్పనలను విడిచినయెడల — మన ఉపనిషత్తులందు గోచరించుచున్నవి. అనంతరకాలమున భారతదేశమున ప్రబలిన ఆధ్యాత్మికమత భావాంకురములన్నియుకూడ ఉపనిషత్తులలో కలవు. ఉపనిషత్తులలో భక్తిభావనాదర్శములేదని కొందఱు వాదములు చేయుచుందురు. ఈ వాదములు కేవలము నిరాధారములు. ఉపనిషత్తులు చక్కగ చదివినచో ఈ వాదములు ఎంతమాత్రము సత్యము కాదని స్పష్టపడును. ప్రతి ఉపనిషత్తునందును కావలసినంత భక్తి యున్నది; మీరు కొంచెము కన్నులు తెఱచి దానిని చూడవలసియుండును, అంతే. ఉత్తరకాలమున పురాణములలోను, ఇతర స్మృతులలోను, పూర్తిగ వికసించియున్న అనేకభక్తిభావములు ఉపనిషత్తులయందు బీజప్రాయముగా నున్నవి. వాని ఆకృతిరేఖలు స్థూలముగా అందే కలవు. కొన్ని పురాణములు ఆ స్థూలరేఖలను సూక్ష్మముగా తీర్చిదిద్దినవి. అంతేగాని, ఉపనిషత్తులలో అంకురముగనైన గోచరింపని ఒక్క భారతీయాదర్శమైనను, నూతనముగ వికసించినది కాన్పింపదు. ఉపనిషత్తులు బాగుగా చదువని కొందఱు పెద్దలు, భక్తికి ఏదో అన్యాధారము చూపవలయునని వెఱ్ఱిప్రయత్నములు చేసియున్నారు. కాని వారి ప్రయత్నములన్నియు వ్యర్థములనుట రుజువైనది. భక్తిపరముగా మీకు కావలసినదంతయు ఉపనిషత్తులలో సంహితలలోసైతము కలదు. భక్తి, పూజ, మున్నగునదంతయు అందున్నది. కాని అవి వికసించుటమాత్రము ఆ తరువాతి కాలముననే క్రమక్రమముగా జరుగుచు వచ్చినది. సంహితాభాగములందు కొన్నికొన్నిచోటుల, భయసంకటములతో కూడిన మతముయొక్క జాడలు మనకు గోచరించును, ఏ వరుణదేవుని ఎదుటనో, మఱొక దేవుని ఎదుటనో, గజగజలాడుచుండెడి అర్చకుడు మనకు కానవచ్చును. పాపభావము వారి నొక్కొకసారి అపారముగా సంక్షో

భింపజేయుటయు కానవచ్చును. కాని ఉపనిషత్తులలో ఇట్టి విషయముల ప్రస్తావనయే కానరాదు. ఉపనిషత్తులలో కానవచ్చు మతభావమున భయమునకు స్థానమే లేదు. అందలి మతము ప్రేమ మయము, భక్తిమయము, జ్ఞానమయము.

ఈ ఉపనిషత్తులే మనకు శాస్త్రగ్రంథములు. వానికి వేఱు వేఱు రీతుల అర్థము చెప్పుదురు. అర్వాచీనములగు పురాణము లకును, ప్రాచీనములగు వేదములకును వైరుధ్యము సంభవించినప్పు డెల్ల, నే నిదివఱకే తెలిపియున్నటుల పురాణములే తలవంపవలసి యుండును. అయినప్పటికిని, యథార్థమునకు మనము నూటికి తొంబదిపాళ్లు పౌరాణికులమును, పదిపాళ్లు మాత్రమే వైదికుల మును అయితిమి. ఈ పదిపాళ్లయినను పూర్తిగ వైదికులమో కాదో! హిందూశాస్త్రాధారము బొత్తుగాలేని అనేక విరుద్ధాచార ములు మనలో కాన్పించుచున్నవి! అట్టి విరుద్ధమతభావములు సైతము మన సంఘములో పరిపాటియై పాతుకొని పోయినవి! వేదములలోగాని, స్మృతులలోగాని, పురాణములలోగాని, ఎట్టి ప్రమాణములును లేక కేవలము స్థానికములై వచ్చు దేశాచార ములను చూచినచో మనకు అత్యాశ్చర్యము కలుగును. పామరు డగు ప్రతి పల్లెటూరివాడును, ఏ చిన్నగ్రామాచారమో నశించి పోయిన యెడల, తా నిక హిందువై నిలువజాలక భ్రష్టుడై పోవలసినదే యని తలచుచున్నాడు! వాని మనస్సులో వేదాంత మతమును, ఈ స్థానికక్షుద్రాచారములును పెనవేసికొని, ఏక రూపమై పోయినవి! అట్టివాడు ధర్మశాస్త్రములను చదివినను కూడ, తాను చేయు వాదనకు యథార్థముగా శాస్త్రాధారము లేదనియు, ఈ ఆచారములను వదలిన యెడల తనకు ఏమాత్రము హాని లేకపోగా, తాను ఉత్తమమానవుడుగాకూడ పరిగణింపబడ గలడనియు గ్రహించుట చాల కష్టము. రెండవది ఇంకొక కష్ట మున్నది. ఈ మన శాస్త్రగ్రంథములు బహువిస్తృతములై

యున్నవి. ఉత్తమవేదాంతగ్రంథములలో నొకటి యగు పతంజలి మహాభాష్యమున, సామవేదమునకు వేయిశాఖలు కలవని చెప్ప బడియున్నది! అవి యన్నియు ఇప్పుడు ఎక్కడ నున్నవి? ఎవనికిని తెలియదు! ప్రతివేదము సంగతియు ఇట్లే అయినది. ఈ గ్రంథ ములు చాలభాగము అదృశ్యమై పోయినవి; కొద్దిభాగములు మాత్రమే మనకు మిగిలియున్నవి. అవియు కొన్నికొన్ని ప్రత్యేక కుటుంబములవారి అధీనమందే యుండెడివి. ఆ కుటుంబములవా రిప్పుడు అంతరించియుందురు, లేదా పరదేశీయులచేత క్రూరముగ వధింపబడియుందురు; మొత్తముమీద ఏదోవిధముగ వారందఱును రూపుమాసిపోయిరి. వారితోపాటు వారు తమ అధీనమందుంచు కొనిన వేదశాఖాపాండిత్యముకూడ నాశమైపోయినది. ఏదేని క్రొత్తవిషయమును బోధించుటకో, ఏదేని వేదవిరుద్ధమగు ధర్మమును ప్రచారము చేయుటకో పూనుకొనిన వారెల్లరు దీని నొక మిషగా పెట్టుకొనుచుందురని మనము జ్ఞప్తినుంచుకొన వలయును. స్థానికాచారమునకును శ్రుతికిని వివాదము సంభవించి నప్పుడెల్ల, ఆ స్థానికాచారము శాస్త్రవిరుద్ధమని చూపబడినప్పు డెల్ల, ఈ వాదనను వారు బయటికి తీయుదురు. ఆ స్థానికాచారము శ్రుతివిరుద్ధము కాదనియు, అది అంతరించిపోయిన యొక శ్రుతి శాఖయందలి ఆచారమే యనియు, కావున దానికి వేదముయొక్క అంగీకారము కలదనియు వక్కాణింతురు! భిన్నభిన్నములగు పాఠాంతరములమధ్య, శాస్త్రములకు అర్థములు చెప్పుచో అవలం బింపబడు భిన్నభిన్నమార్గముల నడుమ, అన్నింటికిని సామరస్య మునుగూర్చు సూత్రమును కనుగొనుట చాల కష్టము. ఏల యందురా? భిన్నభిన్నములై చూపట్టు ఈ శాఖాంతరముల కన్నింటికిని అడుగున మూలాధారము ఒకటి ఉండితీరవలయు ననియు, ఈ చిన్నచిన్న భవనములన్నిటికిని పరస్పరానురూప్య మును గూర్చు సామాన్యమగు పరికల్పనము ఏదో యొకటి ఉండి తీరవలయుననియు, 'మన మతము' అని మనము చెప్పుకొనునట్టి

ఈ కలగూరగంపకు అంతకు ఒక ఆరంభము ఉండితీరవలయుననియు మనము విశ్వసించుచున్నాము. అటుల లేకున్నచో మన మతము ఇన్నిదినములు నిలిచియుండెడిదే కాదు, ఇంత కాలము సజీవమై యుండగలిగెడిదే కాదు.

మరల మన భాష్యకర్తల విషయము ఎత్తుకొన్నచో, ఇంకొక చిక్కు కానిపించుచున్నది. అద్వైతియగు భాష్యకారుడు తనకు అద్వైతపరమగు శాస్త్రవాక్యము దొరకినప్పుడు, దానిని ఉన్నది ఉన్నటుల కాపాడును. కాని ఆ భాష్యకారునకే ద్వైత పరమగు వాక్యము కండ్లబడగనే, తనకు చేతనైనంతవఱకు దానికి ఏదో ఒక వికృతార్థమును కల్పనచేయును. ఒక్కొకప్పుడు 'బ్రహ్మదేవుడు' 'ఆడు మేక'యై పోవును! ఆ భాష్యకర్తలు తమకు అనుకూలించుకొఱకై 'అజుడు' అనగా పుట్టువు లేనివాడు (బ్రహ్మదేవుడు) అను అర్థమున్నచోట 'అజా' అనగా ఆడుమేక అని అర్థము చెప్పివేయుదురు. ఇదేతీరున ఇంతకంటె అధ్వానముగ కూడ ద్వైతభాష్యకారులుసైతము శాస్త్రవాక్యముల యర్థమును కొన్నిచోటుల తాఱుమాఱుచేసిరి. ద్వైతపరమగు ప్రతివాక్యము సురక్షితముగ నుంపబడును. అద్వైతసిద్ధాంతమును తెలుపు ప్రతి వాక్యమును తమ యిచ్చవచ్చినతీరున మెలికలుత్రిప్పి హింసింప వలసినదే! ఈ సంస్కృతభాష మిక్కిలి క్లిష్టమగుటచేతను, వేదము లందలి సంస్కృతభాష అత్యంతము పురాతనమైనదగుటచేతను, 'భాషోత్పత్తిశాస్త్రము' అతిసమగ్రమైయుండుటచేతను, ఒక్క మాటయొక్క అర్థమును గుఱించి యుగయుగములుగా ఎంతెంత వివాదమునైనను సాగింపవచ్చును. ఒక పండితుని పుట్టెలో బుద్ధి పుట్టైనా, ఏ పిచ్చిప్రలాపమునైనను తన వాదబలముచేతను, శాస్త్రప్రమాణములను సూత్రములను క్రోడీకరించుటచేతను, శుద్ధమగు సంస్కృతముగ నిరూపింపగల్గును. ఉపనిషత్తులను అర్థము చేసికొనుటలో మనకు గల చిక్కు లిట్లున్నవి. నాకొక అవతార

పురుషుని పాదసమీపమున జీవించు నదృష్టము కలిగినది. ఆయన ఎంతటి అద్వైతియో అంతటి ద్వైతియు! ఎంతటి జ్ఞానియో అంతటి భక్తుడును! మున్ముందుగా ఈ పురుషుని సాహచర్యము లభించుట వలన, భాష్యకర్తలను గ్రుడ్డిగా అనుసరించుటకంటె స్వతంత్ర ముగా ఉపనిషత్తులకును శాస్త్రగ్రంథములకును అకృత్రిమాధారము గల అర్థము చెప్పుకోవలయునను సంకల్పము నాకు కలిగినది. నా పరిశోధనలవలన నాకు కలిగిన అభిప్రాయ మిది: ఈ శాస్త్ర గ్రంథములు ఎంతమాత్రమును పరస్పరవిరుద్ధములు కావు. కాబట్టి మూలగ్రంథములను పెడత్రిప్పవలసిన భయము మనకు లేదు. ఈ శాస్త్రగ్రంథములు రమ్యమైనవి, మహాద్భుతమైనవి. అవి పరస్పర విరుద్ధములు కానే కావు. ఒక భావముననుండి మఱొక భావమునకు తిన్నని దారిని చూపుచు, అన్ని భావములకు అద్భుత సామరస్యమును సాధించినవి. నేనొక సత్యమును కనిపెట్టినాను. అన్ని ఉపనిషత్తులును ద్వైతభావములతోడను పూజాపురస్కార ములతోడను ప్రారంభమై చివరకు అద్వైతభావములతో ముగియు చున్నవి.

ఆ మహనీయుని జీవితమునుబట్టి విచారింపగా ద్వైతియు అద్వైతియు ఒకరితో నొకరు పోట్లాడ నవసరము లేదని నేను గ్రహించితిని. జాతీయజీవితమున ఇరువురకును స్థానము—గొప్ప స్థానమే కలదు. ద్వైతి ఉండవలసినవాడే! ఏలయన, ద్వైతియు అద్వైతివలెనే, జాతియొక్క ఆధ్యాత్మికజీవితమున ప్రాధాన్యము వహించియే యున్నాడు. ఒకడు రెండవ యతడు లేనిది బ్రతుక జాలడు. ఒకడు రెండవవాని ప్రయోజనమును సఫలము చేయును. ఒకడు దేవళమువంటివాడు, రెండవ యతడు దాని శిఖరమువంటి వాడు. ఒకడు వేరువంటివాడు, రెండవ యతడు పండువంటివాడు. ఇట్లే పోల్చుకొనవచ్చును. కాబట్టి ఉపనిషత్తుల వాక్యములను విఱిచి, తికమకలు చేయబూనుట అసహ్యముగ కాన్పించును.

ఉపనిషత్తులభాష నాకు మహాద్భుతమైనదిగా కనిపించుచున్నది. గొప్ప తత్త్వశాస్త్రముగా దానికి గల యోగ్యతకంటెను, మానవ జాతికి తరణోపాయము చూపు భాగవతసిద్ధాంతముగా దానికిగల అద్భుతమహత్త్వముకంటెను, ఈ ఉపనిషద్భాషలోని గంభీరతా వర్ణనచిత్రణము ప్రపంచమం దసమానమై చిత్రాతిచిత్రమై యున్నది. మానవహృదయముయొక్క విశిష్టమహిమయు, సూక్ష్మదృష్టి, అంతరంగికప్రబోధముగల భారతీయుని బుద్ధికుశల తయు, బహువిస్పష్టముగా ఇందు ప్రకటితమగుచున్నవి! అన్యజాతి భాషలయందు గంభీరమగు చిత్రరచనలు ఇతర సందర్భములందు కనబడుచుండును. కాని ఒక్క మినహాయింపును లేకుండ వాని అన్నిటియందును, బాహుబల మహత్త్వమును ప్రకటించుటయే పరమావధిగా గోచరించుచున్నది. ఉదాహరణకు మిల్టన్, డాంటే, హోమర్, లేక యే ఇతర పాశ్చాత్యకవుల రచనలనైనను చూడుడు. వానియందును అద్భుతములగు గంభీరవాక్యము లున్నవి. కాని పంచేంద్రియములును, కండరబలమును, అఖండ వికాసమును పొందుటవలననే అఖండతత్త్వము పట్టుబడునను సిద్ధాంతము అందు సర్వత్ర గోచరించుచుండును. ఇట్టి భావములే సంహితలందును కొన్ని చోటుల గలవు. సృష్టి వివరణముల దెలుపు కొన్ని అత్యద్భుతబుక్కులను మీలో కొంద రెఱిగియుందురు. విస్తృతియందు సూక్ష్మతత్త్వమును, ఆకాశమునందు అఖండ తత్త్వమును వివరించుటలో మహోన్నతభాషాచిత్రణము అందు కూర్పబడినది. కాని ఆ విధముగా అఖండబ్రహ్మమును తాము చేరలేమని వారు త్వరలోనే కనుగొనిరి. అనంతాకాశమును, విశాలావకాశమును, అంతులేని బాహ్యప్రకృతియుగూడ, వారి హృదయములనుండి వ్యక్తములై వెలువడుటకు తహతహలాడు చున్న భావరాజములను తగురీతిని ప్రకటింపజాలవని వారు తెలిసి కొనిరి. కాబట్టి ఇతరవిధములగు సమాధానముల కొఱకై తమ దృష్టిని మరల్చిరి. ఉపనిషత్తులందు వారిభాష మార్పుచెందినది.

ఆ భాష నిషేధరూపము దాల్చినది. ఒక్కొక్కప్పు డది చిందఱ వందఱగ నుండును; ఒక్కొక్కప్పుడు అది మిమ్ము ఇంద్రియములకు అతీతముగా తీసికొనిపోయిపోయి సగములో వదలి, అక్కడనుండి మీరు గ్రహింప నలవికాని స్పష్టాస్పష్టమగు ఏదో యొక తత్త్వమును చూపును. అదేదో ఉన్నట్లు మాత్రము మీకు భావము కలుగును. కాని అది యేదో స్పష్టముగా తెలియదు. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతో ఽయమగ్నిః" అను వాక్యముతో సరిపోలు వాక్యము ప్రపంచమున నింకొకటి కలదా? అక్కడ "సూర్యుడు ప్రకాశింపడు; చంద్రుడు ప్రకాశింపడు; నక్షత్రములు ప్రకాశింపవు; మెఱుపులును అక్కడ ప్రకాశింపవు. ఇంక అగ్నిమాట చెప్పవలసిన దేముండును?" అని దీని అర్థము!

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య
నశ్న న్నన్యో అభిచాకశీతి॥

సమానే వృక్షే పురుషోనిమగ్నోఽ
నీశయాశోచతి ముహ్యమానః।
జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య
మహిమానమితి వీతశోకః"

ఈ శ్లోకమునందుకంటె, మనోహరతరమగు భాషలో గాని, ప్రపంచమునగల పారమార్థికజ్ఞానరాశిని, హిందువుల వేదాంతతత్త్వసారమును, మానవజాతియొక్క అఖండ మోక్షాదర్శము, రమ్యతరమగు అలంకారరూపమునగాని విశదము చేయజాలు వాక్యములు మీకెందెందు లభింపగలవు? ఒకే చెట్టు మీద రెండు సుందరపక్షులు కలవట. అవి ఒకదానికొకటి

మిత్రములు. ఒకటి పండ్లను తినుచుండగా రెండవది ఏమియుతినక శాంతముగను నిశ్చలముగను కూర్చుండెను. అడుగు కొమ్మమీద నున్న పక్షి తియ్యనిపండ్లను చేదుపండ్లను తినుచు సుఖమును కష్టమును పొందుచుండగా, రెండవపక్షి శాంతముగ, గంభీరముగ, చెట్టుకొనయందు కూర్చుండి యుండెనట! అది తియ్యనిపండ్లను గాని చేదుపండ్లనుగాని తినదు. సుఖమునుగాని దుఃఖమునుగాని అనుభవింపదు. తన స్వస్వరూప మహిమయందు లీనమైయుండును! ఇది మానవుని ఆత్మయొక్క రూపపటము! నరుడు ఐహికజీవితము యొక్క మధురఫలములను విషఫలములను తినుచున్నాడు; ద్రవ్యముకై పరుగులు పెట్టుచున్నాడు; ఇంద్రియములవెంటబడి గంతులు వేయుచున్నాడు; జీవితాడంబరముల వెంబడి ఉరుకు చున్నాడు. నిరాశోపహతుడై వెఱ్ఱిగా ఇట్లు జీవితము గడపు చున్నాడు! వేఱుస్థలములయందు ఉపనిషత్తులు నరుని జీవాత్మను రథికునకును, ఇంద్రియములను మదించి పట్టువశముగాక పరుగులు పెట్టు గుఱ్ఱములకును పోల్చినవి. లౌకికాడంబరములవెంట పరుగులు పెట్టు నరునియొక్క జీవనగతి ఇట్లున్నది. సువర్ణస్వప్నములను కాంచు పిన్నలు, అవి అన్నియు చివరకు బూటకములే యని కను గొనుచున్నారు. పెద్దలు తమ పూర్వచర్యలనుగుఱించి పశ్చాత్తాపము పొందుచున్నారు. ఐనను ఈ వలలోనుండి తప్పించుకొను బయటపడుమార్గము కానబడుటలేదు. ప్రపంచమునగా ఇట్టిది! కాని ప్రతివాని జీవితమునందును ఉత్తమాశాజనకములగు క్షణ ములు కొన్ని వచ్చుచుండును. ఘోరదుఃఖముల నడుమ— అంతేకాదు, మహానందముల నడుమ సైతము—సూర్యుని ప్రకా శమును కప్పివేయు ఈ నల్లని మబ్బులు కొన్నని తొలగిపోవు నిమేషములు రాగలవు. అప్పుడు ఇంద్రియానుభవములను దాటి, చాల దూరమున ఎక్కడనో, అతీతముగానుండు తత్త్వముయొక్క ఒక్కతళుకు హఠాత్తుగా, అప్రయత్నముగా, మన కన్నులకు మిరుమిట్లుగొలుపును. ఈ జీవితాడంబరములకు అతీతముగా, ఈ

సుఖములకు ఈ కష్టములకు దూరముగా, ఈ ప్రకృతిని—అనగా ఇహపరములందలి మన ఆనందభ్రాంతులను—దాటి, ఐశ్వర్యము కొఱకు పేరుకొఱకు ప్రతిష్ఠకొఱకు వంశాభివృద్ధికొఱకు మనము పొందు ఆరాటమునకు చాలదవ్వుగా, అది మెఱయును. దాని తళుకునుచూచి నరుడు ఒక నిమిషకాలము చకితుడై పోవును. శాంతముగను, గంభీరముగను కూర్చుండి, తీపి పండ్లనుగాని చేదు పండ్లనుగాని తినక, ఆత్మతృప్తి కలిగి, ఆత్మానందముతో, స్వకీయ తేజమున ప్రకాశించు ఆ రెండవ పక్షిని చూచును.

"యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మ తృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే॥"

అని గీతావచనము. "ఆత్మయందు అనురక్తుడై, ఆత్మనుదప్ప మఱెద్దానిని కోరిక, ఆత్మయందే సంతృప్తుడైయున్న వానికి తాను నిర్వహించుకొనవలసిన కార్యమేమియుండును?" వానిసవలె అతడేల పాటుపడవలయును? నరుడు తళుక్కుమను దాని జాడను చూచును; కాని మఱల దానిని మఱచి పోవును. ఈ సంసారపు తియ్యని పండ్లను, చేదుపండ్లను అతడు తినుచునే యుండును. ఒక వేళ కొంతకాలమునకు, తళుక్కుమను వెలుగుజాడ ఇంకొకసారి కానరావచ్చును. ఇటుల క్రిందనున్నపక్షి దెబ్బలుతిని తిని, పైనున్నపక్షికి దగ్గఱదగ్గఱగా పోవుచుండును. గట్టి మొట్టికాయలను తినునదృష్టము ఎంతబాగుగా పట్టిన అంతత్వరగా తన సహవాసియు ప్రాణమును మిత్రమును అగు రెండవపక్షి దాపునకు పోయి చేరును. దానిని సమీపించిన కొలది, దానిఱెక్కల కాంతులు దీనిని చుట్టుకొని, దీనిఱెక్కలుకూడ ప్రకాశించుచున్నటుల తోచును. ఈ పక్షి యింకను సమీపమునకు పోవునపుడు దానికొక విచిత్ర రూపాంతరము చేకూరును. అది దాపునకుచేరిన కొలది, తన స్వరూపము కరగి పోవుచున్నదా యన్నట్లు దానికి తోచుచుండును. తుదకది పూర్తిగా అదృశ్యమై పోవును. సత్య

మున కీ పక్షి అసలు లేనే లేను. ఇటు నటు కదలియాడుచుండు ఆకుల మధ్య నిశ్చలముగను, గంభీరముగను కూర్చుండియున్న ఆ రెండవపక్షి ప్రతిబింబమే యిది! అంతయు పైదాని ప్రకాశమే! పైనున్న పక్షియొక్క ప్రభయే! దానిని కలిసికొన్నంతనే దీని భయము అణగి పోవును, పూర్ణతృప్తి లభించును; నిశ్చలశాంతి దొరకును. ఇట్టి ఆలంకారిక భాషతో, ఉపనిషత్తులు మనలను ద్వైతభావమునుండి అద్వైతభావమునకు తోడ్కొని పోవు చున్నవి.

ఇట్టి ఉదాహరణలను అనంతముగా చూపవచ్చును. కాని ఈ ఉపన్యాసములో అటుల చేయుటకు వ్యవధిచాలదు. ఉపని షత్తులలోని ఉదాత్తకవితావైభవమును, ఉత్కృష్టభావసంపదను, చూపుటకు ఇది యదనుకాదు. ఐనను ఇంకొక్క విషయమును మాత్రము తెలుపవలసి యున్నది. ఉపనిషత్తులలోని భాషయు, భావమును అతినిశితముగా, నిరర్గళ వేగముతో సాగివచ్చును. కత్తి విసరినటుల మీదపడును, పెద్ద సమ్మెటపోటులవలె పైని పడును. వాని అర్థమును గుఱించి పొరపడుటకు వీలులేదు. ఆ గానములోని స్వరములెల్ల స్పష్టమధురములై సంపూర్ణముగా రక్తికట్టును. తిరుగుళ్ళుండవు; పిచ్చి పిచ్చి ప్రసంగములు లేవు. పతనపుజాడలు అందు కాన్పింపవు. మితి మీరిన ఉపమాలంకార ములుగాని, విశేషణ పరంపరలుగాని, క్లిష్టాన్వయములుగాని అందులేవు. మెదడు తిరుగుళ్లుపడి, చెదరి అందులోనుండి బయట పడు మార్గముతోపక గిజగిజలాడవలసిన యవసరములేదు. అటు వంటిచిక్కు ఎంతమాత్రమునులేదు. అది మానవరచితమైన వాఙ్మయమే అగునెడల, జాతీయమేధాసంపద ఎంతమాత్రమును పోలిపోవని ఒక మహాజాతి దానిని రచించి యుండునని చెప్ప వలెను.

'బలము', 'బలము' అని ప్రతి పుటనుండియు ఉపనిషత్తులు ఉద్బోధించుచున్నవి! మనము జ్ఞప్తినుంచుకొనవలసిన గొప్పవిషయ

ములలో ఇది యొకటి. నా జన్మలో నేను నేర్చుకొనిన గొప్ప గుణపాఠము ఇది ఒక్కటే. "బలము, బలము!" అని ఉపనిషత్తులు ఉద్బోధించుచున్నవి; "ఓయి మానవుడా, దుర్బలుడవుగా నుండుటతగదు, తగదు!" అని హెచ్చరించు చున్నవి. మానవునందు లోపములుండకుండునా? అని నరుడు శంకించుచున్నాడు. "సరే యున్నవి; ఇంకను ఎక్కువ లోపములువచ్చి వానిని సవరించునా? ముఱికితో ముఱికిని కడిగివేయ ప్రయత్నింతువా?" అని ఉపనిషత్తులు అడుగుచున్నవి. పాపమును పాపము హరించునా? దోషమును దోషము తొలగించునా? "బలమును, ఓ మనుజుడా, బలమునే సంపాదింపుము! లేచి నిలబడుము. బలముగలిగి దృఢముగా నిలబడుము" అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఓహో! ప్రపంచవాఙ్మయములలోనెల్ల ఈ వాఙ్మయమునందు మాత్రమే 'అభీః' అనగా జంకులేకుండుట, అనుశబ్దము మఱల మఱల ప్రయోగింపబడినది! ప్రపంచములో మఱే మతగ్రంథమునందును దేవునకుగాని మానవునకుగాని ఈ 'అభీః' విశేషణము ప్రయోగింపబడి యుండలేదు. "అభీః" అను పదము వినగనే అలగ్జాండరనెడు గొప్ప పాశ్చాత్యచక్రవర్తి స్వరూపము నా కిప్పుడు మనోగోచరమగుచున్నది. ఆ మహాచక్రవర్తి అడవియందు మన సన్న్యాసులలో ఒకనితో మాటలాడుచు సింధూనదియొడ్డున నిలిచియున్నటుల ఒక రూపపటము నా కండ్ల యెదుట గోచరించు చున్నది. అతనితో మాట్లాడుచుండిన వృద్ధుడు దిగంబరియై, ఒక రాతిబండమీద కాబోలు కూర్చుండియున్నాడు! ఆ చక్రవర్తి భాగ్యగౌరవములపై ఆసలు గొలిపి, తన గ్రీసుదేశమునకు రమ్మని ఆయనను అడుగుచున్నాడు. ఆయన అఖండజ్ఞానమునకు ఆశ్చర్యపడి అట్లే నిలుచుండియున్నాడు. ఈ సన్న్యాసి వాని ఐశ్వర్యమును చూచి నవ్వుచున్నాడు; అతడు పురిగొల్పుచున్న భ్రమలనుచూచి మందహాసము చేయుచున్నాడు; అన్నిటిని నిరాకరించుచున్నాడు! అప్పుడు రాజ్యాధికారమదాంధు

డగు చక్రవర్తి 'నీవు నాతోడ రానియెడల నిన్ను చంపివేసెదను' అని భయపెట్టగా, ఆ పురుషశ్రేష్ఠుడు పకపక నవ్వి "నీవిప్పుడు పలికినంత అసత్యము నీ జన్మలో నెన్నడును పలికియుండవు న న్నెవరు చంపగలరు? జడమయప్రపంచమునకు నీవు చక్రవర్తివే ఐననేమి? నీవా? నన్నా? చంపుటయా? ఎన్నడును పొసగదు ఏలయందువా, నేను జననమరణములు లేని ఆత్మస్వరూపిని నే నెన్నడును పుట్టియుండలేదు; ఎన్నడును చచ్చువాడను కాను నేను శాశ్వతుడను; సర్వవ్యాపిని; సర్వజ్ఞుడను; నీవా? నన్ను చంపుటయా? నీవు ఏమియు నెఱుగని పసివానివలె నున్నావే!' అని పలుకుచున్నాడు. బలమనగా అట్టిది! నేను ఉపనిషత్తులను చదివినకొలది, ఓ నా స్నేహితులారా, నా దేశీయులారా! మిమ్ము చూచిన నాకు విచారము కలుగుచున్నది. ఆచరణయోగ్యమగు మహాసాధన ఉపనిషత్తులందు గోచరించుచున్నది. ఓహో! బలము! బలము మనకు కావలసియున్నది! బలము, బలమే మనకు కొఱవడియున్నది! మనకు బలమును ప్రసాదించువారేరి? దుర్బలురను చేయువారు వేలకొలదిగ కాన్పించుచున్నారు. తలతోకలేని వెఱ్ఱికథలు మనకు కావలసినన్ని యున్నవి. ఎక్కడ నున్నవని మీరు ప్రశ్నింతురేమో, మనపురాణములలో ప్రతిదానియందును —ప్రపంచగ్రంథాలయములలో ముప్పాతికభాగము నింపగలిగినన్ని కథలు—గలవు. జాతిత్వేన మనలను దుర్బలురను చేసివేయు విషయములెన్నో గడచిన వేయిసంవత్సరములనుండి మనలను వెంటాడుచున్నవి. మన జాతీయజీవితములో ఈ వేయి సంవత్సరములుగా నానాటికి మనము దుర్బలురమై నిర్వీర్యులమై పోయితిమి. మనపై పాదము నిడ సాహసించు ప్రతివాని కాలి క్రిందను వానపాములవలె గిలగిల తన్నుకొనుచు ప్రాకులాడు దుర్గతి మనకు పట్టినది. కావున సోదరులారా, మీ రక్తబాంధవులలో నొక్కడనగు నేను, మీతోడ జీవించి మీతోడ మరణింపనున్న నేను, "మనకు బలము కావలసియున్నది; సదా బలమే మనకు

కావలసియున్నది'' అని ఘోషించుచున్నాను. మన ఉపనిషత్తులు బలమునకు అపారనిధులై యున్నవి. ఈ ప్రపంచమంతటికిని ఉజ్జీవము నొసంగజాలునంతటి బలము వానియందున్నది. ఆ ఉపనిషత్తుల ద్వారమున లోకమంతయు సజీవము కాగల్గును; బలసత్త్వములను పొందగల్గును. అన్ని జాతులందును, అన్ని మతములందును, అన్ని సంప్రదాయములందును గల దుర్బలురను, దుఃఖితులను, పీడితులను, శంఖధ్వనివంటి ముక్తకంఠముతో ఆహ్వానించి ''మీ పాదములపై మీరు నిలువబడుడు; స్వతంత్రులై నడువుడు'' అని ఉపనిషత్తులు హెచ్చరించుచున్నవి. స్వాతంత్ర్యము! శారీరకస్వాతంత్ర్యము, మానసికస్వాతంత్రము, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము అనునవియే ఉపనిషత్తులలోని ప్రధానసూత్రములు.

ప్రపంచమందలి ధర్మగ్రంథము లన్నిటిలోను ఇవిమాత్రమే మోక్షమునుగుఱించిగాక స్వాతంత్ర్యమునుగుఱించి ఉద్బోధించుచున్నవి. ''ప్రకృతి బంధములనుండి సంతంత్రులు కండు; దౌర్బల్యబంధములను త్రెంచివేయుడు!'' అని హెచ్చరించుచున్నవి. అంతేకాదు; ఈ స్వాతంత్ర్యము ఇదివఱకే మీలోనున్నదనికూడ అవి మీకు తెలుపుచున్నవి. ఉపనిషత్తుల బోధలకు ఇది మఱొక విశిష్టమైన లక్షణము. నీవు ద్వైతివే అనుకొనుము. ఐననేమి? జీవాత్మ స్వాభావికముగనే పరిపూర్ణమైనదని నీవు అంగీకరింపవలయునుగదా! కాని ఆ జీవాత్మ కొన్ని కర్మలమూలమున 'సంకోచము' పొందియున్నది. శ్రీ రామానుజాచార్యులవారి 'సంకోచవికాస' సిద్ధాంతమునే ఇప్పటి ఆధునిక శాస్త్రజ్ఞులు 'ఎవల్యూషన్' అనియు, 'ఆటవిజం' అనియు పేర్కొనుచున్నారు. జీవాత్మ క్రిందికి పోయిపోయి సంకోచముపొందును, దానిశక్తులు అవ్యక్తములగును. సత్కర్మలమూలమునను సత్సంకల్పముల మూలమునను అది తిరిగి వికాసముపొంది, తనకు స్వభావసిద్ధమగు పరిపూర్ణతను గాంచును. అద్వైతి అభిప్రాయము దీనికి కొంత

భేదమైయున్నది. అతడు ప్రకృతిపరిణామమును అంగీకరించును కాని, ఆత్మపరిణామమును అంగీకరింపడు! ఒక తెర ఉన్నదను కొనుడు. ఆ తెరలో ఒక చిన్నబెజ్జమున్నది. ఆ తెరవెనుక నిలుచుండి నేనీ మహాసభవంక చూచుచున్నాను. ఇచ్చటనున్న ఏకొలది ముఖములు మాత్రమో నాకు కనబడును. ఇప్పుడు ఆ బెజ్జము పెద్దదగుచున్నదనుకొనుడు. అది పెద్దదైనకొలది, అధికాధికముగ ఈసభ నాకు సువ్యక్తమగుచు వచ్చును. ఇక ఆ బెజ్జము తెరయంతటిదై దానితో ఏకీభవించునప్పుడు, నాకీసభ యంతయు పూర్ణముగ గోచరించును. అప్పుడు మీకును నాకును నడుమ అడ్డమేమియు నుండదు. మీరు మారినది లేదు, నేను మారినది లేదు. మార్పంతయు ఈ తెరలోనే సంభవించినది. మొదటినుండి తుదివఱకు, మీరు ఏకరీతినే యున్నారు. తెర మాత్రము మారినది. పరిణామసిద్ధాంతమును గుఱించి అద్వైతి యొక్క భావము ఈ తీరుగ నున్నది. ప్రకృతియందు పరిణామము జరుగుచున్నకొలది, లోనున్న ఆత్మ వ్యక్తమగుచుండును. అంతే గాని, ఆత్మ ఏ తీరుననైనను 'సంకోచము' పొందునని అద్వైతి ఒప్పుకొనడు. ఆత్మ నిర్వికారము, అఖండము. అది మాయ అనెడు ముసుగుచేత కప్పబడినదనవచ్చును. ఈ మాయ అనెడు ముసుగు పలుచనైన కొలదిని, ఆత్మయొక్క స్వభావసిద్ధమైన సహజ తేజస్సు వెలువడి సువ్యక్తమగుచుండును. ఈ మహా సిద్ధాంతము నొక్కదానిని భారతదేశమునుండి నేర్చుకొనుటకు లోకము వేయికన్నులతో ఎదురుచూచుచున్నది. ఏమేమి మాట లాడినను, ఎంతగా డంబములు పల్కినను, ఈ సిద్ధాంతమును ఒప్పుకొనక ఏ సంఘమును నిలువజాలదని కాలము జరుగుకొలది వారు తెలిసికొందురు. సమస్తమును క్షణక్షణము పరివర్తించు చున్నది. మీకీ పరివర్తన కాన్పించుటలేదా? ప్రతివిషయమును, మంచిదని రుజువగు వఱకును దానిని చెడ్డదిగనే భావించుట ఎట్లాచారముగ వచ్చుచున్నదో మీరు చూచుటలేదా? విద్యావిష

యమునను, దోషుల దండించు విషయమునను, వెఱ్ఱివారికి చికిత్స చేయువిషయమునను, సామాన్య రోగములకు మందులిచ్చు విషయమున సైతము, ఇది ఒకటే తాతలనాటి పద్ధతి! ఇక నవీన పద్ధతి ఎట్లున్నది? "శరీరము స్వభావముచేత ఆరోగ్యవంతమైనదే; అది తన స్వశక్తిచేతనే తన రోగములను మాన్పుకొన గలదు" అని నూతన సిద్ధాంతము చెప్పుచున్నది. మందు చేయగల దంతయు శరీరమునందు గల అనుకూల పదార్థము నెల్ల ప్రోగు చేసి పెట్ట గలదు, అంతయే అని చెప్పును. అది అపరాధులను గుఱించి ఏమి చెప్పునో తెలియునా? ఒక అపరాధి ఎంత పతితుడైనను, వాని యందు దైవాంశ కలదు. ఆదైవాంశ మారునదికాదు. ఈ సిద్ధాంతము ననుసరించి అపరాధులకు శిక్షణగఱపవలసియున్నది. ఈ మార్పులన్నియు ఇప్పుడు వచ్చుచునేయున్నవి. సంస్కరణ శాలలు, పశ్చాత్తాపభవనములు ఏర్పాటగుచున్నది. ఇటులనే ప్రతివిషయమునందును పరివర్తన జరుగుచున్నది. ప్రతివానియందును దైవాంశకలదనెడు భారతీయుల సిద్ధాంతము — తెలిసినను తెలియకున్నను — ఇతర దేశములందు సైతము మెలమెల్లగా తల సూపుచున్నది. దీనికి వివరణము మన గ్రంథములందుమాత్రమే కలదు. దానినే ఇతరజాతులవారును అంగీకరింపవసివచ్చుచున్నది. ఒకడు తనతోడి వానితో ఎట్లు ప్రవర్తింపవలెనను విషయమున అభిప్రాయ పరిణామములు కలుగుచున్నవి. మానవజాతియొక్క దుర్బలతనే చాటుచుండు తాతలనాటి ప్రాతభావములెల్ల తొలగి పోవలసి యున్నవి. ఈ శతాబ్దములోనే అవి వినాశమై పోగలవు. ఇప్పుడు ప్రజలు చెలరేగి మనలను ఆక్షేపింపవచ్చును. పాపమే లేదు అను రాక్షస తత్త్వమును బోధించుచున్నానని, ప్రపంచములో ఈ కొననుండి ఆ కొనవఱకు, నన్నాక్షేపించుచున్నారు. నేను పాపబోధచేయక పుణ్యబోధచేసితినని ఈ ప్రజల సంతానమే, నన్నుగుఱించి ధన్యవాదములుచేయు కాలము వచ్చును. నేను పుణ్యబోధ చేయుదునుగాని పాపబోధచేయువాడనుగాను. చీకటిని

గాక లోకమునకు నేను వెలుగునే ప్రకటించుచున్నానని సగర్వ ముగా చెప్పుకొనుచున్నాను.

ఉపనిషత్తులనుండి ప్రపంచము గ్రహింపవలసిన రెండవ గొప్పసిద్ధాంతము ఈ 'విశ్వమంతయు ఏక' మనునది! హద్దులను, భేదములను చూపుచుండిన పూర్వకాలపు భావములన్నియు వేవే గముగా అంతరించిపోవుచున్నవి. విద్యుచ్ఛక్తియు, ఆవిరియంత్ర ములును, ప్రపంచపు నలుమూలలకు రాకపోకలద్వారా పరస్పర పరిచయము చేకూర్చినవి. ఇకమీదట మనము మనదేశమునకు ఆవలనున్న ప్రదేశములన్నియు రాక్షసులతో, దయ్యములతో, నిండియుండునని కాకమ్మకబుర్లు చెప్పుకొనుటకు వీలులేదు. క్రైస్తవ దేశ ప్రజలైనను 'భారతదేశములో అడవి జాతివారును, మనుష్యు లను చంపుకొని తిను ప్రజలును, నివసించుచుందు' రని ఇపుడు చెప్పుటకు వీలులేదు. మనము పరదేశములకేగినను అచ్చటకూడ, మనకు చేతినందించి ఆదుకొనువారు, సాయపడి ప్రోత్సహించి ఆశీర్వదించువారు వేలకొలది సోదరమానవోత్తములుకలరు. మన జన్మభూమియం దున్నవారికంటె. కొన్ని సందర్భములలో వారే యోగ్యతరులుగా కాన్పింతురు. వారు ఇక్కడికి వచ్చినప్పుడును అదేరీతిన సోదరభావమును ప్రోత్సాహమును దీవనలను మన మును ఇచ్చుచున్నాము. దుఃఖమున కంతకును అజ్ఞానమే మూల మని మన ఉపనిషత్తులు బోధించుచున్నవి. సాంఘికమైనను, ఆధ్యాత్మికమైనను, ప్రతిజీవనదశయందును ఆ విషయము పూర్ణ ముగ సత్యమేయని ఉపనిషత్తులు తెల్పుచున్నవి. మనలో ఒకరి మీద నొకరికి ద్వేషము కలుగునట్లు చేయునది అజ్ఞానము. ఈ అజ్ఞానము వలననే మనము ఒకరినొకరము తెలిసికొనలేక, ఒకరి నొకరము ప్రేమించుకొనలేక దూరమైపోవుచున్నాము. మనము ఒకరినొకరము తెలిసికొనినతోడనే ప్రేమ పుట్టును. ప్రేమ పుట్టి తీరవలయును. ఏలయన, మన మందఱమును నిజమునకు ఒక్క

టియే కదా! ఈ విధముగా మనకు ఇష్టములేకున్నను ఏకీభావము అమరుచున్నది. రాజకీయసాంఘికాది విషయములయందు, ఇరువది సంవత్సరముల క్రిందట ప్రత్యేక జాతీయములుగా నుండిన సమస్యలు, ఇకమీదట అట్లు ప్రత్యేకజాతీయభావములనే ఆధారము చేసికొని పరిష్కారము కాజాలవు. అవి మిక్కుటముగ పెరిగిపోయి బ్రహ్మాండము నిండుచున్నవి. అవి ఇకమీదట నానాజాతి సంబంధమగు విశాలదృష్టితో పరిష్కారము కావలసియుండును. "నానాజాతి వ్యవస్థలు, నానాజాతి సమ్మేళనములు, నానాజాతి శాసనములు" అనుఘోష నేడు ఎల్లెడల వినవచ్చుచున్నది. ఇదంతయు ఏకత్వమును ప్రకటించునదే! ఇట్లే ప్రకృతిశాస్త్రమునందు భౌతికద్రవ్యరాశినిగూర్చిన విశాలతరభావములను అంగీకరించుచున్నారు. ద్రవ్యరాశినిగురించి యోచించునప్పుడు, ఈ జగమంతటిని ఒకేరాశిగను, ఒకే ద్రవ్యమహాసముద్రముగను భావనచేసినచో, అందులో మీరును నేనును సూర్యుడును చంద్రుడును సమస్తమును, వేఱువేఱు చిన్నిసుడులో, బుడగలో అని తేలును. మనః పరముగా మాటలాడుకొనినను, ఇదంతయు సంకల్పమయమగు ఒక్క భావమహాసముద్రముగా నున్నది. దీనియందు నీవు, నేను, అదేరీతిగా చిన్నసుడులుగ నున్నాము. ఆత్మపరము చూచితిమా, అది కదలదు; మాఱదు. అదంతయు నిర్వికారమును అఖండమును నిరవయవమును నగు ఒకే ఆత్మ! నీతిధర్మావశ్యకతను గూర్చియు మన గ్రంథములయందే కానవగును. నీతిధర్మముల వివరణమును, నీతిసూత్రముల ఆధారమునుకూడ, ప్రపంచము తెలియ గోరుచున్నది. అదియు ఇచటనే లభింప గలదు.

భారతదేశమున మనకు కావలసినదేమి? ఈ విషయములు ౦దేశీయులకు కావలసియున్నచో, మనకు అవి ఇరువదిరెట్లు ఎక్కు౦గా ఆవశ్యకము! ఎందువలననో తెలియునా, ఉపనిషత్తులు

ఎంత గొప్పవైనను, మన పూర్వ ఋషులను గూర్చి మనమెంతగా దంభములు కొట్టుకొనుచున్నను, ఇతర జాతులతో పోల్చి చూచినప్పుడు మనము దుర్బలురమై, జీవచ్ఛవములవలె ఉన్నామని చెప్పక తప్పదు! మన శారీరక దౌర్బల్యమే మన దుఃఖములలో కనీసము మూడింట నొకభాగమునకు కారణ మగుచున్నది. పైగా మనము సోమరులము. మనము పని చేయజాలము; కలిసికట్టుగా ఒక సంఘముగా కూడ నుండజాలము. ఒకరినొకరు ప్రేమించుకొనుటలేదు. మిక్కిలి స్వార్థపరులమై పోయితిమి. ఒకరినొకరు ద్వేషించుకొనకుండ, ఒకరిని గూర్చి యొకరు అసూయ చెందకుండ, ముగ్గురమేని కలిసి జీవింపజాలము. మన స్థితి ఇంత అధ్వానముగా నున్నది. గాలిలో చెల్లాచెదరై పోయిన దూదిపింజలవలె నున్నవి మన బ్రదుకులు! దీనికితోడు కరడు కట్టిన స్వార్థపరత! మన ముఖముమీద బొట్టును ఈ తీరున బెట్టుకొనవలయునా, ఆ తీరున బెట్టుకొనవలయునా, అనుచు శతాబ్దముల కొలది ఒకరితో నొకరము కొట్లాడుకొనుచున్నాము. ఒక నరుని దృష్టి నా అన్నమును మైలపఱచునా లేదా, అనునిట్టి మహాసమస్యలను గూర్చి సంపుటముల మీద సంపుటములుగా గ్రంథములను వ్రాయుచున్నాము. కొలది శతాబ్దముల నుండి మనము చేయుచున్న పని ఇదియే! ఇంతచక్కని సమస్యల తోడను, పరిశోధనల తోడను, మెదడుయొక్క బలమంతను వినియోగము చేయుచున్నజాతి ఇంక ఏ ఘనకార్యము చేయగలదని మనము విశ్వసింపగలము? పోనీ యిప్పుడైనను మనలను గూర్చి మనము సిగ్గుపడుట లేదే! అవును, కొన్ని సమయములయందు సిగ్గుపడుచునే యున్నాము! కాని ఆ విషయములు తుచ్ఛము లని తెలిసియు, మనము వానిని వదలివేయజాలకున్నాము. మనము అనేక విషయములనుగూర్చి చిలుకపలుకులు పలుకుచుందుము. కాని వానిని ఆచరణలో పెట్టము! ప్రలాపములుచేయుటయు, పని చేయకుండుటయు మనకు అభ్యాసమై

పోయినది! దీనికి కారణము ఏమి? శారీరకదుర్బలతయే! దుర్బలమగు మెదడునకు ఏమి చేయుటకును శక్తి యుండదు. మనము దానిని బలిష్ఠముచేయవలెను. మొదట, మన యువకులు బలిష్ఠులుకావలెను. మతనిష్ఠ ఆ పిమ్మట తనంతటతానే వచ్చును. ముఖ్యముగా నాయువ సోదరులకు నేనుచేయు విజ్ఞప్తియిది. ముందు బలిష్ఠులుకండు. భగవద్గీతాపారాయణము కంటె 'ఫుట్ బాల్' ఆటయే మిమ్ము శీఘ్రముగా మోక్షమార్గమున గొని పోవును. ఇయ్యవి మహాసాహస వచనములు! అయినను నేను వానిని చెప్పవలసియున్నది. ఏలయన, నాకు మీయందు గాఢాభిమానము కలదు. నా చెప్పు ఎక్కడ కఱచుచున్నదో నాకు తెలియును. నేను కొంచెము అనుభవము సంపాదించినాను. మీ జబ్బలు, మీ కండరములు ఇంక కొంచము బలపడినపుడు, మీ రింకను బాగుగ గీతను అర్థముచేసికొనగలుగుదురు. మీ లోపల ఇంక కొంచెము బలముగల రక్తము ప్రవహించుచో, శ్రీకృష్ణుని మహాబలమును, ప్రతిభావిశేషమును చక్కగా అర్థము చేసికొనగలుగుదురు. మీ పాదములమీద మీ శరీరము దృఢముగా, సుస్థిరముగా నిలువజాలినపుడు, మీరు నిజమగు పురుషులమని భావింపగల్గినపుడు, ఉపనిషత్తులను, ఆత్మమహిమను సమగ్రముగా గ్రహింపజాలుదురు! ఈ విధముగా మనయొక్క అక్కఱల కొఱకై వీనిని ఉపయోగించుకొనవలయును.

నేను అద్వైతమతమును బోధించుటచూచి, అనేకపర్యాయములు ప్రజలు విసుగుజెందుచుందురు. అద్వైతమతమునో, ద్వైతమతమునో, లేక ప్రపంచములోని యే ఒక్కమతమునో బోధించుట నా అభిప్రాయమే కాదు. మనకు ఇప్పుడు కావలసియున్న ఏకైకమతము అద్భుతమగు ఆత్మభావనయే! ఆత్మయొక్క అఖండశక్తిని, దాని అఖండదార్ఢ్యమును, దాని అఖండపవిత్రతను, దాని శాశ్వతపరిపూర్ణతను మనము అనుభూతమొనర్చుకొన

వలెను. నాకొక బిడ్డ యున్న యెడల, అది పుట్టినది మొదలు, 'నీవు శుద్ధబ్రహ్మమవు' అని నూరిపోసెదను. పురాణములలో నొకదానియందు రాణి మదాలసను గుఱించిన చక్కని కథను మీరు చదివియుందురు. తనకు శిశువు పుట్టినతోడనే ఆమె స్వాయముగా తనచేతులతో ఆ శిశువును తొట్టెలలో నుంచి, ఆతొట్టెలను ఊపుచు, "నీవు శుద్ధబ్రహ్మమవు! నిష్కళంకుడవు! పాపరహితుడవు! మహాత్ముడవు! మహాపురుషుడవు!" అని జోల పాడెడిదట. ఓహో! అందులో అద్భుతమాహాత్మ్యమున్నది! మీరు మహాపురుషులమని త్రుటికాలము భావనచేయుడు! వెంటనే మీరును మహాపురుషులగుదురు. ఈ ప్రపంచమంతయు తిరిగి తిరిగి నేను కొంత అనుభవమును సంపాదించితిని; ఆంగ్లేయులు ఎల్లప్పుడు పాపులనుగూర్చి పలుకుచుందురు. వారందఱును, తాము పాపులమనియే నిజముగ విశ్వసించునెడల ఈ ఆంగ్లప్రజలు మధ్యఆఫ్రికాలోని నీగ్రోల దుఃస్థితికి దిగుదురు. భగవదనుగ్రహమున వారటుల విశ్వసించుటలేదు! పైగా, ఆంగ్లేయుడు తాను లోకమునకు ప్రభువై పుట్టితినని విశ్వసించుచున్నాడు! తాను గొప్పవాడననియు, ప్రపంచములో తానేమైనను చేయగలననియు అతని విశ్వాసము! తాను అనుకొన్నచో, చంద్రునికడకుగాని, సూర్యునికడకుగాని పోగలడనియే అతని నమ్మకము! అదియే వానిని అంత గొప్పవానిగ చేయుచున్నది. తాను దీనుడగు మహాపాపియనియు, శాశ్వతనరకమున వేదనపాలు కావలసినవాడనియు బోధించు మతగురువులనే నమ్మినయెడల, అత డీనాడు ఇంతటివాడు కాకయే పోయెడివాడు! ఈ విధముగ ప్రతిజాతియందును మతాచార్యులును, మూఢవిశ్వాసములును, అడుగడుగున అడ్డుపడుచున్నను, ఆంతరమగు దైవాంశ సజీవమై నిలిచి, స్వాయముగా వ్యక్తమగుచుండుట నాకు గోచరించుచున్నది. మనము 'శ్రద్ధ'ను పూర్తిగా కోలుపోయినాము. ఆంగ్లేయులకు గల శ్రద్ధలో సహస్రాంశముకూడ మనకు లేదు. నేను ఉన్నది

ఉన్నట్లు నిష్కపటముగా చెప్పుచున్నాను. వీనిని చెప్పకతప్పని పరిస్థితి యేర్పడుటచేత చెప్పుచున్నాను. ఆంగ్లేయులకు మన ఆదర్శములు నచ్చి, వానియందు గాఢవిశ్వాసము కుదిరెనా, ఇక ఉన్మత్తులవలె తదేకదీక్షతో, తమదేశస్థులు అపహాస్యముచేయుచు గేలిచేయుచున్నను లక్ష్యముచేయక, తాము ప్రభుజాతికి చెందిన వారమనిన విషయమునే మఱచి, భారతదేశమునకు వచ్చి, మన మతాదర్శములను మనకే ఎటుల బోధించుచున్నారో మీరు చూచుటలేదు? మీలో నెంతమంది ఆ విధముగ చేయగలరో తెలుపుడు? మీరు ఆ తీరుగ ఎందుకు చేయలేరు? ఆ విషయములు మీకు తెలియనివా? వారికంటె మీకే ఎక్కువ తెలియునే! మీకు తెలివి మితిమీరి, 'అతితెలివి'గా మాఱినది. వచ్చిన చిక్కంతయు అక్కడనే యున్నది! మీ రక్తము నీరైపోయినది, మీ మెదడు చవుడుపట్టియున్నది; మీ శరీరమున సత్త్వ సున్న! మీ రిక శరీరములు మార్చుకొనవలయును. అన్నిటికిని శారీరక దుర్బలతయే కారణము; మఱేమియు కాదు. నూఱుసంవత్సర ములనుండి సంస్కరణములు, ఆదర్శములు మున్నగు విషయముల నెన్నింటిని గుఱించియో మీరు ప్రసంగములు చేయుచునే యున్నారు. ఆచరణకు దిగవలసి వచ్చినప్పుడు మాత్రము మీ రెక్కడను కాన్పింపరు! ప్రపంచమంతయు ఈ కబుర్లతో విసువు చెంది పోయినది. సంస్కరణమను పేరె అపహాస్యముపాలైనది. దీనికి హేతువేమి? మీకు తెలియదా? అబ్బో! మీకు బాగుగనే తెలియును. కారణమంతయు మీ దౌర్బల్యమే! ముమ్మాటికిని మీ దౌర్బల్యమే! మీ శరీరము దుర్బలమైనది; మీ బుద్ధి దుర్బల మైనది; మీయందు మీకు విశ్వాసములేదు. శతాబ్దములకు శతాబ్దములుగ, పీల్చి పిప్పిచేయు కులద్వేషముల పీడయు, రాజుల హింసయు, విదేశీయుల నిర్బంధములును, మీ స్వజనులను మీరు పెట్టు ఇక్కట్టులును, నా యన్నలారా! మీ బలమునంతను బలి గొన్నవి. మీ వెన్నెముక విరిగిపోయినది; మీరు కాలిక్రింద

నలిపివేయబడు పురుగులై పోయినారు. మీకు బలమును ప్రసాదించునది ఎవరు? మనకు కావలసినది బలము—బలమే యని మీకు నేను స్పష్టముగ చెప్పుచున్నాను. అట్టి బలమును సంపాదించుకొనుటకు, మొట్టమొదటి సాధనము ఉపనిషత్తులను సత్యములని గౌరవించి 'నేను ఆత్మను' అని విశ్వసించుటయే! "నన్ను ఖడ్గములు ఛేదింపజాలవు. తుపాకిగుండ్లు నాలో గ్రుచ్చుకోజాలవు. నన్ను అగ్ని దహింపజాలదు. గాలి శోషింపజాలదు. నేను సర్వశక్తిమంతుడను. నేను సర్వజ్ఞుడను" అను ధన్యవాక్కులను ఉచ్చరింపుడు! 'మేము దుర్బలురము' అని ఎన్నడును పలుకబోకుడు. మనము సర్వమును చేయజాలుదుము! మనము చేయజాలనిది ఏమున్నది? మనము సమస్తము చేయజాలుదుము. మనలో అందఱియందును ఆ దివ్యాత్మ కలదు. దానియందు మనము విశ్వాసము పూనుదుముగాక! నచికేతునివలె 'శ్రద్ధ' వహింపుడు. నచికేతునకు, వానితండ్రి యాగముచేయు సమయమున, 'శ్రద్ధ' ఉదయించినదట. అటులనే మీలో ప్రతివానికిని 'శ్రద్ధ' కలుగుగాక యని నేను కోరుచున్నాను. మీలో ప్రతివాడును మహావీరుడై నిలుచుగాక! అద్భుత ధీశక్తి గలిగి, అఖండ దివ్యాంశతో, లోకమును వ్రేలిపై త్రిప్పగలిగియుండునుగాక! నేను కోరునది మీరు అట్టివారు కావలయుననియే. ఉపనిషత్తుల వలన మీరు పడయగల బలము అటువంటిది! అందుండి మీకు లభింపగల 'శ్రద్ధ' అటువంటిది!

ఓహో! ఆ ఉపనిషత్తులు సన్న్యాసుల సొత్తట! రహస్యమైనవట! అవి సన్న్యాసి చేతులలో బడినవి; అతడు వానిని అడవులకు తీసికొనిపోయినాడు. శంకరాచార్యులు కొంచెము దయబూని, గృహస్థులుసైతము ఉపనిషత్తులు పఠింపవచ్చుననియు, అవి వారికి మేలు చేయుననియు, అందువలన వారికి అపాయము లేదనియు తెలిపినారు, ఐనను, ఏకాంతవాసివై అడవులలోనుండు

వానినిగూర్చి మాత్రమే ఉపనిషత్తులు పలుకునను అభిప్రాయము ఒకటి కలదు. నేను మొన్న మీకు తెలిపినటుల, వేదములను గుఱించిన ప్రామాణికమగు వ్యాఖ్యానము — ఏకైక వ్యాఖ్యానము ఆ వేదములను ప్రసాదించిన దివ్యపురుషుని వలననే ఆ శ్రీకృష్ణభగవానుని వలననే గీతయందు ప్రకటింపబడియున్నది. ఏ జీవనవృత్తియందున్నను ప్రతి వానికి ఉపకరించు విధమున ఆ వ్యాఖ్యానము కలదు, వేదాంతభావములు విశ్వమంతటను ప్రచారము గాంచవలెను. అవి అడవులలోనే పడియుండరాదు. అడవులనుండి, గుహలనుండి, వెలువడివచ్చి న్యాయాధిపతికిని, న్యాయవాదికిని, గురువులకును, ఛాత్రులకును, సంపన్నునకును, దరిద్రునకును, చివరకు చేపలుపట్టు బెస్తవానికిసైతము అందుపాటులోనికివచ్చి ఉపకరింపవలయును. ఉపనిషత్తుల ప్రబోధము ప్రతి పురుషునికి, స్త్రీకి, బిడ్డకు, వారెట్టి వృత్తిగలవారైనను, వారెచ్చటి వారైనను, అందఱకును వర్తించును. భయపడుట కేమున్నది? ఉపనిషత్తుల ఆదర్శములను ఎల్లరు బెస్తవాండ్రు సైతము ఎటుల అనుసరింప వీలగునో ఆ మార్గము తెలుపబడియేయున్నది. ఆ మార్గము అనంతము. మతము అనంతము. ఎవరును దానిని దాటిపోజాలరు. నీవు నిష్కపటచిత్తముతో ఏమి చేసినను నీ కది మేలే. అత్యల్పకార్యమైనను సవ్యముగ చేసినచో మహాద్భుత ఫలము నొసగును. కాబట్టి ప్రతివాడును, తానుచేయగల స్వల్ప కార్యమునైనను, శ్రద్ధతో నిర్వహించును గాక. బెస్తవాడు సైతము తాను ఆత్మస్వరూపి నని భావించు నెడల, తన బెస్త వృత్తియందు ఉత్తముడగును. విద్యార్థి తాను ఆత్మరూపినని తలంచునెడల, శ్రేష్ఠతరుడగు విద్యార్థియగును. న్యాయవాది తాను ఆత్మయే అని భావనచేయునెడల, శ్రేష్ఠతరుడగు న్యాయవాది యగును. ఇటులనే ఇతరులునుకూడ. దీని ఫలితార్థముగా కులములు శాశ్వతముగ నిలిచియుండును వర్గములుగ నేర్పడుట సంఘస్వభావములోనే కలదు. అందుగల ప్రత్యేకాధికారములు

మాత్రమే పోవలసినవి. కుల మనునది సహజమగు వ్యవస్థ. సాంఘికజీవితములో నే నొక ధర్మమును నిర్వహింపగలను, నీవు మఱొకధర్మమును నిర్వహింపగలవు. నీవు దేశమును పరిపాలింప గలవు, నేను పాతచెప్పులజోడును బాగుచేయగలను. అంత మాత్రముచేత నీవు నాకంటె గొప్పవాడవనుటకు కారణములేదు. ఏలయన నీవు నావలె చెప్పులను మరమ్మతు చేయగలవా? నేను దేశమును ఏల గలనా? నేను చెప్పులను బాగుచేయుటలో నేర్పరిని, నీవు వేదములు చదువుటలో నేర్పరివి. కాని అంత మాత్రముచేత నీవు నా నెత్తిమీద నెక్కి త్రొక్కుటకు కారణము లేదే! ఒకడు నరహత్యచేసినచో వానిని స్తోత్రముచేయుటయు, మఱియొకడు ఒక రేగుపండును దొంగిలించినమాత్రమున వానిని ఉరిదీయుటయు ఏల! ఇట్టిది అంతరింపవలయును. కులవిభజన మంచిదే. జీవనసమస్యను పరిష్కారము చేయుటకు ఇదియొక్క టియే సహజమైన మార్గము! మానవులు సంఘములుగ నేర్పడ వలసినదే, దానిని మీరు మాన్పజాలరు. మీ రెచ్చటికి పోయి నను, అచ్చట కులము ఉండియేతీరును. కాని అట్లనుటచేత ఈ న్యూనాధిక్యతలు, ఈ ప్రత్యేకాధికారములు, ఉండవలయునని అర్థముకాదు. వానిని తప్పక నిర్మూలింపవలయును. మీరు చేపలు పట్టు బెస్తవానికి వేదాంతము నేర్పినయెడల, అతడు ఇట్లనును "నేనును నీవలెనే మానవుడను. నీవు తత్త్వజ్ఞుడవు; నేను చేపలు పట్టువాడను. ఐననేమి? నీలోనున్న ఆ బ్రహ్మమే నాలోను గలదు." మనకు కావలసినది ఇదియే. ప్రత్యేకాధికారములు ఎవరికిని ఉండరాదు; అందఱికిని సమానావకాశములే! ప్రతివాని కిని, తనయందు భగవంతుడు గలడని బోధింపుడు. అప్పుడు ప్రతి వాడును తన ముక్తికై తానే పాటుపడును.

స్వాతంత్ర్యమే అభివృద్ధికి ముఖ్యమగు మూలము. 'ఈ స్త్రీకిగాని, ఈ బిడ్డకుగాని, నేను ముక్తిని సాధించిపెట్టెదను' అని

ఎవడేని చెప్ప సాహసించినయెడల అది అపచారము ఘోరాప చారము! వితంతుసమస్యనుగుఱించి నా అభిప్రాయ మేమనియు, స్త్రీసమస్యనుగుఱించి నా అభిప్రాయ మేమనియు, నన్ను అనేక పర్యాయములు అడుగుచుందురు. ఇందుకు ఒకేసారిగ ప్రత్యుత్తర మిచ్చివేసెదను· "ఆ పిచ్చిమాటలు నన్ను అడుగుటకు నేను వితంతువునా? నన్నా ప్రశ్న పదేపదే అడుగుటకు నేను ఆడు దాననా? ఆడువాండ్ర సమస్యలను పరిష్కరించుటకు మీ రెవరు? ప్రతివితంతువును, ప్రతిస్త్రీని, మీ అధికారములోనికి తెచ్చుకొని పరిపాలించుటకు మీరు దిగివచ్చిన దేవుళ్లా? దూరముగ నిలువుడు. వారు తమ సమస్యలను తామే పరిష్కరించుకొందురు. లోక కంటకులారా! మీ రొకరి కొక సాహాయ్యము చేసిపెట్టగలమని తలప సాహసింతురా? చాలును, ఊరకుండుడు. భగవంతుడే సమస్తమును చూచుకొనును. మీకు సర్వము తెలియునని అహంకరించుటకు మీ రెవరు? ఓ దైవదూషకులారా! భగవంతుని పైనను మీకు అధికారము గలదని భావించుటకు మీ రెటుల సాహసించుచున్నారు? ప్రతిజీవాత్మయు పరమాత్మయే యని మీకు తెలియదా? మీ కర్మవిషయము మీరు చూచుకొనుడు! మీరు అనుభవింపవలసిన కర్మభారము మీకున్నది! మీ జాతి వారు మిమ్మొక గద్దె నెక్కింపవచ్చును. మీ సంఘము మీ చర్య లకు ఆమోదసూచకముగా తమ కరతాళధ్వనులు మిన్నందింప వచ్చును. బుద్ధిహీనులు మిమ్మగూర్చి స్తోత్రపాఠములు చేయ వచ్చును. కాని భగవంతుడు నిదురపోవువాడుకాడు. మీకు ముట్టవలసిన ప్రతిశోధము ఇందో లేక అందో మి మ్మనుసరించి వచ్చుట తథ్యము!

ప్రతిస్త్రీని, ప్రతిపురుషుని, ప్రతివారిని బ్రహ్మముగ చూడుడు! మీరు చేయగలది సేవయే; సాహాయ్యముకాదు. భగవంతుని బిడ్డలకు సేవచేయుడు. ఆ భాగ్యము కలిగెనేని

భగవంతునికే సేవచేయుడు. తన బిడ్డలలో ఎవనికేని మీరు తోడ్పడు అదృష్టమును పరమేశ్వరుడు మీకు ప్రసాదించినచో మీరు ధన్యులే! మిమ్ముగుఱించి మీరు అతిశయముగ తలచుకొనకుడు. ఇతరులకు లభింపని ఆ అదృష్టము మీకు లభించుట వలన మీరు ధన్యులు. అర్చనరూపముగ మీ రా సేవాకార్యమును నిర్వహింపుడు. దరిద్రులందు మనము భగవంతుని ప్రత్యక్షము చేసికొనవలయును. మనము పోయి వారిని పూజించుట మన ముక్తికొఱకే! వ్యాధితునిరూపమున, పిచ్చివానిరూపమున, కుష్ఠరోగిరూపమున, పాపాత్మునిరూపమున కానబడుచున్న భగవంతుని మనము సేవించుకొఱకే దరిద్రులును, దుఃఖితులును ఉద్దేశింపబడియున్నారు! ఈ సాహసోక్తులను — ఈ స్వరూపములన్నింటను భగవంతుని సేవించు నవకాశము మనకు లభించుట మహాప్రసాదము, పురాకృత సుకృతప్రాప్తము అను మాటలను — నేను మఱల చెప్పుదును. ఇతరులను పాలించుటవలన మీరు వారికి ఏమాత్రముగానైనను మేలు చేయగలుగుదు మను అభిప్రాయము విడిచిపెట్టుడు. మొక్క విషయములో మీ రెంత చేయగలరో అంతమాత్రమే ఇచ్చటకూడ చేయగలరు. వికాసమొందుచున్న విత్తనపు శరీరనిర్మాణమునకు అవసరములగు మృత్తికను, జలమును, వాయువును సమకూర్చుట మాత్రమే మీరు చేయగలపని. తనకు కావలసినదానినంతను అది తన సహజశక్తిచేతనే తీసికొని, జీర్ణము చేసికొని, తన సహజశక్తిచేతనే పెరుగును.

ప్రపంచములోనికి తేజోరాశిని తీసికొని రండు! తేజస్సు! తేజస్సు! తేజస్సు ప్రతివానికిని లభించునట్లొనర్పుడు! ప్రతివాడును బ్రహ్మమును చేరువఱకు ఈ కర్తవ్యము ముగియదు. పేదవారికి తేజస్సును చేకూర్పుడు. భాగ్యవంతులకు ఇంకను ఎక్కువగా దానిని చేకూర్పుడు. ఏలయన పేదవారికన్న వీరికే ఎక్కువగా వెలుగు కావలసియున్నది! చదువురానివారికి వెలుగును సమ

కూర్చుడు. చదువుకొన్నవారికి ఇంకను ఎక్కువ వెలుగను సమకూర్చుడు. ఏలయన మనకాలపు చదువులచే గలుగు దురభిమానములు అపారములు. కావున అందఱకను తేజస్సును సమకూర్చి తక్కిన పనిని భగవంతునికి వదలివేయుడు.

"కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి"

"కర్మచేయుటకే నీకు అధికారము కలదు కాని, ఆ కర్మఫలమునందు నీకు అధికారము లేదు. ఆ కర్మలు నీకొఱకై ఫలము లొసగునను ఆశ పెట్టుకొనదగదు. ఐనను నీవు కర్మను వదలగూడదు" అని భగవానుడే స్వయముగా సెలవిచ్చియున్నాడు గదా.

ఇట్టి మహోన్నతభావములను యుగములకుమున్నే మన పూర్వులకు బోధించిన ఆ పరమేశ్వరుడు తన ఆజ్ఞలను ఆచరణలో పెట్టుటకు తగిన బలమును సంపాదించుకొనునటుల మనకు సాహాయ్యముచేసి అనుగ్రహించుగాక!



# భారత సిద్ధపురుషులు

భారత సిద్ధపురుషులను గుఱించి మాట్లాడునపుడు, చరిత్ర రూపమగు సాక్ష్యములేనట్టి పురాతనకాలమునకు నా మనస్సు పరువులిడుచున్నది. ఆ ప్రాచీనకాలపు అంధకారములో దాగి యున్న రహస్యములను వెలువరించుటకు సంప్రదాయబంధురము లైన జనశ్రుతి గాథలు వ్యర్థముగ ప్రయత్నించుచున్నవి. భారత సిద్ధపురుషులు లెక్కలేనంతమంది గలరు. వేలకొలది సంవత్సరములుగా భారతజాతిసిద్ధులను సృజించుటకంటె చేసిన మహత్తర కార్య మింకొకటిలేదు. యుగకర్తలై మహాతేజముతో వెలిగిన కొందఱి జీవితములను మాత్రమే కైకొని, వారిని గుఱించి నా పరిశోధనఫలములను మీకు తెలిపెదను.

మున్ముందుగ మన శాస్త్రగ్రంథములనుగూర్చి మన మొకింత తెలిసికొనవలసియున్నది. సత్యముయొక్క రెండు ఆదర్శములు మన శాస్త్రములందు గలవు. ఇందొకదానిని సనాతనమనియు, రెండవదానిని అంత ప్రామాణికమైనది కాదనియు, ఐనను కొన్ని దేశకాలపరిస్థితులయందు అది విధిగా అనుసరింపవలసినదే అనియు మన మనుచున్నాము. జీవునియొక్క ఈశ్వరునియొక్క స్వభావములనుగూర్చియు, జీవాత్మలకును పరమాత్మకును గల సంబంధమునుగూర్చియు, శ్రుతులు లేక వేదములు అను వానియందు తెలుపబడియున్నవి. రెండవరకపు సత్యములను మనము స్మృతులని పేర్కొనుచున్నాము. మనువు, యాజ్ఞవల్క్యుడు మొదలగు వారి గ్రంథములందును, పురాణములు మొదలు తంత్రశాస్త్రముల వఱకును గల గ్రంథములందును అవి తెలుపబడియున్నవి. ఈ రెండవరకపు గ్రంథములును, సిద్ధాంతములును, శ్రుతులకు లోబడినవి. వీనిలో ఏదేని శ్రుతివిరుద్ధముగా నున్నయెడల, దానిని

త్రోసివేసి శ్రుతిధర్మమునే పాటింపవలయును అని సిద్ధాంతము. నరునియొక్క గతిగమ్యముల బాహ్యరూపము మాత్రము వేదములందు సూచింపబడెననియు, వాని వివరములు స్మృతులలోను, పురాణములలోను విశదముచేయబడెననియు దీని అభిప్రాయము. సామాన్యధర్మములను మాత్రము తెలిసికొనుటకు శ్రుతులు చాలును. పారమార్థికజీవనమును గుఱించి అంతకుమించి తెలుపగలిగినది లేదు. తెలిసికొనుటయు సాధ్యముకాదు. జీవాత్మ అఖండత్వమును సాధించుకొనుటకు కావలసినదంతయు పూర్తిగా శ్రుతులయందు బోధింపబడియున్నది. వివరములు మాత్రము లేవు. వీనిని స్మృతులు ఆయా కాలములందు పూరించుచు వచ్చినవి.

శ్రుతులను గుఱించిన మఱొక విశేష మేమనగా, వానియందలి సత్యములను ప్రోగుచేసినట్టి ఋషులు అనేకులు—వారిలో పెక్కండ్రు పురుషులు, కొందఱు స్త్రీలు. వారెటువంటివారో, ఎప్పుడు పుట్టిరో, ఈ మొదలగు విషయములనుగూర్చి మనకు తెలిసినది బహుస్వల్పము. ఐనను వారి ఉత్తమభావములు, వారు కనిపెట్టిన రహస్యములు, వేదములందు సురక్షితముగ కాపాడబడియున్నవి. స్మృతులందు ఇందుకు మాఱుగా వ్యక్తులవిషయములే ఎక్కువ ప్రధానముగా గోచరించుచున్నవి. లోకమునే ఉఱ్ఱూతలూగింపగల పురుషసింహులు, అద్భుతావహులు, మహామహిమాఢ్యులు, సర్వజనాకర్షకులు పెక్కండ్రు మొట్టమొదటిసారి మనయెదుట నిలువబడిరో యనునటుల సాక్షాత్కరింతురు. కొన్ని సందర్భములందు వారి బోధలకంటె వారి స్వరూపములే మహత్తరములై కాన్పించును.

మనము గ్రహింపవలసిన విచిత్రవిషయ మొకటి గలదు. మన మతము నిర్గుణమగు సగుణబ్రహ్మమును బోధించుచున్నది. నిర్గుణధర్మములను ఎన్నింటినో బోధించుచు, అనేకుల మూర్తి

మత్త్వములనుకూడ చేర్చుచుండును. కాని మన మతమునకు మూలాధారములగు శ్రుతులయందు పూర్తిగా నిర్గుణతత్త్వమే కలదు. గొప్ప అవతారములు, దైవము తాల్చు మానవ స్వరూపములు, ప్రవక్తలు, మొదలగు పురుషభావములన్నియు స్మృతులందును, పురాణములందును గోచరించుచుండును. మన మత మొక్కటి తప్ప ప్రపంచములోని యితర మతములన్నియు, పురుషరూపుడగు ఒకానొక మతకర్త జీవితముపై ఆధారపడి యున్నవి. క్రైస్తవమతము ఏసుక్రీస్తు మీదను, మహమ్మదీయ మతము మహమ్మదుమీదను, బౌద్ధమతము బుద్ధునిమీదను, జైన మతము జినులమీదను, ఇట్లే ఇతర మతములు ఇతరులమీదను ఆధారపడి నిర్మాణమైయున్నవి. ఈ మతములన్నియు, వానివాని మహాపురుషులను గుఱించిన చారిత్రాత్మికములగు నిదర్శనముల విషయమై గొప్ప పోరాటములు జరిపియుండుననిమనము ఊహింప వచ్చును. ఈ మహాపురుషుల జీవితముల గుఱించిన చారిత్రక నిదర్శనముల బలము ఎన్నడైనను సడలినయెడల, వారి మతభవన మంతయు నేలకూలి, విచ్ఛిన్నమై పోవును. మన కీ దురవస్థ తప్పినది. ఏలయన, మన మతము మానవులపైగాక, ధర్మ సిద్ధాంతములపై ఆధారపడియున్నది. మీరు మీ మతధర్మ ములకు లోబడి వర్తించుట, ఎవరో యొక ఋషియో, అవతార పురుషుడో ఆ ధర్మములను చెప్పిననుటచేత కాదు. వ్యక్తులపై గల ప్రామాణ్యబుద్ధివలనకాదు మనము ధర్మము నాచరించుట! వేదముల ప్రామాణ్యము కృష్ణునివలన వచ్చుటలేదు. కృష్ణునికే వేదములు పరమప్రమాణములగుచున్నవి. వేదములను బోధించు వారిలో ఆయన ఉత్తమోత్తము డగుటవలననే ఆయనకును పూజ్యత కలిగినది. ఇటులనే ఇతర అవతారముల సంగతియు! మన ఋషులందఱి విషయము అంతియే. నరుడు పరిపూర్ణు డగుట కును, మోక్షముపొందుటకును, కావలసినదంతయు వేదములందు కలదనుటయే మన ప్రాథమికసిద్ధాంతము. అంతకు మించిన

నూతనప్రమాణమును దేనినిగాని నీవు కనిపెట్టజాలవు. సమస్త జ్ఞానమునకును పరమావధియగు పరిపూర్ణాద్వైతమునుదాటి నీవు పోజాలవు. ఆ గమ్యము ఇప్పటికే అందు సాధింపబడియున్నది. దానిని దాటిపోవుట అసంభవము. ''తత్త్వమసి'' అను బోధను స్వానుభవమునకు తెచ్చికొనుటతో ఆధ్యాత్మికజ్ఞానము పరిపూర్ణ మగుచున్నది. అది వేదములందున్నది. ఇంక మిగిలినదంతయు భిన్నభిన్నములగు దేశకాలములను, పరిస్థితులను, సంబంధములను, అనుసరించి అప్పుడప్పుడు ప్రజలకు మార్గము చూపుచుండుట కొఱకేర్పడినదే! ప్రాచీన సనాతనమార్గము ననుసరించి ప్రజలను నడుపుటకొఱకే బోధకాగ్రగణ్యులగు ఈ మహాపురుషులు అవతరించు చుండిరి.

> ''యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
> అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం,
> పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే''

(ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియు గలుగుచుండునో, అప్పుడెల్ల నేను పుట్టుచుందును. సాధువుల రక్షించు కొఱకును, దుష్టుల సంహరించు కొఱకును, ధర్మమును సంస్థాపించు కొఱకును నేను ప్రతియుగమునందునుపుట్టుచుందును). శ్రీకృష్ణభగవానుని ఈ సుప్రసిద్ధ గీతావచనముకంటె ఎక్కువ విశదముగ ఈ విషయమును మఱేదియు ఋజువుచేయ జాలదు. భారతీయులకుగల భావ మిదియే.

దీని ఫలితార్థ మేమి? తర్కముమీదగాని, మహాపురుషుల ప్రామాణ్యములమీదగాని, చివరకు అవతారపురుషులమీదగాని ఆధారపడక, తమ సొంతపునాదులమీదనే స్వతంత్రముగా నిలిచి యుండు ఈ నిత్య ధర్మములు ఒకవైపున నున్నవి. ఇది భారత

దేశమునకుగల విశిష్టలక్షణమగుటచే, వేదాంతమత మొక్కటియే విశ్వజనీనమతము కాగల దనియు, అది మానవులను గుఱించిగాక ధర్మసిద్ధాంతములను గుఱించి బోధించునది గావున ప్రపంచములో ఇప్పటికి రూపొంది సిద్ధమైయున్న విశ్వజనీనమతము ఇదియొక్కటియే యనియు, మనము బాహాటముగా లోకమునకెల్ల చాటి చెప్పవచ్చును. ఒక పురుషునిపైని ఆధారపడి నిర్మింపబడిన ఏ మతమునుగాని ప్రపంచమందలి అన్నిజాతుల ప్రజలును అదర్శముగా అంగీకరింపరు. మన దేశమునందే మహాపురుషు లనేకులు వెలసి యుండిరని మన మెఱుగుదుము. ఒక చిన్నపట్టణములో సైతము వేర్వేఱుచిత్తవృత్తులు గల ప్రజలు తమతమ చిత్తవృత్తుల ననుసరించి, వేర్వేఱు వ్యక్తులను ఆదర్శమూర్తులుగ వరించుచున్నారు. అట్టిచో, ఒక మహమ్మదో, ఒక బుద్ధుడో, ఒక క్రీస్తో ప్రపంచ మంతటికిని అనన్యమగు ఆదర్శముగా స్వీకరింపబడుట ఎట్లు సాధ్యమగును? న్యాయమంతయు, నీతి యంతయు, ఆధ్యాత్మికధర్మ మంతయు, సిద్ధాంత మంతయు, ఆ ఒక్క పురుషుని అంగీకారమున్నంతమాత్రముననే సత్యమైనదిగా సమస్తప్రజలును శిరసా వహించుట ఎట్లు పొసగును? ఇక వేదాంతమతమునకో, అటువంటి ఏ పురుషునియొక్క ప్రామాణ్యాధికారములును అవసరము లేదు. దాని ప్రమాణము నరుని సనాతన ప్రకృతియే! అందలి నీతులు ఇదివఱకే సిద్ధమై యున్నట్టి సనాతనమగు మానవుని పారమార్థిక స్థైర్యముమీద ఆధారపడియున్నవి. ఐనను అతిప్రాచీనకాలము నుండియు, మానవజాతిలో అధికసంఖ్యాకులకు సగుణమూర్తి ఆవశ్యకమైయుండు నను సంగతి మన మహాపురుషులు తెలిసికొనియే యుండిరి. ఏదో ఒక రూపమున సగుణదైవతము ప్రజలకు కావలసియేయుండును. సగుణదైవతము ఉండ కూడదని గట్టిగా వాదించిన బుద్ధుని నిర్యాణానంతరము, ఏబది సంవత్సరములైనను గడవక మునుపే, వాని శిష్యులు వానినే ఒక సగుణదైవ

తముగా ఏర్పఱచి, ఆరాధించుట కారంభించిరి! ఈ సగుణదైవతము అవసరమే! ఐనను నిజ మాలోచించిన, సగుణదైవతములుగా భావింపబడినవారిలో నూటికి తొంబది తొమ్మిదిమంది మానవపూజకు అనర్హులుగనే యున్నారు. కాని ఊహాకల్పిత సగుణదైవతములకంటె శ్రేష్ఠతరమైన సజీవదైవతములు ఈలోకములోనే అప్పుడప్పుడు మనమధ్య, మనతోపాటు నివసించుచు, మనతో కలిసిమెలసి తిరుగుచుండుట కలదు! మన ఊహాకల్పితమగు బూటకపు దైవమునకంటె, ఇట్టివారిని సేవించినచో మన జన్మలు ధన్యమగును! మన జీవితములు చరితార్థములగును! మీరు గాని, నేను గాని కల్పించుకొన గలిగిన ఏ భగవద్భావన కంటెను శ్రీకృష్ణుడు గొప్పవాడు గదా! మన మనస్సులలో మీరు గాని, నేను గాని కల్పన చేసికొనగలిగిన ఆదర్శమూర్తి కంటె, బుద్ధుడు ఎన్నోరెట్లు సజీవమును, పూజనీయమును నగు ఉత్తమ భావనామూర్తి కాదా! అందువలననే ఇట్టి పురుషులు ఊహాకల్పితదేవతల నందఱిని నెట్టివేసి, మానవ జాతివలన సతతము పూజల నందుచున్నారు!

ఈ సత్యము మన ఋషులకు తెలియును. కావుననే అట్టి మహాపురుషులను, అవతారమూర్తులను, భారత ప్రజలెల్లరు పూజించు నవకాశమును వారు కల్పించియున్నారు. ఇట్టి అవతార పురుషులలో ఉత్తమోత్తముడగు శ్రీకృష్ణుని పలుకు సర్వాతిశాయిగానున్నది

> "యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
> తత్త దేవావ గచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవం"

(ఎచ్చటెచ్చట నరుని వలన బాహాటముగ అసాధారణవిభూతి ప్రకటితమగునో అక్కడ నే నున్నాననియు, ఆ ప్రకాశమంతయు నా వలననే పుట్టుచున్నదనియు తెలిసికొనుము.)

ఈ ప్రవచనము, ప్రపంచములోని ఎల్ల దేశములందలి అవతారములను పూజించుటకు భారతీయునకు అవకాశము నొసగుచున్నది. హిందువు ఏ దేశమందలి ఏ ఋషినైనను, ఏ సాధుపురుషునైనను, పూజింప గల్గును. యథార్థమునకు మనవారు అనేక పర్యాయములు క్రైస్తవుల ఛర్చిలలోనికిని, మహమ్మదీయుల మసీదులలోనికిని, పోయి పూజ లర్పించుచుండుట మనకు తెలిసిన విషయమే. అటుల చేయుట మంచిదే. ఎందులకు కాదు? నేను చెప్పినటుల మనది విశ్వజనీనమతము, సమస్తాదర్శములను తలలో ఇముడ్చు కొనగలిగినంత ఉదారమును, విశాలమును నైనది. ప్రపంచములో ఇంతవఱ కుండియున్న మతాదర్శముల నన్నింటిని వేదాంతమతము తనలో ఇప్పుడే ఇముడ్చుకొన గలదు, ఇట్లే ఆదరించి తన అనంత బాహువులతో ఆలింగనమును చేసికొనుటకు భవిష్యత్కాలమున రానున్న ఆదర్శముల కొఱకై ఓపికతో నిరీక్షించుచుకూడ నుండగలదు.

భగవదవతారమూర్తులగు మహాపురుషులను గుఱించి, మన సిద్ధాంతము ఇంచుమించుగా ఇట్లున్నది. వారికంటె తక్కువ ప్రాధాన్యముగల పురుషవరులుగూడ కలరు. ఋషి యను మాట వేదములలో అనేకపర్యాయములు వాడియుండుట మనము ఎఱుగుదుము. ఇప్పటికాలమునకూడ ఆ శబ్దము సామాన్యముగా వాడబడుచున్నది. 'ఋషి' అనగా ఒక గొప్ప ప్రమాణపురుషుడు. ఆ భావమును మనము గ్రహింపవలయును. 'ఋషి' యనగా 'మంత్రద్రష్ట', అనగా భావమును చూచువాడు అని నిర్వచనము. ఆధ్యాత్మికధర్మమునకు రుజువేమి? అతిప్రాచీనకాలమునందే ఈ ప్రశ్న బయలుదేఱినది. దానికి ఇంద్రియానుభవరూపమగు రుజువు లేదని ప్రవచింపబడెను. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" (ఆ పరతత్త్వమును చేరలేక వాక్కులు మనస్సుతో సహా వెనుకకు వచ్చుచున్నవి!) "న తత్ర చక్షు

ర్గచ్ఛతి, నవాగ్ గచ్ఛతి నో మనో!'' (అక్కడికి కన్నులు చేర జాలవు, వాక్కు చేరజాలదు, మనస్సును చేరజాలదు) అని యుగ యుగాంతరములనుండి ప్రవచింపబడుచున్నది. ఆత్మయొక్క ఉనికిని గుఱించియు, భగవంతునియొక్క ఉనికిని గుఱించియు, జీవితముయొక్క నిత్యత్వమును గుఱించియు, మానవుని పరమా వధిని గుఱించియు, ఇంకను ఇట్టి విషయములను గుఱించియు బాహ్యప్రకృతి మన కేమియు సమాధానము చెప్పజాలదు. మానవ మనస్సు నిరంతరము మాఱునది, ఎప్పుడును చంచలము. దానికి పరిమితి గలదు. అది ఖండఖండములుగా తెగిపోవునది. అనంతమై, నిర్వికారమై, అఖండమై, అభేద్యమై, శాశ్వతమై పరగు బ్రహ్మ మును గుఱించి ప్రకృతి ఎట్లు తెలుపగలుగును? అది దాని కెన్నడును సాధ్యముకాదు. పైగా నిర్జీవమై, జడమై పరగు ద్రవ్యరాశినుండి ఆ సమాధానమును పొందుటకై మానవుడు ప్రయత్నించినప్పుడెల్ల, అతడు వ్యర్థసంకల్పుడగుటయే తటస్థించె నని చరిత్ర తెలుపుచున్నది. అయినచో వేదములు తెలుపు జ్ఞానము ఎట్లు లభించినది? 'ఋషి'త్వ మొందుటవలన అది లభించెను. ఆ జ్ఞానము ఇంద్రియములం దుండునది కాదు. ఈ ఇంద్రియజ్ఞానమే నరుని ఆద్యంతములగునా? మానవుడన ఈ ఇంద్రియ ములే అని చెప్పగలవా డెవడు? మన యందఱి జీవితములలో అత్యంతనిశ్చలతను అనుభవించు క్షణములు అప్పుడప్పుడు ఘటిల్లు చుండును. మన కన్నులయెదుట మనము ప్రేమించు నొకడు మరణించినప్పుడో, ఏదేని ఆకస్మికమగు ఆపద వచ్చినప్పుడో, అత్యంతమగు ఆనందము చేకూరినప్పుడో అటుల తటస్థింపవచ్చును. మన మనస్సు నిశ్చలమై ఒక క్షణకాలము తన స్వస్వరూపమున నిలిచి, సర్వాతీతమగు అఖండబ్రహ్మముయొక్క జాడ తళుక్కు మనెనో యన్నట్లు విశిష్టానుభవమును పొందునట్టి క్షణములు ఇతర సమయములందు సైతము తటస్థింపవచ్చును! మాటల కందని దియు, మనస్సునకు గోచరింపనిదియు, ఏదో మన కప్పుడు ప్రత్యక్ష

మగును. ఇది సామాన్యజీవితమునకూడ సంభవించునదే. కాని దీనికి ఔన్నత్యముకల్పించి, సాధనమూలమున పరిపూర్ణత కలిగింప వలెను. యుగాంతరములకు పూర్వమే ఆత్మ ఇంద్రియములచేత పరిమితముగాక, ఇంద్రియములకు అతీతమై చైతన్యమునకుకూడ అందక పరగునని మహాపురుషులు కనిపెట్టియున్నారు! అంతులేని ఒక పెద్దగొలుసులో, 'ఎఱుక' అనునది ఒక కడియము మాత్రమే అని మనము గ్రహింపవలయును. ఎఱుకయును, బ్రహ్మమును ఒకటికాదు. ఎఱుక బ్రహ్మముయొక్క ఒక అంశమాత్రమే! ఈ ఎఱుకను దాటియు సాహసవంతమగు అన్వేషణము సాగవలసి యున్నది. ఎఱుక ఇంద్రియములచేత పరిమితమైనది. దానిని దాటి, ఇంద్రియములను దాటి ఎగసిపోవలయును. అప్పుడు ఆధ్యాత్మికప్రపంచముయొక్క సత్యములు మనకు గోచరించును. ఈ ఇంద్రియముల హద్దులను దాటిపోవుటలో సామర్థ్యమును గడించిన పురుషులు ఈ కాలమునందును కలరు. ఆధ్యాత్మిక సత్యములను వారు ప్రత్యక్షముగా తెలిసికొనుటవలన వారిని 'ఋషులు' అందుము.

వేదములకు రుజువు, నా యెదుట నున్న యీ బల్లకు రుజువు ఎట్టిదో అట్టిదే! అది ప్రత్యక్షప్రమాణమే; అనగా స్వయముగా గోచరించుటయే. ఈ బల్లను నేను ఈ బాహ్యేంద్రియదృష్టితో చూచుచున్నాను. ఆధ్యాత్మికసత్యములను జీవాత్మయొక్క అతీంద్రియావస్థలో చూడగలుగుదుము. ఈ 'ఋషిత్వము' కాలమువలనగాని, స్థలమువలనగాని, స్త్రీపురుషభేదమువలనగాని, జాతిభేదమువలనగాని పరిమితముకాదు. ఆర్యుడని, అనార్యుడని, మ్లేచ్ఛుడని భేదములేక అందఱకును ఈ 'ఋషిత్వము' సామాన్య సంపదయని వాత్స్యాయనఋషి ప్రకటించియున్నాడు. వేదము లలో తెలుపబడిన 'ఋషిత్వము' ఇటువంటిది. భారతదేశములోని ఈ మతాదర్శమును నిరంతరము మనము స్మరించుకొనుచుండ

వలెను. దీనిని ప్రపంచములోని ఇతరజాతులవారును తెలిసికొని, జ్ఞప్తి నుంచుకొందురుగాక యని కోరుచున్నాను. అప్పుడు పోట్లాటలు తగ్గిపోవును; వాగ్వాదములు తఱిగిపోవును. ఆధ్యాత్మిక ధర్మము పుస్తకములందు లేదు; సిద్ధాంతములందు లేదు; విధి వాక్యములందు లేదు; ఉపన్యాసములందు లేదు; తర్కమునందును లేదు. అది 'స్థితి' 'సిద్ధు'లందు ఉన్నది. మిత్రులారా, మీలో ప్రతివాడును ఋషియై, ఆధ్యాత్మికసత్యములను ప్రత్యక్షముచేసి కొనువఱకును, మీకు ఆధ్యాత్మికజీవనము ప్రారంభము కానట్లే! అతీంద్రియదశ మీకు అబ్బువఱకును ఆధ్యాత్మికజీవనము అనునది వట్టి అర్థరహితమగు మాటయే. అదంతయు సాధనవంటిదన వచ్చును. నీవు స్వయముగా ఎఱుగని విషయమునుగూర్చి ఎవరో చెప్పిన దానిని మఱెవరిమూలముగనో విని నీవు ప్రసంగములు సాగించుచున్నావు. బుద్ధభగవానుడు కొందఱు బ్రాహ్మణులతో వాదన సలిపినప్పుడు చెప్పిన మాట ఇక్కడ చక్కగా ప్రసక్తమై యున్నది. వారు బ్రహ్మముయొక్క స్వరూపమును గుఱించి వివాద పడుచుండగా బుద్ధదేవుడు "నీవు బ్రహ్మమును చూచితివా?" అని ప్రశ్నించెను. "లేదు" అని బ్రాహ్మణు డనెను. "సరే, నీతండ్రియో?" "ఆయనయు చూడలేదు." "మీ తాతయో?" "ఆయనయు చూచినట్లు నాకు తోపదు." "అటులైనయెడల, మిత్రమా! మీ తండ్రియు, మీ తాతయు, ఎన్నడునుచూచి యుండని పురుషుని గుఱించి మీరు వివాదపెట్టుకొని, ఒకరినొకరు జయింపజూచుట ఎందులకు?" అని బుద్ధభగవానుడు పల్కెను. ప్రపంచమంతయు చేయుచున్న దిదియే. ఈ వేదాంతవాక్యమును మన మనువదింతముగాక! "నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా, బహునాశ్రుతేన!" (పాండిత్య మార్జించుటచేత ఈ ఆత్మను చేరలేము; మహత్తర బుద్ధిబలముచేతను చేరలేము; వేదముల నన్నిటిని పఠించుట మూలమున సైతము చేరలేము.)

కావున వేదప్రమాణము ననుసరించి ప్రపంచమందలి అన్ని జాతులవారికిని మనము ఇటుల చెప్పుదము గాక: "మీ పోరాటము లన్నియు మీ వాగ్వాదము లన్నియు, వ్యర్థములు! మీరు బోధింప బూనిన దైవమును మీరు చూచితిరా? చూచి యుండని యెడల, మీ బోధయంతయు వ్యర్థమే! మీరు చెప్పున దేమో మీకే తెలియదు. మీరు అతనిని చూచియున్న యెడల వాదు లాడరు; అప్పుడు మీ ముఖములందే వర్చస్సు కానిపించును." ఉపనిషత్తులలో పేర్కొనబడిన ఒక ప్రాచీనఋషి తన కుమారుని బ్రహ్మమును గుఱించి తెలిసికొనిరమ్మని పంపెను. ఆ బాలుడు తిరిగిరాగా నీవేమి తెలిసికొంటివని తండ్రి యడిగినాడు. నేను చాల శాస్త్రములను నేర్చితినని పిల్లవాడు జవాబు చెప్పెను. కాని తండ్రి 'అది యంతయు నిష్ఫలము; తిరిగి పొ'మ్మనెను. ఆ కొమరుడు మఱలిపోయి, కొంతకాలమునకు మరల తిరిగి రాగా తండ్రి వెనుకటి ప్రశ్ననే అడిగెను. బాలుడు వెనుకటి జవాబునేచెప్పెను. ఇంకొక పర్యాయము అతడు వెడలిపోవలసి వచ్చెను. ఆ పిమ్మట ఆ బాలుడు తిరిగి వచ్చినప్పుడు, వాని ముఖమంతయు ప్రకాశవంతమై యుండెను. అప్పు డతనితండ్రి దిగ్గున లేచి, "ఓహో! కుమారా! ఈనాడు నీముఖము బ్రహ్మవిదుని ముఖమును బోలి ప్రకాశించుచున్నది" అని పలికెను! మీరు భగవంతుని తెలిసికొనినప్పుడు మీ ముఖవర్చస్సు మాఱును; మీ కంఠస్వరము మాఱును; మీ ఆకారమంతయు మాఱును. మీరు మానవజాతినే ఉద్ధరించువారగుదురు. "ఋషి"కి ఎవరును ఎదురై నిలువ జాలరు. ఇట్టిది ఋషిత్వమనగా! ఇది మన మతమున పరమావధి! తక్కిన వన్నియు, ఈ ప్రసంగములు, తర్కములు, తత్త్వ సిద్ధాంతములు, ద్వైతములు, అద్వైతములు — చివరకు వేదములు కూడ — యాత్రాసన్నాహములవంటివే! అప్రధానమైనవే! ఋషిత్వము మాత్రమే ప్రధాన మైనది. వేదములు, వ్యాకరణము, జ్యోతిషము, మొదలగున వన్నియు అప్రధానములే. ఆ

నిర్వికార బ్రహ్మసాక్షాత్కారమును చేకూర్చునది పరావిద్య యొక్కటియే. వేదములలోని 'ఋషు'లు అట్టి సాక్షాత్కారమును పొందినవారే. ఈ 'ఋషి' అనుపదము, ఒక తరగతికి, ఒక దశకు పేరు. మన మెల్లగమును — సత్యముగు ప్రతి హిందువును ఆ పదమునకు అర్హులమై, మన జీవితములో ఏదో ఒక కాలమున 'ఋషుల'ము కావలయును. ఋషి యగుట యనగా ముక్తి నార్జించుటనియే హిందువుల అభిప్రాయము. శాస్త్రధర్మములందలి విశ్వాసము ముక్తి కాదు. వేలకొలది దేవస్థానములను దర్శించుటయు కాదు, లోకములోని నదు లన్నింటను స్నానమాడుటయు కాదు. కాని మంత్రద్రష్టయై 'ఋషి' యగుటయే బంధవిమోచనము, మోక్షము.

వేదకాలమునకు తరువాతకూడ లోకమును సంచలింపజేయు సామర్థ్యముగల మహర్షులును అవతారపురుషులును ఎందరో ఉదయించిరి. భాగవతప్రమాణము ననుసరించి అట్లుదయింపవలసినవారి సంఖ్య అనంతము. భారతదేశములో అత్యధికముగ పూజింప బడువారు రాముడును, కృష్ణుడును, త్రేతాయుగము నాటి ప్రాచీనదైవత మగు రాముడు సత్యధర్మములకు నిలయము, ఆదర్శరూపుడగు కుమారుడు, ఆదర్శరూపుడగు భర్త, ఆదర్శరూపుడగు తండ్రి, అన్నిటిని మించి ఆదర్శరూపుడగుప్రభువు. ఇట్టి రాముని వాల్మీకిమహర్షి మనకు ప్రదర్శించి యున్నాడు. ఈ మహాకవి శ్రీరాముని జీవితమును వర్ణించిన భాషకంటె స్వచ్ఛమును, నిర్దుష్టమును, మనోహరమును, సులభగ్రాహ్యమును అగు భాషయే ఉండజాలదు. ఇక సీతను గుఱించి చెప్పవలవియా! ప్రపంచములోని పూర్వగ్రంథరాశి నంతను భవిష్యత్కాలములో రచింపబడనున్న గ్రంథరాశిని సైతము గాలించిచూచిన గాని మీకింకొక సీత కనబడదు. సీత అసదృశమైనది. అంతకంటె సమగ్రత నూహించుట దుర్లభముగా నుండున ట్లామె

చిత్రింప బడినది. అనేకరాము లుండిన నుండవచ్చును గాని, ఈ ఒక్క సీతగాక మఱిసీత లుండబోరు. ఆమె నిష్కళంక భారత నారీమణికి పరమాదర్శమై యున్నది. ఆ సీతయొక్క జీవితము నుండియే స్త్రీత్వపరమావధిని నిర్ణయించు భారతాదర్శము లన్నియు పుట్టుకొని వచ్చినవి. అనేక సహస్రాబ్దములనుండి, ఆర్యావర్తభూమిలో ఒక కొన నుండి మఱొక కొనవఱకు, సర్వత్ర ప్రతి పురుషుని చేతను ప్రతి స్త్రీ చేతను ప్రతి శిశువుచేతను సైతము పూజల నందు కొనుచు, ఆ దివ్యమూర్తి వెలయుచున్నది. ఈ దివ్య స్వరూపిణి సీత, పావనత కంటెను పావనమై, అగాధ సహనశీలయై, పరమశాంతినిధానయై, సర్వకాలమును అసమానయై నిలిచియుండును. ఇసుమంతయు సణుగు కొనక, గొణుగు కొనక, ఆమె జీవనదుఃఖసముద్రమును ఓపికతో ఈదినది ; నిత్య సత్యవ్రతయై, పతివ్రతాతిలకమై, మానవులకును దేవతలకును పరమాదర్శమై ఆమె ప్రకాశించుచున్నది. ఆ మహా సాధ్వి సీత మనజాతికి అధిష్ఠానదేవతయై సదా సుస్థిరముగ నిలిచి యుండ వలసినదే! ఆమెను గుఱించి వర్ణనలు చేయుట ముంజేతి కంకణ మునకు అద్దము చూపుటే! మన పురాణములన్నియు నశించి పోవచ్చును; మన వేదములే నీట గలయ వచ్చును; మన సంస్కృత భాషయే ఊరుపేరు లేకుండ మాయమైపోవచ్చును; కాని పదిమంది భారతీయులైనను బ్రతికియుండు నంత కాలము, నింద్య గ్రామ్యభాషలో నైనను ఒక్కడుగాని మాటాడువా డుండునంత వఱకు, ఈ సీతా మహాదేవి కథ ప్రస్తావనకు రాక తప్పదు. ఈ సీత మన జాతియొక్క జీవస్థానము నాక్రమించినది. ప్రతి భారతీయ స్త్రీయొక్క, పురుషునియొక్క రక్తము నందు ఆమె కలదు. మన మెల్లరము సీతామహాదేవి యొక్కసంతానమే! మన స్త్రీల యందు నవీనసంస్కరణముల ప్రవేశ పెట్టు ప్రయత్నములో సీత యొక్క పరమాదర్శమునుండి వారిని దూరము చేయవలయు నను సంకల్పము కలదేని, అది తత్క్షణము కొఱగానిదై పోవును. ఆ

సంగతి ప్రతిదినము తెలియవచ్చుచునే యున్నది. భారత దేశ స్త్రీలు ఈ సీతయొక్క అడుగుజాడల ననుసరించి వృద్ధి పొంది వికాసమును పడయవలయును. వారి కది యొకటియే మార్గము.

అనంతరూపముల పూజింపబడుచు, స్త్రీలకును పురుషుల కును ఏకరీతిని ఇష్టదైవతమై, పిన్నలకును పెద్దలకునుగూడ పరమా దర్శమై వెలుగు తేజోమూర్తికడ కిప్పుడు వత్తము. భాగవతకర్త ఈ శ్రీకృష్ణుని అవతారమని పేర్కొనుటతో తృప్తినొందక, అవతారములన్నియు ఎవ్వాని అంశోద్భూతములో అట్టి శ్రీమహా విష్ణువే యని అభివర్ణించినాడు. ఈ మహనీయుని బహుముఖమూర్తి మత్త్వము మనల నాశ్చర్యనిమగ్నుల నొనర్చుచుండ నాతనిని ఈ విధముగా అభివర్ణించుట విచిత్రము కాదు. అతడు విస్మయము కలిగించు సన్న్యాసియు, విస్మయము కలిగించు గృహస్థుడును! అతనియందు అగణితమగు మహాశక్తిస్వరూపమగు రజస్సు గోచ రించుచుండుటే కాక, బహువిస్మయము గొలుపు వైరాగ్యము కూడ మూర్తీభవించియుండును. మీరు గీతను బాగుగ పఠించిన గాని, శ్రీకృష్ణుని మహత్త్వము మీకు తెలియనే తెలియదు. ఏలయన అతని ఉపదేశమున కతడే మూర్తీభావము. ఈ అవతార ములలో ప్రతివారును తాము ఏమి బోధింప వచ్చిరో ఆ ధర్మము నకు సజీవదృష్టాంతములై వెలసిరి. గీతను బోధించిన శ్రీకృష్ణ భగవానుని జీవితమంతయు దివ్యగీతాస్వరూపమే. అనగా నిష్కామకర్మమునకు అతడు చక్కని దృష్టాంతము. తన సింహా సనమును పరిత్యజించి, మరల దానినిగూర్చి స్మరింపనైన లేదు. ఏ మహనీయుని ఆజ్ఞను శిరసావహించి చక్రవర్తులు తమ సింహా సనములనుండి దిగెదరో ఆ భారత నాయకాగ్రణి ఎన్నడును ప్రభు వగుటకు సంకల్పింపడయ్యెను, గోపికలతో కలసి మెలసి ఆటలాడిన బాలకృష్ణుడుగనే, సర్వజనసులభుడగు ఆ కృష్ణుడుగనే యుండెను. ఆ బృందావన మనోజ్ఞలీలలలో ప్రకటితమైన మహావిచిత్ర విశాల

వికసిత విశుద్ధప్రేమయొక్క దివ్యతత్త్వమును గ్రహించుట అట్టి దివ్యమధురభావరసపానము చేసి, నిష్కళంకప్రేమోన్మత్తచిత్తుడైనవానికే సాధ్యమగును! అహా! గ్రహించుట బహుదుర్లభమగు ఆ అద్భుతజీవితఘట్టమును పరమపవిత్రుడును, పూర్ణనిష్కళంకుడును అగు పర్యంతము ఏ వాడును గ్రహింప ప్రయత్నింపరాదు. ఆ గోపికల ప్రేమస్పందనముల నెవరు గ్రహింపజాలుదురు? ఆదర్శరూపమగు ఆ ప్రేమ! ప్రతిఫలాపేక్ష ఏ కోశమునను లేని ప్రేమ! స్వర్గమును సైతము లెక్కసేయని ప్రేమ! ఇహమునందుగాని పరమునందుగాని ఎద్దానిని స్మరణయందైనను నిలుపనోపని వినిర్మలప్రేమ! మిత్రులారా! ఈ గోపికాప్రేమమందే సగుణ నిర్గుణ బ్రహ్మభావముల నడుమ గల విభేదమునకు పరిష్కారమార్గము లభించినది. నరజీవితమునందలి అత్యున్నతదశయే సగుణబ్రహ్మమని మన మెఱుగుదుము. ఎవడు ఈ విశ్వమున సర్వాంతర్యామియై యున్నాడో, ఈ సృష్టి సర్వమును ఎవని వ్యక్తరూపముగా నున్నదో, అట్టి నిర్గుణబ్రహ్మమునందు విశ్వాసముంచుట తత్త్వశాస్త్రసమ్మతమని మనకు తెలియును. ఐనప్పటికిని మన హృదయములు ఏదేని వ్యక్తరూపముకొఱకై, ఏదేని సుగ్రాహ్యమగుదానికొఱకై, ఎవని పాదములచెంత మన ఆత్మలు శరణాగతి పొందజాలునో అట్టి తత్త్వస్వరూపముకొఱకై తహతహపడుచుండును. కావున మానవస్వభావము అందుకొనగల మహోత్కృష్టభావన సగుణబ్రహ్మరూపమైనది, కాని సగుణబ్రహ్మభావనము తర్కమునకు వెగటుగనే తోచును. ఇది బ్రహ్మసూత్రములలో వితర్కింపబడినట్టియు, ద్రౌపది యుధిష్ఠిరునితో అరణ్యవాసకాలమున తర్కించినట్టియు, తాతలనాటి ప్రాత ప్రశ్నయే! సగుణదైవతమే యుండినయెడల, ఆయన సర్వదయాళుడును, సర్వశక్తిమంతుడును అగునెడల, ఈ భూలోకనరకము ఏల సంఘటిల వలయును? అతడు ఇట్టిదానిని సృష్టిచేయనేల? ఆతడు పక్షపాతియై యుండవలెను! ఇందుకు సమాధాన మారయగా ఈ గోపికాప్రేమ

మొక్కటియే తగు సమాధానముగా లభించినది. కృష్ణునకు ఆరోపింపబడిన ప్రతివిశేషణమును గోపికలకు వెగటై తోచినది. అతడు జగన్నాథుడని, సర్వశక్తిమంతుడని, పరంధాముడని వినుట యందు వారి కాసక్తి లేదు. అతడు అఖండప్రేమమూర్తి యని మాత్రమే వారి భావము. వారి కంతియే చాలును! వారు శ్రీకృష్ణుని బృందావనకృష్ణునిగా మాత్రమే పరిగణించిరి. ఆ మహా సైన్యాధిపతి, ఆ రాజాధిరాజు వారి భావనలో గోపాలుడే! ఎల్లప్పుడు గొల్లవాడే! "నాకు ధన మక్కఱలేదు; జన మక్కఱ లేదు; పాండిత్యము అక్కఱలేదు; స్వర్గప్రాప్తికూడ అక్కఱలేదు. నేను ఎన్నిజన్మలనైనను ఎత్తుదునుగాక! ఓ దేవా, నాకు నీయెడల భక్తి యుండునటుల, అది నిష్కామభక్తిగ నుండునటుల అను గ్రహింపుము!" అని వ్రజవనిత ప్రార్థించినది.

భక్తికొఱకే భక్తి, కర్మకొఱకే కర్మ; ధర్మముకొఱకే ధర్మము! అను ఈ భావము ఆస్తికజీవనచరిత్రయం దొక ప్రధాన ఘట్టము. ఈ పరమార్థము అవతారములలో ఉత్తమోత్తముడగు శ్రీకృష్ణభగవానుని ముఖమునుండి ప్రప్రథమమున వెలువడినది. మానవజాతిచరిత్రయందు అయ్యది మొట్టమొదటిసారి భారత క్షేత్రముననే ప్రవచింపబడినది! భయప్రలోభములతో గూడిన మతములు ఒక్కసారిగా ఎగిరిపోయినవి. నిరయభీతి విజృంభించు చున్నను, స్వర్గసుఖప్రలోభము తాండవించుచున్నను, భక్తికొఱకే భక్తి, ధర్మముకొఱకే ధర్మము, కర్మకొఱకే కర్మ అను మహో త్కృష్టమగు ఆదర్శము ఉదయించినది.

ఓహో! ఎట్టి భక్తి! ఎట్టి ప్రేమ! గోపికల ప్రేమను అర్థము చేసికొనుట చాల దుష్కరమని ఇంతకు మునుపే చెప్పి యుంటిని. అద్భుతమగు ఆ ప్రేమోదంతములోని గంభీరార్థమును గ్రహింపజాలని మూర్ఖులు మనయందు సైతము లేకపోలేదు. ఈ పవిత్రగాథకు నీచార్థములు కల్పించి వివరించుకొను మూర్ఖులు,

కలుషమనస్కులు, అపవిత్రహృదయులు పెక్కుమంది మన జాతి యందే కలరు. "బిడ్డలారా, మున్ముందుగా మీ హృదయములను పవిత్రము చేసికొనుడు; ఈ గోపికల అనురాగ గాథను వివరించిన మహనీయుడు ఆ శ్రీశుకదేవుడే గాని అన్యుడు కాడని మీరు జ్ఞప్తి నుంచుకొనుడు. అద్భుతావహమగు ఈ గోపికాప్రేమమును గుఱించి గానము చేసిన ఐతిహాసికుడు పరమపవిత్రుడై అవతరించిన ఆ నిత్యనిర్మలమూర్తి శ్రీ శుకమహాఋషి! శ్రీ వ్యాసమహాఋషి తనయుడు!" అని మాత్రమే నేను వారికి చెప్పుదును. హృదయము నందు ఎక్కడేని ఇసుమంత స్వార్థచింత యున్నంతవఱకు భగవద్భక్తి కలుగనేరదు. స్వార్థచింతతో భక్తినెఱపుట అంగడి వ్యాపారమువంటిదే! "నేను ఇది నీకిచ్చెదను; ఓ స్వామీ! దీనికి మాఱుగ నాకు వేఱొకటి యిమ్ము" అనుటే! అప్పుడు, ఆ స్వామి ఇట్లనును: "సరే, నీవు ఈ పని చేయుము. చేయనిచో నీవు మరణించిన పిదప నీ పని పట్టెదను; జన్మజన్మకు నిన్ను నిప్పులలో వేసి మలమల మాడ్చెదను; ఇంక ఏమేమో చేసెదను." ఇట్టి క్షుద్రభావములు మనలో నున్నంతకాలము, ఆ గోపికాప్రేమోన్మాదస్థితి ఎట్లు అర్థమగును? "అహో! ఆ పెదవులముద్దు, ఒక్క ముద్దు చాలును! నీ ముద్దు నందుకొనినవానికి నీ కొఱకై తపన, ఆరాటము, క్షణక్షణము పెరిగిపోవుచుండును! ఇతర వ్యసనములన్నియు రూపుమాసి పోవును! నిన్ను వినా మఱెద్దానిని అతడు ప్రేమించుటే మఱచును! నిన్ను మాత్రమే రాగముతో స్మరించుచుండును." ఔను! భోగములపై మీకున్న రాగమును, పేరు కొఱకై మీరు పడుచున్న ఆరాటమును, ప్రఖ్యాతిపై మీకున్న క్షుద్రాపేక్షను, ఈ జడప్రపంచపు నీచాడంబరములపై మీకున్న కాంక్షను పరిత్యజింపుడు; పూర్తిగా పరిత్యజింపుడు. అప్పుడే, అప్పుడు మాత్రమే, గోపికల ప్రేమ యెట్టిదో మీకు అర్థము కాగలదు. సర్వార్పణము గావింపనిది అట్టి పవిత్రప్రేమకొఱకై ప్రయత్నించుట అతిసాహసమే యగును. అంతరంగము సంపూర్ణ

ముగా పవిత్రమై వెలయువఱకు, ఆ భక్తియొక్క మహత్త్వము మీకు ఎఱుకపడదు. కటకటా! స్త్రీపురుష విభేదభావములు, ధనకాంక్ష, కీర్తి కామము, అనుక్షణమును హృదయములో పొంగి పోవుచుండు ఈ క్షుద్ర మానవులు గోపికల విశుద్ధప్రేమను శ్రీకృష్ణావతార తత్త్వరహస్యములను అర్థము చేసికొనుటకును, అధిక్షేపించుటకును సాహసించుచున్నారే! ఉత్తమతత్త్వశాస్త్ర మగు గీతసైతము ఈ భక్తిపారవశ్యమునకు సాటిగాదు! ఏలయన, గీతలోని సాధకుడు పరమావధి చేరుటకు ఎట్లు నడువవలయునో, నెమ్మది నెమ్మదిగా నేర్చుకొనుచున్నాడు! కాని ఇక్కడనో, శిష్యులు, గురువులు, ఉపదేశములు, గ్రంథములు, భయము, దేవుడు, స్వర్గము సహితము ఏకమై పోవునట్టి రాగోన్మాదము! అనుభూతి పారవశ్యము!! ఆ స్థితిలో సమస్తమును విసర్జింప బడినది. మిగిలినది భక్తి ప్రమత్తత ఒక్కటియే! సర్వమును విస్మరింపబడిన ఆ కాలమున భక్తున కీ ప్రపంచమున శ్రీకృష్ణుడు తప్ప మఱేమియు కాన్పింపదు. ఎచ్చట చూచినను శ్రీకృష్ణుడే! ప్రతివాని ముఖమును శ్రీకృష్ణవదనారవిందమే! తన ముఖము సైతము శ్రీకృష్ణునిదే! తన ఆత్మయు శ్రీకృష్ణమయమే! శ్రీ కృష్ణభగవానుని మహత్త్వము అటువంటిది!

నలుసులను వెదకుచు మీ కాలమును వృథ చేసికొనకుడు. జీవనసారమగు ప్రధానధర్మమును చేపట్టుడు. చారిత్రక వ్యత్యాస ములు అనేకము లుండుగాక, శ్రీకృష్ణుని జీవితకథయందు అసం గతవిషయములు అనేకము చొప్పింపబడియుండవచ్చును. అయి నను వానికి మూలాధారము ఏదో ఒకటి ఉండితీఱవలయును! లేనిచో ఈ అత్యద్భుతమగు వినూత్నాదర్శ మెట్లు ఉత్పన్న మైనది? ఇతర మహాపురుషులయొక్కయు, ప్రవక్తలయొక్కయు జీవితములను పరిశీలించినచో, ఆ మహాపురుషులు తమ పూర్వము జరిగియున్న జ్ఞానప్రచారముయొక్క పరిణామఫలమే యనియు,

వారు చేయు ఉపదేశములుసైతము ఆ కాలమున దేశమందెల్లెడల వ్యాపించియున్న అజ్ఞాతభావములు తప్ప అన్యములు కావనియు మనకు స్పష్టపడును. "కర్మకొఱకే కర్మ; భక్తికొఱకే భక్తి, ధర్మముకొఱకే ధర్మము!" అనెడు నవీనాదర్శములు శ్రీకృష్ణుని వలన ప్రభవించినవి కావని ఎవ్వరును నిరూపింపలేరని నేను ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను! ఈ భావరత్నములు ఎవరో ఒకరివలన ప్రభవించినవే గదా! ఇంకెవరినుండియో సంగ్రహింపబడినవి కావు. శ్రీకృష్ణ జననకాలమునందు అవిలేవు. అవి వాతావరణ మున ఎగురుచుండి యుండనేరవుగదా! శ్రీకృష్ణభగవానుడే ప్రప్రథమముగా వానిని ఉపదేశించిన గురువు! వాని శిష్యుడగు వ్యాసమహర్షి ఆ ఉపదేశమును స్వీకరించి మానవుల కెల్లరకును ప్రచారము గావించి యున్నాడు. ఇది మీ అంతఃకరణములందు చిత్రించుకొనవలసిన పరమోత్కృష్టభావము! మనము హృదయ ములందు నిలుపుకొనదగిన అత్యుత్తమ ధ్యేయమూర్తి గోపీజన వల్లభుడు! అనగా బృందావన గోపికలకు ప్రియుడు! మీకు ఆ అనురాగపారవశ్యము కలిగినప్పుడు, ఆ గోపికలహృదయము నీకు అర్థమైనప్పుడు, 'ప్రేమ' యన నేమో మీరు గ్రహింప గలుగు దురు; లోకమంతయు అదృశ్యమై, తదితరాలోచనములన్నియు సమసిపోయి, మీ హృదయములు విశుద్ధములైనప్పుడు మాత్రమే

చివరకు ధర్మాన్వేషణముసైతము మిమ్ము విడిచిపోయినప్పుడు మాత్రమే ఆ ప్రేమపారవశ్యము, గోపికలకు లభించిన ఆ అఖండ ప్రేమమహత్త్వము మీకు అలవడును. అదియే అహేతుకప్రేమ "ప్రేమకొఱకగు ప్రేమ" యనగా, అదియే గమ్యములకెల్ల పరమ గమ్యము! అది మీకు దొరకినదా, సమస్తము లభించినట్లే!

అంతకంటె క్రిందికి దిగి, గీతోపదేశకర్తయగు కృష్ణుని కడకు వత్తము. అకటా! భారతదేశములో ఇప్పుడు, గుఱ్ఱమునకు ముందు బండినుంచుటవంటి వికటప్రయత్నమొకటి సాగుచున్నది!

గోపికాప్రియునిగ శ్రీకృష్ణుని భావనచేయుట ఏదో ఒక వికృత కార్యముగా మనవా రనేకులు భావించుచున్నారు. యూరపియను లకు అది కొంచె మసహ్యముగ నుండునట! డాక్టరు బిరుదు సంపాదించిన ఎవడో ఒక పిచ్చిపుల్లయ్యకు అది రోతగానుండునట! కాబట్టి గోపికల గోల విసర్జించివేయవలసినదే! పాపము, యూరపి యనుల ఆమోదము లేకుండ కృష్ణుడు జీవించు టెట్లు? వానికి బ్రతుకుతెలివు లేదు! మహాభారతమునందు ఒకటి రెండుచోట్ల తప్ప గోపికల ప్రస్తావనయే లేదు. ఆ సందర్భములును అంత ప్రధానమైనవి కావు. ద్రౌపదియొక్క ప్రార్థనయందు బృందావన లీలల ప్రస్తావన గలదు. శిశుపాలుని అధిక్షేపమునందును ఈ బృందావన ప్రస్తావన గలదు. కాని ఇవన్నియు ప్రక్షిప్తములట! యూరపియనులకు హితవుగాని దానిని దేనినైనను త్రోసివేయ వలసినదే! గోపికల ప్రస్తావన, గోపాలకృష్ణుని ప్రశంస సైతము ప్రక్షిప్తములై పోవుచున్నవి! ఆహా, వ్యాపారసంరంభమున మునిగి పోయిన ఈ మహానుభావులు మతధర్మమును సైతము వాణిజ్య మున కొక అంగముగా చేసికొనిన ఈ ఘనులు ఇహమున నేదియోచేసి దానిని పట్టుకొని స్వర్గమునకు ఎగబ్రాక చూచు చుందురే! కోమటి చక్రవృద్ధి అనగా వడ్డికివడ్డి రావలసినదే! ఇహమున నిలువచేసికొనినదానిని అతడు పరమున అనుభవించు టకు పన్నుగడ పన్నుచున్నాడు. ఆహా! అటువంటి భావక్షేత్ర మున పాపము గోపికలకు తావు లేకుండుట సత్యమే!

ఆ బృందావనగోపికాప్రియుని దివ్యరూపమును విడిచి మనము క్రిందికివచ్చి గీతాబోధకుడగు శ్రీకృష్ణుని క్షేత్రమును చేరుదము. వేదములకు గీతను మించిన శ్రేష్ఠతరవ్యాఖ్యానము ఇంతవరకు రచింపబడియుండలేదు, రచింపబడనుజాలదు. భాష్య కారులు అనేకులు కలరు. ప్రతివాడును తనమతమున కనుకూలించు మార్గమున అర్థమును కల్పనచేయుచువచ్చుటవలన శ్రుతుల

యొక్క, అనగా ఉపనిషత్తులయొక్క తత్త్వసారమును గ్రహించుట అత్యంత దుర్లభమై పోయినది. కావున అప్పుడు శ్రుతులను ప్రసాదించిన ఆ దేవదేవుడే, ఆ శ్రీహరియే, గీతోపదేశకుడుగా వాని అర్థమును మనకు బోధపఱచుటకు మరల అవతరించి వచ్చినాడు. వాని వ్యాఖ్యానపద్ధతిని మించి, ఏదియు భారతీయుల కీనాడు అక్కఱలేదు. ప్రపంచమునకుకూడ అంతకుమించి ఆవశ్యకమైనదేదియులేదు. అనంతరకాలమున మనశాస్త్రములకు అర్థము చెప్పబూనినవారు గీతకుసైతము వ్యాఖ్యానముచేయనెంచి, అనేక స్థలములయందు అర్థమును గ్రహింపలేక తికమకపడిరి. అనేక సందర్భములయందు భావసరణిని గుర్తింపజాలకపోయిరి. ఎట్లందురా? గీతయందు గోచరించునదేమి? ఈ నవీన భాష్యకర్తలయందు గోచరించునదేమి? ఒకానొక అద్వైతభాష్యకారుడు ఒక ఉపనిషత్తును తీసికొనును, అందు ద్వైతపరములగు వాక్యములనేకము లుండును. అతడు వానిని మెలిపెట్టి, నలిపి, ఏదో అర్థమును తీయును. అన్ని వాక్యములందును తనకు హితవగు అర్థమునే తీయుటకు బ్రహ్మప్రయత్నము చేయును. ద్వైతియగు భాష్యకారుడు వచ్చునెడల, వాని కన్నిటికిని ద్వైత పరముగా అర్థమును చెప్పుటకై అద్వైతభావముగల అనేకవాక్యములను నలిపి నలిపి హింసలపాలుచేయును. కాని గీతలోమాత్రము ఉపనిషద్వాక్యము నొక్కదానినైనను మెలిపెట్టి హింసించు ప్రయత్నము కానరాదు. ఆ వాక్యములన్నియు ఉత్తమములే. "నెమ్మదిగా, క్రమక్రమముగా, స్థూలమునుండి సూక్ష్మమునకు, సూక్ష్మమునుండి సూక్ష్మతరమునకు, మెట్టుతర్వాత మెట్టుగా, జీవాత్మ తన పరమగమ్యమగు అఖండబ్రహ్మమును చేరువఱకు పైపైకి ఎక్కిపోవుచుండును" అని శ్రీకృష్ణభగవానుడు పలుకుచున్నాడు. గీతలో తెలుపబడిన దిదియే. మఱియు, కర్మకాండసైతము గీతయందంగీకరింపబడినది, అది ప్రత్యక్షఫలముగా మోక్షము నీయజాలకున్నను, పరోక్షసాధనము కాగలదు, కావున అదియు యోగ్య

మైనదే అని తెలుపబడినది. విగ్రహములును పరోక్షముగ ఫల ప్రదములే. చిత్తశుద్ధియుండెనేని, క్రతువులు, ఆచారములు అన్నియు ఉపకారకములే. అర్చనలు యోగ్యమైనవే; గమ్యమును చేర్పగలవే; హృదయము పవిత్రముగా, నిష్కపటముగామాత్ర ముండవలయును. వివిధములగు పూజావిధానములు ఆవశ్యకములే. కావేని అవి పుట్టియుండవు. ఆధునికులలో కొందఱు భావించునట్లు, ఈ మతములును, సంప్రదాయములును ఏదో కొంత డబ్బు సంపా దించుకొను నిమిత్తమై కపటవర్తనులు, వంచకులు సృష్టించిన తంత్రజాలములుమాత్రముకావు. వారి వాదము ఎంత యుక్తి యుక్తముగ కాన్పించినను, అందు సత్యములేదు. ఇవి ఆ విధముగ కల్పనచేయబడినవి ఎంతమాత్రమును కావు. ఇవి నరుని ఆత్మ యొక్క అవసరములనుబట్టి కలిగినవే! భిన్నదశాంతరములందున్న నరుని కాంక్షలను, పిపాసలను తృప్తిపఱచుటకే ఇవి ఉద్భవమైనవి. వీనికి విరుద్ధముగా మీరు ప్రచారమును సాగింప నక్కఱలేదు. అవసరము తొలగిపోవునప్పుడు, దానితోపాటు ఇవికూడ తొలగి పోవును. కాని ఆ అవసరమున్నంతవఱకు, మీ రెంతగా ప్రచా రము సాగించినను, ఎంతగా విమర్శలు చేసినను, ఇవి నిలిచియుండ వలసినదే. మీరు ఖడ్గములతో తెగవేయుడు; ఫిరంగులు ప్రయో గింపుడు; ప్రపంచమునంతను నరరక్తముతో ముంచివేయుడు; కాని విగ్రహములు అవసరమగునంతవఱకు ఉండియే తీఱును. ఈ ప్రతిమలు, మతములోని ఈ అంతరువులు అన్నియు నిలిచియే యుండును. అవి అటుల నిలిచియుండవలసిన కారణము శ్రీకృష్ణ భగవానుడు తెలిపియే యున్నాడు.

భారతదేశ చరిత్రలో, కొంచెము విషాదకరమగు ప్రకరణ మున కిప్పుడు మనము రావలసియున్నది. వేర్వేఱు తెగల పోరా టముల అలజడి కొంతదూరమున గీతయందే మనకు వినవచ్చినది. వానికి సఖ్యతకూర్చుటకై సామరస్యము నుపదేశించు మహాగురు

వుగా, సౌహార్దమును ప్రచారముచేయు ప్రబోధకుడుగా, శ్రీ కృష్ణభగవానుడు నిలబడుచున్నాడు. "మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" (ఆయా తెగలన్నియు దారముపై నిముత్యములవలె నాలో కూర్పబడియున్నవి) అని ప్రకటించుచున్నాడు. అవిగో మరల దూరమునుండి ధ్వనులు, వివాదముల కలకలములు, వినవచ్చుచున్నవి. కొంతకాలము శాంతిసామరస్యము లుండెను కాబోలు! ఆ పిదప మతభేదములవలననేగాక కులభేదములవలనను వైరములు సాగుచున్నట్లున్నవి! మన సంఘములో రాజు లోక వైపున, బ్రాహ్మణు లోకవైపున యుద్ధసన్నద్ధులైనిలిచియున్నారు. చూచుచుండగనే వారికి పోరాటము సాగి క్షణములో విజృంభించినది. దాదాపు వేయి సంవత్సరముల కాలము భారతదేశమును ముంచివేసిన, ఒక ఉత్తుంగ సముద్రతరంగశిఖరమున దేదీప్యమానముగా వెలుగుచు ఇంకొక మూర్తి ప్రత్యక్షమగుచున్నాడు. ఆయన ఎవరోకాదు, మన గౌతమశాక్యమునియే! ఆయన బోధలును, ఉపదేశములును మీ రందఱు ఎఱిగినవే! ప్రపంచమున ఇంతవఱకు అవతరించిన ధర్మప్రచారకులలో అత్యుత్తముడును, అతిసాహసికుడును అగు ఈ కర్మయోగిని శ్రీహరి అవతారముగా మనము పూజించుచున్నాము. తనకు తానే శిష్యుడై అవతరించినట్లు ఆ శ్రీకృష్ణభగవానుడే తన సిద్ధాంతములను ఆచరణలో పెట్టుట ఎట్లో చూపుటకై మరల వచ్చినాడు! గీతలో ఇట్లు బోధించిన ఆ కంఠస్వరమే మరల వినవచ్చినది :

"స్వల్ప మప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్"

(ఈ ధర్మము ఎంత స్వల్పముగ నిర్వహించినను, అది గొప్ప భయమునుండి కాపాడును.)

"స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాంతి పరాం గతిమ్"

(స్త్రీలు వైశ్యులు శూద్రులు సయితము పరమపదమును పొందగలరు.)

అందటి బంధములను త్రెంచివేసి, ఎల్లర శృంఖలములను ఛేదించివేసి, సర్వజనులకును పరమపదమును చేరు స్వాతంత్ర్యము కలదని గీతావచనరూపమున ఇట్లు ప్రకటించిన శ్రీకృష్ణభగవానుని ఆ కంఠస్వరమే మేఘగంభీరధ్వనులతో దశదిశల మరల మారుమ్రోగినది.

"ఇహైవ తైర్జిత స్సర్గో
యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః."

(ఎవరి మనస్సు సమత్వమునందు సుస్థిరమైనదో, వారీ జన్మయందే సంసారమును జయించుచున్నారు; అనగా మోక్షమును బడయుచున్నారు. కారణమేమన, బ్రహ్మము నిష్కళంకమును సర్వసమమునై యున్నది. కావున వారు బ్రహ్మమునందే స్థిరపడుచున్నారు.)

"సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం।
న హి నస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్॥"

(ఎవడు ఈశ్వరుని సర్వత్ర సమభావమునందున్నట్లు చూచుచుండునో, అతడు ఆత్మను ఆత్మతో హింసింపడు, కావున పరమగతిని, అనగా మోక్షమును పొందుచున్నాడు.)

ఈ గీతాబోధకు సజీవనిదర్శనమును చూపుటకో యన, అందొక అంశమునైనను ఆచరించి చూపుటకోయన, ఆ ఉపదేశకుడే వేఱొక రూపమున మరల వచ్చియున్నాడు. దీనులను, పేదలను, దరిజేర్చి ధర్మోపదేశము చేసిన శాక్యముని అతడే! ప్రజల హృదయములను చూఱగొనుటకై, ఈయన దేవభాషను విడిచి

జనసామాన్యభాషలో బోధలు సలిపినాడు, బిచ్చగాండ్రతోడను, నిరుపేదలతోడను, దిక్కులేనివారితోడను, కలిసి జీవించుటకై తన సింహాసనమును త్యాగముచేసినాడు; పూర్వము శ్రీరామావతారమున చేసినట్లు ఇంకొకసారి పంచముని తన కౌగిట నిలుపుకొనినాడు!

ఆయన గావించిన ఘనకార్యములను, ఆయన ఉత్తమ శీలమును మీరందఱును ఎఱుగుదురు. కాని ఆ కార్యములందు ఒక గొప్ప లోపముకలదు. అందువలననే ఈ నాడు మనమిట్లు ఇడుమల గుడుచుచున్నాము. అందు బుద్ధభగవానుని దోషము లేదు. ఆయన పరమపవిత్రుడు! మహిమోన్నతుడు! కాని అప్పుడు ఆర్యసంఘములోనికి చొరబారివచ్చిన అనాగరికులును మూఢులును అగు ఆయాజాతులవారు అట్టి ఉత్తమాదర్శములను జీర్ణముచేసికొనజాలరైరి! నానావిధములగు మూఢవిశ్వాసములు గల్గి, తుచ్ఛదేవతారాధనలను చేయు ఈ జాతులవారు ఆర్య సంఘములోనికి రివ్వున చొరబారి వచ్చిరి. కొంత కాలమువఱకు వీరు నాగరికులవలెనే కాన్పించిరి. కాని ఒక శతాబ్దమైననుగడవక పూర్వమే, తమ పూర్వులు పూజించుచు వచ్చిన సర్పములు, భూతములు మున్నగు నితరవస్తువులను మతమున ప్రవేశపెట్టిరి. అందువలన భారతదేశమంతయు అధోగతిని పడి మూర్ఖజన సంకీర్ణమై పోయెను! బౌద్ధులు జంతువధలను జూచి ఆగ్రహము పూని వైదికయజ్ఞములను ఖండించిరి. ఈ యజ్ఞములు ప్రతియింటను జరిగెడివి. ఇంటింటను ప్రజ్వలితాగ్ని యుండెడిది. వారి పూజాకలాపమంతయు ఇంతే. అట్టి యజ్ఞములు రూపు మాసినవి. మహాశోభాయమానములగు దేవళములు, వైభవోపేతములగు కర్మలు, భోగపరాయణులగు అర్చకులు, మఱియు ఈ కాలమున భారతదేశమున గోచరించు సర్వాడంబరములు వాని బదులుగా వచ్చి చేరినవే! బుద్ధుడు వైదికసాంప్రదాయకములగు విగ్రహము

లను ధ్వంసము చేసినాడని ఇటీవల కొందఱు వ్రాసిన గ్రంథము లను చదువగా నాకు నవ్వువచ్చినది. బౌద్ధమతమే బ్రాహ్మణ సంప్రదాయమును విగ్రహారాధనమునుగూడ భారతదేశమున సృష్టిచేసినదని పాపము వారికి తెలియదు!

ఒకటి రెండు సంవత్సరములక్రిందట రష్యాదేశీయుడొకడు ఒక గ్రంథము వ్రాసియున్నాడు. ఆయన ఏసుక్రీస్తుయొక్క అతి విచిత్రమగు జీవితకథ నొకదానిని తాను కనిపెట్టినటుల ఆ పుస్తక మున తెలుపుకొన్నాడు. ఆ గ్రంథమునందొక భాగమున క్రీస్తు బ్రాహ్మణులయొద్ద జ్ఞానార్జనముచేయుటకై జగన్నాథాలయమునకు వెళ్లినట్లును, బ్రాహ్మణు లితరులయెడచూపు అసహనభావమును, వారి విగ్రహములనుచూచి అసహ్యించుకొని, టిబెట్టు దేశములోని 'లామా'ల కడకు పోయి సిద్ధిని సాధించి ఇంటికి మరలి పోయినట్లును ఆయన అందు వ్రాసెను. హిందూదేశచరిత్ర తెలి సిన యే బాలునికైనను ఈ విషయమంతయు వట్టి అబద్ధమేయని, ఆవ్రాతల వలననే తెలియును. ఏలయన, జగన్నాథములోని ఆలయము ప్రాచీన బౌద్ధాలయమేకదా! ఈ ఆలయమును ఇంక కొన్నిటిని మనము అనంతరకాలమున మరల హిందూదేవాలయ ములుగా మార్చితిమి. ఇట్టి కార్యములను మనమింకను చాల చేయవలయును. జగన్నాథములో ఆ కాలమున ఒక్క బ్రాహ్మణు డైనను లేడు! అయినప్పటికిని, అచ్చటి బ్రాహ్మణులయొద్ద చదువు కొనుటకు ఏసుక్రీస్తు వచ్చెనని చరిత్రపరిశోధకుడగు ఈ ఘనుడు చెప్పుచున్నాడు.

జీవకారుణ్యము నెంతబోధించినను, మహోదాత్తమగు నీతిధర్మములను ఎంత ప్రకటించినను, నాశములేని ఆత్మయొకటి కలదా లేదా యను సూక్ష్మ వివాదముల నెన్ని సాగించినను, బౌద్ధమతసౌధము ఈ తెఱగున నేలకూలి ముక్కలుముక్కలై పోయినది. ఆ జీర్ణావస్థ బహుబీభత్సరూపమైనది. బౌద్ధమత

నాశమునాటి బీభత్సదశను వర్ణించుటకు ఇప్పుడు వ్యవధి గాని అభిలాష గాని నాకు లేదు. కాని ఒక్కమాట. అతినీచములగు కర్మకలాపములు, అసహ్యములగు దురాచారములు ఎన్నో బౌద్ధమతముపేరిట వెలసినవి. కొన్ని బౌద్ధగ్రంథములలో కానవచ్చుచున్నంతటి బూతులు ఇంతవఱకు ఏ మానవబుద్ధియు ఊహించియుండదు, ఏ మానవహస్తమును వ్రాసియుండదు. అవి అంత దుర్భరముగా, ఘోరముగా నున్నవి. అవి భ్రష్టమైపోయిన బౌద్ధధర్మమున తలయెత్తిన సృష్టి.

అట్లయ్యును భారతదేశము బ్రతికియుండవలసినదగుటచేత, ఈశ్వరాంశ మఱొకసారి అవతరించి వచ్చెను. ధర్మము క్షీణించినప్పుడెల్ల అవతారము దాల్చివచ్చెదనని చాటిచెప్పిన భగవానుడు మరల వచ్చినాడు. ఈ పర్యాయము దక్షిణదేశమున అవతారము దాల్చినాడు. తన పదునారవయేటనే గ్రంథములన్నిటిని వ్రాసి ప్రసిద్ధిగాంచిన ఆ బ్రాహ్మణబాలుడు, బాలశంకరాచార్యులు ఉద్భవించినాడు! ఆ పదునారేండ్ల బాలుడు ఆనాడు వ్రాసిన గ్రంథములను ఈనాడు ప్రపంచమెల్ల, విస్మయచకితమై, అద్భుతావిష్టమై చూచుచున్నది! ఆ బాలుడు నిజముగా అట్టివాడే! అతడు భారతదేశమును తొల్లిటి నిర్మలస్వచ్ఛదశకు తీసికొని రావలెనని ప్రయత్నించినాడు. ఆయన పూనిన ఈ మహోద్యమము ఎంతటిదో మీరే ఊహించుకొనుడు. ఆయన అవతరించునాటికి భారతదేశము ఎట్టి కల్లోలపరిస్థితులలో నుండెనో కొంతవఱకు మీకిప్పుడు తెలిపియున్నాను. మీరిప్పుడు సంస్కరింప బూనిన ఘోరదోషములన్నియు ఆ పతనావస్థయొక్క ఫలితార్థములే! తార్తారులు, బెలూచీలు మొదలగు ఘోరజాతులు భారతదేశమునకు వచ్చి బౌద్ధులై పోయినారు, మనలో కలిసిపోయినారు. వారి జాతీయాచారములను మనలో నెమ్మదిగా చొప్పించినారు. అందువలన మన జాతీయజీవనమంతయు ఘోరబీభత్సదురాచారభూయిష్ఠమై

పోయినది. బౌద్ధులవలన ఆ బాలుడు సంపాదించుకొనిన పిత్రార్జితము ఇది! ఆ నాటినుండి ఈ నాటివఱకును భారతదేశమున జరుగుచున్న కృషియంతయు, వేదాంతధర్మసాహాయ్యమున బౌద్ధపతనావస్థనుండి దేశమును మరల పునరుద్ధరించుటే. అది ఇంకను జరుగుచునే యున్నది. శ్రీ శంకరులు మహాతత్త్వవేత్తయై అవతరించి, బౌద్ధ వేదాంతమతముల సత్యతత్త్వార్థములు అంతగా భిన్నములు కావనియు, శిష్యులు గురువుయొక్క బోధను అర్థము చేసికొనజాలక పతితులై పోయి, జీవుడు లేడని, దేవుడు లేడని వాదించుచు, నాస్తికులై పోయిరనియు రుజువుచేసి లోకమునకు చాటిచెప్పినారు. అప్పుడు బౌద్ధమతస్థులందఱును వెనుకటి మతములోనికి తిరిగి రా సాగిరి. కాని వా రప్పటికే ఈ దురాచారము లెన్నిటికో అలవాటుపడియుండిరి. చేయగల దేమున్నది?

అంతట తేజోవైభవమూర్తియగు శ్రీ రామానుజులవా రుద్భవించిరి. శంకరాచార్యులకు మహోజ్జ్వల బుద్ధివైభవముతో తులదూగు హృదయవైశాల్యము లేదని నా భావము. రామానుజాచార్యుల హృదయము మహోదారమైనది. పీడితులకై ఆయన హృదయము వేదన నొందెను. వారియెడ ఆయనకు సానుభూతి కలిగెను. అప్పటికి దేశాచారములలో కలిసిపోయి, ఎల్లెడల విజృంభించుచున్న కర్మకలాపములను ఆయన సాధ్యమైనంతవఱకు సంస్కరించి పవిత్రీభూతము కావించినాడు. ప్రజలకు అత్యావసరములగు క్రొత్త కర్మలను, పూజాకలాపములను ఏర్పఱచినాడు. ఇది కాక ఉత్తమాధ్యాత్మికపూజావకాశమును బ్రాహ్మణుడు మొదలు మాలవాని వఱకును ప్రతివానికిని కల్పించినాడు. ఇదియే శ్రీ రామానుజులవారు కావించిన మహాకార్యము. ఆ ఉద్యమము ఉత్తరముఖముగా పురోగమింపసాగినది. క్రమక్రమముగా ఉత్తర భారతమంతయు వ్యాపించినది. ఆ తరువాత, మహమ్మదీయ పరిపాలన కాలమున అచ్చటి మహానాయకులు కొందఱు దానిని

చేపట్టిరి. ఉత్తరదేశపు నవీనప్రవక్తలలో దీనిని చేపట్టిన మహనీయులలో మహోజ్జ్వలబుద్ధిసంపన్నుడు శ్రీ చైతన్యులవారు.

శ్రీ రామానుజులవారి కాలమునుండి ఒక విశేషము మీరు గుర్తింపవచ్చును. ప్రతివానికిని ఆధ్యాత్మికసాధనకు అవకాశము కల్పింపబడినది. శంకరాచార్యులవారికి ముందున్న ప్రవక్తలందఱును ఈ ధర్మమునే పాటించిరి. రామానుజులకు తర్వాత వచ్చిన ప్రవక్తలకును అయ్యదియే ధర్మసూత్రమై వెలసినది! శంకరాచార్యులవారు ఈ విషయమున అంగీకారములేనివా రను ప్రతీతికి హేతువేమో నేను గ్రహింపజాలకున్నాను. అట్టి ప్రాతికూల్యము వారి గ్రంథములలో ఎచ్చటను నాకు గోచరించుట లేదు. శంకరాచార్యులవారి బోధలయందు లోకమునకు ఇట్టి భావ ముండుటకు కారణము చాలవఱకు బుద్ధభగవానుని విషయము నందువలెనే వారి శిష్యులయొక్క అసమర్థత యనియే నా తలంపు. ఉత్తరభారతసిద్ధపురుషశేఖరులగు శ్రీ చైతన్యులవారు పురాణ కాలమునాడు గోపికలందు చూపట్టినట్టి ప్రేమోన్మాదమునకు మూర్తిభావమై వెలసిరి. ఆయన బ్రాహ్మణుడు; ఆ కాలమున తర్కమునకు ప్రసిద్ధిగాంచిన సద్వంశమునందు జన్మించినవాడు, తర్కశాస్త్రమునందు మహావిద్వాంసుడు, తర్కశాస్త్రబోధకుడు, జగద్విజయము సాధించిన తార్కికాగ్రగణ్యుడు, తర్కజ్ఞానమే జీవితమునకు పరమగమ్యమని బాల్యమునుండి నేర్చుకొనినాడు. అయినను ఒక మహాత్ముని కరుణవలన ఆయన జీవితమంతయు మాఱిపోయినది. వాగ్వాదములను, తర్కవిద్యాగురుపదవులను పరిత్యజించినాడు! లోకమున భక్తిప్రబోధము సలిపిన గురువులలో నెల్ల అగ్రగణ్యుడైనాడు! వెఱ్ఱిచైతన్యుడను పేరు వడసినాడు! వానిభక్తి వంగభూమియం దంతటను వ్యాపించి ప్రతివానికిని భవక్లేశోపశాంతి కలిగించెను. వాని ప్రేమకు హద్దులు లేవు. పుణ్యపురుషుడుగాని పాతకిగాని, హిందువుగాని మహమ్మదీయుడు

గాని, పవిత్రుడుగాని అపవిత్రుడుగాని, వీధి కెక్కిన వెలయాలు గాని, అందఱును వానికి ప్రేమపాత్రులే; అనుగ్రహపాత్రులే. కాలక్రమమున అన్నియు భ్రష్టమైపోయినట్లే వీని సంప్రదాయము సైతము చాలవఱకు ఈనాడు భ్రష్టమైపోయినప్పటికికూడ, పేద వారికి, పతితులకు, దుర్బలురకు, కులభ్రష్టులకు, సంఘబహిష్కృతు లకు ఎల్లరకును శరణము నొసగుచున్నది.

కాని సత్యముకొఱకు ఒక్కవిషయమును నేనిచట చెప్ప వలసియున్నది. వేదాంతమతావలంబులయందు అద్భుతమగు భావవైశాల్యము గోచరించును. శంకరాచార్యులవారిని బాగుగా అర్థము చేసికొనినవా డెవ్వడును భారతదేశములోని వివిధసంప్ర దాయములన్నియు నిజముగా విభిన్నములని చెప్పడు. అట్లయ్యును శంకరులు కులతారతమ్యములను పాటించుటయందు గట్టి పట్టుదల గలవాడై యుండెను. ఇక వైష్ణవ గురువులో, కులవిషయక సమస్యలందు మహౌదార్యమును, మతవిషయక సమస్యలందు అసహనభావమును ప్రదర్శించిరి.

వీరిలో ఒకరికి అద్భుతబుద్ధిబలము, రెండవవారికి అద్భుత హృదయవైశాల్యము కలదు. అట్టి బుద్ధిని, అట్టి హృదయమును కూడ కలిగిన ఒక మహానుభావుడు జన్మింపవలసిన కాలము ఏతెం చెను. ధగద్ధగితమగు శంకరుని బుద్ధివిశేషమును, అద్భుతమగు చైతన్యుని అఖండ విశాలహృదయమును, ఒకేశరీరములో కూర్చు కొని ఒకరు అవతరించుటకు కాలము పరిపక్వమయ్యెను. ప్రతి సంప్రదాయమును కల్పించినది ఒకేఆత్మ, ఒకేదైవము అని కను గొనగలిగినవాడు, ప్రతి జీవియందును భగవంతుని సాక్షాత్కరింప జేసికొనగలవాడు; పేదవారలకొఱకు, దుర్బలురకొఱకు, పీడితుల కొఱకు, సంఘభ్రష్టులకొఱకు ఒక్క భారతదేశములోనే కాదు, ప్రపంచమంతటను ప్రతివానికొఱకును ఆరాటపడి సానుభూతితో తపించిపోవు హృదయముగలవాడు; ఒక్క భారతదేశమందే

గాక, ప్రపంచమంతటను, నిరంతరము ఒకదానితో ఒకటి పోరాడుకొనుచున్న అన్ని మతసంప్రదాయములకును అద్భుత సామరస్యముగూర్చు మహోత్కృష్ట భావములను సంకల్పింపగల మహోజ్జ్వల బుద్ధివైభవము గలవాడు, బుద్ధి హృదయసమ్మేళన ముగల సార్వలౌకిక మతమును కల్పించు శక్తిగలవాడు అవతరించు తరుణమేతెంచెను. అట్టి పురుషోత్తము డొక్కడు ఈ లోకమున నవతరించెను. అట్టివాని పాదారవిందములచెంత సంవత్సరముల తరబడి కూర్చుండు మహాభాగ్యము నాకబ్బినది. కాలము పరిపక్వమై, అట్టి మహాపురుషు డవతరింపవలసి వచ్చినది. కావున ఆయన అవతరించినాడు. ఇందొక విశేషము కలదు. పాశ్చాత్యుల అభిప్రాయములతో, పాశ్చాత్యభావములతో, నిండి క్రిక్కిరిసిపోయిన ఒక మహానగరముదాపున ఆయన అవతరించెను. భారతదేశమునందలి ఇతరనగరములన్నింటిని మించి కరుడుకట్టిన యూరపియను సంప్రదాయములతో మదించిపోయిన ఆమహానగర ప్రాంతముననే, ఆయన జీవితకార్యము జరిగినది. పుస్తకజ్ఞాన మనునది ఎఱుగక, అచ్చోటున ఆయన నివసించినాడు. ఈ మహామేధావికి తన పేరును వ్రాయుటకూడ చేతకాదు. ఐనను మన విశ్వవిద్యాలయములనుండి వెలువడు అద్భుతధీమంతులగు పట్టభద్రులుసైతము ఆయనను మహామనీషాగ్రగణ్యునిగా తలదాల్చిరి! ఈ శ్రీరామకృష్ణపరమహంస అద్భుతచరిత్రుడు. ఆయననుగూర్చి చెప్పుటకు చాలకాలము పట్టును. అంత అవకాశము నాకిపుడు లేదు. హైందవమహాపురుషులలో సిద్ధమూర్తియై ఆధునికయుగ ప్రవక్తయై వెలసిన ఆ శ్రీరామకృష్ణుని నామమునుమాత్రము ఇప్పుడు సంస్మరింతును. ఆయన ప్రబోధము ప్రస్తుతకాలమున ఎంతయేని శ్రేయస్కరము. ఆ మహాపురుషునిలో దాగియున్న దివ్యశక్తిని గుర్తింపుడు. ఒక పేద పురోహితుని కుమారుడు, ఏదో ఒక మారుమూలపల్లెలో పుట్టినవాడు; ఊరుపేరు లేని ఈ వ్యక్తి ఈ నాడు యూరపునందును, అమెరికాయందును, వేల

కొలది జనముచేత యథార్థముగ పూజింప బడుచున్నాడు! రేపింకను లక్షలాదిగా ఆయనను పూజింతురు! భగవత్సంకల్పము ఎట్టిదో ఎవరికి ఎఱుక?

సోదరులారా, ఇప్పుడు ఈశ్వరసంకల్పప్రచారరీతిని మీరు చూడజాలకున్నచో, మీరు గ్రుడ్డివారే, జన్మాంధులే! ఇంకొక అవకాశము దొరకునేని, ఈ మహాపురుషుని గుఱించిన వివరములను పూర్తిగా తెలుపుదును. నేనిప్పుడు ఏ సత్యవచనమునైనను మీకు బోధించియుండినయెడల, అది ఆయనది, ఆయనదే యనియు; సత్యముకాని, సత్క్రమముకాని, లోకోపకారకముకాని ఏ విషయము చెప్పియున్నను, అది నాదే యనియు, దానిబాధ్యత యంతయు నాపైననే గలదనియు మాత్రము ఇప్పుడు మనవి చేయుచున్నాను.



## మన ప్రస్తుతకర్తవ్యము

(చెన్నపురి, తిరువల్లిక్కేణి సారస్వత సంఘమున నొసగిన ఉపన్యాసము.)

ప్రపంచము సాగిపోవుచున్నకొలది, జీవనసమస్య ప్రతిదినము అతిగంభీరమును, విశాలమును అగుచున్నది. వేదాంత ధర్మము మొదట దర్శింపబడినప్పుడే ఆ ప్రాచీనకాలమునందే జీవమంతయు అభిన్నమనెడు మహాసత్యము ప్రబోధింపబడి యున్నది. ప్రపంచమునంతను తనతో లాగికొని పోకుండ, విశ్వములో ఒక్కఅణువైనను కదలజాలదు. ప్రపంచమంతయు వెన్నంటి రాకుండ ఏదియు పురోగమనము సాగింపజాలదు. సంకుచితదృష్టితో — అది జాతీయము కానిండు, సాంఘికము

కానిండు ఏ సమస్యయు పరిష్కారము కాజాలదని అనుదినము మనకు విశదమగుచునే యున్నది. ప్రతిసంకల్పము ప్రపంచమంతటను వ్యాపించునంతగా విశాలము కావలయును, ప్రతిఉద్యమము, మానవజాతినంతను జీవకోటినంతనుకూడ తనలో ఇముడ్చుకొనజాలునంతదనుక క్రమాధికవికాసము పొందవలయును. మన దేశము ప్రాచీనకాలమునందువలె కొలదిశతాబ్దములనుండి పురోగమింపకుండుటకు కారణము ఇందువలన విశదమగుచున్నది. మన మిట్లు భ్రష్టులమగుటకు గల కారణములలో నొకటి, మన దృక్పథము సంకుచితమగుటచే మన కార్యములయొక్క ఫల వ్యాప్తి పరిమితమగుట!

ఒకే మహాజాతినుండి రెండు విచిత్రములగు ఉపజాతులు ఉద్భవించినవి. అవి వేర్వేఱుపరిస్థితులలో, వేర్వేఱువాతావరణములలో పడిపోయి, దేని కది తన ప్రత్యేకమార్గమున జీవిత సమస్యలను పరిష్కరించుటకు పూనుకొనినది. ప్రాచీన హిందూ జాతియు, ప్రాచీన గ్రీకుజాతియు ఈ ఉపజాతులు. హైందవార్యుడు, ఉత్తరమున తుషారకిరీటములతో నొప్పారు హిమాలయ పర్వతములు, చుట్టును ప్రావాహికసముద్రములబోలు మధుర జలపూరితములగు నదులు, ఎటుచూచినను దిగంతములవఱకు వ్యాపించినట్లున్న సాంద్రారణ్యములు తనకు అడ్డునిలువ దన దృష్టిని అంతర్ముఖము చేసినాడు. నిశితమేధాశాలియగు ఈతడు, తన్ను ఆవరించిన మనోహరప్రకృతిదృశ్యముల ప్రేరణవలన ఆంతర దృష్టి గలవాడగుట స్వభావసిద్ధమే. ఈ విధముగా నిజమనఃపరిశోధనమే హైందవార్యునకు స్వాభావికమై పోయినది. ఇక గ్రీకు ఆర్యుడన్ననో, సుందరములగు గ్రీకు ద్వీపరాశినడుమ ప్రవేశించినాడు. అతడాక్రమించిన భూభాగములో గాంభీర్యమునకు మించిన సౌందర్యము కలదు. వానిచుట్టునున్న ప్రకృతి నిరాడంబర సుందరమై నేత్రపర్వముగా నుండెను. కావున వానిమనస్సు

సహజముగ బహిర్ముఖమై, బాహ్యప్రపంచపరిశీలనను పూను కొనినది. తత్ఫలితముగ హిందూదేశమునందు విశ్లేషణ శాస్త్రములు అన్నియు, గ్రీసుదేశమునందు సమ్యక్కరణశాస్త్రము లన్నియు ఉద్భవమైనవి. హిందువుని బుద్ధి తన విశిష్టమార్గమున నడచి, మహాద్భుతఫలమును సాధించినది. ప్రస్తుతకాలమందు సైతము హైందవుని తార్కికశక్తియు, మేధాశక్తియు సాటిలేనివి. ఏ ఇతరదేశబాలురకును మనబాలురు తీసిపోరు. వారితో పోటీ పడినప్పుడెల్ల మనవారే విజయము గాంచుచున్నారు. ప్రాయశః భారతదేశమును మహమ్మదీయులు జయించుటకు ఒకటి రెండు శతాబ్దముల పూర్వమే మనజాతియొక్క శౌర్యము నష్టపడిపోయి యుండును. తత్ఫలముగా మనజాతియొక్క విశిష్టత హద్దులు మీఱ పెరిగి పతితహేతువయినది. ఆ పతనము భారతదేశమున నన్నిటియందును చిత్రకళలందును, గానకళయందును, శాస్త్రము లందును, ఇట్లు అన్నిటియందును గోచరించుచు వచ్చినది. చిత్రకళయందు విశాలమగు భావసంపద పోయినది, అంగసౌష్ఠవము అడుగంటినది; రూపకల్పనమున గాంభీర్యము తొలగినది, కేవలాలంకారదృష్టితో కూడిన జిలుగుకూర్పులు బయలుదేఱినవి, జాతియొక్క స్వతంత్రకల్పనాశక్తి విధ్వంసమైపోయినట్లుండెను. గానమునందు ప్రాచీనసంస్కృతగానకళాలక్షణమగు ఆత్మోద్ధారక భావసంపద పోయినది. ప్రతి స్వరమును సుస్పష్టముగా స్వతం త్రమై నిలిచి అద్భుత సమరసభావమును కల్పనచేయుట అరు దైనది. ప్రతి స్వరమును, తన విశిష్టసౌందర్యమును కోల్పోయినది. ఆధునిక గానమంతయు అర్థవిహీనమగు స్వరసమ్మేళనము; గందర గోళమగు శబ్దవిన్యాసరాశి! గానకళయందలి భ్రష్టత్వమునకు ఇది యొక చిహ్నము. మీ ఆదర్శములందును స్వతంత్రభావసంపద అడుగంటి, ఆలంకారికతయే ఎక్కువగా కాన్పించును. మన అభిమానక్షేత్రమగు మతమునందుసైతము మహాభయంకరమగు పతనమే సంభవించినది. మనము నీరుత్రాగునప్పుడు, చెంబును

కుడిచేతితో పట్టుకొనవలయునా, ఎడమచేతితో పట్టుకొనవలయునా అను నిట్టి ప్రధానసమస్యలనుగూర్చి తర్కించుచు వందలకొలది సంవత్సరములు తమశక్తిని, బుద్ధిని, కాలమును బూడిదపోయుచున్న ఈ చచ్చుజాతి ఇంతకంటె ఏమిచేయగలదని మీరాశింపగలరు? నేను మిమ్ము తాకవచ్చునా, మీరు నన్ను తాకవచ్చునా? అటుల తాకినయెడల చేసికొనవలసిన ప్రాయశ్చిత్తమేమి? ఇట్టి వాదములతోడను, వంటయింటి విషయములనుగూర్చిన చర్చల తోడను, దేశమునందలి మహామేధాసంపన్నులు శతాబ్దముల కొలది కాలమును దుర్వ్యయము చేయుటకంటె మించిన భ్రష్టత్వము ఇంకేమి ఉండగలదు? జీవేశ్వరసంబంధమును గుఱించి ఎన్నడేని లోకమున ప్రచారము గాంచిన సిద్ధాంతములలోనెల్ల ఉత్తమోత్తమములు, సూక్ష్మాతిసూక్ష్మములు, మహామహిమాఢ్యములు అగు మహాసిద్ధాంతములకు నిధి యనదగు వేదాంతము అడవులపాలై సగము నష్టమైనది; కొలదిమంది సన్న్యాసులు అందు కొంత కాపాడిరి. ఈ మహాజాతిలోని తక్కినవారందఱు ఒకరినొకరు తాకుట, అన్నవస్త్రముల తీరు మున్నగు మహాసమస్యలనుగూర్చి నిర్విరామముగా తర్కించుచుండిరి. మహమ్మదీయ సామ్రాజ్యము మనకు చాల ఉపకారములను సమకూర్చినమాట సత్యమే. ప్రపంచములో అత్యంత నీచమానవుడుసైతము అత్యుత్తమపురుషవరేణ్యుని కైనను ఎప్పుడో ఒకసారి, ఏదియో కొంత తాను నేర్పగలిగియే యుండును. కాని అంతమాత్రముచేత జాతికి సత్త్వము చేకూరదు. మహమ్మదీయ సామ్రాజ్యకాలమునకు పిమ్మట మేలునకో కీడునకో, ఆంగ్లేయుల భారతదేశాక్రమణము జరిగినది. ఏ ఆక్రమణమైనను అనర్థమే. ఏలయన ఒకరివశమైపోవుటయే అనర్థముగదా! విదేశీయుల పరిపాలన అనర్థమనుటకు సంశయములేదు. కాని అనర్థమునుండి కూడ ఒక్కొకప్పుడు మేలు చేకూరుచుండును. ఇంగ్లీషువారి విజయమువలన గొప్ప మేలే చేకూరినది. ఇంగ్లాండేకాక యూరపు

ఖండమంతయు అసలు గ్రీసు నాగరికతకు ఋణపడి యున్నది. యూరపునాగరికతయందును, సంస్కృతియందును గ్రీసుదేశ ప్రభావము ప్రకటితమగుచుండును. అచ్చటి ప్రతిభవనమును, ప్రతివస్తువును గ్రీసుసంప్రదాయముద్రను ధరించియే యుండును. యూరపియను శాస్త్రములును, కళలును గ్రీసుసాంప్రదాయకములే గాని వేఱుగాదు. నేడు ప్రాచీనగ్రీసుదేశీయుడు భారతభూమి యందు ప్రాచీనహిందువును కలిసికొనవచ్చినాడు. ఈ విధముగా విజాతిప్రభావము నెమ్మదిగను నిశ్శబ్దముగను మనలో చొరబడినది. ఇప్పటి మన విశాలదృక్పథమునకు, మన పునరుద్ధరణోద్యమములకు పైవాని సమష్టిబలమే కారణము. జీవితమును గుఱించిన ఉదార విశాలభావములెన్నో మన యెదుట నిలిచినవి. మొట్టమొదట మనము కొంత దిగ్భ్రాంతిపొంది, సంకుచితమార్గము పట్టజూచినను, క్రమక్రమముగా కొంతకాలమునకు ఈ ఉదారప్రేరణలు, ఈ విశాలజీవితోద్దేశ్యములు, మన ప్రాచీనగ్రంథములందే కలవనియు, అవియన్నియు హైందవమతానుసారముగా నున్నవే యనియు గ్రహించి సరియైనత్రోవకు వచ్చితిమి. మన పూర్వుల ప్రధానోద్దేశ్యములనుగూర్చిన గాఢవిమర్శఫలితమును ఆచరణలోనికి తెచ్చుటయే ఇప్పుడు జరుగుచున్నపని! విశాలభావముల వహించుట, బహిరంగప్రాంతములందు ప్రవేశించుట, ఇతరులతో సమ్మేళనమగుట, సర్వజనసమ్మతముగా వర్తించుట మనకు గమ్యార్థములు. ఇంతవఱకును మనము రానురాను సంకుచితహృదయులమై, అన్యుల సహవాసమునకు దూరులమై, మన శాస్త్రములలో చెప్పబడిన విధానములకు భిన్నముగా ప్రవర్తించుచు వచ్చితిమి.

మన మార్గమున అపాయములు చాల గలవు. ప్రపంచములోనికెల్ల మనమే మానవులమని తలంచు అత్యంతమూఢభావము అం దొకటి. భారతదేశమునెడ నా కెంత ప్రేమయున్నను, నే నెంతటి దేశాభిమానినైనను, మన పూర్వులయెడ నా కెంతటి

పూజ్యభావమున్నను కూడ, ఇతరజాతులవారివలన మనము అనేక విషయములను నేర్చుకొనవలసియున్నామని నేను చెప్పక తప్పదు. మనము అందఱి పాదముల చెంతను కూర్చుండుటకు సంసిద్ధముగా నుండవలయును. ఏలయన, ప్రతివాడును మనకు గొప్ప పాఠము లను నేర్పగలిగియే యున్నాడు. "కడజాతివానివలననైనను నీచపు పుట్టుపుగలవానివలననైనను సుజ్ఞానమును స్వీకరింపుము వానికి శుశ్రూషచేసి పరమార్థమును గ్రహింపుము" అని మన స్మృతికర్తయగు మనువు తెలుపుచున్నాడు. మనము నిజముగా మనువుయొక్క యోగ్యసంతానమగుదుమేని, వాని ఆజ్ఞల ననుసరించి నడవవలయును. ఐహికధర్మములనుగాని, పారమార్థిక ధర్మములనుగాని, మనకు బోధచేయగల ఎవరినుండియైనను సరే, నేర్చుకొనుటకు సంసిద్ధముగా నుండవలయును. అట్లయ్యును మనముగూడ ప్రపంచమునకు ఒక మహాధర్మమును బోధింపవలసి యున్నామనుటను మఱవరాదు. బయటి ప్రపంచముతో సంబంధము లేకుండ మనకు జరుగదు. అటుల జరుగగలదని ఇన్నాళ్లును మూఢులమై తలచియుంటిమి. అందుకు ప్రాయశ్చిత్తముగా వేయేండ్లు బానిసతనమును అనుభవించితిమి. | మనము వెలుపలికి పోయి మన అనుభవములను ఇతరుల అనుభవములతో పోల్చి చూచుకొనకుండుటయు, మనచుట్టును ఏమి జరుగుచున్నదో గుర్తింపకుండుటయు, మనబుద్ధి భ్రష్టమైపోవుటకు గొప్పకారణము! అందుకు శిక్ష ననుభవించితిమి. ఇంక నెన్నడును అటుల చేయమని చెంపలువేసికొందము. భారతీయులు దేశమునుదాటిపోగూడదను నిట్టి మూఢవిశ్వాసములు అజ్ఞానబాలలక్షణములు! నెత్తిమీద మొట్టి అట్టివానిని తొలగింపవలయును. మీరు ఎంతెంతగా దేశమును దాటిపోయి ప్రపంచమందలి ఇతరజాతులమధ్య సంచారము చేయుదురో, అంతంతగా మీకును మీ దేశమునకును క్షేమము కలుగును. ఈ విధముగా కొన్నిశతాబ్దములకుపూర్వమే మీరు చేసియుండినయెడల, మీపై రాజ్యముచేయవలయునని

ఉబలాటపడు ప్రతిజాతికిని అడుగులకు మడుగులొత్తు దుర్గతి మీకు తప్పియుండెడిదే! చైతన్యముయొక్క ప్రధానచిహ్నము వికాసము. మీరు సజీవులై యుండదలచితిరేని వికాసమును పొందవలయును. వికాసముపొందుట మానిన మరుక్షణముననే మృత్యువు మిమ్ము కబళించివేయును. మీరు ప్రేమతో ప్రస్తావించినట్లు, నేను అమెరికాకును యూరపునకును వెళ్లితిని, జాతీయజీవన పునరుద్ధరణమునకును వికాసమునకును అదియే మొదటి చిహ్నమగుటచేత, నేను వెళ్లవలసివచ్చెను. ఈ జాతీయజీవనపునర్వికాసమును, ఆంతరంగికవిలసనమును, నన్ను విదేశములకు నెట్టుకొనిపోయినవి. ఇంకను ఇదేవిధముగ వేలకొలది మందిని నెట్టుకొనిపోవును ఈ జాతి సజీవమై నిలుచుటకు అట్లు జరుగవలసినదే! ఈ నూతనచైతన్యము జాతీయజీవనపునరుద్ధరణచిహ్నములలో అతి ప్రధానమైనది. ఈ నూతనచైతన్యవికాసమువలననే మానవజాతి సమష్టిజ్ఞానరాశికి మనవంతుగా నొసగవలసియున్న భాగము, సామాన్యప్రపంచోద్ధారణకు మన మర్పింపవలసియున్న కానుక చెల్లింపబడుచున్నవి. ఇదొక క్రొత్తసంఘటనముకాదు. యుగయుగాంతరములనుండి భారతీయులు కూపస్థమండూకములవలె ఈ దేశపు నాలుగుహద్దులలోపలనే సదా ముడుచుకొని కూర్చుండి యుండిరని మీలో ఎవరైనను తలతురేని, అది చాల పొరపాటు. అటుల మీరు తలచినయెడల, మీ ప్రాచీనగ్రంథములను మీరు చదువలేదన్నమాట. ఈ జాతిచరిత్రమును మీరు సరిగా పరిశీలింపలేదన్నమాట. ఏ జాతియైనను సజీవమై యుండవలెనన్నచో, తనకు కలదాని నితరులకిచ్చి తీరవలయును. నీవు ప్రాణదానము చేసినప్పుడే, నీ ప్రాణము నిలుచును. నీవు కైకొంటివా, దానికి బదులుగా ఇతరులకు ఇచ్చి తీఱవలయును. తప్పదు. ఇన్నివేల సంవత్సరములనుండి మనము ఎటుల సజీవులమై యుండగల్గితి మనగా— తెలియనివారు ఎటుల అభిప్రాయపడినను మనము ప్రపంచమునకు ఎప్పుడును ఇచ్చుచుంటిమి గనుకనే.

భారతదేశము చేయునది మతదానము! తత్త్వశాస్త్ర దానము! జ్ఞానదానము! పారమార్థికదానము! యుద్ధభటులు తనకు ముందు నడచి, తన మార్గమును నిరాటంకము చేయవలసిన యావశ్యకత మతమునకు లేదు. జ్ఞానము, వేదాంతము, రక్త ప్రవాహములపైని తేలుచు పోవు నగత్యము లేదు. జ్ఞానము, వేదాంతము నెత్తురోడ్చుచున్న నరశరీరములపై అయఃపాదములతో నడచునవికావు. దౌర్జన్యముతో అవి గమనమును సాగింపవు. అవి శాంతి ప్రేమలనెడు ఱెక్కలపై మెల్లగా, చల్లగా, తేలియాడుచు వచ్చును. ఎల్లప్పుడును అటులనే జరుగుచు వచ్చినది. కాబట్టి మనము మరల ఈయవలసియున్నాము. "హిందువులగు మీరు చేసినదేమున్నది? ఒక్క జాతినైనను ఎన్నడుగాని జయించినది లేదే!" అని లండను నగరమున ఒక తరుణీమణి నన్నడిగినది. శూరుడును, వీరుడును, క్షత్రియుడును అగు ఆంగ్లేయుని దృక్పథము నుండి చూచినయెడల ఆ మాట నిజమే ఒక నరుడు ఇంకొకని మీద సాధించిన విజయము మహాఘనకార్యమే. వాని దృష్టికి అది సత్యమే! కాని మన దృష్టికి అది అందుకు వ్యతిరేకమై కాన్పించును. హిందూదేశపు గొప్పతనమునకు కారణమేమి అని, నాలో నేను ప్రశ్నించుకొనినప్పుడు, మన మెన్నడును ఇతరులపై బడి జయింపకుండుటయే అని నాకు సమాధానము తోచును. అదియే మనఘనత! మన మతము ఇతర మతములను ఎన్నడును లోబఱచుకొనలేదని 'వివేకవంతులు' సైతము మన మతమును నిరసించుచుండుట మీరు అనుదినమును వినుచుందురు. కాని ఇతరమతములకంటె మనమతమే శ్రేష్ఠతరమైనదనుటకు ఇదే కారణమని నా మనస్సునకు తోచుచున్నది. మన మతము ఇతర మతములను జయింపగోరదు; అది రక్తపాతము గావింపదు, అందఱకు దీవనలను, శాంతిని, ప్రేమను, సానుభూతిని తెలుపు వాక్కులే దాని ముఖమునుండి సదా వెలువడుచుండును! ఇచ్చట —ఇచ్చట మాత్రమే అద్భుతపరసహనాదర్శము ప్రప్రథమ

మన బోధింపబడినది! ఇక్కడ ఇక్కడ మాత్రమే సహనము, సానుభూతి అను మహాధర్మములు ఆచరణలో పెట్టబడినవి. ఇతర దేశములలో అవి సిద్ధాంతరూపమున మాత్రమే నిలిచిపోయినవి. ఈ దేశముననే, ఈ ఒక్క దేశముననే, హిందువులు మహమ్మదీయులకొఱకు మసీదులను, క్రైస్తవులకొఱకు ఛర్చీలను నిర్మించి యిచ్చినారు! కావున మన సందేశము అనేక పర్యాయములు ప్రపంచమునకు ప్రకటితమై యున్నదని మీరు కనుగొనగలరు. కాని ఈ ప్రకటనము నెమ్మదిగను, నిశ్శబ్దముగను, నిరాడంబరముగను జరిగినది. మన స్వభావమునకు, యోగ్యతకు తగినట్లే ఈ ధర్మప్రచారముకూడ సాగినది. మన ప్రత్యేకలక్షణము శాంతము, మౌనము. వాని వెనుక మహాద్భుతశక్తి కలదు గాని, అది దౌర్జన్యరూపము తాల్పదు. అది సర్వత్ర, భారతీయ సంకల్పముయొక్క వశీకరణశక్తిరూపమున నిశ్శబ్దముగా వ్యాపించును. విదేశీయుడు మన వాఙ్మయమును చదువబూనినయెడల, మొట్టమొదట అతనికి వెగటు కలుగును. వానిని తత్క్షణమే ఉఱ్ఱూతలూచి ఉద్రేకమును కల్పించి నెట్టుకొనిపోవు లక్షణములు మన వాఙ్మయమున కాన్పింపవు. యూరపియనుల దుఃఖాంతనాటకములను మన దుఃఖాంతనాటకములతో పోల్చిచూడుడు. వారివి అతిప్రవృత్తిపూరితములై క్షణకాలములో ఉద్రేకము కలిగించును. కాని ఆ ఉద్రేకము అణగిపోవగనే ప్రతిక్రియ ప్రారంభమగును, మీ మనస్సులనుండి అంతయు అదృశ్యమగును, కడిగివేసినట్లగును. భారతీయుల దుఃఖాంతనాటకములు వశీకరణమాంత్రికుని ప్రభావమువలె నిశ్చలముగను, నిశ్శబ్దముగను నిగూఢముగను పనిచేయును. అవి చదివినకొలది మిమ్ము సమ్మోహితుల నొనర్చును. మీరు కదలలేరు, బందీకృతులై పోవుదురు! మన వాఙ్మయమును తాకుటకు సాహసించిన వాడెల్ల దానికి వశమై పోవును, సదా బందీకృతుడై పడియుండును!

కంటికి కానరాక చెవులకు వినరాక, మెలమెల్లగా రాలుచు, అత్యంతసుందరములగు లేగులాబీలను పుష్పింపజేయు కోమల నీహారవర్షమువలె ప్రపంచవిజ్ఞానమునకు భారతదేశము ఒసగిన ఈవి నిరాడంబరముగా పనిచేయును; నిశ్శబ్దముగా, ఎవ్వరికి తెలియరాకుండ—కాని సర్వసమర్థముగా—లోకవిజ్ఞానము నంతెను పరివర్తనము చేసినది. అది ఎప్పుడు అటుల చేసెనో ఎవ్వరికిని తెలియదు. "భారతదేశములో గ్రంథకర్తల పేళ్లను తెలిసి కొనుట చాల కష్టము" అని ఒకరు నాతో పలికిరి. "అదియే భారతీయుని ఉద్దేశ్యము!" అని నే నంటిని. ప్రాచీనభారతీయ గ్రంథకర్తలు ఆధునికులవలె, తాము ప్రకటించువిషయములలో నూటికి తొంబదివంతున ఇతరగ్రంథకర్తలనుండి దొంగిలించుచు, పైగా సిగ్గులేక 'ఈ భావములన్నియు నావే' అని ఉపోద్ఘాతములు వ్రాసికొనుచుండువారు కారు. ఆ మహామేధాసంపన్నులు మానవ జాతి హృదయములలో అద్భుత పరివర్తనము కల్పించు గ్రంథము లను వ్రాసి, తమ పేరునైనను అందు ఉదాహరింపక, తమ పుస్తక ములను మాత్రము భవిష్యత్సంతానమునకు సంక్రమింపజేసి నిరా డంబరముగా మరణించుటతో తృప్తిపడిరి. మన తత్త్వశాస్త్రము లను రచించిన గ్రంథకర్తలెవ్వరో ఎవరెఱుగుదురు? మన పురాణ ముల వ్రాసిన వారెవ్వరో ఎవరికి ఎఱుక? వారందఱును వ్యాసు డనియో, కపిలుడనియో, ఏదో యొక సామాన్య నామముతో వ్యవహరించుకొనిరి! వారలు సత్యముగా శ్రీకృష్ణుని బిడ్డలు! వారు నిజముగా గీతానుష్ఠానపరులు! "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన!" (కర్మ చేయుటకే నీకు అధికారము కలదు గాని, దాని ఫలమునకు నీకు అధికారములేదు) అను సూత్ర మును అనుసరించి వారు వర్తించిరి!

ఈ విధముగా, భారతదేశప్రభావము ప్రపంచముపై పని చేయుచున్నది. కాని దాని కొక సదుపాయము అవసరము.

వర్తకపుసంబారములవలెనే, భావములును ఎవరో ఒకరు సిద్ధము చేసిన మార్గములవెంట మాత్రమే వ్యాపింపగలవు. ఒకచోటి నుండి మఱొకచోటికి ప్రయాణము చేయవలెనన్నచో భావములకు కూడ మార్గములు సిద్ధమై యుండవలయును. ప్రపంచచరిత్రలో ఒక మహాజాతి విజృంభించి, దిగ్విజయముగాంచి, ప్రపంచమందలి వివిధప్రాంతములను ఒక్కచో జతగూర్చినప్పుడెల్ల, ఆ మార్గముల వెంట భారతీయతత్త్వవిద్య ప్రవహించి, ప్రతిజాతియొక్క రక్త నాళములలోనికి చొరబాఱుచు వచ్చినది. బౌద్ధమతము అవత రించుటకు పూర్వమే భారతతత్త్వవిద్య విశ్వవ్యాప్తమగుచుండి నట్లు అనేక నిదర్శనములు చూపట్టుచున్నవి. బౌద్ధమతవ్యాప్తికి పూర్వమే చీనాలోనికిని, పర్షియాలోనికిని, తూర్పుసముద్రమునందలి ద్వీపగణములోనికిని వేదాంతము వ్యాపించినది. గ్రీకుల ధీశక్తి ప్రాక్ప్రపంచమునంతను ఒకటిగా సమ్మేళనము గావించినప్పుడు, భారతీయవేదాంతముకూడ వ్యాపించినది. తమ నాగరికతను గూర్చి క్రైస్తవులు ఎంతగా డంబములు కొట్టుకొన్నను, వారి మతము భారతీయతత్త్వశాస్త్రములోని స్వల్పాంశముల సము దాయము మాత్రమే! బౌద్ధమతము మిక్కిలి మహనీయమైనదే గాని, అది మన మతమున నుద్భవించి, దాని కెదురుతిరిగి విడివడిన బిడ్డయే! క్రైస్తవమతము మన మతము ననుకరించునట్టి ఒక అతుకులబొంత! ఈ చక్రగతి మరల ప్రారంభమైనది. ప్రపంచము నందలి ఆయా భాగములను సమ్మేళనము చేయుచు ఆంగ్లసామ్రా జ్యాధికారము ప్రబలుచున్నది. ఇంగ్లీషువారిబాటలు పూర్వపు రోమనులబాటలవలె నేలమీద ప్రాకులాడుటతో తృప్తిపడక, మహాసముద్రములందు సైతము అన్నివైపులకును నాగలిచాళ్లవలె అనుదినము వ్యాపించుచున్నవి. ఒక మహాసముద్రమునుండి మఱొక మహాసముద్రమునకు ఇంగ్లాండుబాటలు నిరాటంకముగా పరుగులిడుచున్నవి. ప్రపంచమందలి ప్రతిదేశము ప్రతిఇతరదేశము తోడను లంకెవేసికొనుచున్నది. నూతనవార్తాహరునివలె విద్యు

చ్ఛక్తి మహాద్భుతవ్యాపారమును నడపుచున్నది. ఈ పరిస్థితు లన్నింటివలనను, భారతదేశము పునర్జీవముగాంచి ప్రపంచపురోభి వృద్ధికిని, నాగరికతావ్యాప్తికిని, తనవంతు దోహదముచేయుటకు సిద్ధముగా నున్నది. ప్రకృతినన్ను నెట్టుకొని పోయినదో అన్నట్లు, నేను ఇంగ్లాండు అమెరికాలకు పోయి మతప్రచారము సాగించుట దాని ఫలితమే! భారతదేశము ప్రపంచమునకు ఆధ్యాత్మిక నాయ కత్వము వహించు తరుణము ఏతెంచినదని మనలోని ప్రతి వారును గ్రహించియుండవలెను. మిక్కిలి అనుకూలముగా నుండు ఈ వాతావరణములో భారతీయభావరాశి, వైదాంతికముగను, పారమార్థికముగను మఱొకసారి బయలువెడలి ప్రపంచమును జయింపవలసియున్నది. కాబట్టి మనకిప్పు డేర్పడిన సమస్య దిన ములు గడచినకొలది బ్రహ్మాండాకృతి తాల్చుచున్నది. మనదేశ మును మాత్రము పునరుద్ధరించుకొన్న చాలుననుకొనుట తగదు. అదొక స్వల్పవిషయము. నా బుద్ధికి ఊహాగమనముచేయుట అలవాటు. హైందవజాతి ప్రపంచమునంతను జయింపవలయునని నా సంకల్పము!

ప్రపంచములో అనేకదిగ్విజయములు సాగించిన గొప్ప గొప్ప జాతులుగలవు ; మనముగూడ ఒకప్పుడు విజయశీలురమే! మన విజయచరిత్ర మతవిషయకమును, ఆధ్యాత్మికవిషయకమును అని భారతీయమహాచక్రవర్తి అశోకుడు అభివర్ణించి యున్నాడు. మరల ఇంకొకసారి భారతభూమి ప్రపంచమును జయింపవలసి యున్నది. ఇదియే నా జీవిత స్వప్నము! మీరుకూడ మీమనస్సు లలో అదే స్వప్నమునుగాంచుచు, ఆ స్వప్నమును ప్రత్యక్షాను భవమునకు తెచ్చుకొనుటకై అహోరాత్రములు నిర్విరామముగా కృషిసలుపుదురుగాక! "ముందు మీఇల్లు చక్కబెట్టుకొనుడు. ఆ పిమ్మట రచ్చలకెక్కి 'రాచకార్యములు' నిర్వహింపవచ్చును" అని ఎవరైనను మీతో అనవచ్చును. కాని ఒక్కవిషయము

మీకు స్పష్టముగా చెప్పుచున్నాను. మీ మంచి మీరు చూచు కొనుటకంటె ఇతరుల మంచికై కృషిసలుపుట వేయిరెట్లు పవిత్ర కార్యము. సముద్రములను సైతము దాటిపోయి, వేదాంతభావ ములను విదేశభాషలలో ప్రచారముచేయుచు, అచ్చటిప్రజలకు సేవచేయుటే, మీకు మీరు చేసికొనగల ఉత్తమోత్తమసాహా య్యము! ఇతర దేశములను మీ తత్త్వవిద్యలతో విజ్ఞానవంతముగ చేయుటకై మీరు చేయుప్రయత్నము మీ దేశమునకు ఎంతటి ఉపకారముచేయగలదో ఈసభయే రుజువుచేయుచున్నది. నా బోధలు భారతదేశముకొఱకుమాత్రమే అని హద్దుపెట్టుకొని నేను ఇంట గూర్చున్నచో, నేను ఇంగ్లాండు అమెరికాలకు పోయివచ్చుట చేత ఈ దేశమునకు కలిగిన లాభములలో పాతికభాగమైనను కలిగియుండెడిది కాదు! మన కిప్పుడు పరమగమ్యము ఇదియే! భారతదేశము ప్రపంచమునంతను జయింపవలయును! మీలో ప్రతివాడును అందుకొఱకై సిద్ధపడవలయును. ప్రపంచ విజయము తప్ప, అంతకుతక్కువ మఱేదియు మనకక్కఱలేదు. అందుకొఱకై మనమందఱమును సన్నద్ధులముకావలెను. నరములు తెగునట్లు పెనగులాడవలెను. విదేశీయులు వచ్చి తమసేనలతో మనదేశ మును ముంచివేయుదురుగాక, మీరు లక్ష్యముచేయవలదు! భారత పుత్రులారా! లెండు! మీ ఆధ్యాత్మికతత్త్వముతో ప్రపంచమును జయింప రండు! 'ద్వేషమును ప్రేమయే జయింపగలదు. ద్వేషమే ద్వేషమును జయింపజాలదు' అను నుడి ప్రప్రథమమున ఈభారత భూమియందేకదా ప్రకటింపబడినది! నాస్తికతయు, దాని అనర్థ ములును నాస్తికవాదముచే ఎన్నడును జయింపబడజాలవు. సేన లను సేనలతో జయింపబూనినచో అవి పెరిగిపోయి మానవజాతు లను పశువులమందలుగా మార్చివేయును! పాశ్చాత్యప్రపంచ మును వేదాంతమే జయింపవలయును. తమ జాతులు సురక్షిత ముగా నుండుటకు తమకు కావలసినది పారమార్థికతయేఅని వారు నెమ్మది నెమ్మదిగా గ్రహించుచున్నారు. వారు దానికొఱకై

ఎదురు చూచుచున్నారు; ఆతురపడుచున్నారు. అది యెందుండి వచ్చును? భారతమహర్షుల సందేశములను చేకొని, ప్రపంచ మందలి ప్రతిదేశమునకును వెడలుటకు సంసిద్ధులుగానున్న పురుషు లెక్కడనున్నారు? అట్టి ధీరహృదయులు ధర్మప్రచారమున తోడ్పడుటకు కావలయును! అట్టి సాహసవంతులగు ప్రచారకులు పరదేశములకుపోయి, ఉత్తమవేదాంతధర్మములను వెదజల్ల వలయును! ప్రపంచమునకు వేదాంతబోధ అత్యావశ్యకముగా నున్నది. అది లేదేని ప్రపంచము వినాశముచెందును. పాశ్చాత్య ప్రపంచమంతయు నేడో రేపో భగ్గుమని మంటలు వెలిగ్రక్కనున్న అగ్నిపర్వతముఖమున నున్నది. రేపైనను అది పటాపంచలై పోగలదు. వారు ప్రపంచపు మారుమూలలకు సైతము పోయి గాలించినారు. ఎక్కడను వారికి శాంతి చిక్కలేదు. సౌఖ్యము లను భోగములను పరిపూర్ణముగ అనుభవించి చూచి, అంతయు బూటకమని చివరకు గ్రహించినారు. భారతీయ వేదాంతమును పాశ్చాత్యహృదయములందు గాఢముగా నాటుకొనునట్లు ప్రచా రముచేయుటకు ఇదియే మంచితరుణము! కాబట్టి చెన్నపురి యువకులారా! ఈ మాటను జ్ఞప్తియందుంచుకొనుడని మిమ్ము మఱిమఱి కోరుచున్నాను. మనము దేశాంతరములకు పోవల యును; మన వేదాంతముతోడను, తత్త్వశాస్త్రముతోడను లోక మును జయించి వేయవలయును. ఇంక మార్గాంతరములేదు. మనము ఆపని చేసితీఱవలయును; లేదా చావవలయును. మన జాతీయజీవనము నిలుచుటకును, అది ఉజ్జీవమై సత్త్వమయమై విరాజిల్లుటకును, భారతీయవేదాంతముతో లోకమును జయించు టయే ఏకైక మార్గము!

వేదాంతవిద్యతో ప్రపంచమును జయించుట అనగా, ఉజ్జీవనహేతువులగు ధర్మములను ప్రచారముచేయుటయే నా అభి ప్రాయముగాని, అనేకశతాబ్దములనుండి మనము పట్టుకొని ఊగు

లాడుచున్న మూఢాచారము లన్నిటిని ప్రచారము చేయుట అని కాదు. వీనిని ఇక్కడే పెఱికివేసి, కట్టకట్టి ఆవల పారవేయవలయును. అప్పుడుగాని వానికి శాశ్వత వినాశము చేకూరదు. ఇవియే మనజాతి పతనమునకు కారణములైనవి. ఇవియే మన మెదడును పాడొనరించినవి. అట్టి మెదడు ఉన్నతములగు గంభీరభావములను సంకల్పింపజాలదు; దానికి స్వతంత్రయోచనాశక్తి యుండదు. అది నిర్వీర్యమై, మతముపేరిట చెల్లుబడియగుచున్న నానావిధక్షుద్రమూఢభావములతో కలుషితమై యుండును. ఈ మెదడును గుఱించి మనము కొంచెము జాగ్రత తీసికొనవలయును. ఇక్కడ, భారతదేశమున, అపాయము లనేకము మన కంటి ఎదుట గోచరించుచున్నవి. శుద్ధనాస్తికవాదము ఒకపక్షమున! క్షుద్రమూఢాచారనిరతి రెండవపక్షమున! ఈ రెండు తిరుగలిరాళ్ల మధ్యను పడకుండ మనము తప్పించుకొనవలసియున్నది. పాశ్చాత్య విజ్ఞాన మనెడు మద్యమును త్రావిన కైపుతో, తనకు సమస్తమును తెలిసిపోయినదనెడు ఘనుడు నేడు బయలుదేఱినాడు! ప్రాచీన ఋషుల పేరు విన్నంతనే అతనికి నవ్వువచ్చును! హిందూవిజ్ఞానమంతయు వాని దృష్టిలో పనికిరాని చెత్త! తత్త్వసిద్ధాంతములు పసిపిల్లల పిచ్చికూతలు! మతధర్మములు బుద్ధిహీనుల వెఱ్ఱి అలవాట్లు! ఇక రెండవపక్షమున, అతివాదముచేయుచు అన్యుల పొడ గిట్టని పండితుడు గలడు! ఆయన ప్రతిశకునమునకును బండెడు వ్యాఖ్యానములు రచించుచు కూర్చుండును; తన శాఖాసంప్రదాయమునకును, తన ఇష్టదేవతలకును, తన గ్రామసంబంధమగు ప్రతి మూఢాచారమునకును తత్త్వసిద్ధాంతములను, వేదాంత ధర్మములను ఇంకను ఏవేవియో క్రోడీకరించుచుండును. అది యంతయు దేవునికే ఎఱుక! ప్రతి క్షుద్రగ్రామాచారమును వానికి వైదికధర్మముగనే గోచరించును! వాని అభిప్రాయములో—దాని నిర్వహణముమీదనే జాతీయజీవనమంతయు ఆధారపడి యున్నట్లుండును! ఈ రెండుపక్షములనుగూర్చియు మీరు అతి జాగ

రూకతతో మెలగవలయును. మీ రందఱును నాస్తికవాదులై పోయినను నా కిష్టమేగాని, మూర్ఖాచారములతో వెఱ్ఱులై పోవుట మాత్రము తగదు. ఏలయన, నాస్తికునియందు చైతన్యముండును. వాని నొకరీతిగా సవరింపవచ్చును. కాని మూర్ఖావేశము పట్టువడెనా, మెదడు ధ్వంసమైపోయినట్లే! అది పోయెనా, జీవితము భ్రష్టమైపోయినట్లే! ఈ రెంటినుండి జాగ్రత్తగా తప్పించుకొనుడు. ధైర్యవంతులును సాహసవంతులును మనకు ఇప్పుడు అవసరము. రక్తమునందు జవము, నరములందు సత్త్వము కావలయును. ఇనుమునుబోలు కండరములు, ఉక్కువంటి నరములు కావలయునే గాని నిలుకడలేక ఊరక జారిపోవు పిచ్చిఊహ లెందుకు, తగుల బెట్టనా? మర్మమనునది యుండగూడదు. సత్యమతమున మర్మము లేదు. వేదములందుగాని, వేదాంతమునందుగాని, సంహితలలో గాని, పురాణములలోగాని, ఏమైన గుప్తత గలదా! పూర్వకాలపు ఋషులు తమ మతమును ప్రచారము చేయుటకై ఏమేని రహస్య సంఘములను నెలకొల్పిరా! తమ మహాధర్మములను మానవకోటికి అందించునపుడు ఏలాటి హస్తలాఘవమర్మముల నుపయోగించి నట్లు ఎందేని వ్రాయబడియున్నదా! రహస్యప్రచారము, మూఢ విశ్వాసము, దుర్బలతకు చిహ్నములు! పతనమునకు, మరణము నకు చిహ్నములు! కాబట్టి వానివిషయమై జాగ్రత్తగా నుండుడు. ధీరులై మీ కాళ్లమీద మీరు నిలబడవలెను. మన వేదాంతము నందు అత్యద్భుత విషయములు కలవన్నమాట సత్యము. మన పరిమితభావప్రమాణమునుబట్టి వానిని అలౌకికవిషయములని మనము పలుకవచ్చును. కాని వానిలో ఒక్కదానియందును నిగూఢత, మర్మము, రహస్యము కలవని చెప్పజాలము. మతధర్మములు రహస్యమైనవనిగాని, హిమాలయపర్వతశిఖరములపై చేరిన రహస్యసంఘముల సొత్తనిగాని, ఈ దేశమున పూర్వ మెన్నడును పలుకబడియుండలేదు. నేను హిమాలయపర్వతములకు పోయితిని. మీరు పోలేదు. అవి యిక్కడికి చాలవందలమైళ్లదూరము. నేను

సన్న్యాసిని. గడచిన పదునాలుగుసంవత్సరములనుండి పాదచారినై తిరుగుచున్నాను. ఈ రహస్యకూటములు ఎక్కడను లేవు. ఈ పిచ్చినమ్మకములు పెట్టుకొనకుడు — అంతకన్న మీరు కేవల నాస్తికులై పోవుటే మీకును మీ జాతికిని క్షేమము. అపుడు మీ బలము నిలిచియుండును. కాని ఇట్టివానివలన మీకు లభించునది భ్రష్టత్వమును మరణమును మాత్రమే! బుద్ధిపాటవముగలవారు ఈ మూఢవిశ్వాసములతో కాలము గడపుటయు, అసహ్యములగు పిచ్చినమ్మకములను సమర్థించుటకై అంతరార్థములు కల్పించుచు వృధాకాలయాపన చేయుటయు మానవజాతికే అవమానకరము! ధైర్యము వహింపుడు. ప్రతిదానిని ఆ విధముగా సమర్థించుటకై ప్రయత్నింపకుడు. మనలో చాల మూఢాచారములున్నమాట నిజమే. మన శరీరముమీద పొడమచ్చలు పడినవి; పుండ్లును గలవు. వీనిని రూపుమాపుకొనవలయును; శస్త్రచికిత్స చేసికొనవలయును. వానిని పూర్తిగా నిర్మూలము గావింపవలయును. కాని ఇవి మన మతమును, మన జాతీయజీవనమును, మన ఆధ్యాత్మికతను ధ్వంసముచేయునవి కావు. ప్రతి సత్యధర్మసూత్రమును సురక్షితముగానే యుండును. ఈ పొడమచ్చలు ఎంత త్వరగా తొలగింపబడునో అంత శీఘ్రముగా, సత్యధర్మసిద్ధాంతములు అధికతేజముతో ప్రకాశింపగలవు! వానిని అంటిపట్టుకొని యుండుడు!

ప్రతి మతమువారును తమ మతమే విశ్వజనీనమని వాదులాడుచుందురు. విశ్వజనీనమత మెన్నటికిని కలుగదని నా భావము. ఒకవేళ అట్టిమతము కలదనుచో, మన మత మొక్కటి మాత్రమే అట్టిదని చెప్పుటకు కొంతయేని వీలున్నది. మరేమతమునకును అటువంటి అవకాశము లేదు. ఏలయన, తక్కిన మతములన్నియు ఎవరో ఒకపురుషునిమీదగాని, పురుషులమీదగాని, ఆధారపడి పుట్టినవి. అవన్నియు చారిత్రక పురుషుడని తన్మతస్థులు వక్కా-

ణించు ఒకానొకపురుషుని జీవితము చుట్టును అల్లబడినవి. వారు తమ మతమునకు ఏది బలము నిచ్చునని భావించుచున్నారో, అది నిజముగా దాని దౌర్బల్యమే! ఏలయన, ఆ పురుషుని గుఱించిన చారిత్రకగాథ సత్యముకాదని మీరు రుజువుచేసితిరేని, ఆ మత నిర్మాణమంతయు నేలగూలిపోవును. ఈ గొప్ప గొప్ప మతనిర్మాతల జీవితాంశములలో సగమైనను చారిత్రకముగా సత్యముకావని రుజువైనది. తక్కిన సగపాలు సంశయగ్రస్తమై ఊగులాడు చున్నది. అందుచే ఆ మతకర్తల పలుకులే ఆధారముగా గల మతధర్మములెల్ల రూపుమాసి, గాలిలో కలిసిపోవుచున్నవి! మనకును పురుషవరేణ్యు లెందఱో ఉన్నప్పటికిని మన మతధర్మ ములు వారిపై ఆధారపడినవి కావు. శ్రీకృష్ణునిమహిమ ఆయన వేదాంతబోధ చేయుటలో గొప్పవాడగుటవలననే కలిగినది కాని, వ్యక్తిత్వేన శ్రీకృష్ణుడగుటవలన కాదు. లేనిచో, బుద్ధుని నామమువలెనే కృష్ణుని నామముకూడ ఈ దేశమున క్రమక్రమ ముగా మాసిపోయి యుండును. మనము భక్తిగౌరవములు చూపునది సదా ధర్మసిద్ధాంతములకే గాని, నరులకు గాదు. నరులు మూర్తిమంతములయిన సిద్ధాంతములుగా మాత్రమే, అనగా ఆ సిద్ధాంతములకు నిదర్శనములుగా మాత్రమే, ఆదరింప బడు చున్నారు. సిద్ధాంతములు సుస్థిరముగ నుండినయెడల ఇట్టి నరు లనేకులు వేలకొలది, లక్షలకొలది, రాగలరు! ధర్మసిద్ధాంతము సురక్షితమై నిలిచిన యెడల, బుద్ధునివంటిపురుషులు వందలకొలది, వేలకొలది, పుట్టుకొని రాగలరు! కాని సిద్ధాంతము ధ్వంసమై మఱుపున బడిపోయి, జాతీయ జీవితమంతయు ఎవరోయొక 'చారి త్రకపురుషు'ని చుట్టును అల్లుకొనియుండజూచుచో, ఆ మతము నకు వినాశము తప్పదు! నరులపై ఆధారపడక, సిద్ధాంతములపై మాత్రమే ఆధారపడియుండు మతము మనది ఒక్కటే! అట్లని పురుషుల కవకాశము లేకపోలేదు. లక్షలకొలది పురుషులకు అవ కాశము కలదు. కాని అట్టివారిలో ప్రతివాడును, ఆ ధర్మసూత్ర

ములకు నిదర్శనరూపముగా నుండవలయును. ఈ విషయమును మనము మఱవదగదు. మన సిద్ధాంతము లన్నియు సురక్షితముగా నున్నవి. వానిలో ప్రతిదానిని చెక్కు-చెదరకుండ కాపాడి, కాల గతిని వచ్చుదుమ్ము ధూళి చేరకుండ, శ్రద్ధతీసికొనుట మన కర్త వ్యము. మనజాతికి మరల మరల అధోగతి పట్టినను, వేదాంత ధర్మములు ఎన్నడుగాని కళంకితములు కాకుండ అట్లే నిలిచియుం డుట అబ్బురమగు విషయమే! ఎంతటి దుష్టుడును వానిమీద దుమ్మెత్తి పోయుటకు సాహసింపలేదు. ప్రపంచములోనికెల్ల, చక్క-గా కాపాడబడిన ధర్మశాస్త్రములు మనవి మాత్రమే! ఇతరుల గ్రంథములతో పోల్చిచూచిన యెడల, మన గ్రంథము లందలి ధర్మోపదేశములసారమును నాశము చేయుటగాని, క్రొత్త కల్పనలను తెచ్చి వీనిలో చొప్పించుటగాని వాక్యములు తికమకలు చేయుటగాని తటస్థింపలేదనియే చెప్పవచ్చును. నరునిబుద్ధిని పరమ ప్రాప్యమగు ఆదర్శము వైపునకు నడపుచు ప్రథమమున ఎట్లుం డెనో అవి నేటికిని అట్లే యున్నవి.

వైదికసూత్రములకు వేర్వేఱు భాష్యకర్తలు వేర్వేఱు అర్థములను వ్రాసిరి. ఆ అర్థములను గొప్ప గొప్ప ప్రబోధకులు ప్రచారముగావించిరి. వానిని ఆధారము చేసికొని అనేకశాఖా సంప్రదాయములు సృజింపబడినవి. వేదములలో పరస్పరము విరు ద్ధములైచూపట్టు భావము లనేకము కాన్పించును. పూర్తిగా ద్వైతభావముగల వాక్యములు కొన్ని గలవు. పూర్తిగా అద్వైత బోధకములగు నవియు మఱికొన్ని గలవు. ద్వైతవాదియగు భాష్యకర్త, అంతకంటెనేమియు చేయలేకపోవుటచేత, అద్వైత పరములగు వాక్యములను చిదుకగొట్టజూచును. వానికి ద్వైతపర మగు అర్థమును కల్పనచేయును. అద్వైతపక్షము వహించు భాష్య కర్తము ద్వైతపరములగు వాక్యములను అదేతీరున ఆదరించును. ఇది వేదములయొక్క- దోషముగాదు. వేదము లన్నియు సంపూ

ర్ణముగ ద్వైతపరముగనే యున్నవని ఋజువుచేయబూనుట బుద్ధి లేనిపని. అవన్నియు పూర్తిగా అద్వైతబోధకములే అని ఋజువు చేయబూనుటయు, అందుకు సమమగు బుద్ధిమాలినపనియే! అవి ద్వైతపరములుగను, అద్వైతపరములుగను కూడనున్నవి. నూతనముగా లభించిన భావముల మూలమున మనము ఈనాడువానిని మునుపటివారికంటె సరిగా అర్థముచేసికొనగల్గుచున్నాము. బుద్ధి యొక్క పరిణామమునకు ద్వైతాద్వైతపరములగు భావనావిశేషములు రెండును అవసరములే అనియు, అందువలననే ఆరెంటిని వేదములు ఆదరించి బోధించుచుండుననియు, నా యభిప్రాయము. అవి మానవజాతిని కరుణించి, ఉన్నతగమ్యమును చేర్చునట్టి సోపానముల నన్నిటిని చూపుచున్నవి. ఆ సోపానములు పరస్పర విరుద్ధములు కానేకావు. అదంతయు పసివారిని విభ్రాంతుల చేయుటకై ప్రయోగింపబడిన వ్యర్థపదజాలము కాదు. పసివాండ్రకొఱకేగాక, వయసు వచ్చినవారికికూడ అవి అవసరమే! మనకొక శరీరము ఉండునంతకాలము, శరీరమును మనమును ఏకమనెడు అధ్యాస మనను పట్టుకొని యుండునంతకాలము, ఐదు జ్ఞానేంద్రియములు గలిగి మనము బాహ్యప్రపంచమును చూచుచుండు నంతకాలము, సగుణబ్రహ్మము మనకు తప్పక అవసరమే! ఇట్టి భావము లన్నియు మనకు కలిగియుండునంతవఱకు, శ్రీ రామానుజాచార్యులవారు నిరూపించినట్లు, భగవంతునిగూర్చిన, ప్రకృతినిగూర్చిన, జీవాత్మనుగూర్చిన భావములన్నింటిని మనము స్వీకరింపవలసినదే! ఈ మూటిలో ఏఒక్కదానినితీసికొన్నను, తక్కినరెంటినికూడ తీసికొని తీఱవలయును. గత్యంతరములేదు. కాబట్టి బాహ్యప్రపంచము నీకు గోచరించుచున్నంతకాలము, సగుణదైవతము, సగుణజీవాత్మ లేవనుట కేవలము ఉన్మాదము. కాని, మానవబుద్ధి తన హద్దులనుదాటి, ప్రకృతినికూడ దాటి, "అచ్చోటును చేరజాలక, వాక్కు మనస్సుతోసహా వెనుకకుతిరిగి వచ్చును" అని శ్రుతిలో వర్ణింపబడిన క్షేత్రములుచేరు తరుణ

ములు మహాపురుషుల జీవితములందొకొక్కసారి రావచ్చును. "అక్కడికి కన్నులు చేరజాలవు; వాక్కు చేరజాలదు; మనస్సును చేరజాలదు." "మనము దానిని ఎఱుగుదు మని చెప్ప జాలము; ఎఱుగ మనియు చెప్పజాలము". నరుని ఆత్మ ఇట్లు పరిమితుల నన్నింటెని అతిక్రమించిన క్షణముననే "నేనును ఈ విశ్వమును ఒక్కటే", "నేనును బ్రహ్మమును ఒక్కటే" అనెడు అద్వైతభావము అతని ఆత్మయందు మెఱుపువలె తళుక్కుమనును. ఈ ఎఱుక జ్ఞానమువలనను, తత్త్వవిచారమువలనను మాత్రమే గాక, ప్రేమమహిమవలనకూడ కొంతవఱకు లభించును. శ్రీకృష్ణుడు అదృశ్యుడు కాగా, గోపికలు అతనిని గాంచలేక, మిగుల దుఃఖితలై కొంతవడికి వారి మనస్సులలో శ్రీకృష్ణభావము బలీయముకాగా, ప్రతిగోపికయు తన తనువును మఱచి, తానే శ్రీకృష్ణుడని భావించి, అతనివలె అలంకరించుకొని అతనివలెనే లీలలు సలుప నారంభించినట్లు భాగవతమున వర్ణింపబడినది. కాబట్టి భక్తిద్వారమున కూడ ఇట్టి అద్వైతభావము లభ్యము కాగలదని మనము తెలిసికొనవలయును. సూఫీమతమునకు చెందిన పర్షియాదేశపు ప్రాచీనకవి యొకడు తన కావ్యమొకదానిలో ఇట్లు వ్రాసెను: "నేను నా ప్రియురాలికడకు పోయితిని. తలుపు మూసియుండెను. తలుపు తట్టితిని. 'ఎవరక్కడ?' అను ధ్వని లోనుండి వినవచ్చెను. 'నేనే' అని మాఱుపల్కితిని. తలుపు తెఱవబడలేదు. రెండవసారి తలుపు తట్టితిని. 'ఎవరక్కడ?' అను వెనుకటి ధ్వనియే వినవచ్చినది. నేను ఫలానావాడనని పల్కితిని. తలుపు తెఱవబడలేదు. మూడవసారి తట్టితిని. 'ఎవరక్కడ?' అనెడు ఆ ధ్వనియే వినవచ్చినది. 'ప్రేయసీ! నేను నీవే!' అంటిని. తలుపు తత్‌క్షణమే తెఱవబడినది!"

అనగా, పెక్కు అంతరువులు కలవు. కావున మనము వానిని గుఱించి వాదులాడ నవసరములేదు. ప్రాచీన వ్యాఖ్యాన

కర్తలందు విభేదములున్నను మనమెల్లరము వారిని పూజించి తీఱవలసినదే. ఏలయన, జ్ఞానమునకు పరిమితి లేదు. ప్రాచీనకాల మందుగాని, ఆధునికకాలమందుగాని, సర్వజ్ఞత్వము ప్రత్యేకముగా ఒకరి సొత్తుగాదు. పూర్వకాలమున జ్ఞానసిద్ధులును, ఋషులును ఉన్నట్లే ఇప్పుడును అట్టివారు చాలమంది యుందురనుట నిశ్చయము. పూర్వకాలమున వ్యాసులు, వాల్మీకులు, శంకరాచార్యులు ఉండినయెడల, మీలో ప్రతియొకరును ఒక శంకరాచార్యులు ఎందుకు కాకూడదు? మన మతములో మీరు సదా జ్ఞప్తినుంచుకొనవలసిన మఱొక విశేషాంశము కలదు. తక్కిన మతగ్రంథము లన్నింటిలో ఈశ్వరవాణి ప్రమాణముగా చెప్పబడుచున్నది. ఆ వాణి ఏకొలదిమంది పురుషులకు మాత్రమే వినబడెను. వారి నుండి ఆ ధర్మములు ప్రజాసామాన్యమునకు వచ్చినవి. మన మందఱమును వానిని శిరసావహింపవలెను. సత్యమును ఏసుక్రీస్తు దర్శించెను. కావున మనమందఱమును వానియెడల విధేయత చూపవలసినదే! మన మతమునం దట్లుగాక పూర్వకాలమున మంత్రద్రష్టలగు ఋషులకు లభించినట్లే అనంతరకాల ఋషు లందఱకు కూడ సత్యజ్ఞానము లభింపగలదు. ఆ సత్యము ఊరక ఆదేపనిగ ప్రసంగములుచేయువారికిగాని, గ్రంథములకు గ్రంథములు కంఠస్థముచేయువారికిగాని, పండితులకుగాని, భాషాశాస్త్ర వేత్తలకుగాని లభింపదు! అది మంత్రద్రష్టలకే లభించును. అత్యధికప్రసంగములచేతను, అత్యున్నతబుద్ధివిశేషముచేతను, తుదకు నిరంతరశాస్త్రపఠనముచేతనుగూడ ఆత్మను పొందలేము. శాస్త్రములే అటుల చెప్పుచున్నవి. వేదాధ్యయనమువలనకూడ మనము ఆత్మను చేరజాలమట! ఇట్టి సాహసవాక్కును ఏ ఇతరుల మతగ్రంథములందైనను మీరు కనుగొనగలరా? మీరు మీ హృదయములను వికసింపజేసికొనవలయును! మత మనగా చర్చికి పోవుటగాదు; ముఖమున బొట్లుపెట్టుకొనుటగాదు; వేషములు వేసికొనుటయుకాదు. ఇంద్రధనస్సునం దెన్ని వర్ణము లున్నవో

అన్నింటితోను మీ శరీరములకు రంగులు పూసికొందురుగాక; మీ హృదయము వికసింపనియెడల, మీకు బ్రహ్మసాక్షాత్కారము కానియెడల, సర్వమును వ్యర్థమే! హృదయమునకు సరియైన వర్ణము లభించినయెడల ఎట్టి బాహ్యవర్ణముతోడను అక్కఱ యుండదు. అదియే సత్యమగు పారమార్థికసిద్ధి. రంగులు మొదలగునవి అన్నియు, మనకు సహకారములుగా నుండునంత కాలము మంచివే! అంతవఱకు అన్నింటికిని స్వాగతము చెప్పుదము. కాని ఒకదశలో అవి భ్రష్టములై పోయి సహకారములగుటకు బదులు ప్రతిబంధకములుగా మాఱును. అప్పుడు నరుడు మతమును బాహ్యవిషయములతో అభిన్నముగా భ్రమించును; దేవాలయ మును దర్శించుటే పరమార్థ జీవనమై పోవును; పురోహితునకు దానము చేయుటే మతధర్మాచరణమై పోవును. ఇట్టివి అపాయ కరములు, అవినీతికరములు. ఇట్టివానిని తత్క్షణము త్యజింప వలెను—మన బాహ్యేంద్రియజ్ఞానము సైతము మతము కాదని శాస్త్రములు పదేపదే ఘోషించుచున్నవి. ఆ నిర్వికారబ్రహ్మము సాక్షాత్కారమగునట్లు చేయునదియే మతము! దానినే ప్రతి వాడును అనుసరింపవలెను. ఎవడు సర్వాతీతసత్పదార్థమును సాక్షాత్కరింపజేసికొనునో, ఎవడు స్వతత్త్వమునందే ఆత్మను ప్రత్యక్షము చేసికొనునో, ఎవడు భగవంతుని ముఖాముఖని చూచునో, ఎవనికి సర్వమునందును బ్రహ్మము మాత్రమే కాన్పిం చునో అట్టివాడే ఋషి. నీవు అట్టి ఋషివిగా మాఱువఱకును నీకు మతమనునది లేనట్లే! అప్పుడు మాత్రమే మతము ప్రారం భము కాగలదు. అంతవఱకు జరుగునది మతము కొఱకై సన్నా హము మాత్రమే. ఈ సన్నాహము పూర్తియైనగాని మతో దయము కాదు. ఇప్పుడు నీవు బుద్ధివ్యాయామమును, శారీరక వ్యాయామమును మాత్రము పొందుచున్నావని అర్థము.

"మోక్షమును గోరు ప్రతివాడును ఋషిత్వ దశను సాధింపవలయును; మంత్రద్రష్ట కావలయును; ఈశ్వరసాక్షాత్కా

రము పొందవలయును'' అని మన మతము వివరముగను సుస్పష్ట ముగను విధించుచున్నది. 'మోక్షము' అనగా అట్టిది! మన శాస్త్రములు విధించు ధర్మమదియే! మన శాస్త్రములను మనము స్వయముగా పరిశోధింపవలయును; స్వయముగా వాని అర్థమును గ్రహింపవయును; మనకు కావలసిన దానిని విచక్షణచేసి మనం తట మనమే సత్యమును గ్రహింపవలయును. ఇవియే చేయవలసిన పని. ప్రాచీన ఋషివరులు సాధించిన మహాకార్యములను తలంచి వారియెడల మనము పూజ్యభావము చూపవలయును. ఈపురాతన ఋషులు చాలగొప్పవారు. కాని మనమువారికంటెను గొప్ప వారము కావలెను. వారు పూర్వకాలమున ఘనకార్యములను సాధించిరి. మనము వానిని మించిన ఘనతరకార్యములను సాధింతము. ప్రాచీనభారతదేశమున వందల కొలది ఋషులు ఉండెడి వారు, మనకును లక్షలకొలది ఋషులు ఏర్పడుదురు — ఏర్పడి తీఱుదురు. ఈ విషయమును మీలో ప్రతివాడును ఎంతత్వరగా, గాఢముగా విశ్వసించునో, భారతదేశమునకు అంత మేలు కలుగును! ప్రపంచమునకు అంత శ్రేయస్సుకలుగును! మీరు దేనిని విశ్వసింతురో అదిగా మీరు మారెదరు! మీరు ఋషులమని విశ్వసించినయెడల, రేపే మీరు ఋషులు అగుదురు! మిమ్ము అడ్డు పెట్టునది లేనేలేదు! చూచుటకు పరస్పరము విరుద్ధములుగానుండి, ఒకదానితో నొకటి పోరాటములు సలుపుచుండు మన సంప్రదాయము లన్నింటికిని సమముగా వర్తించు సిద్ధాంత మేదేని కలదేని, అది 'సమస్త తేజోవైభవము, శక్తి, పవిత్రత, ఆత్మలో ఇదివఱకే కల' వనెడు సిద్ధాంత మొక్కటే! శ్రీరామానుజాచార్యుల సిద్ధాంతప్రకారము ఆ జీవాత్మ ఒక్కొక్కప్పుడు సంకోచము పొందుచు, ఒక్కొక్కప్పుడు వికాసముపొందుచుండును. శంకరాచార్యుల సిద్ధాంతము ప్రకారము అది భ్రాంతిలో పడును. ఇంతియే భేదము. ఈ భేదము లుండిన నుండనిండు. వ్యక్తరూపమునగాని, అవ్యక్తరూపమునగాని, జీవాత్మయందు శక్తి గలదనెడు సత్యమును

అందఱును ఒప్పుకొనుచున్నారు. మీకు దీనియందు ఎంత త్వరలో నమ్మకము కుదురునో మీ కంత శ్రేయస్కరము! మీలో సర్వశక్తి యున్నది! మీరు చేయలేనిది లేదు! లేనేలేదు. ఆత్మవిశ్వాసము వహింపుడు! దుర్బలురమని నమ్మబోకుడు! వెడగులమని భావింపకుడు. మీకు ఎవరును దారిజూప నక్కరలేదు. మీయంతట మీరే దేనినైనను చేయగలరు. మీయందు సర్వశక్తి యున్నది! లేచి నిలబడుడు! మీయందు నిగూఢమైయున్న దివ్య తేజమును ప్రకటింపుడు!!



# భారత దేశ భావిభాగ్యోదయము

విజ్ఞానము మఱి ఏ ఇతరదేశమునకుగాని పోవుటకు పూర్వము, తన స్వగృహముగా చేసికొనినది ఈ ప్రాచీనభూమినే! ఆధ్యాత్మికజ్ఞానాగమనమునకు స్థూలదృష్టికి చూపట్టుచిహ్నములో యన, మహాసముద్రముల బోలు గొప్ప నదులు ప్రవహించుచున్నది ఈ భారతదేశముననే! స్వర్గమందలి నిగూఢాంశములను తొంగి చూడబోవుచున్నవో యనునటుల, ఆహా, మన అఖండ హిమాలయ పర్వతపంక్తులు సోపానపరంపరలుగా స్వచ్ఛమగు శిశిరకిరీటములను ధరించి, ఆకాశములోనికి అత్యున్నతముగ వ్యాపించుచున్నది ఇక్కడనే! లోకమున ఎన్నడేని యవతరించిన అత్యంత పూజ్యులగు ఋషిసత్తముల పాదస్పర్శచే పవిత్రీభూతమైన క్షేత్రమును ఈ భారతదేశమునందే కలవు! నరుని ఆభ్యంతర ప్రకృతిని గుఱించియు, అంతరప్రపంచమును గుఱించియు, పరిశోధనలు మొట్టమొదట ప్రారంభమైనది ఇక్కడనే! జీవాత్మయొక్క అమృతత్వమును గుఱించియు, ఈశ్వరునియొక్క పరిపాలనాకర్తృత్వమును గుఱించియు, ప్రకృతియందును నరునందును

అంతర్యామియై వఱగు భగవంతునిగుఱించియు సిద్ధాంతములు ప్రప్రథమమున బయలుదేరినది ఇక్కడనుండియే! మతధర్మము యొక్కయు, తత్త్వశాస్త్రముయొక్కయు అత్యుత్తమాదర్శములు తమ పరమప్రాప్యస్థానమును పొందగలిగినది ఇక్కడనే! ప్రపంచమును పెక్కుతడవలు పూర్తిగ ముంచి లేవనెత్తిన ఆధ్యాత్మిక జ్ఞానము, తత్త్వవిద్య, అనెడు మహోత్తుంగతరంగములు బయలుదేరినది ఈదేశమునుండియే! మానవకోటిలో శుష్కించి నిర్జీవములైపోవుచున్న జాతులను మరల నొకసారి ఉజ్జీవింపజేసి, జవసత్వములు కూర్చుటకు అట్టి తరంగజాలము ఇక బయలుదేరవలసి యున్నది ఈ భారతక్షేత్రమునుండియే! వందలకొలది విదేశీయుల దాడులను, భిన్నభిన్నములగు ఆచారమర్యాదల సమ్మేళనవలన గల్గిన వందల కొలది విప్లవములను భరించి నిలిచినట్టి భారతభూమి ఇదియే! చెక్కుచెదరని శౌర్యముతోడను, వినాశమెఱుంగని చైతన్యప్రభలతోడను, లోకములోని ఏ శైలరాజమునైనను మించగలిగిన సుస్థిరత్వముతో నిలిచినది ఈ పవిత్రదేశమే! ఆద్యంతములులేక, అమృతమై వఱగు నిత్యాత్మ ఎట్టిదో ఈ పవిత్రక్షేత్రముయొక్క జీవితముకూడ అట్టిదే! మనము అట్టి దేశమాత కనిన సంతానము!

భారతపుత్రులారా! నేనిప్పుడు కొన్ని 'అనుష్ఠానాంశములను గూర్చి మీకు తెలుపుటకై ఇచ్చట నిలిచియున్నాను. గతించిపోయిన వైభవోన్నతిని మీ జ్ఞప్తికి తెచ్చుటలో నా ఉద్దేశ్యము తెల్పెదనుగాక. గతమును గుఱించి చింతించుట పతనమునకే హేతువనియు, ఎంతమాత్రమును లాభకారి కాదనియు, కావున మనము సదా భావిని గుఱించియే అనగా ముందు రానున్న దశను గుఱించియే విచారింపవలసియుండుననియు పెక్కురు బోధించుట నేను అనేకపర్యాయములు వినియున్నాను. ఆ మాట సత్యము. అయినప్పటికిని గతముపై ఆధారపడియే భావినిర్మాణము కాగలదు.

కాబట్టి మీకు శక్తియున్నంతవఱకు వెనుదిరిగి దృష్టి సారింపుడు; మీ వెనుకనున్న ఆ యఖండనిధులనుండి కడుపునిండుగ జ్ఞానజలములను గ్రోలుడు; అటుపిమ్మట ముందునకు చూడుడు; ముందునకే పరుగులిడుచు పొండు. భారతదేశమును పూర్వకాలమునాటి కంటెను తేజోమయముగను, మాననీయముగను మహిమాఢ్యముగను వెలయింపుడు. మన పూర్వులు చాల గొప్పవారు. మున్ముందుగా మన మా విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. మన స్వరూపసత్త్వములను మన నాళములందు ప్రవహించు రక్తము యొక్క స్వభావమును మనము తెలిసికొనవలయును. ఆ రక్త పటుత్వమునందును, భూతకాలమున ఆ రక్తపటిమ సాధింపగలిగిన ఘనకార్యములయందును మనము విశ్వాసము ఉంచవలయును. అట్టి విశ్వాసమును, మన ప్రాచీన ఔన్నత్యమును గుఱించిన పరిజ్ఞానమును ఆధారము చేసికొని పూర్వమునకంటె మహిమాఢ్యమై తేజరిల్లు తెఱగున భారతభూమిని పునరుద్ధరింపవలయును. మనదేశము క్షీణతను, హీనతను అనుభవించిన కాలములును కలవు; తథ్యమే. అవి అంత ప్రధానములుగా నే నెంచను; మనకందఱకును ఆ విషయము తెలియును. అట్టి సమయములు తటస్థించుటయు అవసరమే! ఒక మహావృక్షమునందు మనోహరమగు పక్వఫలము కలుగుచున్నది. ఆ పండు నేలరాలి చితికి క్రుళ్లి నాశమగును. దాని వినాశమునుండియే, వేరు పాతుకొని, భావికాలపు వృక్షము అంకురించుచున్నది. ఈ వృక్షము ప్రాయశః మొదటిదానికంటె మహోన్నతమైనది కావచ్చును! మనము గడపిన క్షీణదశ ఎంతయు అవసరమైనదే! ఆ క్షీణత నుండియే ఈ భారతదేశపు భావిభాగ్యోదయము రానున్నది. అదిగో అంకురము వెలువడినది! ఇప్పుడే దాని బీజదళములు కానవచ్చుచున్నవి! బ్రహ్మాండమగు మహావృక్షము రానున్నది! "ఊర్ధ్వమూలం" * అని వర్ణింపబడిన దివ్యవృక్షము అదిగో,

* ఈ శ్లోకము భగవద్గీతలోనిది.

అప్పుడే దృగ్గోచరమగుటకు ప్రారంభించినది! దీనిని గుఱించియే నేనిప్పుడు ప్రసంగింపబూనియున్నాను.

భారతదేశముయొక్క సమస్యలు ఇతరదేశముల సమస్యల కంటె మిగుల చిక్కైనవి. అంతేకాదు, ప్రముఖమైనవికూడ. సంఘము, మతము, భాష, పరిపాలనము ఇవి అన్నియు కలిసి జాతి యనుపేర పరగును. మనజాతితో పోల్చిచూచిన యెడల ప్రపంచములోని ఇతరజాతుల నిర్మాణవైచిత్ర్యములు నిజముగా అత్యల్పము లనవచ్చును. ఇచ్చట ఆర్యులు, ద్రావిడులు, తార్తారులు, తురుష్కులు, మొగలులు, యూరపియనులు, ఇంతేల ప్రపంచములోని సమస్తజాతులవారును చేరి తమరక్తము లను ఈ దేశములోనికి ప్రవహింపజేసిరనవచ్చును. ఇచ్చటి భాషా జాలమన్ననో అతివిచిత్రమగు కలగూరగంప బోలునది. ఆచార వ్యవహారములను విచారించిన యెడల పాశ్చాత్యజాతులకును ప్రాచ్యజాతులకును నడుమ ఎంత భేదము గలదో అంతకు మించిన విభేదము ఈ దేశమందలి ఏ రెండుజాతులమధ్యనైనను కాన వచ్చును.

మనకుగల ఏకైకసమానలక్షణము మన మతమునందును, మన పరంపరాగతసంప్రదాయరాశియందును కాననగును. దాని మీదనే మనము భవననిర్మాణము చేసికొనవలసియున్నది. యూరపునందు రాజనీతి జాతీయైక్యమును కూర్చుచున్నది. ఆసియాఖండమున మతాదర్శములు జాతీయైక్యమునకు ఆధారము లుగా నున్నవి. కాబట్టి మతమునందు ఏకీభావము కుదురుట భారతదేశ భావిభాగ్యోదయమునకు ప్రప్రథమనియమముగ అత్యావ సరమగుచున్నది. ఈ దేశమందంతటను పూర్ణముగా అంగీకారము పడసిన మత మొక్కటి యుండవలయును. ఒక్క మత మనగా నా అభిప్రాయమేమియో తెలియునా? క్రైస్తవులు, మహమ్మ దీయులు, బౌద్ధులు భావన చేయునటుల ఒక ప్రత్యేక మతము

కాదు. మన శాఖాసంప్రదాయములన్నియు వాని వాని సిద్ధాంతములందు ఎంత భిన్నములుగ నున్నను, ఎట్టి అధికారములకొఱకై వివాదములు సాగించుచున్నను, మన మతమునకు సమష్టిని కొన్ని సామాన్యాధారములు కలవు. ఈ సామాన్యాధారములను అనుసరించి వాని హద్దుల లోపల, ఈ మన మతము అనంతమగు భావనాస్వాతంత్ర్యమును, జీవనస్వాతంత్ర్యమును అంగీకరించుచు అత్యద్భుత విచిత్రవైఖరితో వెలయుచున్నది! ఈ విషయము మన కందఱకును తెలియును; కనీసపక్షము మనలో జిజ్ఞాసువులైనవారికైనను తెలియును. ఇప్పుడు మనకు కావలసినది మనమతమునకు ఆయువుపట్టులగు ఈ సామాన్యధర్మములను వెదకి కనుగొని, దేశమందంతటను ఒక కొననుండి మఱొక కొనవఱకు ప్రతిపురుషుడును, ప్రతిస్త్రీయు, ప్రతిశిశువును వీనిని తెలిసికొని, చక్కగా అర్థముచేసికొని, తమజీవితములలో అనువర్తింప యత్నించునటుల చేయుట మాత్రమే. ఇదియే మొట్టమొదటి సోపానము. కాబట్టి దానిని గుఱించియే మనమిప్పుడు శ్రద్ధ పూనవలసి యున్నది.

మతముయొక్క సమ్మేళనాశక్తిని ఎదిరించి నిలువలేక, ఆసియాఖండములో అందు ముఖ్యముగా భారతదేశములో జాతి సంబంధములగు చిక్కులు, భాషాసంబంధమగు కష్టములు, సంఘ సంబంధమగు ఇక్కట్టులు, ఉపజాతులకు సంబంధించిన బాధలు అన్నియు నీరై పోగలవు. ఆధ్యాత్మికాదర్శములకు మించినదేదియు భారతీయుని మనస్సునకు గోచరింపదనియు, భారతీయ జీవనమునకు మతమే కీలకమనియు మనకు తెలియును. మఱియు అవరోధములు అత్యల్పముగనుండు మార్గమున మాత్రమే మనము పనిచేయగలుగుదుము. ఆధ్యాత్మికాదర్శము అత్యుత్తమాదర్శమనుట సత్యమగుటయే కాదు; ముఖ్యముగ భారతదేశ విషయమున కార్యనిర్వహణమునకు అది ఒకటియే మార్గము! దీనిని మొట్టమొదట బలపఱచకుండ మఱి ఏ ఇతరమార్గముననైన పని

సాగించినయెడల అది మహానరకమగును. కాబట్టి భవిష్య త్కాలపు భారతజాతిని నిర్మించుటకై మొట్టమొదట చేయవలసిన శంఖుస్థాపన ఈ మతసమ్మేళనమే. యుగయుగములుగ పెరిగి యున్న ఆ మహాశైలమునందు చెక్కవలసిన ప్రథమసోపానము ఈ మతసమ్మేళనమే. ద్వైతులమనియో, విశిష్టాద్వైతులమనియో, అద్వైతులమనియో, శైవులమనియో, వైష్ణవులమనియో, లేక పాశుపత సంప్రదాయులమనియో మన మే పేరు పెట్టుకొనినను, హిందువులమగు మన కందఱకును ఆధారములగు కొన్ని సామా న్యాదర్శములు కలవనియు, మన శ్రేయస్సుకొఱకును, మన జాతి యొక్క క్షేమముకొఱకును, అల్పములగు మన విభేదములను మన వివాదములను విడిచిపెట్టవలసిన కాలము ఏతెంచినదనియు నచ్చ జెప్పుటయే మనకు కావలసినది. ఈ వివాదములన్నియు సంపూర్ణ ముగ దోషములే యని నమ్ముడు. మన శాస్త్రములు అట్టివానిని ఖండించి యున్నవి. మన పూర్వులు అట్టివి కూడవని మందలించి యున్నారు. మనము ఎవరి సంతతివారమని చెప్పుకొనుచున్నామో అట్టి మహాఋషులు, ఎవరి రక్తము మన నాళములందున్నదను చున్నామో ఆ గోత్రపురుషులు ఈ స్వల్పభేదముల గుఱించి వాదు లాడుకొనుచున్న తమ సంతానమును చూచి ఏవగించుకొను చున్నారు!

వివాదములను వదలివేయుటతో ఇతరములగు అభివృద్ధి కార్యములన్నియు తమంతటతామే చేకూరును. జీవరక్తము నిర్మలముగను పుష్టిగను నున్నయెడల ఏరోగ జీవాణువులును శరీరములో ప్రవేశింపజాలవు. మన జీవరక్తము ఆధ్యాత్మిక ధర్మమే. అది స్వేచ్ఛగా ప్రవహించు నంతకాలము, అది బలము గను శుద్ధముగను పుష్టిగను ఉన్నంతకాలము, సమస్తమును సక్ర మముగనే నడచును. ఆ రక్తము నిర్మలముగ ఉన్నయెడల, రాజ కీయబాధలు, సాంఘికదోషములు, ఇంక నితరములగు కొఱతలు,

దేశదారిద్ర్యము సైతము నివారణ కాగలదు! రోగజీవాణువును ఒక్కసారి తొలగించివేసినయెడల ఏ దోషముకూడ మన రక్తము లోనికి చొరబడ జాలదు. ఆధునిక వైద్యశాస్త్రమునుండి ఒక ఉదాహరణను తీసికొందము. రోగము అంకురించుటకు రెండు కారణములుండవలయునని తెలియ వచ్చుచున్నది. వెలుపలనుండి వచ్చి ప్రవేశించు విషజీవాణువు ఒకటి; రెండవది శరీరముయొక్క దుర్బలస్థితి. శరీరము విషజీవాణువులకు ప్రవేశమిచ్చుస్థితికి వచ్చు వఱకును, ఆజీవాణువులు లోపల ప్రవేశించి బలపడి వృద్ధిగాంచు టకు వీలగునంతగా శరీరపటుత్వము తగ్గి జవము ఉడుగు నంత వఱకు, ప్రపంచములోని ఏరోగజీవాణువునకుకూడ మనశరీరమున రోగము కల్పించుటకు సామర్థ్యములేదు. సత్యమునకు సూక్ష్మ జీవుల రూపమున లక్షలకొలది జీవాణువులు ప్రతివాని శరీరము నందును నిరంతరము వచ్చుచు పోవుచునుండును. కాని శరీరము పుష్టిగా నున్నంతకాలము వానిబాధ దానికి తెలియదు. శరీరము నిస్సారమైనప్పుడుమాత్రమే ఈ సూక్ష్మజీవులు దానిని ఆవహించి రోగకల్పన చేయును. జాతీయజీవనసందర్భమునను ఇటులేజరుగును. జాతీయశరీరము దుర్బలమైనప్పుడే, నానావిధములగు రోగజీవాణు వులు జాతియొక్క రాజకీయపరిస్థితులందో, సాంఘికావస్థయందో, విద్యావిధానమునందో, చిత్తవైఖరియందో, గుంపులు గుంపులుగ శరీరమందు జొచ్చి రోగకల్పనచేయును. దీనిని నివారించుటకు ఆ రోగమునకు మూల మెక్కడనో మనము కనుగొని, రక్తము లోని మాలిన్యములనన్నింటిని తొలగింపవలయును. వెలుపలినుండి వచ్చు విషములనన్నింటిని ఎదుర్కొని నెట్టివేయగల సమర్థత కలుగునటుల రక్తమును నిర్మలముగను, శరీరమును బలిష్ఠము గను చేసి, నరుని పుష్టిమంతునిగ చేయుటకొఱకే మన ప్రయత్న మంతయు సాగింపవలయును.

మనజవము, సత్వము, ఇంతేల మన జాతీయ జీవనమే మన మతమునందు కలదని తెలిసికొనియుంటిమి గదా! అటుల మన

చైతన్యము మతమునందు నెలకొనుట సరియైనదో కాదో, నిర్దుష్ట
మైనదో కాదో, తుదకు లాభకరమైనదో కాదో అను విషయ
మును నేను తర్కింపబోవుటలేదు. మేలునకో కీడునకో అది అటు
లున్నది. దానిని మీరు తప్పించుకొనలేరు. ఇప్పుడును ఇకముం
దును అది అట్లుండవలసినదే. మతమునందు నాకున్నంత విశ్వా
సము మీకున్నను లేకున్నను దానినిమీరు పోషింపవలసియున్నది.
దానిచే మీరు బంధింపబడి యున్నారు. దానిని వదలివేసికొం
టిరా, మీరు భిన్నభిన్నమైపోదురు. మనజాతీయ జీవనరహస్యము
అటులున్నది. మీరు దానిని బలపఱుపవలసియున్నది. పూర్వము
మీరు దానిని గుఱించి చాల శ్రద్ధవహించితిరి గనుకనే, దానిని
గుఱించి తక్కిన వానినెల్ల త్యాగముచేసితిరిగనుకనే, శతాబ్దముల
తరబడిగా మీకు ఎన్ని అవాంతరములు వచ్చినను ఎదిరించి నిలువ
గలిగితిరి. మీపూర్వులు సమస్తమును భరించిరి. మరణమునకు
సైతము తలయొగ్గిరి. కాని వారు తమ మతమును మాత్రము
సంరక్షించుకొనిరి. విదేశ దండయాత్రికులు దేవాలయములను
ఒకటితర్వాత ఒకటిగా పగుల గొట్టివేసిరి. ఆ ఆఘాతము గడచి
పోవగనే దేవాలయశిఖరములు మరల పైకి లేచుచునే వచ్చినవి.
దక్షిణభారతదేశమునందలి ఈ ప్రాచీనదేవాలయములును, గుజ
రాతునందలి సోమనాథము వంటి దేవాలయములును, విజ్ఞాన
సంపుటములను మీకొసగగలవు. అనేక పుస్తకరాసులకంటె ఇవి
మీ జాతీయచరిత్రయొక్క రహస్యములను ఎక్కువ స్పష్టముగ
మీకు తెలుపగలవు. నిరంతరము వందలకొలది దాడులకు లోనై
నేల కూలియు, ఆ శిథిలములనుండియే ఎప్పటివలె వందలకొలది
సార్లు జవసత్వములతో పునర్జీవితములై పైకి లేచుచు వచ్చిన
గుఱుతులు ఆ దేవళములమీద ఎటుల కాన్పించుచున్నవో
చూడుడు. మన జాతీయహృదయము ఆ రీతిగా నున్నది. మన
జాతీయజీవనస్రవంతి ఆ తీరున ప్రవహించుచున్నది. దానిని అను
సరించి పొండు. అది మిమ్మును మహాతేజోవంతులనుగ చేయ

గలదు. దానిని వదలుకొంటిరా, మీరు మరణింతురు. ఆ జీవనస్రవంతిని వదలి ఒక అడుగునడచిన తత్క్షణమే తత్ఫలితముగా మరణము చేకూరును! సర్వనాశనమే దాని ఫలితార్థమగును. ఇతర విషయములు అవసరములుకావని చెప్పుట నా అభిప్రాయముగాదు. రాజకీయాభివృద్ధిగాని, సాంఘికాభివృద్ధిగాని, అవసరముకాదని నేను చెప్ప పూనుకొనలేదు. కాని మన దేశమున మతము ప్రధానమనియు, తక్కినవన్నియు ఆనుషంగికములనియు, అనగా అప్రధానములనియు నా అభిప్రాయము. ఈ విషయమును మనస్సులో పెట్టుకొనుడని నేను మిమ్ము కోరుచున్నాను. భారతీయుని హృదయము మొట్టమొదట పారమార్థికమై ఆపిమ్మట ఏదియైనను కాగలదు. కాబట్టి మనము మతమును బలపఱుప వలయును. ఆపనిని ఎటులచేయుటయో నా ఉద్దేశ్యములను మీకు చెప్పబోవుచున్నాను. నేను అమెరికాపోవుటకై చెన్నపురి సముద్రతీరమును విడుచుటకు అనేకసంవత్సరములకు మునుపే అవి నా మనస్సులోనున్నవి. అసలు నేను అమెరికా ఇంగ్లాండులకు పోవుట కేవలము ఈ భావములను ప్రచారము చేయుటకొఱకే. అఖిలమతమహాసభను, ఇతరవిషయములను నేను సరకుగొనలేదు. అందువలన నాకొక అవకాశము మాత్రము దొరకినది. నిజముగా నాకు గల ఈభావములే నన్ను లోకమంతటను ద్రిమ్మరునటుల చేసినవి.

ఏ కొలదిమందికో వశమై, ఏమఠములందో ఏ అడవులయందో రహస్యముగ దాచబడి మూలబడి యున్నట్టియు, మన గ్రంథములందలి అమూల్యనిధు లనదగినట్టియు ఆధ్యాత్మిక జ్ఞానరత్నములను వెలికి తీసికొనివచ్చుటయే నా యుద్దేశ్యములలో మొట్టమొదటిది. ఆ జ్ఞానమును దాచిపట్టుకొనియున్నవారి చేతులనుండియే గాక, యింకను దుర్గమమగు సంస్కృతభాషనుండి కూడ దానిని పెకలించి లాగికొని రావలయును. శతాబ్దముల నుండి

కరుడుకట్టుకొనిపోయిన సంస్కృత శబ్దజాలమునందు అది భద్ర
పఱుపబడియే యున్నది. అయినను నేను ఒక్కమాటలో చెప్ప
దను. దాని నంతను ప్రజాసామాన్యమునకు అందుబాటులోనికి
తీసికొని రావలయును, ఈ యుత్కృష్టభావరాశిని బయటికి లాగి
కొని వచ్చి సంస్కృత భాష తెలిసినను తెలియకున్నను భారత
దేశములోని ప్రతివానికిని అది కొంగుబంగారమై యొప్పునటుల
చేసివేయవలయునని నాకోరిక. అటులచేయుటలో మన సంస్కృత
భాష, మన యీ దివ్యభాషయే గొప్ప అవరోధముగ నున్నది.
అవకాశమున్నంతలో మన జాతి యంతయు మంచి సంస్కృత
పండితులయిననే తప్ప ఈ కష్టము తొలగునటుల లేదు. నా జీవిత
కాలమంతయు ఈ భాషను పరిశోధించుచునే యుంటిని. అయినను
ప్రతి నూతనగ్రంథమును నాకు తెలియనిదిగనే చూపట్టుననిన
ఈ కష్టమటువంటిదో మీరు గ్రహింపగలరు. ఈ భాషనుపూర్తిగ
ఆకళించుటకు అవకాశము లేని సామాన్యప్రజలకు ఇంకను ఎంత
కష్టముగ నుండునో యూహింపుడు. కాబట్టి భావములను ప్రజల
భాషలోనే నేర్పుచుండవలయును. అయినను దానితోపాటు
సంస్కృతవిద్యనుకూడ నేర్పవలయును. ఏలయన సంస్కృత శబ్ద
ములయొక్క స్వరమునకే గొప్పగౌరవమును మహిమయు కలవు.
అది జాతికి బలమునొసగును. భారతదేశపు నిమ్నజాతులను
ఉద్ధరించుటకై రామానుజులు, చైతన్యులు, కబీరువంటి మహా
నీయులు చేసిన ప్రయత్నములు ఆ ప్రవక్తల జీవితకాలములోనే
యెటువంటి సత్ఫలమును కల్పింపగలిగెనో తెలిసికొనుడు. అయి
నను వారి తరువాతివారు ఏల విఫలులయిరో విశదపఱుప వలసి
యున్నది. ఈ మహాగురువులు గతించిపోయిన తరువాత దాదాపు
ఒకశతాబ్దము లోపలనే వారి బోధల సత్ఫలములు అడుగంటి
పోవుటకు గల కారణము తెలిసికొనవలసి యున్నది. దానిగుట్టు
ఇది, వారు నిమ్నజాతులను పైకి తీసికొని రావలయునని మాత్రమే
తలచిరి. అట్లే తెచ్చిరి. కాని ప్రజాసామాన్యమునందు సంస్కృత

భాషను వ్యాపింపజేయుటకు ఈ మహాపురుషులు తమ శక్తి సామర్థ్యములను వినియోగించియుండలేదు. సామాన్యజనులు సంస్కృత భాషను చదువకుండ ఆపివేయుటలో బుద్ధభగవానుడు సయితము పొరపాటు చేసియున్నాడు. ఆయన సత్వరము లభించు తాత్కాలిక ఫలితములను కోరి ఆనాటి ప్రజాసామాన్యభాషయగు పాలీ భాషలో తన బోధలను సాగించినాడు. అది మహాఘనకార్యమే. ఆయన ప్రజలభాషలో మాటాడినాడు. ప్రజలు ఆయన భావములను గ్రహించినారు. అది గొప్పవిషయమే. అటుల చేయుటచేత వాని భావములు త్వరితముగ వ్యాపించి చాలదూరమున నున్న వారికి సైతము చేరగలిగినవి. అయినను వానితోపాటు సంస్కృత భాషకూడ వ్యాపించి యుండవలసినది. జ్ఞానము లభించినది; కాని దానికి గణ్యత కొఱవడినది, సభ్యతయు కొఱవడినది. సభ్యతయే, అనగా నాగరకతయే ఒడుదుడుకులకు నిలిచి ఆగగలదు. కేవల విజ్ఞానరాశికి ఆ శక్తిలేదు. ప్రపంచములో జ్ఞానరాశిని మీరు వ్యాపింప చేయవచ్చును. కాని అందువలన ప్రపంచమునకు ఎక్కువ మేలుకలుగదు. రక్తములోనికి సంస్కృతిని ప్రవేశ పెట్ట వలసియున్నది. మహత్తరమైన జ్ఞానరాసులు కల జాతుల నెన్నిటినో యీకాలమున మన మెఱుగుదుము. వాని గతి యెట్లున్నది? సంస్కృతి వారి యందు కొఱ వడుటచేత వారు పులులవలెను క్రూరమూర్ఖజాతులవలెను ఉన్నారు. జ్ఞానమనునది పైపైని మెఱుగువంటిదే! ఈనాటి నాగరకతయును అటులే యున్నది. కొంచెము లోతుగ చూచిన యెడల వారి క్రూరబుద్ధి బయలు పడును. అట్టి విషయములు ఇప్పుడు తటస్థించు చున్నవి. ఇప్పుడు వచ్చిన అపాయమదియే. సామాన్యప్రజలకు వారి మాతృభాషలో బోధలుచేయుడు. వారికి ఉన్నత భావముల నేర్పుడు. వారికి విషయము గోచరమగును. కాని యింకొకటికూడ అత్యావశ్యకమగుచున్నది. వారికి సంస్కృతి నొసగలయును. అది వారి యందు కొఱవడియున్నంతవఱకు ప్రజాసామాన్యమును పైకి తీసి

కొనివచ్చిన లాభము సుస్థిరముగ నుండజాలదు. సంస్కృతభాషా ప్రభావముతో నొప్పు వేఱొకవర్ణమేర్పడి, త్వరలో తక్కినవా రందఱి కంటె ఆధిక్యమును సంపాదించి, వారిపైని రాజ్యముచేయ సాగును. నిమ్నజాతుల వారికి రక్షణము చేకూరు మార్గము, వారికి ఉన్నతదశ లభించు నుపాయము, సంస్కృతభాషను అభ్య సించుటలో నున్నది; పోరాటములవలనను, ఖండనరచనల వలనను, ఉత్తమ జాతులవారిని నిందించుట వలనను లాభములేదు. అందువలన మేలు చేకూరదు. పైగా వాగ్వాదములు పోరాట ములు పెచ్చుపెరుగును. అయ్యో, ఇదివఱకే భిన్న భిన్నముగ చీలిపోయిన జాతి యింకను ముక్కలు ముక్కలై పోవును. కుల ములను సమస్థితిలోనికి తీసికొనివచ్చుటకు సంస్కృతి అలవఱచు కొనుట ఒకటే ఉపాయము. ఉన్నతకులములవారిని బలవంతు లనుగా చేసిన ఆవిద్యను వీరును సంపాదింపవలయును. అది చేసి తీరా మీకోరిక సిద్ధింపగలదు.

ప్రత్యేకముగా ఈ చెన్నపట్టణమునకు సంబంధించిన ఒక విషయమునుగుఱించి ఈ సందర్భమున వివరింపగోరెదను. ఉత్తర భారతదేశమున గల ఆర్యులనెడు జాతికంటె వారికి భిన్నమగు ద్రావిడు లను వేఱొకజాతి దక్షిణభారతదేశమున గలదనియు, ఈ దక్షిణభారతదేశమున బ్రాహ్మణులు మాత్రమే ఉత్తరమునుండి వచ్చిన ఆర్యులనియు, ఈ ఇతర జనులందఱును ఈ బ్రాహ్మణుల కంటె భిన్నమగు కులములకును జాతికిని చెందిన వారనియు ఒక సిద్ధాంతము కలదు. ఈ సిద్ధాంతము పూర్తిగా నిరాధారమని నేను పలుకునెడల భాషాతత్త్వవేత్తలు నన్ను క్షమింతురుగాక!

ఉత్తరమునకును దక్షిణమునకును భాషాభేదముండుట మాత్రమే ఈ సిద్ధాంతమునకు ఆధారము! మఱి ఏ భేదమును నాకు కాన్పించుటలేదు. ఉత్తరదేశపు జనులము ఇక్కడ చాల మందిమి ఉన్నాముగదా! ఈ సభలోని ఉత్తరదేశమువారిని

దక్షిణదేశమువారిని వేఱుచేసి చూపుడని నా యారపియను మిత్రులను కోరుచున్నాను. ఆ భేదమెక్కడనున్నది? కొంచెము భాషాభేదమేగదా! కాని ఈ బ్రాహ్మణులు ఉత్తరమునుండి ఇక్కడకు వచ్చి చేరిరట. వీరు సంస్కృతభాషను మాట్లాడెడు జాతివారట! సరే, వారిప్పుడు ద్రావిడభాషను చేపట్టినారు, సంస్కృతభాషను మఱచిపోయినారు. తక్కిన కులములవారును ఎందువలన అదే రీతిని చేసియుండగూడదు? తక్కిన కులముల వారును ఒకరితర్వాత ఒకరుగా ఉత్తర భారతదేశమునుండి వచ్చి, ద్రావిడభాషను చేపట్టి, తమ సొంతభాషను ఏల మఱచియుండ గూడదు? ఈ భాషావాదము రెండు పక్షములకును అనుకూలింప గలదు. అట్టి పిచ్చి విషయములను మీరు విశ్వసింపబోకుడు. ద్రావిడజాతిప్రజలు కొందరిక్కడనుండి అదృశ్యులై పోయి యుండ వచ్చును. అట్లు నశింపగా మిగిలిన ఏకొలదిమందియో అడవుల లోను, అట్టి ఇతర స్థలములలోను నివసించుచుండియుందురు వారిభాష ఈ ఆర్యులచేత చేకొనబడెననుట సంభవమే యైయుండును. కాని వీరందఱును ఉత్తరమునుండి వచ్చిన ఆర్యులే! భారతదేశమంతటను ఉన్నది ఆర్యజాతియే తప్ప వేఱుకాదు.

ఇక శూద్రకులమువారు ఆదిమనివాసులనెడు అభిప్రాయము ఒకటి కలదు. ఆ ఆదిమనివాసులు ఎటువంటివారు? బానిసలట! చరిత్రయందు ఒకసారి జరిగిన సంఘటనలే మరల మరల జరుగు చుండునని చెప్పుదురు. అమెరికనులు, ఇంగ్లీషువారు, డచ్చివారు, పోర్చుగీసువారు పాపము ఆఫ్రికావారిని పట్టుకొని ప్రాణము లున్నంతవఱకు కష్టపెట్టి వారిచేత పనులు చేయించుకొనెడివారు. ఆ బానిసతనములో వారిబిడ్డలు సంకరజాతివారై పుట్టుచు వచ్చిరి. ఇటుల చాలకాలము జరిగినది. విచిత్రమగు ఈ నిదర్శనమును పట్టుకొని, మనస్సు ఎన్నో వేలయేండ్లు వెనుకకు పరువెత్తి, అదే

విషయము ఇక్కడను జరిగియుండునని ఊహలు సాగించుచున్నది. ఇక మన పురాతనవస్తుపరిశోధకుడు కాటుక కన్నులుగల ఆదిమ వాసులతో నిండియున్న ఇండియాదేశమును గుఱించి కలలుగాంచ మొదలుపెట్టినాడు. సరే, ఆర్యులనెడు ఈ దివ్యపురుషులు ఎక్కడి నుండి వచ్చిరి? భగవంతునికే ఎఱుక. కొందఱి అభిప్రాయములో వీరు మధ్యత్రివిష్టపము (తిబెట్టుదేశము) నుండి వచ్చియున్నారు! మధ్యఆసియాఖండమునుండి వచ్చిన వారని మఱికొందఱు అభిప్రాయపడుచున్నారు! ఆర్యులందఱును ఎఱ్ఱని వెండ్రుకలు గలవారని అభిప్రాయపడెడు స్వాభిమానులగు ఆంగ్లేయులును కలరు. వారి అభిప్రాయము ననుసరించి ఇతరులందఱును అనగా అనార్యులు నల్లని వెండ్రుకలు గలవారగుదురు. ఆ గ్రంథకర్త నల్లని వెండ్రుకలు గల పురుషుడైనచో ఆర్యులందఱును నల్లని వెండ్రుకలు గలవారే అయిపోదురు. ఇటీవల 'ఆర్యులు' అనువారు 'స్విస్సు' సరస్సుల తీరమున నివసించెడివారని ఋజువుచేయుటకు ప్రయత్నములు జరిగినవి. ఈ సిద్ధాంతములన్నియు, ఆ సరస్సులలో మునిగిపోయినను నాకు విచారముండదు. ఇక నరులందఱు ఉత్తరధ్రువమునుండి వచ్చినవారే యని మఱికొందఱు చెప్పుచున్నారు. ఈ ఆర్యులనెడు జాతివారి సంతానపు గొడవ ఈశ్వరుడే చూచుకొనుగాక! ఈ సిద్ధాంతముల సత్యమును నిరూపించుటకు తగిన ఒక్క మాటయేని మన గ్రంథములందు లేదు. ఆర్యులు భారతదేశము వెలుపలనుండి వచ్చిన వారని ఋజువు చేయుటకు తగిన మాట ఒక్కటియైనను లేదు. ఆఫ్ఘనుస్థానముకూడ ప్రాచీనభారతదేశములోనిదే. అంతటితో ఆ విషయము పోనిండు! ఇక శూద్రకులమువారందఱు అనార్యులనియు, వారు అధికసంఖ్యాకులుగ నుండిరనియు చెప్పెడు సిద్ధాంతము సైతము తర్కమునకు నిలువజాలదు; అసంగతమైన వాదన అది. కొలదిమంది ఆర్యులు ఇక్కడ నివాసముల నేర్పఱచుకొని, లక్షలకొలది బానిసలను తమ స్వాధీనమందు పెట్టుకొనియుండుట ఆ దినములలో సాధ్యమగు

విషయము కాదు. ఈ బానిసలు వారిని మ్రింగివేసి యుందురు. ఐదునిమిషములలో ఈ పదిమంది ఆర్యులను పచ్చడిక్రింద నంజుకొనియుండరా? సత్యయుగములో మొట్టమొదట ఒక బ్రాహ్మణ కులమే కలదనియు, కాలక్రమమున వృత్తిభేదమునుబట్టి వేఱు వేఱు వర్ణములుగా వారు చీలిపోయిరనియు చెప్పెడు సిద్ధాంతము మాత్రము మహాభారతమునందు కానవచ్చుచున్నది. ఇంతవఱకు లభించిన సిద్ధాంతములలో అది యొకటియే సత్యమును సమంజసమునై చూపట్టుచున్నది. మరల రానున్న సత్యయుగములో తక్కిన కులములన్నియు ఆ మొదటి స్థితికే మరలి పోగలవు.

కాబట్టి భారతదేశమందలి కులసమస్యాపరిష్కారము ఈ తీరున జరుగవలసినదియే. ఉన్నతకులములవారిని క్రిందికి లాగి భ్రష్టుల చేయుటయు, బ్రాహ్మణులను నలిపి నాశము చేయుటయు పొసగదు.

శ్రీ శంకరాచార్యులవారు తన గీతావ్యాఖ్యాన ప్రారంభమునందు బ్రాహ్మణత్వమును గుఱించియు బ్రాహ్మణత్వరక్షణమును గుఱించియు బోధించుటకై శ్రీకృష్ణుడు అవతరించినటుల కారణములను విశదముచేయు పట్టున భారతదేశమున బ్రాహ్మణత్వమే ఆదర్శమని తెలిపియున్నారు. అదియే గొప్ప పరమావధి. ఈ బ్రాహ్మణుడు, ఈ భగవద్భక్తుడు, ఈ బ్రహ్మవిదుడు, ఈ ఆదర్శమూర్తి, ఈ సిద్ధపురుషుడు స్థిరముగ నిలిచియుండవలసినవాడే! అతడు రూపుమాసి పోగూడదు. ఆ కులమువారియందు ఇప్పుడు ఎన్నిలోపములు కాన్పించుచున్నను, తక్కిన అన్నికులములవారి నుండి బయలుదేఱిన బ్రహ్మవేత్తలకంటె ఈ బ్రాహ్మణకులమునుండి ఎక్కువమందియే సత్యముగ వెలువడియుండిరి. ఈ ప్రఖ్యాతిని ఆ బ్రాహ్మణకులమువారికి ఒసగుటకు మన మందఱము సిద్ధముగ నుండి తీరవలయును. ఆ మాట సత్యము. వారియందు దీర్ఘఘనత కలదని తక్కిన కులముల వారందఱు అంగీకరింపవలయును.

మనము వారి లోపములను గుఱించి మాట్లాడుటకును ధైర్యము వహింపవలయును. పూర్తిగ ధైర్యము పూనవలసినదే అట్లయ్యును వారికి అర్హమగునట్టి గౌరవమును వారి కొసంగియే తీరవలయును. "ఎవరి కొసంగదగిన దానిని వారి కొసంగుడు" అనునట్టి ప్రాచీనపు ఇంగ్లీషు సామెతను జ్ఞప్తికి తెచ్చుకొనుడు. కాబట్టి మిత్రులారా! వివిధకులములవారు పోట్లాడుకొనుటవలన ప్రయోజనములేదు. దానివలన మేలేమియు చేకూరదు. అది మనయందు ఇంకను విభేదముల కల్పించును, మనల నింకను దుర్బలుల జేయును, మనల నింకను అధోగతిపాలు చేయును. ప్రత్యేకార్హతలుగల దినములు, ప్రత్యేకమర్యాదలుగల దినములు గడచిపోయినవి. మన భారతదేశమున ఇంకెన్నడును ఆ దినములు మరలి రావు. భారతదేశమునకు బ్రిటిషు పరిపాలనవలన చేకూరిన మేళ్లలో అది ఒకటి. ప్రత్యేకార్హతలను రూపుమాపుట అనెడు మహాప్రసాదమును మహమ్మదీయ పరిపాలనముగూడ మన కొసంగియున్నది. ఆ పరిపాలన అంతగా దుష్టమైనది గాదు. ఏదియు పూర్తిగా అనర్థమని చెప్పుటకు వీలులేదు, ఏదియు పూర్తిగా శుభప్రదమును కాజాలదు. మహమ్మదీయ విజయము భారతదేశమున అణగద్రొక్కబడియున్నవారికిని, బీదవారికిని, మోక్షప్రదాయిగా పరిణమించెను. అందువలననే మన ప్రజలలో ఐదవవంతు జనము మహమ్మదీయులైరి. అదియంతయు కత్తివలన సాధించిన కార్యము కాజాలదు. కత్తియు, అగ్గియు ఇంతకార్యము సాధించెనని తలంచుట మిక్కిలి వెఱ్ఱితనము. అయిదవవంతు అననేల? మీ చెన్నపురి వాసులలో సగముమంది, మీరు జాగ్రత్తపడరేని, క్రైస్తవులు కాగలరు. మలబారు దేశమున నాకు గోచరించిన దానికంటె పిచ్చివిషయము పూర్వము ఎన్నడైన ప్రపంచమున ఉండియుండెనా? పాపము మాలవాండ్రు ఉన్నతకులములవారు పోవు వీధులగుండా నడువనే కూడదట. కాని వారు ఏవేవో ఇంగ్లీషుపేరులను దడబిడగ చెప్పుకొనునెడల అంతయు

కుదుటబడుచున్నది; మహమ్మదీయ నామముల పెట్టుకొనినను సరిపోవుచున్నది. ఈ మలబారు ప్రజలందఱును వెఱ్ఱివాండ్రనియు, వారి గృహములు వెఱ్ఱివాండ్ర శరణాలయములనియు నిర్ణయించుట కంటె మీరేమి చేయగలరు? వీరు తమ చేష్టలను మరల్చుకొని, తిన్నని త్రోవకువచ్చిననే తప్ప భారతదేశమునందలి ప్రతి జాతివారును వీరిని చూచి అసహ్యపడవలసినదే. ఇటువంటి దౌర్జన్యమును, రాక్షసాచారమును అంగీకరించుట ఎంతసిగ్గుచేటు! ఈ మాలవారి బిడ్డలు తిండిలేక చచ్చుచున్నారు. కాని వారు వేఱొక మతమును స్వీకరించినంతనే వారికి చక్కగా భోజనము దొరకుచున్నది. కాన వివిధకులముల వారిమధ్య పోరాటము లుండుట ఎంత మాత్రమును తగదు.

పైవారిని క్రిందికి పడలాగుట వలన కాక క్రిందివారినిపైకి లేవదీయుట వలననే ఈ సమస్య పరిష్కారముకాగలదు. ఎవరికి శాస్త్రజ్ఞానము సున్నయో, ప్రాచీనులయభిప్రాయము తెలిసికొను శక్తి ఎవరియందు 'పూజ్యమో' అట్టివారు మీ కేమి చెప్పినను వారి వలన మీరేమి గ్రహించినను వ్యర్థమే. కాని మన గ్రంథములం దెల్లెడల కాన్పించు సాధనోపాయము నేను చెప్పినదే. ఇది వారు గ్రహించుటలేదు. బుద్ధిమంతులకు ఈ విషయము చక్కగనే గ్రాహ్యముకాగలదు; ఎంతయో పని చేయవచ్చును. సర్వమును ఆలోచన గలవారికి తేటతెల్లమే. అట్టివారు ప్రక్కకు తొలగి నిలచి, యుగయుగాంతరములనుండి మన జాతీయజీవనము ఎటుల అద్భుతముగా నడచుచున్నదో కనుపెట్టి చూచిన యెడల, ప్రాచీనములు, నూతనములు అగు గ్రంథములన్నిటియందును ఈసంగతిని వారు గుర్తింపగలుగుదురు. కార్యోపాయము ఏది? ఒకవైపు బ్రాహ్మణాదర్శమున్నది; రెండవవైపు చండాలస్వరూపమున్నది. మనము చేయవలసినపనియంతయు ఈ చండాలుడు బ్రాహ్మణాదర్శమును జేరునటుల చేయుటయే. మెట్టుమెట్టుగా, మెల్ల మెల్లగా,

వానికి యోగ్యతలను కల్పించుచుండవలయును, "శూద్రుడు వేద ములను వినుట తటస్థించినయెడల వాని చెవులలో సీసము కరగించి పోయవలయును. ఒక్క వేదవాక్యమును వాడు మదిని నిలిపిన యెడల, అనగా జ్ఞప్తి నుంచుకొనిన యెడల వానితలను చితుక కొట్టుడు. 'ఓ బ్రాహ్మణుడా!' అని వాడొక బ్రాహ్మణుని పిలువ సాహసించిన మాత్రమున, వాని నాలుకను తెగకోయుడు." అను నిట్టి భయంకరవాక్యములు గల పుస్తకములును కలవు. ఇది ఎంతయు రాక్షసకృత్యము! ప్రాచీనమూర్ఖత! సందేహములేదు. ఆమాట చెప్పకయే వెల్లడి యగుచున్నది. అయినను స్మృతి కర్తలను నిందింప బోకుడు. వారు కొన్ని శాఖాసంప్రదాయము లందు చూపట్టినయాచారములను ఉదాహరణ మాత్రముగ తెలిపి యున్నారు. ప్రాచీనులందు అప్పుడప్పుడు అటువంటి ఘోరరాక్షసులు తలజూపుచు వచ్చిరి. అన్నియుగములందును కొంచెము హెచ్చు తగ్గుగా, అటువంటి ఘోరపాతకులు అన్నిచోట్లను కాన్పించుట కలదు. కాలక్రమమున ఈ కాఠిన్యము కొంచెము తగ్గుచు వచ్చును. ఉదాహరణకు 'శూద్రులను బాధింపకుడు. అయినను వారికి ఉత్తమధర్మములను బోధింపకుడు' అనునిట్టి వాక్యములును కలవు. కాలక్రమమున ఇతర స్మృతులయందు, ముఖ్యముగా ఇప్పుడు ప్రామాణికములుగ నున్న స్మృతులయందు 'శూద్రులు బ్రాహ్మణులను అనుకరించినయెడల, వారి యాచార మర్యాదలను చేపట్టిన యెడల మంచిదియే. వారిని ప్రోత్సహింపుడు' అని యున్నది. ఆ పనియే ఇప్పుడు జరుగు చున్నది. ఆ ఉదంతముల వివరములను మీకు తెలుపుటకు నాకు వ్యవధి లేదు; వాని వివరమును మీరెట్లు గుర్తింపగలరో తెలుపుటకు గూడ అవకాశము చాలదు. యథార్థముగ జరుగు విషయము లను బట్టి, అన్నికులముల వారును మెల్ల మెల్లగా ఉత్తీర్ణులు కావలసి యున్నది. ఎన్ని వేలకులములు ఉన్నను కొందఱు బ్రాహ్మణులలోనికి చేరిపోవుచునే యున్నారు. వారటుల బ్రాహ్మ

ణులమని చెప్పుకొనకుండ ఏది అడ్డగలదు? ఈ కారణమున కఠిన మగు కులపద్ధతి నిర్మితమైయున్నది. ఐన నేమి? ఇక్కడపదేసి వేల జనులు గల కులములు కొన్ని కలవని అనుకొందము. వారి తలలు కూడి, అందఱును కలసి మేము బ్రాహ్మణులము అని ప్రకటించు కొనినచో వారిని ఎవరును అడ్డుపెట్టజాలరు. నా జీవితకాలములో, నేను స్వయముగా ఇట్టి సంఘటనములను చూచియున్నాను. ఏ కులమువారైనను బలవంతులై ఏకాభిప్రాయులు అయిన వెంటనే, 'వద్దు' అని అడ్డుచెప్పగల వాడుండడు. ఏమైన కానిండు, ప్రతికులమును ఇతరులనుండి వేఱుపడుచు వచ్చినది. అది ఇతరుల వ్యవహారములతో జోక్యము పెట్టుకొనుట లేదు. ఒక్కకులములోని అంతశ్శాఖలవారే మఱియొక శాఖవారితో జోక్యము కల్పించుకొనుటలేదు. శ్రీ శంకరాచార్యులు మొదలగు మహాయుగపురుషులు గొప్ప కులనిర్మాతలైరి. వారు కల్పన చేసిన విచిత్ర విషయముల నన్నిటిని నేనిప్పుడు మీకు చెప్పజాలను. నేను చెప్పుదానిని విని మీలో కొందఱు ఆగ్రహావేశులు కావచ్చును. నా సంచారములయందు నా అనుభవములనుబట్టి ఆ చిత్రములను పరిశీలించితిని. విస్మయము గొలుపు నిర్ణయము లును తేలినవి. ఒక్కొకప్పుడు మనవారు *బెలూచీలను గుంపులు గుంపులుగ తెచ్చి అందఱిని ఒక్కమ్మడిగా క్షత్రియులను చేసి వేసెడివారు. బెస్తవాండ్రను సమూహములు సమూహములుగ తెచ్చి బ్రాహ్మణులనుగా చేసివేసెడివారు. అట్టి వారందఱును ఋషులును మహాఋషులును అయిరి. వారిని సంస్మరించి నేడు మనము సాష్టాంగనమస్కారములు చేయుచున్నాము. అదే విధముగా మీరందఱును ఋషులు మహాఋషులు కావలయును. అదే రహస్యము.' కొంచెము హెచ్చు తగ్గుగా మనమెల్లరము ఋషులము కానున్నాము! 'ఋషి' అనగా నేమి? 'పవిత్రుడు'

* బెలూచిస్థాన్ ప్రజలు.

అన్నమాట. ముందు మీరు పవిత్రులు కండు. అధికారము అప్పుడే వచ్చును. ఊరక 'నేను ఋషిని, నేను ఋషిని' అని చెప్పుకొనుటవలన ప్రయోజనము లేదు. నీవు నిజముగా ఒక ఋషివి అయినప్పుడు ఇతరులు సహజముగా వచ్చి నీవు చెప్పినట్లు నడతురు. ఏదో ఒక విచిత్రశక్తి నీలోనుండి బయలుదేఱి వారు నీ వెంటబడునటుల చేయును. వారు నీ మాట వినునటుల చేయును. తమకు ఇష్టములేకపోయినను తమకు తెలియకుండనే వారు నీ సంకల్పములను నెఱవేర్చుచుందురు. 'ఋషిత్వము' అనగా అటువంటిది!

సరే, అల్పాంశములు చక్కబడుటకును కొన్ని తరములు గడవవలసి యుండును. అయినను ఈ వివాదములు ఎటుల తీరునో మీకు తెలుపుటకు సూచనగా చెప్పితిని. ముఖ్యముగా ఈదినములలో ఆ యా కులముల మధ్య వివాదములు జరుగుట నాకు విచారముగ నున్నది. ఇట్టివి అంతరింప వలయును. ఉభయ పక్షములకును ఇందువలన కలుగు లాభము లేదు; ముఖ్యముగా ఉన్నత కులజులగు బ్రాహ్మణుల కేమాత్రమును లాభములేదు. ప్రత్యేకార్హతలకును, ప్రత్యేకాధికారములకును దినములు గడచిపోయినవి. అభిజాతవర్గములోనివారు ప్రతివారును విధిగా తమ సమాధిని తామే త్రవ్వుకొన వలసి యున్నది. ఎంత త్వరితముగా వారు అటుల త్రవ్వుకొనిన అంత మంచిది. వారు ఆలస్యము చేసిన కొలదిని రోగము పెరిగి దేహము కుళ్ళిపోవును. దుర్భరమగు మరణముపాలు కావలసి వచ్చును. కాబట్టి తక్కిన మానవకోటి యొక్క మోక్షము కొఱకై పాటుపడుట భారతదేశ బ్రాహ్మణుని విధి. దానిని నిర్వహించు నంతకాలమును అతడు బ్రాహ్మణుడే. కాని ధనార్జనమునకై తిరుగులాడుచో అతడు బ్రాహ్మణుడుకాడు. మఱియు దానమునకును అర్హుడయిన నిజమైన బ్రాహ్మణునకే మీరు దానము లీయవలయును. అదిస్వర్గమునకు దారిజూపును.

కాని అనర్హుడగువానికి ఒసగబడినదానము ఒక్కొకప్పుడు నరక మునకే త్రోవ చూపునని మన శాస్త్రములు పలుకుచున్నవి. దానిని గుఱించి మీరు జాగరూకతతో నుండవలయును. ఎవనికి లౌకిక వ్యాపారముండదో అతడు మాత్రమే బ్రాహ్మణుడు. లౌకిక వ్యాపారము బ్రాహ్మణుని కొఱకేర్పడినది కాదు. అది ఇతరకుల ములవారి పని. తాము తెలిసికొనినదానిని ఇతరులకు బోధించుచు అనేక శతాబ్దములనుండి తాము కూర్చిపెట్టుకొనిన సభ్యతను పంచి యిచ్చుచు, భారత ప్రజను ఉద్ధరించుటకు పూర్తిగ శ్రమ పడి పని చేయుడని నేను బ్రాహ్మణులను ప్రార్థించు చున్నాను. సత్యముగ బ్రాహ్మణత్వము ఎయ్యదియో జ్ఞప్తియందు ఉంచు కొనుట భారతదేశపు బ్రాహ్మణుని ధర్మము. మనువుచెప్పినటుల, ధర్మకోశాగారము తన స్వాధీన మందుండుటవలననే, బ్రాహ్మణునికి ఈ అర్హతలు ఈ గౌరవములు అన్నియు ఒసగబడుచున్నవి. అతడు ఆ కోశాగారమును తెఱచి అందలి ధనరాసులను ప్రపంచ మునకు పంచి ఇయ్యవలయును. భారతీయ జాతులకు బోధలు సలిపిన ప్రథమగురుడు బ్రాహ్మణుడనుట సత్యము. జీవితము యొక్క పరమ 'గమ్యార్థమును సాధించుటకొఱకు సమస్తము త్యాగముచేయవలయు నను భావము ఇతరులకు స్ఫురించుటకు పూర్వమే బ్రాహ్మణుడు సర్వపరిత్యాగము చేయుటలో ప్రప్రథము డయ్యెననుట తథ్యము. అతడు ఇతరకులముల వారికంటె ముందు నడచియుండుట అతని దోషముకాదు. ఇతరకులముల వారును అటులే తెలివిగలవారై బ్రాహ్మణులు చేసినటుల తామును ఏల చేసి యుండలేదు? తాము తీరి కూర్చుండి సోమరులై బ్రాహ్మణు లను ఏల పరువిడనిచ్చిరి? కాని ముందుగ లాభములు సంపాదిం చుట ఒక విషయము; దుర్వినియోగము చేయుటకొఱకు వానిని పేర్చి పెట్టుకొనుట మఱొక విషయము. దుర్వినియోగము చేయ బడెడు అధికారము రాక్షసలక్షణము. అధికారమనునది సద్విని యోగము కొఱకే ఏర్పడినది. యుగాంతరములనుండి సంపాది

తమై, ధర్మకర్తగా బ్రాహ్మణుడు తనయొద్ద నుంచుకొనిన ఈ విజ్ఞానమును అతడు మన సామాన్యజనమునకు నేడు దానము చేయవలసియున్నది. అతడటుల ఇదివఱకే దానిని ప్రజలకు దానముచేసి యుండని కారణముననే మహమ్మదీయులదండయాత్ర సంభవించుటకు అవకాశము కల్గినది. ఈ మహానిధిని ప్రజలకై అతడు మొదటి నుండియు తెఱవక యుండిన కారణముననే, వేయిసంవత్సరముల నుండి భారతదేశము మీదికి రా దలపెట్టిన ప్రతివాని పాదము క్రిందను పడి మనము నలుగుచున్నాము. ఆ కారణము వలననే మనము భ్రష్టులమై పోయినాము. కాబట్టి మన అందఱి పెద్దలగు మహాఋషులు ప్రోగుచేసి యుంచిన ఈ అద్భుత ధనరాసులు దాచబడియున్న కోశములను బాగుగ తెఱచి వేయుట మన ప్రప్రథమ విధివిహిత కృత్యముగ నున్నది. ఆ ధన రాసులను వెలికితీసికొని రండు. వానిని ప్రతివానికిని ప్రసాదింపుడు. అటుల చేయువారిలో బ్రాహ్మణుడు ప్రథముడుగానుండ వలయును. త్రాచుపాము తాను కఱచిన మనుజునిగాయమునుండి విషమును తాను తిరిగి పీల్చుకొనిన యెడల ఆరోగి మరణింపడని ఒక మూఢ విశ్వాసము వంగదేశమున గలదు. మంచిది. అట్లే బ్రాహ్మణుడు తనవిషమును తానే పీల్చి వేయ వలసియున్నది. బ్రాహ్మణేతర కులములవారికి నేను చెప్పునదేమనగా 'ఓపికపట్టుడు; తొందఱ పడకుడు; అవకాశము దొఱకినప్పుడెల్ల బ్రాహ్మణునితో పోరునకు దిగకుడు. ఏల యందురా? నేను తెలిపియున్నటుల మీ లోపమువలననే మీరు బాధల ననుభవించుచున్నారు. ఆదిని ఆధ్యాత్మికజీవనమును, సంస్కృతపాండిత్యమును అశ్రద్ధ చేయుడని మీకెవరు చెప్పిరి? ఇంతకాలమును మీరేమి చేయుచుంటిరి? మీరు శ్రద్ధావిహీనులై యుండనేల? మీ కంటె ఎక్కువ మెదడును, బలమును, సత్వమును, జవమును ఇంకొకరికి ఉండుట చూచి ఇప్పుడు కినిసి (చిందులు త్రొక్కనేల? వార్తాపత్రికలలో వ్యర్థ మగు వివాదములను విమర్శనములను సాగించి మీ శక్తులను

వ్యర్థము చేసికొనుటకు మారుగా, పాపమునకు పాల్పడి స్వగృహములో పోరును తెచ్చిపెట్టి కొట్లాటలు సాగించుటకుమాఱుగా, బ్రాహ్మణుడు సంపాదించిన సభ్యతను మీరు సాధించుటలో మీ సామర్థ్యము నంతను వినియోగింపుడు. మీకు కార్యసిద్ధి యగును. మీరేల సంస్కృతపండితులు కాఁగూడదు? సంస్కృత విద్యను భారతదేశములోని సకలవర్ణముల వారికిని చెప్పించుటకై, లక్షల కొలది ధనమును మీరేల ఖర్చు పెట్టరు? ఇదియే సమస్య. ఈపని చేసిన తత్‌క్షణమే మీరు బ్రాహ్మణులతో సమానులు కాఁగలరు. భారతదేశములోని అధికారరహస్య మిందే యున్నది.

సంస్కృతవిద్యయు, ఉత్తమార్హతయు భారతదేశమున పెనవేసికొని నడచుచున్నవి. మీరు వానిని సంపాదించినతోడనే మిమ్ము ఎదిరించి మాటాడుటకు ఎవ్వరును సాహసింపరు. అది యొకటియే కీలకము. దానిని చేజిక్కించుకొనుడు. ప్రాచీనాద్వైతులు వర్ణించినటుల, ఈ విశ్వమంతయు స్వకల్పిత సమ్మోహనస్థితిలో పడియున్నది. ఇచ్ఛ శక్తిస్వరూపము. సమర్థమగు ఇచ్ఛాశక్తిగల పురుషుడు తనచుట్టును ఒక జ్యోతిర్మండలమును సృష్టిచేసికొనుచున్నాడనవచ్చును. అట్టివాడు ఇతరజనులను తన మనస్సునందు గల స్పందనదశకు తెచ్చి, ఊగులాడింపగలుగును. అట్టి మహనీయ పురుషులు పుట్టుకొని వత్తురు. ఆహా! ఈ భావము ఎట్టి మహత్త్వము గలది! ఒక్కొక మహాత్ముడు పుట్టునప్పుడు వాని మహత్త్వమును వాని సంకల్పములను మనలోనికి చొప్పించును. మన అందఱిలోను ఆ సంకల్పములే ప్రసరించును. అప్పుడు మనము శక్తిమంతుల మగుదుము. సంఘములు బలవంతములగుటకు సాధన మేమి? సంఘీకరణము! కేవల సంఘీకరణము జడమయమని అనెదరేమో. ఉదాహరణగ చూచునెడల నాలుగుకోట్ల ఆంగ్లేయులు ఈ దేశమందలి ముప్పదికోట్ల జనమును పరిపాలింప గలుగుట సాధ్యమయ్యెగదా! ఎందువలన? మనస్తత్వ

శాస్త్రము తెలుపగల వివరణము ఏమి? ఈ నాలుగుకోట్లమందియు తమ ఇచ్ఛలను సమీకరింతురు. అనగా ఏకము చేయుదురు. ఆ శక్తి అనంతమగును. ముప్పదికోట్లమందిగ నున్న మీలో ప్రతి వానికిని గల ఒక్కొక్క యిచ్ఛ వేలు వేలై ఉండును. కాబట్టి భవిష్యత్కాలమున మహత్తర భారతదేశమును నిర్మించుటయందు గల రహస్యమంతయు సంఘీభావమునందు కలదు; శక్తి సమీకరణమునందు కలదు; ఇచ్ఛలయొక్క అనగా మన సంకల్పముల యొక్క పరస్పర సహకారమునందు కలదు.

ఇదిగో అధర్వవేదసంహితయందలి శ్లోకములలో నొకటి నా స్ఫురణకు వచ్చుచున్నది. దాని భావ మిది: 'మీరందఱును ఒక్క మనస్సుతో నుండుడు; మీరందఱును ఒక్క సంకల్పముతో నుండుడు. ఏల యన, ప్రాచీనకాలమున దేవతలు ఏకమనస్కులై హవిస్సులను పొందగలిగిరి. దేవతలు ఏకమనస్కులు అగుట చేతనే మానవులచే పూజింపబడుచున్నారు.' ఏకమనస్కతయే సంఘమునకు కీలకము. ద్రావిడులని, ఆర్యులని అల్పభేదములను పాటించి వివాదములు, పోరాటములు సాగించిన కొలదిని, బ్రాహ్మణులని బ్రాహ్మణేతరులని ఇట్టి భేదములతో కీచులాడు కొలదిని, భావిభారతభాగ్యమును నిర్మింపగల శక్తిసామర్థ్యముల సమీకరణము మీకు దూరమై పోవును. నా మాట గుర్తుపెట్టు కొనుడు. భావిభారతభాగ్యోదయము పూర్తిగ ఈ సమీకరణము పైని ఆధారపడియున్నది. ఇచ్ఛాశక్తియొక్క సమీకరణమే అనగా సమ్మేళనమే—సంకల్పముల నన్నిటిని ఒక్క కేంద్రమునకు తెచ్చుటయే—ఆ కీలక మనవచ్చును. ప్రతి చీనావాడును తన త్రోవను తాను సంకల్పము చేయును. కొద్దిమందియైన జపాను వారందఱును ఒకేమార్గమున సంకల్పింతురు. ఫలితార్థము మీకు తెలిసినదే. ప్రపంచచరిత్రయందు ఎల్లెడలి జరుగుచున్న దిదియే. సంఘీభవించి జీవించు స్వల్పజాతులు ప్రతివిషయము

నను, అధికసంఖ్యాకములై, విడియుండు జాతులను సదా జయించి పాలించుచుండుట మనము చూచుచున్నాము. అది స్వభావ సిద్ధమగు విషయమే. ఏలయన సంఘీభావముతో మెలగు అల్ప జాతులవారు తమ భావములను కేంద్రీకరించుట, అనగా సమీకరణము చేయుట, లేక ఒకటిగా చేయుట చాల తేలికయైనపని. అందువలన వారు త్వరలో వికాసమును పొందుచున్నారు. ఒక జాతి పెద్దదైన కొలదిని ఈ సమీకరణము దుస్సాధ్యమగుచుండును. చెల్లాచెదరయిన గుంపువలె వీరు సులభముగా సంఘీభవింప జాలరు. ఎట్లో ఇట్టి వైషమ్యము లన్నియు తుదముట్టి తీర వలయును.

మనలో ఇంకొక లోపమును కలదు. నారీరత్నములారా! నన్ను క్షమింతురుగాక. శతాబ్దముల కొలది బానిసతనములో పడియుండుటచేత అందఱమును స్త్రీలవలె మారిపోతిమి. ఈ దేశములోగాని, మఱి ఏ దేశములోగాని, ముగ్గురు స్త్రీలను ఒకచోట చేర్చి వారు పోట్లాడకుండ నుంచగలుగుట చాల అరుదు. యూరపు దేశములో స్త్రీలు పెద్ద పెద్ద సంఘములను స్థాపించి స్త్రీల సామర్థ్యమును గుఱించి గొప్ప ఆడంబర ప్రకటనములను కావింతురు! కాని వారు త్వరలోనే తమలో తాము కీచులాడు కొందురు. ఇంతలో ఎవడో పురుషుడు వచ్చి వారి అందఱిమీదను అధికారము చేయసాగును. ప్రపంచమంతటను ఇట్లొక పురుషుడు తమ్ము పాలింపవలసినటుల స్త్రీలే కోరుచుందురు. మనము వారి వలె నున్నాము. మనము స్త్రీలమైపోయినాము. ఒక స్త్రీవచ్చి స్త్రీలమీద నాయకత్వము వహించునెడల తత్క్షణమే వారందఱును ఆమెను విమర్శింప పూనుదురు. ఆమెను ముక్కలు ముక్కలుగ చీల్చి చెండాడ జూతురు. తుదకు ఆమె నొక మూల కూలబడ జేతురు. ఒక మగవాడు వచ్చి కొంచెము కాఠిన్యముచూపి అప్పుడప్పుడు నాలుగు తిట్లు తిట్టుచున్నయెడల, అంతయు చక్క-

బడును. వారిట్టి ఇంద్రజాలమునకు అలవాటుపడియున్నారు. ఈ ప్రపంచమంతయు అటువంటి ఇంద్రజాలికులతోడను, మంత్రగాండ్రతోడను నిండియున్నది. మన దేశీయులలో నొకడు నిలువబడి ఏదో విధముగ ప్రముఖుడగుటకు ప్రయత్నించు నెడల, మన మందఱముకూడి వానిని అణగద్రొక్క ప్రయత్నింతుము. కాని ఒక్క విదేశీయుడు వచ్చి మనలను తన్న జూచిన అంతయు చక్కబడును. మనము అట్టి దానికి అలవాటుపడియున్నాము. మనకటువంటిది అభ్యాసమై పోయెనా లేదా? మఱి బానిసలు గొప్ప నాయకులు కాగలరా? కాబట్టి బానిస లగుట మానుకొనుడు. రానున్న ఏబదిసంవత్సరములవఱకు, ఈ మన దివ్యభారతమాతయే మన అధిష్ఠాన దైవతముగ నుండుగాక! అంతవఱకును ఇతర వ్యర్థ దేవతలు మన మనస్సులనుండి అదృశ్యమై పోవుదురు గాక. ఈమె ఒక్క తెయే జాగ్రదవస్థలో నుండవలసిన ప్రధానదేవత! మూర్తీభవించిన మన జాతియొక్క స్వరూపము! సర్వత్ర ఆమె చేతులే, సర్వత్ర ఆమె పాదములే, సర్వత్ర ఆమె కర్ణములే, ఆమెయే సర్వమును ఆవేశించియుండుగాక. తక్కిన దేవతల నందఱిని నిద్ర పోనిండు. వ్యర్థపు దేవతల వెంటబడి, మనచుట్టును ఆవరించి వెలుగు దైవతమును, ఈ విరాణ్మూర్తిని పూజింపజాలకున్నామే! ఈ దేవతను మనము అర్చించిన యెడల తక్కిన దేవతల నందఱను పూజించుటకు అర్హుల మగుదుము. ఒక అరమైలు ప్రాకులాడుచు పోవుటకు శక్తిని సంపాదించుటకు పూర్వమే, హనుమానుని లీల మహాసముద్రమును లంఘింప జూచుటయా! అది పొసగునది కాదు. ప్రతివాడును యోగి కావలయునట! ప్రతివాడును తపస్సునకు పూనుటయా! అది పొసగదు. దినమంతయు కర్మకాండతో సంసారమున మునిగియుండి, సాయంకాలము కాగానే ఒకచోట కూర్చుండి రేచకపూరకముల జేయబూనుటయా! అది అంతటి సులభకార్యమా! నీవు ముక్కుతో మూడుసార్లు బుస్సుమని గాలిని పీల్చి వదలిన మాత్రమున ఋషులు

ఆకాశమునుండి దిగి వత్తురనుకొందువా? ఇదేమి వేళాకోళమా? ఇది అంతయు వెట్టిపని! మనకు కావలసినది చిత్తశుద్ధి! హృదయ పవిత్రత! అది యెట్లు లభించును? పూజలలోని కెల్ల ప్రప్రథమ పూజ విరాట్పూజయే. అనగా మన చుట్టు నున్న సర్వభూతముల అర్చనమే. ఆ పూజను చేయుడు. పూజ అను సంస్కృత పదమునకు సరియైన ఆంగ్లపదము 'వర్షిప్' అనవచ్చును. మఱే ఆంగ్ల పదమును సరిపోజాలదు. వీరందఱును, నరులు పశువులు సహా, మనకు దేవతలు! మనము పూజింపవలసిన ప్రధాన దేవతలు మన దేశప్రజలే! మనము పరస్పరము అసూయాగ్రస్తులమై ఒకరితో నొకరము పోరాడుకొనుటకు మాఱుగా వీరిని పూజింపవలసి యున్నది. మహాఘోరకర్మముపాలై మనము ఇదుమలు గుడువ వలసి వచ్చినది. అట్లయ్యును కటకటా, మనము కన్నులు తెఱచుట లేదే!

సరే ఈ విషయము చాల పెద్దదిగా నున్నది. ఎక్కడ ఆగుటయో నాకు తెలియుట లేదు. కాని చెన్నపట్టణములో నిర్వహింప దలచిన కార్యములను గుఱించి కొలది వాక్యములు మీకు తెలిపి నా ఉపన్యాసమును ముగింతును. ఈ జాతియొక్క పారమార్థిక వ్యావహారిక విద్యలను మన వశములో నుంచుకొనవలయును. అనగా మీకు అర్థమైనదా? స్వప్నములలోగూడ మీరు దానిని గుఱించియే చింతించుచుండవలయును; దానిని గుఱించియే ముచ్చటలాడుకొనుచుండవలయును; దానిని గుఱించియే జిజ్ఞాస చేయవలయును; దానిని గుఱించియే పాటుపడవలయును. అంతవఱకును ఈ జాతికి మోక్షము లేదు. ఇప్పుడు మీరు నేర్చుచున్న విద్యయందు కొన్ని మంచిలక్షణము లున్నవి. కాని మహానర్థములు పెక్కు కలవు. అవి దానివలన వచ్చు మేళ్లను త్రొక్కగలుగునంత గొప్పవిగా నున్నవి. మొట్టమొదట —ఇది పురుషత్వమును నిర్మించు విద్యయే కాదు. ఇది పూర్తిగా

నిషేధరూపమగు విద్యగా మాత్రమే యున్నది. నిషేధరూపవిద్య, లేక దోషనిరూపణము చేయుశిక్షణ, మరణముకంటె నికృష్టమైనది! బిడ్డ బడికి పోవును. అక్కడ అతడు నేర్చుకొను మొదటి విషయము తన తండ్రి బుద్ధిహీనుడని! రెండవ విషయము తన తాత వెఱ్ఱివాడని! మూడవ విషయము తన గురువులందఱు మోసగాండ్రని! నాల్గవ విషయము తన పవిత్ర గ్రంథములన్నియు అబద్ధములని! ఇంతియే. ఆ బిడ్డలకు పదునారేండ్ల ఈడు వచ్చునప్పటికి అతడు ఎముకలులేని, త్రాణలేని, పెద్ద నిషేధముల మూర్తిగా తయారగుచున్నాడు. తత్ఫలితార్థము ఏమన, ఇట్టి విద్య ఏబది సంవత్సరములనుండి నేర్పబడుచున్నను ఈ మూడు రాజధానులయందును సహజశక్తిగల పురుషు నొక్కనినైనను అది సృజింపజాలకపోవుటయే! స్వకల్పనాశక్తిగల పురుషులు ఎక్కడనైన చూపట్టిరేని, అట్టివారు ఇతరదేశములయందు విద్య నేర్చి వచ్చినవారే గాని ఈ దేశమందు తయారైనవారు కారు. లేదా వారు ప్రాచీన విశ్వవిద్యాలయములకడ కేగి మఱొకసారి తమ మూఢ విశ్వాసములను కడిగివేసికొనినవారై యుందురు. విద్య యనగా, మీ మెదడులోనికి చొప్పింపబడిన వార్తారాశి కాదు. అది అక్కడ పడి ముఱిగిపోవును. కాని జీవితకాలమంతయు వేచి యున్నను జీర్ణము కాదు. మనకు కావలసినది చైతన్యప్రదములును, పురుషనిర్మాణకుశలములును, శీలనిర్మాణసమర్థములును అగు భావములను జీర్ణముచేసికొనగల ప్రబోధమే. మీరు ఐదు భావములను జీర్ణముచేసికొని వానిని మీ జీవనమునందును మీ శీలమునందును సారూప్యము పొందించుకొంటిరేని, ఒక గ్రంథకోశమునంతను కంఠపాఠముగా వల్లెవేసినవానికంటె మీకు హెచ్చు విద్య వచ్చినట్లే సుమీ! "యథా ఖర శ్చన్దనభారవాహీ భారస్య వేత్తా నతు చందనస్య — మంచి గంధపుచెక్కలను మోయు గాడిదకు, ఆ మంచిగంధపు చెక్కలయొక్క బరువే తెలియును గాని విలువ తెలియదు". అట్లే విద్య అనగా

వార్తారాశిగా భావించిన యెడల గ్రంథకోశములే ప్రపంచము లోని కెల్ల ఉత్తమసిద్ధమూర్తులును, విషయసర్వస్వగ్రంథములే మహాఋషులును అయియుండును గదా! కావున మన దేశము యొక్క పారమార్థిక వ్యావహారిక విద్య యావత్తును మన చేతు లలో పెట్టుకొని, జాతీయ పద్ధతుల ననుసరించి జాతీయములగు సదుపాయములతో సాధ్యమైనంతవఱకు నడుపవలసి యున్నది.

ఇది చాల పెద్ద ప్రణాళికయే; చాల పెద్ద ఉద్యమమే; సందియము లేదు. ఇది ఎన్నడైనను ఆచరణలోనికి వచ్చునో రాదో నాకు తెలియదు. కాని మనము పనిని ప్రారంభించి తీరవలయును. సరే, ఎట్లు? ఉదాహరణకు చెన్నపట్టణమును తీసికొనుడు. హిందువులకు మతము ప్రప్రథమ విషయము గాన, మన కొక దేవాలయము కావలసి యుండును. అప్పుడు అన్ని సంప్రదాయములవారును దానిని గుఱించి తగవులాడుదురు గదా అని మీరు అడుగవచ్చును. కాని మన మా దేవాలయమును సంప్రదాయపక్షపాతములేనిదానినిగా చేయుదము. 'ఓం' అనెడు విగ్రహమును మాత్రము అందుంచుదము. ఇది ఏ సంప్రదాయము వారైనను ఉత్కృష్ట విగ్రహముగా అంగీకరించునదే గదా. 'ఓంకారము' అనెడు విగ్రహము పనికిరాదనెడు సంప్రదాయ మేదైన ఇక్కడ ఉండునెడల దానికి హిందూసంప్రదాయమని చెప్పుకొను అర్హతయే లేదు. తమ సంప్రదాయమునకు అను కూలించు తీరున హిందూమతమునకు వ్యాఖ్యానము చేయు అధికారము అందఱికిని కలదు. కాని మన కందఱకును సామా న్యాలయము ఒకటి ఉండి తీరవలయును. నీ ఇష్టము వచ్చిన విగ్రహములను, ప్రతీకములను నీవు ఇతరస్థలములయందు పెట్టు కొనవచ్చును. కాని ఇక్కడ మాత్రము నీ అభిప్రాయమును అంగీకరింపని వారితో నీవు వాదులాడ తగదు. ఇక్కడ మన యందు గల వేర్వేఱు సాంప్రదాయికశాఖలన్నిటికి సమానముగా

ప్రామాణిక విషయములను బోధింపవలయును. మఱియు ఆయా సంప్రదాయములవారికి, ఇతర సంప్రదాయములవారితో తగవులకు దిగరాదనెడు నియమమునకు లోబడి తమ తమ సిద్ధాంతములను బోధించుటకు స్వేచ్ఛ యుండవలయును. మీరు చెప్పగోరునది చెప్పుడు. ప్రపంచము దానిని వినగోరుచున్నది. కాని ఇతరులను గుఱించి మీ అభిప్రాయ మేమియో వినుటకు ప్రపంచమునకు వ్యవధి లేదు. దానిని మీ లోపలనే యుంచుకొనవచ్చును.

రెండవ విషయమేమన : ఈ దేవాలయమునకు అనుబంధముగా బోధకులను సిద్ధము చేసెడు విద్యాలయము ఒకటి ఉండవలయును. ఆ బోధకులు పోయి మనప్రజలకు పారమార్థిక ధర్మమును లౌకికధర్మమును కూడ బోధించుచుండవలయును. వారు ఈ రెండుపనులను చేయవలయును. మనము ఇదివఱకే ఇంటింటికి పోయి మత ధర్మవ్యాపనము చేయుచున్నాము. దానితోపాటు లౌకికధర్మప్రచారము కూడ చేయుదుము గాక. ఈపని తేలికగా జరుగును. ఆపిమ్మట ఈ బోధకులవలనను, ఈ గురువులవలనను, మనపని వ్యాప్తి కాంచగలదు. భారత దేశమందంతటను వ్యాపించునటుల ఇటువంటి దేవాలయములను నిర్మింప గలుగుదుము. ఇదియే నా కార్యవిధానము. ఇది బ్రహ్మాండ మంతటిదిగా కనుపింపవచ్చును. కాని ఇది మిక్కిలి అవసరము. డబ్బు ఎక్కడ నుండి వచ్చును అని మీరు అడుగుదురు. డబ్బు అవసరమేలేదు. డబ్బు లెక్క లోనిది కాదు. నాజీవితములో కడచిన పన్నెండు సంవత్సరముల నుండి ఎప్పటి కప్పుడు నాకు తిండి ఎక్కడ నుండి రాగలదో నాకు తెలియనే తెలియదు. అయినను నాకవసరమగు డబ్బును సమస్తమును వచ్చియేతీరును. ఏలయన, అవి నా బానిసలు! నేను వానికి బానిసనుకాను. డబ్బుగాని మఱిఏదికాని రావలసినదే. వచ్చియే తీరును. అదియే నా ప్రతిజ్ఞ. తగిన పురుషులేరి? అది నాసమస్య. చెన్నపురి యువకులారా, నాఆశలు

మీయందున్నవి! మీరు మీజాతియొక్క పిలుపును ఆలకింతురా? మీరునామాటలనునమ్ముటకు సాహసింతురేని మీలో ప్రతివానికిని భావికాలమున మహాదశ ప్రాప్తించి తీరును. నాకు చిన్నప్పుడెట్టి విశ్వాస ముండెడిదో అట్టి విశ్వాసము, నేనిప్పుడు ఎటువంటి విశ్వాసమును అనుష్ఠించు చున్నానో అటువంటి విశ్వాసము, మహత్తర విశ్వాసము మీలో కలదా? మీలో ప్రతివానియందును అటువంటి ఆత్మవిశ్వాసము ప్రకాశింపవలెను. ఆ సనాతన మహాశక్తి ప్రతిజీవి యందును నెలకొనియే యున్నది. మీరు ఈ భారత దేశము నంతను సంపూర్ణముగా ఉద్ధరింప గలరు. ఓహో! ప్రపంచమునగల ప్రతి దేశమునకును మనము పోనున్నాము! ప్రపంచములోని ప్రతిజాతిని ఉద్ధరించుటకు ఉపకరించు అనేకశక్తులతో కలిసి మనబోధలు అచిరకాలములో పనిచేయనున్నవి. భారత దేశమునందును పరదేశమందునుగూడ, ప్రతిజాతియొక్క జీవనమునందును మన ప్రభావము ప్రవేశింపవలసియున్నది. ఈ కార్యసిద్ధిని సాధించుట కొఱకై మనము పనిచేయవలయును. సరే, అందుకొఱకు యువకులు నాకు కావలయును. "తరుణ వయస్కులును, బలయుతులును, ఆరోగ్యవంతులును, సూక్ష్మబుద్ధిశాలులును మాత్రమే బ్రహ్మమును పడయగల్గుదు"రని వేదములు ఘోషించుచున్నవి. మీ భావిభాగ్యోదయమును నిశ్చయించుకొనుటకు ఇదియే తరుణము. యౌవనముయొక్క జవసత్వములు మీకుండగనే మీరు నిశ్చయించు కొనవలయును. మీరువృద్ధులై విసిగి వేసారి పోయినప్పుడు అటుల చేయజాలరు. యౌవనపు జవమును నవోజ్జ్వల తేజమును ఉండగనే మీ నిర్ణయమును తేల్చుకొనవలయును! కార్యధురీణులు కండు! ఇదియే తరుణము. ఎవరును తాకని, ఎవరును వాసనచూడని, నవకోమలపుష్పములనే పరమేశ్వరుని పాదములచెంత అర్పణము చేయవలయును. అట్టి వానినే ఆ పరమేశ్వరుడు స్వీకరించును. కాబట్టి ఇప్పుడే మేల్కొనుడు. జీవితము అత్యల్పము. న్యాయవాదులగుట కంటెను, తగవు

లాడుకొనుట కంటెను, అట్టి వాని కొఱకై ఆరాటపడుటకంటెను, సాధింపగల ఘనతరకార్యములు గలవు. మీజాతి శ్రేయస్సు కొఱకును, మానవకోటి నుద్ధరించుట కొఱకును, చేయు ఈ త్యాగము మహోత్తమమైనది! ఈ జీవితములో ఏమున్నది? మీరు హిందువులు గదా! జీవుడు సనాతనుడు అనెడు సహజ విశ్వాసము మీలో కలదు. ఒక్కొక్కప్పుడు తరుణవయస్కులు నాకడకు వచ్చి నాస్తికవాదమును గుఱించి మాట్లాడ మొదలిడుదురు. హైందవుడు ఎన్నడేని నాస్తికుడు కాగలడని నేను నమ్మజాలను. అతడు యూరపియనులు వ్రాసిన పుస్తకములను ఎన్నిటి నేని చదువును గాక; తాను జడవాదినని అనుకొను గాక; అది తాత్కాలిక వికారమే! ఆరీతి యూహ మీరక్తమునందు లేదు. మీతత్త్వమునందు లేనిదానిని మీరు నమ్మజాలరు. అట్టి మీ ప్రయత్నము వ్యర్థప్రయాసయే! అట్టి విషయమును గుఱించి ప్రయత్నము చేయకుడు. నా చిన్నతనములో ఒకప్పుడు అట్టి యత్నము చేసియుంటిని. కాని అది పొసగునది కాదు. ఆయువు స్వల్పము. కాని ఆత్మ అవినాశి, నిత్యమైనది. మరణమో ధ్రువము. కాబట్టి పరమోత్తమాదర్శమునకు పూనుకొని మన యావజ్జీవమును అర్పణముచేయుదుము గాక. ఇదియే మన నిశ్చితభావమై వెలయుగాక. "పరిత్రాణాయ సాధూనాం... సంభవామి యుగే యుగే—నాభక్తులను సాధువులను, రక్షించుట కొఱకు ప్రతియుగమునందును అవతరించు చుందును" అని పలికి నటుల మన శాస్త్రము లెవనిని చెప్పుచున్నవో అట్టి శ్రీకృష్ణ భగవానుడు మనల నాశీర్వదించి మనకు ఆశయసిద్ధి గలుగునటుల నడపు గాక!



# దానము

శ్రీ స్వాములవారు చెన్నపురిలో నున్నకాలమున ఒకానొక ధార్మికసంస్థ యగు చెన్నపురి అన్నదాన సమాజము యొక్క వార్షిక సభయందు అధ్యక్షత వహించిరి. ఒక ఉపన్యాసకుడు శ్రీవారికంటె ముందుగ మాట్లాడుచు బ్రాహ్మణులకు ఇతర కులములవారి కంటె ప్రత్యేకముగా దానము లిచ్చుట తగదని చెప్పెను. ఆ పలుకులను శ్రీ స్వామివారు విమర్శించిరి. వాని సలహా వలన లాభము, నష్టము కూడ వాటిల్ల గలదని వారు తెలిపిరి. నిజమునకు మన జాతియందున్న సంస్కృతి అంతయు బ్రాహ్మణులలోనే నెలకొని యున్నది. మన జాతియందలి జిజ్ఞాసువులుకూడ వారే. వారు జిజ్ఞాసువులగుటకు అవకాశమును కల్పించిన జీవనోపాధిని వారికి లభింపకుండ చేసిన యెడల మన జాతియే మొత్తముమీద నష్టపడును. ఇతరజాతుల యందలి న్యాయస్మృతి సంబంధమగు దానవిధానముతో మన భారతదేశమందలి విచక్షణ శూన్యమగు దాన విధానమును పోల్చి శ్రీవారు ఇటుల చెప్పిరి. "ఇతర దేశీయు లవలంబించు దారిద్ర్యనివారణ పద్ధతుల ఫలితమును గమనింపుడు. మన దేశములోని సోమరిపోతు, వానికి సంతోషముగా ఇచ్చిన దానినే సంతోషముతో పుచ్చుకొని సంతుష్టుడై ప్రశాంతముగ జీవించును. పశ్చిమ దేశము లందలి సోమరిపోతన్ననో, నరునికి తిండిమీది కంటె స్వాతంత్ర్యముమీది ప్రేమ హెచ్చు అనెడు సూత్రము ననుసరించి, దరిద్ర శరణాలయమునకు పో నిష్టపడడు. దోపిడిగాడై సంఘమునకు శత్రువగును. దండన నీతి, రక్షకపద్ధతి (పోలీసు), కారాగారములు (జైలు), ఇట్టివ్యవస్థలకు అతడు ఎంతయో అవసరము కల్పించినాడు. హిందూదేశములో విచక్షణ శూన్యమగు దానపద్ధతి కలదు, నిజమే. కాని యిక్కడి సన్న్యాసులు నిష్కపట పురుషులు కాకున్నను, తమ సద్గ్రంథములలోని విషయమును ఏ కొంచెమో తప్పక నేర్చి తీర

వలయును. లేకున్న ఒక పిడచ అన్నము కూడ వారికి పుట్టదు. పాశ్చాత్యజాతులందు విచక్షణయుతమగు దానపద్ధతి గలదు, నిజమే. కాని దానివలన దారిద్ర్య నివారణ శాసన మనెడు అతి వ్యయ కారణమగు సంప్రదాయ మవసరమైనది. ఇంత చేసినను తుదకు వారు ముష్టివారిని అపరాధులనుగా మార్చిన వారైరి!''



కలకత్తాలో శ్రీ స్వాములవారి కర్పించిన స్వాగతపత్రము. దానికి శ్రీ స్వాముల వారొసగిన ప్రత్యుత్తరము :

శ్రీ వివేకానందస్వాములవారు కలకత్తాకు చేరినప్పుడు ప్రజలు అత్యుత్సాహముతో 'శ్రీవారి కెదురేగి గౌరవించిరి. శ్రీవారు చక్కగ అలంకరింప బడిన ఆ నగరవీథుల గుండా పోవునప్పుడు శ్రీవారి నొక్కసారి కనులార చూచిన చాలునని ఆతురపడు ఆబాలగోపాలముతో మార్గమంతయు క్రిక్కిరిసి పోయెను. వారము దినములు గడచిన పిమ్మట శోభాబజారులోని కీ. శే. రాజా రాధాకాంత దేవబహదూరు వారి నివాసమునందు శ్రీవారికి బహిరంగ స్వాగతసత్కారము కావింపబడినది. అప్పుడు రాజా వినయ కృష్ణదేవ బహదూరుగారు అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు కొలది పరచయవాక్కులు పలికినపిమ్మట, ఈ క్రింది స్వాగతపత్రమును చదివి ఒక రజతపేటిక యందు అమర్చి శ్రీవారి కర్పించిరి.

## శ్రీమత్ వివేకానందస్వాములవారికి

ప్రియసోదరా!

మీ జన్మభూమికి మీరు తిరిగి విజయముచేయు ఈ సమయమున, కలకత్తా నగరమునకును ఇంక వంగదేశమందలి ఇతర ప్రాంతములకును చెందిన హిందువులమగు మేము కృతజ్ఞతతోడను,

గర్వముతోడను ప్రేమపూర్వకముగా స్వాగత మర్పించు చున్నాము. ప్రపంచమునందలి అనేక ప్రదేశములందు మీరు కావించిన ఘనకార్యమువలనను, మీ ఉత్తమాదర్శమువలనను, మన మతమునకును మన దేశమునకును అందునను ముఖ్యముగా మన రాష్ట్రమునకును మహాగౌరవము కలిగినది.

1893-వ సంవత్సరములో చికాగోనగరమున విశ్వప్రదర్శన సందర్భమున జరిగిన అఖిలమతమహాసభయందు మన ఆర్యుల మతధర్మములను మీరు విశదపఱచి యుంటిరి. మీరు కావించిన వివరణముయొక్క సారాంశము శ్రోతలలో అత్యధికసంఖ్యాకులకు దివ్యాదేశమైనది! శైలివలననేమి, భావపటుత్వమువలననేమి, ఆ సందేశ సరళి వారిని తన్మయుల జేసివేసినది. కొందఱు సంశయాత్ములై విని యుండవచ్చును; కొందఱు దానిని విమర్శించి యుండవచ్చును. కాని దానివలన విజ్ఞానవంతులగు అమెరికనులలో చాలమంది మతభావముల విషయమున పూర్తిగా మాఱిపోయిరి. వారి హృదయాకాశమున నూతనతేజస్సు ఉదయించినది. తమ సహజశ్రద్ధతోడను, సత్యపరాయణతతోడను, మీ సందేశము యొక్క పూర్ణఫలమును పడయుటకు వారు నిశ్చయించుకొనిరి. దానితో మీ ప్రబోధావకాశములు విశాలతరములైనవి; మీ కార్యక్రమము వ్యాప్తి చెందినది. అనేక రాష్ట్రములనుండి అనేక నగరములనుండి వచ్చు ఆహ్వానములను మీరు అంగీకరింప వలసి వచ్చినది. అనేక ప్రశ్నలకు సమాధానముల నిచ్చుచు, అనేక సంశయములను తీర్చుచు, అనేకసమస్యలను పరిష్కరించుచు వచ్చితిరి. ఈ కార్యమంతయు మీరు మహత్తరశక్తితోడను, సామర్థ్యముతోడను, నిష్కాపట్యముతోడను నిర్వహించితిరి. అందువలన శాశ్వతఫలములు చేకూరినవి. మీ బోధ అమెరికను కామన్వెల్తునందలి అనేక విద్వత్సంఘముల మనస్సున గాఢముగ నాటి, వారి జిజ్ఞాసను పరిశోధనాభిలాషను పురికొల్పినది. అనేక

సందర్భములందు వారి మతభావములు స్పష్టమగు పరివర్తనమును చెందినవి. భారతీయుల ఆదర్శములయెడ వారికి గౌరవము అతిశయించినది. మతములను పరస్పరమును పోల్చి పరిశీలించుటకును, ఆధ్యాత్మికధర్మములను పరిశోధించుటకును పెక్కు క్లబ్బులు, సమాజములు నెలకొల్పబడి సత్వరముగా వృద్ధిగాంచినవి. ఆ దూర పాశ్చాత్య భూమియందు మీరు కావించిన కృషికి అవియెల్ల సాక్షులు. లండను నగరమున వేదాంతతత్త్వశాస్త్రబోధకై ఏర్పడిన ఒక కళాశాలను నిజమునకు మీరే నిర్మించితిరనవచ్చును. అందు మీరు పరంపరగా ఒసగిన ఉపన్యాసములను వినుటకై ఎందరో ఆతురపడుచు వచ్చి విని విశేషముగా మిమ్ము అభినందించియుండిరి. వానిమహిమ, ఆ ఉపన్యాస భవనముల ఆవరణమును దాటి చాల దూరము వ్యాపించినది. మీరు లండను నగరమును విడిచివచ్చు తరుణమున, ఆ నగరమునందలి వేదాంతశాస్త్రపాఠకులు మీకు సమర్పించిన వినతిపత్రమునందు చూపిన ప్రగాఢకృతజ్ఞతవలన వారి మనస్సులందు మీ బోధ ఎట్టి ప్రేమను ఎట్టి గౌరవమును ఉదయింపజేసెనో తెల్లమగుచున్నది.

ఆర్యుల ధర్మసూత్రములతో మీకు గల గాఢతర పరిచయమును, వాగ్రూపమునను గ్రంథరచనామూలమునను భావప్రకటనము చేయుటలో మీకుగల సామర్థ్యమును ముఖ్యముగా మీ శీల మహిమయును, మతబోధకులుగా మీరు సాధించిన విజయమునకు కారణములు. మీ ఉపన్యాసములు, మీ వ్యాసములు మీ గ్రంథములు, ఆధ్యాత్మికముగను, సాహిత్యవిషయకముగను అద్భుత ప్రభావము గలవి. అవి యిక మహాఫలముల నొసంగకుండు టెట్లు? ఐనను నిరాడంబరమును, నిష్కపటమును, త్యాగపూరితమును అగు మీ శీలము, మీ జీవితాదర్శము, మీ వినయసంపత్తి, మీ భక్తి, మీ దీక్షాపరాయణత, ఆ మహిమకు, వాక్కుతో వర్ణింపజాలని విధమున వన్నె తెచ్చినవి.

మన మతములోని సూక్ష్మధర్మములను ఉపదేశించి మీరు కావించిన లోకోపకారమునకు మా కృతజ్ఞతను తెలుపు నీ సమయమున, మీ గురుదేవుడగు శ్రీరామకృష్ణపరమహంసలవారిని సంస్మరించి సభక్తికముగ సంభావించుచున్నారము. మిమ్ము మాకు ప్రసాదించినదియు వారే. మీలోగల దివ్యతేజమును, అసాధారణమగు అద్భుత సూక్ష్మదృష్టితో ముందుగనే కనిపట్టి వారు మీభవ్యజీవితవిశేషమునుగూర్చి జోస్యము చెప్పియున్నారు. ఓహో! అది యిప్పుడు సాక్షాత్కారమునకు వచ్చుచుండు టెంతయు ఆనందదాయకముగ నున్నది. భగవంతుడు మీకు ప్రసాదించిన ఆత్మదృష్టిని, దివ్యశక్తిని ప్రకాశమునకు తెచ్చిన మహనీయుడు ఆయనయే. ఆయన పవిత్రామోదముకొఱకై నిరీక్షించుచున్న మీ సంకల్పములకును, ఆశయములకును, క్రమగతిని ప్రసాదించి అదృశ్యజగమున మీ పరిశోధనలందు తోడుగ నిలిచి దారి చూపినదియు ఆ మహాపురుషుడే. భావిసంతానమునకు ఆయన యిడిన దివ్యప్రసాదమే మీరుగా మూర్తీభవించినది!

మహాత్మా, సుస్థిరముగ మీరు ఏర్పఱచుకొనిన దివ్యమార్గమందు ధీరతతో సాగిపొండు! మీరు జయింపవలసియున్న ప్రపంచ మొకటి గలదు. అజ్ఞానులకును, సంశయాత్ములకును, బుద్ధిపూర్వకముగ కన్నులు మూసికొనువారికిని, భారతీయుల మతధర్మమును విప్పి చెప్పి దాని గౌరవమును మీరు నిలువబెట్టవలసియున్నది. మా అభిమానగౌరవముల జాడగొను తెఱగున ధీరులరై పనిచేయ మొదలిడితిరి. మీ రిప్పటికే సంపాదించిన విజయములకు అనేక దేశములు సాక్ష్యము పలుకుచున్నవి. కాని చేయవలసినది ఇంకను చాల గలదు. మన మాతృదేశమగు ఈ భారతభూమి మీపైని ఆశలు పెట్టుకొనియున్నది. భారతీయుల మతధర్మమును భారతీయులలోనే అనేకులకు విప్పి చెప్పి బోధింపవలసియున్నది. అట్టి గురుతరకార్యమునకు మీరు సంసిద్ధతతో

పూనిక వహింపుడు. మీయందును, మన ఉద్యమముయొక్క అద్భుతమహిమమునందును మాకు సంపూర్ణవిశ్వాసముకలదు. మన జాతీయమతము భౌతికవిజయమును సాధింపజూచుటలేదు. దాని గమ్యస్థానము పారమార్థికము. జడమతుల కన్నులకు కానరాక, జిజ్ఞాసువులకు ప్రత్యక్షమగు సత్యతత్త్వమే మనమతముయొక్క దివ్యాయుధము. ప్రపంచమును, అవసరమగుపట్ల భారతీయులను సైతము, తమఆంతరంగికనేత్రమును తెఱచి, ఇంద్రియానుభవములకు అతీతముగ నిలిచి, పవిత్రశాస్త్రగ్రంథములను విద్యుక్తమార్గమున పఠించి, పరమార్థమును ప్రత్యక్షము చేసికొని, మానవులై పుట్టిన తమ స్థితిని, తమ పరమావధిని తెలిసికొనుడని మీరు హెచ్చరింతురుగాక. అట్టి ప్రబోధము చేయుటకును, అట్టి హెచ్చరికను కల్పించుటకును మీకంటె అర్హులు ఇతరులు లేరు. భగవన్నిర్ణితమై చూపట్టు ఈ మీ మహోద్యమమున హృదయపూర్వకముగా సానుభూతిని చూపుటకును, కార్యసాధనయందు నిష్కపటముగ తోడ్పడుటకును సిద్ధముగ నుంటిమని ప్రియసోదరా, ఇటుల మనవి చేసికొనుచున్నాము.

ఇట్లు,
తమ అనుంగు మిత్రులు, భక్తులు.

శ్రీస్వాములవారు ఈక్రింది తెఱగున ప్రత్యుత్తరమొసగిరి.

నరుడు వ్యక్తిత్వమును బాసి సమష్టితత్త్వమున కలిసిపోవ కాంక్షించుచుండును. అతడు సర్వసంగపరిత్యాగము గావించి పరుగిడిపోవ జూచును. శారీరక సంబంధముల నన్నిటిని ఒక్కమ్మడిగా త్రెంపివేయ జూచును. గతమును మఱచి, తానొక మానవుడ నను మాటను సైతము విస్మరించుటకు ప్రయత్నించును. అట్లయ్యును వాని హృదయాంతరాళమున, ఒక సూక్ష్మధ్వని, ఒక విచిత్ర తంత్రీస్పందనము, ఒక రహస్యవాణి, పాశ్చాత్య

ప్రపంచమందుగాని, ప్రాచ్యప్రపంచమందు గాని 'స్వస్థానము స్వర్గతుల్య'మని ఘోషించుచుండును. సామ్రాజ్యప్రధాన నగర వాసులారా! నేనిప్పుడు మీ ఎదుట నిలుచునది ఒక సన్న్యాసిగా కాదు; మత బోధకుడనుగా కూడ కాదు. మున్ను మీతోడ ముచ్చటలాడుచు తిరుగులాడిన కలకత్తా బాలుడుగనే మీ యెదుటికి వచ్చుచున్నాను. ఓహో, నా చిన్ననాటివలెనే స్వేచ్ఛగా ఈ నగరవీథులందు ధూళిలో కూర్చుండి నాయన్నలారా, నామనస్సున నున్న దానిని మీకు విప్పిచెప్పుట నా కెంతయు ఆనందకరము. మీరు 'సోదరా' అనెడు సాటిలేని ప్రేమలొల్కు పదముతో నన్ను సంబోధించినందులకు హృదయపూర్వక వందనములను మీకు అర్పించు చున్నాడను. ఓహో, నిజముగా నేను మీ సోదరుడనే గదా! అట్లే మీరును నాకు సోదరులు! నేను ఇక్కడికి బయలు దేరివచ్చునపుడు ఆంగ్లమిత్రుడొకడు "స్వామీ! సర్వ భోగసమన్వితమును, మహాతేజోవిరాజితమును, అసదృశశక్తిమంతమును అగు ఈ పాశ్చాత్యప్రపంచమున గడించిన నాలుగేండ్ల అనుభవముతో మీ మాతృదేశమున కిప్పుడు మరలుట మీ కెట్లున్నది?" అని ప్రశ్నించినాడు. "నే నక్కడనుండి బయలుదేరి రాక పూర్వము నేను భారతదేశమును ప్రేమించి యుంటిని. ఇప్పుడు ఆ భారతదేశపు ధూళిసైతము పరమపావనమై నాకు గోచరించుచున్నది. అచ్చటి గాలియే నాకు పరమపవిత్రమై చూపట్టుచున్నది! ఆ దేశమిప్పుడు ప్రియతమ యాత్రాస్థానముగా, తీర్థ క్షేత్రముగా కాన్పించుచున్నది!" అని ప్రత్యుత్తర మిచ్చితిని. కలకత్తా నగరవాసులారా! నా అనుంగు సోదరులారా! మీరు నాయెడల చూపుచున్న ప్రేమకు తగినరీతిని నాకృతజ్ఞతను మాటలతో తెలుపజాలను. ఇంతేల, మీయెడల నా కృతజ్ఞతను తెలుప యత్నింపనే కూడదేమో! ఏలయన మీరు నా సోదరులు గదా! మీరలు విధిగా నిర్వహింప దగిన సోదరధర్మమును నిర్వహించుచున్నారు. ఔను, ఇది భారతీయులకు సహజమౌ ధర్మమే గదా!

ఇటువంటి కుటుంబబాంధవములు, ఇటువంటి బంధుత్వములు, ఇటు వంటి అనురాగము, మన మాతృదేశపు సరిహద్దులను దాటినచో మఱెక్కడను కాన రావు.

అఖిలమత మహాసభ బ్రహ్మాండకార్య మనుటకు సందియము లేదు. ఆ సభను ఏర్పాటుచేసిన పెద్ద మనుష్యులను ఈ దేశ మందలి వివిధనగరములనుండి మనము అభినందించియుంటిమి. వారు మనయెడల చూపిన ఆదరణనుబట్టి మనకు వందనీయులే; కాని ఆ మహామతసభయొక్క చరిత్రను ఒకింత మీకు తెల్పెదను వినుడు. వారు ఒక గుఱ్ఱమును తెచ్చి దానిపై నెక్కి స్వారిచేయ గాంక్షించిరి. క్రైస్తవేతర మూఢజనులను చేర్చి ఒక విధమగు ప్రదర్శనము కావించుటకు ఉబలాటపడిరి. కాని వారు కోరుకొనినది ఒకటి, జరిగినది మఱియొకటి! అటులకాక తప్పినదికాదు. వారిలో చాలమంది ఆదరభావము గలవారే; అందుకై వారికి కావలసి నన్ని వందనములను మనము సమర్పించి యున్నాము.

అమెరికాలోని నాకర్తవ్యము అఖిలమతమహాసభకు సంబం ధించినదే కాదు. అది ఆనుషంగికము, అనగా నా మార్గములో సంఘటిల్లిన ఒకానొక విషయము. అది నాకొక అవకాశమును కల్పించినది. అందులకు ఆ సర్వమతపరిషత్ సభ్యులయెడ మనము సదా కృతజ్ఞులమై యుందుము గాక! కాని నిజముగా మనము వందనముల నర్పించ వలసినది ఆ అమెరికను మహాజాతికి! తక్కిన చోట్లకంటె అక్కడ సోదరభావము పూర్ణవికాసము పొంది యున్నది. మీరు రైలుబండిలో ఒక అమెరికాదేశీయుని ఐదు నిమిషములపాటు కలిసికొనుడు, చాలును. అతడు మీ స్నేహి తుడై పోవును. మరుక్షణమే అతిథిగా తనఇంటికి రమ్మని ఆహ్వా నించును. అక్కడ దాపఱికములేక తన జీవితసరళిని సర్వమును నీకెఱుక పఱచును. అమెరికను జాతియొక్క శీలలక్షణము ఆ తీరున నున్నది. అది మనకు చాల హృద్యముగనుండును. వారు

నాయెడ చూపిన ప్రేమను నేను వర్ణించి చెప్పజాలను. ఎంతటి అద్భుతాదరముతో వారు నన్ను చూచిరో తెలుపుటకు నాకు కొన్ని సంవత్సరముల కాలము పట్టును. కాబట్టి ఆ మహాజాతికి మనము వందనముల నర్పింప వలసియున్నది. నాకంటె ఇంగ్లీషువారి యెడల జాతినిబట్టి ఎక్కువ ద్వేషముతోనిండినహృదయముతో మఱెవరును ఆంగ్లభూమియందు అడుగిడి యుండరు. ఇదుగో ఈ యున్నతాసనమున కూర్చుండిన ఆంగ్లమిత్రులు ఆవిషయమునుగూర్చి సాక్ష్యము చెప్పగలరు. నేను వారిమధ్య నివసించిన కొలది, ఆంగ్లజాతీయజీవన మనెడు ఆ మహాయంత్రము ఎటుల పనిచేయునో నేను చూచిన కొలది, నేను వారితో కలిసిపోయిన కొలది, ఆ జాతియొక్క హృదయనాడి ఎచ్చట గలదో నేను కనుగొనగలిగితిని. అప్పుడు నేను వారిని మిక్కిలిగా ప్రేమించితిని. సోదరులారా! ఇక్కడనున్న మీలో ఎవరును నాకంటె ఎక్కువగా ఇప్పుడు ఇంగ్లీషువారిని ప్రేమింపజాల రనుకొందును. అక్కడ ఏమి జరుగుచున్నదో మీరు చూడవలయును. మీరు వారితో కలసిమెలసి యుండవలయును. తత్త్వశాస్త్రము, ముఖ్యముగా మన జాతీయ వేదాంత తత్త్వశాస్త్రము, కొద్దిలో చెప్పునటుల, మన సర్వదుఃఖములకు మన పరితాపములకు కారణము, ఏకైక కారణము, అజ్ఞానమే! ఇక్కడ మనకును ఆంగ్లేయులకును మధ్య పొసగు కష్టముల కన్నిటికిని ముఖ్యముగా అజ్ఞానమే కారణమని గ్రహింపవలసి యున్నది. మనమువారి నెఱుగము; వారు మనలను ఎఱుగ కున్నారు.

దురదృష్టవశమున పారమార్థికత, ఇంతేల నీతివర్తనము కూడ, లౌకికసంపదతో ముడివేయబడి యుండునని పాశ్చాత్యుల భావము. కాబట్టి ఆంగ్లేయుడు గాని లేక ఇతర పాశ్చాత్యదేశీయుడు గాని మనదేశమున అడుగిడిన తత్క్షణమే దారిద్ర్యముతోడను, దుఃఖముతోడను నిండిన దేశము వాని కంటబడును.

అంతట ఇక్కడ మతమనునదియే లేదనియు, నీతివర్తనముసైతము ఉండజాలదనియు అతడు వెంటనే నిశ్చయించుకొనును. సత్యముగా వాని అనుభవము అట్టిదిగనే యుండును. యూరపునందు, దుర్భర మగు శీతోష్ణస్థితిని బట్టియు, ఇంకను అనేకములగు ఇతరకారణ ములచేతను, దారిద్ర్యము, దుష్టవర్తనము పెనవేసికొనిపోయినవి. భారతదేశమున అటుల లేదు. అందుకు మారుగా ఈ దేశమున ఒకపురుషుడు దరిద్రుడైన కొలది నీతివర్తనమున మేటియగు చుండుట నా అనుభవములో నున్నది. ఈ విషయము గ్రహించు టకు చాలకాలము పట్టును. విదేశ ప్రజలలో ఎందఱు దీనిని అర్థము చేసికొనుటకు, భారతదేశ జాతీయజీవనము యొక్క ఈ రహస్యమును గుర్తెఱుగుటకు ఓపిక పట్టగలరు? ఈ జాతిని పరిశీ లించి అర్థము చేసికొనుటకై అంతటి ఓపిక పూనగలవారు చాల కొలదిమందియే యుందురు. ఇక్కడ మాత్రమే, ఈ జాతియందు మాత్రమే, దారిద్ర్యమనగా దోషవర్తనము కాదు. దారిద్ర్య మనగా పాపజీవనముకాదు. దారిద్ర్యమనగా దుష్టవర్తనము కాకుండుటయే గాక, ఆ దారిద్ర్యమే దివ్యలక్షణమై పోయినది. దరిద్రుడు ధరించు కౌపీనమును దేశములోని పరమశ్రేష్ఠుడు ధరించు దివ్యాంబరముగా నెంచెడు ఏకైకజాతి ఇక్కడ మాత్రమేకలదు. ఇదేవిధముగా మనముకూడ పాశ్చాత్యుల సాంఘికాచారములను ఓపికతో పరిశీలింప వలసియున్నది. మనము వానిని గుఱించి వేగి రముగా పిచ్చి పిచ్చి అభిప్రాయములను వెలువరించుట తగదు. వానిని పరిశీలించుటకు తగిన ఓపిక మీ కున్న యెడల, వారిలో స్త్రీపురుషులు కలిసి మెలగుట, భిన్నభిన్నములగు వారి ఆచార మర్యాదలు అన్నియు సార్థకములే యని మీకు తెలియవచ్చును. వాని అన్నిటికిని ఉత్తమపక్షము గలదు. ఐనను వారి ఆచార మర్యాదలను మనము అవలంబింపవలయుననిగాని, మన వానిని వారు అవలంబింప వలయునని గాని, నా అభిప్రాయము కాదు. జాతియొక్క ఆచారమర్యాదలు ఆజాతిలో శతాబ్దముల తరబడి

క్రమముగా పెరిగి వచ్చియుండును. ప్రతిదానికిని వెనుక గొప్ప ప్రయోజనముండును. కాబట్టి వారు మన ఆచార మర్యాదలను గాని, మనము వారి ఆచార మర్యాదలను గాని హేళనచేయ దగదు.

ఈ సభ ఎదుట ఇంకొక విషయము తెలుపగోరుచున్నాను. ఇంగ్లాండులో నేను చేసినపని అమెరికాలో చేసినదానికంటె నాకు ఎక్కువ తృప్తికరముగా నున్నది. ఇతరజాతులవారి మేధాశక్తి కంటె ఆంగ్లేయుని మేధాశక్తి అధికమైనది. ధైర్యశాలియు, సాహసికుడును, దీక్షాపరుడును అగు ఆంగ్లేయుని మెదడులో ఒక సంకల్పము ఏదేని ఒకసారి నాటుకొనిపోయిన యెడల అది యెన్నడును జారిపోదు. అత్యంతము కార్యపరతంత్రమగు ఆ జాతియొక్క సమర్థత దానిని పెంపొందజేసి సత్వరఫలమొసంగునటుల చేయును. ఇతర దేశములలో అట్లుకాదు. అట్టి తీవ్రకార్యపరతయు, సునిశితమగు జాతీయ చైతన్యమును మఱెక్కడను కాన్పింపదు. వారియందు ఊహారచన తక్కువగను కార్యధురీణత హెచ్చుగను నున్నవి. ఆంగ్లపురుషుని హృదయముయొక్క జీవధార యెవరికి గోచరము కాగలదు? ఎంతటి భావనాశక్తి కలదో, ఎంతటి అనుభూతి కలదో ఎవరికి ఎఱుక? వారిది వీరులజాతి; వారు సత్యమగు క్షత్రియులు. తమభావములు గుప్తముగ నుంచి ఎన్నడును వెలువరింప కుండుట వారివిద్య; వారు బాల్యమునుండి అటువంటి శిక్షణమునే పడయుదురు. ఆంగ్లపురుషుడు భావోద్రేకమును వెలువరింపగా చూడగల్గుట అరుదు. ఆంగ్లస్త్రీ కూడ అట్టిదియే. ఆంగ్లస్త్రీలు పనులకు పోవుతటి, మహాసాహసులగు వంగదేశీయులు కూడ అనుకరింప జంకునంతటి వీరకార్యములు చేయగా నేను చూచితిని. అయినను, శౌర్యసూచకమగు ఈ బాహ్యాకారము ఎంతటిదిగ నున్నను, ఈ యోధాకృతికి వెనుక ఆంగ్లేయజాతి యొక్క హృదయములో గొప్ప దాక్షిణ్యభావనిధి మఱుగుపడి

యున్నది. నీ వొకసారి దానిని చేరుటకు మార్గము తెలిసికొని అక్కడకు చేరితివా, ఆంగ్లేయునితో నీవు సహవాసముచేసి స్వాయముగా వానితో కలిసి పోగలిగితివా, అతడు తనహృదయమును తెఱచును. ఇక నీ కతడు శాశ్వతమిత్రుడే ; నీ దాసుడే అయి పోవును! కాబట్టి ఇంగ్లాండులో నేను చేసినపని తక్కినతావులందు కంటె ఎక్కువ తృప్తికరముగా నున్నదని నా అభిప్రాయము. రేపు నేను మరణింపనున్నను, ఇంగ్లాండులో నేను ప్రారంభించిన పని నాశ మందక నిరంతరము వృద్ధిగాంచుచునే నడవగలదు.

సోదరులారా! మీరు నా హృదయమునందు మఱొక భావమును, అత్యంతగంభీరభావమును మేల్కొల్పితిరి. మీరు నా గురువుయొక్క, నా స్వామియొక్క, నా నాయకునియొక్క, నా పరమాదర్శముయొక్క, నా సజీవదైవతముయొక్క, శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణపరమహంసలయొక్క నామమును సంస్మరించితిరి. తలపులతోడగాని, మాటలతోడగాని, చేతలతోడగాని, నేను ఏమేని సాధించియున్నచో, ప్రపంచమునకు ఉపయోగకరమగు ఒక్క పలుకేని నా పెదవులనుండి వెలువడి యున్నచో, అదంతయు శ్రీవారిదే; నాయది అనజాలను. కాని నా పెదవులనుండి శాపములు వెలువడినయెడల, నా హృదయమునుండి ద్వేషము పొరలినయెడల, అదంతయు నాదే; శ్రీవారిది కాదు. దుర్బల మగు సమస్తము నాదియే. ఉజ్జీవకరమును బలవర్ధకమును నిర్మల మును పావనమును అగు సర్వమును శ్రీవారి ప్రేరణమే, శ్రీవారి భాషణమే; సర్వమును శ్రీవారిదే. మిత్రులారా! ప్రపంచము ఆ మహాపురుషుని ఇంకను తెలిసికొనవలసియున్నదనుట సత్యము. ప్రపంచ చరిత్రయందు మహాత్ముల గుఱించియు వారి జీవితముల గుఱించియు కథలను చదువుచున్నాము. ఇవన్నియు శతాబ్దముల తరబడి వారి వారి శిష్యుల వ్రాతలను చేతలను ఆధారము చేసి కొని మనకు చేరుచున్నవి. వేలకొలది సంవత్సరములుగా చెక్కి

చెక్కి ఆకారము కల్పించిన ఈ ప్రాచీన మహాప్రవక్తల జీవిత ములు మనకు లభించుచున్నవి. ఇంత జరిగినను, నేను స్వయముగా ఎవరిని నా కన్నులతోచూచి యున్నాడనో, ఎవరినీడను నేను జీవించియున్నాడనో, ఎవరిపాదములచెంత నేను సమస్తము నేర్చు కొంటినో, అట్టి శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణపరమహంసలవారి జీవిత ముతో సాటి రాదగినంతటి దివ్యతేజోమయజీవితము ఒక్కటేని లేదని నా అభిప్రాయము. ఓహో మిత్రములారా! గీతలోని ఈ సుప్రసిద్ధ వాక్యము మీ కందఱకు తెలిసియుండును.

> యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత।
> అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహ్యామ్॥
> పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

"అధర్మమునకు వృద్ధియు ధర్మమునకు నాశనమును, ఓ భారత పుత్రా! ఎప్పుడెప్పుడు కలుగుచుండునో అప్పుడప్పుడు నేను అవత రించుచుందును. సాధువుల రక్షించుటకొఱకును దుష్టుల శిక్షించుట కొఱకును ధర్మమును తిరిగి స్థాపించుటకొఱకును ప్రతియుగమునం దును నేను పుట్టుచుందును" అని దీని యర్థము.

దీనితోపాటు మీరు ఇంకొక విషయమును గ్రహింపవలసి యున్నది. అట్టి విషయమొకటి నేడు మన కన్నులయెదుట గోచ రించుచున్నది. ఆధ్యాత్మిక సాగరమున మహాతరంగ మొకటి బయలు వెడలి వచ్చుటకు పూర్వము సంఘమునందు ఎల్లెడలను చిన్న చిన్న సుడులు కాన్పించుచుండును. అట్టివానిలో నొకటి లేచి మొదట, ఎవరికిని తెలియరాక, ఎవరికిని కాన్పింపకుండ, ఎవరి ఊహకును చిక్కకుండనే విజృంభించి, తక్కిన చిన్న చిన్న సుడులనన్నిటిని మ్రింగివేసి తనలో జీర్ణము చేసికొనెనో యను నటుల పెరిగి, పెద్దదై, మహాతరంగరూపము దాల్చి, ఎవరికిని

నిలువరింప సాధ్యముకానంతటి మహాశక్తితో సంఘముపై పడును. అట్టిది మన కన్నుల యెదుట జరుగుచున్నది. కన్ను లున్నచో మీ కది కాన్పించును. మీ హృదయము వికసించియున్న యెడల దానిని స్వీకరింతురు. మీరు సత్యాన్వేషులై తిరేని మీ కది దొఱకును. సూర్యోదయపు జాడలను చూడజాలనివాడు గ్రుడ్డివాడే, నిజముగా కన్నులులేనివాడే. ఓహో! మీ రెన్నడు వినియైన నుండని ఒక దూరపు పల్లెలో ఒక బీద బ్రాహ్మణ కుటుంబమున జన్మించిన ఈ బాలుడు, అనేక శతాబ్దముల నుండి 'మూర్ఖపు పూజలను' ఖండించుచు ప్రేలుచుండిన విదేశములలో ఈ నాడు యథార్థముగా అర్చనములను పడయుచున్నాడు. అది యెవరి శక్తి? అది మీదియా నాదియా? అది శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణ పరమహంసల రూపమున అవతరించిన దివ్యశక్తి తప్ప అన్యము కాదు. ఏలయన మీరును, నేనును, మహాఋషులును, ప్రవక్తలును, ఇంతేల అవతారములు సైతము, చివరకు ఈ బ్రహ్మాండమంతయు కూడ, ఘనీభూతమై మానవరూపముదాల్చిన ఆ మహాశక్తియొక్క అంశమూర్తులే! ఇచ్చట నేడు ఒకమహాశక్తి అభివ్యక్తమగుచున్నది. దానియొక్క ప్రారంభ కార్యములను మాత్రమే మనము చూడగలుగుచున్నాము. ఈ తరము గడచిపోకపూర్వమే ఆ శక్తియొక్క విచిత్ర కార్యములను ఇంకను హెచ్చుగా మీరు చూడగల్గుదురు. భారతదేశమున సదా పనిచేయుచుండవలసియున్న ఆ చైతన్యశక్తిని మనము మఱచుచు వచ్చుచున్న కారణమున, భారతదేశము నుద్ధరించుటకై ఈ తరుణమున ఆ మహాశక్తి అవతారము దాల్చినది.

ప్రతిజాతికిని దాని ప్రత్యేకలక్షణమగు ఒక కార్యవిధానము ఉండును. కొందఱు రాజ్యతంత్రము ద్వారమునను కొందఱు సంఘసంస్కరణముల ద్వారమునను మఱికొందఱు వేఱువిధానములతోడను పనిచేయుదురు. మనమో మతమును మాత్రమే

ఆధారము చేసికొని కదలగలము. ఆంగ్లేయుడు రాజనీతిద్వార ముననే మతధర్మమును సైతము గ్రహింపగల్గును. అమెరికా దేశీయుడు సంఘసంస్కరణ ద్వారముననే మతధర్మమును సైతము తెలిసికొనజాలును. కాని హిందువన్ననో, రాజనీతిని సైతము మతద్వారముననే గ్రహింపగల్గును. సంఘధర్మము సైతము మతద్వారముననే రావలయును. హిందువునకు సర్వమును మత ద్వారముననే రావలసియుండును. ఏలయన అది వాని గానమునకు పల్లవి. వాని జాతీయజీవితగానమునందు తక్కినవన్నియు రాగ భేదములుగ నుండును. దానికి ఆపద వాటిల్లినది. మన జాతీయ జీవితమునందలి ఈ పల్లవిని మార్చబోవుచున్నట్లున్నాము. మన శరీరమునకు ఆధారమగు వెన్నెముకను మార్చ చూచుచున్న ట్లున్నాము. ఆధ్యాత్మికమగు మన బ్రహ్మదండమును తొలగించి దాని స్థానమునందు రాజకీయమగు బ్రహ్మదండమును నిలుపుటకై యత్నించుచున్నాము. అందు మనము కృతకృత్యులమైనయెడల దాని మూలమున మనకు వినాశమే చేకూరి యుండెడిది. ఆ ఆపద తొలగినది. కావుననే ఈ దివ్యశక్తి అవతరించినది. ఈ మహా పురుషుని మీ రెటువంటి దృష్టితో గ్రహింపజూచినను నేను సరకు గొనను. మీరు ఆయనయెడల ఎంతటి గౌరవము చూపుదురో అను విషయము లెక్కలోనిది కాదు. భారతదేశమున అనేక శతాబ్దములకు పిమ్మట నేడు ఈ మహాద్భుత దివ్యశక్తి అవతరించి వచ్చెనని నేను యథార్థముగా ముఖాముఖిని ప్రతిజ్ఞ చేసి చెప్పు చున్నాను. హిందువులగుటచేత మీ రా శక్తిని పరిశీలించి తెలిసి కొని భారతదేశముయొక్క క్షేమము కొఱకును పునరుద్ధరణము కొఱకును దానిమూలమున అఖిల మానవకోటియొక్క శుభము కొఱకును ఏమి జరుగుచున్నదో తెలిసికొనుట మీ విధి. ఓహో! ప్రపంచమందలి ఏ దేశమందుగాని విశ్వమతభావములనుగూర్చియు, విశ్వమానవసౌభ్రాత్రమునుగూర్చియు వాదోపవాదములు జరుగు టకు చాల ముందుగనే, ఇచ్చట ఈ నగర సమీపమున తన జీవిత

మంతయును నానామతమహాసభగా ఒక మహాపురుషుడు గడపి యుండెను సుడీ!

మన శాస్త్రములలో చెప్పబడిన పరమోత్తమ గమ్యార్థము నిర్గుణపరబ్రహ్మము. ఆ నిర్గుణపరబ్రహ్మాదర్శమును పొందగలుగునట్టి ఉత్తమార్హత మనలో ప్రతివానికిని భగవదనుగ్రహము వలన లభించుగాక యని నేను ఆశించుచున్నాను. కాని అది అసంభవమగుటచేత మానవజాతిలో అత్యధిక సంఖ్యాకులకు సగుణదైవతము అత్యవసరముగా నున్నది. తన జీవితములో పరమాదర్శముల గూర్చుకొని ఒక ధ్వజముక్రింద చేరనిదే ఏ జాతియు ఏర్పడజాలదు; ఘనత కూర్చుకొనజాలదు; ఎంత మాత్రమును కార్యసాధనముచేసికొనజాలదు. రాజకీయాదర్శములు గాని, రాజకీయాదర్శములకు ప్రతినిధులై నిలుచు మహాపురుషులు గాని, చివరకు సాంఘికాదర్శములుగాని, వాణిజ్యాదర్శములుగాని భారతదేశములో ప్రబలములు కాజాలవు. ఆధ్యాత్మికాదర్శములు మనయెదుట సుప్రతిష్ఠితములు కావలెను. ఉత్తమపారమార్థిక వ్యక్తులను ఎదుట నుంచుకొని వారిచుట్టును ఉత్సాహముతో గుమి కూడవలయును. మన వీరులు పారమార్థిక పురుషులుగనే ఉండవలయును. శ్రీరామకృష్ణపరమహంసల రూపమున అట్టి వీరుడొకడు మనకై మూర్తీభవించినాడు! ఈ జాతి అభ్యుదయము కాంచగోరునెడల ఈ నామము చుట్టును ఉత్సాహముతో చేరి నిలువవలయును. నా మాట నమ్ముడు; శ్రీరామకృష్ణపరమహంసలవారిని గుఱించి బోధించునది ఎవరా యను విషయము ప్రధానముకాదు. నీవో, నేనో, ఇంకొకరో, ఎవరైన కావచ్చును. వారి ఆదర్శమును నేను మీ యెదుట పెట్టుచున్నాడను. ఏమి చేయుటో నిర్ణయించుకొనవలసినది మీరు. ఈ జీవితదివ్యాదర్శమును గుఱించి మీరు ఏమిచేయనున్నారో ఇప్పుడే నిర్ణయించుకొనుట భారత మహాజాతియొక్క క్షేమమునకును, అందలి మన

శాఖయొక్క క్షేమమునకును అవసరము. ఒక విషయమును మనము జ్ఞప్తియందుంచుకొనవలయును. మనము చూచిన వానిలో నెల్ల పరమ పవిత్రమైన జీవితమిది. అంతేకాదు, మనము గ్రంథములలో చదివియున్న జీవితములన్నిటిలోగూడ ఇది పావనతమమైనదని నేను మీకు స్పష్టముగా చెప్పుచున్నాను. ఈ యథార్థ విషయము మీ ఎదుట జరిగినది. మహాద్భుతమగు ఇట్టి ఆత్మశక్తి సాక్షాత్కారమును మీరు గ్రంథములలో కనుగొనజాలరు. అంతకంటెను కనులార చూడగలమని ఆశింపజాలరు. ఆ మహానుభావుడు నిర్యాణము చెందిన పది సంవత్సరములలోపలనే వాని మహిమ భూగోళమునంతను ఆవరించి వేసినది. ఇది మీ ఎదుట జరుగుచున్న యథార్థ విషయమే గదా! కాబట్టి మన జాతికల్యాణము కొఱకును, మన మత క్షేమము కొఱకును ఈ ఉత్తమ పారమార్థికాదర్శమును మీ ఎదుట నుంచుట నా విధియై యున్నది. నన్నుబట్టి ఆయన ఎట్టివాడో మీరు విచారింప నిర్ణయింపబోకుడు. నేనందుకు తగని దుర్బలమగు ఉపకరణమను. నా ఆధారమున ఆయన స్వరూపమెట్టిదో మీరు నిర్ణయింప చూడకుడు! ఆయన శిష్యులలో నేను గాని మఱొకడు గాని నూరు జన్మలెత్తినను ఆయన సత్యస్వరూపమున కోట్యాంశమునైనను సమర్థతతో నిరూపింపజాలము. అంతటి మహాత్ముడు ఆయన! మీకు మీరే స్వతంత్రముగా జిజ్ఞాస చేసికొనుడు. మీ హృదయాంతరాళములయందు ఆ యఖండసాక్షి వెలుగుచున్నాడు. ఆయన, ఆ శ్రీరామకృష్ణపరమహంసయే, మన జాతిక్షేమముకొఱకును మన దేశాభ్యుదయముకొఱకును మానవకోటియొక్క కల్యాణముకొఱకును మీ హృదయములను వికసింపజేసి, మీరు బుద్ధిపూర్వకముగ ప్రయత్నించినను ప్రయత్నింపకున్నను, తప్పక రానున్న అద్భుత పరివర్తనకు మిమ్ము పాత్రులుగ జేసి మీరు స్థిరచిత్తముతో పని చేయునటుల అనుగ్రహించుగాక! ఏలయన ఆ ప్రభువు సంకల్పించిన కార్యము మీయొక్కగాని, నాయొక్కగాని ఆమోదముకొఱకు

ఆగియుండునది కాదు. ఈ భూరజమునుండి వందలకొలదిగా వేలకొలదిగా తనసేవకులను ఆయన నిర్మించుకొనజాలును. ఆ మహాపురుషుని ఆశ్రయించుకొని ఏమాత్రమైనను పనిచేయు భాగ్యము లభించెనేని అది మన అదృష్టము! మన ధన్యత!!

దీని నాధారము చేసికొని నా భావన విశాలవ్యాప్తి కాంచుచున్నది. మీ రిప్పుడు నాకు తెలిపినటుల, మనము ప్రపంచమునే జయింపవలసియున్నది. మనము జయించియే తీరవలెను. భారతదేశము లోకమును జయింపవలయును. నా గమ్యార్థము అంతకు తగ్గునది కాదు. ఇది చాల గొప్పదిగా కాన్పింపవచ్చును. మీలో చాలమందికి ఇది అబ్బురముగా కూడ చూపట్టవచ్చును. సత్యముగా అది అంతటిదే. మనము ప్రపంచమును జయించియే తీరవలెను; గత్యంతరము లేదు. జీవనమునకు లక్షణము వికాసము. మనము వెలువడి పోవలయును; వికాసము పొందవలయును; చైతన్యమును ప్రకటింపవలయును; లేదా పతితులమై మురిగి చావవలయును. ఇంతకంటె మార్గాంతరము లేదు. బ్రతుకుటో లేక చచ్చుటో, ఈ రెంటిలో ఒకదానిని నిర్ణయించుకొనుడు. ఇప్పుడు మనదేశములో మనకున్న క్షుద్రములగు మత్సరములను వివాదములను గుఱించి విచారించుదము. ప్రతిచోటను ఇట్టివి యున్నవి. నా మాట సమ్ముడు. రాజకీయ జీవితములతో వర్ధిలు ఇతర జాతులవారికి వారి విదేశాంగ తంత్రములు కలవు. వారికి స్వదేశమున పోరాటములు పెచ్చుపెరిగినప్పుడు దేశాంతరములందు ఎవరితోనో పోరాటము పెట్టుకొందురు. అంతటితో వారి యింటి పోరు ఆగిపోవును. మనకును ఇట్టి పోరాటములే యున్నవి; కాని వాని నాపుటకు విదేశరాజకీయతంత్రములు మనకు లేవు. ప్రపంచమునందలి ఇతరజాతులవారికి మన శాస్త్రధర్మములను బోధించుట యనెడు సనాతన విదేశాంగ తంత్రమును మనము చేపట్టవలసియున్నది. జాతీయముగ మనకిది ఐకమత్యమును

చేకూర్చుననుటకు వేఱొక ఋజువు కావలయునా యని మీలో రాజకీయతంత్రజ్ఞులగువారిని అడుగుచున్నాను. ఈ మహాసభయే కావలసినంత సాక్ష్యము నిచ్చుచున్నది.

రెండవ విషయము ఈ స్వార్థపరత్వములు అట్లుండగా, స్వార్థత్యాగులును ఉత్తములును సజీవులును అగు ఆదర్శమూర్తులు మన వెనుక నున్నారు. భారతదేశముయొక్క దౌర్భాగ్యమునకును పతనమునకును ముఖ్యహేతువులలో నొకటి దీని సంకుచితత్వము. ఈ జాతి సంకుచితమై ముత్యపు పురుగువలె ముడుచుకొని తన చిప్పలోనికి దూరిపోయినది. తన ముత్యములను రత్నములను మానవకోటిలోని యితరజాతులకు పంచియిచ్చుటకు నిరాకరించినది. ఆర్యేతరజాతులవారు చైతన్యప్రదములగు మన ధర్మములకొఱకై దప్పికొని యుండగా వారిని నిరాకరించినది. ఇది యొక గొప్ప కారణము. మనము దేశాంతరములకు వెళ్లి యితర జాతుల అనుభవములతో మన అనుభవములను పోల్చి చూచుకొనకుండుట మన పతనమునకు ముఖ్యకారణము. ఈ కొలదిపాటి చలనమును, భారతదేశమున మీరిప్పుడు చూచు కొలదిపాటి జీవచిహ్నమును, శ్రీ రాజారామమోహనరాయలు మన బహిష్కరణావరణపు గోడలను పగులతన్ని వెలువలికి వచ్చిన నాటినుండియే ప్రారంభమైనదని మీకు తెలియును. ఆ నాటినుండి భారతచరిత్ర క్రొత్తమార్గమును పట్టినది. మఱి యిపుడు అతిశయించిన వేగముతో సాగిపోవుచున్నది. పూర్వకాలమున చిన్న చిన్న నదీప్రవాహములు ఉండెడివి; ఇక పెద్ద పెద్ద వరదలు రానున్నవి. వాని నెవ్వరును ఆపజాలరు. కాబట్టి మన మిప్పుడు బయటికి పోవలయును. ఇచ్చి పుచ్చుకొనుట జీవశక్తికి లక్షణము. మనము ఎల్లపుడును పుచ్చుకొనువారముగనే ఉండవలయునా? ప్రతిదానిని, చివరకు మన మతమునుకూడ పాశ్చాత్యుల పాదములచెంత కూర్చుండి నేర్చుకొనవలసినదేనా?

మనము వారినుండి యంత్రరహస్యములను నేర్చుకొనవచ్చును. ఇంకను ఇతర విషయములు అనేకము నేర్చుకొందము గాక! కాని మనమును కొంత నేర్పవలసియున్నది. వారికి మనము నేర్పవలసినది మన మతము, మన పరమార్థతత్త్వము. ప్రపంచము తన నాగరికతను పూర్తిగావించుకొనుటకు వేచియున్నది; భారత దేశమునుండి వెలువడనున్న రత్నరాసులకొఱకు నిరీక్షించుచున్నది; అనేక శతాబ్దములుగా పతితమై దైన్యమున క్రుంగియున్నను ఈ భారతజాతి తనరొమ్మునకు హత్తుకొని కౌగిట గదించిన పిత్రార్జిత మహాద్భుత పరమార్థతత్త్వమును ప్రపంచమునకు పంచి యీయవలయును. ప్రపంచము ఆ నిధి కొఱకు కను పెట్టుకొని యున్నది!

మన పూర్వులు గడించి పెట్టిన ఈ విచిత్ర రత్నరాసుల కొఱకు భారతేతర దేశములందు ఎంతమంది ఆకలిగొని కృశించి పోవుచున్నారో, ఎంతమంది దప్పిగొని పరితపించుచున్నారో, మీకేమియు తెలియుటలేదు. మన మిక్కడ వ్యర్థప్రసంగములు చేయుచున్నాము. ఒకరితో నొకరము వాదులాడుకొనుచున్నాము. ప్రతి పవిత్ర విషయమును గుఱించియు పక పక నవ్వుచున్నాము; వేళాకోళము చేసికొనుచున్నాము. దైవీసంబంధమగు ప్రతిదానిని గుఱించియు హేళనచేయుట మనజాతికొక దురభ్యాసమైపోయినది. ఈ భారతక్షేత్రమున మన పూర్వులు భద్రపరచియుంచిన అమృతమునందు ఒక చుక్కను గ్రోలుటకై, చేతులు చాచుచు ఆరాటముతో గోడల బైట ఎన్నిలక్షలమంది హృదయావేదనతో నిరీక్షించుచున్నారో మనకు తెలియవచ్చుటలేదు. కాబట్టి మనము వెలుపలికిపోయి మన ఆధ్యాత్మికతత్త్వమును వారికిచ్చి దానికి బదులుగా వారియ్యగల దానిని దేనినైనను గ్రహింతుము గాక! ఆత్మప్రపంచవిచిత్రములను ఒసగి జడప్రపంచచిత్రములను కొనుగోలుచేసెదము గాక! మనము ఎల్లప్పుడును విద్యార్థులుగనే

యుండదగదు. ఉపాధ్యాయులముగకూడ నుండవలసియున్నది. సమత్వము లేనిది మైత్రి ఉండజాలదు. ఒకపక్షమువాడు సదా ఉపాధ్యాయుడుగనే యుండి, రెండవపక్షమువాడు సదా వాని పాదములకడనే కూర్చుండుచో సమత్వ మెట్లుండును? ఆంగ్లేయునితోగాని, అమెరికావానితోగాని నీవు సమానముగా నుండగోరునెడల, వారివలన నేర్చుకొనుటయే కాక వారికి నేర్ప గలిగియు నుండవలయును. శతాబ్దముల తరబడి ప్రపంచమునకు నేర్పగలది నీకడ కావలసినంత కలదు; ఈ పని జరుగవలయును. మన రక్తములో సాహసమును ఉత్సాహమును ఉండవలయును. మనము వంగదేశీయులము. ఊహాశక్తిగలవారమని మనకు ప్రసిద్ధి గలదు. మనయందది కలదనియే నా నమ్మకము. ఊహాశీలుర మనియు, విశేషమగు ఉద్రేకముగలవారమనియు మనలను వెక్కిరించుచుందురు. మిత్రులారా! నా మాట వినుడు. బుద్ధిశక్తి గొప్ప దనుట నిజమే, కాని అది కొన్ని హద్దుల లోపల ఆగిపోవలసి యుండును. ఒక్క హృదయద్వారమున మాత్రమే ఆవేశము పుట్టును. హృదయసముద్భవ ఆవేగమువలననే అత్యుత్తమ రహస్య విషయములను అందుకొనుటకు వీలగును. కాబట్టి భావోద్రేకముగల వంగదేశీయుడే ఈ పని నిర్వహింపవలయును.

* "ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్నిబోధత! లెండు! మేల్కొనుడు! మీ గమ్యార్థమును చేరువఱకు ఆగకుడు!" కలకత్తానగర తరుణ వయస్కులారా! లెండు, మేలుకొనుడు; సమయము మంగళకరముగ నున్నది. అదిగో అప్పుడే సర్వమును మన ఎదుట సిద్ధమగుచున్నది. ధైర్యము వహింపుడు. భయపడకుడు. మన గ్రంథములందు మాత్రమే 'అభయః' అను విశేషణమును భగవంతుని గుఱించి ప్రయోగించి యున్నారు. మనము 'అభయః' భయములేని వారము కావలయును. అప్పుడు మనము

---

* కఠోపనిషత్తు.

పూను కార్యము నెరవేరినట్లే! లెండు! మేల్కొనుడు! మీ దేశము ఈ మహాయజ్ఞమును కోరుచున్నది. యువకులే దానిని నిర్వహింపవలసియున్నది. యువకులును బలయుతులును సత్త్వవంతులును దృఢకాయులును బుద్ధిశాలురును అగువారు నిర్వహింప దగినదే ఈ కార్యము. ఈ కలకత్తానగరమున వందలకొలదిగా, వేలకొలదిగా అటువంటి యువకులున్నారు. మీరు చెప్పునటుల ఇప్పుడు నేను ఏమేని సాధించియుండినను, పూర్వము ఈ కలకత్తా నగర వీథులయందు ఆటలాడుచు కొఱగాని కట్టవాడని అనిపించు కొనినవాడనే అని జ్ఞప్తి నుంచుకొనుడు. నేనే అంతపనిని చేసి యుండగా మీరు ఇంకను ఎంత ఎక్కువ పని చేయగలుగుదురో! లెండు, మేలుకొనుడు, ప్రపంచము మిమ్ము ఆహ్వానించుచున్నది. భారతదేశమునందలి ఇతరప్రాంతములందు బుద్ధిశక్తి యున్నది, ధనమున్నది, కాని ఉత్సాహము మాత్రము నా జన్మభూమియందే కలదు. అది ఇప్పుడు వెలువడి రావలయును. కాబట్టి కలకత్తా నగర యువజనులారా! మీ రక్తములోని ఉత్సాహశక్తితో లేచి నిలువబడుడు. మీరు దరిద్రులనియు, మీకు స్నేహితులు లేరనియు తలంపకుడు. ఓహో! ధనము ఎన్నడైన ఒక పురుషుని సృష్టింపగా చూచినవారు కలరా? పురుషుడే సదా ధనమును సృష్టించు చుండును. ఈ ప్రపంచమంతయు సత్త్వసంపన్నుడగు మానవుని చేత, ఉత్సాహశక్తిమూలమున విశ్వాసబలముతో నిర్మాణ మగు చున్నది.

ఉపనిషత్తులలోనికెల్ల అత్యంతము మనోహరమగు కఠోప నిషత్తును మీలో చదివిన వారికి ఆ రాజు మహాయజ్ఞము చేయ బోవుచు శ్రేష్ఠమగు వస్తువులను దానము చేయుటకు బదులుగా, ఎందుకును కొఱగాని ఆవులను గుఱ్ఱములను ఎటుల దానము చేయ మొదలిడెనో జ్ఞప్తి యుండును. ఆ సమయమున వాని కుమారు డగు నచికేతుని హృదయములోనికి 'శ్రద్ధ' ప్రవేశించినటుల ఆ గ్రంథమున కలదు. ఈ 'శ్రద్ధ' అను మాటకు అర్థముగా

వేఱొక మాట నుపయోగించుట నాకిష్టము లేదు. అర్థము తప్పిపోవును. ఇది ఒక అద్భుతశబ్దము. దీనిని చక్కగా అర్థము చేసికొని దీనినే వాడుకొనుచుండవలయును. దీని మహిమను కొంచెము చూతము. నచికేతుడు వెంటనే తనలో తానిట్లు అనుకొనెను. "నేను చాలమందికంటె గొప్పవాడను; కొందఱి కంటె తక్కువవాడను. కాని ఎందునను నేను కడగొట్టువాడను కాను. నేను కూడ కొంతపని చేయగలను." వానిధైర్యము పెంపొందినది. అంతట ఆ పిల్లవాడు తన మనస్సులో నున్న సమస్యను అనగా మృత్యురహస్యమును తేల్పవలయునని పూను కొనినాడు. ఆ పరిష్కారము మృత్యుదేవతయగు యముని ఇంటికి పోయిన గాని తేలునది కాదు. అక్కడికే ఆ పిల్లవాడు వెళ్లినాడు. అక్కడ ధీరుడగు నచికేతుడు యముని గృహమునొద్ద మూడు దినములు వేచియున్నాడు. పిమ్మట అతడు కోరుకొనిన దానిని ఎట్లు సాధింప గలిగెనో మీకు తెలియును గదా! ఈ శ్రద్ధయే మనకు కావలసినది. దురదృష్టవశమున శ్రద్ధ అనునది భారత దేశమునుండి దాదాపుగా అదృశ్యమై పోయినది. ఆ కారణము చేతనే మన మీ ప్రస్తుత దుఃస్థితికి వచ్చినాము. నరునకు నరునకు నడుమ గల భేదము శ్రద్ధయందు గల భేదమే తప్ప వేఱు కాదు. ఒకపురుషుని ఘనునిగను, వేఱొకని దీనునిగను అధమునిగను చేయునది ఈ శ్రద్ధయే. దీనుడ ననుకొనువాడు, దీనుడై పోవునని నా గురువర్యుడు చెప్పుచుండెడివాడు. ఆ మాట సత్యము. ఈ శ్రద్ధ మీలో ప్రవేశింపవలయును. పాశ్చాత్యజాతులయందు ఎటువంటి జడశక్తి ప్రకటితమై మీకు కాన్పించుచున్నదో చూడుడు. అది అంతయు శ్రద్ధయొక్క మహిమయే. వారు తమ శరీరబల మును నమ్ముకొందురు. మీరు మీ ఆత్మబలమును నమ్ముకొనిన యెడల ఇంకను ఎంత అతిశయముగా అది పనిచేయగలదో! ఆ అఖండాత్మను, అఖండశక్తిమయుని నమ్ముకొనుడు. మీ గ్రంథ ములను, మీ ఋషిసత్తములను ఏకాభిప్రాయముతో దీనినే

బోధించియున్నారు. ఏదియు వినాశము చేయజాలని ఆ ఆత్మ యందు అనంతశక్తి కలదు. మీ ఆవాహనముకొఱకై అది ఎదురు చూచుచున్నది. భారతీయవేదాంతమునకును, తక్కిన తత్త్వ శాస్త్రములన్నిటికిని నడుమ గల గొప్పభేదము ఇక్కడనే యున్నది. ద్వైతులును, విశిష్టాద్వైతులును, అద్వైతులును, అందఱును సమస్తము ఆత్మయందే కలదని దృఢముగా విశ్వసింతురు. అది వెలువలికి వచ్చి సువ్యక్తము కావలయును. కాబట్టి నేను కోరు కొనునది ఈ శ్రద్ధయే. మన అందఱకును కావలసినదియు ఈ శ్రద్ధయే. ఈ విశ్వాసము మీలో కలదు. ఈ విశ్వాసమును మీ అనుభవమునకు తెచ్చుకొనుట యను మహాకార్యము నిర్వ హింపుడు. గాంభీర్యమును గంగపాలు చేసి ప్రతిదానిని వేళా కోళము చేయు బుద్ధి ఈ జాతియొక్క రక్తములోనికి చొచ్చుకొని పోవుచున్నది. ఈ ఘోరవ్యాధిని తొలగించుకొనుడు. ఈ పెద్ద రోగమును తప్పించుకొనుడు. సాహసము పూనుడు. శ్రద్ధను సంపాదించుకొనుడు; తక్కినదంతయు వచ్చి తీరును.

ఇప్పటికి నేనేమియు చేసి యుండనేలేదు. ఆ పనిని మీరు చేయవలయును. నేను రేపు మరణించినను ఈ కార్యము ఆగి పోదు. వేలకొలదిగా ముందునకు వచ్చి ఈ కార్యమును చేపట్టి, నేను ఊహలో కల్పన చేసికొనిన ప్రత్యాశల నన్నిటిని మించి ఈ మహాకార్యమును ముందునకు సాగించుకొని పోవుదురని నేను నిశ్చ యముగా నమ్ముచున్నాను. నామాతృదేశమునందు, ముఖ్యముగా నా మాతృదేశపు యువకుల యందు నాకు విశ్వాసము కలదు. యువకుల మూపులపై ఇంతవరకు మోపబడిన కార్యభారము లన్నింటికంటె ఘనతమమైనది ఈ వంగదేశ యువకులమీద ఇప్పుడు పడినది. దాదాపు పది సంవత్సరములనుండి భారతదేశము నందంతటను నేను సంచారము చేసియున్నాను. భారతమాతను ఉద్ధరించి, ఆధ్యాత్మికముగా ఆమెకు అర్హమగు స్థానమును మఱొకసారి సంపాదించి పెట్టగలశక్తి వంగదేశయువకుల నుండి

ప్రభవింపనున్నదని నా నిశ్చితవిశ్వాసము. అహో! మన పితరులు కనిపట్టిన అఖండ పరమార్థ సత్యములను బోధించుచు ఉపదేశముల గావించుచు ప్రపంచపు మూల మూలలకు ప్రచారము చేయు వీరవరులు ఈ వంగదేశపు యువకులనుండియే — అద్భుత భావస్ఫూర్తియు, ఉత్సాహపూరిత రక్తమునుగల ఈ నాయువక సోదరులనుండియే — ఉదయము గాంచ నున్నారు. మీ యెదుట నున్న ఘనతర కర్తవ్యము ఇదియే. కాబట్టి "లెండు! మేల్కొనుడు! ఈప్సితార్థసిద్ధి యగువఱకు నిలువకుడు!" అనుచు మఱొకసారి మిమ్ము హెచ్చరించుచు నా యుపన్యాసమును ముగింతును! భయపడ బోకుడు. మానవచరిత్రయందంతటను మహాశక్తి ప్రజలనుండియే ప్రభవించుచువచ్చినది! అట్టి ప్రజాశ్రేణులనుండియే ప్రపంచమునందలి మహామనీషావంతులందఱును వచ్చియున్నారు. చరిత్రయందు ఒక్కసారి సంఘటిల్లినదే మరల సంఘటిల్లుచుండును. దేనికిని మీరు భయపడవలదు. మీరు అద్భుతకార్యములను చేయగలరు. భయపడిన తత్క్షణమే మీ రెందునకును కొఱగాకుండ పోవుదురు. లోకములోని దుఃఖమున కంతకును ముఖ్యకారణము ఈ భయమే. మూఢ విశ్వాసములలోనెల్ల అత్యధికమగునది ఈ భయమే. మన దుఃఖమున కంతకును ప్రధానకారణము ఈ భయమే. నిర్భయత ఒక్కక్షణములో స్వర్గమును సైతము తెచ్చిపెట్టగలదు; కాబట్టి "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్ నిబోధత — లెండు, మేల్కాంచుడు, గమ్యస్థానముచేరువఱకును ఆగబోకుడు."

మహాశయులారా! మీరు నాయెడల చూపిన ఆదరణ కంతకును మఱొకసారి మీకు వందనములర్పించుచున్నాను. ఏ కొంచెమైనను, ప్రపంచమునకును ముఖ్యముగా నా దేశమునకును నా దేశప్రజలకును సేవ చేయుట నా కోరిక. అదియే నిశ్చయమగు నా దృఢాభిలాష!



వ్యాపించుచు వచ్చినవి. ప్రాచీనకాలమున ఇవి పడమటి దిశగా పోయి, ఎథెన్సు నగరమునందో, అలగ్జాండ్రియా నగరమునందో ఆంటియోక్ నగరమునందో, గ్రీకుల మనస్సులో నేమో యొక సంచలనము కలిగించినవి. ప్రాచీనగ్రీకుల మనస్సులపై మన సాంఖ్యసిద్ధాంతప్రభావము దీపించియుండుట స్పష్ట... సాంఖ్యమునకును, భారతదేశమందలి తక్కిన సిద్ధాంతమ... ఉపనిషత్తులే, అనగా వేదాంతమే, ఏకైకప్రమా... దేశములో ఈనాడు మనము చూచుచున్న పరస్ప... ...ాయములు ఎన్నియున్నను, పూర్వకాలమునందు ... ఉండిపోయినను, ఉపనిషత్తులే అనగా వేదాంతమే ఈ సి... ...తములన్నిటికిని మూలాధారమై, ఏకైక ప్రమాణమై, ...డెడిది. నీవు ద్వైతి వైనను, అద్వైతి వైనను, విశిష్టా...ద్వైతి వైనను, శుద్ధాద్వైతి వైనను లేక మఱెట్టి ద్వై... అద్వైతివి గాని అయినను, లేక మఱేపేరు పెట్టుకొని... కు ప్రమాణములగు శాస్త్రములును, వేదములును, ఉ... ...త్తులే. భారతదేశములో ఏసిద్ధాంతము ఉపనిషత్ప్రమాణము నంగీకరింపదో అది ఆస్తిక సిద్ధాంత మనిపించుకొన జాలదు. బౌద్ధ జైన సిద్ధాంతములు ఉపనిషత్తుల ప్రమాణమును అంగీకరింపకపోవుట చేతనే భారతదేశము నుండి బహిష్కరింపబడినవి. ఈరీతిగా — మనకు తెలిసినను తెలియకున్నను — భారతదేశములోని అన్ని సంప్రదాయములందును ఉపనిషత్తుల ప్రమాణము అంతర్లీనమైయున్నది. హిందూమతమని మనము పేర్కొను మహావటవృక్షము — దాని యొక్క మహత్తరములును అసంఖ్యాకములును అను శాఖోపశాఖలతో సహా — వేదాంత ప్రభావముతో సర్వత్రనిండియున్నది. బుద్ధిపూర్వకముగనో, అబుద్ధిపూర్వకముగనో మనము వేదాంతమునే భావనచేయు చున్నాము. వేదాంతమునందే జీవించుచున్నాము. వేదాంతమునే శ్వాసించుచున్నాము, వేదాంతమునందే మరణించుచున్నాము. ప్రతి హిందువుడును ఇట్లే చేయు

చున్నాడు. కాబట్టి భారతదేశమునందు, భారత శ్రోతలకు వేదాంతబోధ చేయుట విపరీతచర్యగా కాన్పించును. ఐనను బోధింపవలసినది అది యొకటియే. ఆ బోధయే ఈ కాలమున అత్యావశ్యకము. ఏలయన, నేనిప్పటికే చెప్పినటుల, భారత సంప్రదాయము లన్నియు ఉపనిషత్తులను శిరసావహింపవలసినవే! ఐనను ఈ సంప్రదాయములందు పరస్పరవిరుద్ధత లనేకములున్నట్లు పైకి కానిపించును. అనేకపర్యాయములు ప్రాచీనఋషులుసైతము ఈ ఉపనిషత్తులయందు అంతర్లీనమై యున్న సామరస్యమును అర్థము చేసికొనలేక పోయిరి. చాలసార్లు ఆ ఋషులే తగవులాడు కొనిరి. అందువలననే "భిన్నభావములేని ఋషులు లేరు" అనుట ఒక సామెతయై పోయినది. కాని ద్వైతములైనను, అద్వైతము లైనను, విశిష్టాద్వైతములైనను, మఱెట్టి భావములైనను గల ఉపనిషద్వాక్యములందు అంతర్లీనమై యున్న ఈసామరస్యమును తొల్లిటికన్న చక్కగా ధ్రువపఱుపవలసిన అవసరమిప్పు డేర్ప డినది. ఆ సామరస్యము నిప్పుడు బహిరంగముగా అఖిలప్రపంచ మునకు వెల్లడిచేయవలయును. ఈ పని భారతదేశమునందు ఎంత అవసరమో అన్యదేశములందును అంత అవసరమై యున్నది. అటువంటి సామరస్యరూపవ్యాఖ్యానమై ఎవని జీవితమంతయు ఒప్పి నదో, ఎవని బోధకంటె ఎవని జీవితము వేయిరెట్లు ఉపనిషత్తులకు సజీవమగు భాష్యముగ నుండెనో, ఎవరు మానవరూపము దాల్చిన ఉపనిషత్తులయొక్క సారాంశమో, అటువంటి మహాపురుషుని యొక్క పాదసేవ చేయు మహాభాగ్యము భగవదనుగ్రహమువలన నాకు లభించినది. ఆ సమరసభావము నాకొకింత ప్రాప్తించియుండ వచ్చును. దానిని ప్రకటింపగలనో, లేనో నాకు తెలియదు. కాని అదే నా ప్రయత్నము. వేదాంతమతములు పరస్పరవిరుద్ధములు కావనియు, అవన్నియు ఒకదాని కొకటి అవసరమనియు, ఒకదాని నొకటి సార్థకము చేయుననియు, ఒకటి మఱొక దానికి సోపానము వలె నమరియుండి పరమగమ్యమగు "తత్త్వమసి" లేక అద్వైత

భావము చేరువఱకు నడపుకొనిపోవుననియు విశదము చేయుటయే నా జీవితోద్దేశము! పూర్వమొకప్పుడు కర్మకాండము భారతదేశమును పరిపాలించుచుండెను. ఆ వేదభాగమునందు ఉత్తమాదర్శములు చాల కలవనుట నిజమే. మన ఈనాటి నిత్యపూజావిధానము ఆ కర్మకాండసూత్రములకు అనుగుణముగానే జరుగుచున్నది. అట్లయ్యును వేదములయొక్క కర్మకాండ భారతదేశమునుండి దాదాపుగా అదృశ్యమైనది. మన అనుదినజీవితములో ఏ అత్యల్పభాగమో తక్క ఆ కాండయొక్క నియమముల ననుసరించుటయే లేదు. మన సామాన్య జీవితమునందు మనము చాలవఱకు పౌరాణికులమో, తాంత్రికులమో అనజెల్లును. కొన్ని వేదమంత్రములను ఉపయోగించునప్పుడు సైతము, మన భారతీయ బ్రాహ్మణులు వానిని వేదోక్తవిధమునగాక చాలవఱకు తంత్రముల ప్రకారమో, పురాణముల ప్రకారమో ప్రయోగించుచున్నారు. అటులగుటచేత — వేదములయొక్క కర్మకాండను అనుసరించువారము అనెడు అర్థములో—మనము వైదికులమని చెప్పుకొనుట సమంజసముకాదని నా భావము. కాని మనమందఱమును వేదాంతుల మను మాట మాత్రము యథార్థము. హిందువులమని చెప్పుకొనువారి నందఱను వేదాంతులని పేర్కొనుట యుక్తము. ఆ వైదాంతికనామము ద్వైతాద్వైత సంప్రదాయముల వారందఱకును వర్తించునని ఇంతకు ముందే తెలిపియున్నాను.

ఇప్పుడు భారతదేశములోనున్న సంప్రదాయములు సామాన్యముగా ద్వైతము అద్వైతము అనెడు రెండు గొప్పతరగతులుగా విభజింపబడుచున్నవి. ఈ సాంప్రదాయికులలో కొందఱు స్వల్ప భేదములకు ప్రాముఖ్యమొసగి, వానిని ఆధారము చేసికొని, శుద్ధాద్వైతులమనియు, విశిష్టాద్వైతులమనియు ఏమేమో క్రొత్త పేరులను పెట్టుకొందురు. అవి అంత పాటింపదగినవి కావు. విశాల విభాగమున వారందఱు ద్వైతులో అద్వైతులో అగుదురు. ఈ కాలమున కాన్పించుచున్న సంప్రదాయములలో కొన్ని చాల

క్రొత్తవి; తక్కినవి మిక్కిలి పురాతనసంప్రదాయముల రూపాంతరములుగా కనబడుచున్నవి. మొదటి తరగతికి నిదర్శనముగా శ్రీ రామానుజాచార్యులవారి జీవితమును, వారి సిద్ధాంతమును పేర్కొందును. రెండవదానికి శ్రీ శంకరాచార్యులవారిని పేర్కొందును.

రామానుజాచార్యులవారు ఆధునిక భారతదేశపు ద్వైత వేదాంతులలో ప్రముఖుడు. తక్కిన ద్వైత సాంప్రదాయికులందఱును బోధల సారాంశమున ఏర్పడు తమ తమ సంప్రదాయముల నిర్మాణమునందును, ఆ నిర్మాణమునందు గల కొన్ని అతి సూక్ష్మవిషయములందును ప్రత్యక్షముగనో, పరోక్షముగనో, శ్రీ రామానుజాచార్యులవారినే అనుసరించుచున్నారు. శ్రీ రామానుజాచార్యులవారిని వారి సంప్రదాయమును భారతదేశమునగల ఇతర ద్వైత వైష్ణవ సంప్రదాయములతో పోల్చి చూచిన యెడల, నిర్మాణమునందును బోధలందును పద్ధతులందును ఎంతగా సమాన లక్షణములు కనిపించునో చూచినయెడల, మీరు అబ్బురపడుదురు. దక్షిణదేశమున మధ్వముని యను మహాగురువు ఉండెను. ఆయన ననుసరించి మన వంగదేశమున చైతన్యులవారు బయలుదేరి మాధ్వుల తత్త్వశాస్త్రమును చేపట్టి వంగదేశమున ప్రచారము గావించిరి. దక్షిణదేశమున విశిష్టా ద్వైత శైవులు మున్నగాగల ఇతర సంప్రదాయములుకూడ కలవు. దక్షిణ భారతదేశమున కొన్ని భాగములందును సింహళమునందును తప్ప భారతదేశపు ఇతరప్రాంతములందు చూపట్టు శైవులు చాలవఱకు అద్వైతులు. ఈ అద్వైతేతరులగు శైవులు విష్ణువు స్థానమున శివుని నిల్పుదురన్న మాటె గాని, జీవాత్మను గుఱించిన సిద్ధాంతము నందు తప్ప ప్రతివిషయమునను రామానుజానుచరులే అనవలయును. రామానుజాచార్యులవారి అనుచరులు జీవుడు అణురూపుడని—నలుసువలె అతిసూక్ష్మమై యుండువాడని—చెప్పుదురు.

శంకరాచార్యులవారి అనుచరులన్ననో, జీవుడు విభువు, అనగా సర్వవ్యాపకుడు అందురు. ఇట్టి అద్వైత సంప్రదాయములు ఎన్నియో ఉండెను. ప్రాచీనకాలమునందు అట్టి సంప్రదాయములనేకములను శంకర సంప్రదాయము మ్రింగివేసి తనలో జీర్ణము చేసికొనినటుల కన్పించుచున్నది. కొన్ని భాష్యములందు శంకరుని మీద సైతము ఒక్కొక బాణము విడువబడుట అప్పుడప్పుడు గోచరించును. అందు ముఖ్యముగా విజ్ఞానభిక్షువు తన భాష్యమునందు తాను అద్వైతియై యుండియు శంకరాచార్యులవారి మాయావాదమును ఎగురగొట్టివేయుటకు ప్రయత్నించినాడు. ఈ మాయావాదమును విశ్వసింపనట్టి కొన్ని అద్వైతసంప్రదాయములున్నట్లు కాన్పించుచున్నది. వారు శంకరాచార్యులవారిని ప్రచ్ఛన్నబౌద్ధుడని నింద చేయుటకు కూడ వెనుదీయరైరి. ఈ మాయావాదము బౌద్ధులనుండి తీసికొనబడి వేదాంతసంప్రదాయములోనికి చొప్పింపబడెనని వారి అభిప్రాయము. అది ఎట్లున్నను ఈ కాలమున అద్వైతులందఱును శంకరాచార్యులవారి ఆధిపత్యమునే అంగీకరించుచున్నారు. శంకరాచార్యులవారును, వారి శిష్యవర్గమును, భారతదేశమునందలి ఉత్తరప్రాంతములందును దక్షిణప్రాంతములందునుగూడ, అద్వైతమతమును బోధించుచు గొప్ప ప్రచారము కావించిరి. శంకరాచార్యులవారి ప్రభావము మన వంగదేశమునందును, కాశ్మీరమునందును, పాంచాలమునందును అంతగా వ్యాపింపలేదు. కాని దక్షిణదేశమునందలి స్మార్తులందఱును శంకరాచార్యులవారి అనుచరులే! కాశీనగరము కేంద్రముగా, ఉత్తరభారతదేశమునగూడ అనేక ప్రాంతములందు శంకరాచార్యులవారి ప్రభావము చాల గాఢముగా వ్యాపించినది.

శంకరాచార్యులవారుగాని రామానుజాచార్యులవారుగాని తాము సిద్ధాంత ప్రారంభకులమని చెప్పుకొని యుండలేదు.

శ్రీ రామానుజాచార్యులవారు తాము బోధాయనులవారి వ్యాఖ్యానమును అనుసరించుచున్నటుల స్పష్టముగా తెలిపియున్నారు. "భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాః, సంచిక్షిపుః తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే" (భగవాన్ బోధాయనులవారు రచించిన విపులమగు బ్రహ్మసూత్రవృత్తిని పూర్వపు ఆచార్యులు సంగ్రహపఱచిరి. వారి అభిప్రాయానుసారముగా సూత్రవాక్యములను వివరించుచున్నాడను) అని శ్రీభాష్య మనెడు తన గ్రంథారంభమున శ్రీ రామానుజాచార్యులవారు చెప్పియున్నారు. వారు దానిని చేపట్టి సంక్షిప్తముగా చేసిరి. దానినే మన మీనాడు చూచుచున్నాము. బోధాయనులవారి వ్యాఖ్యానమును చూచు నవకాశము నామట్టుకు నాకెన్నడును లభింపలేదు. వ్యాససూత్రములకు బోధాయనులవారు చేసిన వ్యాఖ్యానమును తప్ప తక్కిన వ్యాఖ్యానములన్నిటిని కీ॥ శే॥ స్వామి దయానందసరస్వతి త్రోసివేయ జూచిరి. వీలున్నపుడెల్ల రామానుజాచార్యులవారిని ఖండించుచుండిన ఈయనయు ఆ బోధాయనభాష్యమును చూపజాలక పోయిరి. నేను భారతదేశమందంతటను దానికొఱకై వెదకితిని. ఇంతవరకు అది నాకనుల బడలేదు. కాని తాను బోధాయన భాష్యములోని భావములను తీసికొనుచున్నటులును, కొన్ని సందర్భములందు అందలి వాక్యములనే తాను సంగ్రహించుచున్నటులును ఆ భావములను సంగ్రహించియే ఇప్పటి రామానుజభాష్యమును సిద్ధముచేసినట్లును శ్రీ రామానుజులవారు స్పష్టముగా తెలిపియున్నారు. శంకరాచార్యులవారును అట్టిపనినే చేసినటుల కాన్పించుచున్నది. ప్రాచీనవ్యాఖ్యానము లుదాహరింపబడిన స్థలములు కొన్ని శంకరభాష్యమునందును గలవు. శ్రీ శంకరాచార్యులవారి గురువును, వారి గురువుయొక్క గురువును, అదే సంప్రదాయమునకు చెందిన వేదాంతు లగుటయేకాక కొన్ని విధములం దీయనకంటె వారు ఆ మతమందు ఎంతో యెక్కువ

చారవను సాహసమును చూపినవా రగుటచేత ఆయన బోధించిన దొక స్వనిర్మిత నూత్నమతము కానేకాదనుట స్పష్టము. శ్రీ రామానుజాచార్యులవారు తమ భాష్యమును బోధాయన భాష్యమును ఆధారము చేసికొని రచించినటులనే శంకరాచార్యుల వారును తమ భాష్యము నొక పూర్వభాష్యము నాధారముచేసి కొని రచించియుందురు గాని వీ రే భాష్యమును అనుసరించినదియు ఇప్పుడు కనుగొనుటకు వీలులేకున్నది. మీ రెన్న డేని కని విని యుండు దర్శనము లన్నియు ఉపనిషత్తుల ప్రమాణముమీద ఆధారపడి యుండునవియే. అది శ్రుతిప్రమాణమని చెప్పినప్పు డెల్ల ఉపనిషత్తులనియే వాని అభిప్రాయము. అవి సదా ఉపనిష త్ప్రమాణములనే ఉదాహరించుచుండెను. ఉపనిషత్తుల తర్వాతనే భారతదేశపు ఇతర తత్త్వశాస్త్రములు వచ్చుచున్నవి. కాని వానిలో ఏదియు భారతదేశమునందు వ్యాసులవారి తత్త్వశాస్త్రము పొందినంత ప్రామాణ్యమును పొందలేక పోయెను. ఈ వ్యాసుల వారి తత్త్వసిద్ధాంతము సైతము అంతకు ముందుగల కపిలుని సాంఖ్యసిద్ధాంతముయొక్క పరిణామమే! ఒక్క భారతదేశము నందలివే గాక ప్రపంచమందలి ప్రతి తత్త్వసిద్ధాంతమును కపిలు నికి అపారముగా ఋణపడినదే. తత్త్వసిద్ధాంతవిషయముననుం, మనశ్శాస్త్రవిషయముననుం భారతదేశచరిత్రయందు కపిలుని నామమే అత్యగ్రగణ్యమని చెప్పవచ్చును. కపిలుని ప్రభావము ప్రపంచమునందు ఎల్లెడల గోచరించుచున్నది. గణుతికెక్కిన తత్త్వసిద్ధాంతము వెలసినచోట నెల్ల కపిలుని సిద్ధాంతప్రభావము మీరు గుర్తింప జాలుదురు. వేలకొలది సంవత్సరములు గడచి పోయినను ఈ మహాత్ముడు, కపిలుడు అసదృశతేజోమూర్తియై, అద్భుతప్రభావుడై యిప్పటికిని నిలిచియేయున్నాడు. అతని తత్త్వసిద్ధాంతమున చాలభాగమును, అతని మనశ్శాస్త్రమును, భారతదేశమునందు—బహుస్వల్పభేదాభిప్రాయముతో — అన్ని సంప్రదాయములవారును అంగీకరించుచున్నారు. మన (వంగ)

దేశమునందు మన నైయ్యాయికదార్శనికులు భారతీయ తత్త్వ శాస్త్రజ్ఞుల ఆమోదము నెక్కువగా పడయజాలక పోయిరి. వీరు వర్గోపవర్గాది క్షుద్రవిషయములందును అతిక్లిష్టమగు పారిభాషిక భాష నభ్యసించుటందును జీవితకాలమునంతయు వ్యర్థపఱచుకొనుచు తర్కమునందే మునిగిపోయి తత్త్వసిద్ధాంతములను వేదాంతులకు వదలివేసిరి. ఈ నవీనకాలమున భారతీయతత్త్వజ్ఞులలోని అన్ని సంప్రదాయములవారును వంగదేశపు నైయ్యాయికుల తర్కపరిభాషనే అవలంబించుచున్నారు. గదాధర, జగదీశ, శిరోమణి నామములు నదీయాజిల్లాలో (నవద్వీపము ఆ జిల్లాలోనిది) ఎంత ప్రఖ్యాతి గలవిగ నున్నవో, మళయాళదేశమందలి కొన్నినగరములందును అంతటి ప్రఖ్యాతిని పడసియే యున్నవి. కాని వేదాంతవిషయమున మాత్రము "వ్యాససూత్రములు" సుస్థిరస్థానమును పడసి, తత్త్వసిద్ధాంతమునందలి వేదాంతపక్షము ఏ బ్రహ్మమునుగూర్చి మానవులకు బోధించుచున్నదో, ఆ బ్రహ్మము వలెనే శాశ్వతముగ వ్యాససూత్రములుకూడ దేశమున నాటుకొనిపోయినవి. తర్కము అనునది శ్రుతిప్రమాణమునకు పూర్తిగా తలయొగ్గవలసివచ్చినది. శ్రీ శంకరాచార్యులవారు ప్రవచించినటుల వ్యాసుడు తర్కములో ఏమాత్రమును దిగలేదు. సూత్రములను వ్రాయుటలో వారి ముఖ్యోద్దేశము వేదాంత వాక్య ప్రసూనములను ప్రోగుచేసి ఒక్కదారములో హారము కూర్చుటయే. ఉపనిషత్తుల ప్రమాణమునకు లోబడియున్నంతవఱకు మాత్రమే ఆ సూత్రములు అంగీకరింపబడుచున్నవి. అంతకు మించిన ప్రామాణికత వానికి లేదు.

నేను చెప్పునటుల భారతదేశములోని అన్ని సంప్రదాయముల వారును ఈ వ్యాససూత్రములను పరమ ప్రమాణముగా అంగీకరించుచున్నారు. భారతదేశములోని ప్రతి నూతన సంప్రదాయమును తన దృక్పథానుకూలముగా ఈ వ్యాససూత్రములకు

ఒక క్రొత్త వ్యాఖ్యానమును కూర్చుటకు యత్నించును. ఈభాష్య కర్తలలో గల భేదములు ఒక్కొక్కప్పుడు చాల గొప్పవిగా నుండును. కొన్ని సమయములందు వారు శ్రుతివాక్యములను తికమకలుచేయుట చూడ వెగటు పుట్టుచుండును. వ్యాససూత్రములకు పరమప్రమాణపదవి సిద్ధించినది. ఎవనికి గాని వేదాంత సూత్రముల మీద ఒక నూతనభాష్యమును రచించు వఱకును భారతదేశములో క్రొత్త సంప్రదాయమును నిర్మించు నధికారము కలుగదు.

ఆ పిమ్మట ప్రామాణికత భగవద్గీతకు కలదు. సుప్రసిద్ధమగు శంకరాచార్యులవారి ఘనత అంతయు గీతాప్రచారమునందే యున్నది. గీతను బోధించుట, దానిని గుఱించి బహుసుందరమగు భాష్యమును రచించుట ఈ మహాపురుషుడు తన దివ్యజీవితమున గావించిన అనేక ఘనకార్యములలోని కెల్ల ఉత్తమోత్తమ కార్యము. భారతదేశమున ఆస్తిక సంప్రదాయనిర్మాత లందఱును ఆ పిదప ప్రతివారును ఒక్కొక్క గీతాభాష్యమును రచించి యున్నారు.

ఉపనిషత్తులు పెక్కులు కలవు. అవి నూట ఎనిమిది అని ప్రతీతి. కాని ఇంకను చాల కలవని కొందఱనుచున్నారు. వీనిలో కొన్ని అనంతరకాల విరచితములనుట స్పష్టము. ఉదాహరణగా అల్లాను స్తోత్రము చేయునట్టియు, మహమ్మదును రజసుల్లా అని పేర్కొను నట్టియు అల్లోపనిషత్తు ఒకటి గలదు. ఇది హిందువులకును, మహమ్మదీయులకును, సఖ్యము కూర్చుటకై అక్బరు కాలమున వ్రాయబడిన దట. ఎక్కడనో సంహితలయందు ఒకచోట అల్లా శబ్దమో, ఇల్లా శబ్దమో దొరకగానే దానిని పట్టుకొని దాని ఆధారమున ఒక ఉపనిషత్తును వ్రాసివేసిరి. ఈ రీతిగా అల్లోపనిషత్తులో మహమ్మదు "రజసుల్లా" అయిపోయినాడు — దాని అర్థము ఏమైనను కానిండు. ఇతర సాంప్రదాయకములగు ఉపని

షత్తులుకూడ ఇట్టివే గలవు. అవి కేవల నవీనములని మనము కనిపట్ట గలము. వేదములలో సంహితాభాగమునందలి భాష అతిప్రాచీన మైనది. ఆ ప్రాచీనభాషకు వ్యాకరణములేదు. కావున ఉపనిషత్తులను సృష్టించుట చాల సులభమైనపని. కొన్ని సంవత్స రముల క్రిందట వేదభాషయొక్క వ్యాకరణము నేర్చుకొను భావము నాకు కలిగెను. అంతట పట్టుదలతో పాణినీయవ్యాకరణ మును, మహాభాష్యమును చదువుట ప్రారంభించితిని. వైదిక వ్యాకరణము సూత్రములకుగల వ్యతిక్రమములతో నిండియుండుట జూచి అబ్బురపడితిని. ఒక సూత్రము ఉండును. దాని క్రిందనే ఈసూత్రము వ్యతిక్రమరూప మైనది అను వ్యాఖ్యానము గోచరిం చును. కాబట్టి ఎవరైనను, దేని నైనను రచించుటకు ఎంత స్వేచ్ఛ గలదో చూడుడు. ఈ స్వేచ్ఛను కొంత నిరోధించునది యాస్కుని నిఘంటువు ఒక్కటియే. కాని చాలవఱకు ఇందులో నుండునవి అసంఖ్యాకములగు సమానార్థకపదములు మాత్రమే. ఈపరిస్థితులలో మీకిష్టమువచ్చినన్ని ఉపనిషత్తులను వ్రాయుట ఎంత తేలికయో చూడుడు. ప్రాచీనవైదికశబ్దములవలె నుండు నట్లు చేయుటకు వలయు మాటలను కొంచెము సంస్కృత భాషా జ్ఞానమును సంపాదించు కొనిన చాలును. వ్యాకరణ భయము లేదు! కావున మీరు రజసుల్లానో, మఱేయితర సుల్లానో ఆవా హనము చేయవచ్చును. ఈ రీతిగా ఉపనిషత్తు లనేకములు సృజింపబడినవి. ఇప్పుడుగూడ అట్టివి సృజింపబడుచునే యున్నవని నా వినికిడి. భారతదేశమున కొన్నిప్రాంతములందు వేర్వేఱు తెగలవారు అట్టి ఉపనిషత్తులను సృజించుచున్నారని నాకు చక్కగా తెలియును. అయినను కొన్ని ఉపనిషత్తులలో, చూచిన మాత్రముననే సత్యసిద్ధములని తెలుపు గుఱుతులు కలవు. ఇట్టి వానిని మహాభాష్యకర్తలు, అందును ముఖ్యముగా శంకరులు, ఆ పిదప రామానుజులు మొదలగు ఆచార్యపురుషులు తీసికొని వానిపై వ్యాఖ్యానములను రచించియున్నారు.

ఉపనిత్తులను గుఱించి మీకు నేను తెలుప దలంచిన ఇంక నొకటి రెండు భావములు కలవు. అవి ఒక జ్ఞానమహాసముద్రము. కావున వానిని గుఱించి మాటాడుటకు నావంటి అల్పజ్ఞునకు సైతము వేండ్లును పూండ్లును పట్టును. ఎన్నో ఉపన్యాసము లీయవలసి యుండును. అందుచే వానిని పఠించువా రెఱుగవలసిన ఒకటి రెండు విషయములు మాత్రము మీకు తెలుపుదును. మొట్ట మొదటిది: ప్రపంచములోనెల్ల అవి అత్యద్భుతములగు కావ్య ములు. మీరు వేదములలోని సంహితాభాగమును చదివిన యెడల అప్పుడప్పుడు అత్యద్భుతములగు రమణీయవాక్యములు మీకు గోచరించును. ఉదాహరణకు—"తమ ఆసీ త్తమసాగూఢ మగ్రే" "చీకటి చీకటిలో మాటువడినప్పుడు" మున్నగు 'అవ్య క్త' వర్ణనగల సుప్రసిద్ధ శ్లోక మొకటి కలదు. ఆ కవిత్వమును చదివినచో అందలి ఉదా త్తత అనుభవమునకు వచ్చును. భారత దేశమునందును ఇతరదేశములందునుకూడ సుందరమగుదానిని వర్ణనచేయు ప్రయత్నములు జరిగెనని మీరు గుర్తుంచుకొనుడు. కాని ఆ అన్యదేశీయు లెప్పుడును కందరములందును, దృశ్య ప్రపంచమునందును, జడపదార్థమునందును, ఆకాశమునందును, అఖండత్వమును కనుగొనుటకే యత్నించిరి. మిల్టన్‌గాని, డాంటే గాని లేక ఏ పాశ్చాత్య కవివరుడుగాని ప్రాచీనుడైనను, అర్వాచీను డైనను అఖండతత్త్వముయొక్క స్వరూపమును చిత్రింప గోరు నప్పుడు వెలుపలికి ఎగిరి పో జూచును. ఉపాధి మూలమున అఖండతత్త్వమును నీ అనుభవమునకు తీసికొనిరా బ్రయత్నించును. అట్టి ప్రయత్నము ఇక్కడకూడ జరిగినది. సంహితలందు అఖండ వ్యాప్తి కన్నులకు కట్టినట్లు అద్భుతముగా ప్రదర్శింపబడినది. ఇంకెక్కడను అంత అద్భుతచిత్రణము కానిపింపదు. "తమ ఆసీ త్తమసాగూఢమ్" అను పైవాక్యమును గుర్తుంచుకొని చీకటిని గుఱించి ముగ్గురు కవులు చేసిన వర్ణనలను పరిశీలింపుడు. మన కాళిదాసు "సూచీభేద్యై స్తమోభిః" (సూది మొనతో గ్రుచ్చ

గల తమస్సు) అని వర్ణించినాడు. ఇక మిల్టనో "కాంతికాదు, రూపముదాల్చిన అంధకారము" అని వర్ణించినాడు. ఇక ఉపనిషత్తు నందలి వర్ణన చూడుడు : "చీకటి చీకటిని ఆవరించినది" లేక "చీకటి చీకటియందు దాగినది". ఉష్ణదేశములందు నివసించు మన కిది అర్థము కాగలదు. ఆకస్మికముగ వర్షాగమనమగును. కారుమబ్బులు ఆకసమంతటను అలముకొనును. ఇంకను ఎట నుండియో దొరలుకొని వచ్చు నల్లని మేఘములచే ఆవరింపబడి ఒక్క క్షణములో దిఙ్మండలమున చీకట్లు క్రమ్మును. సంహితా భాగమునందలి ఈ వర్ణన లన్నియు దృశ్యప్రపంచమునకు సంబంధించినవే. ఇతరదేశములందువలెనే ఇక్కడను ఈ జీవితమహా సమస్యయొక్క పరిష్కారప్రయత్నములు బాహ్యప్రపంచము ద్వారమున జరిగినవి. జిజ్ఞాసువులగు గ్రీకులును, ఇప్పటి యూరపి యనులును "జీవము" "పురుషుడు" మున్నగు అనేకపవిత్ర సమస్యలన్నిటికిని బాహ్యప్రపంచమునందే పరిష్కారమును అన్వే షింప బ్రయత్నించిరి. మన పూర్వులును అటులే చేసిరి. వారును యూరపియనులవలెనే విఫలులైరి. కాని పాశ్చాత్యులు ఇంకే ప్రయత్నమును చేయలేదు. అక్కడనే నిలిచి పోయిరి. ఈ జనన మరణ మహాసమస్యల పరిష్కారము కొఱకు బాహ్యప్రపంచము ననే వెదుకసాగిరి. బురదలో దిగబడినటుల అచ్చటనే ఆగిపోయిరి. మనపూర్వులుకూడ అది అసాధ్యమని కనుగొనిరి ; కాని ఆ పరి ష్కారమును తెలిసికొనుటకు ఈ ఇంద్రియములు ఎంతమాత్రమును సమర్థములు కావని ధైర్యముతో ప్రకటించిరి. ఈ నిర్ణయము ఉపనిషత్తునందుకంటె మిన్నగా మఱెచ్చటను ప్రకటింపబడలేదు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (అక్కడ నుండి మనస్సుతోసహా వాక్కు వెనుకకు మరలివచ్చును.) "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి" (ఈ నేత్రములు అచటికి పోజాలవు. వాక్కును చేరజాలదు.) ఈ విధముగా ఇంద్రియములు

బొత్తుగా అసమర్థములని ప్రకటించు వాక్యము లనేకములు గలవు. కాని వారంతట ఆగిపోక నరుని ఆభ్యంతరప్రకృతిమీాదికి దృష్టిని మరల్చి, తమ ఆత్మవలన సమస్యాపరిష్కారము సాధించుటకు యత్నించిరి. అనగా, బాహ్యప్రకృతియందు ఏమిచేయుటకును వీలులేకపోవుటచేతను, ప్రత్యుత్తరముగాని, ఆశగాని దొరకక పోవుటచేతను, వారు దృశ్యప్రకృతిని పూర్తిగ వదలివేసిరి. ఈ మూఢమగు నిర్జీవపదార్థము సత్యమును తెలుపజాలదని వారు గ్రహించిరి. అంతట నరునిలోని దివ్యాత్మకడకు మరలిపోయి అక్కడ సమస్యాపరిష్కారమును కనుగొనిరి.

'తమేవైకం జానథ, ఆత్మానాం అన్యా వాచో విముంచథ' (ఈ ఆత్మను మాత్రమే తెలిసికొనుడు. ఇతరమంతయు వ్యర్థ ప్రసంగము. అది చేయకుడు, వినకుడు) అని వారు ఘోషించు చున్నారు. ఆత్మయందు వారికి సంశయ పరిష్కారము చిక్కినది. అందే అన్ని ఆత్మలకు పరమాత్మ, దేవుడు, జగదీశ్వరుడు, నరుని ఆత్మతో వానికి గల సంబంధము, మనము వానియెడల నిర్వర్తింప వలసిన ధర్మము, తద్వారా పరస్పరము మనలో మనకు ఏర్పడు సంబంధము ఇవన్నియు వారికి విశదమైనవి. మఱియు ఈ సందర్భ ముననే ప్రపంచమున గల కవిత్వములో మనోహరతమమగునది కలదు. జడప్రపంచపు భాషలో ఈ ఆత్మను వర్ణనచేయు ప్రయ త్నము ఇంక వారు చేయలేదు. ఇంతేల వారు ఆ వర్ణనమున ప్రత్యక్షరూపమగు భాషనే విసర్జించి వేసిరి. ఇంద్రియములకు అఖండబ్రహ్మమును గుఱించిన భావమును కలిగించుటకై ఆ ఇంద్రి యములకడకు వారిక దిగి రాలేదు. దృశ్యమానమును, జడమును, నిర్జీవమును, పంచభూతమయమును, ఇంద్రియగమ్యమును, విశాల మును అగు అనంతలోకము మరల అందు గోచరింపదు. దానికి మారుగా మరియొకటి వచ్చును. ఈ క్రింది మనోహర వర్ణనము అందు కుదాహరణముగా కైకొనుడు :

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
  నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః
తమేవ భాంతమనుభాతి సర్వం తస్య
  భాసా సర్వమిదం విభాతి॥"

అహో! ప్రపంచములో దీనిని మించిన ఉదాత్త కవిత్వము ఏది! (అచ్చట సూర్యుడు ప్రకాశింపజాలడు. చంద్రుడు, నక్షత్రములు ప్రకాశింపజాలవు. మెఱుపు సైతము ప్రకాశింపజాలదు. ఇక ఈ అగ్ని మాట చెప్పనేల?) ఆహా! లోకమున ఇంతకంటెను మహోదాత్తమగు కవిత్వము ఉండగలదా! ఉపనిషత్తులలోనికెల్ల అత్యద్భుతమగు కఠోపనిషత్తును కైకొనుడు. ఎటువంటి అద్భుత నైపుణ్యము, ఎటువంటి విచిత్రకళాసంపత్తి ఆ కావ్యమునందు గోచరించుచున్నది! దాని ప్రారంభమే అబ్బురముగొల్పుచున్నది. శ్రద్ధచేత ఆవహింపబడిన లేబ్రాయపు పిల్లడు యముని చూడగోరును. గురువులలో నెల్ల కడు చిత్రమూర్తి యగు మృత్యుదేవతయే జనన మరణముల గుఱించిన మహారహస్యములను ఆ పిల్లవానికి బోధించును. ఆ పిల్లవాని అన్వేషణమందలి లక్ష్యమేది? మృత్యురహస్యమును కనుగొనుట!

మీరు జ్ఞప్తియం దుంచుకొనవలయునని నేను కోరెడు రెండవ విషయము ఇది. ఉపనిషత్తుల ప్రామాణికత మానవులపై ఆధారపడనే పడదు. వానియందు అనేక పురుషులు, అనేకవక్తలు, అనేకగురువులు ఉదాహరింపబడియుండుట నిజమే కాని, వానిలో ఒక్కడైనను ఈ ఉపనిషత్తులకు ఆధారభూతుడుకాడు. ఒక్కశ్లోకమైనను వారిలో నొకని జీవితముపై ఆధారపడియుండ లేదు. వీరందఱును వెనుక నెక్కడనో మెదలుచుందురు, వారి నీడలుమాత్రము తెరమీద కానిపించునో అన్నట్లుండును. వారు పట్టుకొనుటకు చిక్కరు. చూపులకు దొరకరు. ఇట్టివారని విస్పష్టముగా గోచ

రింపరు. ఉపనిషత్తులు వారిపై నాధారపడినవి కానే కాదు. వానికి గల బలమంతయు అందలి అత్యద్భుతములు, దేదీప్యమానములు, జ్ఞానతేజోమయములు అగు వాక్యములందే కలదు; రచయితల మీాద కాదు. యాజ్ఞవల్క్యులు ఇరువదిమంది పుట్టుదురుగాక, జీవింతురుగాక, మరణింతురుగాక లెక్క లేదు. లెక్కకువచ్చునవి శ్రుతివాక్యములే. శ్రుతివాక్యములు వ్యక్తులపై ఆధారపడనివి, కాని యే వ్యక్తులను ఖండింపవుకూడ. ప్రపంచమున ఇదివఱకు ఉద్భవించినట్టియు ఇంక నుద్భవింపనున్నట్టియు వ్యక్తుల నందఱిని తన కౌగిట చేర్చుకొనజాలునంతటి విశాలత, ఆదరణ అందు కలవు. నరులను, అవతారులను, ఋషివరులను పూజించుటకు అది అడ్డు చెప్పదు. పైగా అట్టిదానిని సదా సమర్థించును. కాని దానికి మానవులతో సంబంధము లేదు. ఉపనిషత్తులు ప్రతిపాదించు ఈశ్వరునికి అనగా నిర్గుణునికి పురుషభావమెట్లు లేదో అట్లే అందలి వాక్యములకును పురుషాధారము, పురుషసంబంధము లేకుండుట అద్భుతమగు విషయము. ఆధునికభౌతికశాస్త్రజ్ఞుడు సత్యమెంత అనన్యాధారమై యుండగోరునో అంత స్వయంప్రామాణికతతో ఈ ఉపనిషత్సత్యములు జ్ఞానసిద్ధులకును, జిజ్ఞాసువులకును, తత్త్వజ్ఞులకును, తార్కికులకును గోచరించును. ఇవియే మన ప్రమాణ గ్రంథములు. క్రైస్తవులకు బైబులు ఎట్టిదో, మహమ్మదీయులకు ఖురాను ఎట్టిదో, బౌద్ధులకు త్రిపిటకము ఎట్టిదో, పారశీకులకు జండఅవెస్టా ఎట్టిదో మనకు ఉపనిషత్తులు అట్టివని మీరు జ్ఞప్తియందుంచుకొనవలయును. పురాణములు, తంత్రములు మున్నగు గ్రంథములన్నియు, చివరకు వ్యాససూత్రములుసైతము, ద్వితీయములును తృతీయములును అగు ప్రమాణములే. ప్రప్రథమ ప్రమాణము వేదములు. మనుధర్మశాస్త్రముగాని, పురాణములుగాని మఱి ఏ ఇతర గ్రంథములుగాని ఉపనిషత్తుల కనుకూలముగా నుండు నంతవఱకే పరిగ్రాహ్యములు. ప్రతికూలములగునప్పుడు నిర్దాక్షిణ్యముగ వానిని త్రోసి వేయవలసినదే. ఈ విషయము

మనము ఎల్లప్పుడును జ్ఞప్తియందుంచుకొనదగినది. కాని దుర దృష్టము వలన భారతదేశము ఈ కాలమున ఆ మాట మఱచి పోయినది. ఏ అల్పగ్రామాచారమో మన కిప్పుడు యథార్థమగు ప్రమాణముగా కాన్పించుచున్నది. ఉపనిషత్తులబోధ అటుల కాన్పించుట లేదు. వంగదేశమున ఏ మారుమూల గ్రామము లోనో వాడుకలో నున్న స్వల్పాభిప్రాయము వేదవాక్యమంతటి అధికారము కలదిగా, అంతకంటె అధికమైనదిగా కూడ పరిగణింప బడుచున్నది. 'పూర్వాచారము' అను శబ్దమునకు ఎంతటివిచిత్ర మహిమకలదో చూడుడు! గ్రామవాసికి కర్మకాండలోని అత్య ల్పాంశ మొక్కటి అత్యధిక గౌరవాస్పదమగు సదాచారముగా కాన్పించుచున్నది. దానిని అనుసరింపనియెడల వానిని "పో, నీ వింక హిందువుడవు కావు" అని నెట్టి వేయుదురు. అటులే ఏదో ఒక తంత్రమును చేపట్టి "ఈ తాంత్రికాచారమును అనుసరించి తీరవలయు" ననెడు వారు దురదృష్టవశమున నా మాతృభూమి యందు అసంఖ్యాకముగా నున్నారు. వారి అభిప్రాయములో అటుల చేయనివాడు సదాచారి కాడు. కాబట్టి ఉపనిషత్తుల యందే ప్రధానప్రామాణ్యము కలదనియు, గృహ్యసూత్రములకు శ్రౌతసూత్రములకు సైతము వేదములకంటె తక్కువ ప్రామా ణ్యమే కలదనియు జ్ఞప్తియందుంచుకొనుట మనకు ముఖ్యము. అవి మనపూర్వులగు మహాఋషుల వాక్కులు. నీవు హిందువు కాగోరుదువేని వానిని విశ్వసింప వలయును. భగవంతుని గుఱించి నీకు ఏవేవో స్వతంత్రభావము లుండవచ్చును. కాని వేదములు ప్రమాణములు కావంటివా నీవు నాస్తికుడవే. క్రైస్త వులయొక్కయు బౌద్ధులయొక్కయు మతగ్రంథములకును, మన మతగ్రంథములకును భేదము ఇక్కడనే యున్నది. వారివన్నియు పురాణములే, శాస్త్రగ్రంథములు కావు. ఏలయన వానియందు జలప్రళయకథనమును, రాజవంశ చరిత్రలును, రాజజీవితములును, మహాపురుషుల జీవితములును ఇట్టి వనేకము లభివర్ణింపబడి

యున్నవి. ఇది పురాణ లక్షణము. అవి వేదములకు అనుగుణ ముగా ఉన్నంతవఱకు మంచివే; బైబులును, ఇతరజాతుల ధర్మ గ్రంథములును వేదములను అనుసరించినంతవఱకు పూర్ణముగా యోగ్యమైనవే; వ్యతిరేకముగా నున్నపుడు, గ్రాహ్యములు కాజాలవు. ఖురాన్ విషయముకూడ అంతియే. దానియందు నీతి బోధలు అనేకము కలవు. అవి వేదములకు అనుగుణముగా నున్నంతవఱకు వానికి పురాణములతో సమానమగు ప్రామాణికత సిద్ధించును, అంతకుమించిన గౌరవము లేదు. మనవేదములు అపౌరుషేయములనియు, వానికి ఆది లేదనియు హిందూమత భావము. ఒక క్రైస్తవమతప్రచారకుడు తమ మతగ్రంథములు చారిత్రక లక్షణములు కలవిగాన అవి సత్యములని నాతో ఒక ప్పుడు చెప్పినాడు. అందులకు నేనిట్లు ప్రత్యుత్తరము చెప్పితిని. "మా శాస్త్రములకు చారిత్రక లక్షణములు లేవు. అందువలననే అవి సత్యములైనవి. మీవి చరిత్రాత్మకములు కాబట్టి ఎవడో ఒకడు ఇటీవల వానిని వ్రాసియుండును. మీవి మానవనిర్మితములు; నావియో అట్టివికావు. నావానికి చారిత్రకలక్షణము లేకపోవు టయే వానికి వన్నె దెచ్చుచున్నది" ఇదియే వేదములకును ఈ నాడు ప్రపంచమునగల ఇతర మతగ్రంథములన్నింటికిని గల తారతమ్యము!

ఇక ఉపనిషత్తుల బోధలను విచారింతము. భిన్న భిన్నము లగు వాక్యములు వానియందు కలవు. అందు కొన్ని పూర్తిగా ద్వైతపరములు, మఱికొన్ని అద్వైతపరములు. అయినను భారత దేశమునగల వివిధశాఖాసంప్రదాయముల వారందఱిచేతను అంగీక రింపబడిన సిద్ధాంతములు కొన్ని కలవు. ఒకటి సంసారమును గుఱించిన, అనగా జీవుని జన్మాంతరమును గుఱించిన, సిద్ధాంతము. రెండవది మానసిక శాస్త్రవిషయమందలి ఏకీభావము. మొదట శరీర మొకటి యున్నది. దానిలోపల సూక్ష్మశరీరమనబడెడు

మనస్సు కలదు. దానికిని లోపల జీవుడుండును. పాశ్చాత్యుల మానసిక శాస్త్రమునకును, భారతీయుల మానసికశాస్త్రమునకును ఇదియే ముఖ్యభేదము. పాశ్చాత్య మనస్తత్త్వశాస్త్రమునందు మనస్సే ఆత్మయనబడును. ఇక్కడనో అటుల కాదు. అంతఃకరణము (లోపలనుండు ఉపకరణము) అనబడెడు మనస్సు జీవుని స్వాధీనములోనుండు ఒక పనిముట్టు మాత్రమే. దీనిసాహాయ్యమున జీవుడు శరీరముమీదను, బాహ్యప్రపంచముమీదను పని చేయును. ఈ విషయమున అందఱికిని ఏకాభిప్రాయము కలదు. "ఈ జీవుడు లేక ఆత్మ (లేక జీవాత్మ అని కొన్ని సంప్రదాయముల వారిచేత పిలువబడునది) ఆదిలేనిదియు, నిత్యమును అనియు, అది తుదిని మోక్షమును పొందువఱకు జన్మపరంపరలను పొందుచు సాగిపోవును" అనియు అందఱును అంగీకరించుచున్నారు. ఇంకొక విషయమునందు గూడ వీరందఱును ఏకీభవించుచున్నారు. పాశ్చాత్యసిద్ధాంతములకును భారతీయసిద్ధాంతమునకునుగల ప్రాణప్రాయమగు భేదమును అత్యంత స్పష్టముగా అత్యంతప్రధానముగా ఇదియే గుర్తింప జేయును. సర్వమును ఆత్మయందే కలదనెడు సిద్ధాంతమే ఇది. ఎక్కడనో వెలుపలనుండి వచ్చునదేదియు లేదు. నిజమునకు అంతయు లోపలినుండి వెలికివచ్చునదే. సకల శక్తులును, సర్వపవిత్రతయు, సమస్త మహనీయతయు ఆత్మయందే ఉన్నవి. యోగి పొందగోరు అణిమ, లఘిమ, గరిమ, మొదలగు అష్టసిద్ధులు, నిజమునకు "సంపాదింపబడునవి" కావనియు, అవి ఇదివరకే ఆత్మలోనున్నవి గనుక వానిని వ్యక్తరూపమునకు తెచ్చుటకే తాను ప్రయత్నించుచున్నాననియు యోగి చెప్పును. మీ పాదములక్రింద ప్రాకులాడు అత్యల్ప క్రిమియందు సైతము ఈ ఎనిమిది విధములగు యోగసిద్ధులును ఇదివఱకే ఉన్నవని పతంజలి చెప్పుచున్నాడు. భేదమంతయు శరీరమువలన అనగా ఉపాధివలన కల్పితమగుచున్నది. ఆ క్రిమి ఉత్తమతర శరీరమును పడసిన తోడ్తోడనే ఈ మహిమలు వ్యక్తములగును. అంతేగాని అవి

అక్కడ నున్నవే! "నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణ భేదస్తు తతః క్షేత్రికవత్" (సత్కార్యములుగాని దుష్కార్యములుగాని స్వభావ పరివర్తనమునకు ప్రత్యక్ష కారణములు కావు. కాని అవి ప్రకృతి పరిణామమున కడ్డుపడు ఆటంకములను ఛేదించుటకు మాత్రమే పనికివచ్చును — సేద్యగాడు నీటి మార్గమును అడ్డగించు దిబ్బలను ఛేదించినంతనే ఆ నీరు తన స్వభావముచేతనే ప్రవహించునట్లు.) ఎక్కడనో ఉన్న మహాతటాకమునుండి తన పొలములోనికి నీటిని పాఱించుకొను సేద్యగాని సుప్రసిద్ధోదాహరణమును ఈ సందర్భమున పతంజలి ఇచ్చుచున్నాడు. తటాకము ఇదివఱకే నీటితో నిండి యున్నది. ఒక్కక్షణములో అది వాని పొలమును నింపివేసియుండును, కాని పొలములకును, తటాకమునకును పెద్దకట్ట అడ్డమున్నది. ఈ అడ్డము తొలగింపగానే ఆ నీరు స్వశక్తిచేతను, స్వబలముచేతను పరుగులిడి వచ్చును. ఈ ప్రబల శక్తియు, పవిత్రతయు, పూర్ణతయు ఇదివఱకే ఆత్మయందున్నవి. ఉన్న అవరోధమంతయు దానిపైని కప్పియున్న ముసుగునుబోలు ఈ ఆవరణమే. ఎప్పుడు ఈ ముసుగు తొలగునో అప్పుడే ఆత్మ పవిత్రతను పడయును; దాని మహిమలన్నియు వ్యక్తరూప మొందును. పాశ్చాత్య భావమునకును ప్రాచ్యభావమునకును గల మహాభేద మిదియేయని మీరు జ్ఞప్తియందుంచుకొనవలయును. ఈ భావభేదమువలననే "మానవులు ఆజన్మ పాపులు" మున్నగు విపరీత సిద్ధాంతములను బోధించుటయు, అట్టి విపరీతసిద్ధాంతములను విశ్వసింపని మనబోంట్లను దుశ్చరితులనుటయు కలుగుచున్నది. మనము స్వాభావికముగనే దుష్టులమైన యెడల మనమింకెన్నడును యోగ్యులము కాజాలమని వారు నిదానించి ఆలోచింపరు—స్వభావము మాఱనేరదు గదా. మాఱినచో దానిని స్వభావమనుటలో భావవైరుద్ధ్యము కలదు.—మాఱునది స్వభావము కాజాలదు. మనము దీనిని జ్ఞప్తియందుంచుకొనవలయును.

ఈ విషయమున ద్వైతులును, అద్వైతులును, భారతదేశము లోని తక్కిన వారందఱును ఏకాభిప్రాయులుగ నున్నారు.

భారతదేశమున అన్ని సంప్రదాయములవారును విశ్వసించెడు మఱియొక విషయము దేవుడు కలడనుట. దేవుని గుఱించి వారి భావములు భిన్నములనుట నిజమే. ద్వైతులు సగుణబ్రహ్మమును సగుణబ్రహ్మమునే విశ్వసింతురు. సగుణుడు అను మాటయొక్క అర్థమును మీరింక కొంచెము వివరముగా తెలిసికొనవలయునని కోరుచున్నాను. భగవంతునకు ఒకశరీరము కలదనియు, అతడు ఎక్కడనో ఒక సింహాసనముమీద కూర్చుండి ఈ ప్రపంచమును ఏలుచుండుననియు ఆ మాటకు అర్థముకాదు. సగుణు డనగా గుణములతో కూడిన వాడు అనియే అర్థము. సగుణదైవతముయొక్క వర్ణనలు అనేకములున్నవి. ఈ జగత్తుయొక్క పరిపాలకుడుగను, సృష్టికర్తగను, రక్షకుడుగను, లయకర్తగను ఉండు ఈ సగుణదైవతమును అన్ని సంప్రదాయముల వారును నమ్ముదురు. కాని అద్వైతులు మఱికొంతకూడ నమ్ముదురు. గుణనిరూపణము పొసగనిచోట ఏ విశేషణమును పనికిరాదు. ఈ సగుణదైవతమునకు ఒక ఉన్నతదశ కలదనియు, అందది సగుణ నిర్గుణమై భాసించుననియు వారి నమ్మకము. విశేషములు లేనివానిని వర్ణించు విశేషణము లెట్లుండగలవు? కావున అద్వైతి భగవంతునకు సత్తు, చిత్తు, ఆనందము అనెడు మాటిని తప్ప ఏ గుణములను ఆరోపింపడు. అఖండ సచ్చిదానందమనియే అద్వైతియొక్క భగవద్వర్ణనము. శంకరాచార్యులవారు చేసినది ఇదియే. కాని ఉపనిషత్తు లింకను లోతునకు దిగి ఆ బ్రహ్మమును గుఱించి "నేతి, నేతి" అనగా "ఇది కాదు, ఇది కాదు" అనుటతప్ప ఇంకేమియును వివరించుటకు వీలుకాదని చెప్పుచున్నవి.

భారతదేశమునందలి భిన్నసంప్రదాయములన్నియు ఈ యంశమునందు ఏకీభవించుచున్నవి. కాని ద్వైతపక్షమునుగూర్చి

మాట్లాడునప్పుడు, ద్వైతసిద్ధాంతములకు ఆధునిక ముఖ్యప్రతినిధి యగు శ్రీ రామానుజాచార్యులవారిని భారత దేశములోని ద్వైతులకు ఆదర్శమూర్తినిగా భావించి మాటాడుదును. ఈ భారత దేశములో ఇతర ప్రాంతములందు పుట్టిన మహామతకర్తలను గుఱించి వంగదేశములోని మనప్రజలకు తెలిసినది బహుస్వల్పము. ఇది మిక్కిలి శోచనీయము. మహమ్మదీయ యుగమునందు ఒక్క మన చైతన్యులవారు తప్ప, తక్కిన గొప్ప మతకర్తలందఱును దక్షిణభారత దేశమునందే జన్మించిరి. దక్షిణభారత దేశపు మేధాబలమే ఇప్పుడు నిజముగా భారతదేశమును పరిపాలించుచున్నది. ఏలయందురా, చైతన్యులవారు సైతము అచ్చటి సంప్రదాయములలో ఒకటియగు మధ్వసంప్రదాయములోని యొక శాఖకు చెందినవారే! రామానుజాచార్యులవారి సిద్ధాంతము ననుసరించి దేవుడు, జీవుడు, ప్రకృతి అనెడు మూడును శాశ్వతమైనవి. జీవులు నిత్యులు; సర్వకాలము వ్యక్తిస్వరూపులై శాశ్వతముగ నుందురు. వాని వ్యక్తిత్వ మెప్పటికిని అట్లే నిలిచియుండును. మీ ఆత్మ శాశ్వతకాలము నా ఆత్మనుండి వేఱుపడియే యుండునని రామానుజాచార్యులవారు పల్కుచున్నారు! ఆత్మ కలదనుటయు భగవంతుడు కలడనుటయు ఎటుల యథార్థమో, ఈప్రకృతి శాశ్వతమై యుండుననుటయు అటుల యథార్థమే. ప్రకృతికూడ శాశ్వతముగా వేరుపడియే నిలిచియుండును. భగవంతుడు సర్వాంతర్గతుడును, జీవాత్మకు సారభూతుడగువాడును. అతడు అంతర్యామి. ఈ అర్థమున భగవంతుడు ఆత్మతో ఐక్యమై యుండుననియు ఆత్మకు మూలసత్త్వమనియు ఒక్కొకప్పుడు రామానుజులవారు భావించుచున్నారు. ప్రళయకాలమునందు ప్రకృతి యంతయు "సంకుచిత" మగునప్పుడు ఈ ఆత్మలన్నియు సంకోచము పొంది అనగా ముడుచుకొని నలుసులవలె నేర్పడి అటుల కొంతకాలము నిలిచియుండునని ఆయన అభిప్రాయము. ఆతర్వాత కల్పారంభమున ఈ ఆత్మలన్నియు తమ తమ పూర్వ

కర్మానుసారముగా వెలువడి వచ్చి ఆ కర్మఫలములను అనుభవించు చుండును. ఆత్మయొక్క సహజమగు అమలత్వమును, పూర్ణత్వమును, సంకోచపఱచు ప్రతికార్యమును పాపకార్యమనియు ఆ ఆత్మను వెలికిదీసి వికసింపజేయు ప్రతి కర్మయు పుణ్యకార్యమనియు శ్రీ రామానుజులవారు చెప్పుచున్నారు. ఆత్మవికాసమునకు తోడ్పడు ప్రతి కార్యమును ధర్మమగును. దానిని సంకోచింపజేయునదెల్ల అధర్మమగును. ఇటుల ఆత్మ తనకర్మలచేత వికాసమును, సంకోచమును పొందుచు పోయి పోయి భగవదనుగ్రహము వలన తుదకు మోక్షమును పడయును. అటువంటి అనుగ్రహము కొఱకు నిష్కళంకముగా తీవ్రప్రయత్నము చేయునట్టి అన్ని ఆత్మలకును ఆ భగవదనుగ్రహము లభించునని శ్రీ రామానుజాచార్యులవారు చెప్పుచున్నారు.

"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" అను ప్రసిద్ధవాక్యము శ్రుతియందు గలదు.—ఆహారము శుద్ధముగా నున్నప్పుడు సత్త్వము శుద్ధమగును. సత్త్వము శుద్ధమగునప్పుడు స్మృతి శుద్ధమగును. స్మృతి అనగా "ఈశ్వరజ్ఞప్తి"; నీవు అద్వైతి వైనచో "మన పరిపూర్ణతయొక్క జ్ఞప్తి" అని అర్థము చెప్పుకొనవచ్చును. సత్త్వము శుద్ధముగా నున్నప్పుడు ఈ స్మృతి సత్యతరమును, స్థిరతరమును, అవ్యయమును అగును. ఇది యొక మహావివాదఘట్టము. మొట్టమొదట "సత్త్వము" అనగా ఏమి? శరీరము మూడువిధములగు పదార్థముల కూడికచేత ఏర్పడుచున్నది—గుణములచేత కాదు. ఇది సాంఖ్యసిద్ధాంతము; దీనిని మన తత్త్వసాంప్రదాయికులందఱును అంగీకరించుచున్నారు. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి గుణములని సామాన్యముగా అభిప్రాయపడుచున్నారు. అటుల కాదు. అవి ఎంతమాత్రమును గుణములుకావు. అవి ఈ జగత్తుగా ఏర్పడిన ద్రవ్యములే! ఆహారశుద్ధితో, అనగా ఆహారము పరిశుభ్రముగానున్న యెడల సత్త్వ

మను ద్రవ్యము శుద్ధమగుచుండును. ఇట్టి సత్త్వమును సంపాదించుటే వేదాంతముయొక్క ప్రధానాశయము. నే నిదివఱకే చెప్పియున్నటుల ఆత్మ స్వతస్సిద్ధముగా శుద్ధమును పూర్ణమును అయినది. కాని అది రజస్సు, తమస్సులయొక్క అణువులతో ఆవరింపబడి పోయినదని వేదాంతసిద్ధాంతము. ఈ మూటిలో సత్త్వాణువులు మిక్కిలి ప్రకాశవంతములుగా నుండును. వెలుతురు అద్దముగుండా చొచ్చుకొని పోజాలునంత సులభముగా ఆత్మయొక్క ప్రకాశము ఈ సత్త్వాణువులగుండా చొచ్చుకొని పోగలదు. కాబట్టి రజస్తమస్సుల అణువులు పోయి సత్త్వాణువులు మిగులు నెడల, ఆ దశయందు ఆత్మయొక్క మహిమయు అమలత్వమును వ్యక్తములై ఆత్మస్వరూపమును ఎక్కువగా ప్రకటించును.

కాబట్టి ఈసత్త్వమును సంపాదించుకొనుట అవసరము. "ఆహారము శుద్ధముగా నున్నప్పుడు" అని శాస్త్రోక్తి. ఈ ఆహారమనుమాటకు భోజనము అని అర్థము చేసి రామానుజులవారు తమ సిద్ధాంతమునందు దీనికొక ముఖ్యస్థానమిచ్చినారు. అంతటితో పోక అది హిందూదేశ మంతకును, అన్ని సంప్రదాయములకును వ్యాపించినది. కాబట్టి దీని అర్థమేమో బాగుగా విచారణ చేయుట అవసరము. ఏలయన రామానుజాచార్యులవారి అభిప్రాయము ననుసరించి ఈ ఆహారశుద్ధి మనజీవితమునందు ప్రధాన విషయములలో నొకటి యగుచున్నది. ఆహారమును అపరిశుద్ధము చేయునది ఏదని శ్రీరామానుజాచార్యులవారు విచారించుచున్నారు. మూడువిధములగు దోషములు అన్నమును అపరిశుద్ధపఱచును. ఒకటి జాతిదోషము; అది ఆ పదార్థముయొక్క జాతికే స్వతస్సిద్ధమైనది. ఉదాహరణ: నీరుల్లి, వెల్లుల్లి మొదలగువాని యందలి వాసన. రెండవది ఆశ్రయదోషము; ఇది ఆహారము ఎవనియొద్దనుండి వచ్చునో ఆ నరునివలన కలుగునది. దుష్టుల ఆహారము అపరిశుద్ధత కల్పించును. భారతదేశములో మహాపురు

షులు అనేకులు తమ జీవితమునందంతటను ఈ విషయమును నిష్కర్షగా పాటించుట నేను స్వయముగా నెఱుగుదును. ఆ ఆహారము తీసికొని వచ్చినవారు ఎవరో, దానిని తాకినట్టి వా రెవరో తెలిసికొనుశక్తి వారికుండెడిది. ఒకసారిగాక అనేక పర్యాయములు నా జీవితములో ఈ విషయమును నేను చూచియున్నాను. మూడవది నిమిత్తదోషము. అనగా అపరిశుద్ధ వస్తువులయొక్కగాని, విషయములయొక్క గాని దోషము ఆహారమునకు తగులుట. దీనిని గుఱించి మనమింక కొంత జాగ్రత్తగా విచారించుట మంచిది. మురికి, దుమ్ము, పెంట్రుకలు కలిసిన ఆహారము నుతినుట ఈ దేశములో అలవాటైపోయినది. ఈ మూడుదోషములు తొలగింపబడిన ఆహారము సత్త్వశుద్ధిని కలుగజేయును. అనగా సత్త్వమును శుద్ధిచేయును. ఆస్తికధర్మజీవన మప్పుడు మిక్కిలి తేలికగా ఆచరింప వీలుకల్గును. పరిశుద్ధమైన ఆహారమును తినుటచేతనే సాధ్యమగునెడల ప్రతివాడును ధర్మజీవనమును ఆచరింపగలడు. నాకు తెలిసినంతలో ఈ మూడు దోషములను తొలగించుకొనజాలనంత అప్రయోజకుడు, అశక్తుడు ఈ ప్రపంచములో ఎవడును లేడు. ఇక శంకరాచార్యులవారు ఈ ఆహారశబ్దమునకు మనస్సులో చేరిన సంకల్పరాశియని అర్థముచేసి ఆ సంకల్పరాశి శుద్ధమగు నప్పుడు సత్త్వము శుద్ధమగునేగాని అంతవఱకును కాజాలదు అని పలుకుచున్నారు. నీ యిష్టమగుదానిని నీవు తినవచ్చును. ఆహారము మాత్రమే సత్త్వమును శుద్ధిచేయునెడల ఇంకనేమి? ఒక కోతిని తెచ్చి అది బ్రతికి యున్నంతకాలము పాలతోను, అన్నముతోను పెంచినచో అది మహాయోగి అయిపోవునా? అటులగుచో ఆవులు, లేళ్లు యోగిసత్తములే కదా! కొందఱు చెప్పినట్లు చాలసార్లు స్నానముచేయుటచేతనే స్వర్గము లభించునెడల, ముట్టమొదట చేపలు స్వర్గమును చేరును. శాకాహారముచేతనే నరుడు స్వర్గమునకు పోగలుగునెడల ఆవులును, లేళ్లును వానికంటె ముందుగా స్వర్గము చేరును.

సరే దీనికి పరిష్కారమార్గమేమి? రెండును అవసరములే. ఆహారమును గుఱించి శంకరాచార్యులవారు తెలుపునట్టి అభిప్రాయమే నిస్సంశయముగా ముఖ్యమైనది. శుద్ధాహారము శుద్ధ సంకల్పమును బలపఱచు ననుటకుకూడ సందియము లేదు; వానికి చాల సంబంధమున్నది. కావున రెండును అవసరమైనవే. కాని, ఆధునిక భారతదేశమునందు శంకరాచార్యులవారి బోధను మఱచిపోయి "పరిశుద్ధమగు ఆహారము" అను అర్థమునే పాటించుచున్నాము. అందువలననే ఆస్తికధర్మము వంటింటిలో దూఱినదని నేను చెప్పితిని. అందులకు ప్రజలు నామీద కోపావేశులైరి. మీరు నాతో చెన్నపురి వచ్చియుండిన యెడల నా మాటలలోని సత్యమును మీరెఱిగియుందురు. వంగదేశీయులు వారికంటె మేలు. అన్నము వంక ఇతరులు చూచినంత మాత్రముననే దానిని పారవేయువారలు చెన్నపురిలో గలరు. ఇంతచేసినను అక్కడి ప్రజలు ఇక్కడి వారికంటె ఉత్తములుగా నున్నారని చెప్పజాలను. ఆహారనియమమువలనను, భోజనకాలమున దృష్టిదోషము పాటించుటవలనను పరిపూర్ణత వచ్చునట్లైనచో, వారందఱును సమగ్రులై యుండవలయును. కాని వారట్టుల లేరు.

రామానుజ శంకరుల భావములను రెంటిని ఏకముచేసి పూర్ణరూపమును కల్పింపవచ్చును. కాని అప్రధానవిషయమునకు ప్రధానవిషయమున కిచ్చినంత ప్రాముఖ్యమీయదగదు. అట్లిచ్చుట గుఱ్ఱమునకుముందు బండినికట్టుటవంటిది. తినదగినది ఈ ఆహారమా ఆ ఆహారమా అను విషయమును గుఱించియు, వర్ణాశ్రమాచారములను గుఱించియు గందరగోళములు నేడు చెలరేగుచున్నవి. ఈ అఱపులలో వంగదేశీయులు దిట్టలుగ నున్నారు. "ఈ వర్ణాశ్రమములను గుఱించి మీకేమి తెలియును" అని మీలో ప్రతివానిని నేను అడుగుచున్నాను. ఈ దేశములో ఈనాడు ఆ చతుర్వర్ణములు ఎక్కడ నున్నవి? నాకు జవాబు చెప్పుడు! ఆ చతు

ర్వర్ణములు నాకు కన్పించుటలేదు. మన వంగదేశపు సామెతయగు "తలయే లేని తలనొప్పి" వలె మీరీవర్ణాశ్రమముల నిక్కడ సృష్టింప జూచుచున్నారు. ఇక్కడ నాలుగు వర్ణము లిప్పుడు లేవు. బ్రాహ్మణశూద్రవర్ణములు రెండే నాకు కాన్పించుచు న్నవి. క్షత్రియులు, వైశ్యులు ఉన్నయెడల వారేరి? ఓ బ్రాహ్మణులారా, హిందూమతానుసారముగా వారిని—ప్రతి క్షత్రియుని, ప్రతివైశ్యుని—యజ్ఞోపవీతములు ధరించి వేదములను చదువుకొనుడని ఏల బోధింపకున్నారు? ఒకవేళ వైశ్యులును క్షత్రియులును వంగదేశమున లేరనుకొందము. బ్రాహ్మణులు శూద్రులు మాత్రమే ఉన్నారనుకొందము. అగుచో శూద్రులు మాత్రమే యున్న దేశమున బ్రాహ్మణులు నివసింపరాదని శాస్త్ర ములు చెప్పుచున్నవిగదా! కావున మూటముల్లె సర్దుకొని వెడలి పొండు. మీరు వేయిసంవత్సరములుగా మ్లేచ్ఛుల తిండితిని మ్లేచ్ఛుల సేవచేయుచున్నారు. అట్టివారిని గుఱించి శాస్త్రము లేమి చెప్పుచున్నవో మీకు తెలియునా? అందుకు ప్రాయశ్చిత్త మేమో ఎఱుగుదురా? చేతులార తన్నుతాను తగులబెట్టుకొనుట! మీరు గురువులమని పేరు పెట్టుకొని కపటవేషధారులై తిరుగ దలచితిరా? మీకు మీ శాస్త్రములందు విశ్వాసము గలదేని— అలగ్జాండరు చక్రవర్తితో వెళ్లియుండిన కారణమున తాను మ్లేచ్ఛుని ఆహారము తినినటుల భావించి, తన్నుతాను దహనము చేసికొనిన బ్రాహ్మణశ్రేష్ఠుని వలె—మిమ్ము మీరు వెంటనే దహనము చేసికొనుడు! ఆ విధముగా చేసినచో ఈ జాతి అంతయు మీకు పాదాక్రాంతము కాగలదు. మీరు మీ శాస్త్రములను విశ్వసింపరు. అయినను ఇతరులు విశ్వసించునట్లు చేయగోరు చున్నారు. ఆ రీతిగా మీరు ఈ కాలమున చేయజాలరేని మీ దుర్బలతను ఒప్పుకొనుడు; ఇతరుల దుర్బలతను క్షమింపుడు. ఓ వంగదేశపు బ్రాహ్మణులారా! ఇతరవర్ణములవారిని ఉద్ధ రింపుడు; వారికి చేయూత నొసంగుడు. వారిని వేదములు చదువు

కొననిందు; ప్రపంచములోని ఇతరార్యజాతులతో సరితూగు ఆర్యులు కానిందు. మీరును అటులే ఆర్యులు కందు.

మీ దేశమును మారణముచేయుచున్న హేయమగు వామాచారమును విసర్జించివేయుడు. మీరు భారతదేశమునందలి ఇతర ప్రాంతములను చూచి యుండలేదు. మన సంఘమున ఎంతగా ఈ వామాచారము వ్యాపించెనో చూచినప్పుడు, మన నాగరకతను గుఱించి ఎంతగా గర్వపడుచున్నను, మన సంఘమునకు మిగుల లజ్జాకరమగు దశ వాటిల్లినటులే తలంచుచున్నాను. వంగదేశమున మన సంఘము వామాచార సాంప్రదాయికులనెడు తేనెటీగలకు తేనెపెరగా నున్నది. పగలు బయటికి వచ్చి ఆచారమును గుఱించి పెద్ద పెద్ద ఉపన్యాసములు చేయువారే రాత్రులందు ఈ భయంకర వ్యభిచారమును సాగించుచు, అతిఘోరములగు గ్రంథములను ప్రమాణము చేసికొనుచున్నారు! ఆ గ్రంథములు ఇట్టి నీచకార్యములను చేయుడని వారిని ఆజ్ఞాపించుచున్నవట! వంగదేశీయులగు మీకు ఆ సంగతి తెలియును. వంగదేశపు శాస్త్రములన్నియు వామాచార తంత్రములే! శ్రుతులను బోధించుటకు మాఱుగా బండ్లకొలదిగా ఆ తంత్రములను ప్రకటించి మీ బిడ్డల మనస్సులలో విషము నింపుచున్నారు. కలకత్తానగర జనకులారా! ఈ వామాచార తంత్రములవంటి ఘోరగ్రంథములు, వాని అనువాదములతో సహా, మీ బాలబాలికల చేతులలోనికి వచ్చి వారిహృదయములను విషపూరితములు చేసివేయగా, ఈ బిడ్డలు అవియే హిందువుల శాస్త్రములనెడు విశ్వాసముతో పెరిగి పెద్దవారగుట మీకు లజ్జాకరముగ తోచుటలేదా? మీకు సిగ్గుకలదేని మీ బిడ్డల చేతులలోనుండి వానిని పెఱికి పారవేసి, సత్యములగు శాస్త్రగ్రంథములను వేదములను గీతను ఉపనిషత్తులను వారిచే చదివింపుడు.

భారతదేశమందలి ద్వైతసాంప్రదాయికుల సిద్ధాంతమననుసరించి వేర్వేఱు జీవాత్మలు శాశ్వతముగా వేఱుపడియే

యుండును. భగవంతుడు నిమిత్తకారణమాత్రుడై అదివఱకే గల ద్రవ్యరాశినుండి జగత్తును సృష్టిచేయును. అద్వైతుల సిద్ధాంతప్రకారమన్ననో భగవంతుడు జగత్తునకు నిమిత్తకారణమును, ఉపాదానకారణమును కూడ అగుచున్నాడు. అనగా ఆయన ఈ జగత్తునకు సృష్టికర్త అగుటయే గాక దీనిని తనలోనుండియే సృష్టి చేయుచున్నాడు. ఇది అద్వైతుల సిద్ధాంతము. జగత్తును భగవంతుడు తనలో నుండియే సృష్టించియు ఆ జగత్తునుండి తాను సదా వేఱుపడి యుండుననియు, సర్వమును ఆ జగదీశ్వరునకు సదా లోబడి యుండుననియు నమ్మునట్టి అసంస్కృత ద్వైత సంప్రదాయములు కొన్ని గలవు. భగవంతుడు తనలో నుండియే జగత్తును పరిణమింపజేసెననియు, జీవాత్మలు తుదకు నిర్వాణమును పొంది ఖండత్వమును బాసి అఖండబ్రహ్మమే అగుననియు విశ్వసించునట్టి సంప్రదాయములు కూడ కలవు. కాని ఈ సంప్రదాయములు అదృశ్యములై పోయినవి. ఈనాడు భారతదేశములో కాన్పించు అద్వైతసంప్రదాయమంతయు శంకరాచార్యులవారిని అనుసరించువారిదే. శంకరమతానుసారము భగవంతుడే జగత్తునకు నిమిత్తకారణమును, ఉపాదానకారణమునుకూడ. మాయవలన ఇట్లు గోచరించునే కాని యథార్థముగా అటులగుట లేదు. భగవంతుడు, లేక బ్రహ్మము ఈ జగత్తుగ అగుటయే లేదు. నిజమునకు ఈ జగత్తు లేనేలేదు; ఉన్నది బ్రహ్మము ఒక్కటియే. అద్వైతవేదాంతమున గ్రహింపవలసిన అత్యంత మహనీయవిషయము ఈ మాయావాదమే. మన తత్త్వశాస్త్రములోని ఈ అత్యంతక్లిష్టవిషయమును విమర్శించి చెప్పుటకు ఇప్పుడు నాకు సమయము చాలదని నా భయము. మీలో పాశ్చాత్య తత్త్వశాస్త్రముతో పరిచయముగలవారికి ఇట్టి అంశమొకటి క్యాంటు మహాశయుని సిద్ధాంతమున గోచరింపగలదు. కాని మీలో క్యాంటును గుఱించి ప్రొఫెసర్ మ్యాక్సుముల్లరుగారి వ్రాతలను చదివినట్టివారికి ముందుగా ఒక హెచ్చరిక

చేయుచున్నాను. గొప్ప తప్పూటర్థమునకు దారితీయు భావమొకటి ఆ వ్రాతలలో కలదు. దేశ కాల నిమిత్తములును, మాయయు అభిన్నములనెడు భావమును మొట్టమొదట కనుగొనినది శ్రీ శంకరాచార్యులవారే! శంకరభాష్యములలో ఇందుకు నిదర్శనములగు వాక్యములను ఒకటి రెండు కనుగొని నా మిత్రుడగు ప్రొఫెసర్ మ్యాక్సుముల్లరుగారికి పంపగల అదృష్టము నాకు కలిగినది. కాబట్టి ఆ సిద్ధాంతముకూడ భారతదేశములోనిదే. అద్వైత వేదాంతుల ఈ మాయాసిద్ధాంతము బహు చిత్రమైనది. నిజమునకు కలదంతయు బ్రహ్మమొక్కటే. కాని ఈ మాయవలన భిన్నత్వమేర్పడినది. ఏకత్వమే, అనగా అద్వితీయబ్రహ్మమే, పరమప్రాప్యము. ఈ అంశమున భారతీయ సిద్ధాంతమునకును పాశ్చాత్య సిద్ధాంతమునకును మధ్య అనంతమగు విభేదము కలదు! వేలకొలది సంవత్సరములకు పూర్వమే ఈ సిద్ధాంతమును ప్రతిజ్ఞాపూర్వకముగా భారతజాతి ప్రపంచములో నెలకొల్పినది. వేర్వేఱు జాతులవారు దీని ఖండనమునకు పూనిరి. తుదకు వారందఱును సమసిపోయిరి. ఈ భారతజాతిమాత్రము అమరముగా నిలిచియే యున్నది. ఆ ప్రతిజ్ఞ ఇదియే: ఈ జగత్తు భ్రాంతిమయము; ఇది అంతయు మాయ. నీవు నేలమీద విస్తరి వేసికొని వ్రేళ్లతో ముద్దలు చేసికొని తినువాడవైనను, బంగరు పళ్లెములలో చేగరిటెలతో తినువాడవైనను, మహాసౌధములందు నివసించు సమ్రాట్టువైనను, శుష్కదరిద్రుడవైనను, మరణము ఒక్కటియే తుదకు నీ గతి. అంతయు సమమే. అంతయు మాయయే. ఇది ప్రాచీన భారతీయ సిద్ధాంతము. ఎన్నియో జాతులు దీనిని ఖండించుటకు, కల్ల యని రుజువు చేయుటకు పరంపరగా ప్రయత్నించుచునే యున్నవి. వారు గొప్పవారై, భోగము గమ్యార్థముగా పెట్టుకొని, చేతిలో పూనిన అధికారమును సంపూర్ణముగా వినియోగించి అత్యంతవైభవములలో తులతూగుచున్నారు. కాని మఱుక్షణము ననే మరణము వాతపడి పోవుచున్నారు! మనము సర్వమును

మాయగా చూచుచు శాశ్వతముగా నిలిచియున్నాము. మాయ యొక్క సంతానము శాశ్వతమై జీవించుచుండ భోగముయొక్క సంతానము విలయమందుచున్నది!

మఱియొక గొప్ప భేదముకూడ కలదు. జర్మను తత్త్వ శాస్త్రమునందు హేగెలు, షోపెన్‌హార్ మహాశయులు చేసిన యత్నములవంటివే, సరిగా అటువంటి భావములే, ప్రాచీన భారత దేశమునందును ప్రకటింపబడినవి. అదృష్టవశమున ఈ హేగెలు మతము జడ్డిగములోనే మిడతపోటు తిన్నది. అనగా ప్రారంభము లోనే నశించినది. కావున అది మొలకెత్తి వృక్షముకాలేదు. దాని శాఖలు పెరిగి వినాశకరమగుదాని ఊడలు మన మాతృదేశమందు నాటుకొనకుండ పోయినవి. అద్వితీయమగు అఖండతత్త్వము అల్ల కల్లోలమైనదనియు, వ్యక్తిత్వమునంది విడివడిన స్వరూపమే ఆ యఖండతత్త్వమునకంటె ఉత్తమమనియు హేగెలు అభిప్రాయము. లోకమే అలోకముకంటె గొప్పదనియు, సంసారమే నిర్వాణము కంటె శ్రేష్ఠతరమనియు ఆతడు తేల్చినాడు. ఇదియే అతని ప్రధాన భావము. మీరు ఈ సంసారములో దిగబడిన-కొలదిని,-జీవన వ్యావృత్తులచే మీ ఆత్మ ఆవరింపబడిన కొలదిని మీరు గొప్ప వారగుచుందురట. ఆ సిద్ధాంతవాదులు ఇట్లందురు: "మే మెట్లు భవనములను నిర్మించుచున్నామో, రాజవీథుల నెట్లు శుభ్రపఱచు చున్నామో, ఇంద్రియభోగముల నెట్లు అనుభవించుచున్నామో గమనింపుడు" ఈ ప్రతి అల్పభోగమునకును వెనుక ద్వేషమును, దుఃఖమును, భయమును దాగియుండవచ్చును.

మన తత్త్వవేత్తలు ఇట్లుకాక, ప్రప్రథమమునుండియు, పరి ణామమనుపేర బరగు వ్యక్తీకరణమంతయు ఆ అవ్యక్తతత్త్వము వ్యక్తమగుటకు చేయు వృథా ప్రయత్నములే యని పల్కు చున్నారు. ఈ విశ్వమున కంతకును మహాకారణ రూపమగు నీవు క్షుద్రములగు బురదగుంటలలో ప్రతిబింబింప జూచుచున్నావు.

కాని కొంతకాలము అటుల ప్రయత్నించిన పిమ్మట అట్టిప్రయత్న మంతయు వ్యర్థమని తెలిసికొని వెనుదిరిగి నీ వెక్కడనుండి వచ్చితివో అక్కడికే మరలిపోవుదువు. ఇదియే వైరాగ్యము లేక సర్వ సంగపరిత్యాగము. ఇదియే మతధర్మమునకు ప్రారంభము. మతముగాని, నీతిధర్మముగాని, ఆత్మార్పణబుద్ధిలేక ఎట్లారంభము కాగలవు? సంగత్యాగమేదీనికి "ఓ, నా, మా"లు. "త్యాగము చేయుము, త్యాగము చేయు"మని వేదము ఘోషించుచున్నది. పరిత్యాగము చేయుము. అది యొకటియే మార్గము. "న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః॥" (సంతానము ద్వార మునగాని, సంపద ద్వారమునగాని, అమృతత్వమును పొంద జాలవు. త్యాగముచేతమాత్రమే అది సాధ్యమగును.) భారతీయ గ్రంథములలోని శాసనము ఇదియే. సింహాసనముల నలంక రించుచు కూడ సంసార త్యాగమును చేసినవారు కలరు! జనక మహారాజు కూడ సర్వపరిత్యాగము చేసెను. జనకుని మించిన గొప్పత్యాగి ఎవడు? ఈ దినములలో అందఱమును జనకుల మని పించుకొన నుబలాట పడుచున్నాము. ఔను, కూటికి, గుడ్డకు దిక్కులేక అల్లాడుచుండు దీన సంతానమునకు వీరు జనకులే*! వీరికి జనకనామము ఈ విధముగా వర్తించును. పురాణ ప్రసిద్ధుడగు ఆ జనకునకుగల భవ్యదివ్య భావములు వీరియందు పూజ్యము! వీరే మన అభినవ జనకులు! ఇప్పుడు ఇట్టి జనకత్వమును కొంచెము త్యాగముచేసి లక్ష్యమును గుర్తించి నడువుడు. మీరు త్యాగము చేయగలిగితిరా మీకు ఆత్మధర్మము చేజిక్కును. అటుల చేయ లేరా తూర్పునుండి పడమర వఱకు ప్రపంచమునగల పుస్తకముల నన్నిటిని మీరు పూర్తిగా జదువుదురుగాక, గ్రంథాలయములన్నిటిని గుటక వేసి మ్రింగుదురు గాక, గొప్పపండితు లవుదురు గాక, కర్మకాండమును మాత్రమే పట్టుకొని వ్రేలాడుచో మీరు వ్యర్థులే!

---

* 'జనక' దను పదమునకు తండ్రియని అర్థము.

మీకు ఆత్మసిద్ధి కలుగ లేదు. త్యాగమువలననే ఈ అమృతత్వ మును పొందుట సాధ్యము. వైరాగ్య మొక గొప్పశక్తి—విశ్వము నంతను ధిక్కరించి నిలువగల మహాశక్తి. తత్ప్రభావమునమాత్రమే "బ్రహ్మాండమ్ గోష్పదాయతే" (ఈ బ్రహ్మాండమంతయు ఆవు అడుగుపెట్టుచోట గలుగు చిన్ని గుంట వంటి దగును.)

ఈ వైరాగ్యమే మన భారతదేశ మహాధ్వజము! లోక మంతటి పైనను అది ఎగురుచున్నది. మృత్యువు వాతబడిపోవు చున్న జాతులను హెచ్చరించుట కొఱకు, నిరంకుశ ప్రభువులను మందలించుట కొఱకు, లోకములోని దుష్టులను అదలించుటకొఱకు పదేపదే హిందూదేశము ప్రకటించుచున్న అనశ్వరభావము ఇదియే. హిందూప్రజలారా! ఈధ్వజమును మీ చేతులనుండి జారి పోనీయకుడు! ఆకాశమున ఎగురునటుల దానినిపట్టుకొనియుండుడు! మీరు దుర్బలులై త్యాగము చేయలేకున్నను ఆదర్శమును మాత్రము క్రిందు చేయకుడు. "నేను దుర్బలుడను. సంసార త్యాగము చేయజాలను" అని ప్రకటింపుడు. కాని శాస్త్రములను తికమక చేయుచు మోసపు వాదనలకు దిగి కపటవేషధారులు కాజూడకుడు. అజ్ఞానులగు ప్రజల కన్నులలో దుమ్ముగొట్ట బ్రయ త్నింపకుడు. ఆ పని మాత్రము చేయవలదు. మీ లోపమును ఒప్పుకొనుడు. ఆ త్యాగసిద్ధాంతము మహామహిమాఢ్యమైనది. ఆ ప్రయత్నములో లక్షలకొలది కార్యసిద్ధిని పొందజాలకున్నను మునిగి పోయిన దేమున్నది! పదిమంది—ఇరువురైనను—శూరా గ్రేసరులు విజయశీలురై తిరిగివచ్చిన చాలదా! అందు ప్రాణముల గోల్పోయిన లక్షలాది యోధులు ధన్యులు. వారోడ్చిన నెత్తురే ఈ విజయమును సంపాదించినది! బొంబాయిరాష్ట్రములోని వల్లభా చార్యసంప్రదాయ మొక్కటితక్క ఆ యా వైదిక సంప్రదాయ ములందెల్లెడల వైరాగ్యమే అద్వితీయమగు ఆదర్శముగా నున్నది. వైరాగ్యము లోపించిన యెడల ఏమి తటస్థించునో మీలో చాల

మందికి తెలియునుగదా! మనకు పూర్వాచారము కావలసియే యున్నది. అందులో బీభత్సమగు పూర్వాచారమును పాటించు వారు సైతము, ఊపిరాడకుండ బూడిదతో కప్పుకొను వారు సైతము, చేతులు పైకి ఎత్తుకొని నిలుచుండువారు సైతము, మనకు అవసరమైనవారే. వారి చర్య అస్వాభావికముగా నున్నను త్యాగభావమును వారు మనకు బోధించుచున్నారు. భారతదేశము లోనికి చొరబడి వచ్చి, మన ఆయువుపట్టులనే తినివేయుచు, మన జాతి నంతను నిర్వీర్యులనుగా, శేలలనుగా, కపటవేషగాండ్రనుగా, చేయుచున్న విలాస పరాయణత్వమునకు లోబడి పోవలదని మన జాతిని వారు హెచ్చరించుచున్నారు. మనకు వైరాగ్యము కొంచెము అవసరముగా నున్నది. ప్రాచీన కాలమునందు వైరాగ్యము భారతదేశమును జయించినది. అది మరల భారతదేశమును జయింపవలయును. ఇప్పుడు సైతము ఈ వైరాగ్యమే భారతీయాదర్శములం దెల్ల మిక్కిలి ఉదాత్తమును ఉన్నతమునై వెలయుచున్నది. బుద్ధదేవుని దేశము, రామానుజుని దేశము, శ్రీరామకృష్ణుని దేశము, వైరాగ్యమునకు పుట్టినిల్లగు దేశము, ఎచ్చోట పూర్వకాలమునుండియు కర్మకాండను ఖండించుబోధలు వెలసెనో అట్టిదేశము, ఎచ్చోట ఈనాడు సైతము సర్వసంగ పరిత్యాగమొనర్చి జీవన్ముక్తులయిన మహాత్ములు వందలకొలదిగ ఉన్నారో అట్టిదేశము, అటువంటి దేశమేనా తన పరమాదర్శములను విడనాడు కొనునది? ఎన్నటికిని కాదు. భోగపరములగు పాశ్చాత్యాదర్శములతో తలలు తిరిగి పోయినవారు కొందఱుందురు గాక! వెక్కసమగునటుల ఇంద్రియభోగములను — పశ్చిమ దేశములను పాడొనర్చి లోకమును శాపగ్రస్తము చేసిన ఇంద్రియ భోగములను—పూర్తిగా అనుభవించు మనుజులు వేలకొలదిగ, లక్షలకొలదిగ నుందురుగాక. అయినను ఈ నా మాతృభూమి యందు ఆ మతధర్మమునే సత్యమని నమ్మి, ఎంతటి ఇడుమలు వచ్చినను లెక్కసేయక, అవసరమగు నెడల సమస్తమును బలి

యిచ్చుటకు సంసిద్ధముగా నుండువారు వేలకొలది మహనీయులు నిలిచియే యుందురు!

మన సంప్రదాయములన్నియు సర్వసామాన్యముగ పాటించు చుండు మఱొక ఆదర్శమును మీకిపుడు నివేదింప గోరు చున్నాను. అది కూడ మహావిస్తృతరూప మైనదే. "మతమను నది ప్రత్యక్షానుభవమునకు తెచ్చుకొన వలసిన విషయము" అనెడు అనన్యసామాన్యసిద్ధాంతము ఈ భారత దేశమందు మాత్రమే చూపట్టుచున్నది. "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునాశ్రుతేన"—"ఈ ఆత్మ ప్రసంగములచేత లభ్యమగునది కాదు. బుద్ధిబలముచేత కూడ లభ్యమగునదికాదు. విశేషమగు వేదాధ్యయనముచేతను లభ్యమగునది కాదు" "వేద పఠనము వలన సైతము ఆత్మ లభ్యము కాదు" అని ప్రకటించు నది ప్రపంచములో మనవేద మొక్కటియే. ఏ యితర ధర్మ గ్రంథమునందును ఇట్టి ప్రకటన కానరాదు. ప్రగల్భములు పనికి రావు; ఉపన్యాసములు వ్యర్థములు, ఇట్టివేవియు ఉపకరింప జాలవు; అయినను ఆత్మను ప్రత్యక్షానుభూతికి తెచ్చుకొనవలయును. అయ్యది గురువు వలన శిష్యునకు లభించును. శిష్యునకు ఈ అంత ర్దృష్టి లభించినప్పుడు సమస్తమును తేటతెల్లమై పోవును. అంతట ఆత్మసాక్షాత్కారము అనుభవములోనికి వచ్చును.

ఇంకొక భావము : కులగురువు, లేక వంశపారంపర్యగురువు అనునొక వింత ఆచారము వంగదేశమున కలదు. "నా తండ్రి నీకు గురువు. కావున ఇప్పుడు నేను నీ గురువను. నా తండ్రి నీతండ్రికి గురువు, కావున నేను నీకు గురువుగా నుందును." గురువు అనగానేమి? వెనుదిరిగి శ్రుతులలో నేమున్నదో చూతము. "వేదరహస్యము నెఱింగినవాడు" గురువు. కాని గ్రంథావ లోకనవ్యగ్రులుగాని, వైయ్యాకరణులుగాని, పండితులుగాని అంత మాత్రముచేతనే గురువులు కాజాలరు. పరమార్థమును తెలిసిన

వారే గురువులు. "యథా ఖర శ్చందనభారవాహీ భారస్య వేత్తా నతు చందనస్య" (గంధపు చెక్కలు మోయు గాడిద ఆ చెక్కల బరువు నెఱుంగునే గాని వాని సుగంధమును ఎఱుగజాలదు.) అట్టివారీ పండితులు. అట్టివారు మనకు అవసరము లేదు. వారికే అపరోక్షానుభూతి లేనిచో, వారేమి బోధింపగలరు? ఇక్కడ ఈ కలకత్తా నగరమున నేను బాలుడనుగా ఉన్నప్పుడు మత ధర్మమును తెలిసికొనగోరి ఇక్కడకు అక్కడకు పోవుచుండెడి వాడను. ప్రతిచోటను పెద్ద పెద్ద ఉపన్యాసము లిచ్చుచుండు వారు చెప్పినదంతయు విని, "మీరు దేవుని చూచితిరా?" అని అడిగెడివాడను. ఆ ఉపన్యాసకుడు 'భగవంతుని చూచుట' అను మాట వినగానే విఠాకుపడెడివాడు. "నేను చూచితిని" అని నాతో చెప్పిన మహాత్ముడు శ్రీరామకృష్ణపరమహంస ఒక్కడే. అట్లనుటయేగాక "నీకుకూడ భగవంతుని గాంచు మార్గము చూపెదను" అని పలికెను. గురువు అనగా శాస్త్రవాక్యములను పీడించి తికమకలు చేయువాడు కాడు. "వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలం వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే న తు ముక్తయే" (శబ్దప్రయోగవైచిత్రియును, అనర్గళమగు ఉపన్యాసశక్తియును, శాస్త్రవాక్యములను వివరణము చేయు నేర్పును, పండితులయొక్క భుక్తికొఱకే గాని ముక్తికొఱకు గాదు.) 'శ్రోత్రియః' అనగా శ్రుతుల రహస్యము తెలిసినవాడు, 'అవృజినః' అనగా పాపరహితుడు, 'అకామహతః'—కామహతుడు కాని వాడు, బోధించుటచేత డబ్బు సంపాదించుటకు కోరికలేనివాడు, శాంతుడు, సాధువు అయినవాడు గురువు. అతడు వసంతఋతువు వంటివాడు. అది ఆయా వృక్షములకు ఆకులను పూవులను కల్పించియు, ఉపకారము చేయుట తన స్వభావము కావున ఆ చెట్లనుండి ఏమియు కోరుకొనదు. అంతటితో సరి. గురువుఅనగా అట్టివాడు. "తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా అహేతు నాన్యానపి తారయంతః" (ఈ ఘోర సంసార సాగరము తాను

దాటినవాడై, ఏమాత్రమును లాభాపేక్షలేక ఆ సముద్రమును ఇతరులు దాటుటకు సాయపడువాడు గురువు.) ఇతరుడు గురువు కానేరడని యెఱుగుడు. "అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితమ్మన్యమానాః। జంఘన్యమానాః పరియంతి మూఢాః అంధేనైవ నీయమానా యథాంధాః" (తామే అజ్ఞానాంధకారములో మునిగియుండియు, గర్వకారణమున సర్వమును తెలిసితి మనుకొను మూఢులు ఇతరులకు సాయపడగోరి తూలుచు తూలుచు నానావక్రగతుల బడి గిర గిర తిరుగులాడుదురు. గ్రుడ్డివారు గ్రుడ్డివారికి త్రోవ జూప బూనిన, ఉభయులును గోతిలో పడుదురు గదా!) ఇది వేదవాక్యము. దీనితో మీ ప్రస్తుతాచారమును పోల్చి చూచుకొనుడు. మీరు వేదాంతులును, విద్యుక్తమార్గవర్తులును. అవునా? మీరు ఉత్తమహిందువులును, శిష్టాచారపరులును. సరే నేను కోరునది మీరు ఇంకను శిష్టాచారపరులు కావలయునని. మీరు అధికాధికముగా పూర్వాచారపరు లైనకొలదిని అధికాధికముగా వివేకవంతు లగుదురు. అధికాధికముగా నవీనాచారపరాయణులైన కొలదిని అధికాధికముగా మతిహీనులై పోవుదురు. మరల మీ పూర్వపు సదాచారమును అవలంబింపుడు. ఏలయందురా, ఆ దినములలో ఈ పుస్తకములనుండి వెలువడిన ప్రతిశబ్దము దృఢమును, సుస్థిరమును, నిష్కపటమును అగు హృదయమునుండి వెలువడినదే! ప్రతిస్వరమును నిష్కళంకమే! అటు పిమ్మట పతనమువచ్చినది. కళలందును, శాస్త్రములందును, మతమునందును, ప్రతిదానియందును జాతికంతటికిని భ్రష్టత్వమే కలిగినది. కారణములను గుఱించి విమర్శించుటకు మనకు కాలము చాలదు. ఆ భ్రంశకాలమున వ్రాయబడిన పుస్తకములన్నియు విషజాడ్య పూరితములును, జాతీయతాపతన సూచకములును. జవసత్త్వములకు మాఱుగా ఏడ్పులను పెడబొబ్బలను మాత్రము వెలువరించినవి. బలమహితమును, చైతన్యమహితమును అగు ఆ పూర్వదినములకై మర

లుడు. వెనుకకు పొందు. ఆ ప్రాచీన నిర్ఝరిణులనుండి కడుపార సుధారసము గ్రోలుడు. మరల బలవంతులు కండు. భారతదేశము సజీవమగుటకు అది యొకటియే మార్గము!

నేడు మనకు గల వ్యక్తిత్వము అద్వైతసిద్ధాంతప్రకారము భ్రాంతి మూలకమైనది. ప్రపంచమందంతటను ఇది దురవగాహ విషయముగనే యున్నది. ఎవనితోనైనను నీకొక ప్రత్యేక వ్యక్తిత్వము లేదు అని చెప్పుము. తన వ్యక్తిత్వము ఎట్టిదో తెలియకపోయినను అది పోవునేమో యని అతడు చాల భయపడును. కాని ఎన్నడును వ్యక్తిత్వ మనునదియే లేదనియు, నీ జీవితమున ప్రతిక్షణమును నీవు మాఱుచునే యున్నావనియు అద్వైతము బోధించుచున్నది. నీవు బాలుడవుగా నుంటివి. అప్పుడు ఒకవిధముగా భావించెడివాడవు. ఇప్పుడు యువకుడవు. ఇప్పుడు వేఱొక విధముగా భావించుచున్నావు. ఇక ముసలివాడ వగుదువు. అప్పుడు ఇంకొక తీరున భావింతువు. ప్రతివాడును సర్వదా మాఱిపోవుచుండును. అటులుండగా ఇంక నీ వ్యక్తిత్వ మెక్కడ? అది నీ శరీరములోగాని నీ మనస్సులోగాని, నీ సంకల్పములోగాని లేదనుట స్పష్టము. వీని అన్నిటికిని లోపల నీ ఆత్మ యున్నది. ఆ ఆత్మ బ్రహ్మమే అని అద్వైతి చెప్పుచున్నాడు. రెండు అఖండపదార్థములుండజాలవు. ఉన్నది ఒకవ్యక్తియే; అది అఖండము. మనము తార్కికజీవులముగదా, హేతుబద్ధవిచారమే గదా మనకు తృప్తికరము. సరే! ఆ తర్కవిచార మెటువంటిది? అది వర్గీకరణరూపమైనది. ఆ వర్గీకరణము చేసికొనుచు పోయి పోయి ఇక ముందునకు పోజాలక ఆగిపోవుదువు. ఖండవస్తువు అఖండముగా వర్గీకరింపబడినప్పుడుగాని, అనగా అఖండములో చేర్పబడినప్పుడుగాని దానికి విశ్రాంతి దొరకదు. ఏదేని ఒక ఖండవస్తువును తీసికొని దానిని పృథక్కరణముచేయుచు పొమ్ము. తుదకు అఖండపదార్థమును, లేక ఆ పరంధామమును చేరువఱకు

నీ కెక్కడను విశ్రాంతి చిక్కదు. ఉండునది ఆ అఖండవస్తువు మాత్రమే అని వేదాంతి పలుకుచున్నాడు. తక్కినదంతయు మాయ. తక్కిన దేదియు సత్యత్వము కలది కాదు. ఏ భౌతికవస్తువులో నైనను సత్యమై యుండునది ఈ బ్రహ్మమే. మనమును ఈ బ్రహ్మమే. ఈ ఆకారము మొదలగునవన్నియు మాయ. ఈ ఆకారమును ఈ రూపమును తొలగించితివా, నీవు నేను అందఱమును ఒక్కటియే అగుదుము. కాని నేను అను శబ్దమునుగుఱించి మనము జాగ్రత్త పడవలెను. సామాన్యముగా "నేను బ్రహ్మము నైనచో ఇది ఎందుకు చేయలేను, అది ఎందుకు చేయలేను?" అని జనులు శంకింతురు. కాని, ఇచట "నేను" అను శబ్దమును వేఱొక అర్థములో ప్రయోగించుచున్నాము. నీవు బద్ధుడవని తలచితివేని, ఇంక బ్రహ్మమవు కావు. ఏ కొఱతయు లేక తన లోపలనే కాంతినంతయు గల ఆ పరమాత్మవు కాజాలవు. వాని ఆనందమంతయు వాని సుఖములన్నియు వాని లోపల నుండును. అతడు సర్వసమగ్రుడు, స్వయంతృప్తుడు. వాని కేమియు కొఱత లేదు. అతడు దేనినిగాని అపేక్షింపడు. పూర్తిగా నిర్భయుడు, సంపూర్ణముక్తుడు. బ్రహ్మమనగా ఇదియే. దీనిలో మన మందఱము ఒక్కరమే!

కావున ద్వైతులకును అద్వైతులకును గల ముఖ్య విభేదము ఇదియే అనవగును. శ్రీశంకరాచార్యుల వారివంటి గొప్ప భాష్యకర్త సైతము కొన్ని వాక్యములకు నాకు అసమంజసములని తోచు అర్థములను కొన్ని సందర్భములందు చెప్పినాడు. ఒక్కొక యెడ రామానుజాచార్యులవారు వాక్యములకు అర్థములు చెప్పు పద్ధతి కూడ అంత విస్పష్టముగా నుండదు. "ఏకం సద్విప్రా బహుధా వదంతి—ఉండు వస్తువు ఒకటియే. ప్రాజ్ఞులు దానికి అనేక నామములు పెట్టిరి" అనెడు మహాద్భుత భావమును ఎన్నడో భారతదేశము కన్గొని, ఇకమీదట ప్రపంచమునకు ప్రసా

దింపవలసి యున్నను, ఈ శ్రుతియొక్క అభిప్రాయమునకు విరుద్ధముగా, ఒక్క సంప్రదాయమే సత్యము కాగలదనియు తక్కిన వన్నియు అసత్యములనియు ఒక దుర్భావము మన పండితులలో సైతము ఉన్నది. ఈ "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" అనెడు సిద్ధాంతమే ఈ జాతియొక్క బ్రతుకు తెరువును ఇంతవఱకు తీర్చి దిద్దినది, కాని కొలదిమంది ప్రాజ్ఞులు తప్ప, అనగా కొలదిమంది పారమార్థిక సాధకులు తప్ప ఈ సూత్రమును అందఱును తఱచుగా మఱచిపోవుచునే యున్నారు. అవును, ఈ మహాసూత్రమును మనము ఎప్పటికప్పుడు మఱచి పోవుచునే యున్నాము. అద్వైతమో ద్వైతమో విశిష్టాద్వైతమో ఏదో ఒక్కటి మాత్రమే సత్యమై యుండవలయును అని అభిప్రాయపడువారు పండితులలో నూటికి తొంబది ఎనిమిది మంది యుందురని తలంచెదను. మీరు కాశీకి వెళ్లి అచ్చటి ఘట్టములలో ఒకదాని యందు కొంచెముసేపు కూర్చుండిన యెడల నేను చెప్పదానికి ఋజువు మీకే తెలిసి పోగలదు. ఈ వివిధసంప్రదాయముల గుఱించియు, భిన్న భిన్న విషయముల గుఱించియు, ఎడ తెఱపి లేని ఆబోతు కుమ్ములాటలు అచట నిరంతరము జరుగుచునే యుండును.

అది అట్లు జరుగుచునే యున్నది. ఈ సందర్భమున హిందూదేశమున మహాపురుషుడగు శ్రీరామకృష్ణపరమహంస అవతరించెను. భారతదేశమునందలి భిన్న భిన్న సంప్రదాయములందు అంతర్లీనమై యున్న సామరస్యమునకు ఆయనజీవితము ఆచరణరూపమగు వ్యాఖ్యానము. జ్యోతిశ్శాస్త్రమునందలి "భూమధ్య సిద్ధాంతము" "సూర్యమధ్య సిద్ధాంతము"ల వలె, ఈ రెండు సిద్ధాంతములుకూడ అవసరమే యని ఆయన జీవితమే స్పష్టము చేయు చున్నది. జ్యోతిశ్శాస్త్రములో భూమియే కేంద్రము అను సిద్ధాంతము మొదట నేర్పబడును. ఈ సిద్ధాంతము

నాధారము చేసికొని విద్యార్థి ఇట్టి భావములతోడనే ఖగోళ శాస్త్రమునంతను గ్రహించును. కాని ఖగోళశాస్త్రము నందలి సూక్ష్మాంశములను నేర్వ ప్రారంభించి నప్పుడు వానికి నడుమ నుండునది సూర్యుడను సిద్ధాంతము అవసరమగును. అప్పుడది వానికి ఎక్కువ బాగుగ కూడ తెలియును. సహజముగ ఇంద్రియ సంబంధమగు సిద్ధాంతము ద్వైతము. ఇంద్రియములు మనకు పరిమితులు పెట్టునంతవఱకు సగుణబ్రహ్మమును మాత్రమే మనము చూడ గలుగుదుము, సగుణమును తప్ప ఇతరమును తెలిసికొన జాలము. ఈ ప్రపంచమున ఉన్నది ఉన్నటుల మనము గ్రహించి తీరవలయును. "నీవొక శరీరమ వని భావించుకొనుచుండు నంత కాలము, నీవొక మనస్సు వని భావించుకొనునంత కాలము, నీవు ఒక జీవుడ వని భావించుకొనుచుండునంత కాలము ఆత్మ, ప్రకృతి, వాని సృష్టికర్త అనెడు మూటిని నీ ప్రతి అనుభవమునందును నీవు పొందక తప్పదు" అని శ్రీ రామానుజాచార్యులవారు చెప్పు చున్నారు. అయినప్పటికిని మనస్సు సూక్ష్మతరమగుచు పోయి పోయి తుదకు ఇంచుమించుగా లయముచెందినప్పుడు, మనకు భయము గలిగించునవియు, దుర్బలుల జేయునవియు, మనలను ఈ స్థూల దైహికజీవితమున బంధించి యుంచునవియు అగు ఆయా విషయము లన్నియు అదృశ్యములై పోయినప్పుడు ఈ శరీర భావము సైతము అదృశ్యమగును. అట్టి స్థితి లభించినప్పుడు గాని ఈ ప్రాచీన దివ్యసిద్ధాంతముయొక్క సత్యము బోధపడజాలదు. "ఇహైవ తైర్జితః సర్గో ఏషాం సామ్యే స్థితం మనః। నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః" (సమస్తమును సమ ముగా చూచుట యందు ఎవరి మనస్సులు సుస్థిరమైనవో వారు ఈ జన్మయందే జనన మరణ చక్రమును దాటు చున్నారు. ఏల యన బ్రహ్మము నిర్మలమును సర్వసమమును అయియున్నది. కాబట్టి అటువంటివారు బ్రహ్మమునందే జీవించుచున్నటుల చెప్పుదురు.)

"సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం।
న హిన స్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాం గతిం॥

"ఇట్లు ఈశ్వరుని సర్వత్ర సమముగా చూచు యోగి ఆత్మను ఆత్మచే హింసించుకొనడు. అతడు పరమగతినే పొందును."



ఆల్మోరా పట్టణమున స్వాములవారికి ఒసగబడిన

# స్వాగతపత్రము, శ్రీవారి ప్రత్యుత్తరము

(శ్రీ)స్వాములవారు ఆల్మోరా చేరగనే ఆ పురవాసులు శ్రీవారికి హిందీభాషలో నొసగిన స్వాగతమునకు అనువాదము :

"మహాత్మా! పాశ్చాత్య ప్రపంచమున ఆధ్యాత్మిక విజయమును సాధించిన పిమ్మట మీ మాతృభూమి యగు భారతదేశమునకు మరలి వచ్చుటకై మీరు ఇంగ్లాండులో బయలుదేరితిరని విన్నప్పటినుండియు మిమ్ములను చూచు భాగ్యముకొఱకై ఎదురు చూచుచుంటిమి. సర్వేశ్వరుని అనుగ్రహమువలన ఆ శుభలగ్నము తుదకు ఘటిల్లినది. 'ఒకనిని పూర్ణహృదయముతో ప్రేమించు పురుషుడు వానిని చూడగలుగుట నిశ్చయము' అని భక్తవరుడైన తులసీదాస కవివరుడు పలికిన పలుకు నేడు పూర్తిగ ఫలించినది. ఎల్లరము వినిర్మల భక్తితో మీకు స్వాగత మర్పించుట కొఱకు ఇచ్చోట సమకూడి యున్నాము. ఎంతయో శ్రమ వహించి మీ రీ పట్టణమునకు వచ్చి కృపామతిని మాకు దర్శనమిచ్చినందున మేమెంతయు ధన్యులమైతిమి. అందులకు తగు కృతజ్ఞతను తెలుప జాలకున్నాము. మీరు ధన్యులు. మిమ్ము యోగారూఢుల జేసిన ఆ పూజ్యగురుదేవులు ముమ్మాటికిని ధన్యులు. ఈ ఘోర

కలియుగమున సైతము ఆర్యజాతులయందు మీవంటి నాయకాగ్రేసరులను గన్న భారతభూమి ధన్యము. మీ జీవితప్రారంభ దశయందే నిరాడంబరవృత్తివలనను, నిష్కాపట్యమువలనను, సద్వర్తనమువలనను, పరోపకారచింతనవలనను, తీవ్రసాధనవలనను, సచ్ఛీలమువలనను, జ్ఞానబోధవలనను ప్రపంచమందంతట వినిర్మలకీర్తిచంద్రికలు వెలయించితిరి. తత్కారణమున మేమెంతయు గర్వపడుచున్నాము.

శ్రీ శంకరాచార్యులవారి కాలమునుండి ఇప్పటివఱకు ఈ దేశములో ఎవరును నిర్వహింపజాలని మహాకార్యమును నిజముగా మీరు నిర్వహింప గలిగితిరి. ప్రాచీన భారతదేశపు ఆర్యుల సంతతివారిలో ఒకడు తన తపోబలముచేత భారతీయుల ప్రాచీనమతము ఇతర మతములకంటె శ్రేష్ఠతరమని ఇంగ్లండు అమెరికా విద్వద్వరుల ఎదుట రుజువు చేయగలడని ఎవరముగాని కలలోనైన తలపలేదు. షికాగోనగరమున జరిగిన అఖిలప్రపంచ మతమహాసభయందు సమావేశమైన వివిధమతముల ప్రతినిధుల ఎదుట, వారి కన్నులు తెఱచు తీరున ప్రాచీన భారతదేశమత శ్రేష్ఠత్వమును అతిసమర్థతతో మీరు రుజువు చేసితిరి. ఆ మహాసభయందు పండితులగు వక్తలు తమ తమ మార్గములందు తమ తమ మతములను సమర్థించుకొనిరి. కాని మీరందఱిని మించి ప్రకాశించితిరి. ఏ ఇతర మతమును వేదమతమునకు సాటి రాజాలదని పూర్తిగ నిర్ధారణ చేసితిరి. ఇంతియేగాక ఆ పాశ్చాత్య ఖండములందు అనేకస్థలములలో ఈ ప్రాచీనజ్ఞానమును గుఱించి ప్రచారము గావించి పెక్కుమంది విద్యాధికుల దృష్టిని ప్రాచీన ఆర్యమతమువైపునకును, తత్త్వసిద్ధాంతములవైపునకును ఆకర్షించితిరి. ఇంగ్లాండులో సైతము మన ప్రాచీన మతధ్వజమును సంస్థాపించితిరి. ఇప్పుడు దానిని తొలగించుట సాధ్యము కానేరదు.

ఇప్పటివఱకు అమెరికా యూరపు ఖండములందలి నవీన నాగరకజాతులవారు మన మతమునకు స్వతస్సిద్ధమైన సత్యస్వభావమును గుఱించి పూర్ణముగా అజ్ఞానములో నుండిరి. కాని మీ ఆధ్యాత్మికోపదేశములవలన మీరు వారి నేత్రములను తెఱచితిరి. ఈ ప్రాచీనమతమును 'దురహంకారులు వ్యక్తీకరించిన దుర్బోధ్యాంశబంధుర మత' మనియు 'బుద్ధివిహీనులకు పనికివచ్చు ప్రలాపరాశి' అనియు తమ అజ్ఞానము కొలది హేళన చేయుచు వచ్చినవారే అది ఒక మహారత్నఖని యని యిప్పుడు తెలిసికొను నటుల చేసితిరి. సత్యముగా, మూఢులగు నూర్గురు కొడుకుల కంటె నీతిమంతుఁడును, విద్వాంసుడును అగు ఒక కొడుకుండుట శ్రేష్ఠతరము. 'ఒక్కడైనను చంద్రుడే తన కాంతిచేత చీకటి నంతను పోద్రోలగలడు; కాని నక్షత్రములన్నియు కలిసికూడ అటుల చేయజాలవు.' మీవంటి పుణ్యాత్ముడగు సత్పుత్రుడే సత్యముగా లోకమున ప్రయోజకుడు కాగలడు. భారతమాత తన దీనదశయందు మీవంటి పవిత్రపుత్రులను చూచుకొని ఊఱట నొందుచున్నది. అనేకులు సముద్రమును దాటి విదేశములకు పోయి దిక్కు తెలియక ఇటు నటు పరువులు పెట్టుదురు. కాని మీ పురాకృతసత్కర్మమహిమవలన దూరమున, సముద్రమున కావల నున్నవారికి మన మతమహిమను విశదముచేసి వచ్చితిరి. మనోవాక్కాయకర్మములచేత మానవకోటికి ఆధ్యాత్మికజ్ఞానమును ప్రసాదించుటయే మీ జీవితపరమావధిగా పెట్టుకొంటిరి. బ్రహ్మజ్ఞానబోధచేయుటకు మీరు సర్వకాలము సిద్ధముగా నున్నారు.

మీరు ఇచ్చోట ఒక మఠమును స్థాపింపవలయునని ఉద్దేశించితిరని విని మిక్కిలి ఆనందించితిమి. మీ ప్రయత్నములు సఫలీకృతములగుగాక యని హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థించుచున్నాము. శ్రీ శంకరాచార్యులవారు సైతము పారమార్థిక విజయములను సాధించిన పిమ్మట ఈ ప్రాచీనమత సంరక్షణార్థము ఒక మఠమును ఈ హిమాలయములలో బదరికాశ్రమ

మున స్థాపించియున్నారు  అదే తీరున మీ కోరికకూడ సఫల మైన యెడల భారతదేశమునకు గొప్ప మేలు చేకూరగలదు. ఈ మఠస్థాపనవలన కూమోన్ ప్రజలమగు మేము ప్రత్యేకమగు ఆధ్యాత్మిక ప్రయోజనములను పడయజాలుదుము. ఆ విధముగా ఈ ప్రాచీనమతము మాలో క్రమముగా అడుగంటి పోకుండ చూచుకొనగలమని ఆశించుచున్నాము.

అతిప్రాచీనకాలము నుండియు భారతదేశమునందు ఈ ప్రాంతము సన్న్యాసమునకు ప్రసిద్ధిచెందిన క్షేత్రముగా నున్నది. భారతఋషులలో ఉత్తమోత్తములు భక్తితోడను, తపస్సాధన తోడను ఈ క్షేత్రమున వాసము చేసిరి. కాని ఆ విషయము పూర్వకాలపు ముచ్చటైపోయినది. మీరు కృపామతితో ఇక్కడ మఠమును స్థాపించి ఆ పూర్వదశను మేము తిరిగి చూచునటుల చేయుదురుగాక యని ఆశించుచున్నాము. ఈ పుణ్యక్షేత్రము నందే సత్యమగు మతధర్మము, కర్మ, ఆత్మశిక్షణము, సద్వర్తనము విలసిల్లినట్లు హిందూదేశమునందంతటను పేరు మ్రోగి యున్నది. కాని ఇప్పుడదంతయు కాలగతికి లోనై క్షీణించినది. మీ సత్ప్రయత్నముల వలన ఈ క్షేత్రము ప్రాచీన ధర్మోన్నతిని తిరిగి పడయునుగాక యని మేము ఆశించుచున్నాము.

మీ రిచ్చటికి వేంచేయుట వలన మాకు గలిగిన ఆనంద మను తగురీతిని ప్రకటింప జాలకున్నాము. పూర్ణారోగ్యమును అనుభవించుచు పరోపకార జీవనమును గడపుచు మీరు చిరం జీవులై వర్ధిల్లుదురు గాక. మీ ఆధ్యాత్మిక శక్తులు సతతము వృద్ధిచెందుచు మీ కృషివలన ఈ భారతదేశదురవస్థను సత్వరము తొలగించునుగాక.''

ఇదియేకాక మఱి రెండు వినతిపత్రములును సమర్పింప బడినపిదప శ్రీస్వాములవారు ఈ క్రింది రీతిని సంక్షేపముగా ప్రత్యుత్తర మొసగిరి :

మన పూర్వులు దివ్యస్వప్నముల గాంచినట్టిక్షేత్రము ఇది. భారతీయులకు తల్లియగు పార్వతీదేవి పుట్టినది ఇక్కడనే కదా! భారతదేశములో ప్రతి భక్తిపరుడును తన చరమదశలోవచ్చి మానవజీవిత కావ్యమునందలి తుది అధ్యాయములను పూర్తి చేయ గోరుకొనునది ఈ పవిత్రక్షేత్రముననే! ఈ దివ్యభూమియందలి పర్వతశిఖరములమీదను, ఇందలి గుహాంతరాళములందును, వేవే గము దూకుచు పరుగులిడు నిచ్చటి సెలయేళ్ల తీరములందును, పరమార్థభావములు సంభావితము లైనవి. వానిలో అతి స్వల్పాం శమే యెఱిగిన పరదేశీయులు సైతము వానిని మిక్కిలి ప్రశం సించిరి. అతి సమర్థులగు విమర్శకులు ఆ భావరాజములు అసమాన మహిమాఢ్యము లని ప్రవచించి యున్నారు. నాబాల్యమునుండియు నా జీవితమును ఎక్కడ గడపవలయునని ఉవ్విళ్లూరు చుంటినో అట్టి పుణ్యభూమి ఇదియే. ఇక్కడనే యుండిపోవుటకు అనేక పర్యాయములు నేను ప్రయత్నించుట మీరందఱు ఎఱిగినదే. అట్టి తరుణము ఆసన్నము కాక పోయినను, ఈ పుణ్యభూమికి దూరముగా విసరివేయబడి ఎచ్చటనో పని చేయవలసిన వాడ నైనను, ఎచ్చట మహాఋషులు పవిత్రజీవితము గడపిరో, ఎచ్చట తత్త్వవిద్య ప్రభవించినదో, అట్టి పర్వతరాజపార్శ్వంబుల నెచ్చట నేని నా జీవితమునందలి తుదిదినములను గడపవలయునని గాఢ ముగా వాంఛించుచున్నాను. పూర్వము ఉద్దేశించిన విధమున నే నిప్పుడు చేయలేనేమో అనిపించుచున్నది. ఆహా! ఆ నిశ్శబ్దత, ఆ అజ్ఞాతవాసము, నా కనుగ్రహింపబడు గాకయని ఎంతగనో కోరుకొనుచున్నాను. భూలోకమున గల క్షేత్రము లన్నింటిలోను ఇక్కడనే—ఈ మహాక్షేత్రమందే—నా అంత్యదినములు గడచు గాక యని ఆశించుచు సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. పరమే శ్వరుడు నా కోరికను మన్నించి అనుగ్రహించునను విశ్వాసము నాకు కలదు.

ఓ పుణ్యక్షేత్ర నివాసులారా!

పాశ్చాత్య దేశములందు నేను నిర్వహించిన స్వల్పకార్యమును గుఱించి మీరు అత్యుదారముగా నన్ను అభినందించినందులకు కృతజ్ఞతను తెలుపుచున్నాను. అయినను పాశ్చాత్య దేశములందు గాని, ప్రాచ్యదేశములందు గాని ఆ విషయమును గుఱించి మాట్లాడు నభిలాష నాకు లేదు. శిఖరము తర్వాత శిఖరముగ ఈ పర్వతశ్రేణులు నా కన్నులకు గోచరింప నారంభింపగనే పనిచేయవలయునను ఇచ్ఛయు, అనేక సంవత్సరములుగా నా మెదడున రేగుచున్న ఆ ఉద్రేకమును శాంతిలి పోవుచున్నటుల కాన్పించుచున్నది. ఇదివఱకు నిర్వర్తించినట్టియు, ఇక ముందు నిర్వహింపనున్నట్టియు, దేనినిగుఱించి యైనను ప్రసంగించుటకు మాఱుగా ఈ హిమాలయములు సర్వదా బోధించునట్టిదియు, ఇచ్చటి వాతావరణమే ఉద్ఘోషించుచున్నట్టిదియు, ఇచ్చట సుడులు తిరుగుచు పరుగులు వెట్టు ప్రవాహములు ప్రబోధించుచున్నట్టిదియు అగు ఆ ఏకైక ధర్మము, ఆ వైరాగ్యము, నా మనస్సున ఆవహించుచున్నది. "సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయం" ('పుడమిని సమస్తమును భయముతో కూడియున్నది. మానవుని భయరహితుని చేయగలది వైరాగ్యమొక్కటియే!') సత్యముగ అట్టి వైరాగ్యభూమి ఇదియే!

ఇప్పుడు మీతో పూర్తిగ మాట్లాడుటకు నాకు వ్యవధి లేదు; పరిస్థితులును అనుకూలముగ లేవు. కాబట్టి ఈ హిమాలయ పర్వతములు వైరాగ్యమునకు నిదర్శములుగ నున్నవనియు, మనము మానవకోటికి బోధింపవలసియున్న ఉత్తమధర్మము వైరాగ్యమే యనియు మాత్రము తెలుపుచు ముగించుచున్నాను. మన పూర్వులు తమ అంత్యదినములలో ఇచ్చోటికే ఆకర్షింపబడెడివారు. అదేతీరున దశదిశలనుండి మహాత్ములు భవిష్యత్కాలమున ఈ పర్వతరాజముచే ఆకర్షింపబడ నున్నారు. అప్పుడు ఆయా సంప్రదాయముల నడుమనున్న పోరాటము

లన్నియు, సిద్ధాంతములందు గల విభేదములన్నియు ఇక జ్ఞప్తికి రావు. నీ మతమనియు, నా మతమనియు సాగించు వాగ్వాదములు అదృశ్యములై పోవును. అప్పుడు సనాతనమతమే నిజమునకు ఏకైకమతమనియు, అంతర్యమున గల పరమాత్మను దర్శించుటే దాని లక్ష్యమనియు, మిగిలినదెల్ల వ్యర్థప్రలాపమే యనియు ఎల్లరును గ్రహింతురు. ఈ సంసారము బూటకములలో నెల్ల బూటకమని తెలిసికొని భగవంతుడును, భగవంతుని సేవయు తప్ప అన్యమంతయు శూన్యమని గ్రహించిన తపోధనులు ఇచ్చటికి రానున్నారు.

మిత్రులారా! నా మనస్సున గల ఒక ఉద్దేశమును గుఱించి మీరు ఔదార్యము పెంపున ప్రస్తావించితిరి. ఈ హిమాలయ పర్వతములలో ఒక మఠమును స్థాపించు విషయమే అది. అటుల ఎందుకు జరుగవలసియున్నదో నేను బాగుగ తెలిపియే యుంటినని తలంచెదను. ఈ విశ్వమతమును బోధించుటకు ప్రధానస్థానము లలో ఒకటిగా నేను ఏర్పఱచుకొనిన కేంద్రమిదియే! ఈ పర్వత ములు మనజాతికి సంబంధించిన అత్యుత్తమ స్మరణీయాంశము లతో సంబంధము గలిగియున్నవి. భారతీయమతచరిత్రనుండి ఈ హిమాలయమును తొలగించిన యెడల ఇక మిగులునది అత్యల్పము. కాబట్టి ఆ కేంద్రములలో ఒకటి ఇక్కడ ఉండవలయును. తీవ్రప్రచారము కొఱకే గాదు; అధికశాంతికొఱకును, తపస్సు కొఱకును, వినిర్మలత కొఱకును కూడ అది ఇక్కడనే నెలకొని యుండవలయును. ఎప్పుడో ఆ కోరిక సఫలము కాగలదని నా నమ్మకము. వేఱు సమయములందు మిమ్ము కలిసికొని మీతో మాట్లాడుటకు ఇంతకంటె మంచి అవకాశములు కల్గునని నేను విశ్వసించుచున్నాను. ఇప్పటికి మీరు నా యెడల చూపినప్రేమను గుఱించి మఱొకసారి మీకు కృతజ్ఞతను తెల్పుచున్నాను. అది నా వ్యక్తిగతముగ నా యెడలగాక మన మతమునకు ప్రతినిధి

నగుటచేత చూపబడిన అభిమాన మని నేను భావించుచున్నాను. అది మన హృదయములను ఎన్నడును వీడి పోకుండు గాక. మన మోక్షమున ఎంత నిర్మలముగా నుంటిమో అంత నిర్మలముగను, ఆధ్యాత్మికవిద్యను గుఱించి మన మిప్పుడు ఎంత ఉత్సాహముతో నుంటిమో అంతటి ఉత్సాహముతోడను, నిరంతరము ఉందుము గాక!



# వైదికధర్మముయొక్క సిద్ధాంత సాధనలు

శ్రీ స్వాములవారు ఇక్కడ అతిథిగా నుండు కాలము ముగియనున్న సమయమున ఆల్మోరా యందలి శ్రీవారి స్నేహితులు హిందీభాషలో ఒక ఉపన్యాస మిమ్మని కోరిరి. శ్రీవారు అట్టి ప్రయత్నము చేయుటకిది మొట్టమొదటిసారియైనను అందుకు ఒడంబడిరి. వారు నెమ్మదిగ ప్రారంభించిరి. కాని త్వరలోనే ఉపన్యాసవిషయమువలన ఉత్సాహప్రేరితులైరి. వారు ఉపన్యసించిన కొలది వాక్యనిర్మాణము, శబ్దగతి అప్రయత్నముగా వానియంతట అవియే అమరుచున్నటుల తోచినది. ఉపన్యాసధోరణికి అనుకూల పదటలో హిందీభాషయందుగల పరిమితులను చిక్కులను ఎఱిగిన వారు శ్రీవారి ప్రయత్నము జయప్రదమైనదనియు, ప్రాయశః అది అసదృశవిజయమనియుకూడ అభిప్రాయము తెలిపిరి. ఆభాషయందు తమకు గల ప్రయోగపటిమను, వక్తృత్వమునకు అనుకూలముగ ఆ భాషను అభివృద్ధిచేయుటకు ఇదివఱకు కలనైన అనుకొని యుండని అవకాశములు ఆ భాషయందు కలవని శ్రీ స్వామివారు ఋజువుచేసిరనిరి

ఇంగ్లీషు క్లబ్బు కడ మఱొక ఉపన్యాసము ఇంగ్లీషులో నొసగబడినది. వైదికధర్మసిద్ధాంతసాధనలు అనునది ఉపన్యాస

విషయము, ఆ యుపన్యాస సారాంశములివి — శాఖాదేవతల పూజారంభము, ఇతర ఉపజాతుల జయించుట మూలమున దాని విజృంభణము; వీని చరిత్రను గుఱించి కొంచెము వివరించిన పిమ్మట వేదములనగా ఎట్టివో తెలిపిరి. వాని స్వభావము, స్వరూపము, వాని బోధ సూక్ష్మముగా విశదీకరించిరి. పిమ్మట జీవాత్మను గుఱించి మాట్లాడుచు ప్రాణప్రదములు, ఆధ్యాత్మికములు అగు తత్త్వరహస్యములను బాహ్యప్రపంచపు సాయమున పరిష్కారము చేయజూచు పాశ్చాత్యుల పద్ధతిని, బాహ్య ప్రకృతిలో అట్టి పరిష్కారము తేలజాలదని కనుగొని అన్వేషణమును అంతర్యామునకు త్రిప్పిన ప్రాచ్యపద్ధతిని పోల్చి చూపి వివరముల దెల్పిరి. తమకు విశిష్టమైన అంతర్లక్ష్య సాధనమును కనుగొనిన గౌరవమును, ఆ పద్ధతియొక్క ఫలితార్థముగా వెలలేని పారమార్థిక విద్యారత్నములను మానవకోటికి పంచిపెట్టిన కీర్తియు, తనజాతికి చెల్లునని సహేతుకముగ తెల్పిరి. హిందువునకు సహజముగ ప్రియమై యొప్పు ఈ ప్రస్తావన అంతటితో నిలిపి జీవునకు బ్రహ్మమునకు గల సంబంధమును, జీవుడు బ్రహ్మమును భక్తిపూర్వకముగ వెదకి వానియందు ఐక్యమగునట్టి సాధనను వర్ణించినప్పుడు ఆధ్యాత్మికవిద్యాగురువుగా తన బోధనాశక్తిని శ్రీవారు అత్యున్నత దశకు ఉద్ధరింప గలిగిరి. కొంతసేపటివఱకు శ్రీవారును, వారి పలుకులును, వారి శ్రోతలును, అందఱియందును పర్వియున్న ఆధ్యాత్మికభావమును అన్నియు ఏకమై పోయినటుల గోచరించినది. నేను, నీవు, ఇది, అది అను భావములే స్మరణకు రావయ్యెను. అక్కడ చేరిన వ్యక్తులందఱును పరవశులైరి. ఆ మహాగురువు నుండి దేదీప్యమానమై వెలువడు పారమాత్మికతేజమునం దెల్లరును మునిగిపోయిరి. శ్రీవారి పలుకులు సర్వమును ప్రమాన్పడ చేసినవి.

శ్రీవారు ఉపన్యసించుచుండగా తఱచు విన్నవారికి ఇట్టి అనుభవములు అప్పుడప్పుడు కలుగుచుండును. శ్రద్ధగా విచక్షణా

పరులై వినుచుండెడు శ్రోతల యెదుట ఉపన్యసించునప్పుడు వివేకానందస్వామి అను వ్యక్తి అదృశ్యమగును. అప్పుడు అల్ప వివరములు, వ్యక్తిభావములు సమసిపోవును. నామరూపములు దూరమై పోవును. ఆత్మమాత్రమే నిలిచియుండి వక్తయు, శ్రోతయు, వక్తృవచనమును ఏకమై అందు లయించి పోవును.



# భక్తి

## పంజాబునందలి శియాల్‌కోటయం దొసగిన ఉపన్యాసము

పాంచాల, కాశ్మీర దేశములనుండి వచ్చిన ఆహ్వానములను అంగీకరించి శ్రీ వివేకానందస్వాములవారు ఆ ప్రాంతములందు సంచారము చేసిరి. శ్రీవారు కాశ్మీరములోనే నెలకు పైగా గడపిరి. మహారాజును ఆయన సోదరులును శ్రీవారి ఉద్యమ మును మిక్కిలి మెచ్చుకొనిరి. ముర్రే, రావల్‌పిండి, జమ్మూ నగరములందు కొన్ని కొన్ని దినములు గడపుచు ఆయాచోటు లందు ఉపన్యాసము లిచ్చుచు వచ్చిరి. పిమ్మట శ్రీ స్వాములవారు శియాల్‌కోటకు విజయముచేసి అక్కడ ఒకటి ఆంగ్లమునను, ఒకటి హిందీలోను రెండు ఉపన్యాసముల నొసగిరి. శ్రీవారి హిందీ ఉపన్యాస విషయము 'భక్తి'. దాని సంక్షేపానువాదము ఈ క్రింద నొసగబడినది.

ప్రపంచమున గల ఆయా మతములు వానియందు అవలం బించు పూజావిధానములనుబట్టి వేర్వేఱుగ తోచుచున్నను సత్య మునకు అవి అన్నియు నొకటియే. కొన్నిచోటుల ప్రజలు గుళ్లను గట్టి వానియందు పూజలు గావింతురు. కొన్నింటియందు అగ్నిని పూజింతురు. కొన్నింటియందు విగ్రహములనుపెట్టి వానిముందు

సాష్టాంగపడుదురు. ఇట్లుండ దేవుడనిన విశ్వాసమే లేనివారు అనేకులు గలరు. అందఱును సత్యవంతులే. యథార్థమగు భావమును, అంతరమగు మతధర్మమును విచారించు నెడల మతములన్నియు ఏకరూపముగ నుండును. కొన్ని మతములందు భగవంతుని పూజించుటలేదు. ఇంతేల, భగవంతుడున్నాడనియు నమ్మరు. కాని ధర్మాత్ములును, ఉత్తములును అగు నరులను దేవతలవలెనే పూజింతురు. ఈ సందర్భమున ఉదాహరణముగా బౌద్ధమతమును చెప్పకొనవచ్చును. దేవుని యెడల చూపినను లేక మహాపురుషుల యెడల చూపినను భక్తి యనునది సర్వత్ర ఉన్నది. భక్తిరూపమగు ఉపాసన సర్వత్ర శ్రేష్ఠమైనది. ఈ భక్తిని జ్ఞానమునకన్న ఎక్కువ సులభముగ పొందవచ్చును. జ్ఞానమునకు అనుకూలపరిస్థితులును, తీవ్రసాధనయు అవసరము. దైహికముగ మంచి ఆరోగ్యవంతుడై సమస్తసంసారసంగముల నుండి విడివడినగాని ఎవడును ఈ యోగమును సక్రమముగా సాధన చేయజాలడు. కాని భక్తియో ఎట్టి జీవితావస్థయందున్నను సులభముగా సాధన చేయవచ్చును. భగవంతునియెడల గాఢమగు ప్రేమయే భక్తి యని భక్తిసూత్రములను రచించిన శాండిల్యఋషి చెప్పుచున్నాడు. ప్రహ్లాదుడును ఇదే రీతిగా పల్కుచున్నాడు. నరునకు ఒకనాడు తిండి దొఱకని యెడల అతడు బాధపడును. అతని కొడుకు మరణించిన యెడల ఆ విపత్తు అతని కెంత దుఃఖమును కలిగించును! భగవంతునికొఱకై పరితపించునప్పుడు భక్తుని హృదయమున అటువంటి దుఃఖమే అనుభవమునకు వచ్చును. భక్తియొక్క గొప్ప సుగుణ మేమనగా అది మనస్సును నిర్మలము చేయును. పరమేశ్వరుని యెడల కుదిరిన సుస్థిరభక్తి ఒక్కటియే మనస్సును పవిత్రము చేయజాలును. "ఓ భగవంతుడా! నీకు నామము లనేకములుగా నున్నవి. కాని ప్రతినామమునందును నీ మహిమ ప్రకాశించుచున్నది. అందు నిగూఢమును, మహనీయమును అగు అర్థము గర్భితమై యుండును." దేశ కాల విచక్షణ లేక

నిరంతరము మనము భగవంతుని గుఱించి స్మరించుచుండ వలయును.

భగవంతుని పూజించుటలో ఉపయోగించు భిన్న భిన్న నామములు చూపులకు మాత్రమే అటుల భిన్నములై కాన్పించును. ఒకడు తాను భగవంతుని పూజించు విధానమే మహా మహిమాధ్యమైనదని తలంచును. ఇంకొకడు తన మార్గమే మోక్షమును సంపాదింపగల మహిమాన్వితవిధానమని భావించును. కాని అన్ని విధానములయొక్క యథార్థమగు మూలాధారమును కనుగొనుడు; అది ఒక్కటిగనే యుండును. శైవులు శివుని మహా మహిమాధ్యు డందురు. వైష్ణవులు విష్ణుని సర్వశక్తిమంతుడని కొలుతురు. దేవ్యారాధకులు తమ దేవి విశ్వమునం దెల్ల సర్వ శక్తిమతి యని ఎవ్వరికిని తీసిపోక వాదింతురు. నీకు సుస్థిరభక్తి కావలయు నెడల వైరభావములను వీడవలయును. ద్వేషము భక్తిమార్గమున మిక్కిలి ప్రతిబంధముగా నిలుచును. ఎవరి యెడలను ద్వేషములేని నరుడే భగవంతుని చేరజాలును. అప్పుడు సైతము తన ఇష్టదైవతము నెడల భక్తి చూపుట అవసరమే. ''విష్ణువును, రామునును ఒకటియే యని నాకు తెలియును. ఐనను కమలనేత్రుడగు రాముడే నా ఉత్తమనిధానము'' అని హనుమానుడు వచించుచున్నాడు. నరునికి పుట్టుకతో వచ్చు విశిష్టములగు వాసనలు వానితో ఉండిపోవును. ప్రపంచమంతయు ఒకేమతమును అవలంబింపజాలకుండుటకు ఇదియే ముఖ్యహేతువు. ఒక్కమతము మాత్రమే ఉండుటను భగవంతుడును నిరాకరించుగాక! ఏలయన అప్పుడు ప్రపంచము గజిబిజిగా నుండును. క్రమ విధానము గల విశ్వముగ నుండజాలదు. ప్రతి నరుడును తనకు విశిష్టములగు సంస్కారములను అనువర్తింపవలసి యున్నది. తన మార్గము ననుసరించి సాగిపోవుటకు సాయపడు గురువు లభించిన యెడల అతడు పురోభివృద్ధి గాంచును. ప్రతినరుని వాని ఇచ్ఛ

చొప్పున పోసియవలయును. అటుల గాక వానిని బలవంతముగా వేఱొక మార్గములో ప్రవేశపెట్టిన యెడల అతడు తనకున్న దానినిగూడ కోల్పోయి ఎందుకును కొఱగాని వాడగును. ఒకని ముఖము వేఱొకని ముఖమును పోలియుండని రీతి, ఒకని స్వభావము వేఱొకని స్వభావమును పోలియుండదు. కావున వానిని వానికి అనుకూలమగు విధమున వర్తింపకుండ మన మేల అడ్డు పెట్ట వలయును? ఒక నది ఒకానొక దిశగా పాఱుచున్నది. నీవు దాని ప్రవాహమును మార్చి వేఱొక సరళమార్గమున ప్రవేశపెట్టితివేని అది ఎక్కువ వేగముగా ప్రవహించును. దానిశక్తి హెచ్చును. కాని దాని సరళమార్గమునుండి బొత్తుగా మార్చివేయ ప్రయత్నించినయెడల తత్ఫలము ఏమగునో చూడుము. నీరా తగ్గిపోవును. మఱియు దాని బలమును క్షీణించును. ఈ జీవితము చాల ముఖ్యమైనది. కాబట్టి ఎవని సంస్కారము ఎటుల ప్రేరణచేయునో ఆ మార్గమున వానిని నడుపవలయును. భారతదేశమున మత వైరములేదు. ప్రతిమతమును నిరాటంకముగా వదలివేయబడినది. కావుననే మతము సజీవమై నిలిచినది. ఒకమతమే సత్యమనియు, తనమతమును విశ్వసింపనివాడు మూర్ఖుడనియు, ఇతరుడు కపటి యనియు, కపటి కానియెడల తనమతమునే అవలంబించెడు వాడనియు, భావించుటవలననే మతవిషయకముగా పోరాటములు కలుగుచున్నవని జ్ఞప్తియం దుంచుకొన వలయును.

ప్రజలందఱు ఒకేమతము నవలంబింప వలయుననుట భగవంతుని ఇచ్ఛ అగునెడల ఇన్నిమతములు ఏల పుట్టుకొని వచ్చినవి? ప్రతివానిని ఒకే మతము అనుసరింప బలాత్కరించుటకు అనేకు లిదివఱకు వ్యర్థప్రయత్నములు చేసిరి. కత్తి యెత్తి ప్రజల నందఱిని ఒకే మతములోనికి చేర్చుటకు ప్రయత్నించి నప్పుడు సైతము దాని స్థానమున పదిమతములు పుట్టుకొనివచ్చిన వని చరిత్ర సాక్ష్య మిచ్చుచున్నది. ఒకేమతము అందఱికిని సరి

పడదు. నరుడు క్రియాప్రతిక్రియలనెడు రెండుశక్తుల సమ్మేళనతో ఏర్పడుచున్నాడు. ఈ శక్తులు వానిని జిజ్ఞాసువుగా చేయుచున్నవి. అట్టిశక్తులు నరుని మనస్సునకు వ్యాయామము కల్పింపనియెడల అతడు జిజ్ఞాస చేయుటకు, అనగా ఊహచేయుటకు అశక్తుడై పోవును. మానవుడనగా మననము చేయువాడని అర్థము. మనుష్యః అనగా మనస్సు గలవాడని అర్థము. అట్టి మనుష్యుని మననశక్తి, లేక జిజ్ఞాసశక్తి, లేక ఊహాశక్తి నష్టమై పోయిన తత్క్షణమే అతడు పశుసమానుడై పోవును. అట్లగుటకు ఎవరు కోరుకొందురు? అట్టి దుర్దశ భారతదేశ ప్రజలకు వాటిల్లకుండ భగవంతుడు రక్షించుగాక! మనుష్యునిగా నిలుపుటకు ఏకత్వమున భిన్నత్వము ఉండుట అవసరము. ప్రతివిషయమునను, భిన్నత్వమును అనగా వైవిధ్యమును పోషింపవలయును. భిన్నత్వ ముండువలకే ఈ ప్రపంచము నిలువగలదు. ఒకటి చిన్నదిగా ఇంకొకటి పెద్దదిగా ఉండుట మాత్రమే భిన్నత్వమని భావింపరాదు. ఈ జీవితమున అన్నియు తమ తమ స్థితిలో సమముగా స్వధర్మమును నిర్వహించిన యెడల భిన్నత్వము సురక్షితముగనే యుండును. ప్రతి మతమునందును యోగ్యులును, సమర్థులును ఉండి తాము పూనిన మతమును గౌరవభాజనముగా నొనర్చు చున్నారు. ప్రతి మతము నందును అటువంటివారు ఉందురు గాన ఏ సంప్రదాయము నెడలను ద్వేషమనునది యుండరాదు.

అటులైనచో కళంకమును ప్రోత్సహించు మతమును మనము గౌరవింప వలయునా అని మీరు ప్రశ్నింపవచ్చును. దీనికి జవాబు వ్యతిరేకముగా నుండు ననుట నిశ్చయము. అటువంటి మతమును తత్క్షణము బహిష్కరించివేయ వలసినదే. అది అనర్థ మూలము, అరిష్టదాయకము. మతములన్నియు తప్పక నీతి మీద ఆధారపడియుండవలయును. ధర్మము కంటెను పవిత్రశీలము గొప్పదిగ భావింపవలయును. ఈ సందర్భమున ఆచార మనగా

బాహ్యమునందును, అభ్యంతరమునందును శుచిగానుండుట యని అర్థము. శరీరమును, శాస్త్రములలో చెప్పబడినట్లు జలము మొదలగు వస్తువులతో కడుగుటవలన బాహ్యశౌచము సంపాదించుకొనవచ్చును. అభ్యంతరమున నుండు నరుడు అబద్ధమాడకుండుట వలనను, కల్లు సారాయములను సేవింప కుండుట వలనను, అవినీతికార్యములను చేయకుండుట వలనను, పరోపకారము చేయుట వలనను పవిత్రుడగుచున్నాడు. ఏ పాపమును చేయక, అబద్ధము పలుకక, త్రాగక, జూదమాడక, దొంగతనము చేయక కాలము గడపినచో, నీకు మంచిదే. కాని అది నీ ధర్మముమాత్రమే అగును. అందువలన నిన్ను మెచ్చుకొనవలసిన పని లేదు. నీవు కొంత పరోపకారము కూడ చేయవలసి యున్నది. నీవు నీకు ఉపకారము చేసికొందువు కావుననే ఇతరులకును ఉపకారము చేయవలసి యున్నది.

ఇచ్చట ఆహార నియమములను గుఱించి కొంత చెప్పెదను. పూర్వాచారము లన్నియు మాసిపోయినవి. వీనితో కూర్చుండి తినకూడదు, వానితో కూర్చుండి తినకూడదు అను పిచ్చి నమ్మకములు తప్ప మఱేమియు మన దేశీయులయందు మిగులలేదు. వందలకొలది సంవత్సరములకుపూర్వము విధించిన ధర్మసూత్రములలో స్పర్శసంబంధమగు శుచి మాత్రము శిథిలముగాక నిలిచి యున్నది. శాస్త్రము మూడు విధములగు ఆహారము తిన కూడదని చెప్పుచున్నది. మొదటిది ఉల్లి, వెల్లుల్లి వంటి పదార్థములు; ఇవి స్వభావముచేతనే దోషము కలవి. వీనిని విశేషముగా మెక్కిన యెడల కామము పుట్టును. అంతట నరునకును నారాయణునకును కూడ అసహ్యము పుట్టించు అవినీతి కార్యములు జరుగును. రెండవది : అన్యపదార్థములవలన అపవిత్రమైన ఆహారము. భోజనము చేయుటకు పూర్తిగ శుచియై ఒబ్బిడిగా నుండు ఏదేని స్థలమును ఏర్పఱచు కొనవలయును. మూడవది : దుష్ట మానవులు

తాకిన ఆహారమును భుజింపరాదు. ఏలయన అట్టి వస్తువుల సంపర్కము వలన మనలో చెడ్డ సంకల్పములు పుట్టును. బ్రాహ్మణుని కుమారుడైనను పోకిరివాడై దురభ్యాసములు కలవాడైనచో అతడు తాకిన ఆహారమును తిన కూడదు.

ఇట్టి నియమముల భావమేమో అంతరించినది. ఉత్తమ కులమునందు పుట్టకున్నచో వాడు ఎంతటి మహాజ్ఞానియైనను, పవిత్రపురుషుడైనను వాని చేతి ఆహారమును తినరాదు అనుట మాత్రము నిలిచియున్నది. ఈ ప్రాచీనవిధులను నిర్లక్ష్యము చేయుట మిఠాయి దుకాణములందు మాత్రము కానవచ్చును. అక్కడికి పోయి చూచిన యెడల ఆ మిఠాయి అంగడి అంతటను ఎగురుచుండు ఈగలను, రోడ్లమీదనుండి గాలికి కొట్టుకొని వచ్చి మిఠాయిని కప్పివేయు దుమ్మును, శుభ్రతయు ఒబ్బిడియు లేని వస్త్రములను ధరించిన అంగడివాడును ప్రత్యక్షమగుదురు. హల్వా షాపులో అద్దాల పెట్టెయందుంచిన తప్ప మిఠాయిని కొనబోమని ఏకకంఠముతో కొనువారెల్లరును చెప్పివేయ వలయును. అందువలన ఈగలు ముసిరి, కలరా ప్లేగు పుట్టించు క్రిములను మిఠాయికి అంటింపకుండ ఆపినట్టి పుణ్యము లభించును. మనము సర్వతోముఖముగ అభివృద్ధిగాంచవలసియున్నది. కాని అటుల వృద్ధిగాంచుటకు మారుగా వెనుక పడిపోవుచున్నాము. నీటిలో ఉమ్మివేయుట తగదని మనువు చెప్పియుండగా మనము నానావిధములగు అశుద్ధములను పావననదులయందు పడవేయు చున్నాము. ఈ విషయములన్నియు చూడగా మన బాహ్య శరీరపు శుచియు చాల అవసరముగనే కాన్పించుచున్నది. మన శాస్త్రకారులు ఆ సంగతిని బాగుగ నెఱుగుదురు. ఆహారశౌచ మును గుఱించిన ఈ ఆచారముయొక్క యథార్థమగు భావము నాశమై పోయినది. అక్షరములు మాత్రము నిలిచియున్నవి. దొంగలు, త్రాగుబోతులు, నేరగాండ్రు స్వకులమువారైనంత

మాత్రమున మనతో నుండుటకు ఒప్పుకొనుచున్నాము. కాని యోగ్యుడును, ఉత్తముడును అగువాడు తనతో సమానముగ గౌరవనీయుడగు ఒక తక్కువజాతివానితో భోజనముచేసినయెడల అతనిని వెలిపెట్టుచున్నాము. అట్టి శీలవంతుని పోనాడుకొనుచున్నాము. ఈ ఆచారము మనదేశమున కెంతయు వినాశకరము. పాపుల సంపర్కమువలన పాపమే మూడుననియు, పుణ్యపురుషుల సహవాసమువలన పుణ్యము వచ్చుననియు, దుర్మార్గులకు దూరముగా నుండుటయే బాహ్యశౌచమనియు మనము స్పష్టముగా గ్రహింపవలసియున్నది.

ఆభ్యంతరశౌచము ఇంతకంటెను ఎక్కువ కఠినమైన ధర్మము! అందు సత్యము పల్కుట, బీదలకు ఉపకారము చేయుట, నిస్సహాయులకు తోడ్పడుట మొదలగునవి ఇమిడి యున్నవి. మనము సదా సత్యమునే పల్కుచున్నామా? తఱచుగా జరుగుచున్నదిది. ఏదో తమ పబ్బము గడుపుకొనుటకు ప్రజలు డబ్బుగల వారి ఇండ్లకు పోయి వారిని పేదల పెన్నిధానమనియు, దీనుల పాలిటి కల్పవృక్షమనియు, ముఖస్తుతులు చేయుట ప్రారంభింతురు; ఆ ధనికులు తమ ఇంటికి వచ్చు పేదల కుత్తుకలను కత్తిపెట్టికోయువారైనను సరియే! ఇది యంతయు నేమి? అబద్ధమాడుట తప్ప మఱేమియుకాదు. మనస్సును మైలపడవేయునది ఇదియే. కాబట్టియే ఏ నరుడైనను తన అంతఃకరణమును పవిత్రము చేసికొని, పండ్రెండు సంవత్సరముల కాలము ఒక్క దుష్టసంకల్పమునైనను తన హృదయములోనికి రానీయని యెడల, అట్టివాడు నోట నేది పల్కిన అది జరిగి తీరునని చెప్పినమాట ఎంతయు సత్యమే. సత్యసంధతయొక్క శక్తి ఇటువంటిది. బాహ్యమునందును, ఆంతర్యమునందును శుచియైనవానికి మాత్రమే భక్తి కుదురును. చిత్రమేమనగా భక్తియే చాలవఱకు మనస్సును పవిత్రము చేయును! హిందువులవలె బాహ్యశౌచమునకు అధిక

మగు ప్రాముఖ్యమును యూదులు, మహమ్మదీయులు, క్రైస్తవులు ఒసగకున్నను ఏదో ఒక రూపమున కొంతవఱకు దానిని వారును గమనించుచునే యున్నారు. అది కొంతవఱకు సదా అవసరమగు చుండునని వారును తెలిసికొనిరి. యూదులు విగ్రహపూజను ఖండింతురు. కాని వారికిని ఒక దేవాలయము ఉండెడిది. అందు వారొక పెట్టెను ఉంచెడివారు. దానికి "ఆర్క్" అని పేరు. దానిలోపల దైవాజ్ఞాఫలకములు భద్రపఱుపబడియుండును. ఆ పెట్టెపైన ఱెక్కలు విప్పుకొని నిలుచుండిన ఇద్దరు దేవదూతల విగ్రహము లుండును. వాని మధ్య మేఘరూపమున భగవంతుడు ప్రత్యక్షమగునని వారు భావనచేసెడివారు. ఆ దేవాలయము చాలకాలము క్రిందటనే ధ్వంసమైనది. కాని అదే నమోనాతో క్రొత్త దేవాలయములు నిర్మింపబడినవి. వానిలో మందసములు పెట్టి మతగ్రంథములను అందుంచుచున్నారు. రోమన్ కాథలిక్కులు, గ్రీకుక్రైస్తవులు, ఒక విధమైన విగ్రహారాధన కలవారే. ఏసువిగ్రహమును, ఆయన తల్లివిగ్రహమును వీరు పూజింతురు. ప్రాటెస్టెంటులందు విగ్రహార్చనము లేదు. కాని వారు సగుణ రూపమున భగవంతుని పూజించుచునే యున్నారు. అది మఱియొక రూపమగు విగ్రహారాధనయే అనవచ్చును. పార్సీలును, ఇరానియులును చాలవఱకు అగ్నిపూజను జరుపుచున్నారు. మహమ్మదీయులు ప్రవక్తలను, మహాపురుషులను పూజింతురు. మఱియు ప్రార్థన సమయములందు "కాబా" వైపునకు ముఖములు త్రిప్పుదురు. మతసాధనలో ప్రథమ దశయందు బాహ్యమగు నెద్దానినైన ఆధారము చేసికొనుట మానవులకు అవసరమని ఈ విషయములు ఋజువుచేయుచున్నవి. అంతఃకరణము నిర్మలమైన కొలది వారు సూక్ష్మభావములవైపు దృష్టిని మరల్తురు. "జీవుడు బ్రహ్మముతో ఐక్యానుసంధానమును పొందగోరుట ఉత్తమము. ధ్యానసాధన మధ్యమము. నామపఠనము అధమము. బాహ్యపూజ అధమాధమము". అయినను ఈ తుదిసాధన

చేయుటలో పాపము మాత్రము లేదని స్పష్టముగా గ్రహింప వలయును. ప్రతివాడును తాను దేనిని చేయుటకు సమర్థుడో దానినే చేయవలయును. అటుల చేయకుండ వానిని నిరుత్సాహ పఱచిన యెడల తనగమ్యమును సాధించుటకొఱకు మఱొక రూపమున దానినే అతడు చేయును. కాబట్టి విగ్రహారాధన చేయువారిని దూషింపరాదు. వారు అట్టి పరిణామదశయం దున్నారు. కాబట్టి అటులే చేసితీరవలయును. అట్టివారు ఉత్తమ దశను పొందుటకై ముందునకు సాగిపోవునట్లు బుద్ధిమంతులైన వారు సాయపడవలయును. అంతియేగాని ఆయా పూజావిధాన ములను గుఱించి పోరుటవలన ప్రయోజనము లేదు.

కొందఱు ధనమును కోరి భగవంతుని పూజింతురు. మఱి కొందఱు పుత్రసంతానమును కోరి పూజలు చేయుదురు. వీరు భాగవతుల మని చెప్పుకొందురు. కాని వారిది భక్తి కాదు. వారు నిజమగు భాగవతులు కారు. బంగారమును చేయగలనని ఏదొంగ సాధువైనను వచ్చినయెడల, వీరందఱును వానిచుట్టుమూగుదురు. అయినను తాము భాగవతుల మనియే భావించుకొందురు. పుత్ర సంతానము కొఱకై భగవంతుని పూజించినయెడల అది భక్తి యనిపించు కొనదు. ధనవంతులు కాగోరి పూజలు చేసిన యెడల అది భక్తి కాదు. స్వర్గమును కోరినను కూడ భక్తి కాదు. నరక బాధల నుండి రక్షణ కోరి దేవపూజలు చేసినను అది భక్తి యని పించు కొనదు. భయము, ఆశ ఉన్నంత వఱకు భక్తి ఫలింపదు. "ఓ దేవా! నాకు సౌందర్యవతి యగు భార్య అక్కఱలేదు. జ్ఞాన మక్కఱలేదు. మోక్షమును అక్కఱలేదు. నన్ను నూరుసార్లు చావనిమ్ము, పుట్టనిమ్ము; నేను కోరుకొనునది సదా నీ పాదసేవ మాత్రమే".

"ధర్మమును కోర, మఱియు న ♦ ర్థమ్ము కోర;
కాంక్షతో నేను కామ భో ♦ గముల కోర;

కర్మమును బట్టి ఏదైన ♦ కలుగ నిమ్ము
నరకు సేయను సుంతయు ♦ నరకు సేయ,
ఎన్ని జన్మము లెత్తిన ♦ నెత్త నిమ్ము;
నీ పదాంభోజ యుగమందు ♦ నిశ్చల మగు
భక్తి యుండిన చాలు, మ ♦ త్ప్రార్థనమ్ము
స్వీకరింపుము శ్రీకృష్ణ! ♦ స్వీకరింపు.''

నరుడు సమస్తము నందును నారాయణుని, నారాయణునందు సమస్తమును చూడగలిగినప్పుడు మాత్రమే పూర్ణభక్తిలభించును. అప్పుడు మాత్రమే పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రతి దానియందును విష్ణువు అవతారము తాల్చి వానికి గోచరింపగలడు. అప్పుడు మాత్రమే సర్వమునందును భగవంతుడు ప్రత్యక్షమై యున్నటుల అలికొనగలడు. అప్పుడు మాత్రమే భగవంతుని విడిచి అన్య మిసుమంతయు నుండ జాలదను అనుభవము వానికి కలుగును. అప్పుడు, ఆ దశయందు మాత్రమే, తాను సమస్త భూతముల కంటెను అత్యల్పము అను భావము కలుగును, సత్యమగుభక్తి తాత్పర్యముతో భగవంతుని పూజింపగలుగును. అప్పుడు ఆ నరుడు తీర్థములను, బాహ్యపూజా విగ్రహములను విడిచివైచి ముందుకుసాగిపోవును. ప్రతి వానిని పరమ పవిత్రమగు దేవాలయముగా చూడగలుగును.

శాస్త్రములలో భక్తి అనేకరీతులుగా వర్ణింపబడియున్నది. భగవంతుడు మన తండ్రి యనియు, తల్లియనియు అనేకవిధములుగా చెప్పుకొనుచున్నాము. మనలోని భక్తిని గాఢముచేసికొనుటకును, భగవంతునికి దగ్గఱయయి ప్రేమాస్పదులమై ఉండుట కొఱకును, ఈ బంధుత్వములను కల్పన జేసికొందుము. కాబట్టి ఈపేరు లన్నియు ఒక విధముగా సమంజసములే! అనగా ఈ శబ్దములు కేవలము ప్రేమ సూచకములగు శబ్దములే! అవి నిజమగు

భక్తుడు భగవంతుని గుఱించి అనుభవించు నటువంటి అనురాగ పూర్వకమగు ప్రేమయొక్క ఫలితార్థమే. రాసలీలయందలి రాధా కృష్ణులగాథను పరిశీలింపుడు. ఆ కథ యథార్థమగు భక్తుని ప్రపత్తి భావమునకు చక్కని నిదర్శనముగా నున్నది. ఏలయన స్త్రీపురుష ప్రేమను మించిన ప్రేమ ప్రపంచములో లేదు. అట్టి గాఢమగు ప్రేమ ఉండునెడల, భయముగాని ఇతరానుబంధములుగానిఉండవు. ఆ జంటను ఏకముచేసి అవ్యయమగు అనురాగబంధమున కట్టి వేయు సర్వోత్కృష్టభావ మొక్కటి నిలిచియుండును. తల్లిదండ్రుల యెడల గౌరవము చూపవలసి యుండుటచే వారి మీది ప్రేమలో కొంచెము భయముకూడ కలిసి యుండును. కాని ప్రేయసీప్రియుల ప్రేమ అట్టిదికాదు. భగవంతుడు దేనినేని సృష్టిచేసినాడో లేదో మనకా విచారమేల? అతడు మన రక్షకుడను విషయముకూడ మనకెందుకు? అతడు మన ప్రియుడు. కావున సమస్తభయసంక ల్పములను వీడి మనము వానిని ప్రేమింతుముగాక. నరుడు తన కే కోరికయు లేనప్పుడే, తనకు అన్యసంకల్పము పొడగట్టనప్పుడే, భగవంతుని గుఱించి వెట్టివాడై పోవు నప్పుడే నిజముగా భగవం తుని ప్రేమింప జాలును. ప్రియునకు తన ప్రియురాలియందు గల ప్రేమయెట్టిదో మనకు భగవంతునియందు ఉండవలసిన ప్రేమ అట్టిది. కృష్ణుడు భగవంతుడు, రాధ వానిని ప్రేమించుచున్నది. ఆ ప్రణయకథను వర్ణించు కావ్యములను మీరు చదువుడు. అప్పుడు భగవంతుని ఎట్లు ప్రేమింపవలయునో ఊహింపగలరు. కాని ఎంతమంది దీని భావమును గ్రహింతురు? పూర్తిగ దుష్ట చిత్తులై పోయి, నీతియననేమో తెలియని జనులు దీనినంతను ఎట్లు అర్థము చేసికొనగలరు? ప్రజలు తమమనస్సుల నుండి సమస్త సాంసారికభావములను తొలగించుకొని స్వచ్ఛమగు నీతి తోడను ఆధ్యాత్మికభావముతోడను జీవించు నప్పుడు మాత్రమే, వారికి చదువులు రాకపోయినను, అతిసూక్ష్మములగు భావములను గ్రహింప గలుగుదురు. అయ్యో! అటువంటి వినిర్మలభావముగల

వారు ఎంత తక్కువగా నుందురో గదా! తలచుచో మానవుడు దుర్వ్యాఖ్యానములుచేసి భ్రష్టము చేయజాలని మతము ఒక టేనియులేదు. ఉదాహరణకు చూడుడు. ఆత్మ శరీరము నుండి పూర్తిగ భిన్నమైయుండునని ఒకడు భావన చేయుచున్నాడు. అతడు శరీరముతో నీచములగు పాపకార్యములు చేయుచు తన ఆత్మ అసంగమై నిర్మలముగ నుండుననును. మతములను యథార్థ ముగా అనువర్తించు నెడల, సంపూర్ణముగ పవిత్రుడు కాజాలని హిందువుగాని, మహమ్మదీయుడుగాని, క్రైస్తవుడుగాని ఒక్క డైనను ఉండడు. కాని మంచిదో, చెడ్డదో తమ సహజగుణమువల ననే మానవులు నడపబడుచున్నారు. దీనిని కాదనుటకు వీలులేదు. అయినను భగవన్నామము చెవినిపడగానే పరవశము చెందు వారును, భగవత్కథలను చదువునప్పుడు ఆనందబాష్పములు రాల్చువారును కొందఱు ఎల్లప్పుడును లోకములో ఉండియే తీరు దురు. అట్టి మానవోత్తములే యథార్థముగ భక్తులు.

మతసాధనయొక్క ప్రథమదశ యందు నరుడు భగవంతుని తన స్వామిగను తాను వాని సేవకునిగను భావనచేయును. తనకు నిత్యావసరవస్తువులు మున్నగు వానిని ప్రసాదించినందులకు భగ వంతునియెడల కృతజ్ఞతను చూపును. మీరిట్టి సంకల్పములను ఆవలకు నెట్టివేయుడు. ఆకర్షవంతమగు శక్తి ఒకటి కలదు. అదియే దేవుడు. ఆ శక్తికి లోబడియే సూర్యుడు, చంద్రుడు, సర్వమును కదలుచున్నవి. ఈ లోకములోని సమస్తమును మంచిదిగాని చెడ్డది గాని, భగవంతునిదే. మన జీవితములో శుభముగాని, అశుభముగాని, ఏమి జరిగినను అదెల్ల మనలను భగవంతునికి దగ్గఱగా కొనిపోవుచునే యుండును. ఒకడు ఏదో స్వార్థము కారణముగా వేఱొకని చంపు ననుకొనుడు. తన్ను గుఱించియో ఇంకొకని గుఱించియో ప్రేమయే ఆ కార్యమునకు హేతువుగ నుండును. మనము పుణ్యము చేసినను, పాపము చేసినను మన

లను ప్రేరేపించునది ప్రేమయే. పులి తానో, తనకూనయో ఆకలిగానుండుటచేతనే పశువును చంపుచున్నది.

భగవంతుడు ప్రేమస్వరూపి. ఆయన సమస్తము నందును ప్రత్యక్షమై యుండును. తనకు తెలిసినను, తెలియకున్నను ప్రతివాడును భగవంతునిచేత ఆకర్షింపబడుచున్నాడు. ఒక స్త్రీ తన భర్తను ప్రేమించు నప్పుడు, తన్నాకర్షించు మహాశక్తి తన భర్తయందున్న భగవంతుడే యని గ్రహించుట లేదు. ప్రేమమయుడగు భగవంతుడే పూజార్హుడగు ఏకైక వ్యక్తి. భగవంతుని సృష్టికర్తగను, రక్షకునిగను మాత్రమే భావన చేయునంత కాలము మనము బాహ్యపూజలు మాత్రమే చేయుదుము. కాని సమస్తమునందు భగవంతుని, భగవంతునియందు సమస్తమును చూచుచు, ఆ హద్దులను దాటిపోయి భగవంతుని ప్రేమావతారముగ భావనచేయ గలిగినప్పుడే మనకు పరాభక్తి సిద్ధింపగలదు!



# హిందూమతమునందలి సామాన్యసూత్రములు

శ్రీ స్వాములవారు లాహోరు విజయము చేసినప్పుడు ఆర్యసమాజము యొక్కయు, సనాతనధర్మ సభయొక్కయు నాయకులు శ్రీవారికి ఘనమగు స్వాగతము నొసగిరి. స్వాములవారు లాహోరునందున్న కొలది కాలములోనే మూడు ఉపన్యాసముల నిచ్చిరి. మొదటిది "హిందూమతమునందలి సామాన్యసూత్రముల" గురించి; రెండవది "భక్తి"ని గురించి; మూడవది "వేదాంతము"ను గురించిన శ్రీవారి ప్రసిద్ధోపన్యాసము. మొదటిసారి శ్రీవారిట్లు ప్రసంగించిరి.

పావనమౌ ఆర్యావర్తమునందు సైతము పరమపవిత్రముగ నెంచబడు ప్రదేశమిది. మహానుభావుడగు మనువు ప్రశంసించిన బ్రహ్మావర్త మిదియే. ఈ దివ్యభూమియందే తొలుత ఆత్మాన్వేషణము ప్రారంభమైనది. చరిత్ర నిరూపించుచున్నట్లు ఇక్కడ నుండియే యీ ఆత్మసాధన వెల్లువలై పొరలి ప్రపంచమునెల్ల ముంచెత్తవలసియున్నది. తన యందు ప్రవహించు మహాస్రవంతుల బోలి ఎచ్చోట ఆధ్యాత్మికసాధనలు వెల్లివిరిసి ప్రపంచము నందంతటను, ఉత్తరమునుండి దక్షిణమునకు, తూర్పునుండి పడమరకు సంచారము చేసి మేఘగంభీరధ్వనితో స్వయంప్రకటన కావించుకొననో ఆ భూమి ఇదే! భారతదేశముపై వచ్చిపడిన అన్ని దండయాత్రల, దోపిడుల, మొదటి దెబ్బతిని ఓర్చుకొనవలసి వచ్చినది ఈ ప్రదేశమే! వెలుపలనుండి ఆర్యావర్తము లోనికి చొఱబాఱి వచ్చిన అనాగరిక జాతులవారి తాకిడికి ప్రథమమున రొమ్ము చూపవలసివచ్చిన వీరభూమి ఇదియే! ఇన్ని పీడలకు లోనయ్యును తన ఔన్నత్యమును, తన బలమును పూర్తిగ పోనాడుకొనక ధీరతమెయి నిల్చినది ఈ వసుంధరయే! ఆధునికయుగమున నానక్ సాధువు తన అబ్బురపు విశ్వప్రేమ సిద్ధాంతమును బోధించి, హిందువులను, హిందువులనుమాత్రమే కాక, మహమ్మదీయులను సయితము మఱి ప్రపంచము నంతటిని తన కౌగిటను చేర్చుకొనుటకై బాహువులను దీర్ఘముగా జాచినదియు, తన విశాల హృదయమును తెఱచినదియు ఇచ్చోటనే! మన జాతీయ మహావీరశ్రేణులయందెల్ల అత్యంతప్రఖ్యాతి పడసిన ఉత్తమోత్తమ వీరశ్రేణికి చెందిన గురుగోవిందసింగు జన్మించినది ఇక్కడనే. తన రక్తమును, తన సన్నిహితప్రియ బంధువర్గము యొక్క రక్తమును ధర్మసంరక్షణార్థము బలియొసగి, ఆ పిమ్మట ఎవరి కొఱకై తాను రక్త బలి దానము చేసెనో వారే తన్ను ఏకాకినిచేయగా, దక్షిణదేశమునకు విశ్రాంతికై వెడలి తనదేశమును గుఱించి పల్లెత్తి ఒక్క దూషణ వాక్కునైనను పలుకక,

ఒక్క నిందోక్తి నైనను వెలువరింపక, గుండెపోటు తినిన సింగమువోలె అసువులు బాసిన ఆ మహావీరుడు ఉద్భవించిన దిక్కడనే!

ఓ పంచనదీక్షేత్రవాసులారా! ఇక్కడ ఈ మన ప్రాచీన క్షేత్రమందు మీ ఎదుట నేను నిలిచినది బోధకుడనుగా కాదు. ఏలయన, ఇతరులకు బోధింప గలిగినంతటి పరిజ్ఞానము నాకు లేదు. ప్రాచ్యభాగమునుండి పశ్చిమభాగమునందు నివసించు సోదరులతో యోగక్షేమములను, పరస్పరానుభవములను ముచ్చటించుకొనుటకు వచ్చియున్నాను. నే నిక్కడకు వచ్చుట మన మధ్యగల విభేదములను కనుగొనుటకు కాదు. మనకు ఏకమత్యము ఎక్కడ కుదురునో గ్రహించుటకొఱకే. ఏ ఆధారములమీద మనము సదా సోదరులముగా ఉండిపోగలమో, ఏ ఆధారముల ననుసరించి సనాతనమగు మన ప్రాచీనవాణి ఇంకను శక్తిమంతము కాగలదో తెలిసికొనుటకు నేను ప్రయత్నించుచున్నాను. మీతో నిర్మాణ కార్యక్రమమును గుఱించి కొంచెము ముచ్చటించుటకు వచ్చితిని గాని నిర్మూలనప్రకరణమునకు ఉద్యమించి రాలేదు. ఖండనకు కాలము గడచి పోయినది. నిర్మాణకార్యము కొఱకు మన మందఱము నిరీక్షించుచున్నాము. దాదాపు నూరుసంవత్సరములనుండి మన ఈ మాతృదేశమునందంతటను విమర్శలు వెల్లువలై ప్రవహించినవి. పాశ్చాత్యశాస్త్రజ్ఞానము విచ్చల విడిగా, మనలో లోపములుగల తావులందెల్ల నాట్యము సలిపినది. దాని ఫలితముగా నేడు సందు గొందులును, కన్నములును, అన్నిటికంటె స్పష్టముగా కనబడుచున్నవి. పూర్వము దేశమందంతటను మహా మనీషావంతులును, ఉత్తములును, మాననీయులును, సత్యపరాయణులై ధర్మాన్వేషణబుద్ధితో దేశమునెడల అభిమానము, తమ మతము దైవము నెడల గాఢతర భక్తి గలవారును అనేకులు జన్మించిరి. వీరు, ఈ మహాత్ములు, తీవ్రజిజ్ఞాసువులు కావుననే,

సాంద్రమగు భక్తి గలవారు కావుననే, వారికి తప్పు అని తోచిన దాని నెల్ల విమర్శించిరి. ఈ ప్రాచీన మహానుభావులకు ధన్య వాదములు. వారు చాల మేలునే చేసిరి. కాని ప్రకృతకాలపు వాణి 'విమర్శ లిక చాలును' అని హెచ్చరించుచున్నది. విమర్శ నము కావలసినంత జరిగినది. అవసరమగునంత దోషాన్వేషణము జరిగినది. పునరుద్ధరణకును, పునర్నిర్మాణమునకును సమయ మాసన్నమైనది. చెల్లాచెదరై పోయిన మనబలగములను ప్రోగు చేసికొని, వానిని ఒక కేంద్రమున సమీకరించి, దాదాపు కొన్ని శతాబ్దములనుండి గమన ముడిగియున్న మన జాతిని ముందునకు నడుపవలసిన తరుణము వచ్చినది. గృహమును శుభ్రపరచుట యైనది. తిరిగి గృహప్రవేశము చేయవలయును. మార్గము ఆయత్తమైనది. ఆర్యసంతానములారా! ముందునకు సాగిపొండు.

ఆర్యులారా! ఈ ఉద్దేశ్యమే నన్నిచ్చటికి తీసికొని వచ్చినది. మొట్టమొదటనే నే నేపక్షమునకుగాని, సంప్రదాయమునకుగాని చెందినవాడను కానని ప్రకటించుచున్నాను. అవి అన్నియు గొప్పవే. నాకు మాన్యమైనవే. వాని నన్నిటిని నేను ప్రేమిం తును. నా యావజ్జీవము వానిలో యోగ్యమును, సత్యమును అగుదానినెల్ల కనుగొనుటకే ప్రయత్నించుచున్నాను. కాబట్టి మనమందఱమును ఏ ఏ విషయములందు ఏకీభవింతుమో వానిని మీ యెదుట పెట్టుటయు, సాధ్యమగునేని మనకు సఖ్యము ఏర్పడు ప్రణాళికను రూపొందించుటయు ప్రస్తుతము నా ఉద్దేశ్యము. భగవదనుగ్రహమువలన అట్టి ప్రణాళిక సాధ్యమగునెడల మనము దానిని ఆచరణలో పెట్టుదముగాక! మనము హిందువులము. ఈ 'హిందువు' అనుమాటను ఏ విపరీతార్థముతోడను నేను ప్రయోగించుటలేదు. ఈ మాటయం దేమేని దూష్యమగు అర్థ మున్నదని చెప్పువారితో నేను ఏకీభవింపను. సింధునదికి ఆవల నుండు ప్రజలు అని మాత్రమే ప్రాచీనకాలమున దీనికి అర్థ

ముండెడిది. ఈనాడు మనలను ద్వేషించువారిలో అనేకులు దాని యందు విపరీతార్థమును ఆరోపింతురుగాక. అయినను పేరులో ఏమున్నది? 'హిందు' అను నామము ప్రభావవంతమగు సర్వ మును, ఆధ్యాత్మికమగు సర్వమును, స్ఫురింపజేయుటయో, లేక పతితులను నిర్భాగ్యులను ధర్మభ్రష్టులను తెలుపు అవమాన సూచకపదముగ నిలిచిపోవుటయో మనపై ఆధారపడియుండును. ప్రస్తుతము 'హిందు' అను శబ్దము ఏదేని చెడుగును సూచించినను సరకు చేయకుడు. ఈ శబ్దమే సర్వభాషలయందలి సర్వశబ్దము లలో అత్యంతశ్రేష్ఠమైనదని మనక్రియలవలన ఋజువుచేయుటకు సంసిద్ధుల మగుదముగాక. నా పూర్వులను గుఱించి లజ్జనొంద కుండుట నా జీవిత ధర్మములలో ఒకటిగా భావించుచున్నాను. నాకున్నంత గర్వము ప్రపంచములో ఎవ్వరికిని ఉండదు. కాని కపటము లేకుండ చెప్పుచున్నాను, నా గర్వము నన్ను గుఱించి కాదు, నా పూర్వులను గుఱించి. నేను గతమును గుఱించి విచారించిన కొలది, నా దృష్టిని వెనుకకు మరల్చిన కొలది, అధి కాధికముగా గర్వము కలిగినది. అది నాకు బలము నొసంగినది; దృఢవిశ్వాసపూర్వకమగు సాహసమును కలిగించినది; నేలమీద దుమ్ములో పడియున్న నన్ను లేవనెత్తినది; మహనీయులగు మన పూర్వులు నిర్ణయించిన ఉత్తమప్రణాళిక ననుసరించి కృషిసల్పు టకు నన్ను ప్రోత్సహించినది. ప్రాచీనార్యసంతానములారా! ఈశ్వరానుగ్రహమువలన మీకును అట్టి గర్వభావము కలుగు గాక! మీ పూర్వులవిషయమై అటువంటి విశ్వాసము మీ రక్తము లోనికి చొఱబాఱుగాక! అయ్యది మీ జీవితములతో సామాప్య మును పొందుగాక! అయ్యది ప్రపంచముయొక్క మోక్షమునకై ఉపకరించుగాక!

మన మందఱమును ఏ అంశమునందు ఏకీభవింతుమో, మన జాతీయజీవనమునకు సామాన్య మూలాధారము ఏదియో,

సరిగా కనుగొన ప్రయత్నించుటకు పూర్వము మనము ఒక్క సంగతిని జ్ఞప్తియం దుంచుకొనవలయును. ప్రతివానియందును ఒక వ్యక్తిత్వము ఉండుతీరున ప్రతిజాతికిని ఒక వ్యక్తిత్వముండును. ఒకడు మఱొకనికంటె కొన్ని కొన్ని విశేషములలోను తనకు విశిష్టములగు సహజలక్షణములలోను భిన్నముగా నుండునట్లు ఒకజాతి మఱొకజాతినుండి కొన్ని కొన్ని విశిష్టస్వభావములందు భిన్నముగా నుండును. ఈ ప్రకృతియొక్క కార్యనిర్వాహణము నందు ఏదో కొంత పనిని నిర్వహించుట ప్రతివాని కర్తవ్యము. వాని పూర్వకర్మనుబట్టి అతడు అనుసరింపవలసిన ఒక ప్రత్యేక కార్యవిధానము ఉండును. జాతుల విషయముననను ఈ సూత్రము వర్తించును. ప్రతిజాతియు నిర్వర్తింపవలసిన నిర్ణీత కార్య ముండును. ప్రతిజాతియు ప్రకటింపవలసిన ఒక ప్రత్యేకసందేశ ముండును. ప్రతిజాతియు నిర్వహింపవలసిన ఒక విశిష్టమగు ఉద్యమముండును. కాబట్టి ప్రారంభమునుండియు మనజాతి యొక్క ఉద్యమమును, అది సఫలము చేయవలసిన నిర్ణీతధర్మ మును, వివిధజాతుల పురోగమనమునందు అది ఆక్రమింపవలసిన స్థానమును, వివిధజాతి సామరస్యమునకై అది చేయవలసిన విశిష్ట కృషిని మనము తెలిసికొనవలసి యున్నది. కొన్ని సర్పముల నెత్తిమీద మణు లుండుననియు, ఆ మణులు వాని శిరస్సున నున్నంతవఱకు వాని నేమిచేసినను సరియే ఆ పాములు చావ వనియు, చిన్నతనమున కథలు వినియుందుము. తమ ఆత్మలను చిన్నపక్షులలో దాచి యుంచుకొను రాక్షసులను, పెనుభూతము లను గుఱించి కథలు వినుచుందుము. ఆ పక్షులు సురక్షితముగా నున్నంతకాలము ఈ రాక్షసులను చంపు శక్తి లోకములో నెవరి కిని ఉండదు. ఈ భూతములను నీవు ముక్కలు ముక్కలుగా నరకుదువుగాక; వీనిని చంపుటకు నీ వేమైనను చేయుదువుగాక, అవి మాత్రము చావవు. అటులే జాతులును ఉన్నవి. ఒకజాతి యొక్క ప్రాణము కేంద్రీకృతమైయుండు ప్రత్యేకవిషయము ఒకటి

యుండును. అక్కడ ఆ జాతియొక్క జాతీయత నెలకొని యుండును. దానిని ధ్వంసముచేయువఱకును ఆ జాతి చావదు. ఈ సాదృశ్యమునుబట్టి ప్రపంచచరిత్రయందలి మహాద్భుతసంఘటన నొకదానిని మనము అర్థముచేసికొనవచ్చును. ఈ మన పుణ్య భూమి మీదుగా కెరటాలు కెరటాలుగా అనాగరికజాతుల దాడులు దొరలుచు పోయినవి. వందలకొలది సంవత్సరములు "అల్లాహో అక్బర్" అను రణధ్వనులు ఆకసమును చీల్చివేసినవి. ఏ హిందువు గాని తన అంత్యకాలము ఎప్పుడు మూడనున్నదో ఎఱుగడు. ప్రపంచచరిత్రలో ఇంతగా ఇడుమల గుడిచిన జాతి, ఇంతగా అణగ ద్రొక్కబడిన జాతి మఱియొకటి లేదు. మనము ఇప్పటికిని అదే స్థితిలో ఉన్నాము. అవసరమగుచో మరల మరల కష్టముల నెదు ర్కొనుటకు సంసిద్ధముగా నిలిచియున్నాము. ఇంతియే కాదు, మనము బలముగలవారమని, అవసరమగుచో దేశాంతరములకు పోవుటకుసైతము సిద్ధముగ నిలిచియున్నామని తెలుపు సూచనలు ఇప్పుడిప్పుడు కానవచ్చుచున్నవి. వికాసము చైతన్యమునకు లక్షణముగదా!

మన భావములును, మన సంకల్పములును ఈ భారత దేశముయొక్క హద్దులలోనే ఒదిగియుండలేదు. ఇతరజాతుల వాఙ్మయములోనికి ప్రాకిపోయినవి. వివిధజాతులయందు తమ అర్హస్థానమును ఆక్రమించుకొని, మనకు ఇష్టమున్నను లేకున్నను, కొన్నియెడల నాయకత్వమును, నిరంకుశాధికారమును సైతము చేపట్టినవి. మొత్తముమీద ప్రపంచవికాసమునకు భారతదేశము చేసిన దోహదము ఆధ్యాత్మికవిద్యాప్రచారము. మానవుని అంతఃకరణమును ఆక్రమింపదగిన విషయములలో అత్యున్నత మును, అతిగంభీరమును, అతిసూక్ష్మమును అగు తత్త్వవిద్య భారతదేశమునుండి బహిర్గతమగుటవలననే మనజాతికి ప్రపంచ జాతులలో ఒక విశిష్టస్థాన మేర్పడినది. మనపూర్వులు అనేకము

లగు ఇతర విషయములందును కృషి సలిపిరి. ఇతర జాతుల వారి వలెనే వీరును ఇంద్రియగోచరమగు బాహ్యప్రకృతియొక్క రహస్యములను కనుగొనుటకై మొట్టమొదట ప్రయత్నించిరి. అద్భుతమగు తమ మహామేధాబలముతో లోకమంతయు శాశ్వతముగ గర్వపడదగిన గొప్ప అలౌకికకార్యములను ఆ క్షేత్రమునకూడ సాధించి యుండెడివారు. కాని అంతకంటె ఉత్తమమైనదాని కొఱకై వారు దీనిని విడిచివేసిరి. వేదపుటలనుండి ఉదాత్తమగు ఒక వాణి ఘోషిల్లుచు వినవచ్చుచున్నది—"ఆ నిర్వికార బ్రహ్మమును తెలుపునట్టి శాస్త్రమే ఉత్తమోత్తమమైనది!" వికార పుంజమును క్షణభంగురమును అగు ప్రకృతియొక్క, ఈ మర్త్య ప్రపంచముయొక్క, ఈ దుఃఖసంసారముయొక్క, ఈ శోకమయ లోకముయొక్క శాస్త్రముకూడ గొప్పదికావచ్చును. నిజమునకు గొప్పదే. అయినను ఎచ్చట మాత్రమే శాంతి కలదో, ఎచ్చట మాత్రమే శాశ్వతజీవనము కలదో, ఎచ్చట మాత్రమే అఖండత్వము కలదో, ఎచ్చట మాత్రమే దుఃఖమంతయు అంతరించుచున్నదో అట్టి నిర్వికారబ్రహ్మమును గుఱించిన, ఆ పరమానందమయుని గుఱించిన శాస్త్రమొక్కటియే మనపూర్వుల అభిప్రాయములలో అన్నింటిలోను ఉత్తమోత్తమము! ఇంతేల మనకు కూడును, గుడ్డను, తోడిమానవులను వశముచేసికొను శక్తిని ఒసగగల శాస్త్రమును, తోడి జీవరాసులను జయించి వానిపై పెత్తనము చెలాయించు సెటులో తెలుపు శాస్త్రమును, బలవంతులు బలహీనులపైని అధికారము చూపు యుక్తిని నేర్పు శాస్త్రమును వారపేక్షించిన యెడల కనుగొనగలిగెడి వారే! కాని ఈశ్వర కృపవలన అంతకంటె మిక్కిలి ఉత్తమమును, ఉన్నతమును, అత్యధికానందప్రదమును అగు ఆ అన్యవిషయమును వారు తత్క్షణము గుర్తించిరి. అది వారి జాతీయ స్వభావమైపోవువఱకును, వేల కొలది సంవత్సరములనుండి అనుస్యూతముగా పిత్రార్జితసంపదగా మనదాక వచ్చువఱకును, అది మనలో సామాప్యము పొందు

వఱకును, మన రక్తనాళములలో ప్రవహించు ప్రతి నెత్తురు చుక్కలోను అది జలజలలాడువఱకును, అది మన సహజలక్షణ మైపోవువఱకును, "మతము", "హిందువు" అను శబ్దములు అభిన్నములై పరగు వఱకును, వారు దానిని పట్టుకొని సాధించిరి. అది మనజాతీయ విశిష్టలక్షణము. దాని నెవరును తాకలేరు. ఖడ్గమును అగ్నిని చేబూనివచ్చిన క్రూరజాతులలో క్రూరదుష్టాచారములను తోడ్కొనివచ్చిన అనాగరికజాతులలో, ఒక్కరేనియు మన ఆయువు పట్టును తాకజాలక పోయిరి. ఆ "జీవమణి"ని ఒక్కడును స్పృశింపజాలక పోయెను. మన జాతీయాత్మ నెలకొని యున్న ఆ "పక్షి"ని చంపు శక్తి ఒక్కనికిని లేకపోయెను. కాబట్టి మత మనునది ఈ జాతియొక్క ఆయువుపట్టు. అది సురక్షితముగా నున్నంతకాలము ఈ జాతిని ధ్వంసముచేయగల శక్తి ఈ జగత్తున ఎక్కడను నుండదు. మన పిత్రార్జిత సంపదలన్నిటిలోను శ్రేష్ఠతమమగు ఆధ్యాత్మికధర్మమును మనము అవలంబించి యుండునంత కాలము, అన్నిబాధలును, లౌకికములగు అన్నిదుఃఖములును, మనకు ఏ హానియు కలుగజేయకయే దాటిపోవును. మనము ప్రహ్లాదునివలె ఆ అగ్నిజ్వాలలనుండి సురక్షితముగా బయట పడగలము. ఏ హిందువేని ఆధ్యాత్మికపరాయణుడు కానియెడల, వానిని నేను హిందువనియే పిలువను. ఇతర దేశములందు ప్రతి వానికిని మున్ముందుగా రాజకీయవిషయము ముఖ్యము; ఆ పిమ్మట కొంచెము మతము. కాని ఇక్కడ భారతదేశమునందో మన జీవితములందు ప్రప్రథమమును, ప్రధానమును అగు ధర్మము ఆధ్యాత్మికము! ఆ పిమ్మట కాలవ్యవధి యున్నచో ఇతర విషయములు వచ్చును. దీనిని మనస్సున పెట్టుకొని మన జాతీయ శ్రేయస్సు కొఱకు ప్రాచీనకాలమున జరిగినట్లే ఇక ముందును సదా పాటుపడవలయును. ప్రస్తుతము మన జాతియొక్క ఆధ్యాత్మికశక్తుల నన్నిటిని మున్ముందుగా కనుగొనవలసి యున్నది. భారతదేశములో జాతీయైక్య మనగా అచ్చటచ్చట చెదరియున్న

ఆధ్యాత్మికశక్తుల నన్నిటిని ప్రోగుచేయుటయే! భారతదేశములో ఒకజాతి యనగా ఒకే ఆధ్యాత్మికసంకీర్తనమునకు అనుగుణముగా తాళమువేయు హృదయస్పందనముగల ప్రజారాశి యనియే అర్థము!

ఈ దేశములో ప్రజాసమాజమున పెక్కు శాఖలు ఉండెడివి. ఇప్పుడు బహుళముగానున్నవి. ఇకముందును బహుళముగా నుండగలవు. ఏలయనగా మనమతము భావమూలక సిద్ధాంతములందు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగుచున్నది. ఇది మన మతమునకు ప్రత్యేకలక్షణము! ఈ సిద్ధాంతముల ననుసరించి అతిస్వల్పాంశముల వివరణము జరుగును. మన శిరస్సులపైని ఉండెడి ఆకాశమంత విశాలములును, సాక్షాత్తు మూలప్రకృతి యంత శాశ్వతములును అగు ధర్మసూత్రములనుండి ఈ స్వల్ప వివరము లన్నియు నిర్మితము లగుచుండును. కాబట్టి సహజముగా సంప్రదాయ భేదములు మనదేశమున ఉండితీరవలసినవే. కాని ఉండదగనివి ఏవి? ఈ సాంప్రదాయకములగు కొట్లాటలు మాత్రమే! సమాజశాఖలు ఉండితీరవలసినవే అయినను సాంప్రదాయక దురభిమానము ఉండ నగత్యములేదు. సాంప్రదాయక దురభిమానమువలన ప్రపంచ మెన్నడును బాగుపడదు. అయినను వేర్వేఱు సంప్రదాయములును సమాజశాఖలును లేనిది ప్రపంచము నడువజాలదు. ఒక చిన్న మానవబృందము ప్రతికార్యమును నిర్వహింపజాలదు. ఈ జగత్తున గల అనంతమగు శక్తిరాశినంతను కొలదిమంది పురుషులు పరిపాలింపజాలరు. కావున పరిశ్రమ విభాగము బలాత్కారముగా నైనను జరుగవలసినదే. అందు వలననే అనేక సంప్రదాయములు ఏర్పడినవి. ఆధ్యాత్మికశక్తుల వికాసార్థము సంప్రదాయభేదము లుండునుగాక! కాని అందువలన మనము పోరాటములకు తలపడ వలసిన అగత్యము కలదా? మన ప్రాచీన గ్రంథములు ఈ విభేదము మిథ్య అనియు, ఇన్ని విభేదము

లున్నను వీని యన్నింటను ఒక ఐకమత్యము ఒక సుందరసామ రస్యము కలదనియు ఘోషించుట లేదా? "ఏకం స ద్విప్రా బహుధా వద న్తి" (ఉండు బ్రహ్మము ఒక్కడే. జ్ఞానులు వానిని అనేక నామములతో పిలుతురు) అని మన ప్రాచీనగ్రంథములు ప్రకటించుచున్నవి. కాబట్టి ఈ సంప్రదాయముల మధ్య తగవులు కలిగిన యెడల, ఈవేర్వేఱు సంప్రదాయములు కొట్లాటలకు దిగిన యెడల, భారతదేశమున గల ఆయాసంప్రదాయముల నడుమ అసూయాద్వేషములు పొసగినయెడల, సర్వసంప్రదాయములును సర్వకాలము గౌరవింపబడుచు వచ్చిన ఈ దేశములో ఆ వంశ పురుషుల సంతానమని చెప్పుకొనుటకేని మనకు యోగ్యతఉండదు గదా! అది యెంతటి శోచనీయ స్థితియో ఆలోచింపుడు!

మనదేశములో వైష్ణవులుగాని శైవులుగాని, శాక్తేయులు గాని గాణాపత్యులుగాని, ప్రాచీన వేదాంతపద్ధతులకు చెందిన వారుకాని, నూతనమతములకు చెందినవారుగాని, పూర్వాచార సంప్రదాయములకు చెందిన వారుగాని, నవీన సంస్కారసంఘము లకు చెందిన వారుగాని, కొన్ని మహాధర్మసూత్రముల విషయ మున ఏకీభవించుచున్నారని నా అభిప్రాయము. హిందువునని చెప్పుకొను ప్రతిమనుజుడు ఈ ధర్మసూత్రములను విశ్వసించు చున్నాడు. అయినను ఈ ధర్మసూత్రములకు అర్థముచెప్పుటలో, వానికి వివరణములు కూర్చుటలో, సహజముగా భిన్నత్వము ఉండి తీరవలసినదే. దానిని అందఱును ఆమోదింప వలసినదే. ఏలయన ప్రతి మానవుని బలాత్కారముగా మన స్థితియందే నొక్కిపెట్టుట మన సిద్ధాంతము కాదు. మన వ్యాఖ్యానము ననుసరించియే వర్తింపుమనియు మనవిధానమునే అనుసరించి జీవింపు మనియు ప్రతిమానవుని బలాత్కరించుట పాతకము. వేదములు మతరహస్య ములను బోధించు సనాతనగ్రంథములని ఇక్కడనున్న వారందఱు బహుశః విశ్వసింతురని అనుకొందును. ఈ పావనవాఙ్మయము

ఆది లేక, అంతమును లేక, ఆద్యంతములు లేని ప్రకృతితో సమాన ప్రతిపత్తి కలిగియున్నదని మన మందఱమును నమ్ముదుము. ఆ పవిత్ర గ్రంధము నెదుట నిలుచుండు నప్పుడు మత సంబంధము లగు మనవిభేదములును మతవిషయకములగు తగవులాటలును అన్నియును అంతరింపవలసి యుండుననియు, ఆధ్యాత్మిక సంబంధములగు మతవిభేదముల నన్నింటిని తీర్చుకొనుటకు వేదమే ఉత్తమన్యాయస్థాన మనియు మనమందఱమును అంగీకరింతుము. ఆ వేదములు ఎట్టివి అను నిర్ణయమును గుఱించి మనకు వేర్వేఱు దృక్పథములు ఉండవచ్చును. ఒకభాగము మఱొకభాగము కంటె అధికపవిత్రత కలదని భావించు ఒక సంప్రదాయము ఉండుగాక! కాని మన మందఱమును ఈ వేదముల విషయమున సోదరుల మనియు, పూజనీయములును సనాతనములును ఆశ్చర్యజనకములును అగు ఈ గ్రంథమునుండియే మన కీనాడు గల శుభకరమును నిర్మలమును పవిత్రమును అగు సర్వమును లభించెననియు మనము గ్రహించినంత కాలము ఆ విషయము అంతగా పాటింపదగినది కాదు. కాబట్టి మీరు వేద ప్రామాణ్యమును విశ్వసించు నెడల మొట్టమొదటగా ఈ సూత్రమును దేశమం దెల్లెడల బాహాటముగా పూర్ణప్రచారము చేయుడు. వేదములకు అర్హమగునట్టి ప్రాధాన్యమును ఒసంగుడు. సరే, వేదముల తర్వాత మనమందఱమును విశ్వసించు రెండవ అంశమేది! ఈ జగము నంతను సృష్టించి రక్షించు మూలశక్తియై యుండు వా డెవడో, జగత్తనెడు ఈ విచిత్రసృష్టి కాలక్రమము ననుసరించి ఎవనినుండి వ్యక్తమై వెలువడుచు మరల ఎవనిలోనికి పోవుచుండునో అట్టి భగవంతు డొకడు ఉన్నాడనుట. ఈ భగవంతుని గుఱించి మన భావనలు భిన్నముగా నుండవచ్చును. ఒకడు పూర్ణముగా సగుణుడగు భగవంతునియందు విశ్వాసము ఉంచవచ్చును. మఱొకడు సగుణుడయ్యును మానవస్వరూపుడు కానట్టి భగవంతుని నమ్ముకొనవచ్చును. వేఱొకడు పూర్ణముగా నిర్గుణుడగు

భగవంతునియందు నమ్మకము పెట్టుకొన వచ్చును. ఈ అందఱి కిని వేదములందు ప్రమాణములు దొఱకును. మనమందఱమును భగవంతునియందు విశ్వాసము గల వారమే! దేనినుండి ఈ సమస్తమును కలుగుచున్నదో, దేనియందు ఈ సమస్తమును మనుచున్నదో, దేనిలోనికి తుదకు ఈ సమస్తమును మరలు చున్నదో, అట్టి విచిత్రాఖండ శక్తిని నమ్మనివాడు హిందువునని చెప్పుకొనుటకు అర్హుడుకాడని దీని అర్థము. అట్లగుచో ఈ సిద్ధాంతమును గూడ దేశము నందంతటను ప్రచారము చేయుదముగాక. నీ కెట్టి భావనకలదో అట్టిదానినే ప్రచారము చేయుము; దానినే బోధింపుము. భేదములేదు; మనము దానిని గుఱించి పోట్లాడబోవుటలేదు. భగవంతుని మాత్రము ప్రచారము చేయుము. మనకు కావలసిన దంతయు అదియే. ఒకభావన వేఱొకదానికంటె శ్రేష్ఠతరముగ నుండవచ్చును. కాని, వానిలో ఏదియు దూష్యము కాదని నీవు జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఒకటి శ్రేష్ఠమైనది, మఱొకటి శ్రేష్ఠతర మైనది, ఇంకొకటి శ్రేష్ఠతమమైనది; అంతియేగాని చెడ్డది అను మాట మన పరిభాషలోనికి రాదగదు. కాబట్టి తమకు ఇష్టమగు విధమున భగవంతుని నామమును ప్రచారముచేయు వారి నంద ఱిని భగవంతుడు ఆశీర్వదించునుగాక! భగవంతుని గుఱించి ఎంతెంత ప్రచారము జరిగిన ఈ జాతికి అంతంత మేలు చేకూరును. భగవన్నామము స్మరింపవలయుననెడు భావముతో మన సంతాన మును పెంచుదుము గాక! ఈ భావము పేదవారి ఇండ్లలోనికిని, దీనజనుల గుడిసెలలోనికిని, శ్రీమంతుల భవనములలోనికిని చొచ్చుకొని పోవుగాక!

నేను మీకు తెలుపదలచిన మూడవ భావమిది: పుడమి యందలి ఇతరజాతులవలె, ఈ ప్రపంచము కొన్నివేల యేండ్ల క్రిందట సృష్టింపబడెననియు, మరల ఒకానొక దినమున శాశ్వత

ముగ నాశముచేయబడుననియు మనము నమ్ముటలేదు. ఈ జగత్తులో కూడ నరుని ఆత్మ, శూన్యమునుండి సృష్టింప బడె ననియు మనము నమ్మము. మన మందఱము ఏకీభవించు మఱొక అంశము ఇదియే యని నేను తలంతును. ప్రకృతి ఆద్యంతములు లేనిదనియు, ఈ బాహ్యప్రపంచముయొక్క స్థూలద్రవ్యము కొన్ని నియతసమయములందు తన అత్యంతసూక్ష్మదశకు మరలు ననియు, కొంత నియమితకాలము వఱకు అటుల నిలిచి తిరిగి బహిర్గతమై మనము 'ప్రకృతి'యని పిలిచెడు ఈ అనంత మనోహరదృశ్యముగా వ్యక్తమగుచుండుననియు మనము విశ్వసింతుము. ఈ తరంగగతి కాలము ఆరంభ మగుటకు పూర్వము నుండియు జరుగుచున్నది. ఇంకను అనంతముగా శాశ్వతముగా జరుగుచునే యుండును. మన విశ్వాస మిట్లున్నది. హిందువులందఱును విశ్వసించు విషయ మింకొకటికూడ కలదు. 'నరుడు' అనగా ఈ జడమయస్థూలశరీరము మాత్రము కాదు. అంతరమగు మనస్సనెడు సూక్ష్మశరీరము మాత్రమును కాదు. ఈ శరీరము మాఱిపోవుచున్నది. అట్లే మనస్సును మాఱిపోవుచున్నది. కాని వీనికంటె శ్రేష్ఠతరమైనది ఒకటి కలదు. అది వీనికి అతీతముగ నుండు ఆత్మ. 'ఆత్మ' అను శబ్దమును భాషాంతరమున తెలుప ప్రయత్నింపను. ఏ భాషాంతరీకరణము చేసినను తప్పే యగును. 'ఈ సూక్ష్మశరీరమునకు ఆవల ఒకటి యున్నది' అని మన మందఱమును నమ్ముచున్నాము. అదియే నరుని ఆత్మ. దానికి ఆద్యంతములు లేవు. మరణమన్న నేమో అది ఎఱుగదు. తక్కిన జాతు లందఱి భావములకును భిన్నమగు ఈ విచిత్ర భావము మనకు గలదు. అదే మన ఆత్మ. అది శరీరము తర్వాత శరీరమును వరుసగా గ్రహించి అందు వసించుచుండును. తనకు అభిలాష ఉన్నంతవఱకు అటుల చేయుచుండును. తుదకు అది ముక్త మగును. ఆ పిమ్మట ఇక దానికి జననము లేదు. ఇచ్చట సంసారసిద్ధాంతమును సూచించుచున్నాను. మనశాస్త్ర

ములు బోధించు 'జీవులు శాశ్వత' మనెడు సిద్ధాంతము ఇదియే. మనము ఏ సంప్రదాయమువార మైనను అందఱము ఏకీభవించు విషయ మిది ఒకటి. ఆత్మకును భగవంతునికినిగల సంబంధమును గుఱించి భావభేదము లుండవచ్చును. ఒక సంప్రదాయము ప్రకారము ఆత్మ భగవంతునినుండి శాశ్వతముగా వేఱుపడి యుండ వచ్చును; వేఱొక సంప్రదాయము ప్రకారము ఆ అఖండాగ్ని రాశియందు ఒక రవ్వను బోలి యుండవచ్చును; ఇంకొక సంప్ర దాయము ప్రకారము ఆ అఖండవస్తువుతో అభిన్నమై ఉండ వచ్చును. మూలసూత్రమునందు మనకు విశ్వాస మున్నంత వఱకు మనమెట్లు భావనచేసినను తొందఱలేదు. ఆ మూలసూత్ర మిది: జీవాత్మ అనంతమైనది; అది ఎన్నడును సృష్టియైనది కాదు. కావున ఎన్నడును మరణింపదు; అది వేర్వేఱు శరీర ములలోనికి పోవుచు మానవ శరీరములో పరిపూర్ణత్వమును పడయు వఱకు పరిణామము పొందుచుండును. ఈ సూత్రమును గుఱించి మన కందఱకును ఏకీభావము కలదు. ఇక ఉత్తమోత్త మమును అతివిస్మయకరమును, ఆధ్యాత్మిక క్షేత్రమున కనుగొన బడిన సిద్ధాంతములలోనెల్ల శ్రేష్ఠతమమును అగు విషయము ఇంకొకటికలదు. పాశ్చాత్య తత్త్వశాస్త్రము, ప్రాచ్య వేదాం తము, ఈ విషయముననే ప్రధానముగా భేదించుచున్నవి. పాశ్చాత్య తత్త్వశాస్త్రమును చదువుచుండిన మీలో కొందఱు దీనిని కనిపట్టియే యుండవచ్చును. అది ఏది? – మనము శాక్తే యులమైనను, వైష్ణవుల మైనను, సూర్యోపాసకుల మైనను, బౌద్ధుల మైనను, జైనుల మైనను భారతదేశములోని మన మంద ఱమును జీవాత్మ స్వభావముచేతనే పవిత్రమైనదనియు, పూర్ణమైన దనియు, అఖండశక్తి గలదనియు, దివ్యమైనదనియు విశ్వసించు చున్నాము. ద్వైతుల అభిప్రాయము ననుసరించి ఆత్మయొక్క ఈ సహజ దివ్య తేజస్సు పూర్వపు దుష్కర్మవలన సంకుచితమై పోయినది. భగవదనుగ్రహమువలన అది తిరిగి వికాసమును

పొంది తన పూర్ణత్వమును ప్రకటించును. ఇక అద్వైతసిద్ధాంతము ననుసరించి సంకోచమనెడు ఈభావము సైతము కొంతవఱకు పొరపాటే. 'మాయ' ఆత్మను ఆవరించియుండుట చూచి ఆత్మ తన మహిమను కోల్పోయినదని మనము భ్రమించు చున్నాము; ఇంతియే కాని దాని మహిమలు సంపూర్ణముగా ప్రకాశించుచునే యున్నవి. ఈ భేదము ఎటువంటిదైనను మన ప్రధాన సారాంశమును విచారించునప్పుడు, ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతముల మధ్య పరస్పరసమాధానము కుదరని గొప్ప భేద మొకటి కలదని స్పష్టమగుచున్నది. ఉత్తమమును శుభంకరమును అగు సర్వమును ప్రాచ్యఖండవాసులు అభ్యంతరమున వెదకుదురు. పూజలు చేయునప్పుడు మనము కన్నులు మూసికొని భగవంతుని అభ్యంతరమునందు కనుగొనజూతుము. పాశ్చాత్యులో, భగవంతుని కొఱకు బాహ్యమునందు పైకిచూతురు. పాశ్చాత్యులకు వారి మత గ్రంథములు బాహ్యమునుండి పుట్టినవి. మన గ్రంథములో శ్వాసవలె అభ్యంతరమునుండి వెలువడినవి. మంత్రద్రష్టలగు ఋషుల హృదయములనుండి భగవంతుని శ్వాసగా అవి వెలువడినవి.

నా మిత్రులారా! నా సోదరులారా! మనము బాగుగా గ్రహింపవలసిన ముఖ్యాంశ మిది యొకటి. భవిష్యత్కాలమున మనము పట్టుదలతో అనుసరింపవలసినది ఈ ఒక్క విషయమే యని మీకు తెలుపుచున్నాను. ఈ ఒక్క విషయమును గుఱించి నాకు దృఢవిశ్వాస మమరినది. మీరు దీనిని చక్కగ గ్రహింపవలయునని నా ప్రార్థన—దివారాత్రములు తాను వ్యర్థుడనని మననము చేయుచుండు నరునివలన ఎట్టిశుభమును కలుగబోదు. ఒక పురుషుడు రేయింబవళ్లు తాను దుఃఖితుడనని అధముడనని వ్యర్థుడనని స్మరించుచుండెనేని, అతడు వ్యర్థుడే అయిపోవును. నీవు 'అహం' 'అహం' అని స్మరింతువేని అటులే అయిపోవుదువు. నీవు 'నాహం' అనుచు 'నేను కా'నని తలంచి, పగలు

రాత్రి వ్యర్థుడనని మననము చేయసాగితివేని నీవు నిజముగా వ్యర్థుడవే అయిపోవుదువు. ఈ మహా సత్యమును జ్ఞప్తియందుంచుకొనవలయును. మనము ఆ సర్వశక్తిమయుని బిడ్డలము; మనమా అఖండ దివ్యాగ్నిలోని రవ్వలము. మనము శూన్యులమై పోవుటెట్లు? మనము సర్వమయులము. మనము సర్వమును చేయ సిద్ధముగ నున్నాము. మనము దేనినైనను చేయగలము. మనము ప్రతిదానిని చేసితీరవలెను. ఈ ఆత్మవిశ్వాసము మన పూర్వుల హృదయములందు ప్రకాశించినది. నాగరికతాభివృద్ధి యందు వారిని ముందునకు త్రోసికొని వచ్చిన క్రియాశక్తి ఈ ఆత్మ విశ్వాసమే! మనకు భ్రష్టత్వము వాటిల్లిన యెడల, దోషము చేకూరిన యెడల, నామాటను గుర్తుపెట్టుకొనుడు. ఆ భ్రష్టత్వము మనప్రజలు ఆత్మవిశ్వాసమును కోల్పోయిననాడే ప్రారంభమైనది. తనయందు తాను విశ్వాసము పోనాడుకొనుట యనగా భగవంతునియెడల విశ్వాసము పోగొట్టుకొనుటయే! నీలోనను, నీద్వారమునను కర్మ చేయుచున్న ఆ అఖండ శుభంకరదైవము నందు నీకు విశ్వాసము కలదా? ఈ అంతర్యామి ప్రతిపరమాణువు నందును వెలసి, నీ శరీరమంతటను, నీ మనస్సునందును, నీ ఆత్మ యందును ఓతప్రోతముగా (పడుగు పేకగా) వ్యాపించి యున్నటుల నీవు విశ్వసింతువేని ఇక అధైర్యపడుటెట్లు? నేను ఒక చిన్న నీటి బుడగను కావచ్చును; నీవు పర్వతోత్తుంగ తరంగమవు కావచ్చును. విచారమేల? ఆ అనంతసాగరము నీకును నాకునుగూడ ఆధార క్షేత్రమై యున్నది. ఆ అఖండచైతన్య సముద్రము, ఆ అఖండశక్తి జలరాశి, ఆ అఖండాత్మజలనిధి, నీదైనయటులే నాదియు కూడ. నా జన్మాదిగా నా చైతన్యము సాక్షిగా ఆ అనంతచైతన్య రాశితో ఇదివఱకే కలసియున్నాను. దానితో యోగము నందుచున్నాను. పర్వతమంత ఎత్తుగలిగి నీవు ఉన్నను, నీవలె ఆ అనంత క్షేమనిధితో ఆ అఖండశక్తి రాశితో నేనును కలిసియే యున్నాను. కాబట్టి నా సోదరులారా! ఈ జీవప్రదమైన,

మాన్యమైన, ప్రభావవంతమైన మహాసిద్ధాంతమును మీబిడ్డలకు, వారు పుట్టిన నాటినుండియే బోధసేయుడు. మీరు వారికి అద్వైతము నేర్ప నక్కఱలేదు; ద్వైతమే బోధింపుడు; లేక మీకిష్టమగు ఏమతమునైనను బోధింపుడు. ఏది బోధించినను ఈ భారత దేశము నందంతటను ఆత్మయొక్క పూర్ణత్వమును గూర్చిన ఈ సిద్ధాంతమే శాశ్వతమై నిలువగలదు. దీనినే సకలసంప్రదాయములును విశ్వసించుచున్నవి. ఆ మహాతత్త్వవేత్త కపిలాచార్యులు తెలిపినటుల జీవాత్మ స్వభావముచేతనే పవిత్రమైనది. కానియెడల ఎన్నడును అది పవిత్రతను పొందజాలదు. స్వభావముచేత ఏదేని పరిపూర్ణము కానియెడల, ఒకప్పుడది పరిపూర్ణత్వమును పొందినను ఆ పూర్ణత్వము మరల జారిపోవును. నరుడు స్వభావముచేతనే అపవిత్రుడైన యెడల, నడుమ ఒక ఐదు నిముసములపాటు పవిత్రుడైనప్పటికిని అతడు సదా అపవిత్రుడుగా ఉండిపోవలసినవాడే. ఆ పవిత్రత కొట్టుకొని పోవుకాలము వచ్చితీరును. అంతట పూర్వపు సహజమగు అపవిత్రత మరల తలసూపవలసినదే! కాబట్టె మన తత్త్వవేత్తలందఱును పుణ్యమే మన స్వభావమందురు. పూర్ణత్వమే మన సహజగుణము. అంతియేకాని అపూర్ణత, మాలిన్యము, మన స్వభావములోనివికావు. మనము ఈ విషయమును జ్ఞప్తియం దుంచుకొందుముగాక. ఒక మహర్షి ప్రాణావసాన కాలమున తన మహాకార్యముల నన్నింటెని, తన మహోత్తమ సంకల్పముల నన్నింటిని, జ్ఞప్తికి తెచ్చుకొనుమని తన మనస్సును హెచ్చరించెనట! తన దోషములను లోపములను జ్ఞప్తికి తెచ్చుకొనుమని మనస్సునకు చెప్పలేదు! చూచితిరా! మనోహరమగు ఈ ఉదాహరణమును ఎన్నడును మరువకుడు. లోపములా ఉండును. దుర్బలతయా ఉండి తీరును. అయినను మీ యథార్థస్వభావమును నిరంతరము జ్ఞప్తిలో నుంచుకొనుడు. మన దౌర్బల్యమును పోగొట్టుకొనుటకు ఇది ఒకటియే మార్గము; మనదోషములను నివారించుకొనుటకు ఇది ఒకటియే త్రోవ!

భారతదేశములో వివిధమతసంప్రదాయముల మధ్య సమానముగా కొన్ని అంశములు ఇవిగా గోచరించుచున్నవి. ఒకవేళ భవిష్యత్కాలమున ఈ సమానాంశములను పురస్కరించుకొని పూర్వాచార పరాయణులును, మతస్వాతంత్ర్యవాదులును, ప్రాతపద్ధతులవారును, క్రొత్తపద్ధతులవారును, ఒండొరులను ఆలింగనము చేసికొనవచ్చును. అన్నిటిని మించి జ్ఞప్తిలో నుంచుకొనవలసిన ఇంకొక విషయము కలదు. దానిని అప్పుడప్పుడు మనము మఱచుచుండుట చూడ నాకు విచారము కలుగుచున్నది. భారతదేశములో మతమనగా స్వయమగు అపరోక్షానుభూతియే. ఈ ప్రత్యక్షానుభవమునకు తగ్గినదేదియు మతమే కాదు. "ఈ ధర్మమును నమ్ముకొనుము, నీకు క్షేమమగును" అనునిట్టి బోధలు మనచెవికెక్కవు. మనకు వానియందు నమ్మకములేదు. నిన్ను నీవు ఎట్టివానినిగా చేసికొందువో అట్టివాడవుగానుందువు. ఈశ్వర కృపవలనను, నీసాధనవలనను నీ విప్పుడిట్టి వాడవైతివి. కొన్ని సిద్ధాంతములను, కొన్ని ధర్మములను 'నమ్మట' వలనమాత్రము కాదు. భారతదేశములో ఆధ్యాత్మికాకాశమునుండి వినవచ్చిన గంభీరశబ్దము అనుభూతి; అనగా ప్రత్యక్షానుభవము. "బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనవలయును" అను బోధ మన గ్రంథములందు మాత్రమే పలుమారు వినవచ్చుచున్నది. ధైర్యవంతములును, సాహసోపేతములును అగు పలుకు లివి! కాని అవి సంపూర్ణముగా సత్యములే! ప్రతిశబ్దమును ప్రతిస్వరమును సత్యమే! మతమును అనుభూతి చేయవలయును. వినిన చాలదు. చిలుకవలె ఏదో శాస్త్రమును నేర్చుట చాలదు. దేనినిగాని మానసికముగా అంగీకరించినంతమాత్రమున మతము కాబోదు. అందేమియు ప్రయోజనములేదు. అది మన లోపలికి ప్రవేశింపవలయును. చూడుడు, భగవంతుడున్నాడనెడు విషయమున మనకు గల గొప్ప నిదర్శనము మన తర్కము అటుల చెప్పుచున్నదనుటకాదు. ప్రాచీనులును నవీనులును కూడ భగవంతుని

సాక్షాత్కారము పొందిరి. కనుకనే మనము రుజువైనదను చున్నాము. ఆత్మ కలదని రుజువుచేయుటకు బలవత్తర కారణము లున్నవి. కాని మనము దాని ఉనికిని విశ్వసించుట అందువలననే కాదు. ముఖ్యముగా భారతదేశములో, పూర్వకాలమున పెక్కు వేల మంది ఆత్మసాక్షాత్కారమును పొందిరి. ఈకాలమున గూడ చాలమంది పొందుచున్నారు. భవిష్యత్కాలమునను అట్టి సాక్షాత్కారమును పొంది తమ ఆత్మలను చూడ గలుగువారు వేలకొలది ఉందురు. అందుచే ఆత్మ కలదను విశ్వాసము మనలో దృఢముగా నిలిచినది. నరుడు స్వయముగ దేవుని చూచువఱకు, తన ఆత్మను ప్రత్యక్షము చేసికొనువఱకు వానికి మోక్షములేదు. కాబట్టి అన్నిటికంటె ముఖ్యముగ దీనిని అర్థముచేసికొందుము గాక. మనము దీనిని గ్రహించినకొలదిని భారతదేశములోని సాంప్రదాయక దురభిమానము తగ్గిపోవుచుండును. ఏలయన భగవంతుని అనుభూతికి తెచ్చుకొని వానిని చూచినవాడే మతధర్మ పరాయణుడగును. ఎవడు దగ్గఱవానిలోనెల్ల దగ్గఱగను, దూరపు వానిలోనెల్ల దూరముగను ఉండు దైవమును చూచునో వాని యందలి హృదయగ్రంథులు తెగిపోవును. వానియందలి సంశయములు తీరిపోవును. అతడు మాత్రమే కర్మఫలమునుండి ముక్తుడగును. ఓహో వ్యర్థప్రలాపములనే మతధర్మములుగను, కేవల బుద్ధిసాధ్యప్రసంగములనే ఆత్మసాక్షాత్కారముగను భావించి మనము తఱచుగ పొరబడుచుందుము. అంతట సాంప్రదాయక దురభిమానములు బయలుదేరి పోట్లాటలు సాగును. అపరోక్షానుభూతియే నిజమగు మతమని మనమొకసారి గ్రహించిన యెడల, మన హృదయములను పరిశోధించుకొని మతధర్మములను ఎంత వఱకు అనుభూతి చేసికొన గలిగితిమో తెలిసికొందుము. అప్పుడు మనమట్టుకు మనమే చీకటిలో దేవులాడుకొనుచు ఇతరులను కూడ ఆ చీకటిలోనికే తీసికొనిపోవుచున్నామని గ్రహింతుము. అప్పుడు మనము పాక్షికదురభిమానములను వివాదములను దెబ్బలాటలను

మానుకొందము. ఎవరేని శాఖాసాంప్రదాయకమగు పోరాట
మును మొదలిడ ప్రయత్నించినయెడల వానిని ఇట్లు ప్రశ్నింపుడు
"నీవు భగవదనుభూతిని పడసితివా? నీవాత్మను కనుగొంటివా?
లేదేని భగవంతుని పేరిట ప్రచారము చేయుటకు నీకేమి అధి
కారము కలదు? నీమట్టుకు నీవే చీకటిలో దేవులాడుచు నన్ను
గూడ ఆ చీకటిలోనికి లాగ ప్రయత్నించుట * గ్రుడ్డివాడు గ్రుడ్డి
వానికి త్రోవచూపుచు ఇద్దరును గోతిలోపడుచందమగును గదా".

కాబట్టి మీరు పోయి ఇతరుల దోషములను వెదకుటకు
ముందు జాగ్రత్తగా ఆలోచనచేయుడు. వారు తమ హృదయము
లోని సత్యమును కనుగొనుటకు ప్రయత్నించుచున్నంతవఱకు
భగవత్సాక్షాత్కారము పొందుటకు వారిమార్గమున వారిని
పోనిండు. విశాలమును, నిష్కళంకమును అగు సత్యమే గోచ
రించుచో వారు పరమానందమునే పొందుదురు. భారతదేశము
నందలి ప్రతి ఋషియు, సత్యసాక్షాత్కారము పొందిన ప్రతి సిద్ధ
పురుషుడును ఈ పరమానందమును గుఱించి ఋజువు పల్కు
చున్నారు. అప్పుడు వారి హృదయములనుండి ప్రేమపూరిత వచ
నములు మాత్రమే వెలువడును. ఏలయన అకలంకప్రేమస్వరూపి
యగు భగవంతుని వారిహృదయములు స్పృశించియుండును.
అప్పుడు మాత్రమే సమస్తశాఖాదురభిమానపు పోరులును అణగి
పోవును. అప్పుడు మాత్రమే మనము హిందు వను శబ్దమును,
ఆ పేరు పెట్టుకొనిన ప్రతివానిని అర్థముచేసికొనగలము. అప్పుడు
మాత్రమే అట్టి హిందువును మన హృదయములోనికి ఆకర్షించు
కొనుటకును, కౌగిట జేర్చుకొని గాఢముగ ప్రేమించుటకును, తగిన
స్థితి మనకు సంప్రాప్తించును. నా పలుకులు గుర్తుంచుకొనుడు,
అప్పుడు మాత్రమే మీరు నిజమగు హిందువులై, హిందువను
నామము ఉచ్చరింపగనే బలవర్ధకమగు విద్యుత్ప్రవాహము

* "అంధేనైవ నీయమానా యథాంధాః" కఠోపనిషత్తు.

మీతనువుల బులకరింపజేయును. హిందువని పేరు పెట్టుకొని ఏ దేశమునందుండినను, మనభాషను మాటాడువాడైనను కాక పోయినను, అతడు నీకు సన్నిహిత ప్రియబంధువై తోచునప్పుడు మాత్రమే నీవాక హిందువు అనిపించుకొన దగుదువు. హిందువను పేరుగల ఎవడేని ఆపదలో నున్నప్పుడు నీ హృదయము కరగి నీ సొంతకుమారుడే ఆపదలో నున్నటుల నీవు అనుభూతి పడసినపుడు మాత్రమే నీవు హిందువనిపించుకొనుటకు అర్హుడ వగుదువు. ఈ ఉపన్యాసారంభమున నేను పేర్కొనిన అసదృశ మహామూర్తియగు మీ గురుగోవిందసింగు మహాశయునివలె సోదర హిందువులకొఱకు సర్వమును భరించుటకు సంసిద్ధముగ నున్నప్పుడే మీరు హిందువులనిపించుకొనుటకు తగినవారగుదురు. ఎవరు హిందూమత సంరక్షణకొఱకు తన రక్తమును బలిఇచ్చెనో, ఎవరు యుద్ధభూమియందు తన కొడుకుల హత్యను కనులార చూచియు హృదయమును చిక్కబట్టి, తనదేశమును పీడించు శత్రువుల నెదిరించి పోరాడ సాహసించెనో, కటా! ఎవ్వరికొఱకు తన రక్తమును తన సన్నిహితప్రియబంధువుల రక్తమును బలిగా నర్పించి అట్టివారిచేతనే తన మాతృదేశమునుండి వెళ్లగొట్టబడెనో ఆ అప్రతిమ మహామూర్తి, పోటువడసిన సింహము తీరున యుద్ధభూమినుండి మరలి దక్షిణదేశమున ప్రశాంతముగా ప్రాణములు విడుచుటకు ప్రవాసముపోయియు, కృతఘ్నులై తన్ను పరిత్యజించినవారిని గూర్చి ఒక్క కఠినవచనము నైనను తన పెదవుల నుండి వెలువడనీయడయ్యె! ఓహో! మీ దేశమునకు మీ రుపకారము చేయగోరితిరేని మీలోని ప్రతివాడును అట్టి గురుగోవింద సింగు కావలసియుండును. మీ స్వదేశీయులందు వేలకొలది లోపములు మీకు కాన్పించుగాక. అయినను వారియందలి హిందూరక్తమునే గుర్తించి పాటింపుడు. వారు మీకు అపాయము కూర్చుటకే సర్వవిధముల ప్రయత్నించి యుండినను మీరు పూజ లర్పింపవలసిన ప్రధానదేవతలు వారే! వారిలో ప్రతియొక్క

డను మీపై శాపవాక్యములు విసరుచున్నను మీరు మాత్రము వారిపై దీవనలనే కురిపింపుడు. వారు మిమ్ము తఱిమివేసినయెడల ఆ మహాసింహమువలె మౌనము వహించి చాటునకు పోయి శాంతముతో మరణింపుడు. అట్టివాడే హిందువను నామమును ధరించుటకు అర్హుడు. అట్టి ఆదర్శమును నిరంతరము మనము ఎదుట నుంచుకొనవలయును. మన ఖడ్గముల నన్నింటిని పూడ్చిపెట్టుదముగాక! ఎల్ల దిశలను ఇట్టి మహాప్రేమవాహినులను ప్రవహింప జేయుదము గాక!

తమ ఇష్టమువచ్చినటుల భారతదేశ పునరుద్ధరణమును గుఱించి ప్రసంగములు చేయువారిని అట్లే చేయనిండు. ఈ విషయమై యావజ్జీవమును పాటుపడుచున్నట్టి, కనీసము పాటుపడ ప్రయత్నించుచున్నట్టి నేను, మీకు చెప్పునదేమనగా. మీరు ఆత్మపరాయణులగువఱకు భారతదేశమునకు పునరుద్ధరణము లేదు. అంతియే గాదు, సర్వప్రపంచ కల్యాణము సైతము దానిమీదనే ఆధారపడియున్నది. ఏలయనగా నేడు పాశ్చాత్య నాగరికత యొక్క పునాదులు సైతము అట్టడుగు వఱకు కదలియున్నవని నేను మీకు దాపరికము లేక చెప్పుచున్నాను. జడవాద మనెడు ఔడియిసుక పునాదులమీద కట్టబడిన మహాభవనములు ఏదో యొక దినమున భగ్నములై నేలకూలి నాశము కాక తీరదు. ప్రపంచచరిత్రయే యిందుకు సాక్షి. జాతి తర్వాత జాతిగా లేచి నరుడనగా జడమయరాశియే యని ప్రకటించుచు తన ప్రభావము నంతను జడవాదము మీద నిలుపుచు వచ్చినవి. చూడుడు, పాశ్చాత్య భాషలో నరుడు ఆత్మను విడిచెనందురు. మనభాషలో నరుడు దేహమును విడిచెనందుము. పాశ్చాత్యుడు మొదటగా తానొక శరీరమై పిమ్మట ఆత్మను పొందుచున్నాడు. మనలో నరుడు ఒక జీవుడు లేక ఆత్మయై తానొక శరీరము పడయుచున్నాడు. ఇక్కడనే ప్రపంచమంత విభేదము చూపట్టుచున్నది.

కాబట్టి భౌతికసౌఖ్యము మొదలగు ఇసుక పునాదుల ఆధారముపై నిర్మింపబడిన నాగరికతలన్నియు స్వల్పకాలము జీవించి, ఒకదాని తర్వాత ఒకటిగా ప్రపంచరంగమునుండి అదృశ్యమై పోయినవి. కాని భారతమాతృపాదముల చెంత నిలిచి భారతీయ నాగరికతను అభ్యసించిన జపాను, చైనావంటి ఇతరజాతులు ఈనాటివఱకు సజీవములై యున్నవి. మఱియు వానియందు పునరుద్ధరణ సూచనలు సైతము గోచరించుచున్నవి. వారి జీవములు ''ఫీనిక్సు'' పక్షి జీవమువలె వేయిసార్లు నాశము చేయబడినప్పటి కిని మరల మరల అతిశయ వైభవముతో పునర్భవమగుటకు సంసిద్ధముగా నుండును. కాని జడమయనాగరికత ఒకతడవ నేలకూల్పబడినపిదప మరల నెన్నడును తలయెత్తజాలదు. ఆ భవనము ఒక్కసారి కూలెనా ఇక నెన్నటికిని పనికిరాకుండ ముక్కలు ముక్కలై పోవును. కాబట్టి ఓపికతో వేచియుండుడు. మనకు భావిభాగ్యోదయము కానున్నది.

తొందర పడబోకుడు. ఇతరుల నెవరినిగాని అనుకరింప దలపకుడు. మనము నేర్చుకొనవలసిన గొప్ప నీతిపాఠము ఇది యొకటి. అనుకరణము నాగరికత కాదు. నేను ఒక రాజవేషము వేసికొనవచ్చును. అంతమాత్రమున నేను రాజునా? సింగపు చర్మమును కప్పుకొనిన గార్దభము సింహము కాగలదా? అనుకర ణము, పిరికితనముతో కూడిన అనుకరణము, ఎన్నడును వృద్ధి అనిపించుకొనజాలదు. అది నరునియందు చూపట్టు దౌర్భాగ్య పతన సూచనయే! నరుడు తన్ను తాను ద్వేషించుకొనుట ప్రారంభించెనా వానికి తుట్టతుది దెబ్బ తగిలినట్లే! తన పూర్వు లను గూర్చి లజ్జించుట ఆరంభించెనా అంత్యకాలము మూడినట్లే! ఇదిగో హిందూజాతిలో నిమ్నసోపానముమీదివారిలో నొకడనై నేనున్నాను. అయినను నాజాతిని గుఱించి నేను గర్వించు చున్నాను. నాపూర్వులను గుఱించి నేను గర్వపడుచున్నాను.

హిందువునని చెప్పుకొనుటకు నేను గర్వించుచున్నాను. మీ సామాన్య సేవకులలో ఒకడ నగుటకును నేను గర్వపడుచున్నాను. నేను మీ తోడిదేశీయుడననియు, మీరు సాధుసంతాన మనియు, మనము ఈ ప్రపంచములో తేజరిల్లిన మహామహిమాఢ్యులగు ఋషుల వంశము వారమనియు, నేనెంతయు గర్వమును పొందుచున్నాను. కాబట్టి మీరును ఆత్మవిశ్వాసము పూనుడు. మీ పూర్వులను గుఱించి గర్వపడుడు. వారినిగూర్చి ఎన్నడును సిగ్గు పడబోకుడు, ఇతరులను అనుకరింపకుడు, నామాట వినుడు; ఎన్నడుగాని ఇతరులను అనుకరింపబోకుడు. మీరు ఇతరులను అనుకరించి వారి చేతిక్రిందికి పోవునప్పుడెల్ల మీ స్వాతంత్ర్యమును కోల్పోవుచుందురు. పారమార్థిక విషయములందు సైతము ఇతరుల చెప్పుచేతలలో పడి పనిచేయ సాగితిరేని క్రమేణ మీ సంకల్పశక్తిని సైతము పోగొట్టుకొందురు. మీ సొంత అనుభవముల ద్వారమున మీకు గల దానిని ప్రకాశింప జేయుడు. ఇతరులను అనుకరింపకుడు. అయినను ఇతరులనుండి శుభంకరమగు దానిని తప్పక స్వీకరింపుడు. మనము ఇతరులనుండి కూడ నేర్చుకొనవలసి యున్నది. బీజమును భూమిలో నాటుడు. దాని పోషణకు కావలసిన ఎఱువును, గాలిని, నీటిని దాని కొసగుడు. ఆ బీజము పెరిగి మొక్కయై మహావృక్షమై, ప్రకాశించునప్పుడు అది మట్టి యగునా? గాలి యగునా? లేక నీరగునా? అది తన కొసగబడిన సర్వమును జీర్ణము చేసికొని తన స్వభావము ననుసరించియే మొక్కయై మహావృక్ష మగుచున్నది. మీ స్థితియు అట్లే ఉండవలయును. ఇతరులనుండి మీరు నేర్వవలసిన విషయములు నిజముగా అనేకములున్నవి. క్రొత్తదానిని నేర్చుకొనన నిరాకరించువాడు ఇదివఱకే ప్రాణముపోయిన శవముతో సమానుడు.

"ఆదదీత పరాం విద్యాం ప్రయత్నాదవరాదపి।
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి॥

ఒక స్త్రీరత్నము నీచకులమందు పుట్టినదైనను భార్యగా స్వీకరింపుము. నీచజాతి పురుషునికైనను శుశ్రూష చేసి పరా విద్యను నేర్చుకొనుము. చండాలునికైనను సేవచేసి ముక్తికి త్రోవను తెలిసికొనుము'' అని మనువు బోధించుచున్నాడు. ఇతరులనుండి మంచిని సర్వమును నేర్చుకొనుము; నీలోనికి తీసికొనుము; నీకు స్వాభావికమగు మార్గమున దానిని జీర్ణము చేసికొనుము. అంతియే గాని పరుల వేషముమాత్రము వేయకుము. ఈ భారతీయ జీవితమార్గమునుండి తొలగిపోకుము. భారతీయులందఱును వేఱొక జాతివారివలె ఉడుపులు ధరించుట, తిండి తినుట, ప్రవర్తించుట మున్నగునవి ఆరంభించుటవలన భారతదేశమునకు మేలుకలుగునని ఒక్క త్రుటికాలమైనను అపోహ పడకుము. కొన్ని సంవత్సరములపాటు అలవాటైన ఒక అభ్యాసమును వదలివేయుటలోనే ఎన్ని ఇబ్బందులు కలవో నీకు తెలియును. ఈ భారతీయత నీ రక్తములో ఎన్ని వేల సంవత్సరములు జీర్ణమై యుండెనో దైవమునకే ఎఱుక. ఈ జాతీయవిశిష్టజీవన ప్రవాహము ఒక తెన్నున ప్రవహించుచున్నది. అది అతుల ఎన్ని వేలఏండ్లుగా ప్రవహించుచున్నదో భగవంతుడే ఎఱుగును. దాదాపుగా మహాసముద్రమున కలియనున్న ఈ మహాప్రవాహము ఆ హిమవత్పర్వతములమీది మంచుగడ్డలలోనికి మరలి పోగలదను నమ్మకము నిజముగా నీకున్నదా? అది అసంభవము. అటువంటి ప్రయత్నము దానిని ధ్వంసముచేయును. కాబట్టి ఈ జాతియొక్క జీవనస్రవంతియొక్క త్రోవను సరిచేయుము. ఈ మహానదియొక్క గమనమును అడ్డగించు గుట్టలను తొలగింపుము; మార్గమును శుభ్రపఱుపుము; కాలువను హాటము చేయుము. అప్పుడది సహజ బలముతోనే వడివడిగా వెల్లువయై ప్రవహించును. అప్పుడు ఈజాతి పరుగులిడుచు పురోగమనము సాగించును.

భారతదేశములో ఆధ్యాత్మిక ప్రచారమునకు మార్గములు ఇవి యని సూచించుచు మనవిచేయుచున్నాను. ఇంకను ఇతర సమస్యలు చాలకలవు. వ్యవధి లేకపోవుటచేత ఈ సందర్భమున వానినన్నిటిని మీకు తెలుపజాలను. ఉదాహరణకు చిత్రమగు మనవర్ణవిభేదసమస్యను చూడుడు. ఈ సమస్యను గుఱించియు, దీని సాధకబాధకముల గుఱించియు నా యావజ్జీవము పరిశీలించుచున్నాను. భారతదేశములో దాదాపుగా అన్ని ప్రాంతములందును దాని స్థితిని విచారించితిని. ఈ దేశములో దాదాపుగా ప్రతిభాగమందును, అన్ని కులముల వారితోడను నేను కలిసి తిరిగియున్నాను. దీని ప్రాధాన్యము ఎందున్నదో తెలిసికొనుటకై నా మనస్సులో చాల తికమకలు పడితిని. దీనిని గుఱించి పరిశీలన చేసినకొలదిని నా అబ్బురపాటు హెచ్చుగుచువచ్చినది. తుదకిప్పుడు దాని తేజముయొక్క ఒక చిన్న తళుకును మాత్రము చూడగలిగితిని. ఇప్పుడిప్పుడే దాని అర్థమును అనుభవముచేసికొన ప్రారంభించితిని. దీని తర్వాత కలిసి తినుట త్రాగుటను గుఱించిన ఇంకొక మహాసమస్య కలదు. ఆ మహాసమస్య మనము సామాన్యముగా తలచునటుల అంత వ్యర్థవిషయము కాదు. అన్నపానములను గుఱించి మనమిప్పుడు పెట్టుకొనిన పట్టుదలలు బహువిచిత్రముగను, మన శాస్త్రవిధులకు కేవలము వ్యతిరేకముగను నున్నవి. మనము తిను ఆహారముయొక్కయు, త్రాగెడు పానీయముయొక్కయు పారిశుద్ధ్యమునందు అశ్రద్ధ చేయుటవలన అనర్థముల పాలగుదుము. దాని యథార్థభావమును మనము కోల్పోయినాము.

నేను మీకు తెలుపదలచిన ఇతరప్రశ్నలు చాలకలవు. ఈ సమస్యలను పరిష్కరించుటెట్లో, వాని రహస్యములను కనుగొనుటెట్లో తెలుపవలెనని యున్నది; కాని చాల కాలవ్యవధి అగువఱకును ఈ సభ సక్రమ స్థితికి రాలేకపోయినది. ఇప్పు

డింకను మిమ్ము చాలకాలము ఇచ్చట నిలుపుట నా అభిమతము కాదు. కాబట్టి వర్ణవ్యవస్థ మున్నగు విషయముల గుఱించి ప్రసంగించుటకు ఇంకొక అవకాశము కలుగు వఱకును నా భావములను అట్లే యుంచెదను.

ఇంకొక మాట తెలిపి ఈ ఆధ్యాత్మిక భావములను గుఱించి మాటలాడుట విరమింతును. చాలకాలమునుండి భారతదేశములో మతము స్తబ్ధమై యున్నది. దాని నిప్పుడు క్రియాశక్తితో పూరింపవలయును. ప్రతివాని జీవితములోనికిని దానిని చొప్పించుట నా అభిమతము. పూర్వపు రీతినే మతము రాజుల మహాసౌధములందును దరిద్ర కృషీవలుల గుడిసెలందునుగూడ బ్రవేశింపవలసియున్నది. ఈజాతియొక్క సామాన్య పిత్రార్జిత సంపదయు సార్వజనీన జన్మస్వామ్యమును అగు మతమును ప్రతివాని గడప కడకును ధారాళముగా తీసికొని రావలసి యున్నది. దేవుడిచ్చిన గాలివలె అంత ధారాళముగను, అంత సులభసాధ్యముగను మన దేశములో మతము సర్వత్ర నిండియుండవలయును. భారతదేశములో మనము నిర్వహింపవలసినది ఇటువంటి పనియే; కాని చిన్ని చిన్ని శాఖాసంప్రదాయములను బయలుదేఱదీసి, విభేదములు కల్పించు విషయములను పట్టుకొని ప్రాకులాడుచు పోట్లాడుటవలన ఎన్నడును ఏ లాభము కలుగదు. మనమందఱమును ఏకీభవించు విషయములనే ప్రచారము చేయుదుము గాక. అప్పుడు విభేదములు వానియంతట అవియే నివారణ కాగలవు. నేను భారతప్రజలకు మరల మరల ఇదే చెప్పుచుందును. ఒక గదిలో శతాబ్దముల తఱబడి చీకటి యున్నది. ఆ గదిలోనికి పోయి అబ్బో ఇక్కడ చీకటిగ నున్నది, చీకటిగ నున్నది అని అరచుచుందు మనుకొనుడు. ఆ చీకటి పోవునా? దీపము తీసికొని రండు, తత్‌క్షణము ఆ చీకటి పటాపంచలై పోవును. ప్రజలను సంస్కరించుటకు తగిన కీలక మిదియే. వారికి శ్రేష్ఠతర విషయ

ములను తెలుపుడు. నరుని యోగ్యతయందు విశ్వాసము పూనుడు. నరుడు పతితుడై భ్రష్టుడైపోయెనను నమ్మకము నాధారము చేసికొని మన కృషిని ప్రారంభింపనేల? ఏ సందర్భమునను, ఎంత నికృష్టుడుగా నున్నను, మానవునియందు విశ్వాసమునుంచి నే నెన్నడును భంగపడలేదు. నేను నరునందు విశ్వాసము ఉంచిన సందర్భమునందెల్ల ఫలితము మొదట ప్రోత్సాహకరముగా కనపడకున్నను, చివరకు జయప్రదముగానే ఉండెడిది. ఒకడు గొప్ప విద్వాంసుడుగ కనపడినను మిక్కిలి పామరుడుగ కనపడినను, దేవదూతగా కాన్పించినను లేక రాక్షసాధముడుగ కాన్పించినను, వానియందు అచంచలమగు విశ్వాస ముంచుము. మొట్టమొదట మానవునియందు విశ్వాస ముంచుము. అటుల విశ్వాస ముంచిన పిమ్మట వానిలో దోషములు కాన్పించిన యెడల, అతడు నేరములు చేసిన యెడల, అతడు అత్యంతము మూఢములు, దుష్టములును అగు ధర్మములను అవలంబించిన యెడల, అవి అట్లు తటస్థించుట నిజముగా వాని స్వభావమునుబట్టి కాదనియు, శ్రేష్ఠతరాదర్శములు కొఱవడి యుండుటను బట్టియే యనియు నమ్ముము. ఒకడు అసత్యమార్గమున పోయెనేని దానికి కారణము అతడు సత్యమును తెలిసికొనలేక పోవుటే! కాబట్టి దబ్బరయగు దానిని సవరించు మార్గము సత్యమగు దానిని వానికి తెలుపుటయే! అట్లుచేసి వానిని విచక్షణ చేసికొననిమ్ము. నీవు వానికి సత్యమును తెల్పుము; అంతట నీ పని తీరినట్లే. అతడు దీనిని అదివఱకు తనలోనున్న దానితో తన మనస్సులోనే సరిపోల్చి చూచుకొననిమ్ము. నామాట నమ్ముము, నీవు వానికి యథార్థముగా సత్యమునే ఒసగితివేని అసత్యము పారిపోయి తీరును. వెలుగు చీకటిని తరిమివేయుతీరున సత్యము అసత్యమును పాఱద్రోలి ధర్మమును వెలికి తీసికొనివచ్చును. దేశమును ఆధ్యాత్మికముగా నీవు సంస్కరింప దలచితివేని ఇదియే మార్గము, పోట్లాటకాదు! ప్రజలతో

వారు చేయునది దోషమని చెప్పుటయు కాదు! ఇది ఒకటియే మార్గము. వారి యెదుట ధర్మము నుంచుము. ఎంత ఆతుర తతో వారు దానిని స్వీకరింతురో చూడుము. ఎన్నడును నాశము చెందక నరునందు సదా వసించుచుండు దివ్యాత్మ మేల్కొని పైకివచ్చి ధర్మముగునట్టి సర్వమును, తేజోవంతమైన సమస్తమును, స్వీకరించుటకు ఎటుల చేతుల చాచునో మీరు స్పష్టముగా కను గొన గలుగుదురు.

సృష్టికర్తయు, రక్షకుడును, మన జాతిపోషకుడును, మన పూర్వుల దైవమును అగు నతడు విష్ణువో, శివుడో, శక్తియో, లేక గణపతియో, వానిని ఏపేరున పిలిచినను, వానిని సగుణరూపముగ పూజించినను లేక నిర్గుణరూపముగ ఉపాసించినను, వానిని సాకా రునిగ అర్చించినను లేక నిరాకారునిగ భావించినను, మన పూర్వులు ఎవనిని ప్రత్యక్షము చేసికొని "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" (ఉన్న బ్రహ్మము ఒక్కడే. విప్రులు వానిని పెక్కు పేరులుపెట్టి పిలిచిరి) అనుచు అభివర్ణించిరో, ఆభగవంతుడు తన దివ్యప్రేమతో మనలను ఆవహించుగాక! ఆయన తన ఆశీ ర్వాదములను మనపైని వర్షించుగాక! మనము పరస్పరము ఒకరి భావము నొకరు గ్రహించునటుల చేయునుగాక! మనము ఒకరి యెడల నొకరు సత్యమగు ప్రేమతో, సత్యము నెడ గాఢతరాభి మానముతో పనిచేయునటుల చేయుగాక! స్వఖ్యాతికొఱకుగాని, స్వప్రతిష్ఠకొఱకుగాని, స్వలాభముకొఱకుగాని, అత్యల్పపు కోరిక యేనియు భారతదేశముయొక్క ఆధ్యాత్మిక పునరుద్ధారణ మహో ద్యమమునందు చొఱబడ కుండుగాక!



# భక్తి

(1897 సం॥రం నవంబరు 9 తేదీ లాహోరులో ఒసగబడిన ఉపన్యాసము.)

గురుగంభీర శబ్దములతో వడివడిగ ప్రవహించు ఉపనిష ద్వాహినినుండి ఒక ప్రతిధ్వని దూరమునుండి వచ్చుచున్నదో యనునట్లు వినబడుచున్నది. ఒక్కొకప్పుడది చాల అధికమై, సాంద్రమై విజృంభించుచున్నది. వేదాంతవాఙ్మయ మందంతటను దాని ధ్వని విస్పష్టముగ నున్నను అంత శక్తిమంతముగ మాత్రము లేదు. ఉపనిషత్తుల ప్రధానధర్మము పరతత్త్వభావమును, స్వరూపమును మనకు ప్రత్యక్షము చేయుటయే యని తోచుచున్నది. ఐనను ఈ అద్భుతగాంభీర్యమునకు వెనుక అక్కడక్కడ కావ్య చమత్కృతి గోచరించును. దీనిని చదివిచూడుడు: ''న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నే మా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః'' (అచ్చట సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు ప్రకాశింపడు. నక్షత్రములు ప్రకాశింపవు. ఇక అగ్నిని గురించి చెప్పనది ఏమి?) ఇట్టి మనోహరకవిత్వమును వినునప్పుడు ఇంద్రియ గోచర మగు ప్రపంచమునుండియే గాక బుద్ధిగోచరమగు ప్రపంచమునుండి సైతము ఎగిరిపోయి ఊహించుటకు వీలుకానిదియు, అయినను సదా మనలను ఆవరించియుండునదియు అగు వేఱొక ప్రపంచమునకు చేరుచుందుము. ఈ గాంభీర్యమున కంతకును వెనుక వేఱొక ఆదర్శము దాని ఛాయవలె అంటివచ్చుచున్నది. అది మానవజీవితముయొక్క ప్రత్యంశమునందును ప్రవేశించుచున్నది. రాను రాను విశాలమై మహాకారమును తాల్చుచున్నది. అది పూర్ణమును, విస్పష్టమును అగు భాషలో పురాణములందు వివరింపబడినది. అదియే భక్త్యాదర్శము. భక్తి బీజములు ఇదివఱకే యున్నవి. ఆ బీజములు సంహితయందు సైతము కలవు. ఉప

నిషత్తులందు ఆ బీజములు కొంత పరిణామమును పొందినవి. పురాణములయందు వివరములతో నిరూపింపబడినవి.

భక్తిని అర్థముచేసికొనుటకు మనపురాణముల భావమును గ్రహింపవలయును. పురాణములు యథార్థమగునా కాదా యను గొప్ప వివాదము ఇటీవల బయలుదేరినది. సందిగ్ధార్థములు గల అనేక వాక్యములను తీసికొని పెక్కురు విమర్శింప సాగిరి. చాల చోట్ల ఆవాక్యములు ఆధునికశాస్త్రపరిశోధనకు ఆగజాలవని నిరూపింపబడినవి. ఈ వివాదములు ఎట్లున్నను, పురాణవాక్యములు శాస్త్రరీత్యా సమర్థింప దగినవా కావా అను విషయమెట్లున్నను, వానియందలి భూగోళవర్ణన అంగీకరింప దగినదా తగనిదా అను విచారణ ఎట్లున్నను, వానియందలి ఖగోళవివరణము మొదలగునవి నమ్మదగినవా తగనివా అను ప్రశ్న ఎట్లున్నను, ఈ పురాణసంపుటములలో ప్రతిదానియందును కొంచెము కొంచెముగా భక్తి సిద్ధాంతపు జాడలుమాత్రము విస్పష్టముగా గోచరించును. ఈ భక్తిసిద్ధాంతమే ఋషుల జీవితములందును రాజుల జీవితములందును సాదృశ్యములతో దృష్టాంతములతో వివరింపబడి, మఱల మఱల సవ్యాఖ్యానముగా ప్రవచించబడి మఱల మఱల పునరావృత్తి చేయబడుచు వచ్చినది. మహామనోహరమగు భక్త్యాదర్శమునకు సాదృశ్యమును చూపుటయే పురాణముల యొక్క ఉద్దేశముగా కనబడుచున్నది. ఈ ఆదర్శము, నేను చెప్పినటుల, సామాన్య మానవునకు చాల హితవుగా నుండును. వేదాంత జ్యోతియొక్క పూర్ణప్రకాశములోని గాంభీర్యమును, అర్థము చేసికొనగలవారును, ఆమోదింపగలవారును, చాల కొలది మందియే యుందురు. ఇక ఆ గాంభీర్యమునందు మెలగుచు దానిని అనువర్తించి జీవింపగలవారు ఇంకను స్వల్పముగ నుందురు. ఏల యనగా శుద్ధవేదాంతి అడుగు పెట్టవలసిన మొట్టమొదటి మెట్టే "అభయః" (జంకులేకుండుట) అనునది. నరుడు తాను వేదాంతిని

'అనుకొన సాహసించుటకు పూర్వము సమస్త దౌర్బల్యములును రూపుమాసి పోవలయును. అది ఎంత కష్టమో మన మెఱుగుదుము కదా! ప్రపంచముతో సకల సంబంధములను త్యజించినవారు సైతము, తమ్ము పిఱికివారినిగా చేయు సంగములేవియు లేనివారు సైతము, ఒక్కొక క్షణమున తామెంత దుర్బలులగుచుందురో, ఒక్కొక్కప్పుడు ఎంతగా మెత్తబడి పోదురో, ఎంతగా జంకుపడి పోదురో, వారి హృదయాంతరాళమున వారికే తెలియును. ఇక అనేకబంధములు కలిగి అసంఖ్యాకములగు బాహిర విషయముల కును, ఆంతర విషయములకును దాసులై వర్తింపవలసిన వారును, జీవితమున అనుక్షణమును దాస్యములో దిగబడి పోవుచున్న వారును ఎంత ఎక్కువ జంకవలయునో గదా! అట్టి వారికి పురాణములు అత్యంతరమణీయమగు భక్తి సందేశమును తెచ్చి అందించు చున్నవి.

అట్టి వారికి మృదుకవిత్వమును ఉపశాంతికరముగా ప్రసాదించుచున్నవి. ధ్రువుడు, ప్రహ్లాదుడు మున్నగు వేలకొలది సాధు సత్తముల అద్భుతవిచిత్ర కథలను అవి చెప్పుచున్నవి. ఈ ఉదాహరణలు ఆ భక్తిసందేశమును ఆచరణయోగ్యముగా జేయును. శాస్త్రదృష్టిలో పురాణములు నిరుపద్దములని మీరు నమ్మినను నమ్మకపోయినను ప్రహ్లాదుడు, ధ్రువుడు మున్నగు పౌరాణికసాధు సత్తముల కథల ప్రభావమువలన పరివర్తనము చెందనివారు మీలో ఒక్కరును నుండరు. మన తరమువారిపై కూడ పురాణముల మహిమ పర్వియున్నదని మన మంగీకరింపవలయును. ఇటీవల భ్రష్టమైన బౌద్ధమతసిద్ధాంతము మనకు నేర్పినదానికంటె, విశాలతరమై ప్రజాసామాన్యమునకు ఉపకరించెడి మతమును మనకు ప్రసాదించినందులకు ఈ పురాణములయెడ మనము కృతజ్ఞులమై ఉండవలయును. సులభమును కోమలమును నగు ఈ భక్తి భావము ఎట్లు ప్రేమగా పరిణమించునో పురాణములు వివరించు

చున్నవి. అనుదినము ప్రత్యక్షజీవితమున మనము దానిని అనుష్ఠింప వలయును. నిజమునకు భక్తి ప్రేమయొక్క సారమే! సగుణమును, జడమును అగు ప్రేమ ఉన్నంతకాలము పురాణబోధలను దాటి ఎవడును పోజాలడు. ఇంకొకరిని అండచేసికొని నిలుచునట్టి దౌర్బల్యము మానవస్వభావమునం దున్నంతవఱకు ఈ పురాణములు ఏదో ఒకరూపమున ఉండి తీఱవలసినదే. నీవు వానిపేర్లను మార్చ వచ్చును. ఇదివఱకు ఉన్నవానిని నిరసింపవచ్చును. కాని అట్లు నిరసించిన తత్‌క్షణమే ఇంకొక పురాణము వ్రాయవలసిన అవసర మేర్పడును. ఈ ప్రాత పురాణములు అవసరము లేదను మహాను భావుడొకడు మనలో ఉద్భవించినయెడల ఆయన మరణించిన ఇరువది సంవత్సరములలోపలనే ఆయన శిష్యులు ఆయన జీవిత మును ఆధారము చేసికొని ఇంకొక పురాణము వ్రాసితీఱుదురు. ఇదియే భేదము.

మనుజుని స్వభావము ననుసరించి అది అవసరమే. సమస్త దోషములను, మాయాబంధములను, చివరకు ప్రకృతిసిద్ధములగు అవసరములను సైతము అతిక్రమించి, ధైర్యసాహసోపేతులై, సర్వవిజేతలై, పరమహంసలుగా మాఱిన 'సాక్షాద్దేవత'లకు మాత్రము పురాణముతో పనిలేదు. సామాన్యమానవుడు పూజ సలుపుటకు సగుణదైవతము లేనిదే సాగదు. ఒకవేళ సృష్టిలోని దేవతలను పూజింపడేని భార్యరూపముననో, బిడ్డరూపముననో, తండ్రిరూపముననో, మిత్రునిరూపముననో, గురునిరూపముననో, ఏదేని మఱొకరూపముననో మఱియొక దేవతను కల్పించుకొని పూజింప వలసినదే. పురుషులకంటె స్త్రీల విషయమున ఈ అవ సరము హెచ్చుగానున్నది. ప్రకాశరేఖ సర్వత్ర ఉండవచ్చును. అది చీకటిస్థలములందు గూడ నున్నది. పిల్లులు మొదలగు జంతు వులు చీకటిలో ఆ తేజస్సును చూడగలుగుచున్నవి గదా! కాని మనక్షేత్రమున మన కనుకూలమగు స్థితియందున్నప్పుడే ఆ ప్రకా

శము మనకు కనబడును. నిర్గుణబ్రహ్మము మొదలగు తత్త్వ విషయములను గుఱించి మనము మాటలు చెప్పవచ్చును. కాని సామాన్యమానవులముగా ఉన్నంతకాలము కేవల నరరూపమున మాత్రమే-మనము భగవంతుని చూడగలము. భగవంతుని గుఱించిన మన భావనయు, మన పూజావిధానమును సహజముగా మానవలక్షణముతో కూడియుండును. "ఈ శరీరము సత్యముగా భగవంతుడు వసించు ఉత్తమదేవాలయము." కాబట్టి అన్ని యుగములందును నరులు పూజింపబడుచునే వచ్చిరి! ఇట్టి పూజా పద్ధతిలో కొన్ని ఆడంబరములు సహజముగా వచ్చి చేరుచుండును. వానిని మనము ఖండింపవచ్చును, లేక విమర్శింపవచ్చును. కాని ఇట్టి అత్యాచారము లెన్నియున్నను, అవి ఎంతగా మితిమీరిపోవుచున్నను, ఈ భక్తిసూత్రమునకు సత్యమును, సుస్థిరమును అగు ఒక ఆధారము, ఒక జీవము, కలదనియు అదిమాత్రము నిర్దుష్టముగనే యున్నదనియు సూక్ష్మముగా పరిశీలించినచో స్పష్టపడును. ఎట్టి ప్రాచీనకథలనైనను సరియే, శాస్త్రవిరుద్ధములగు ఏ వెఱ్ఱి విషయములైనను సరియే, గుణదోషవిమర్శ చేయకుండ ఊరక దిగమ్రింగుడని నేను మిమ్ము కోరుటలేదు. దురదృష్టవశమున కొన్ని పురాణములలోనికి నానావిధములగు వామాచార సమర్థనములును ఎగబ్రాకినవి. వాని నన్నిటిని నమ్ముడని నేను మీకు బోధించుటలేదు. కాని మనము పోగొట్టుకొనదగని సారభూత విషయమొకటి కలదనియు, ఈ పురాణములు నిలిచియుండుటకు తగినంత కారణము కలదనియు నా అభిప్రాయము. అత్యున్నతములగు తత్త్వసిద్ధాంతములను సామాన్యమానవుల అనుదిన జీవితములలోనికి తెచ్చుటకును, మతమును అనుష్ఠానమునకు అనుకూలపఱచుటకును ఏర్పడిన భక్తిబోధ పురాణములందే కలదని నా నిశ్చితాభిప్రాయము.

తర్వాత భక్తిసాధనయందు జడవస్తువుల వినియోగమును సమర్థించుచు శ్రీవారు ఇటుల చెప్పదొడగిరి. నరుడు తానున్న

చోట నిలిచిపోక భగవదనుగ్రహమువలన సాగిపోయినయెడల బాగుగనే యుండెడిది. అయినను ఉన్నవిషయములు లేవనుకొని తగవులాడుట వ్యర్థము. ఇప్పుడు నరుడు భౌతికజీవిగా నున్నాడు. అతడు ఆధ్యాత్మికతత్త్వమునుగుఱించి ఎంతగా మాటలు చెప్పినను, భౌతికజీవిగా నున్నాడనుట తప్పదు. కాబట్టి ఈ భౌతికనరుని చేపట్టి అతనిని ఆధ్యాత్మికజీవిగా చేయుటకై క్రమక్రమముగా పైకి తీసికొని పోవలయును. ఈ దినములలో నూటికి తొంబది తొమ్మిదిమందికి ఆధ్యాత్మికమనిననే అర్థమగుట లేదు. దానిని గుఱించి బోధింపగలుగుశక్తి ఇంకను తక్కువ. మనలను ముందుకు త్రోసికొని పోవు క్రియాశక్తులును, మనము కోరుకొను ఫలితములును అన్నియు భౌతికములే. హెర్బర్ట్ స్పెన్సరు మహాశయుడు చెప్పినటుల, అత్యల్ప ప్రతిరోధముగల మార్గమునందు మాత్రమే మనము పని చేయగలము. మన పురాణములు అత్యల్ప ప్రతిరోధము గల మార్గమునే చూపుచున్నవి. ఈ పురాణములవలన లభించిన ఫలితములు అద్భుతములును, అనన్య సామాన్యములునునై యున్నవి. భక్త్యాదర్శము యథార్థమునకు ఆధ్యాత్మికమైనది. కాని దానిని ప్రాపించు మార్గము జడవస్తు మార్గమున నడచుచున్నది. మనకు వేఱు గత్యంతరములేదు. కాబట్టి ఈ భౌతికప్రపంచమున ఆధ్యాత్మికతత్త్వమును సాధించుటకు అనుకూలించు ప్రతిదానిని చేపట్టవలయును. నరుడు ఆధ్యాత్మికజీవిగా పరిణామము పొందుటకై ప్రతిదానిని వినియోగించుకొనవలయును. (ఈ సందర్భమున శ్రీ స్వాములవారు కులభేదముగాని మతభేదముగాని లింగభేదము గాని పాటింపక, ప్రతివ్యక్తికిని వేదములను చదువు అధికారమును శాస్త్రములు ప్రాథమికధర్మముగా అంగీకరించెనని వివరించిన మీదట వారిట్లు నొక్కిచెప్పిరి.) భగవంతునియెడల భక్తిసాధన చేసికొనుటకు జడవస్తు మయమగు దేవాలయము నరునకు ఎక్కువగా ఉపయోగపడునెడల అటులే జరుగుగాక! ఒక విగ్రహమును నిర్మించుకొనుట భక్త్యాదర్శమును చేరుటలో మానవునికి సాహాయ్య

పడునెడల భగవంతుడు వానిని దీవించి వానికి ఇష్టమగునేని అట్టి విగ్రహములను ఇంకను ఇరువదింటిని ప్రసాదించునుగాక! పారమార్థిక గమ్యమును ప్రాపించుటలో ఏదైనను నరునికి సాయపడునెడల అది నీతిమార్గమునకు అడ్డు రానంతవఱకు దానికి స్వాగతమే! కాని అవినీతికరమగునది ఏదియు తోడ్పడజాలదు; పైగా వెనుకకు కూడ లాగిపట్టును. (ఈ సందర్భమున, భారతదేశములో విగ్రహములను పూజార్థము వినియోగించుటలో కలిగిన ఆక్షేపణ కొంతవఱకైనను కబీరుని వలన సంభవించెనని తెలిపిరి.) సగుణదైవము గలడను విశ్వాసములేని గొప్ప తత్త్వవేత్తలును, మతకర్తలును భారతదేశమున ఉండెడివారు. వారు తమమతమును ధైర్యముగా ప్రజలకు బోధించిరి. అయినను విగ్రహముల ఉపయోగమును వారు ఖండింపలేదు. వారు విగ్రహపూజ భగవత్పూజయందు అత్యుత్తమవిధానము కాదని మాత్రము పల్కిరి. అది అత్యుత్తమవిధానమని వక్కాణించు పురాణము ఒక్కటైనను లేదు. (యూదులు తమ యెహోవా ఒక మందసములో నివసించునను విశ్వాసముతో విగ్రహ పూజను చేసిరని చారిత్రక నిదర్శనములను చూపి, ఇతరులు చెడ్డదన్నంతమాత్రమున విగ్రహారాధనమును దూషించు అభ్యాసమును శ్రీవారు ఖండించిరి. ఆపిదప ఇట్లు చెప్పసాగిరి.) విగ్రహము గాని మఱే భౌతిక రూపముగాని నరుని ఆధ్యాత్మికపరాయణునిగా చేయుటకు ఉపకరించినను విగ్రహార్చనము జడ పదార్థద్వారమున చేయబడుపూజ కనుక అధమాధమము అని మన మతగ్రంథములన్నియు స్పష్టముగా వక్కాణించుచున్నవి. (హిందూదేశము నందంతటను బలాత్కారముగ విగ్రహారాధనను ప్రతివానిచేతను చేయింప వలయునను పట్టుదలను శ్రీస్వాములవారు పూర్తిగ ఖండించిరి.) దేనిని పూజింపవలయునో దేనిద్వారమున పూజింపవలయునో, నిర్ణయించి శాసించుటకు ఎవనికేమి పట్టినది? ఎవరెట్లు పురోగమనము సాగింప వలసియుండునో, వారివారి ఆధ్యాత్మిక వికాసము విగ్రహమును పూజిం

చుటచేత సాధ్యమగునో అగ్నిని ఆరాధించుటచేత సాధ్యమగునో లేక స్తంభమును అర్చించుటవలన సాధ్యమగునో వారికే తెలియునుగాని ఇతరులకెట్లు తెలియును? ఆ విషయము సొంతగురువుల వలనను, గురు శిష్య సంబంధమువలనను నిర్ణయమై శాసింపబడవలయును. "ఇష్టము" అను దానిని గురించి భక్తి గ్రంథములు నిర్ణయించిన సూత్రము మిక్కిలి సహేతుకమైనది. ప్రతివాడును తన ప్రత్యేక పూజావిధానమును, భగవంతునిచేరు తన ప్రత్యేక మార్గమును తానే నిర్ణయించుకొనవలయును. అది వాని ఇష్టము. ఆ నిర్ణీతాదర్శము వాని ఇష్ట దేవత అనబడును. అతడు ఇతర పూజా విధానములయెడ సానుభూతితో గౌరవము చూపవలయును. అయినను తనగమ్యమును తాను చేరువఱకును, తన కిక జడమయ సహాయోపకరణములు అవసరములేని దశ సిద్ధించువఱకును తన ప్రత్యేక విధానమునే అనుసరించుచు సాధనను సాగింపవలయును. ఈ సందర్భమున భారతదేశపు కొన్ని ప్రాంతములందు ఆచరణలోనున్న కులగురు పద్ధతిని గురించి కొంచెము హెచ్చరింపవలసియున్నది. ఇది ఒక విధమైన పరంపరాగతమగు గురుత్వము. మన శాస్త్రములు "వేదసారము నెఱిగినవాడును పాపరహితుడు నగు గురువు, స్వర్ణము నపేక్షించిగాని, మఱి దేనిని వాంఛించిగాని శిష్యులకు బోధలు సేయడు. వారికరుణ నిర్హేతుకము. తరులతానికుంజముల నుండి వసంతఋతువు ప్రతిఫలమును కోరదు. పరోపకారము చేయుట దాని స్వభావము. వానిని మరల ఉజ్జీవింపజేసి మొగ్గలను, పూవులను, ఆకులను ప్రసాదించును. అటులే ఆయనయు ప్రతిఫలమాసింపక విద్యాదానము చేయును. వాని జీవితమంతయు పరోపకారార్థమే" అని చెప్పుచున్నవి. అట్టివాడే గురువు కాగలడు. ఇతరులకు అట్టి అర్హత లేదు. ఇంకొక అపాయముకూడ నున్నది. గురువనగా కేవలము బోధకుడు కాడు. బోధకత్వము బహు స్వల్పాంశము. హిందువుల విశ్వాసము ప్రకారము గురువు తన శిష్యులకు ఆధ్యాత్మిక తేజస్సును దానముచేయును. కాబట్టి సద్గురు

ప్రసాదరక్షణలేనియెడల దష్టత్వమునకును, కీడునకును లోనై నరుడు హాని పొందవచ్చును. అందుచే దుష్టగురువువలన ఉపదేశము పొందినవాడు దుష్టత్వమును నేర్చుకొనుట యను అపాయముపాలు కావచ్చును. కాబట్టి ఈ కులగురుసిద్ధాంతమును భారతదేశము నుండి బహిష్కరించుట అత్యంతావశ్యకము. గురుత్వము ఒక వృత్తిగా ఏర్పడ కూడదు. అట్టిది తుదముట్టవలయును. అది శాస్త్రవిరుద్ధమైన పద్ధతి. గురుశబ్దవాచ్యుడెవడును ఈ కులగురు పద్ధతిని అనుసరించి, ప్రస్తుత దుఃస్థితికి సాయపడ రాదు.

———శ్రీవారు ఆహారసమస్యను గురించి మాట్లాడుచు, తిండి విషయములో ఈనాడు పట్టుదలతో అనుసరించుచున్న ఆచారములు చాలవఱకు పైపై మెఱుగులై పోయి, ప్రారంభమున ఎందుకొఱకై ఏర్పడినవో ఆ లక్ష్యమునుండి దూరమై పోయెననిరి. ఎవరు ఆహారమును తాకుటకు అర్హులో అను విషయమును గురించి జాగ్రత తీసికొనవలయునను భావమును విమర్శించిరి. దానియందు తత్త్వసంబంధమగు గొప్ప రహస్యమున్నదనియు సామాన్యులు తమ అనుదిన జీవితమున అట్టి జాగ్రతను తీసికొనుట కష్టమును, అసాధ్యమును, అసంభవమును అనియు చెప్పిరి. ప్రత్యేకము ఒక్క తరగతి వారికే సాధ్యమగు ఆదర్శమును సామాన్యముగా అందఱును ఆచరింపవలయునని పట్టు పట్టుట పొరపాటని తెలిపిరి. తమ జీవితములను పూర్ణముగా ఆధ్యాత్మిక సాధనలకు వినియోగించు వారికి మాత్రమే అది సాధ్యమగుననియు, మానవులలో అత్యధిక సంఖ్యాకులు భౌతికసుఖములతో ఇంకను తృప్తిపడకున్నారనియు, ఆధ్యాత్మికజీవనమును బలాత్కారముగా వారిపైని పడవేయ జూచుట వ్యర్థమనియు పలికిరి.

భక్తునికి నిర్ణయింప బడిన శ్రేష్ఠతమపూజ మానవపూజయే. సత్యముగా ఏదేని ఒక విధమగు పూజను ఆచరింప దలచినచో తమస్థితి ననుసరించి ఒకనినో ఇద్దఱినో ముగ్గురినో

దరిద్రులను ప్రతిదినము తమ ఇండ్లకు తోడ్కొనివచ్చి వారిని నారాయణులనుగా భావనచేసి సేవింపవలయునని శ్రీవారు సూచించిరి. అనేక దేశములలో దానము చేయుటను నేను చూచితిని. అది ఫలప్రదము కాకుండుటకు కారణము అది సత్సంకల్పముతో జరుగకుండుటయే. "ఇదిగో ఇది తీసికొని వెళ్లిపో" అందురు. అది యోగ్యమగు దానముకాదు. హృదయమున గల గర్వమును, లోకము తమ్ము పొగడవలయునను కాంక్షను, తాము దానశీలురని లోకమెఱుంగుగాక యను కోరికను ఇది వెలువరించుచున్నది. హిందూశాస్త్రముల ప్రకారము దానమును గ్రహించువానికంటె దానమిచ్చువాడు తక్కువ. ఏలయన పుచ్చుకొనువాడు ఆ సమయమున భగవంతుడన్నమాటే! కాబట్టి కొంత మంది దరిద్రనారాయణులను గాని, అంధనారాయణులను గాని, ఆకొన్న నారాయణులనుగాని, ప్రతి గృహమునకును ప్రతిదినమును తీసికొనివచ్చి దేవతావిగ్రహమును పూజించువిధమున వారికి చక్కగ భోజనము పెట్టి బట్టలు కట్టబెట్టుట ఉత్తమమగు పూజ యగును. ప్రతిదినమును ఇటుల చేయుచుండవలయును అని శ్రీవారు చెప్పిరి. వారెట్టి పూజలనుగాని ఖండనచేయలేదు. కాని ఉత్తమ విధమగు పూజ, ఇప్పుడు భారతదేశములో అత్యావసరమగు పూజ, ఇట్టి నారాయణుల ఆరాధనమే యని తమ అభిప్రాయమును తెల్పిరి.

ఉపన్యాసమును ముగించుచు శ్రీ స్వామిజీ భక్తిని ఒక త్రికోణాకృతిగల యంత్రమునకు పోల్చిరి. ఒకకోణము ఏ కామము నెఱుంగనిభక్తి. రెండవకోణము భయమునెఱుంగనిది, ప్రతిఫలము గాని, మఱేవిధమగు ఉపకారమునుగాని కోరి నెరపు భక్తి యాచకుని మతమో, బేరగాని మతమో అగును. దానిలో యథార్థమగు మతము అతిస్వల్పము. మీరు యాచకులుగా నుండరాదు. ఏలయన యాచన ఒకవిధమగు నాస్తికతయే. "గంగయొడ్డన

కాపురముండు నరుడు త్రాగుటకు జలమును కోరి చిన్న కూపమును త్రవ్వుట వలె'' నుండును. భగవంతుని, భౌతిక విషయముల కొఱకు ప్రార్థన చేయువాడు ఇటువంటివాడే అనవచ్చును. భక్తుడగువాడు సాహసముతో నిలబడి "దేవా నీవలన నే నేమియు కోరుకొనను. కాని నా వలన నీ కేమేని కావలయు నెడల ఇదిగో ఇచ్చుటకు సిద్ధముగనున్నాను'' అనుటకు సంసిద్ధముగ నుండవలయును. ప్రేమ భయము నెఱుంగదు. అబలయై బక్కచిక్కియున్న స్త్రీ మార్గమున పోవుచు కుక్క మొఱిగినమాత్రమున పరుగునబోయి ప్రక్క ఇంటిలోనికి దూరుట చూడలేదా? మఱు నటిదినమున ఆమె అదేత్రోవను పోవుచుండును. ఆమె యొడిలో బిడ్డకలదు. సింహ మొకటి ఆమెపై బడును. అప్పుడామె ఏమి చేయును? ఆహా! తనబిడ్డను రక్షించునిమిత్తము సింహమునోట బడును. ప్రేమకొఱకై పరగు ప్రేమ ఉత్తమోత్తమమైనది. తుదకు భక్తుడీ దశకు వచ్చును. అప్పుడు ప్రేమయే దైవము! ఇతరమేమియు కాదు. దేవుడు కలడని రుజువుచేయుటకు మానవు డక్కడికి పోవలయును? దృశ్యమాన వస్తుజాలములోనికెల్ల మఱింత దృశ్యమానము ప్రేమ. సూర్యుని, చంద్రుని, నక్షత్రములను, ఆకాశమున త్రిప్పుచున్న శక్తి ఆ ప్రేమయే! పురుషులందును, స్త్రీలయందును, పశువులందును ప్రతిప్రదేశమునందలి ప్రతిదానియందును దాని మహిమ ప్రకటితమగుచున్నది. జడశక్తులయందు భూమ్యాకర్షణము మొదలగు రూపములతో అది వ్యక్తమగుచున్నది. అది సర్వత్ర నున్నది. ప్రతి పరమాణువు నందును, ప్రతి ప్రదేశమునందును వ్యక్తమగుచునే యున్నది. ఈ విశ్వమునంతను నడపుశక్తి ఎల్లెడల గోచరించుశక్తి ఆ అఖండ ప్రేమయే! అది సాక్షాత్ పరబ్రహ్మమే!



# వేదాంతము

(1897 సం॥రం నవంబరు 12 వ తేదీన లాహోరునందు ఒసగబడిన యుపన్యాసము.)

మనము జీవించు ప్రపంచములు రెండు కలవు. ఒకటి బాహ్యప్రపంచము, రెండవది అంతరప్రపంచము. రైలు రెండు పట్టాలమీద నడచునట్లు మానవజాతియొక్క అభివృద్ధి ప్రాచీన కాలమునుండియు ఈ రెండు ప్రపంచములలోను జరుగుచున్నది. మొదట బాహ్యమున అన్వేషణము ప్రారంభమైనది. గంభీరములగు సమస్య లన్నింటికిని పరిష్కారము బాహ్యప్రకృతినుండియే పొందవలయునని నరుడు మొదట ప్రయత్నించినాడు. సుందరమును దివ్యమును అగుదానికొఱకు తాను అనుభవించు ఆరాటమును నలునైపుల తన్ను ఆవరించియుండు ప్రకృతివలన సంతృప్తిపఱచుకొనదలంచినాడు. తన స్వస్వరూపమును, తన ఆంతర్యమున గల సమస్తమును, జడ ప్రాపంచికభాషలో ప్రకటింప యత్నించినాడు. అతడు పడసిన ప్రతిఫలము మహోత్కృష్టమైనదనుట సత్యము. భగవంతుని గుఱించియు వాని నర్చించు విధానమును గుఱించియు అత్యద్భుత సిద్ధాంతములును, మిక్కిలి మనోహరములగు సౌందర్యభావములును అతనికి లభించినవి. బాహ్యప్రపంచమునుండి నిజముగా దివ్యమైన భావములే లభించినవి. ఐనను ఆ రెండవదగు ఆభ్యంతరప్రపంచము కొంత ఆలస్యముగా మానవునికి ప్రత్యక్షమై దివ్యతరమును, సుందరతరమును, విశాలతరమును అగు ఒక అనంతవిశ్వమును వాని ఎదుట నిలిపినది. వేదములలోని కర్మకాండభాగము అత్యాశ్చర్యకరములగు ఆధ్యాత్మికభావములను బోధించుచున్నది. సృష్టికర్తయు, పరిపాలకుడును, లయకారకుడును అగు సర్వాధినాయకుని గుఱించిన అద్భుత భావములు మనచిత్తమును కరగించివేయు భాషలో అవి మనకు

ప్రదర్శించుచున్నవి. ఋగ్వేదసంహితలో ప్రళయవర్ణనను తెలుపు ఆ అత్యద్భుత శ్లోకము మీలో అనేకులకు జ్ఞప్తియుండవచ్చును. ఆహా! మరల ఎన్నడేని అంతటి భవ్యమగు శ్లోకము మఱియొకటి రచింపబడెనా అనిపించును. ఇంత చెప్పినకూడ అది బాహ్య గాంభీర్యమును మాత్రమే వర్ణించుచున్నదని మనకు తెలియును. తుదకు అది స్థూలమే; భౌతికతత్త్వము కొంత దానికి అంటుకొనియే యున్నది. అయినను, అది భౌతికపదార్థమునకు సంబంధించిన భాషలో చేయబడిన అఖండతత్త్వముయొక్క వర్ణన! ఆ భాష ఖండవస్తు సాంప్రదాయికమైనది. అది స్థూలశరీరపక్షమున అఖండమేయైనను, మానసికముగా అఖండముకాదు. స్థలభావమున అది అనంతమై తోచినను, సంకల్పమునకు సంబంధించి అనంతము కానేరదు. ఇక రెండవ భాగమగు జ్ఞానకాండయందు అనుసరింపబడిన మార్గము సంపూర్ణముగా ఇందుకు భిన్నముగ నున్నది. మొదటిది విశ్వముయొక్క రహస్యములకొఱకు బాహ్యప్రకృతి యందు జరిగిన అన్వేషణము. అతిగంభీరజీవనసమస్యలకు జడ ప్రపంచమునుండి పరిష్కారమును తెలిసికొనగోరు ప్రయత్నమది. "యస్యైతే హిమవంతో మహిత్వా" (దాని మహిమను హిమాలయములు ప్రకటించుచున్నవి.) అను వర్ణనయందు ఉదాత్తమగు భావమే యున్నది. అయినను భారతీయునికి అది అంత ఉదాత్తమైనదిగా తోచలేదు. కావున భారతీయుని చిత్తము అంతర్ముఖము కావలసివచ్చెను. ఆ అన్వేషణము బాహ్యమునుండి ఆంతర్యమునకును, జడపదార్థమునుండి మనస్సునకును తిరిగి, పూర్తిగా వేఱొక త్రోవ త్రొక్కినది. "నరుడు మరణించుచున్నాడు గదా! వాడేమగుచున్నాడు?" అను విచారణ బయలుదేరినది. "అస్తీత్యేకే నాయమస్తీతి చైకే" (కొందఱు అతడు కలడనుచున్నారు; ఇతరులు అతడు లేకుండ పోయెననుచున్నారు. ఓ యమరాజా! ఇందేది సత్యము?) అనెడు విచారణ సాగినది. పూర్వవిచారణకు పూర్తిగ భిన్నమగు విధానము మనకిక్కడ గోచరించు చున్నది.

బాహ్యప్రపంచమునుండి పొందదగిన దానినంతను భారతీయుని బుద్ధి సంపాదించినది; కాని దానితో తృప్తిపొందలేదు. అది ఇంకను వెదుక నెంచి తన ఆత్మలోనికే మునుంగజూచెను. అప్పుడు తుది పరిష్కారము లభించినది.

వేదములలోని ఈభాగమునకు ఉపనిషత్తులు లేక వేదాంతము లేక ఆరణ్యకములు లేక రహస్యము అని పేరు. ఇచ్చట మతము ఒక్కసారిగా సమస్తమైన బాహ్యప్రమాణములను వదలివేసినది. ఇచ్చట స్థూలపదార్థ సంబంధమగు భాష పూర్తిగా పరిత్యజింపబడి, ఆత్మసంబంధమగు సూక్ష్మాతిసూక్ష్మభాషలో ఆధ్యాత్మికవిషయములు వివరింపబడినవి. ఏ విధమగు స్థూలభావమును ఇంక దానిని అంటి వచ్చుటలేదు. ప్రపంచసంబంధమగు ఏలాటి రాజీప్రయత్నములును అందు లేవు. మానవకోటి దర్శించిన వానిలోనెల్ల అత్యుత్తమములగు సత్యములను సాటిలేని ధైర్యసాహసములతో ప్రకటించిన మహాఋషుల అత్యద్భుత భావనాపటిమ ఉపనిషత్తులందు ప్రకాశించుచున్నది. సోదరులారా! దీనిని మీకు తెలుప గోరుచున్నాను. వేదములయొక్క ఈ జ్ఞానకాండ సైతము మహాసముద్రమువలె నున్నది. దానిలో లవలేశము తెలిసికొనుటకైనను అనేకజన్మలు పట్టును. ఉపనిషత్తులు వేదములకు శిరస్సుగాను భుజములుగాను శిరోభూషణముగాను ప్రకాశించుచున్నవని శ్రీ రామానుజాచార్యులవారు చేసిన వర్ణన సముచితమైనదనుట తథ్యము. ఉపనిషత్తులు నిశ్చయముగా ఆధునిక భారతదేశమునకు బైబిలు వంటివి. హిందువులకు వేదములలోని కర్మకాండ యనిన అత్యంతగౌరవము. అయినను యుగాంతరములనుండి 'శ్రుతి' యనగా ఉపనిషత్తులనియు, ఉపనిషత్తులు మాత్రమే అనియు భావింపబడుచున్నది. మన మహాతత్త్వవేత్తలందఱును —వ్యాసులవారుగాని, పతంజలిమహర్షిగాని, గౌతముడుగాని, చివరకు సమస్త తత్త్వశాస్త్రములకు మూలపురుషుడగు కపిల మునీంద్రుడుగాని—తాము రచించిన గ్రంథములకు ప్రమాణము

లను ఉపనిషత్తులనుండి మాత్రమే కైకొనిరి. ఇంక నెందుండియు వారు ప్రమాణములను గ్రహించియుండలేదు. ఏలయన ఉపనిషత్తు లందు మాత్రమే శాశ్వతముగా నిలిచియుండు సత్యములు కలవు.

కొన్ని సత్యములు ఒకానొక పక్షముననే, ఒకానొక విధానముననే, కొన్ని ప్రత్యేకసందర్భములందే, కొన్ని సమయములందు మాత్రమే సత్యములై యుండును. అవి ఆ యా కాలములందున్న సంప్రదాయములపై ఆధారపడును. మఱికొన్ని సత్యములు నరుని మూలస్వభావము మీదనే ఆధారపడుచు నరజాతి యుండునంత కాలము స్థిరముగ నిలుచును. విశ్వజనీనముగా నుండదగినవి ఈ సత్యములు మాత్రమే. మనలో ఎన్నిమార్పులు సంభవించినను శ్రుతులందలి ఈ విశ్వజనీనసత్యములు, ఈ అద్భుత వేదాంతభావములు, అచలములై, అజేయములై, అమరములై, శాశ్వతములై మన సాంఘిక సంసర్గములయందును, మన వస్త్రధారణవైఖరులందును, మన భోజనపద్ధతులయందును, మన పూజావిధానములందును తమ గాంభీర్యము పెంపున నిలిచియున్నవి. అయినను ఉపనిషత్తులయందు పక్వమునకు వచ్చిన సమస్తసిద్ధాంతముల బీజములును కర్మకాండలో ఇదివఱకే యున్నవి. అన్ని వేదాంతసంప్రదాయముల వారును సత్యమని అంగీకరించు సృష్టిసిద్ధాంతముగాని సమస్త భారతీయ సిద్ధాంత సంప్రదాయములకును ఆధారమగు బుద్ధి తత్త్వశాస్త్రముగాని ఇదివఱకు ఉన్నవే! ఆధ్యాత్మికభాగమగు వేదాంతమును గూర్చి విచారణ ప్రారంభించుటకు పూర్వము ఈ కర్మకాండను గూర్చి నాలుగు మాటలు చెప్పవలసి యున్నది. పైగా వేదాంతము అను పదమును నేను ఏ అర్థముతో ప్రయోగించుచున్నదియు ముందుగా మీకు వివరముగా తెలుపవలసియున్నది.

భారతదేశమున వేదాంతమను పదము అద్వైత సిద్ధాంతమునకు మాత్రమే చెల్లుననెడు పొరపాటు అభిప్రాయము ఈనాడు

కలదు. ప్రస్థానములు మూడును సమాన ప్రాధాన్యము కలవి యని అన్ని మతసిద్ధాంతములను పరిశీలించునప్పుడు మీరు సదా జ్ఞప్తి నుంచుకొనవలయును. ప్రథమమున శ్రుతులుగలవు. శ్రుతులనగా ఉపనిషత్తులని నా భావము. తరువాత వ్యాససూత్రములు. తత్త్వజ్ఞులు వీనికి అత్యధిక ప్రాధాన్యమును ఇచ్చియున్నారు. ఏల యన అదివఱకున్న అన్ని తత్త్వసిద్ధాంతములయొక్క పరిణామ ఫలములే ఈ వ్యాససూత్రములు! ఈ సిద్ధాంతములు ఒకదాని కొకటి విరుద్ధములు గావు. పైగా ఒకదాని కొకటి ఆధారముగా నున్నవి. ఒకే మహాసిద్ధాంతము యొక్క క్రమ వికాసము వ్యాస సూత్రములలో చక్కగా గోచరించును. అద్భుతములగు వేదాంత సత్యములు ఇందు సూత్రీకరింపబడినవి. ఉపనిషత్తులకును, వ్యాస సూత్రములకును మధ్య భగవంతుని వేదాంతవ్యాఖ్యానమగు శ్రీ గీత కలదు.

ఉపనిషత్తులు వ్యాససూత్రములు గీత ఈ మూటిని ద్వైతాద్వైత విశిష్టాద్వైత ప్రతిపాదకములగు సమస్త సంప్రదాయములును శిరసావహించితీఱవలెను. కానిచో అవి ధర్మ సమ్మతములుగా ఈదేశమున గౌరవింపబడవు. ఈ సంప్రదాయ ములలో ప్రతి దానికిని ప్రస్థానత్రయమే ప్రమాణము! ఒక శంక రాచార్యులో, ఒక రామానుజాచార్యులో, మధ్వాచార్యులో, ఒక వల్లభాచార్యులో, ఒక చైతన్యులో ఎవరైనను ఒక నూతన సంప్రదాయమును స్థాపింపగోరిన యెడల ఈప్రస్థానముల మూడిం టిని చేకొనవలయును. వానిమీద తమ క్రొత్త వ్యాఖ్యానమును రచింపవలసి యుండును. కాబట్టి ఉపనిషత్తులనుండి పుట్టిన సిద్ధాం తములలో ఒకదానికి మాత్రమే వేదాంతమను పదమును ప్రత్యే కముగా ప్రయోగించుట పొరపాటేయగును. వేదాంతము అను మాటలో ఈప్రస్థానములు మూడును ఇమిడి యున్నవి. అద్వైతి వలెనే, విశిష్టాద్వైతియు వేదాంతి అని పిలుచుకొనుటకు సమా

నార్హత కలిగియుండును. నేనింకొక అడుగు ముందుకు పోయి యథార్థమునకు హిందువను మాటవలన మనము నిజముగా దేనిని అర్థము చేసికొనుచున్నామో అదియే నిజముగా వేదాంతి అను దానికిని అర్థమని చెప్పుదును. ఈమూడు సిద్ధాంతములును దాదాపుగా స్మృతికి అందని పురాతన కాలమునుండియు ప్రచారములో నున్నవియే. శంకరాచార్యులవారు అద్వైతసిద్ధాంతమునకు మూలకర్తయని మీరు తలప కూడదు. ఏది శంకరాచార్యులు పుట్టుటకు పూర్వము యుగాంతరములనుండి వచ్చుచున్నదో దాని తుది ప్రతినిధులలో ఈయన ఒకడు. అటులనే విశిష్టాద్వైతవాద ~~మును.~~ అది రామానుజాచార్యులవారి పుట్టుకకు పూర్వము చాల యుగములనాడే యున్నది. ఆయన వ్రాసిన వ్యాఖ్యానముల బట్టియే ఈ విషయమును ఇదివఱకే తెలిసికొనియున్నాము. ఇటులే ద్వైత సిద్ధాంతములును ఇతర సిద్ధాంతములతో పాటు ప్రాచీనకాలము నుండియు వచ్చుచునేయున్నవి. నా కొలదిపాటి జ్ఞానములో అవి ఒకదాని కొకటి విరుద్ధములు కావను నిర్ధారణకు వచ్చితిని.

సనాతన మహాసూత్రములు దూరముగా వినవచ్చు మంద మృదుస్వరములవలె ఆరంభమై, క్రమముగా వికసించి, చివరకు అద్వైతవాదమను విజయగంభీరకీర్తనముగ షడ్దర్శనములందు పరిణమించినవి. అట్లే మానవహృదయము క్రమక్రమముగా ఉత్తమోత్తమాదర్శముల వైపునకు, సర్వమును ఆఅద్భుత అభిన్నత్వములో కలిసిపోవు వఱకు, అనగా అద్వైతసిద్ధాంతము చేరువఱకు, క్రమగతిని సాగిన వికాసముగా ఈ మూడు సిద్ధాంతములను మనము గ్రహింపవలసియున్నది. ఈ మూడు వాదములును పరస్పరవిరుద్ధములుకావు. అయినను అనేకులు ఈ పొరపాటుపడి యుండిరి. అద్వైతబోధకుడు అద్వైతమును ప్రత్యేకముగా బోధించు వాక్యములను చెక్కుచెదరకుండ నిలిపి, ద్వైతపరము

లును విశిష్టాద్వైతపరములును అయిన వాక్యములను సాగదీసి వానిని తన వాదములోనికి లాగికొని వచ్చుట మనకు తెలియును. అట్లే ద్వైతమతబోధకులు అద్వైతవాక్యములలోనికి ద్వైత పరమగు తమ అర్థమును చొప్పింప ప్రయత్నించుటయు కనబడు చున్నది. మన గురువులు మహానుభావులే. అయినను "గురు వుల దోషములు సైతము చెప్పవలసి వచ్చును" అను ఒకసామెత కలదు. వారు ఈ విషయమున మాత్రము పొరపడిరని నా అభి ప్రాయము. ఎవరుగాని వాక్యములను తికమకలు చేయుపనికి పూనుకొనవలసిన అవసరము లేదు. ఏ విధమగు మతముపేరిటను కపటవర్తనమునకును దిగవలసిన అగత్యము లేదు. వ్యాకరణ మును ఆధారముచేసికొని ఏ విధమగు అసంగత, రుచిరహిత ప్రలా పములకును దిగ నక్కఱలేదు. మన స్వంత భావములను ప్రతి వాక్యములోనికి చొప్పింప ప్రయత్నించు నంతటి బాధ మనకు వలదు. "అధికార భేద" మనెడు అద్భుతసూత్రమును మీరొక సారి గ్రహించితిరా, మీ పని ఏ చిక్కులు లేక సులభముగ సాగి పోగలదు.

"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (దేనిని తెలిసికొనిన సర్వమును తెలిసికొనినట్లగునో అది ఏది?) అను ఏకైక సమస్య ఉపనిషత్తుల ఎదుటనున్నది సత్యమే. ఆధు నికుల భాషలో చెప్పునెడల ఉపనిషత్తుల గమ్యార్థము సమస్తము యొక్క తుది ఏకత్వమును కనుగొనుట అని చెప్పవలయును. జ్ఞానమనగా భిన్నత్వమునందు ఏకత్వమును కనుగొనుట తప్ప వేఱుగాదు. ప్రతిశాస్త్రమును దీనిపైననే ఆధారపడి యున్నది. నరుని విజ్ఞానమంతయు భిన్నత్వమును కనుగొనుటమీదనే ఆధార పడియున్నది. కొలదిపాటి భిన్నసంఘటనల మధ్య ఐక్యమును కనుగొనుట మహాకార్యముగా నుండును. అట్టియెడ విచిత్రముగా భిన్నభిన్నమై చూపట్టు ఈ విశ్వమునందలి — అసంఖ్యాకములగు

నామరూపభేదముల తోడను, ఆత్మానాత్మ పదార్థభేదముల తోడను, నిండియున్న ఈ జగత్తులోపలి — అద్వితీయ తత్త్వమును తెలిసికొనుట బ్రహ్మాండకార్యముగా నుండక తప్పదు. ప్రతి సంకల్పమును వేఱొండు సంకల్పమునకు భిన్నముగనే యున్నది. ప్రతి ఆకృతియు మఱొక ఆకృతికి భిన్నముగనేయున్నది. ఇట్లుండ అనేక క్షేత్రములకును, అనంతలోకములకును, సామరస్యమును కూర్చుటయు, అంతులేని ఈ భిన్నవస్తుజాల మంతటిలో ఏకైక తత్త్వమును కనుగొనుటయు పరమగమ్యముగా ఈ ఉపనిషత్తులు పరిగణించినవి. ఐనను అరుంధతీ న్యాయమను ఒక విధానము కలదు. అరుంధతియను చాల చిన్నచుక్కను ఒకనికి చూపవలసి వచ్చినప్పుడు దానిదాపున బాగుగ మెఱయుచున్న పెద్ద నక్షత్రము మీద వానిదృష్టిని మొదటగా నిలుపుమందురు. ఆతరువాత అరుంధతిమీదికి దృష్టిని మరల్చుట బహు సులభముగ నుండును, మనము నెరపవలసిన కార్యము ఇట్లే యున్నది. నా అభిప్రాయమును ఋజువు చేయుటకు ఉపనిషత్తులను చూపిన చాలును. ఆ పిమ్మట మీరే ఆ విషయమును చూచుకొందురు. దాదాపుగా ప్రతి అధ్యాయమును ఉపాసనారూపమగు ద్వైతబోధతో ప్రారంభమగును. ఈవిశ్వమునకు సృష్టికర్తయు పోషకుడును ఎవరో, ఎవనిలోనికి తుదకు ఈ సర్వమును లయమై పోవునో, అట్టి భగవంతుని మొట్టమొదట బోధింతురు. అతనిని మనము పూజింప వలయును. అతడు బాహ్యాంతరములగు ఈ సృష్టికంతకు అధిపతియు నాయకుడును ఐనను అతడు ఈప్రకృతికి వెలియై బాహ్యమునందు ఎక్కడనో యున్నట్లు కాన్పించును. ఒక్క మెట్టు ముందుకు పోయిన యెడల ఈ భగవంతుడు ప్రకృతికి వెలుపల లేడనియు దానిలో అంతర్యామియై యున్నాడనియు ఆ గురువే బోధింప బూనుట మనకు తెలియవచ్చును. తుట్టతుదకు ఈ రెండు అభిప్రాయములును పూర్వపక్షము చేయబడును. అప్పుడు కలదంతయు యథార్థముగా అతడే. భేదమేదియులేదు. "తత్త్వమసి శ్వేతకేతో"

(ఓ శ్వేతకేతూ అది నీవే అగుదువు). ఆ అంతర్యామియు తుదకు నరుని జీవాత్మయందు ఉండునదియు ఒకటియే! ఇచ్చట రాజీ పడుటలేదు. ఇతరులేమని అభిప్రాయపడుదురో అను భయము లేదు. సత్యము—నిర్భయమగు సత్యము—నిర్భయమగు భాషలో తెలుపబడినది. ఈనాడు ఆ సత్యమును అట్టి నిర్భయమగు భాషలో బోధించుటకు మనము జంకవలసిన అగత్యము లేదు. ఈశ్వరానుగ్రహమువలన అట్టి సాహసప్రచారకుడుగా నుండగల ధైర్యము నాకు కలుగవలెనని ఆశించుచున్నాను.

మరల మొదటి విషయమునకు వత్తము. మనము మొట్ట మొదట గమనింపవలసిన విషయములు రెండు గలవు. ఒకటి అన్ని వేదాంతసంప్రదాయములకును సామాన్యమగు ఆధ్యాత్మికాంశము. రెండవది సృష్టియంశము. నేను మొదటగా సృష్టివిషయము ఎత్తు కొనెదను. ఈనాడు ఆధునికశాస్త్రమున నూతనముగ కనిపెట్ట బడిన విచిత్రాంశములు ఆకాశమునందుండి పిడుగులవలె మనపైన బడి, మన మెన్నడును కలనైనను తలచి యుండని విచిత్రములను మన కన్నులకు చూపుచున్నవి. అయినను వీనిలో చాలవఱకు యుగాంతరములకు పూర్వమే తెలిసికొనబడినవయ్యును ఇప్పుడు మరల నూతనముగా కనిపెట్టబడుచున్నవి. మొన్న మొన్ననే భిన్నభిన్నమై చూపట్టు శక్తుల మధ్య ఏకత్వము కలదని ఆధునిక శాస్త్రము కనుగొనినది. ఉష్ణము, కాంతశక్తి, విద్యుచ్ఛక్తి, ఇత్యాది పేర్లతో పిలువబడువాని నన్నిటిని ఒక్క మూలశక్తిలోనికి మార్చవచ్చుననియు, వానినన్నిటిని ఇష్టమువచ్చిన ఒక్క పేరుతో వ్యక్తము చేయవచ్చుననియు నూతనశాస్త్రము మొన్ననే కను గొనినది. కాని ఆ పని సంహితయందే జరిగియున్నది. సంహిత పురాతనముగను ప్రాచీనముగను కనబడుచున్నను దానియందు నేను ఇప్పుడు ప్రస్తావించుచున్న శక్తిని గుఱించిన ఈ భావమే కాన్పించుచున్నది. ఈ శక్తులన్నియు — భూమ్యాకర్షణము

ఆశ్లేషము లేక వికర్షణము అని మీరే పేరు పెట్టి పిలిచినను సరియే, అవి ఉష్ణముగాగాని విద్యుచ్ఛక్తిగాగాని కాంతశక్తిగాగాని ఏరూపమున వ్యక్తమైనను సరియే ఆ మూలశక్తియొక్క రూపాంతరములే. నరునియొక్క అంతఃకరణమునుండి ఉద్భవించు సంకల్పముగా వ్యక్తమైనను లేక బాహ్యావయవములవలన జరగు కార్యముగ వ్యక్తమైనను ఆ శక్తులన్నియు దేనినుండి కలుగునో ఆ మూలశక్తికి 'ప్రాణము' అనిపేరు. ఇక ప్రాణమననేమి? ప్రాణమనగా స్పందనము లేక అదురుడువంటి చలనము. ఈ విశ్వమంతయు దాని ప్రారంభదశకు మరలిపోయినప్పుడు ఈ అనంతశక్తి ఏమగును? అది శూన్యమై పోవునని తలతురా? అటుల కాజాలదు గదా. అది నాశనమై పోవునెడల ఆ పిమ్మట వచ్చు తరంగమునకు కారణముగా నుండదగు ఆధారమెక్కడ? ఏలయన ఈ చలనము తరంగరూపమున లేచుచు పడుచు మరల లేచుచు మరల పడుచు సాగిపోవుచున్నది. ఇక్కడ 'సృష్టి' యను పదము జగత్తని అర్థమిచ్చుచున్నది. ఆ పదమునకు అర్థముగా ''క్రియేషన్'' అని చెప్పరాదు. ఆంగ్లమున మాటలాడుచున్న నాకు గత్యంతరము లేదు. సంస్కృతపదములను నా శక్తికొలది ఆంగ్లములోనికి మార్చవలసి వచ్చుచున్నది. సృష్టి యనగా ''ప్రొజెక్షన్'', అనగా ఆవిష్కరణము, లేక వెలికి వచ్చుట అని అర్థము చెప్పవచ్చును. ఒక కల్పము తుదను సమస్తమును సూక్ష్మరూపము పొంది, ఇంకను సూక్ష్మరూపము పొంది అది ఎట్లు ఆరంభమయ్యెనో అట్టి ప్రారంభదశకు మరలిపోవును. కొంతవఱకు నిశ్చలముగా అక్కడ నిలిచి మరల బహిర్గతమగుటకు అనగా వెలువడుటకు సిద్ధముగ నుండును. దీనిని సృష్టి లేక ఆవిష్కరణము అందుము. సరే ఈ శక్తులన్నియు, అనగా ప్రాణములన్నియు ఏమగును? అవి అన్నియు వాని మూలరూపమగు ప్రాణములోనికి మాఱును. ఈ ప్రాణము దాదాపుగా నిశ్చలమగును. కాని పూర్ణముగా నిశ్చలము కాదు. వేదములోని ఒక సూక్తమున ఇది వర్ణింపబడి

యున్నది. "అనిదవాతం" అనగా అది స్పందనము లేకుండ స్పందించెను. ఉపనిషత్తులయందు చాల సాంకేతికవచనములు కలవు. అవి అర్థము చేసికొనుట కష్టము. ఉదాహరణకు "వాతా" అను శబ్దము తీసికొనుడు. చాలచోట్ల గాలి అని దాని యర్థము. ఇంకను చాల తావులయందు దానికి చలనము అని అర్థము గలదు. ప్రజలు తరచుగా ఒక అర్థమునకు మఱొక అర్థమును చెప్పుకొని కలవరపడుచుందురు. ఇట్టి విషయమున మనము జాగ్రత్తగ నుండవలయును. సరే మనము జడపదార్థమని పిలుచు నది ఏమగును? శక్తులు జడపదార్థమంతటను అంతర్గతమై యుండును. అవి అన్నియు ఆకాశములోనికి లయమైపోయి మరల దానినుండి వెలువడుచుండును. ఈ ఆకాశమే మూలపదార్థము. మీరు దానిని ఆంగ్లభాషలోనికి "ఈథర్" అనిగాని ఇంకొకటని గాని తర్జుమా చేయవచ్చును. ఐనను ఈ ఆకాశము ద్రవ్యరాశి యొక్క మూలస్వరూపము అని భావము. ఈ ఆకాశము ప్రాణము యొక్క ప్రేరణచేత స్పందించుచున్నది. తర్వాత సృష్టి పైకి వచ్చుచున్నప్పుడు స్పందనము వేగిరమగును. అప్పుడు ఈ ఆకాశము సూర్యులు, చంద్రులు, ఇతరమండలములు అని మనము చెప్పుకొను తరంగరూపములలోనికి ఎగురగొట్టబడును.

అందింకను ఇట్లున్నది: "యదిదం కించ జగత్ సర్వం ప్రాణఏజతి నిస్సృతం" (ఈ విశ్వములోని సర్వమును ప్రాణము స్పందించుటవలన ఆవిష్కృతమగుచున్నది.) 'ఏజతి' అను పదమును మీరు గుర్తుంచుకొనవలయును. 'ఏజ' అనగా స్పందించుట, 'నిస్సృతం' అనగా ఆవిష్కృతము, 'యదిదంకించ' ఈ విశ్వములో కలది ఏదైనను.

ఇది సృష్టి విషయకమగు ఒకభాగము. దాని నిర్మాణము లోనికి రాగల సూక్ష్మవస్తువులు చాల గలవు. ఉదాహరణకు చూడుడు సృష్టిక్రమము ఎట్టిది? మొట్టమొదట ఆకాశ

మెట్లేర్పడినది? ఆ ఆకాశమునుండి తక్కినవన్నియు ఎట్లు పుట్టు కొని వచ్చినవి? ఆకాశము స్పందించుట ఎట్లు ప్రారంభమైనది? దానినుండి వాయువెట్లు కలిగినది ఇట్టి ప్రశ్న లెన్నో కలవు. కాని సూక్ష్మమునుండి స్థూలము కలుగుచుండును అనెడు భావము ఇందు కలదు. స్థూలపదార్థము చిట్టచివర ఏర్పడుచున్నది. అది అన్నిటికంటె బాహ్యమున నుండును. ఈ స్థూలపదార్థమునకు పూర్వము సూక్ష్మపదార్థము ఉండవలయును. ఐనను సర్వమును రెండు వర్గములుగా ఏర్పడుట చూచితిమి కాని ఇంకను తుది అభేదము రావలసి యున్నది. శక్తి యంతయు ఏకమై ప్రాణ మగుచున్నది. ద్రవ్యమంతయు ఏకమై ఆకాశ మగుచున్నది. ఈ రెండును ఇంకను ఏకమగుట కానగునా? అవి రెండును ఒకటిగా కలిగిపోవునా? మన ఆధునిక శాస్త్రములు ఈ సందర్భ మున మౌనము వహించి యున్నవి. వానికిక్కడ ఇంకను మార్గము దొరకలేదు. అట్లు జరుగుచో అవి ఆ ప్రాతకాలపు నాటి ప్రాణమునే, ఆ పురాణకాలమునాటి ఆకాశమునే కను గొనుచు నెమ్మది నెమ్మదిగా అదేమార్గము ననుసరించి రావలసి యున్నది.

తర్వాత రావలసియున్న ఏకరూపము సర్వవ్యాపకమును నిర్గుణమును అగు వ్యక్తి. దానికి ప్రాచీనపురాణములు బ్రహ్మ లేక చతుర్ముఖబ్రహ్మ అని పేరిడినవి. ఆధ్యాత్మిక తత్త్వశాస్త్ర మున దానినే మహత్ అందురు. పై రెంటికిని ఐక్యము ఇక్కడ కలుగుచున్నది. నీ మనస్సనునది మెదడు అనెడు బోనులో చిక్కుకొనిన ఈ 'మహత్' యొక్క ఒక రేణువు. అందఱి మెదడులలో మొత్తముగా చిక్కుకొనిన మనస్సుల నన్నిటిని కలిపి 'సమష్టి' అనుచున్నారు. ఇది అన్నిటికూడిక, విశ్వవ్యాప్తమైనది. ఈ వివరణము ఇంకను సాగిపోవలయును. ఇప్పటి కింకను పూర్తి కాలేదు. ఇచ్చట మనలో ప్రతివానిని ఒక పిండాండ మనవచ్చును

ఈ జగత్తంతను ఒకటిగా తీసికొనినయెడల బ్రహ్మాండ మన వచ్చును. ప్రత్యేకసృష్టియందు ఏమేమి జరుగుచున్నదో అట్టిదియే వెలుపలగూడ జరుగుచున్నదని ధారాళముగా ఊహ చేయ వచ్చును. మన మనస్సులను పరిశోధించుకొను శక్తి మనకున్న యెడల ఇక్కడ జరుగునదియే విశ్వమానసమునందును జరుగు చున్నదని నిరాఘాటముగా ఊహింపగలము. ఈ మనస్సనునది ఏమిటో ఇప్పుడు విచారింపవలసియున్నది. ఆధునిక కాలమున పాశ్చాత్య దేశములలో భౌతికద్రవ్యశాస్త్రము వేవేగముగ వృద్ధి యగుచున్నకొలదిని శరీరనిర్మాణశాస్త్రము క్రమక్రమముగా ప్రాచీనమతములు నిర్మించుకొనియున్న కోటలను ఒకదాని తర్వాత నొకటిగా పడగొట్టివేయుచున్నది. దీనిని చూచి పాశ్చాత్యప్రజలు ఎక్కడ నిలుచుటయో తెలియజాలకున్నారు. ఏలయన ఆధునిక శరీరశాస్త్రము అడుగడుగునకు మనస్సును మెదడుతో ఐక్యము చేయుచున్నది. ఇది చూచి వారు దిగులుపడి పోవుచున్నారు. కాని భారతదేశములో మనకు ఇది సదా తెలిసియున్న విషయమే. హిందూబాలుడు మొట్టమొదటనే మనస్సనునది జడపదార్థమే యనియు, కాని సూక్ష్మమైనదనియు నేర్చుకొనుచున్నాడు. ఈ శరీరము స్థూలమైనది. దీని వెనుక సూక్ష్మశరీరము అని మనము పేర్కొనునది కలదు. అదియే మనస్సు. ఇదియు జడ మైనదే కాని అతిసూక్ష్మరూపమున నుండును. ఇది ఆత్మకాదు.

ఈ పదమును ఆంగ్లములోనికి భాషాంతరీకరణము చేయను. ఏల యందురా? ఈ భావము యూరపునందు లేదు. కాబట్టి దీని భాషాంతరీకరణము సాధ్యముకాదు. జర్మనీదేశపు తత్త్వశాస్త్ర జ్ఞులు 'ఆత్మ' అను మాటకు "సెల్ఫ్" అని భాషాంతరీకరణము చేసిరి. దానిని సర్వత్ర అందఱు అంగీకరించినగాని ఉపయో గించుట సాధ్యముకాదు. కాబట్టి దానిని "సెల్ఫ్" అనుడు, లేక మఱేపేరుతో నైన పిలువుడు. అది మన ఆత్మ. ఈ ఆత్మయే

అంతర్యామునందు సత్యమగు నరుడు. ఈ ఆత్మయే జడమగు మనస్సును తన పనిముట్టుగా ఉపయోగించుకొనుచున్నది. ఆధ్యాత్మికతత్త్వశాస్త్రమున, మనోవిద్యయందు ఈ మనస్సునకు అంతఃకరణ మనిపేరు. ఈ మనస్సు కొన్నికొన్ని అంతరింద్రియ ముల సాహాయ్యమున మన శరీరములో దృశ్యములై కాన్పించు అంగములను ఉపయోగించుచున్నది. ఈ మనస్సుయొక్క స్వరూప మెట్టిది? పాశ్చాత్యతత్త్వవేత్తలు మొన్న మొన్ననే ఈ కన్నులు నిజముగా చూచు ఇంద్రియములు కావనియు, వాని వెనుక వేఱుగా దృష్టి ఇంద్రియములు కలవనియు కనుగొనిరి. ఈ కన్నులు నాశనమైనను నరుడు ఇంద్రునివలె వేయికన్నులు కలవాడు కావచ్చును. కాని బాహ్యదృష్టి మాత్రము వానికి లభింపదు. ఔను మన తత్త్వశాస్త్రము దృష్టియనగా బాహ్యమున కన్పించు ఈ దృశ్యము కాదనెడు ఊహతో ప్రారంభమగుచున్నది. సత్యమగు దృష్టి అంతరింద్రియములకు సంబంధించినది. ఆ కేంద్ర ములు మెదడులోపల నున్నవి. మీరు వానికేమి పేరులనైన పెట్టుడు. కాని ఈ కనుపడు కన్నులు, చెవులు, ముక్కు మొద లగునవి నిజమగు ఇంద్రియములు కావు. మఱియు ఈ ఇంద్రియ ములును మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగునవి కలిసి మొత్తముమీద (ఆంగ్లభాషలో) "మైండ్" అని పేర్కొనబడుచున్నవి. ఆధునికశరీరశాస్త్రజ్ఞుడు ఈ మెదడే మన స్సనియు, ఇన్ని ఇంద్రియములునుకూడి మెదడు ఏర్పడుచున్న దనియు చెప్పును. అది విని భయపడనక్కఱలేదు. మన కా విషయము ఎల్లప్పుడును తెలిసిన సంగతియేయని వానికి చెప్పుడు. మన మతముయొక్క ప్రాథమికసూత్రములలో అది ఒకటి.

సరే మంచిది. ఇప్పుడు ఈ మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగు వాని అర్థమేమో విచారింతము. మొట్ట మొదట చిత్తమును విచారింతము. అది మానసికపదార్థము.

'మహత్తు'లో ఒకభాగము. అది మనస్సుయొక్క వికారములన్ని టికిని వర్తించు సామాన్యనామము. వసంతకాలమున ఒకనాటి సాయంకాలము ప్రశాంతముగా అలలేమియు లేక ప్రసన్నముగ నున్న ఒకసరస్సులో ఒకడు ఒకరాతిని పడవేయుననుకొనుడు. అప్పుడు ఏమి జరుగును? మొట్టమొదట ఆ నీటికి దెబ్బతగులుట అనెడు క్రియ జరుగును. తర్వాత అచ్చటి నీరు పైకిలేచి ఆ రాతి వెంట ఒక ప్రతిక్రియను కల్పనచేయును. ఈ ప్రతిక్రియ ఒక తరంగరూపము దాల్చును. మొట్టమొదట ఆ నీరు కొలదిగా స్పందించి వెంటనే తరంగరూపమగు ఒక ప్రతిక్రియను వెనుకకు పంపును. చిత్తమును ఈ చెఱువునకు పోల్చుదము. ఈ బాహ్య వస్తువులు దానిలో వేయబడు రాళ్లవంటివి. ఈ ఇంద్రియముల ద్వారమున చిత్తము ఈ బాహ్యవస్తువులలో ఒకదానితో సంప ర్కమును పొందగనే ఒక స్పందనము కలుగును. ఆ స్పందన మునకే మనస్సని పేరు. దానికి విస్పష్టమగు రూపమేర్పడలేదు. ఈ బాహ్యవస్తు సంపర్కమును లోపలికి తీసికొని పోవుటకు ఇంద్రియములు అవసరమగును. మనస్సు ఏర్పడగనే ఒక ప్రతి క్రియ కలుగును. అది నిశ్చయముచేయు సత్త. దీనిని బుద్ధి అందురు. ఈ బుద్ధి కలిగిన తోడ్తోడనే 'అహం' అనెడు భావ మును, బాహ్యవస్తువుయొక్క భావమును తళుక్కుమనును. నా చేతిమీద ఒక దోమ వ్రాలినది అనుకొనుడు. ఆ స్పర్శాను భవము చిత్తమునకు చేర్పబడును. అప్పుడు చిత్తము కొంచెము స్పందనము చేయును. ఈ స్పందనమునే ఆధ్యాత్మికశాస్త్రమున "మనస్సు" అందురు. ఆపిమ్మట ఒక ప్రతిక్రియ ఏర్పడును. తత్క్షణమే నా చేతిమీద ఒక దోమ ఉన్నది, దానిని త్రోలవలెను అనెడు భావము కలుగును. ఈ రీతిగా ఆ చెఱువునందు రాళ్లు పడుచుండును. కాని మామూలు చెఱువు విషయములో దానికి కలుగు ప్రతిదెబ్బయు బాహ్యప్రపంచమునుండియే వచ్చి తగులును. మనస్సనెడు చెఱువు సందర్భములో ఈ దెబ్బలు బాహ్య

ప్రపంచమునుండిగాని, ఆంతరప్రపంచమునుండిగాని రావచ్చును. ఈ వరుస అంతటిని కలిపి అంతఃకరణము అందురు.

దీనితోపాటు ఇకముందు అద్వైతసిద్ధాంతమును గ్రహించుటలో మనకు సహాయపడునట్టి ఇంకొకవిషయమునుకూడ మనము తెలిసికొనవలయును. మీరందఱు ముత్యములను చూచియుందురు. చాలమందికి ఆ ముత్యము లెట్లేర్పడునో తెలిసియుండును. ముత్యపుచేపయొక్క చిప్పలోనికి ఒక ఇసుకరేణువు ప్రవేశించును. అంతట అచ్చట 'గులగుల' లాడును. ఆ ముత్యపుచేపయొక్క శరీరమునందు ఆ 'గులగుల' లాడు తావున ప్రతిక్రియకలుగును. అంతట దాని శరీరమునుండి ఒకవిధమైన రసము ఊరి ఇసుకరేణువు చుట్టు చేరును. ఈ ద్రవము గడ్డకట్టి ముత్యముగా నేర్పడును. ఈ జగత్తంతయు అటులే ఏర్పడుచున్నది. మనచేత నిర్మాణము చేయబడు ముత్యమే ఈ జగము. బాహ్యప్రపంచమునుండి మనకు వచ్చునది ఒక దెబ్బమాత్రమే. ఆ దెబ్బ తగిలినది అనెడు జ్ఞానము కలుగుటకుకూడ మనము ప్రతిక్రియ సలుపవలెను. మనము ప్రతిక్రియ సలిపిన తోడ్తోడనే మన మనస్సులోని ఒక భాగమును ఆ దెబ్బవైపునకు మనము చాచుచున్నాము. మనము ఆ దెబ్బను గుఱించి తెలిసికొనునప్పుడు ఆ దెబ్బవలన ఆకృతి పొందిన మన మనస్సునే సుమా మనము నిజముగా తెలిసికొన్నది! కాబట్టి బాహ్యమున ప్రపంచమనునది ఒకటి స్థిరముగా నున్నదని విశ్వసింప గోరువారు శరీరశాస్త్రమును బాగుగ నేర్చుకొను ఈ దినములలో ఒకవిషయమును ఒప్పుకొనక తప్పదు. బాహ్యమున కాన్పించు ప్రపంచమునకు "క" అను గుర్తు అనుకొనుడు. అప్పుడు మనము నిజముగా తెలిసికొనునది ఈ "క" యును, దానితో కూడిన మనస్సును! మనస్సనెడు ఈ తత్త్వము "క" అంతటిని తనలో ఇముడ్చుకొనగలంత పెద్దదిగా నున్నది. కాబట్టి ఈ "క" అనునది ఎల్లప్పుడును తెలియరాకుండనే, తెలియ వీలగు

నది కాకుండనే ఉండును. అందువలన ఒకవేళ బాహ్యప్రపంచము ఉన్నను, అది సదా దెలియబడనిదిగను, దెలియ వీలుకానిదిగను ఉండును. బాహ్యప్రపంచమును గుఱించి మనము తెలిసికొను చున్నామనుకొనునది మన మనస్సుచేత అచ్చు కొట్టబడి రూపము పొంది సిద్ధముగా నున్నదానినే! అంతరప్రపంచము సంగతియు అటులే యున్నది. ఈ సూత్రమే మనజీవుడు లేక 'ఆత్మ' అను దానికిని వర్తించును. 'ఆత్మ'ను మనము తెలిసికొన వలయు ననినచో మనస్సు ద్వారముననే చూడవలసి యుండును. కాబట్టి ఈ ఆత్మను గుఱించి మనము తెలిసికొనిన కొంచెము సైతము మనస్సుతో సమ్మిళితమై యున్న ఆత్మను గుఱించి మాత్రమే. అనగా మనస్సుచేత కప్పివేయబడి అచ్చులో సిద్ధము చేయబడిన కల్పితాకృతియగు ఆత్మను మాత్రమే. అంతకంటె ఎక్కువ ఏమియు మనము చూచుటలేదు. కొంత సాగిపోయిన పిమ్మట ఈ విషయమునకు మరల వచ్చెదము గాక! కాని ఇప్పుడు చెప్పు కొనిన దానిని బాగుగ జ్ఞప్తిలో నుంచుకొన వలయును.

మనము తెలిసికొన దగిన తరువాతి విషయము ఇది: ఈ శరీరమనగా ఎడతెగక ప్రవహించుచున్న ఒక జడద్రవ్య ప్రవాహముయొక్క పేరేగదా అను ప్రశ్న బయలుదేరుచున్నది. ఒక నది ఎడతెగకుండ ప్రవహించుచున్నదనుకొనుడు. పోయిన నీరు పోవుచుండగా ఎప్పటికప్పుడు క్రొత్తనీరు వచ్చి దానిలో చేరు చుండును గదా! అటులే ప్రతిక్షణమును మనశరీరమునుండి కొంత ద్రవ్యము బయటికి పోవుచుండగా మరల కొంతద్రవ్యము ప్రతి క్షణమును క్రొత్తగా వచ్చి దానిలోచేరుచున్నది. అయినప్పటికిని దానినంతనుకలిపి ఊహచేసికొని, ఆ ఊహనే నది అనియో శరీర మనియో అనుచున్నాము. సరే, నదియని మనము పిలుచునది దేనిని? ప్రతిక్షణమును ఆ నీరు మాఱిపోవుచున్నది; ఆ తీరమును మాఱిపోవుచున్నది; ప్రతిక్షణమును పరిసరములుకూడ (అనగా

దాని సమీపమున, చుట్టును ఉండునవియు) మాఱిపోవుచున్నవి. ఇంక నది యనునది ఏది? ఈ వికార పరంపరయొక్క, అనగా మార్పుల వరుసయొక్క పేరుమాత్రమే ఆ''నది''. మనస్సుకూడ అట్టిదే. దీనిని ప్రసిద్ధముగా క్షణిక విజ్ఞానవాదము అందురు. దీనిని గ్రహించుట చాల కష్టము; అయినను గట్టి పట్టుదలతో తర్కబలముచేత బౌద్ధ తత్త్వశాస్త్రము బాగుగ నిరూపణము చేసినది. ఇది భారత దేశములో కొంత వేదాంతభాగమునకు విరుద్ధముగా బయలు దేరినది. దీనికి మనము సమాధానము చెప్పవలసియున్నది. అద్వైతము యొక్క సాహాయ్యమున మాత్రమే దీనికి సమాధానమును కూర్పగలము. మఱింక దేనివలనను అట్టి సమాధానము కుదరదు. అద్వైతమతమును గుఱించి ప్రజలకు విపరీత భావములున్నను, అద్వైతమును గుఱించి ప్రజలు పోరాటములు సాగించినను, ఈ అద్వైతము ప్రపంచమునకు ఎటుల తరణోపాయము కాగలదో మనము కనుగొందముగాక. అద్వైతమునందు మాత్రమే అనేక విషయములకు సహేతుకమగు సమాధానములు కలవు. ద్వైతమతమును ఇతరమతములును ఈశ్వరార్చనకు సాధనములుగా చాలమంచివే; మనసునకు సంతృప్తి నొసంగునవే. అవి మనస్సును ఉద్ధరించుటకు సాయపడి యుండవచ్చును; కాని ఒక నరుడు మతసాధకుడుగను తార్కికుడుగను కూడ నుండ దలచునేని ప్రపంచములో వానికి ఉపకరింప తగినది అద్వైత సిద్ధాంత మొక్కటియే. సరే ఇపుడు ఒక ప్రక్కనుండి నిరంతరము నిండుచుండి రెండవ ప్రక్కను నీటిని వదలివేయుచుండు నదితో పోల్చి మనస్సును గుఱించి విచారణ చేయుదము. మనము ఆత్మయని పిలిచెడు ఆ ఐక్యము ఎక్కడనున్నది? శరీరము నిరంతరము మాఱిపోవుచున్నను మనస్సు సతతము మార్పు చెందుచున్నను మనలోపల మార్పు చెందనిది ఒకానొకటి కలదు. అది వస్తువులను గుఱించిన మన భావములను మాఱని వానివలె కనబడునటుల చేయుచున్నది. వేర్వేఱు తావులనుండి వచ్చు కాంతి

కిరణములు ఒక తెరమీదనో, ఒకగోడమీదనో, కదలక మాఱక యుండు ఇంక దేనిమీదనో పడినప్పుడు మాత్రమే ఆ కిరణములకు ఐక్యము ఏర్పడుట సాధ్యమగును. అప్పుడు మాత్రమే అవి పూర్ణ స్వరూపముగ కూర్పునందుటకు వీలగును. నరుని ఇంద్రియములకు ఐక్యము ఎట్లేర్పడును? అతని వేర్వేఱు భావములు ఏకమై ఒక పూర్ణ స్వరూపము పొందుటకు వీలెట్లు కలుగును? మనస్సుకూడ మాఱిపోవుచుండునదే కావున దానిలో ఐక్యము సాధ్యమగునని చెప్పుట కెంతమాత్రమును అవకాశము లేదు. కాబట్టి శరీరమును మనస్సును కానిది వేఱొకటి ఉండి తీరవలయును. మన భావము లన్నియు, మన ఇంద్రియానుభవము లన్నియు, దేనిమీదనిలిచి ఐక్యమును పొందగలవో, ఒక పూర్ణస్వరూపముగ ఏర్పడగలవో, అట్టిది ఏదో యొకటి, మాఱనిది, శాశ్వతముగ నుండునది, ఉండి తీరవలయును. అదియే నరునియందలి నిజమగు జీవుడు లేక ఆత్మ. పంచభూతములతో ఏర్పడినది ఏదైనను మీరు దానిని సూక్ష్మ ద్రవ్యమనుడు, లేక మనస్సనుడు, అది మాఱిపోవుచునేయుండును. మీరు స్థూలపదార్థము అనెడు ఈ బాహ్య ప్రపంచముకూడ సూక్ష్మద్రవ్యమగు మనస్సుకంటె మఱింతగా మాఱిపోవుచున్నది. అందుచేత మార్పు చెందనటువంటిది ఏదో అది భౌతికపదార్థము మాత్రము కాజాలదు; అది ఆత్మ పదార్థమై ఉండి తీరవలయును. అనగా అది జడద్రవ్యము కాజాలదు. అది అవినాశియై, నిర్వికారమై అనగా మార్పులేనిదై ఉండి తీరవలయును.

ఇప్పుడు ఇంకొక ప్రశ్న బయలుదేరుచున్నది. బాహ్య ప్రపంచమునందు మాత్రమే జనించు పురాతన వాదములనెల్ల దూరముగ నుంచుదము. సరే, ఈ బాహ్యప్రపంచమునే ఎవరు సృష్టించిరి? జడపదార్థము కల్పన చేసిన దెవరు? నరునందలి అంతరప్రకృతినుండి మాత్రమే మనము ఈ సత్యమును తెలిసికొనవలయును. ఆత్మను గుఱించియు ఈ సందర్భమునను అదేవిధమగు

ప్రశ్న ఉదయించుచున్నది. మనస్సునకు వేఱైనదియు నిర్వికార మును అగు ఆత్మ నరునియందు కలదని ఒప్పుకొనినప్పటికిని జీవుల మధ్య భావములందును అనుభవములందును సానుభూతులందును ఐక్యము ఎట్లు కలుగుచున్నది అను ప్రశ్న కలుగును. నా జీవా త్మకు మీ జీవాత్మతోడి సంసర్గమెట్లు కలుగుచున్నది? అది అట్లు పనిచేయుటకు ఉపకరించు సాధనమేది? దేని ద్వారమున అది నీ ఆత్మను చేరగలుగు చున్నది? ఇతర జీవాత్మసంసర్గానుభవము నా కెట్లు కలుగుచున్నది? నీ ఆత్మతోడను నా ఆత్మతోడను సంబం ధమును కల్పించుకొని ఈ మధ్యనుండు వస్తువేది? కాబట్టి ఇంకొక ఆత్మ కలదని ఒప్పుకొనవలసిన అవసరము ఆధ్యాత్మికముగ ఏర్పడు చున్నది. అన్ని జీవాత్మలతోడను సంపర్కము కలిగి పనిచేయ గలదియు, జడపదార్థములందును వానిమూలమునను పనిచేయ గలదియు, ఆత్మయే అయియుండవలయును. ప్రపంచమునగల అసంఖ్యాకములగు జీవాత్మలనన్నిటిని తనలో ఇముడ్చుకొని వానిలో అంతర్యామియై వర్తించుచు అవి అన్నియు తనలోనే తన మూలముననే బ్రతుకునట్లును, తనలోనే తన ద్వారముననే ఒక దానితో ఒకటి సానుభూతి పొందుచు, ఒకదానినొకటి ప్రేమించు కొనుచు, ఒకదానికొకటి ఉపకారము చేయుచు, ఉండుటకు వసతిని కల్పించు విశ్వాత్మ ఒకటి ఉండితీరవలయును గదా! ఈ విశ్వాత్మయే పరమాత్మ. అదియే జగదీశ్వరుడు. ఆత్మ భౌతిక పదార్థముతో ఏర్పడినది కాదు కావునను, అది ఆత్మమయము కావునను, జడపదార్థ ధర్మములకు అది లోబడి యుండదు అని తేలుచున్నది. జడపదార్థ ధర్మముల ననుసరించి దీనిని పరిశోధిం చుటకు కూడ వీలులేదు. ఇది అవిజేయము, అజము, అమరము, నిర్వికారము.

"నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతిపావకః
నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః
నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః"

"ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు, అగ్ని కాల్ప జాలదు, నీరు తడపజాలదు, గాలి ఆర్పివేయజాలదు. ఈ ఆత్మ నిర్వికారమైనది. అంతటను పర్వియుండునది. కదలనిది, చలనము లేనిది, శాశ్వతమైనది" అని అర్థము. భగవద్గీత ననుసరించియు, వేదాంతశాస్త్రము ననుసరించియు ఈ జీవాత్మ విభువు కూడనని మనము గ్రహించుచున్నాము. కపిలుని సిద్ధాంతము ననుసరించి ఇది సర్వవ్యాపి. ఈ ఆత్మ అణు స్వరూపి అనగా అత్యంత సూక్ష్మ పరిమాణముగలది అని వాదించు సంప్రదాయములును భారత దేశమునందు కలవు నిజమే. అయినను వ్యక్తమగుటలో అది అణువుగా గోచరించుననియే వారి అభిప్రాయము. దాని యథార్థ స్వరూపము విభువు. అనగా సర్వత్ర వ్యాపించియుండునది అని అర్థము.

ఇక్కడ ఇంకొక సిద్ధాంతము బయలుదేరుచున్నది. అది మిక్కిలి అబ్బురముగ తోచవచ్చును. అది భారతీయుల ప్రత్యేక సిద్ధాంతము. ఇది అన్ని సంప్రదాయములవారును సమానముగా అంగీకరించు సిద్ధాంతము. కాబట్టి ఈ ఒక్క భావమును గురించి మిక్కిలి శ్రద్ధగా విని జ్ఞప్తి నుంచుకొనవలయునని మిమ్ము కోరు చున్నాను. భారతదేశమున ఈ భావము సర్వమునకును పునా దిగా ఉన్నది. పాశ్చాత్య ప్రపంచమున జర్మనుతత్త్వవేత్తలును, ఆంగ్ల తత్త్వజ్ఞులును స్థూల పరిణామసిద్ధాంతమును బోధించుట మీరు వినియేయుందురు. అన్ని జంతువుల శరీరములును ఒక్క రీతివే అని ఆ సిద్ధాంతము. ఒకే వర్గమునకు చెందిన శరీరములును భిన్న భిన్నములుగ ఆకృతిపొంది వ్యక్తమగుచున్నందున విభేదము లేర్పడుచున్నవి. కాని అత్యల్పక్రిమి మొదలు అత్యుత్తమ జీవి యగు మానవోత్తముని వఱకు శరీర మొక్కటియే. ఒక్కటియే ఇంకొకటిగా ఇంకొకటిగా మాఱుచు పైపైకిపోవుచు శ్రేష్ఠతర రూపమును తాల్చును. తుట్టతుదకు పరిపూర్ణతను పడయును.

మనలోకూడ ఆ సిద్ధాంతము కలదు. "జాత్యంతర పరిణామః ప్రకృత్యా పూరాత్" అని పతంజలియోగి తెల్పియే యున్నాడు. అన్నియు ఒక్కటే శ్రేణికి చెందియున్నవి. జాతి యనగా శ్రేణియే. ఒకటి ఇంకొకరకముగా మాఱుచుండును. ఇదియే పరిణామము. ఒక రకము ఇంకొకరకముగా ఏర్పడుట వలె ఒకవస్తువు వేఱొక వస్తువుగా మాఱుటకే పరిణామమని అర్థము. యూరపియనుల కును మనకును భేదము ఎక్కడనున్నది? "ప్రకృత్యా పూరాత్" అనగా "ప్రకృతి పూర్ణతను పొందుట వలన" అని పతంజలి తెలిపియున్నాడు. స్పర్థవలనను అనగా పోటీపడుట వలనను, స్వాభావికమగు స్త్రీ పురుష జాతి ఆకర్షణవలనను శరీరము రూపాంతరము పొందుచున్నదని యూరపియనులు చెప్పుచున్నారు. పతంజలి సూక్తియందు యూరపియన్ సిద్ధాంతముకంటె సూక్ష్మ తర పృథక్కరణమును గాఢతర పరిశీలనమును కనబడుచున్నది. ప్రకృతి పూర్ణతపొందుట అనగా నేమియో ఇప్పుడు విచారింతము. అత్యల్ప సూక్ష్మ జీవి క్రమక్రమముగా శ్రేష్ఠతర జీవియగుచు ఒక బుద్ధుడుగా నేర్పడు పర్యంతము మారుచు పోవునని మనమును ఒప్పుకొనుచున్నాము. ఒక యంత్రములో క్రియను ఏదో యుక రూపమున, అంతకుముందు మనము ప్రవేశపెట్టియుండనిచో ఆయంత్రము ఏ 'క్రియ'ను చేయజాలదు. శక్తి ఎన్నిరూపములతో వ్యక్తమైనను దాని పరిమాణమొక్కటే. దానికి మార్పురాదు. ఒకరూపమున కొంత శక్తిని మనము పొందకోరినచో అంత శక్తిని వేరొక రూపమున వ్యయించి తీరవలయును. కాబట్టి ఉన్న శక్తి పరిమాణ మొక్కటే. ఒక సూక్ష్మజీవి పరిణామము పొంది బుద్ధుడయ్యె ననుకొనుడు. ఆ సూక్ష్మజీవియు నిజమునకు బుద్ధుడే. సూక్ష్మజీవియే బుద్ధుడుగా పరిణమించెనేని ఆ సూక్ష్మజీవి సంకోచము పొందిన బుద్ధుడే అయి యుండవలయును. ఈ విశ్వము అనంతశక్తిరాశియొక్క వికాసమేమైనయెడల, ఈ జగత్తు ప్రళయ దశ యందున్నప్పుడు సంకోచము పొందిన ఆ అనంత శక్తిరాశియే

అయి యుండవలయును. వేఱువిధమగుటకు వీలులేదు. అందువలన ప్రతిజీవాత్మయు అఖండ మనియే తేలుచున్నది. మన కాలిక్రింద మిలమిలలాడు చిన్నపురుగు మొదలు మహోన్నతులగు మహా ఋషులవఱకునుగల అందఱి యందును ఈ అఖండ శక్తియు, అఖండ నైర్మల్యమును, అఖండ సర్వమును ఉన్నవి. భేదమంతయు వికా సమునందలి తారతమ్యమే. చిన్నపురుగు ఆ శక్తియొక్క అతి స్వల్పాంశమును మాత్రమే ప్రకటించుచున్నది. నీవు దానినే ఎక్కువగా ప్రకటించుచున్నావు. ఒక మహాఋషి దానిని ఇంకను ఎక్కువగా ప్రకటించుచున్నాడు. ఇంతియే భేదము. కాని ఆ అఖండశక్తి ఏకరీతిగనే నిలిచియున్నది. "తతః క్షేత్రక వత్ — కృషికుడు తన పొలమునకు నీరు పెట్టుట వంటిది." అని పతంజలి వచించియున్నాడు. కర్షకుడు ఎక్కడనో ఉన్న చెఱువునుండి ఒక మూల చిన్నగండి ద్వారమున తన పొలమునకు నీరు పెట్టుకొనును. ఆ నీరు ఒక్కసారిగా తనపొలము లోనికి వేగముగా వచ్చి పడకుండ ఆపునిమిత్తము దానికొక తలుపునుకూడ అమర్చి యుండ వచ్చును. అతనికి నీరు కావలసి వచ్చునపుడు ఊరక ఆ తలుపును తెఱచిన చాలును. ఆ నీరు తనస్వశక్తి వలననే వచ్చి పడును. ఆ శక్తికి ఇతరమేమియు క్రొత్తగా చేర్చవలసినది లేదు. అది ఆ చెఱువులో ఇదివఱకే యున్నది. ఈ విధముగా మనలోని ప్రతి వానికిని, ప్రతిజీవికినికూడ మూలాధారముగా అనంతశక్తియు అనంత పావనత్వమును, అనంతానందమును అనంతసత్త్వమును గలిగిన ప్రబలమగు ఒక చెఱువు ఉన్నదన్న మాటే; కాని వెల్లువ నరికట్టు లాకు తలుపులవంటి ఈ శరీరములు ఆ స్వస్వరూపమును సంపూర్ణముగా ప్రకటింపకుండ ఆపుచున్నవి.

తమోగుణము రజోగుణముగను రజోగుణము సత్త్వగుణ ముగను మాఱుచుండగా, ఈ శరీరములు అధికాధికముగా సూక్ష్మనిర్మాణము కలవి అగుచుండగా, ఈ శక్తియు ఈ నిర్మల

త్వమును అధికాధికముగ ప్రకాశమునకు వచ్చుచుండును. ఈ కారణముచేతనే ఆహారపానీయముల విషయమునకు భోజనాదిక విషయమునను మన పూర్వులు అత్యంత శ్రద్ధవహించిరి. వివాహ విషయమునందు వలెనే ఈ విషయమునందును పూర్వపుటాచారము, అభిప్రాయములు నేడు అదృశ్యమై పోయి ఉండవచ్చును. ఇప్పుడు అది ప్రసక్తము కాకున్నను భారతీయవివాహమును గూర్చి ఒక్క విషయము మాత్రము ముచ్చటింతును. ఇంకొక అవకాశమున్న'యెడల ఈ విషయమును గుఱించి విపులముగా ప్రసంగించెదను. వివాహవ్యవస్థనుగూర్చి మనకు గల అభిప్రాయములు ఉత్తమనాగరకతకు ప్రాతిపదికలుకాదగిన సిద్ధాంతములనిమాత్రము వక్కాణించు చున్నాను. అన్యసిద్ధాంతములు ఏవియు నాగరకములుకావు. ఒక పురుషుడుగాని, స్త్రీగాని, తనకు నచ్చిన స్త్రీని భార్యగాను తనకు నచ్చిన పురుషుని భర్తగాను నిర్ణయించుకొను స్వాతంత్ర్యమును అంగీకరించినయెడల, వ్యక్తిసౌఖ్యమును పశువాంఛాతృప్తియు విచ్చలవిడిగా విజృంభించుటకు సంఘమున అవకాశము కల్పించినయెడల, తత్ఫలముగా అనర్థము వాటిల్లి తీరును. దుష్టసంతానము పెరుగును. సంఘము దుష్టమై రాక్షసమయమగును. చూడుడు, ప్రతి దేశమందును నరుడు ఒకవైపున ఇటువంటి ఘోరసంతానమును వృద్ధిచేయుచున్నాడు, రెండవ వైపున, ఈ పశువులను అణచిపట్టుటకై పోలీసుబలమును పెంచుచున్నాడు. ఆ రీతిగా అనర్థమును ఎటుల నాశము చేయుటయా యనునది ఒక సమస్యగా నుండరాదు. ఈ యనర్థము యొక్క యుత్పత్తిని ఎటుల ఆపుటయా యనునది మనసమస్యగా నుండవలయును. నీవు సంఘములో నుండు నంతకాలము నీ వివాహము యొక్క ఫలమును సంఘము నందలి ప్రతివ్యక్తియు తప్పక అనుభవింపవలసి వచ్చును. కాబట్టి నీవు ఎవరిని వివాహముచేసికొనవచ్చునో ఎవరిని వివాహము చేసికొనతగదో నిర్ణయించుటకు సంఘమునకు అధికారము కలదు. ఈదేశమున ఇటువంటి ఉత్తమ

భావములు వివాహసిద్ధాంతమునకు మూలాధారముగ నున్నవి. దీనినే వధూవరుల జాతకచక్రమందురు. మనువు అభిప్రాయములో కామతృప్తివలన పుట్టినబిడ్డ ఆర్యుడు కాడనియే. ఏ బిడ్డయొక్క పిండోత్పత్తియు మరణమును వేదశాస్త్రానుగుణమగునో అతడే ఆర్యుడు. ప్రతిదేశమునను ఇట్టి ఆర్యసంతానము తగ్గిపోవుచున్నది. తత్ఫలముగ అధర్మవృద్ధి యగుచున్నది. దానినే మనము కలియుగ మనుచున్నాము. మనమీ ఆదర్శముల నన్నింటిని పోగొట్టుకొని నాము. ఈ సిద్ధాంతముల నన్నిటిని ఈ నాడు పూర్తిగా ఆచరణలో పెట్టజాలమనుటయు సత్యమే, ఈ సద్భావములను అపహాస్యరూపమునకు తెచ్చితి మనుటయు తథ్యమే. నేటి తల్లులు, తండ్రులు, పూర్వకాలమునాటి తలిదండ్రులవంటివారు కాకుండుట శోచనీయము. మఱియు సంఘమునకు వ్యక్తులయెడ పూర్వముండి యున్నట్టి ప్రేమయు ఇప్పుడు లేదు. కాని ఆచరణలో దోషములున్నను ధర్మసిద్ధాంతము మాత్రము నిర్దుష్టముగనే యున్నది. అనుష్ఠానమున లోపము గలిగి ఒక ఆచారము నిరుపయోగమైన యెడల ధర్మసిద్ధాంతమును చేపట్టి ఆచరణను సవరింపుడు. ధర్మసిద్ధాంతమునే ఏల నాశము చేసెదరు? ఆహార విషయమునను ఇదే స్థితి వాటిల్లినది. అనుష్ఠానాచార వివరములును, చాల చెడిపోయినవి. బొత్తుగ చెడిపోయిన వనుటయు నిజము. అంత మాత్రముచేత ధర్మసూత్రమునకు హానిలేదు. ధర్మము సనాతనమై నిలిచి యుండవలసినదే. దానిని సవ్యమార్గమున పెట్టి అనుష్ఠానమును సంస్కరింపుడు.

భారతదేశమున, ప్రతిసంప్రదాయము వారును ఆత్మ విషయమున విశ్వసించు ఒక గొప్ప సిద్ధాంత మిది. ద్వైతులు మాత్రము దుష్కర్మలచే ఆత్మ సంకుచితమైనది అని చెప్పుదురు. అనగా దాని శక్తులన్నియును దుస్స్వభావమువలన ముకుళించుకొనును; మరల సత్కర్మలవలన వికసించును. అద్వైతసిద్ధాంత

ప్రకారము ఆత్మ ఎన్నడును ముకుళించుకొనదు, వికసించుటయు లేదు; కాని అటుల జరుగుచున్నట్లు మాత్రము కాన్పించును. అది ముకుళించుకొనినట్లు అనగా సంకుచితమైనట్లు కాన్పించును; అంతే భేదము. కాని సర్వశక్తులును ఆత్మయందు ఇదివఱకే యున్నవి. బయటనుండి ఏమియు దాని లోనికి వచ్చుటలేదు. ఆకాశమునుండి దానిలోనికి ఏమియు ఊడి పడదు. ఈ భావమును అందఱును ఒప్పుకొందురు. మన వేదములు వెలుపలనుంచి లోపలికి వచ్చునవి కావనియు, లోనుండి వెలుపలికి వికసించి వచ్చున వనియు, అవి ఎక్కడనుండియో వచ్చునవి కాక ప్రతి ఆత్మయందును శాశ్వతముగా నుండు ధర్మములే యనియు గుర్తుంచుకొనుడు. వేదములు చీమయొక్క ఆత్మలోనున్నవి. దేవతయొక్క ఆత్మలోను ఉన్నవి. చీమ పరిణామము పొంది ఋషి శరీరమును పొందవలయును. వేదములు వానియంతట అవియే వెలువడి వచ్చును. ఆ శాశ్వతధర్మములు వానియంతట అవియే ప్రకాశించును. మన శక్తియంతయు ఇదివఱకే మనదై యున్నది. మన మోక్షము ఇదివఱకే మనలో ఉన్నది. ఈ మహాసిద్ధాంతమును మనము గ్రహింపవలయును. మన ఆత్మ సంకుచితమైనదే అనుకొనుము; మాయయొక్క ముసుగుతో కప్పబడినదే అనుకొనుము. అది అంతగా పాటింప దగిన విషయము కాదు. అధమాధమ నరుని యందు సైతము బుద్ధుని యందుగల ప్రతిభయే కలదనెడు సిద్ధాంతము ఇదివఱకే యున్నది. మీరు దానిని విశ్వసింప వలయును. ప్రతివాని యోగ్యతను విశ్వసింపవలయును. ఆత్మను గుఱించిన పరమసిద్ధాంత మిదియే.

ఇప్పుడు గొప్ప పోరాటమొకటి సంభవించుచున్నది. మన వలెనే బౌద్ధులును శరీరమును పరిశోధించి అది ఒక విధమగు జడ ప్రవాహమనియు, మనస్సును పరిశోధించి అది మఱొక జడ ప్రవాహమనియు కనుగొనిరి. ఇక ఆత్మ విషయమును పరిశోధిం

చుట అనవసరమని వారిమతము. కాబట్టి ఆత్మ అను నొకటి కలదని ఊహించుటే అనావశ్యకము. "జడ పదార్థములోడను ఆ పదార్థమునకు అంటియుండు గుణములతోడను మనకేమి పని? అవి గుణములు మాత్రమే అని చెప్పుదుము. ఒక్క కారణమే సర్వమును వివరించుచుండగా రెండు కారణములు కలవని యూహించుట అవివేకము" అని వారందురు. ఇక పోరాటములు సాగినవి. ద్రవ్యమునకు సంబంధించిన సిద్ధాంతము లన్నిటిని బౌద్ధులు నేలకూల్చిరి. "నీకొక ఆత్మకలదు. నాకొక ఆత్మకలదు. ప్రతివానికిని మనస్సునకును శరీరమునకును భిన్నమగు ఒక ఆత్మ కలదు. ఇట్లు ప్రతివానికిని ఒక వ్యక్తిత్వము ఉన్నది" అనెడు ద్రవ్యగుణ సిద్ధాంతమును నమ్మువారెల్లరు చెల్లాచెదరైరి.

మనము చూచినంతవఱకు ద్వైతుల సిద్ధాంతము సరిగనే యున్నది. శరీరమొకటి యున్నది. మనస్సు, లేక సూక్ష్మశరీరము ఉన్నది. ఈ ఆత్మ ఉన్నది. అన్ని ఆత్మలలోను నిండి అంతర్యామియై పరమాత్మ యున్నాడు. సరే ఇక్కడ ఒక చిక్కు తటస్థించుచున్నది. ఆత్మ పరమాత్మలు రెండును ద్రవ్యములు. వానికి మనస్సు శరీరము ఇంకను ఇతరద్రవ్యములు వేర్వేఱు గుణముల వలె అంటుకొని యుండునని అందురు. ఎవరును ఎన్నడు గాని ద్రవ్యమును చూచినవారు లేరు. దానిని ఊహ చేయగలవారును లేరు. ఇట్టి ద్రవ్యమును గుఱించి ఆలోచించిన ప్రయోజనమేమున్నది? క్షణికవాదియై 'ఉన్నది మానసికప్రవాహముల పరంపర మాత్రమే, మఱేమియులేదు' అని ఏల అనకూడదు? ఈ ప్రవాహములు ఒకదానికొకటి అంటుకొనిపోవు; అవి ఒకటిగా కలిసిపోవు. సముద్రము నందలి తరంగములవలె ఒకదాని వెంట నొకటి వచ్చుచుండును. అవి ఎన్నడును పూర్తి కావు. ఎన్నడును ఒక్కటిగా కలిసిపోవు. నరుడనగా ఇట్టి తరంగముల పరంపర. ఒక తరంగము పోవునప్పుడు ఇంకొకదానిని కల్పన చేయుచుండును.

ఈ తరంగరూపములు ఆగిపోవుటయే నిర్వాణమనబడును. ఈ వాదము ఎదుట ద్వైతవాదము, వేదసిద్ధాంతము మౌనము వహింపవలసినదేగదా! ఏమని వాదము చేయుటకును సాధ్యము కాదు. ద్వైతుల దేవుడు సైతము ఇక్కడ నిలువజాలడు. సర్వవ్యాపి యయ్యును దేవుడు ఒక పురుషుడై చేతులు లేకుండ సృష్టి చేయుననుట కాళ్ళు లేకుండ నడచుననుట మొదలైన భావములును, కుమ్మరి కుండలు చేయువిధమున ఆ దేవుడు ఈ జగత్తును సృష్టి చేయుచున్నాడను సిద్ధాంతమును అర్థములేని బాలప్రలాపములని బౌద్ధులు పల్కుచున్నారు. 'అట్టి దేవుడు ఎవ్వడైన ఉండిన యెడల ఆ దేవునితో నేను పోరాడుదును గాని పూజింపను' అని బౌద్ధమతస్థుడు నిగ్రహించి పల్కును. ఈ జగత్తు దుఃఖముతో నిండియున్నది. ఇది భగవంతుని పనియైనయెడల అట్టి భగవంతునితో మేము యుద్ధము చేసెదము. రెండవది, ఇట్టి భగవంతుడు ఉండుట సహేతుకము కాదు. అసంభవమని మీరందఱును ఎఱుంగుదురు. సృష్టి రచనాసిద్ధాంతములోని లోపముల గుఱించి మనము ప్రస్తావింప నక్కఱలేదు. మన క్షణికవాదులు వారి బండారము పూర్తిగ బయటపెట్టిరి. ఈ విధముగా సగుణబ్రహ్మము విచ్ఛిన్నమై పోవుచున్నాడు.

సత్యము, అనన్యమగు సత్యమే, అద్వైతియొక్క ధర్మసూత్రము. "సత్యమేవ జయతే నానృతం; సత్యేనైవపంథా వితతో దేవయానః" (సత్యమే జయించును, అసత్యము జయింపదు; దేవయానమార్గము సత్యము ద్వారమున పోవుచున్నది). ప్రతివాదును ఈ సత్యమును నమ్మియే నడచుచున్నాడు. కాని నీకంటె దుర్బలుని వాదమును నీ వాదబలముచేత నలిపివేయుటకే ద్వైతసిద్ధాంతము నుపయోగించుకొనుచున్నావు. పాపము ఏదో ఒక విగ్రహమును పూజచేసికొనువానితో ఊరక తగవు పెట్టుకొనుచున్నావు. నీది ఒక అద్భుత తర్కవాదమనియు ఎదుటి

వానిని సులభముగా కలవరపెట్టగలననియు తలంతువు. కాని అతడు ఎదురుతిరిగి నీ సగుణబ్రహ్మమును తుత్తునియలు చేసి అది కేవల ఊహాజన్యమగు ఆదర్శమేయని పల్కునెడల నీకు గతి ఏమున్నది? నీవు ఏదో ఒక నమ్మకమును ఆధారముచేసికొని ఇతరులు నాస్తికులని మొఱలిడుదువు; అది తాతలనాటి దుర్బలుని మొఱయే యగును. అతడు తన్ను ఓడించినవానినెల్ల నాస్తికుడని పల్కును. నీవు తర్కమునాశ్రయించినయెడల పూర్తిగ తర్కము ననుసరించియే నడువుము; లేదా నీయెడల ఇతరులు అంగీకరింపవలయునని నీవు కోరుకొను నీతులనే ఇతరులయెడలను నీవు అంగీకరింపుము. దేవుడు కలడని నీ వెట్లు రుజువుచేయగలవు? నిజమునకు దేవుని ఉనికికి రుజువే లేదు. పైగా వాని ఉనికికి విరుద్ధముగా ప్రబలములగు వాదములు కలవు. నీ దేవుడు, వాని గుణములు, ద్రవ్యమయములగు అనేక ఆత్మలు, ప్రతి ఆత్మ, ఒక ప్రత్యేకవ్యక్తి— వీనినన్నిటిని సమర్థించుకొనుచు, నీ దైవమును గుఱించి నీవెట్లు రుజువుచేయుదువు? నీ వొక ప్రత్యేకవ్యక్తివా? ఎట్లు? నీవు ఒక శరీరమవు కాదుగదా! ఆ సూర్యునిలో ఒకప్పుడు నిండియున్న ద్రవ్యము ఇప్పుడు నీలోనున్న ద్రవ్యముగా మాఱియుండవచ్చును. ఇప్పుడు నీలోనున్న ద్రవ్యము వెలువడిపోయి ఆ చెట్టులోని ద్రవ్యముగా ఏర్పడవచ్చును. అట్టి సందర్భములలో నీ వ్యక్తిత్వము ఎక్కడ? నేను పుల్లయ్యననియో వెంకయ్యననియో చెప్పుకొనునది దేనిని? మనస్సు విషయమునను ఇట్లే యున్నది. నీ వ్యక్తిత్వము ఎక్కడ? ఈ రాత్రి నీ భావము ఒకతీరుగా నున్నది. రేపు మఱొక తీరుగా నుండును. నీవు పసివాడవుగా నున్నప్పటివలె ఇప్పుడు భావన చేయుటలేదు. ముసలివారు పడుచువారివలె ఆలోచింపరు. ఇక నీ వ్యక్తిత్వము ఎచ్చటనున్నది? అది ఈ యహంకారమందు కలదనకుము. ఏలయన అది నీ ఉనికియందు ఒక అల్పభాగమే అగును. నేను ఇప్పుడు మీతో మాటాడుచుండగా నా యింద్రియములన్నియు పనిచేయుచున్నవి. నాకు

ఆ గుర్తులేదు. గుర్తు తగులుటయే అవి యున్నవనుటకు రుజువగు నెడల అవి నా గుర్తునకు వచ్చుటలేదు కావున అవిలేవనియే చెప్ప వలసివచ్చును. ఇక మీరును మీ సగుణదైవత సిద్ధాంతములును ఎక్కడ నిలువగలవు? అటువంటి దేవుడున్నాడని మీరెట్లు రుజువు చేయగలరు?

బౌద్ధులు మరల ఎదురువచ్చి అట్టిభావము సహేతుకము కాదనియు అవి నరుని పిఱికివానినిగా చేసి వెలుపలనుండి వచ్చు సాహాయ్యముకొఱకు దేవురింపచేయుననియు, అట్టిసాహాయ్యమును ఒసగువాడు ఎవ్వడు లేడనియు, కాబట్టి అట్టిబోధ నీతిబాహ్య మనియు పలుకుదురు. "ఇదిగో జగత్తు కాన్పించుచున్నది. నరుడు దానిని నిర్మించినాడు. ఇంక ఎవడును ఎన్నడును చూడనట్టి, ఎన్నడును గుర్తించనట్టి, ఎన్నడు మనకు సాహాయ్యముచేయనట్టి, ఒక వ్యక్తి మనకు బాహ్యమున ఎక్కడనో కలడను ఊహల మీద ఆధారపడియుండుట ఎందులకు? మీరు వ్యర్థముగ పిఱికి వారైపోనేల? మీ బిడ్డలకు, కుక్కలవలె పూర్ణవిశ్వాసముతో నుండుటయే నరునకు ఉత్తమోత్తమదశయని చెప్పనేల? కేవలము ఊహచేత ఒక భూతమును కల్పించుకొని వాని యెదుట దీనముగ నిలిచి 'మేము దుర్బలులము. అపవిత్రులము. ఈ జగత్తులో దుష్టత్వమెల్ల మాలోనే మూర్తిభవించినది' అని చెప్పుకొనుడని వారలకేల నేర్పెదరు? "మీరు అబద్ధములాడుచున్నారు. మీ బిడ్డల నెత్తిమీద మహాదోషమును తెచ్చిపెట్టుచున్నారు" అని బౌద్ధులు నిందింతురు. ఏమందురా? "ఈ ప్రపంచము భ్రాంతిచే కలుగు చున్నది. మీరు ఎటుల భావనచేసిన అటులే అయిపోవుదురు. ఎటుల సంకల్పించుచున్నారో అటులే యున్నారు. ఎటుల సంక ల్పింపబోవుదురో అటులే యుందురు" అను పలుకులే మొట్ట మొదట బుద్ధభగవానుని ముఖమునుండి వెలువడినవి. కావున మే మెందుకును కొఱగామనియు, ఎక్కడనో మబ్బులకావల

కూర్చుండు నెవ్వడో సాహాయ్యము చేసినగాని ఏమియు చేయజాల మనియు చెప్పుకొనకుడు. అటులగునేని దినదినము మీరు అధి కాధికముగా దుర్బలులై పోవుటయే తటస్థించును. "స్వామీ! మేము అపవిత్రులము; మమ్ములను పవిత్రులనుగా చేయుము" అని పలుమారు ప్రార్థన సల్పుటవలన మీరు భ్రాంతిబడి పోయి నానావిధములగు దోషకార్యములు చేయుదురు. ఇట్టి సగుణ దైవతము ఒకడు కలడను భావమువలననే, ఇప్పుడు ప్రతి సంఘ మునను గోచరించు దోషములలో నూటికి తొంబదివంతులు కలుగుచున్నవని బౌద్ధులు చెప్పుచున్నారు. ఈ జీవితపరిణామము యొక్క ముఖ్యగమ్యార్థము ఈ అద్భుతజీవనపరిణామము. సేవాక కుక్కవై పోవుటే యగునెడల అది మానవజన్మ ఎత్తినవానికి తగని ఘోరసంకల్పమగును. "వైకుంఠము అనెడు తావునకు పోయి అక్కడ నివసించు దేవునియెదుట సర్వకాలము చేతులు జోడించుకొని దీనముగా నిలువబడి యుండుటయే నీ జీవిత గమ్యార్థ మగునెడల ఆత్మహత్య చేసికొని చచ్చుట మేలు" అని బౌద్ధులు వైష్ణవునితో వాదింతురు. అందువలననే తాము ఈ స్థితినుండి తప్పించుకొనుకొఱకే నిర్వాణమనెడు శూన్యస్థితిని సృష్టిచేయు చుంటిమని వారు చెప్పుదురు. అద్వైతభావములన్నియు ప్రజలను నీతిబాహ్యులనుగా చేసివేయుచున్నవని ఈ కాలమున వాదనలు బయలుదేరుటవలన, నేను మాటల వరుసను బౌద్ధునివలె ఈ భావ ముల నన్నిటిని ఊరక మీ యెదుట పెట్టుచున్నాను. ఆ రెండవ పక్షము ఎటుల నుండునో చూపుటకు ప్రయత్నించుచున్నాను. రెండు పక్షములను ధైర్యసాహసములతో మనము విమర్శించి చూతముగాక.

'ఒకానొక సగుణదైవతము జగమును సృష్టిచేయుచున్నాడు' అనెడు సిద్ధాంతమును ఋజువుచేయుటకు వీలులేదని మొదటనే మనము తెలిసికొంటిమి. ఈనాడు అట్టిమాటను పసివాడైనను

విశ్వసించునా ? కుమ్మరి కుండలు చేయుచున్నాడు. అటులే బ్రహ్మదేవుడు ప్రపంచమును సృష్టిచేయుచున్నాడు అని చెప్పుటయా ? అటులైన యెడల మీ యూరి కుమ్మరియు ఒక దేవుడే అగును. అతడు తలగాని చేతులుగాని లేకుండ పనిచేయునని ఎవడైన చెప్పునెడల వానిని పిచ్చివారి చికిత్సాలయమునకు పంపవచ్చును. ఈ జగత్తునకు సృష్టికర్త యనెడు నీ సగుణబ్రహ్మ నీ మొఱలను నీవు బ్రతికియుండగా ఎన్నడైనను ఆలకించి సాహాయ్యము చేసి యున్నాడా ? ఇది ఆధునిక శాస్త్రము చేయు మఱియొక ఆక్షేపణ. నీకు లభించు సాహాయ్యమంతయు నీ స్వంత ప్రయత్నమువలననే లభింపగలదనియు, ఇటుల మొఱలిడుటవలన నీవు వ్యర్థము చేసికొను శక్తిని అటుల దేవురించుచు మొఱలిడుటకంటె శ్రేష్ఠతరముగా వినియోగించుకొనగలవనియు వారు రుజువు చేయుదురు. మఱియు సగుణదైవతము కలడను నమ్మకముతోపాటు అధికార పీడనమును అర్చకుల వ్యాపారమును బయలుదేరునని మనకు తెలియును. అధికార పీడనమును, పూజారుల ప్రభయు, ఈ విశ్వాసము కలిగిన చోటులనెల్ల ప్రబలుచునే యున్నవి. ఈ భ్రాంతిని నెత్తిమీద మొట్టి అణచివేసిన గాని ఈ పీడ తొలగదని బౌద్ధులు గట్టిగ వాదించుచున్నారు. ఒక అలౌకికపురుషుని యెదుట నరుడు వణకుచు నిలుచుండవలసినదే అని తలంచునంత కాలము, పాపము ఈ నరులు ఎవరో ఒక పురోహితుని బ్రతిమాలుకొని, భగవంతుని యెదుట తమకు అండగా నిలిచి అనుగ్రహము సంపాదించి పెట్టుమని కోరుకొనుచునే యుండవలెను. అంతకాలమును నరులు తమ యెదుట గడగడలాడుచుండవలసినదే యనియు తమకు గొప్ప అధికారములు అర్హతలు కలవనియు ఈ పూజారులు చెప్పుకొనుచునే యుందురు. మీరు బ్రాహ్మణుని దూరముగ నెట్టివేయవచ్చును. కాని నా మాటను నమ్ముడు. అటుల చేయించువారు తామే ఆ బ్రాహ్మణ స్థానము నాక్రమించి ఇంకను ఎక్కువ పీడాకరులగుదురు. ఏలయందురా ? బ్రాహ్మణునియందు కొంత

ఉదారస్వభావము కలదు. కాని హఠాత్తుగా గణ్యతలోనికి వచ్చిన ఈపురుషులు అత్యధికముగా పీడించువారుగా నుందురనుట సత్యము. ఒక దరిద్రునకు హఠాత్తుగా ధనము చేజిక్కినయెడల ప్రపంచము నంతను గడ్డిపఱకవలె చూడసాగును. కాబట్టి సగుణదైవతము నందు మనకు విశ్వాస మున్నంతకాలము ఈ పూజారులును ఉండియే తీరుదురు. ఇక సంఘమునందు ఉదాత్తమగు నీతి ఉండుట అసంభవము. పూజారివృత్తియు పీడనమును ఒకదాని నంటి ఒకటి ఉండియే తీరును. అట్లైన ఈ వృత్తి ఎందు కేర్పడి నది? ఎందుకనగా పూర్వము కొందఱు బలాఢ్యులు ప్రజలను తమ చేతిక్రిందికి తీసికొని 'మేము చెప్పినటుల మీరు వినుడు, లేదా మిమ్ములనాశము చేసెదము' అని భయపెట్టిరి. ఇదియే జరిగిన కథ. ''సభయం వజ్ర ముద్యతమ్''—ఈ భావము తనకు లోబడని ప్రతివానిని చావకొట్టు పిడుగును పైబడవేయుటవలె నున్నది.

బౌద్ధమతస్థుడు '''సర్వమును కర్మసూత్రము ననుసరించి ఫలించును' అనునంతవఱకు నీ భావము ఎంతయు సహేతుకము గనే యున్నది'' అనును. అనంతమగు జీవాత్మలు కలవనియు ఆ జీవాత్మలకు జననమరణములు లేవనియు మీరు నమ్ముదురు. అసంఖ్యాకములగు జీవాత్మలు కలవనుటయు, కర్మసూత్రవిశ్వాస మును, తర్కసమన్వితములనుటకు సందియములేదు. ఫలము నీయని కారణమే యుండజాలదు. ప్రస్తుతదశకు కారణము పూర్వదశయం దుండితీఱును. ఈ ప్రస్తుతదశకు ఫలముగా భావి కాలపుదశ యేర్పడును. కర్మ జడమనియు, చైతన్యము కాదనియు, కాబట్టి ఈ జడకర్మను ఫలప్రదము చేయుటకు చైతన్యము అవసర మనియు హిందువు చెప్పుచున్నాడు. అటులనా? చెట్టును ఫలింప జేయుటకు చైతన్యము అవసరమగుచున్నదా? నేను ఒక బీజమును భూమిలో నాటి కొంచెము నీరు పోసినయెడల చాలును. చైతన్యము అవసరమగుటలేదే! అచ్చట అధిష్ఠానచైతన్యము కలదని మీరు

చెప్పవచ్చును. కాని ఈ జీవాత్మలు ఆ అధిష్ఠానచైతన్యమే గదా! ఇక ఏమియు అవసరముండదు. మానవుల జీవాత్మలకు సైతము ఆ అధిష్ఠానచైతన్యము కలదుగదా! ఇంకను దేవుడొకడు అవసర మనుట ఎందుకు అని జైనులు వాదించుచున్నారు. వారు బౌద్ధుల వలె గాక జీవాత్మలు కలవని ఒప్పుకొందురు కాని భగవంతుడు కలడని విశ్వసింపరు. మీ తర్కమెక్కడ? మీ నీతిధర్మమెక్కడ? సరే, మీరు అద్వైతమతమును పరిశీలించి అది అవినీతికి మార్గము చూపునని భయపడినయెడల భారతదేశములోని ద్వైతసాంప్రదాయులు ఏమిచేయుచున్నారో కొంచెము చూడుడు. అద్వైతులలో ఇరువదివేలమంది తుంటరులు ఉన్నయెడల ద్వైతులలోకూడ ఇరువదివేలమంది తుంటరులు ఉన్నారు. సామాన్యముగ ద్వైతులలోనే తుంటరులు ఎక్కువమంది యుందురు. ఎందుకనగా అద్వైతమును గ్రహించుటకు కొంచెము ఎక్కువ బుద్ధిమంతులు అవసరము. అద్వైతులు సామాన్యముగా భయపడి దేనికిని లోబడరు. ఇక హిందువులగు మీకు మిగులునదేమున్నది? బౌద్ధుల పిడికిటిలో చిక్కకుండ మీకు రక్షణ లేదు. మీరు వేదములను క్రోడీకరింపవచ్చును. కాని బౌద్ధులకు వేదములందు విశ్వాసము లేదు. అందువలన బౌద్ధులు "త్రిపీఠకములు వేఱువిధముగ చెప్పుచున్నవి. అవి ఆద్యంతములు లేనివి; అవి బుద్ధునిచేత వ్రాయబడినవియు కావు. బుద్ధుడే తాను వానిని ఆవృత్తి సలుపుచుంటినని, వల్లె వేయుచుంటినని చెప్పినాడు. ఈ త్రిపీఠకములు సనాతనములు. మా త్రిపీఠకములే సత్యములగు వేదాంతములు; మీ వేదములు సరియైనవి కావు; అవి బ్రాహ్మణ పురోహితులచేత కల్పింపబడినవి; కాబట్టి వానిని దూరముగ పారవేయుడు" అని విజృంభించి పలుకుదురు. మీరు తప్పించుకొను త్రోవ ఏది?

ఆ చిక్కనుండి తప్పించుకొను త్రోవ ఇది. ఆధ్యాత్మిక వాదరూపమగు మొదటి ఆక్షేపణను తీసికొనుడు. ద్రవ్యమును

గుణములును వేఱని గదా వాదింతురు. అవి అటుల భిన్నములు కావని అద్వైతి వచించును. ద్రవ్యమునకును గుణములకును మధ్య విభేదమేమియు లేదు. పురాతనసాదృశ్యమును మీరు ఎఱుగుదురు గదా! త్రాడు కాన్పించి పామను భ్రాంతి కలిగినది. పాము నీకు కనబడునంతవఱకు ఆ త్రాడు నీకు కనబడుటలేదు. ఆ త్రాడే అదృశ్యమై పోయినది. ఒక వస్తువును ద్రవ్యముగను గుణములుగను విభాగించుట తత్త్వవేత్తల మెదడులలోని ఒకానొక ఆధ్యాత్మిక విషయమని చెప్పవచ్చును. ఏలయన అవి యథార్థముగ వెలుపల నుండునవి కావు. నీవు సాధారణ మానవుడవేని గుణములనే చూడగల్గుదువు. నీవు మహాయోగివైన యెడల ద్రవ్యమును చూడగల్గుదువు. అంతియేగాని, ద్రవ్యమును గుణములను రెంటిని ఒకేకాలమందు నీ వెన్నడును చూడజాలవు. కావున బౌద్ధులారా! ద్రవ్యములని గుణములని మీరు సాగించు పోరాటమంతయు గొప్ప పొరపాటు. యథార్థవిచారణకు అది నిలువజాలదు. ద్రవ్యము నిర్గుణమందువేని అది ఒక్కటిగ మాత్రమే యుండగలదు. నీవు ఆత్మనుండి గుణములను వేఱుచేసి, ఈ గుణములు నిజముగా మనస్సునందు ఉండునవి అనియు, అవి ఆత్మమీద ఆరోపణ చేయబడినవనియు చెప్పుదువేని, ఇక రెండు ఆత్మలుండజాలవు. గుణములు మాత్రమే ఒక ఆత్మను ఇంకొక ఆత్మనుండి వేఱుచేయగల్గును. లేనిచో ఒక ఆత్మ ఇంకొక ఆత్మకంటె వేఱు అని నీవు భేదమును గుర్తించుటే ఎట్లు పొసగును? ఏవో కొన్ని భిన్నలక్షణములను కొన్ని గుణములను బట్టియే గదా భిన్నత్వమును గుర్తింపజాలుట? అటులగాక గుణములే లేనియెడల భిన్నత్వము ఎక్కడనుండి వచ్చును? కాబట్టి రెండు ఆత్మలుండజాలవు. ఉండునది ఒక్కటియే. ఇక మీ పరమాత్మ అనవసరము. ఈ ఆత్మయే అది. ఆ ఒక్క ఆత్మయే పరమాత్మ అనబడుచున్నది. ఆ ఒక్కటియే జీవాత్మ యనియు పిలువబడుచున్నది. ఇక సాంఖ్యులు మొదలగు ద్వైతులారా, మీరు ఆత్మ 'విభు' అనగా సర్వవ్యాపి అనెదరు

గదా! ఇక రెండు అఖండవస్తువులు మీ కెక్కడనుండి వచ్చును? అఖండమై యుండగలది ఒక్కటియేగదా? ఇంక ఇతరమేమున్నది? ఈ ఒక్కటియే అఖండాత్మమై యుండ దక్కిన సర్వమును దాని వ్యక్తరూపములే కావలయును. అంతటితో బౌద్ధమతస్థుడు ఆగిపోవుచున్నాడు. కాని వాదన ఇక్కడ ఆగిపోవుట లేదు.

అద్వైతసిద్ధాంతము పరిశోధనకు నిలువని కేవలదుర్బల వాదము కాదు. అద్వైతి ఇతరులను విమర్శించి నెట్టివేసి తన వాదమును దిట్టపఱచుకొనును. కాని ఆక్షేపణలను చేయుచు ఆ ఆక్షేపణల తోడను గ్రంథసాక్ష్యముల తోడను అతడు ఆగిపోడు. ఇదిగో ఇక్కడ నీవున్నావు. ఈ జగత్తును నిరంతర చలనముగల వస్తువుగా నీవు చెప్పుచున్నావు. సృష్టియందు అనగా ఖండదశయందలి ప్రతిదియు చలించుచునే యున్నది. నీవు చలించుచున్నావు. ఈ బల్ల చలించుచున్నది. సర్వత్ర చలనము గలదు. ఇది సంసారము; అనగా నిరంతరచలనమే. అందువలననే దీనిని జగత్తు అనుట. కాబట్టి ఈ జగత్తునందు వ్యక్తిగా నుండగలది ఏదియును లేదు. వ్యక్తిత్వము అనగా మార్పు లేకుండుట. సవికారమగు వ్యక్తిత్వము ఉండజాలదు. ఆ మాటయే అర్థరహితమైనది. వికారము, వ్యక్తి అను పదములు ఒకదానికొకటి విరుద్ధమైనవి. ఈ మన చిన్న ప్రపంచములో ఈ జగత్తులో వ్యక్తి యనదగిన వస్తువేదియు లేదు. సంకల్పము, అనుభవము, మనస్సు, శరీరము, నరులు, పశువులు, చెట్లు అన్నియు నిరంతర చలనదశ యందే ఉన్నవి. ఈ జగత్తంతయు ఒకే వస్తువుగా నీవు భావన చేయుదు వనుకొనుము. అప్పుడు అది మాఱగలదా? లేక చలింపగలదా? అట్లగుట ఏమాత్రమును పొసగదు. తక్కువ చలనము గల వేఱొకదానితో గాని లేక చలనమేలేని వేఱొక దానితో గాని పోల్చిచూచినప్పుడేగదా చలనము అనుదానిని గ్రహించుట సాధ్యము కాగలదు! కాబట్టి విశ్వమంతయు కలిసి

ఒకటే అయినప్పుడు, అది నిశ్చలముగనే నిర్వికారముగనే యుండును. అందువలన విశ్వమంతయు నీవై "నేను బ్రహ్మాండ మనే" అను సాక్షాత్కారము నీకు గలిగినప్పుడే, నీవు 'వ్యక్తివి' కాగలుగుదువు. అందువలననే 'ద్వైతమున్నంతవఱకు, అనగా రెండవది యున్నంతవఱకు భయము నశింపదు' అని వేదాంతులు చెప్పుచున్నారు. ఒకడు వేఱొకడు కలడని తలచుట మానినప్పుడే, ఇంకొకని యునికి వాని అనుభవమునకు రానప్పుడే, అనగా సర్వమును ఒక్కటియైనప్పుడే వాని భయము నశించును. అప్పుడే మరణము తొలగిపోవును. అప్పుడు మాత్రమే సంసార మంత రించును. కాబట్టి నరుడు విశ్వమయుడు అగునప్పుడే 'వ్యక్తి' కాగలుగును గాని ప్రత్యేకతతో నిలిచియున్నట్లు భావించుట మూలమున వ్యక్తి కాజాలడు అని అద్వైతసిద్ధాంతము తెలుపు చున్నది. నీవు సర్వమునైనప్పుడే అమృతుడ వగుదువు. నీవు విశ్వము అయినప్పుడే జనన మరణముల భయము లేకుండపోవును. అప్పుడుమాత్రమే, నీచే విశ్వమని పిలువబడునది నీవు భగవంతు డని పిలుచునదిగను, "సత్-అస్తిత్వము" అని పేర్కొనునదిగను, మఱి నీవు సర్వము అని చెప్పునదిగను కాగలుగును! నీవును నీవంటి మనఃస్థితి గలవారందఱును, బహుళ తత్త్వముతో కూడిన ప్రపంచముగా చూచునది ఆ ఏకైక సద్వస్తువునే! కొంచెము పుణ్యకర్మచేసి ఉత్తమమగు మనఃస్థితిని సంపాదించుకొనిన జనులు, వారు మరణించునప్పుడు, ఆ ఏకైక సద్వస్తువునే స్వర్గముగ భావించి, అందు ఇంద్రుడు మొదలగువారిని చూతురు. ఇంకను శ్రేష్ఠతర కర్మచేసి శ్రేష్ఠతరస్థితికి వచ్చినవారు అదే సద్వస్తువును బ్రహ్మలోకముగా చూతురు. మఱియు పూర్ణత్వమును పడసిన వారు భూలోకమును చూడరు; దేవతాలోకమును చూడరు; ఏ లోకమును వారు చూడనేచూడరు. వారికి ఈ విశ్వమంతయు అదృశ్యమై పోవును. దానితావున బ్రహ్మము ఒక్కటియే నిలుచును.

ఈ బ్రహ్మమును మనము తెలిసికొనగలుగుదుమా? సంహితలోగల అఖండవస్తువు యొక్క వర్ణనను గుఱించి ఇదివఱకే చెప్పియుంటిని. ఇప్పుడు అంతర్యామునందు గల అఖండతత్త్వముయొక్క అనగా రెండవపక్షముయొక్క దర్శనమును చేయుదము. అది కాయికరూపమగు అఖండత్వము. ఇదియు సంకల్పరూపమగు అఖండత్వమే. అక్కడ ఆ అఖండతత్త్వమును భావరూపమగు భాషలో వర్ణించు ప్రయత్నము జరిగినది. ఇదిగో ఈ ప్రపంచము కాన్పించుచున్నది. దీనిని బ్రహ్మమే యని ఒప్పుకొనినను దీనిని మనము గ్రహింపగలుగుదుమా? "నేతి! నేతి!" (లేదు, లేదు). ఈ విషయమును మీరు విస్పష్టముగా అర్థము చేసికొనవలయును. లేనిచో మరల మరల సందేహము మిమ్ము బాధించుచుండును. ఇది బ్రహ్మము అయినయెడల దీనిని మనము గ్రహించుట యెట్లు? "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" (దేనివలన జ్ఞాత తెలిసికొనబడగలడు?) తెలిసికొనువాడు తెలిసికొనబడుట ఎట్లు? కన్ను సమస్తమును చూడగలుగును. అది తన్ను తాను చూచుకొనగలదా? మీ రీవిషయమును బాగుగ జ్ఞప్తినుంచుకొనవలయును. ఇందొక పెద్ద చరిత్ర యున్నది. మీపైని వచ్చిపడుచున్న పాశ్చాత్యవ్యామోహములన్నియు, 'ఇంద్రియజ్ఞానమును మించినది ఏదియు లేదు' అను ఏకైకసూత్రముమీద తమ ఆధ్యాత్మికభావములను నిర్మించుచున్నవి. ప్రాచ్యఖండమునందు మన వేదములయందు ఈ జ్ఞానము వస్తువుకంటె తక్కువదే. ఏలయన, అది సర్వదా పరిమితినే సూచించుచున్నది. మీరొకవిషయమును తెలిసికొనగోరిన తత్క్షణమే దానికి మీ మనస్సు హద్దుపెట్టుచున్నది. ముత్యపుచేప ముత్యమునుచేయు సాదృశ్యము జ్ఞప్తికి తెచ్చుకొని జ్ఞానమనగా పరిమితి యనియు, ఒకవస్తువును ప్రోగుచేయుట యనియు, దానిని మీ ఎఱుకలోనికి తెచ్చుకొనుట యనియు, అంతేగాని దానినంతను ఏకముగా దెలిసికొనుట కాదనియు, గ్రహింపుడని వేదములు చెప్పుచున్నవి. సమస్తజ్ఞాన

విషయమునను ఈ మాటయే సత్యము. అఖండతత్త్వము విషయమున మాత్రము దీని సత్యము కొలువడునా? సమస్త జ్ఞానమునకును లక్ష్యమగు బ్రహ్మమునకు నీవు పరిమితి పెట్టగలుగుదువా? సాక్షియగువానికి, ఎవరు లేనిది జ్ఞానము కలుగజాలదో అటువంటి ద్రష్టకు, ఎవనికి గుణములు లేవో అటువంటి పరమాత్మకు, ఈ విశ్వమునంతకును సాక్షియగు వానికి, మన ఆత్మలలోని సాక్షికి, ఎటుల అవధుల పెట్టగలుగుదువు? నీవు వానిని తెలిసికొనుట ఎట్లు? నీవు వానిని ఎట్లు బంధింపగలుగుదువు? ఈ సమస్తమును, ఈ బ్రహ్మాండమంతయు అటువంటి వెఱ్ఱిప్రయత్నముగ నున్నది. ఈ అఖండాత్మ తనముఖమును చూచుకొన బ్రయత్నించు చున్నటుల ఉన్నది. అత్యల్పజీవులు మొదలు అత్యుత్తమ దేవతలవఱకు ఆ పరమాత్మను ప్రతిబింబింపజేయు అద్దములవలె నున్నవి. ఆ పరమాత్మ ఇవి చాలక మానవ దేహములో జేరి, అదియు ఖండములో ఖండమనియు, సమస్తమును ఖండమే యనియు, ఇట్టి ఖండవస్తువులలో అఖండతత్త్వముయొక్క స్వరూపము వ్యక్తము కాజాలదనియు తెలిసికొనుచున్నాడు. అంతట తిరుగు ప్రయాణము ప్రారంభమగుచున్నది. దీనినే త్యాగము, వైరాగ్యము అనుచున్నాము. "ఇంద్రియములనుండి వెనుకకు మరలుడు; వెనుకకు తిరిగి పొండు; ఇంద్రియములవైపునకు పోవలదు" అనుటయే వైరాగ్యముయొక్క హెచ్చరిక. సర్వనీతిధర్మముల హెచ్చరిక ఇదియే! సర్వక్షేమమును కూర్చు హెచ్చరిక ఇదియే. ఏలయన, మన మతము ప్రకారము ఈ జగత్తు తపశ్చర్యయందు అనగా వైరాగ్యమునందు ప్రారంభమగుచున్నది. మీరు క్రమముగా మరలిపోయినకొలది ఆయా స్వరూపములు మీ ఎదుట ప్రత్యక్షమగుచుండును. వాని నన్నిటిని ఒకదాని తర్వాత నొకటిగా నెట్టివేసికొనుచు నీవు నీవై, నీ స్వరూపమున నిలుచువఱకు సాగి పోవుదువు. ఇదియే మోక్షము; ముక్తి.

ఇందలి భావమును మనము అర్థముచేసికొనవలసియున్నది. "విజ్ఞాతారమరే కేనవిజానీయాత్" (అనగా తెలిసికొనెడువానిని తెలిసికొనుట ఎట్లు?) తెలిసికొనెడువాడు తెలియబడజాలడు. ఏల యందురా? తెలిసికొనెడువాడు తెలిసికొనబడునెడల అతడు తెలిసికొనెడువాడు కాజాలడు. నీవు ఒక అద్దమునందు నీ కన్నులను నీవు చూచుకొనునెడల ఆ ప్రతిబింబము నీ కన్నులు కాజాలదు. అది వేఱొకటిగా నుండును. కేవలము ప్రతిబింబముగనే యుండును. అటులైన ఈ ఆత్మ ఈ అఖండ విశ్వాత్మ నీ స్వస్వరూపము, కేవలము సాక్షిగ నున్నయెడల దానివలన లాభమేమి? మనవలె అది జీవింపజాలదు. ఇటు అటు తిరుగజాలదు. ప్రపంచమును అనుభవింప జాలదు. ప్రజలు ఈ సాక్షి ఎటుల అనుభూతిచేయ గలదో అర్థము చేసికొన జాలకున్నారు. ఓహో! హిందువులగు మీరు ఈ సిద్ధాంతమును బట్టి సాక్షులుగనుంటి మందురేని స్థాణువులై పోవుదురు. ఎందుకును కొఱగానివారౌదురని ఆక్షేపణ వచ్చుచున్నది. మొట్టమొదట సాక్షియే అనుభవింపగలవాడని తెలిసికొనుడు. ముష్టియుద్ధము జరుగుచున్నపుడు దానిలోపాల్గొను వారా లేక వెలుపలనుండి చూచుచుండువారా ఆ యుద్ధమువలని ఆనందమును పొందునది? జీవితములో దేనియెడల నైనను నీవు సాక్షిగ నున్నకొలదిని అంత అధికాధికముగ దాని ఆనందమును పొందగలుగుదువు. ఇదియే ఆనందము. కాబట్టి నీ వీ జగత్తునకు సాక్షివైనప్పుడే అఖండానందము నీదికాగలదు. అప్పుడే నీవు ముక్తపురుషుడ వగుదువు. సాక్షిగానుండునతడు మాత్రమే ఏ కోరికయులేక స్వర్గమునకు పోవలయునను సంకల్పము సైతములేక, కీర్తిని గుఱించిన అపేక్షయులేక అపకీర్తిని గుఱించిన భయమునులేక పనిచేయగలడు. సాక్షి యొక్కడే ఆనందము ననుభవింపగలడు. వేఱొకడు అటుల అనుభవింపలేడు.

నైతిక పక్షముయొక్క విచారణకు దిగినప్పుడు, అద్వైతము నందలి ఆధ్యాత్మికపక్షమునకును నైతికపక్షమునకును మధ్య

ఒక విచిత్రవిషయము తలచూపుచున్నది. అదియే మాయా సిద్ధాంతము. అద్వైత సిద్ధాంతమునందలి ఈ ఒక్కొక్క అంశ మును అర్థము చేసికొనుటకు సంవత్సరములు పట్టును. వివరించి తెలుపుటకు నెలలు పట్టును. కాబట్టి నేను వానిని కొలదిగ ప్రస్తావించి సాగిపోవు నెడల మీరు క్షమింతురుగాక. అన్ని యుగములందును ఈ మాయాసిద్ధాంతమును అర్థము చేసికొనుట అత్యంతము కష్టముగా నుండినది. అది నిజముగా సిద్ధాంతమే కాదని నేను మీకు కొలది మాటలలో తెలిపెదను. అది దేశకాల నిమిత్తములు, అనగా స్థలము, సమయము, కారణము, అనెడు మూడు భావములయొక్క సమ్మేళనమై యున్నది. ఈ స్థలము, కాలము, కారణము, అనువానినే నామరూపములుగ మార్చి వ్యవహరింతురు. సముద్రమున ఒక తరంగము కలిగినదనుకొనుడు. ఆ తరంగము దాని ఆకారమునందును, పేరునందువు మాత్రమే ఆ సముద్రమునుండి భిన్నముగా నుండును. ఆ తరంగములేనిది ఆ ఆకారముగాని, ఆ నామముగాని, కలుగజాలవు. అవి తరంగ ముతో కలిసి మాత్రమే నిలువగలవు. ఆ తరంగము అణగిపో వచ్చును. అప్పుడు ఆ తరంగమునందు ఆరోపింపబడిన నామరూప ములును నాశమైపోవును. కాని అందలి నీరు మాత్రము నిలిచియే యుండును. అదేతీరున నీకును నాకును మధ్య, సర్వజంతువులకును నరునికినిమధ్య, దేవతలకునుమానవులకునుమధ్య, భేదమును కల్పిం చునది ఈ మాయయే. నిజమాలోచించిన యెడల ఈ ఆత్మను లక్షలకొలది జీవులలో పట్టువడునట్లు చేయునది ఈ మాయయే. ఈజీవులను నామరూపముల ద్వారమున మాత్రమే గుర్తించుటకు వీలగును. ఈ మాయను వదలివేసి ఈ నామరూపములను జార విడిచితివేని ఈ భేదమంతయు తుదముట్ట నశించిపోవును. అప్పుడు నీవు నీ స్వరూపముతో నుందువు. ఇదియే మాయ.

ఇది ఒక సిద్ధాంతము కాదు అని మరల చెప్పుచున్నాను. ఇది యథార్థమే. ఈ బల్ల "ఉన్నది" అని ప్రత్యక్షవాది

అన్నప్పుడు ఈ బల్లకు స్వతంత్రమగు సొంతయునికి కలదనియు దాని యునికి ప్రపంచమున ఇంక దేని యునికిమీదను ఆధారపడియుండ దనియు, ఈ విశ్వమంతయు నాశమై శూన్యమున కలిసిపోయినను ఈ బల్ల ఇప్పుడు ఉన్నటులే నిలిచి యుండగలదనియు వాని అభి ప్రాయము. కొంచెము యోచనచేసిచూచితివేని అది అటులుం డుట సాధ్యముకాదని నీకు తెలిసిపోవును. ఈ విషయప్రపంచమున ప్రత్యంశము సాధారణమై పరస్పరాధారము కలిగి సానుబంధమై పరస్పరానుబంధము కలిగియుండును. ప్రతిదాని యునికి మఱొక దాని యునికిమీద ఆధారపడుచుండును. విషయములను గుఱించి మనకు గలుగు జ్ఞానమునందు మూడు మెట్లు లేక అంశములు కలవు. ప్రతివస్తువును ప్రత్యేకమై తక్కిన అన్నిటినుండి వేఱై యుండుననుకొనుట మొదటిది. అన్ని అంశములకును మధ్య సంబంధబాంధవ్యములు కలవని గ్రహించుట రెండవది. మనము అనేకముగా చూచునట్టి ఒకే వస్తువు కలదని గ్రహించుట మూడవది. భగవంతునిగుఱించి పామరులకు గలుగు మొట్ట మొదటి భావము ఆ భగవంతుడు ఈ జగత్తునకు వెలుపల ఎక్క డనో ఉన్నాడని. అనగా భగవంతుని గుఱించిన భావన కేవలము మానవుని గూర్చిన భావనవలె నున్నది. మానవుడు చేయుదానినే అతడును చేయును. కాని అతిశయముగను శ్రేష్ఠతరముగను చేయును, అంతే. ఈ భగవద్భావన అసమంజసమనియు, అసం పూర్ణమనియు, నెటుల క్లుప్తముగ రుజువుచేయబడెనో చూచి యుంటిమి. ఒక శక్తి సర్వత్ర వ్యక్తమగుచుండు ననెడు భావము మఱియొకటి కలదు. ఇది మనము "చండి" యందు కనుగొను నట్టి సగుణబ్రహ్మము. ఈ సగుణబ్రహ్మము సమస్తసద్గుణములకు ఆధారుడని మీరు భావించు భగవంతుడుకాడు. దైవము, దయ్యము, అనెడు ఇద్దరు భగవంతులను మీరు పెట్టుకొనరాదు; ఒక్కనిని మాత్రమే పెట్టుకొని వానినే మంచివాడనియు చెడ్డవా డనియు కూడ చెప్పవలసియుండును. ఒక్కని మాత్రమే పెట్టుకొని

అందువలన కలిగెడు కష్టసుఖములను అనుభవింపవలసినదే, తప్పదు. "ప్రతి జీవియందును శాంతిరూపమున వెలుగుచుండెడు ఓ దివ్యజననీ! నీకు నమస్కారము. ఓ మహాజననీ! అన్ని జీవుల యందును నిర్మలరూపమున వెలయునీకు వందనములు" అని "చండి"ని ప్రార్థింతుము. భగవంతుని సర్వాకారుడని భావన చేయుటవలన కలుగు ఫలముల నన్నిటిని మనము అంగీకరించియే తీరవలయును. "ఇది అంతయు ఆనందమయమైయున్నది. ఓ గార్గీ! ఎచ్చటెచ్చట ఆనందముగలదో అచ్చట నెల్ల పరమాత్మ యుండును". ఈ పరమాత్మను మీ ఇచ్చవచ్చిన చొప్పున వినియోగించుకొనవచ్చును. ఇదిగో ఇచ్చట దీపమున్నది గదా, దీని సాయమున నీవు ఒక బీదవానికి నూఱు రూపాయలు ఎంచి ఈవచ్చును. వేఱొకని దొంగ సంతకమును సృష్టిచేయవచ్చును. ఈ రెండు పనులు జరుగునప్పుడు దీప మొకేరీతిగ నుండును. ఇది రెండవ దశ. భగవంతుడు సృష్టికి వెలుపలగాని దాని లోపలగాని ఉండువాడు కాడు అనుట మూడవదశ. భగవంతుడు, ప్రకృతి, ఆత్మ, జగత్తు అనునవి పర్యాయపదములే. ఒకే భావముకలవియే. నీ వెన్నడును రెండు వస్తువులను చూచుటయే లేదు. నీ తత్త్వ శాస్త్రసంబంధమగు శబ్దములు నీకు భ్రాంతి గొలుపుచున్నవి. నీవు ఒక శరీరమనియు, నీకొక ఆత్మ కలదనియు, మీరు ఇరువురును కలిసియుండురనియును నీవు మొదటనే భావించుకొనుచున్నావు. అది ఎట్లు సాధ్యమగును! నీ మనస్సులో వివరముగ ఊహచేసి చూడుము. తాను చైతన్యమని యోగి ఎఱుంగును. వానిశరీరము అదృశ్యమైపోవును. సామాన్యనరుడు తాను శరీరమనని భావించును. వానికి ఆత్మయను భావము స్ఫురింపదు. ఏలయన తత్త్వ సిద్ధాంతమునందు నరునకు ఒక శరీరము, ఒక ఆత్మ, ఈ అనేక విషయములు కలవనెడు భావముకలదు. అందువలన అవి అన్నియు ఏక కాలమందు గోచరించునవియే అని నీవు తలంతువు. ఒక్కొక సమయమునందు ఒక్కొకటి మాత్రమే గోచరింపగలదు. నీకు

స్థూలపదార్థము గోచరించునపుడు భగవంతుని గుఱించి మాటాడ కుము. నీవు కార్యమును చూచునప్పుడు ఆ కార్యము మాత్రమే నీకు గోచరించును. దాని కారణము నీకు గోచరించుట లేదు. నీవు కారణమును చూచుటతోడనే కార్యము అదృశ్యమైపోవును. అయినచో ఈ జగత్తు ఎచ్చట నున్నది? ఎవరు దీనిని తొలగించి వేయుదురు?

''సర్వకాలము చైతన్యమై, ఆనందమయమై, సర్వా తీతమై, అసమానమై, సర్వగుణాతీతమై, సత్యయుక్తమై, ఆకాశ మునుబోలి అపరిమితమై, నిరవయవమై, అవ్యయమై, పరిపూర్ణమై వెలుంగు బ్రహ్మము, ఓ ఋషి! ఓ విద్వాంసుడా! సమాధిగతు డగు జ్ఞానియొక్క హృదయమునందు ప్రకాశించుచుండును''.

''ఎచ్చట ప్రకృతివికారములన్నియు అంతరించిపోయెనో, ఎవనిని భావాతీతదశయందు భావింతురో, అన్నిటితో ఎవడు సమానుడయ్యు తనకు సమమగునది లేనివాడో, ఎవడు పరిమితు లకు అందనివాడో, ఎవడు మనయందలి సత్తని చెప్పబడుదానికి సారభూతమైనవాడో, అట్టి పరిపూర్ణుడు, అట్టి బ్రహ్మము, ఓఋషి! ఓ విద్వాంసుడా! సమాధిగతుడగు జ్ఞానియొక్క హృదయము నందు ప్రకాశించుచుండును''.

''జననమరణములకు అతీతుడై ఏ యఖండుడు, అతు లితుడు, మహాప్రళయమునందు పైని నీరు, క్రిందను నీరు, అన్ని వైపులను నీరు నిండియుండ ఆ నీటిమీద ఒక్కతరంగమేనియు, ఒక్క చిన్న అలయు కాన్పింపని స్థితిలో నెమ్మదిగా మునిగిపోవు జగత్తువలె నిశ్శబ్దముగా, నిశ్చలముగా నుండగా, సర్వదృశ్యములు నాశమై దుష్టులయొక్కయు సాధువులయొక్కయు వాగ్వాదములు, పోరాటములు, యుద్ధములు, తుదముట్టి అణగిపోవునో, అట్టి బ్రహ్మము ఓ ఋషి! ఓ విద్వాంసుడా! సమాధిస్థుడగు జ్ఞాని

యొక్క హృదయమునందు ప్రకాశించుచుండును'' అని వేదములు ప్రకటించుచున్నవి.

దీని నెఱుంగు దశ మీకు రాగలదు. అది వచ్చునపుడు ఈ ప్రపంచము అదృశ్యమగును.

ఈ బ్రహ్మము, ఈ సద్వస్తువు, తెలియబడనిదనియు, తెలియబడజాలదనియు గ్రహించితిమి. అట్లనుట అజ్ఞేయవాదము ననుసరించి కాదు. కాని నీవా బ్రహ్మమవే అయియుండుటచేత వానిని వేఱగువానిగ నెఱుంగుట మహాదోషమగును గదా! బ్రహ్మ మనగా ఈ బల్ల కాదనియు, బల్లయు ననియు తెలిసికొనియుంటిమి. ఆ నామమును, రూపమును తీసివేయుము. ఇక మిగులు సద్వస్తువు ఆ బ్రహ్మమే. సమస్తమునందు గల సత్యపదార్థము ఆ బ్రహ్మమే.

''నీవే స్త్రీవి. నీవే పురుషుడవు; నీవే బాలుడవు. నీవే బాలికవు. నీవే ఊతకఱ్ఱపై ఊగులాడుచు పోవు వృద్ధుడవు. నీవే ఈ జగము సర్వమును'' అను నిట్టిదియే అద్వైతభావన. మఱికొంత వినుడు. వస్తువుల మూలతత్త్వమును గుఱించిన వివరణము ఇందే యున్నటుల తోచుచున్నది. ఈ విషయమునందే తర్కవాదముల, శాస్త్రజ్ఞానముల ధాటిని ఎదిర్చి స్థిరముగ నిలువ గలుగుదుమని గ్రహించితిమి. ఇక్కడనే హేతువాదమునకు సుస్థిరమగు ఆధారము తుదకు దొరకుచున్నది. అయినను భారతీయ వేదాంతి దీనికి పూర్వమునందు గల దశలను నిరసించు వాడు కాడు. అతడు వెనుదిరిగి చూచి వానిని ఆశీర్వదించును. వానికి అవి సత్యములే యని తెలియును. కాని వానిని అపసవ్య ముగా చూచి అపసవ్యముగా వర్ణించుట తటస్థించినది. మాయ అనెడు అద్దము ద్వారమున చూచుటచేత వికారమై కాన్పించినను అవి అన్నియు ఆ ఒక్క సత్పదార్థమే; అన్నియు సత్యమే; సత్యేతరము కావు. ఎవనిని పామరుడు ప్రకృతికి ఆవల చూచెనో వానినే కొంచెము విద్యగలవాడు జగత్తునందు అంతర్యామియై

యున్నటుల చూచును. ఆ బ్రహ్మమునే ఋషి తన ఆత్మగను, జగత్స్వరూపముగను గ్రహించును. సర్వమును ఒకటియే; ఒక్క-తత్త్వమే. మాయామయములగు అద్దముల ద్వారమున వేర్వేఱు దృక్పథములనుండి భిన్నభిన్నములగు మనస్సులతో చూచుటవలన ఈ భేదమంతయు కలుగుచున్నది. ఇంతియే కాదు. ఒక దృష్టి మఱొక దృష్టికి దారితీయవలయును. శాస్త్రజ్ఞానమునకును, సామాన్యజ్ఞానమునకును మధ్యగల భేదమేమి? చీకటిగా నున్నప్పుడు నీవు వీథిలోనికి పోగా ఏదేని అసాధారణ విషయము సంభవించునెడల దానికి కారణమేమని ఆ త్రోవను పోవువాని నొకనిని అడుగుము. ఆ సంఘటనము ఒక దయ్యము వలన కలుగుచున్నదని పదిమందిలో ఒకడైనను తప్పక చెప్పును. కారణములను కార్యములకు భిన్నముగా వెలుపల గలవని దేవులాడుట అజ్ఞానుల స్వభావము గాన అతడు సదా దయ్యములను, భూతములను చూచుచుండును. ఒక ఱాయి క్రింద పడినయెడల పామరుడు ఏదేని దయ్యమో భూతమో దానిని పడవేసె నునును. కాని శాస్త్రజ్ఞానము గల పురుషుడో అది ప్రకృతిధర్మమువలన భూమ్యాకర్షణ స్వభావమువలన జరిగినదని తెలుపును.

ప్రకృతిశాస్త్రమునకును, మతమునకును, సర్వత్ర కలుగు పోరాటము ఎట్టిది? మతములు బాహ్యప్రపంచమునుండి తెచ్చిపెట్టుకొనిన అనేక సమాధానముల బరువుతో క్రుంగిపోవుచున్నవి. సూర్యుడు ఒక అధిష్ఠానదేవతవశమునందుండును! చంద్రుడు మఱొక అధిష్ఠానదేవతవశమునందుండును! ఇట్లు అనంతములగు దైవతములు ఏర్పడుచున్నారు. ప్రతివికారమును ఒక దేవతవలన కలుగుచున్నది. ఈ దేవతలందఱును, ఆయా విషయములకు వెలుపల నుండువారని అందఱును అంగీకరించుచున్నారు. ఒక విషయముయొక్క కారణముకొఱకు దాని స్వభావమునే పరిశీలింపవలయునని ప్రకృతిశాస్త్రము చెప్పుచున్నది. ఈ ప్రకృతిశాస్త్రము

ఒక్కొక్కమెట్టే ఎక్కిపోయిన కొలదిని కారణములను దేవతలయు, భూతములయు చేతులలోనుండి లాగివేయుచున్నది. అద్వైత మతముకూడ ఆధ్యాత్మికవిషయములందు అటులే చేయుచున్నది. కావున అది అత్యంతము శాస్త్రసమ్మతమగు మతమని చెప్ప వచ్చును. ఈ జగము విశ్వాతీతుడగు ఏ బ్రహ్మదేవునిచేతను సృష్టింపబడుట లేదు. ఇది బయట ఎక్కడనో యుండు ఏ పెను భూతముయొక్క సృష్టియు కాదు. ఇది స్వయముగనే సృష్టియై స్వయముగనే ప్రకాశించి స్వయముగనే లయమునందెడు ఒకే అఖండ సత్పదార్థము. అదియే బ్రహ్మము. "తత్త్వమసి శ్వేత కేతో" (ఓ శ్వేతకేతూ, అది నీవే సుమీ!) అని బోధించు ఈ అద్వైతమతము మాత్రమే శాస్త్రానుగుణమగు మతమని మనము గ్రహింపగలము.

ఈ కాలమున ఈ నవ్యభారతదేశములోని మిడిమిడి చదువులు చదివినవారు హేతువాదమనియు, తర్కమనియు, ఏమేమో ప్రగల్భములు కొట్టుట అనుదినము నేను వినుచున్నాను. ప్రకృతిశాస్త్రమును గుఱించి వారి ప్రగల్భములు ఎట్లున్నను మీలో అన్నిసంప్రదాయములవారును వచ్చి అద్వైతులై పోవ సాహసింతురనియు, బుద్ధభగవానునివలె "బహుజనహితాయ బహుజనసుఖాయ" (అనేకుల క్షేమముకొఱకును, అనేకుల సుఖము కొఱకును) అనుచు ఈ మతమును ప్రపంచమునందెల్లెడల ప్రచా రము చేయుదురనియు నేను ఆశించుచున్నాను. మీ రటుల చేయలేని మిమ్ము పిఱికివారినిగా భావించెదను. మీరు మీ పిఱికి తనమును పోగొట్టుకొనజాలనియెడల, మీరు మీ భయమునే సాకుగా చెప్పుకొనునెడల, అటువంటి సాకునే ఇతరులయెడను అంగీకరింపుడు. పాపము, విగ్రహారాధకులపైని పడబోకుడు. వారివి వెఱ్ఱి దైవములని దూషింపబోకుడు. మీతో పూర్తిగ ఏకీభవింపని ప్రతివానికిని బుద్ధులు చెప్పుటకు పూనుకొనకుడు.

మీమట్టుకు మీరే పిరికివారై ఉన్నట్లు మొట్టమొదట తెలిసికొనుడు. సంఘమును చూచి మీరు భయపడునెడల, మీ పూర్వ మూఢాచారముల గుఱించి మీరే అంతగ భయపడునెడల, పామర జనులు ఈ మూఢవిశ్వాసములను గుఱించి ఎంతగా భయపడుదురో, అవి వారిని ఎంతగా బంధించి పడవేయుచున్నవో విచారింపుడు. అద్వైతియొక్క అభిప్రాయము ఇట్లుండును. అందఱిని ఆదరణతో చూడుడు. ప్రపంచమంతయు కేవల సిద్ధాంతములోనేగాక అనుభవమునందును అద్వైతభావమయమగుగాక యని నేను భగవంతుని వేడుకొందును. అంతవఱకు మనము పోజాలనియెడల దాని క్రిందిమెట్టువఱకైనను పోవుదుముగాక. పామరులను ఆదరణతో చేయిపట్టుకొని, వారు ఒక్కొక్కమెట్టే ఎక్కిపోవునట్లు సాహాయ్యము చేయుదుము గాక. భారతదేశములో మతయాత్రసర్వమును పురోగమనమే యని బాగుగా గ్రహింపుడు. అధర్మమునుండి ధర్మమునకు పోవుచుంటిమని తలంపకుడు. మనము ఒక ధర్మమునుండి దానిపై ధర్మమునకు చేరుచున్నామని తెలిసికొనుడు.

నీతిధర్మమును గుఱించి మఱికొంత చెప్పవలసియున్నది. మనపిల్లలు ఎవరివలననో అది భగవంతునకే ఎఱుక అద్వైతమతము ప్రజలను అవినీతిపరులను చేయుచున్నదని విని చెలరేగి మాటాడుచున్నారు. మనమందఱమును బ్రహ్మమే అగునెడల నీతితో అసలు పనియేమున్నది? బడితెకఱ్ఱతో తప్ప క్రమమార్గమున నడవని పశువు చేయవలసిన వాద మిది. మీరట్టి పశువులగుటకంటె ఎందులోనైన పడి మరణించుట మేలు. ఎప్పుడును బడితెకఱ్ఱకు లోబడి నడవగోరు మానవజీవులుగా జీవించుటకంటె అటుల మరణించుటయే ఉచితము. దుడ్డుకఱ్ఱ తొలగినంతనే మీరు రాక్షసులై పోదురా? అటులగునెడల మిమ్ములను హతము చేయవలసినదే. మీకు గత్యంతరము లేదు. మీరు నిరంతరము బడితెపోటులతోను, మొట్టికాయలతోను, బ్రతుకవలసినవా

రగుదురేని మీకు మార్గాంతరము లేదు. మీ కెన్నటికి మోక్షము లేదు.

ఇక రెండవ విషయము అద్వైతము మాత్రమే నీతికి వివరణమును బోధింపగలదు. ప్రతిమతమును పరోపకారము చేయుట నీతికంతకు సారమని బోధించుచున్నది. "స్వార్థరహితముగా వర్తింపుడు" అని ప్రతిమతము అనును. "ఎందులకు? నేను ఎందుకు స్వార్థమును విడువవలయును?" అని ప్రశ్నించిన యెడల ఏదో దేవత అటుల చెప్పెనందురు. "ఆ దేవతను నేను సరకుచేయను" అందువు. అప్పుడు ఏవో కొన్ని శాస్త్రములు అటుల విధించుచున్న వందురు. అప్పుడు "శాస్త్రములలో నుండుగాక, అవి అటులనే చెప్పుగాక; నేను లెక్క చేయను. అవి ఏమి చెప్పిన నాకేమి?" అందువు. అంతటితో సరి. ఎవని మార్గము వానిదే. వెనుక చిక్కినవాడు ఇడుమల పాలగును. ప్రపంచములో నీతి అటులున్నది. కనీసము చాలమంది అటులున్నారు అన వచ్చును. నే నెందులకు నీతిపరుడనుగా నుండవలెను? కారణ మేమి? అని ప్రశ్న వచ్చినెడల గీతలో చెప్పబడినటుల నీవు సత్యమును గ్రహించినగాని దానికి వివరణము చెప్పజాలవు.

"సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
న హినస్త్యాత్మనాత్మానం తతోయాతి పరాంగతిమ్॥"

(ఆత్మను సర్వత్ర సమముగా చూచు యోగి ఆత్మను ఆత్మచేత హింసించుకొనజాలడు. అతడు పరమగతినే పొందగల్గును.) నీవు ఎవరిని హింసించినను, నిన్ను నీవే హింసించుకొనినవాడవగు చున్నాడవనియు, వారందఱు నీవేయనియు, అద్వైతబోధవలన తెలిసికొనుము. నీవు ఎఱిగియున్నను, ఎఱుగకున్నను అన్ని చేతుల తోడను నీవు పనుల చేయుచునేయున్నావు; అన్ని పాదముల తోడను నీవు నడచుచున్నావు. రాజప్రాసాదములలో భోగించు

రాజువు నీవే. దీనుడవై వీథులలోని దుమ్ములో పడి దుఃఖించు వాడవును నీవే. నీవు పండితులలోను, పామరులలోనుకూడ ఉన్నావు. బలవంతులలోను, బలహీనులలోనుకూడ కలవు. దీనిని గ్రహించి సానుభూతిపరుడవుకమ్ము. మనము ఇతరులకు ఏల అపకారము చేయగూడదో ఆ కారణ మిదియే. అందువలననే నేను ఆకలిచే బాధపడుచున్నప్పటికిని 'వేలకొలది నోరులతో తినువారు కలరు; ఆ నోరులన్నియు నావే యని భావించి నేను నిర్విచారముగ నుండగలను. కాబట్టి నా గతి ఏమగునా యనిగాని నాకుగలది ఏమైపోవునా యనిగాని నేను ఆతురపడను. ఏలయన, ఈ జగమంతయు నాదియే. నేను అనంతానందమును అనుభవించుచున్నాను. నన్నుగాని, ఈ జగత్తునుగాని, ఎవరు చంపగలరు? నీతి అంతయు ఇందున్నది. ఈ అద్వైతసిద్ధాంతము మాత్రమే నీతికి కారణమును ఇట్లు విశదము చేయుచున్నది. ఇతర మతములును నీతిని బోధించును గాని కారణమును వివరింపజాలవు. ఇంతవఱకు వివరణమేమో తెలిసికొంటిమి.

సరే ఇందువలన కలుగు లాభమేమి? ఇది బలవర్ధకము. నీవు ప్రపంచముమీద పఱచిన సమ్మోహన యనెడు ముసుగు తొలగింపుము. దుర్బలతను కలుగజేయు సంకల్పములనుగాని, మాటలనుగాని, మానవకోటియందు ప్రవేశపెట్టకుము. పాపములన్నియు, అనర్థములన్నియు, 'దుర్బలత' అనెడు ఒక్క మాటలో ఇమిడియున్నవి. అన్ని దోషకార్యములందును ప్రేరణశక్తిగా నుండునది దుర్బలతయే. స్వార్థపరత కంతకును మూలము దుర్బలతయే. ఇతరులకు అపకారముచేయుటకు నరులను ప్రేరేపించునది దుర్బలతయే. సత్యమును కప్పిపెట్టి కపటవేషముల దాల్చునట్లు చేయునది దుర్బలతయే. తమ స్వస్వరూపమును ఎల్లరును గ్రహింతురు గాక. ఎల్లరును "సోహం" అనుచు దివారాత్రములు తమస్వస్వరూపమును ధ్యానింతురు గాక. "అహం బ్రహ్మాస్మి, అహం

బ్రహ్మాస్మి'' అనుచు ఈ బలవర్ధకమగు భావమును తల్లిపాలతో ప్రతివారును త్రాగుదురు గాక. ''శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'' (మొట్టమొదట దీనిని గుఱించి వినవలయును; పిమ్మట దీనిని గుఱించి మననము చేయవలయును). ఆ విచారణనుండి, అట్టి హృదయమునుండి, ప్రపంచ మెన్నడును విని, కని యుండని మహాకార్యములు బయలుదేరగలవు. ఓహో! ఈ అద్వైతమతమును కొందఱు ఆచరణయోగ్యము కాదనుచున్నారు. అనగా స్థూలదృష్టికి ఇది ఇంకను వ్యక్తము కాలేదని అర్థము. కొంతవఱకు ఆ మాట సత్యమే.

''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ఓమిత్యేకాక్షరం పరం।
ఓమిత్యేకాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్॥''

(ఓం అను ఏకాక్షరము బ్రహ్మమై యున్నది. ఓం పరమసత్య పదార్థము. ఈ ఓం యొక్క తత్త్వమును తెలిసినవానికి కోరిన దెల్ల లభించును). ఓహో! అందువలననే ఈ ఓంయొక్క రహస్యమును అనగా ఆ ఓంకారము నీవే అనుటను మొదటనే తెలిసికొనుము. ఈ 'తత్త్వమసి' అను మహావాక్యముయొక్క భావమును గ్రహింపుము. అప్పుడు నీవేమి కోరిన అది తప్పక నీకడకు వచ్చును. నీవు లౌకికసంపదను మిక్కిలిగా కోరుకొందువేని నీవు అట్టివాడవని విశ్వసింపుము. నేను ఒక చిన్ని నీటిబుడగగా నుండవచ్చును. నీవు పర్వతమంత ఎత్తగు తరంగమవు కావచ్చును. అయినను మన కిరువురకును ఆధారక్షేత్రముగా ఆ అనంతమహాసముద్రమే కలదని గ్రహింపుము. అఖండబ్రహ్మమే మన శక్తికిని, మన బలమునకును ప్రధానమగు అవ్యయఖని. అందుండి చిన్ని బుడగనగు నేనును, ఉత్తుంగ పర్వతసమతరంగమవగు నీవును మన యిష్టమువచ్చినంత శక్తిని తీసికొని వినియోగించుకొనవచ్చును. కాబట్టి ఆత్మవిశ్వాసమును కుదుర్చుకొనుట అద్వైతమతములోని

రహస్యము! ఆ పిమ్మట నీవు ఎట్టి నమ్మకమునైనను పెట్టుకొందువు గాక. ప్రపంచచరిత్రయందు అచంచలమగు ఆత్మవిశ్వాసముగల జాతులు మాత్రమే శక్తిమంతములగు మహాజాతులుగా వృద్ధిపొందినవి. ప్రతిజాతి చరిత్రయందును ఆత్మవిశ్వాసము పూనినవ్యక్తులు మాత్రమే గొప్పవారును, బలాఢ్యులును కాగలిగిరని తెలిసికొనుడు. ఇక్కడ భారతదేశమునకు ఒక ఆంగ్లేయుడు గుమాస్తాగా వచ్చినాడు. డబ్బు లేకపోవుటచేతను, ఇంక ఇతర కారణములచేతను అతడు తన తలకు గుఱిపెట్టి రెండుసార్లు తుపాకితో కాల్చుకొన యత్నించెను. రెండు సార్లు వాని ప్రయత్నము విఫలము కాగా వానికి ఆత్మవిశ్వాసము కుదిరినది. అతడు తాను మహాకార్యములు చేయుటకొఱకు జన్మించితినని విశ్వసించెను. ఆ పురుషుడే ఈ సామ్రాజ్యనిర్మాతయగు క్లైవు. ఆతడే పాదరీల బోధలు నమ్మి యావజ్జీవము దీనుడై "ఓ ప్రభువా! నేను దుర్బలుడను, నేను హీనుడను" అనుచు దేవురింపసాగినయెడల ఎక్కడుండెడివాడు? బహుశః పిచ్చివాండ్ర చికిత్సాలయములో పడియుండెడివాడు! ఇట్టి పిచ్చిబోధలవలన మీరును వెడగులై పోవుచున్నారు. 'ఇట్టి దౌర్బల్యబంధురబోధలు చేయుటవలన మానవజాతిని నాశముచేయునట్టి ఘోరానర్థములు ప్రపంచము నందంతటను వాటిల్లుచుండుట నేను ఎఱిగియున్నాను. ఈవిధముగా మన పిల్లలు పెంపబడుచున్నారు. వీరు సగము పిచ్చివారగుటలో ఆశ్చర్యమేమున్నది!

ఈ బోధ అనుష్ఠానపరుల పక్షమున చేయబడినది. కాబట్టి ఆత్మవిశ్వాసమును పూనుకొని మీకు లౌకికసంపద కావలయునెడల దానికొఱకై పాటుపడుడు. అది మీకు లభించును. మీరు మహామేధావంతులు కాగోరునెడల బుద్ధిక్షేత్రమునందు పని చేయుడు. అప్పుడు మీరు మహామేధావులు కాగలరు. మీరు మోక్షమును కోరుదురేని ఆధ్యాత్మికక్షేత్రమున సాధనసాగింపుడు.

అప్పుడు మీరు ముక్తులై నిర్వాణమున ప్రవేశించి నిత్యానందము ననుభవింతురు. కాని ఈ అద్వైతమతమున ఒక లోపము సంభవించినది. దాని సాధన ఆధ్యాత్మిక క్షేత్రమున మాత్రమే సాగింపబడి ఇతర క్షేత్రములు ఉపేక్ష చేయబడినవి. ఇప్పుడు మీరు దానిని పూర్ణముగా ఆచరణయోగ్యము చేయవలసిన తరుణము వచ్చినది. అది ఇంకను రహస్యముగ నుండరాదు. అది ఇంకమీదట గుహాలలోను, అడవులలోను, హిమాలయముల లోను, సన్న్యాసులకడను మాత్రమే నిలిచిపోరాదు. అది ప్రజల అనుదిన జీవిత క్షేత్రమునకు దిగిరావలయును. మహాసౌధములందు రాజులు దానిని అనుష్ఠింపవలెను. గుహాలలోని సన్న్యాసులు, గుడిసెలలోని పేదలు, వీధులలోని యాచకులు, ఎల్లరు సర్వత్ర సర్వదా దానిని ఆచరణలో పెట్టవలెను. కాబట్టి నీవు స్త్రీవైనను, శూద్రుడవైనను, భయపడవలదు. ఏలయన ఈ మతమును స్వల్పముగ ఆచరించినను కూడ అత్యధికమగు మేలు చేకూరగల దని శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

కాబట్టి ఆర్యసంతానములారా! సోమరులుగ కూర్చుండకుడు! లెండు! మేల్కొనుడు! గమ్యము చేరువఱకును ఆగకుడు! ఈ అద్వైతమతమును అనుష్ఠానములో పెట్టవలసినకాలము ఏతెంచినది. దీనిని స్వర్గమునుండి భూతలమునకు తీసికొనివత్తము గాక. ఇదియే నూతనధర్మప్రచారము. అదిగో ఆలకింపుడు. మన పూర్వులు దీనిని స్వర్గమునుండి పుడమికి తీసికొనిపొండని మనలను ఆదేశించుచున్నారు. మీ బోధలు ప్రపంచమంతటను వ్యాపించు గాక. అవి సంఘశరీరమున ప్రతినాళములోనికిని చొరబాఱుగాక. అవి ప్రతివాని సమష్టిసంపదయై పఱగుగాక. అవి మన జీవితములతో ఐక్యానుసంధానము పడయునుగాక. అవి మన రక్తనాళములలో ప్రవేశించి ప్రతి రక్తబిందువుతో కలిసి ప్రసరించును గాక.

ఓహో! అనుష్ఠానవేదాంతులుగా అమెరికనులు మనకన్న మిన్నలని విని మీరు విస్మయము చెందవచ్చును, కాని అది సత్యము. నేను న్యూయార్కు నగరమున సముద్రతీరమునందు నిలుచుండి వేర్వేఱు దేశములనుండి వలస వచ్చు ప్రజలను చూచుచుండెడివాడను. అణగద్రొక్కబడి, పీల్చి పిప్పిచేయబడి, నిరాశాహతులై, మోమెత్తి మనుజులవంక చూచుటకు జంకుచు, చిరిగి పేలికలైన నాలుగు గుడ్డల చిన్నమూటయే తమ సర్వస్వముగా అనేకులు ఆ దేశమున ప్రవేశింతురు. పోలీసువాడు కాన్పింపగనే వారు భయపడి కాలిబాటను విడిచి రెండవ ప్రక్కకు పరుగిడబోదురు. చూడుడు! ఆఱు మాసములలో ఈ పురుషులే సొగసుగా దుస్తులను ధరించి నిక్క నిటారుగా నడచుచు ప్రతివాని ముఖము వంకను నిర్భయముగ చూచుచు సంచరింతురు! ఈ విచిత్రమగు పరివర్తనము ఎట్లు కలిగెను? ఆర్మేనియా దేశమునుండియో, మఱెచ్చటనుండియో ఒకడు అమెరికాకు వచ్చుననుకొనుడు. స్వదేశమున అతడు పోలికయే లేకుండపోవునంతగా అణగత్రొక్కబడి యుండును. అతడు బానిసగా జన్మించెనని ప్రతివారును వానికి అచ్చట బోధించియుందురు. యావజ్జీవమును అత డట్టి దీనదశలో ఉండుటకే పుట్టెనని చెప్పియుందురు. అతడు కదలినను మెదలినను కాలరాచియుందురు. "ఓయి బానిసా! నీవు బానిసవై పుట్టితివి. నీ వట్లుండవలసినదే. నీ వాశాశూన్యుడవై జన్మించితివి. నిరాశాహతుడవయి ఉండిపోవలసినదే" అని అచ్చటి ప్రతిదియు వానికి తెలిపియుండును. "నీకు ఆశలు లేవు. నిరాశుడవై, నీచదాసుడవై ఉండిపోవలసినదే" అని అచ్చటి గాలి సైతము దశదిశలనుండి వాని చెవులలో నూఁదిపోసియుండును. బలవంతులు వానిని పీడించి ప్రాణముల విసిగించి యుందురు. కాని అతడు న్యూయార్కు నగరవీథులయందు అడుగిడినతోడనే మాన్యరీతిని దుస్తుల ధరించిన ధీరపురుషు డొకడు ఎదురుగవచ్చి, ఆదరణ సూచకముగా చేతులు కలిపి గౌరవించును. అతడు సొగసుగా

దుస్తులను ధరించియున్నను, ఇతడు ప్రాతపేలికలను ధరించి యున్నను భేదమేమియు చూపడు. ఇత డింకొక అడుగు సాగి పోయి ఒక విందుల బసను కాంచును. గొప్ప గొప్ప వారు బల్లల ముందు కూర్చుండి ఫలాహారములు కైకొనుచుందురు. అదే బల్ల చెంత వీనికికూడ ఒక ఆసనమును చూపి యజమాని ఆహ్వానిం చును. ఇతడు అటు నిటు సంచరించునప్పుడు వానికి నూతన జీవనము ప్రత్యక్షమగును. తానుకూడ మనుష్యులలో నొకడై మెలగ గల ప్రదేశము వాని కనులకు గోచరించును. అతడు వాషింగ్టన్ నగరమునకు పోయి అచ్చట అమెరికన్ ప్రెసిడెంటుతో చేతులు కలుపవచ్చును; అనేక దూరగ్రామములనుండి వచ్చిన ప్రజలను. కృషీవలులను చింపిరిగుడ్డలు కట్టినవారిని అమెరికా అధ్యక్షుడు చేతులుజోడించి గౌరవించుట చూడవచ్చును. అంతట వానిపై గల మాయాపటము జారిపోవును. అంతవఱకును సమ్మో హమున జిక్కి బానిసతనమునందును దుర్బలతయందును మ్రగ్గు చున్న అతడు ఇప్పుడు బ్రహ్మమై నిలుచును! ఒక్కసారిగా మేల్కొనును! ఇక లేచి మానవలోకమున తానును ఒకవ్యక్తినే యని గ్రహించును. కటకటా! ఈ మనదేశమునందో, ఇది వేదాంతమునకు జన్మక్షేత్రమైనను కూడ, మన జనసామాన్యము యుగయుగములనుండి సమ్మోహమున జిక్కి పడియున్నారు! వారిని తాకిననే మైల సోకును; వారితో కలిసి కూర్చుండిననే అశుచి పైనిబడును! ఇట్లు నిరాశాహతులై వారు పుట్టుచున్నారు! ఆశారహితులుగనే జీవితాంతము ఉండిపోవుచున్నారు! తత్ఫల ముగా వారు ఇంకను పతితులై పోవుచున్నారు! మానవుడెంత అధోగతిపాలుకాగలుగునో అంత అధోగతినంది అధమాధమస్థితికి వచ్చియున్నాడు. మానవులై పుట్టి పశువులతో కలిసి నిదురింప వలసిన గతి ప్రపంచమున మఱే దేశమున గోచరించును? ఇట్టి దుఃస్థితినిబట్టి అన్యులను దూషింపబోకుడు. పామర జనులవలె పొరపడబోకుడు. ఫలితమా ఇక్కడ నున్నది. దానికారణమును

ఇక్కడనే యున్నది. మనదే దోషమంతయు. లేచి నిలువబడుడు. ధైర్యము పూనుడు. దోషమునంతను మీభుజముల మీదనే వహింపుడు. ఇతరులను తిట్టుచు వారిమీద దుమ్మెత్తిపోయుచు కాలము గడపకుడు. మీకు బాధలు తెచ్చిపెట్టిన దోషములన్నింటికిని మీరే కారకులమని ఒప్పుకొనుడు.

లాహోరు యువజనులారా! ఈ విషయమును బాగుగా గ్రహింపుడు. పరంపరాగతమై వచ్చుచున్న ఈ జాతీయ మహాదోషము మన భుజములమీద నున్నది. మనకు ఆశలు గోచరించుటలేదు. మీరు వేలకొలది సమాజములు పెట్టవచ్చును. ఇరువదివేల రాజకీయసంఘములను స్థాపింపవచ్చును. ఏబదివేల సంస్థలను నెలకొల్పవచ్చును. కాని సమష్టిని అందఱిని గుఱించి సంకల్పము చేయగల ఆ సానుభూతి, ఆ ప్రేమ, ఆ విశాలహృదయము మీలో కొఱవడియున్నంతకాలము, వీనివలన ప్రయోజనముండదు. బుద్ధుని హృదయము మరల భారతదేశమున ప్రత్యక్షమగువఱకు, శ్రీకృష్ణభగవానుని వాక్కులు అనుష్ఠానములోనికి వచ్చువఱకు మనకు ఆశలేదు. మీరు యూరపియనులను, వారివ్యవస్థలను, వారి మహాసభలను ఎన్నేని అనుకరింతురుగాక; కాని నా కన్నులార జూచిన ఒక కథను చెప్పెదనువినుడు: ఇచ్చట యురేషియనులు అనబడు కొందఱు, బర్మీయులను కొందఱిని లండను నగరమునకు తీసికొనిపోయిరి. వారు లండనులో ఈ బర్మీయులను ప్రదర్శించి బాగుగా డబ్బు సంపాదించుకొనిరి. అంతట వీరిని యూరపుఖండమునకు తీసికొనిపోయి మీగతి మీరు చూచుకొనుడని అచ్చట వదలివేసిరి. పాపము, వీరికి యూరపు భాషలలో ఒక్కమాటయేని తెలియదు. కాని ఆస్ట్రియాలోనుండు ఆంగ్లేయ ప్రతినిధి వీరిని లండను నగరమునకు పంపినాడు. అచ్చట వీరెఱిగిన వారెవరును లేక ఆ మహానగరమున నిరాధారులై యుండిరి. అంతట ఒక దొరసాని వీరిని గుఱించి తెలిసికొని ఈ బర్మాదేశీ

యులను తన ఇంటికి తీసికొనిపోయినది. తన బట్టలను కట్టనిచ్చినది. తన శయ్యలను, సర్వమును వారికి వాడుకొననిచ్చినది. ఈ విషయమునుగుఱించి వార్తాపత్రికలకు వ్రాసినది. చూడుడు! ఆమఱునాడే ఆ జాతియంతయు నిద్రనుండి మేల్కొనినట్లైనది. ధనము ప్రవాహముగా వచ్చి పడినది. అంతట వీరికి సాహాయ్యము దొఱికినది. వీరు బర్మా చేరగలిగిరి. ఈ విధమగు సానుభూతిపై వారి రాజకీయవ్యవస్థలు, ఇతర వ్యవస్థలు నిర్మితములై యున్నవి. కనీసము తమకొఱకేయగుగాక అచంచలములును, అపారములును అగు ప్రేమనిధు లచటగలవు! వారు ప్రపంచమునంతను ప్రేమింపక పోవచ్చును. బర్మీయులు వారికి శత్రువులే కావచ్చును. కాని ఇంగ్లాండులో మాత్రము స్వజాతీయుల యెడలను, సత్యము నెడలను, న్యాయము నెడలను, తమ వాకిటనున్న పరదేశీయుని ఆదరించు ధర్మము నెడను వారికి గొప్ప అభిమానము కలదు. పాశ్చాత్యఖండమున ప్రతి దేశమునందును, ఎంత అద్భుతముగా ఎట్టి ఆదరణతో నన్ను మన్నించిరో మీకు తెలుపనియెడల నేను కృతఘ్నుడనే యగుదును. మనలో ఉదారహృదయ మెక్కడ నున్నది? ఇచ్చట చిన్న సమష్టిపరపతిసంఘమును స్థాపింపబోదుము, వెంటనే ఒకరినొకరము మోసగించుకొను ప్రయత్నము! ఇంకనేమున్నది? మఱుక్షణమే అంతయు నేలగూలును. ఆంగ్లదేశీయులను అనుకరించుటను గుఱించియు వారివలె ఒక మహాజాతిని నిర్మాణము కావించుటను గుఱించియు మీరా ప్రసంగించుట! మీకు పునాదులు ఏవి? ఉన్నది వట్టి ఇసుక! కాబట్టి ఏ వ్యవస్థగాని ఒక్క నిమేషములో ముక్కలుచెక్కలై నేల కూలును!

కాబట్టి లాహోరు యువజనులారా! మరల నొక్కసారి అద్వైతమహాధ్వజమును లేవనెత్తుడు! ఏలయన, ఆ భగవంతుడు మీకు సర్వత్ర ప్రత్యక్షమగువఱకును అవసరమగు ఆ గాఢప్రేమ

మతాలోకసిద్ధాంతమున మీకు లభింపదు. ఆ ప్రేమధ్వజమును విస్ఫార నెగురవేయుడు. "లెండు, మేల్కొనుడు, గమ్యమును చేరువఱకు నిలువకుడు." లెండు, మరల నొక్కసారి మేల్కొనుడు! వైరాగ్యము లేనిదే ఏమియు కొనసాగదు. మీరు ఇతరులకు సాయపడ గోరుదురేని మీ సంకుచితాత్మ తొలగిపోవలయును. క్రైస్తవులు చెప్పునట్లు మీరు దైవమును, ధనమును ఏకకాలమున ఆరాధింపలేరు. వైరాగ్యమును వహింపుడు. మీ పూర్వులు మహాకార్యములను నిర్వహించుకొఱకు సంసారములను త్యజించియున్నారు. ఈనాడును తమ ముక్తికొఱకు సంసారములను త్యాగముచేయువారు కలరు. మీరు సర్వమును త్యాగము చేయుడు. మీ ముక్తిని సైతము త్యాగముచేసి ఇతరులకు సాహాయ్యము చేయుటకు సిద్ధముకండు. ఔను, మీరు మహాధీర వచనములను సదా పల్కుచుందురు. కాని ఇప్పుడు కావలసినది అనుష్ఠానవేదాంతము! లెండు, మీ అల్పజీవితములను బలి యొసగుడు. మీరు తిండిలేక చచ్చినను అది ఏపాటిది? మీరును, నేనును, మనబోటి వేయిమందియు మనజాతి సజీవమైయుండుట కొఱకు నలిగి బలియైన నేమి? ఇదిగో, జాతి అధోగతిని పడిపోవుచున్నది. లక్షలకొలది ప్రజల లెక్కకుమీఱిన శాపములు మన తలలమీద పడుచున్నవి. దప్పిచే అల్లాడుచు దాహమడుగగా దాపున వినిర్మల జీవనదీప్రవాహములు చూపట్టుచున్నను ఎవరికి మనము మురికిగుంటల నీరు నొసంగుచున్నామో, అష్టైశ్వర్యములు మనకు కనుల ఎదుట గోచరించుచుండగా లక్షలకొలంది ఆకొని చచ్చుచున్నను ఎవరిని ఉపేక్షించుచుంటిమో, నోటిమాటలతో అద్వైతమును గుఱించి బోధలు చేయుచు ఏ అసంఖ్యాకజనులను మనశక్తికొలది ద్వేషించుచుంటిమో, కోట్లకొలదిగనున్న ఏ నరులను హింసించుకొఱకు మనము లోకాచారసూత్రములను కల్పన చేయుచుంటిమో, నిఖిలభూతములు ఏకమనియు, ఎల్లరము ఒకే

భగవానుని అంశముతో జన్మించితిమనియు సిద్ధాంతవాక్కులను పల్కుచు వీసమైనను ఆచరణలేక ఎవ్వరిని మనము మోసగించుచుంటిమో అట్టి సోదరుల శాపములు మన నెత్తిపై పిడుగులవలె పడుచున్నవి! స్నేహితులారా! సర్వమును మీ మనస్సున కలదనుచున్నను లేశమైనను ఆచరణయందు లేకుండుటయా? ఈమచ్చను తొలగించుకొనుడు. లెండు, మేల్కొనుడు. ఈ స్వల్ప ప్రాణము పోయినను లెక్క ఏమి? ప్రతివాడును చావవలసినదే గదా! మహాఋషియు మహాపాపియు, అత్యంతధనికుడును అత్యంత దీనుడును, చివరకు మరణింపక తప్పదు గదా! ఎట్టివారికిని శరీరము శాశ్వతమై నిలువబోదు. లెండు, మేల్కొనుడు. కపటము విడిచి నిలబడుడు. మన కపటవర్తనము ఘోరముగా పెరిగి పోయినది. మన కిప్పుడు కావలసినది శీలము. యమునికుండు హఠముతో, పూనిన కార్యమును పట్టువిడువకుండ నిర్వహించు దీక్షయు శీలమును మనకు అవసరములై యున్నవి.

"ఘనులు దూషింతురు గాక, లేక భూషింతురు గాక; ఈ దినమున లక్ష్మి వచ్చుగాక, లేక పోవుగాక; మరణము తత్క్షణమే సంభవించుగాక, లేక నూ ఱేండ్లవఱకు ఆగుగాక; ధర్మమార్గము నుండి ఒక్క అడుగైనను తప్పివేయనివాడే సత్యముగా సాధుపుంగవుడగును." కాన లెండు, మేల్కొనుడు. కాలము గతించి పోవుచున్నది; మన సామర్థ్యమంతయు వ్యర్థపు ప్రసంగములతో వృథయై పోవుచున్నది. లెండు, మేల్కొనుడు. క్షుద్రవిషయములను అల్పాంశములనుగూర్చిన వాదులాటలను, స్వల్పసిద్ధాంతముల గూర్చిన పోట్లాటలను, దూరముగ నెట్టివేయుడు. మనము నిర్వహింపవలసిన మహాకార్యము కలదు. కోట్లకొలదిజనము నశించి పోవుచున్నారు. మహమ్మదీయులు మొట్టమొదట భారతదేశమునకు వచ్చినప్పుడు, ఇచ్చటి హిందువుల సంఖ్య ఎంత ఎక్కువగా నుండెనో ఈనాడు వారి సంఖ్య ఎంత పలుచబడిపోయెనో గమ

నింపుడు. దినదినము హిందువులు తగ్గిపోవుచున్నారు. తుదకు పూర్తిగా అదృశ్యమై పోగలరు. వారు అదృశ్యులై పోయినను పోవుదురుగాక. కాని వారియందు ఎన్ని దోషములున్నను వారు ఎన్ని అపార్థకల్పనములు చేయుచున్నను ఏ మహాద్భుత భావరాజములకు వారింకను ప్రతినిధులుగ నున్నారో అయ్యవి వారితోడనే నశించిపోగలవు. సమస్త ఆధ్యాత్మిక విద్యలకును, శిరోభూషణమగు అద్వైతసిద్ధాంతము వారితోడనే వినాశమై పోగలదు. కాబట్టి ప్రపంచ పారమార్థికతను సంరక్షించుటకై ప్రసారిత బాహువులతో లెండు, మేల్కాంచుడు. మొట్టమొదటగా మీ మాతృదేశముకొఱకు దానిని అనుష్ఠానముచేయుడు. మన కీనాడు కావలసినది కేవలమగు ఆధ్యాత్మికత కాదు. ఈ వ్యవహార ప్రపంచములోనికి అద్వైతమును కొంచెము ప్రవేశపెట్టవలెను. ఇది ప్రధానము. మొట్టమొదటిది భుక్తి; ఆ తరువాతిది ముక్తి. దరిద్రులు తిండిలేక మాడుచుండగా వారికి మితిమీరిన మతబోధ చేయుచుందురే! ఎన్ని సిద్ధాంతములైనను ఆకలిబాధను నివారింపగల్గునా? మనకు రెండు దౌర్భాగ్యములున్నవి. మొదటిది మన దుర్బలత; రెండవది విద్వేషపూరితమగు శుష్కహృదయము. నీవు లక్షలకొలది సిద్ధాంతములను గుఱించి ప్రసంగములు చేయవచ్చును; కోట్లకొలది సంప్రదాయములను బయలుదేఱదీయవచ్చును. కాని నీ హృదయమునందు ఆదరభావము పుట్టువఱకును అంతయు వ్యర్థమే! వేదము బోధించునటుల వారు నీలో కలిసిపోయి నీశరీరాంగములలో వారును చేరిపోవువఱకు, నీవును వారును, దరిద్రులును ధనికులును, పండితులును పామరులును యోగులును, పాపులును అందఱును నీవు బ్రహ్మమని పేర్కొనెడు ఆ అద్వితీయాఖండ పరమాత్మయందు అంశభూతములై పరగువఱకు, వారిపై నీ సానుభూతిని పెంపుచేయుము.

ఆర్యులారా! ఆ అద్వైత సిద్ధాంతముయొక్క ప్రధానములగు దివ్యాంశములను కొన్నిటిని మీకు తెలుపుటకు ప్రయత్నించి

తిని. ఆ అద్వైతమును ఆచరణలో పెట్టుతరుణము వచ్చినది. దానిని ఈ దేశమునందే కాక ఎల్లెడలను ఆచరణలో పెట్టవలసి యున్నది. ఆధునికభౌతికశాస్త్రము తన సమ్మెటపోటులతో ప్రతి చోటను ద్వైత మతపు గాజు పునాదులను పొడిపొడిచేసి వేయు చున్నది. ద్వైతులు శాస్త్రవాక్యములను ఇంకను సాగతీయుటకు వీలు కనుపించు నంతవఱకు వానిని పట్టి లాగులాడుట ఇక్కడనే కాదు—ఈ శాస్త్రవాక్యములు కేవలము "ఇండియా రబ్బరు" మాత్రమేకాదు గదా — వారు తాము సురక్షితముగా దాగి కొనుటకు సందుగొందులను మారుమూలలను వెదుకులాడుట ఇక్కడనే కాదు; ఇంతకంటె ఎక్కువగనే యూరపునందును అమెరికాయందును గూడ కలదు. మన భారతదేశమునుండి అక్కడికి గూడ ఈ అద్వైతభావము కొంత వ్యాపింపవలసి యున్నది. అది ఇదివఱకే పోయినది. కాని అది పెరిగి వృద్ధి కాంచవలసియున్నది. అది వారి నాగరికతలనుకూడ సంరక్షింప వలయును. పాశ్చాత్యదేశములయందు ప్రాత విషయములు కనపడ కుండపోయి క్రొత్తక్రొత్త విషయములు తలలెత్తుచున్నవి. స్వర్ణా రాధనములు ధనపూజలు పెచ్చుపెరుగుచున్నవి. స్పర్ధ, ధనా ర్జనము, పోటీ అనెడు నవీన సిద్ధాంతము కంటె ఎంత మోటు దైనను పూర్వపు మత సిద్ధాంతమే మంచిది. ఎంత బలముగల దైనను అటువంటి పునాదులమీద నిర్మితమైన ఏజాతియు నిలువ జాలదు. అట్టి పునాదులు కలవన్నియు నశించి ఊరు పేరు లేకుండ పోయెనని ప్రపంచచరిత్ర బోధించుచున్నది. అట్టి వెల్లువ ఈ భారతదేశముమీదికి వచ్చిపడకుండ మనము మొట్టమొదటగా ఆపవలయును. కాబట్టి ఈ ఆధునికభౌతికశాస్త్రమువేయు దెబ్బల నుండి మతమును కాచుకొనుటకై ఎల్లరకును ఈ అద్వైతమును బోధింపుడు. అంతియే కాదు. మీరు ఇతరులకు సాహాయ్యము చేయవలయును. మీ వేదాంతము అమెరికా యూరపుల చిక్కులు తీర్పగలదు. అన్నిటికంటె ముఖ్యముగా ఆచరణరూపమైన పని

చేయవలసిన ఆవశ్యకత ఈదేశమున కలదని ఇంకొకసారి మీకు జ్ఞప్తిచేయుచున్నాను. అందు మీరు పూనవలసిన మొట్టమొదటి యంశముగ, అధోగతిపాలై పోవుచున్న కోట్లకొలది దీనజనుల దరికి పోవలయును. శ్రీకృష్ణభగవానుని యీ వాక్యమును మన నముచేసికొనుచు వారిని చేయి పట్టుకొని నడపవలెను :

"ఇహైవ తైర్జితః సర్గో ఏషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణితే స్థితాః"

అనగా బ్రహ్మము నిర్మలుడును సర్వసముడును అగుటచేత సర్వ సమత్వ భావమును మనసున స్థిరమొనర్చువారు ఈ జన్మయందే సంసారమును జయించుచున్నారు. కావున అటువంటివారు బ్రహ్మమునందే జీవించుచున్నారు.



# వేదాంతమతము

1897 సంవత్సరము, డిశంబరు 20 తేదీ, ఖేత్రీనగరము నందు శ్రీవివేకానందస్వాములవారు తాను బసదిగియున్న మహా రాజావారి భవనమునందు వేదాంతమతమును గుఱించి ఉపన్యా సము చేసిరి. ఆ సభకు అధ్యక్షత వహించిన మహారాజావారు శ్రీస్వాములవారిని సభ్యులకు ఎఱుకచేసిరి. అంతట శ్రీవారు గంటన్నరకు పైగా ఉపన్యసించిరి. శ్రీస్వాములవారు మహో త్సాహముతో మాటాడిరి. కాని ఆ యుపన్యాసము నంతను ఆమూలాగ్రముగ వ్రాయుటకు సంక్షిప్తలేఖరి లేకపోవుట విచార కరము. అందువలన ఆ సమయమున గుర్తుగ వ్రాసికొనిన ఉపన్యా సాంశముల యాధారమున ఈ క్రింది సారాంశమును మాత్రమే తెలుపగలుగుచున్నాము.

ప్రాచీనజాతులలో గ్రీకుజాతి, ఆర్యజాతి, అనెడు మహా జాతులు రెండు భిన్న భిన్న వాతావరణములలో, పరిస్థితులలో, వర్ధిల్లినవి. సృష్టిలోని సుందరమును, మధురమును, ఆకర్షవంత మును అగు సర్వమును గ్రీకుజాతిని ఆవరించి వెలసినది. అచటి శీతోష్ణస్థితి బలప్రవర్ధకముగ నుండెను. ఆర్యజాతిని ఆవరించి అన్ని వైపులను గంభీరదృశ్యములు వెలసినవి. శరీరపరిశ్రమకు మిక్కిలి అనుకూలముకాని శీతోష్ణస్థితిలో ఈ జాతి పుట్టి పెరిగినది. ఇట్లే రెండుజాతులును రెండు విశిష్టములును భిన్నములును అగు నాగర కాదర్శములను పెంపొందించినవి. గ్రీకులు చేసిన పరిశీలనము పూర్ణముగా వెలుపలి విషయముల గుఱించినది. ఆర్యులు చేసిన పరిశీలనము పూర్ణముగా ఆంతరవిషయములకు సంబంధించినది. ఒకరు పిండాండమును పరిశోధించిరి; రెండవ వారు బ్రహ్మాండ మును పరిశోధించిరి. ప్రపంచ నాగరకతలందు ప్రతిదానికిని విశిష్ట మగు కర్తవ్య మొకటి కలదు. ఒక నాగరకత మఱియొకదానిని అనుకరింపరాదు. కాని అవి తమ తమ అనుభవములను పోల్చి చూచుకొనునెడల ఉభయమును లాభము పొందును. ఆర్యులు స్వభావముచేత విశ్లేషణ ప్రియులు. వారు గణితశాస్త్రము నందును, వ్యాకరణశాస్త్రమునందును, అద్భుత ఫలితములను సాధించిరి. మనస్సును విశ్లేషించుటలో ఈ అన్వేషణము పూర్ణ పరిణామము పొందినది. పైతాగరస్సు, సోక్రటీసు, ప్లేటో, ఈజిప్షియనులగు నవీన ప్లేటో సిద్ధాంతులు రచించిన గ్రంథము లందు భారతీయ సిద్ధాంతములయొక్క జాడలు కాన్పించుచున్నవి.

ఆ పిమ్మట భారతీయ విద్యలయొక్క ప్రభావము యూరపు నందు ఎటుల వ్యాపించినదో వివరముగ తెలుపుచు ఆయా యుగ ములందు స్పెయిను, జర్మని మొదలగు యూరపుదేశములు ఎటుల మహోపకారములు పొందినవో స్వామివారు విశదీకరించిరి. భార తీయ రాజకుమారుడగు దారాషేకో ఉపనిషత్తులను పారసీకభాష

లోనికి అనువదించినాడు. ఆ గ్రంథముయొక్క లాటిను భాషాను వాదము స్కోపెన్‌హోరుగారికి లభించి యున్నది. వారి తత్త్వ సిద్ధాంతము వానిని అనుసరించినది. దాని తర్వాత కాంటుయొక్క తత్త్వశాస్త్రమునందు ఉపనిషదర్థములయొక్క జాడలు గోచరించు చున్నవి. యూరపునందు వివిధభాషావిజ్ఞానశాస్త్రములను పరిశీలించి వాని తారతమ్యము కనుగొనుటయందు అచ్చటి పండితులకు గల అభిలాషవలన వారు సంస్కృతభాషాభ్యాసమునకు పూనుకొనిరి. కాని 'డ్యూసేను' వంటి వారు కొందరు తత్త్వశాస్త్రమునందు ప్రత్యేకాభిలాషతో సంస్కృతమును పఠించిరి.

భావికాలమునందు ఎల్లరును సంస్కృతభాషాభ్యాసమునందు ఎక్కువ అభిమానము చూపవలెనని శ్రీ స్వాములవారు ఆశించిరి. తర్వాత "హిందూ" అను శబ్దము పూర్వకాలమునందు 'సింధునదికి ఆవల నివసించువారు' అని సూచించుచు సార్థకముగ నుండెననియు, ఇప్పుడు అది అర్థహీనమై పోయినదనియు, దానివలన ఈ జాతిగాని వీరి మతముగాని సూచింపబడుట లేదనియు, సింధునదికి ఈవలివైపున భిన్న భిన్న [illegible] అవలంబించు వివిధజాతులవారు ఎందరో నివసించుచున్నారనియు తెలిపిరి.

శ్రీ స్వాములవారు అటుపిమ్మట వేదములను గుఱించి దీర్ఘముగ ఉపన్యసించుచు అవి ఏ నరునిచేతను రచింపబడినవి కావనియు, అవి క్రమేణ పరిణామము పొందుచు వచ్చి ఒక గ్రంథరూపము తాల్చిన దివ్యభావములనియు తెలిపిరి. ఇప్పుడా గ్రంథము ప్రమాణ గ్రంథమైనది. అనేకమతములు పుస్తకములలో నిరూపింపబడినవనియు, ఆ పుస్తకముల ప్రభావము ఇంతింతయని చెప్పనలవికాదనియు తెల్పిరి. హిందువులకు వేదములు కలవు. వారా వేదములనే అనేక సహస్రాబ్దములు అనుసరింపవలసియున్నది. ఆ వేదముల గుఱించిన భావములు మాఱుచుండవచ్చును. కాని

శిలామయమగు పునాదులమీద ఆ భావములు పునర్నిర్మితములగు చుండవలయును. 'వేదము' లనగా పెద్ద గ్రంథరాశి. వానిలో నూటికి తొంబదితొమ్మిదిపాళ్లు కనబడుటలేదు. అవి కొన్ని కుటుంబముల వశమునందుండి ఆ కుటుంబముల నాశముతో అంత రించిపోయినవి. ఇప్పుడున్నవి సైతము తామున్న ఆ పెద్ద భవన ములోకూడ పట్టునవికావు. అవి పురాతనమగు భాషలో సరళ ముగా వ్రాయబడియున్నవి. వానియందలి వ్యాకరణము చాల అపరిష్కృతముగ నున్నది. కాబట్టి వేదములలో కొన్ని భాగములు అర్థమే యగుటలేదు.

ఆ తరువాత శ్రీ స్వాములవారు కర్మకాండ, జ్ఞానకాండ అనెడు వేదములయొక్క రెండుభాగముల గురించి విపులముగ చెప్పిరి. (1) కర్మకాండ, అనగా సంహితలు. (2) బ్రాహ్మణ ములు. బ్రాహ్మణములు యాగములనుగూర్చి తెలుపుచున్నవి. సంహితలు అనుష్టుప్పు, త్రిష్టుప్పు, జగతి మొదలగు ఛందస్సులలో వ్రాయబడిన గీతములు. ఇవి సాధారణముగ వరుణుడు, ఇంద్రుడు [illegible] దేవతలను గూర్చిన స్తోత్రములుగా నున్నవి. ఈ [illegible] ఎవరు అను ప్రశ్న బయలుదేరినది. వానిని గురించి ఏవేని సిద్ధాంతములు బయలుదేరగనే వానిని ఖండించివైచు వేరు సిద్ధాంతములును బయలుదేరుచునే యున్నవి.

శ్రీ స్వాములవారు అంతట పూజలను గురించిన వేర్వేరు భావములను వివరించి తెలుపసాగిరి. ప్రాచీన బాబిలోనియనులు జీవుడు శరీరమునందు ఆ రూపమే తాల్చి నిండియుండుననియు, వానికి స్వతంత్రరూపము లేదనియు, అతడు శరీరమును విడిచి వేరై యుండలేడనియు భావించెడివారు. ఈ జీవుడుకూడ ఆకలి దప్పులు అనుభవించుననియు పూర్వశరీరమునకు గల కామక్రోధా దులవంటివానినే పొందుచుండుననియు వారి నమ్మకము. పూర్వ శరీరమునకు హాని కలిగెనేని ఈ జీవునకును హాని కలుగును.

మొదటిది నాశమగునప్పుడు ఇదియు నాశమగును. కాబట్టి వారు మృతశరీరములను భద్రముగా కాపాడుటకు మిక్కిలి ప్రయత్నించెడివారు. ఈ రీతిగా మమ్మీలు, మసీదులు, సమాధులు వెలసినవి. ఈజిప్షియనులు, బాబిలోనియనులు, యూదులు, ఈ దేహాత్మభావనను దాటి దూరముగ పోజాలరైరి. వారికి గలిగిన ఆత్మభావన ఇంతే.

ఋగ్వేదమునందు పితృదేవతారాధన సూచనగనైనను కనబడదని ఆచార్య మాక్సుముల్లరుగారు అభిప్రాయపడిరి. కఠినములై మనవంక శూన్యభావముతో చూచు 'మమ్మీ'ల బీభత్స దృశ్యము అందు గోచరింపదు. అందలి దేవతలు నరునితో మైత్రిగలిగి యుండిరి. పూజితునియొక్కయు, పూజకునియొక్కయు సంబంధము నిర్మలముగా నుండెను. అందు వెగటుతనము లేదు. సంతోషమునకు కొఱత లేదు. మందహాసమునకుగాని, నేత్రముల తేజమునకుగాని లోపము లేదు. ఈ వేదముల గుఱించి ప్రసంగించు తఱిని దేవతల నగవులు తమకు వినవచ్చునటుల తోచునని స్వాముల వారు సెలవిచ్చిరి. వేదఋషులు భాషాసౌకుమార్యము తెలియని వారు కావచ్చును. కాని వారియందు సభ్యత సౌహార్ద్రము కలవు. వారితో పోల్చినపుడు మనము పశువులమో యనునటుల దోచును. స్వాములవారు తాము చెప్పుదానికి ఉదాహరణములుగా చాల మంత్రములను చదివిరి. ''పీనిని పితృదేవతలు నివసించు తావునకు, శోక దుఃఖములు లేని ఆ తావునకు తోడ్కొని పొమ్ము''. ఈ విధముగా మృతశరీరము ఎంత త్వరగా దహనమైన అంత మంచిదను భావము ఏర్పడినది. క్రమేణ ఒక సూక్ష్మశరీరము కలదనియు, అది దుఃఖము అనునది లేక కేవలానందముగల ఒకానొక తావునకు పోవుననియు వారు తెలిసికొనగల్గిరి. సెమిటిక్ జాతీయుల మతమునందు భయము, దుర్భర బాధ కాన్పించును. భగవంతుని చూచునెడల నరుడు మరణించునని

వారు తలచెడివారు. కాని ఋగ్వేదమతానుసారము నరుడు భగవంతుని ప్రత్యక్షముగ చూచునప్పుడు వాని సత్యజీవనము ప్రారంభమగును.

ఇక ఈ దేవతలు చేయుపని ఏమి? అనెడు సమస్య వచ్చినది. ఒక్కొకప్పుడు ఇంద్రుడు వచ్చి నరునకు సాయపడుచుండెడివాడు. ఒక్కొకప్పుడు ఇంద్రుడు మితిమీరి సోమపానము చేసెడివాడు. అప్పుడప్పుడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి మొదలగు లక్షణములు పూజకులు వానికి ఆరోపించెడివారు. వరుణుని సందర్భమునను ఇట్లే జరిగినది. ఇదేవిధముగ ఆ గ్రంథభాగము నడచినది. ఈ మంత్రములలో కొన్ని ఈ దేవతలను అభివర్ణించిన రీతి మహాద్భుతము. ఆ భావ అత్యంతగంభీరము. ఈ సందర్భమున ప్రళయవర్ణనచేయు నాసదీయసూక్తమును శ్రీ స్వాములవారు చదివి "చీకటి చీకటిని కప్పిపుచ్చెను" అనెడు భావము అందుండుటను తెలిపి ఇటువంటి కవనధోరణిని ఇట్టి గంభీరభావములను అభివర్ణించిన పురుషులు అనాగరికులును, అజ్ఞానులును అగునెడల మన మేమని పిలుచుకొనవలయును? అని ప్రశ్నించిరి. ఆ మహాఋషులను, ఇంద్ర, వరుణ, ఇత్యాది వారిదేవతలను విమర్శించుటగాని, ఖండనముచేయుటగాని తమపని కాదనిరి. ఇది అంతయు ఒక విశ్వరూపదర్శనమువలె రంగము పిమ్మట రంగముగ గోచరమునకు వచ్చుచుండెను. వీనికన్నింటికిని వెనుక ఆధారముగ "ఏకం సద్విప్రా బహుధావదన్తి" (కల బ్రహ్మము ఒకటియే. దానిని ఋషులు అనేక నామములతో పిలిచిరి) అను దివ్యభావన స్థిరముగ నిలుచుచున్నది. ఈ సర్వమును అలౌకికమై, అద్భుతమై, అత్యంతసుందరమై ఒప్పుచున్నది. అది ఇప్పటికిని అసామాన్యమై, అందరానిదై తోచుచున్నది. ఆ తెర అత్యంతము సూక్ష్మమై, తాకినమాత్రమున విచ్ఛిన్నమై, ఎండమావులవలె శూన్యమున కలిసిపోవుదానివలె తోచుచున్నది.

ఇటుల చెప్పుచు ఒక విషయము స్పష్టముగా జరిగియుండ నోపునని తెలిపిరి. అది ఏమన : ఆర్యులుకూడ గ్రీకులవలెనే తమ సమస్యా పరిష్కారము కొఱకు బాహ్య సృష్టిని ఆశ్రయించిరి. ఆ ప్రకృతి వారిని బాహ్యమునకు ఆకర్షించి క్రమేణసుందరమును, ప్రయోజనకరమును, అగు బాహ్యప్రపంచములోనికి నడపినది. కాని ఈ భారతదేశమున గంభీరతలేని దేనికిని గణ్యతలేదు. మరణ రహస్యములను కనుగొనవలెననెడు అభిలాష గ్రీకులకు పొడమినది కాదు. కాని ఇక్కడనన్నో ప్రప్రథమమునుండియు "నే నెవడను? మరణానంతరము నే నేమైపోదును?" అను ప్రశ్న పదేపదే స్ఫురించుచున్నది. అక్కడ గ్రీకులు నరుడు మృతినొంది స్వర్గమునకు పోవునని భావించిరి. ఈ స్వర్గమునకు పోవుట అనగా నేమి? ప్రతి దానిని విడిచి వెలువడి పోవుట అని వారి భావన. ఆంతర్యమున ఏమియు లేదు. సర్వమును వెలుపలనే యున్నది. ఇటుల తలంచి గ్రీకుదేశీయుడు బాహ్యమునకు తన అన్వేషణమును త్రిప్పినాడు. ఇంతేల? తాను సైతము తనకు వెలుపలనే యున్నటుల భావించెననవచ్చును. అతడు ఈ లోకమువంటిదే అయి దుఃఖము మాత్రములేని స్థలమునకు పోయిన యెడల తన ఈప్సితము లన్నియు నెఱవేరి తృప్తికలుగునని విశ్వసించినాడు. అంతటితో మతమును గుఱించిన వాని భావములన్నియు ఆగిపోయినవి. కాని ఇది హిందువుయొక్క మనస్సునకు తృప్తికరముగ తోచలేదు. వాని పరిశోధనయందు ఈ స్వర్గములన్నియు భౌతిక జగత్తు లోపలనే ఇమిడియున్నవి. "ఏయ్యది ద్రవ్యసమ్మేళనముచేత నేర్పడునో అది విచ్ఛిన్నమై నశించు"నని హిందువులు భావించిరి. నీవు ఆత్మను ఎఱుగుదువా? అని బాహ్యప్రకృతిని వారడిగిరి. నాకు తెలియదు అని ఆ ప్రకృతి బదులు చెప్పినది. దేవుడుకలడా? అని అడుగగా నే నెఱుగనని ప్రకృతి ప్రత్యుత్తరమిచ్చినది. అంతట వారు ప్రకృతినుండి మరలిపోయిరి. ఈ బాహ్యప్రకృతి యెంత

గొప్పదైనను అది దేశకాలములలో బంధింపబడినదే యని వారు గ్రహించిరి. అంతట ఇంకొక వాణి వినవచ్చినది. నవీనములగు దివ్యభావములు వారి మనస్సులందు ఉదయించినవి. "నేతి, నేతి" (ఇదికాదు, ఇదికాదు) అని ఆ వాణి పలికినది. ఆ యా దేవతలందఱును ఒక్కటిగా మాఱిపోయిరి. సూర్యులు చంద్రులు నక్షత్రములు ఇంతేల, బ్రహ్మాండమంతయు ఒక్కటై పోయెను. శ్రోత్రదగు ఈ ఆధ్యాత్మికాదర్శముపై మతమును నిర్మించిరి.

"న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం।
నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః॥
తమేవ భాన్త మనుభాతి సర్వం।
తస్య భాసా సర్వమిదం విభాతి॥"

(అచ్చట సూర్యుడు ప్రకాశింపడు; చంద్రుడు ప్రకాశింపడు; నక్షత్రములును ప్రకాశింపవు, మెఱుపు సైతము ప్రకాశింపదు. ఇక ఈ అగ్నిని గుఱించి చెప్పనదేమి? అతడు ప్రకాశింపగా సర్వమును ప్రకాశించుచున్నది. వానిద్వారమున సమస్తమును ప్రకాశించును). ఇక ఆ పరిమేయమును మూఢమునగు సగుణ భావన అక్కడ నిలువలేదయ్యె. పుణ్యపాపముల విచారణచేయుచు కూర్చుండు దేవతలయొక్క అల్పభావన ఇంక అక్కడ కానరాదు. వెలుపల సాగిన అన్వేషణము ఇక కట్టువడినది. అంతటినుండి ఆ అన్వేషణము ఆభ్యంతరమునకు తిరిగినది. ఈ విధముగా ఉపనిషత్తులు మనదేశమునకు బైబిలుగా నేర్పడినవి. ఈ ఉపనిషత్తులు బహువిశాలమగు వాఙ్మయము. భారతదేశములోని వివిధ సిద్ధాంతములుగల సంప్రదాయము లన్నియు ఉపనిషత్తులనెడు పునాదుల మీదనే నిర్మితములైనవి.

అంతట శ్రీస్వాములవారు ద్వైత అద్వైత విశిష్టాద్వైతములను తీసికొని వీనిలో ప్రతిదియు వేఱొకదానిని చేరుటకు గడవవలసిన సోపానమువలె నుండెనని చెప్పి వానికి సమన్వయము

కూర్చిరి. తుదిని అద్వైతముగా పరిణమించుట సహజమగు ఫలిత మనియు 'తత్త్వమసి' అనునది కట్టకడపటి మెట్టు అనియు తెలిపిరి. శంకరాచార్యులు రామానుజాచార్యులు మధ్వాచార్యులు మొదలగు భాష్యకారులుసైతము పొరపాటులను చేసిరి. ప్రతివారును ఏకైక ప్రమాణముగా భగవద్గీతలను విశ్వసించిరి. కాని అవి ఒకే విషయమును, ఒకేమార్గమును బోధించుననుకొనిరి. అటుల శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమనెడు ఒకేవిషయమును ఉపనిషత్తులన్నియు బోధించుననియు, ఇతరము నేమాత్రమును బోధించుట లేదనియు ఊహించుటలో పొరపడిరి. కాబట్టి ఎక్కడెక్కడ స్పష్టముగా ద్వైతపరమగు వాక్యము కాన్పించినను, ఆయన తన సిద్ధాంతమును బలపఱచునట్టి అర్థము వచ్చునటుల దానిని తికమకలు చేసినారు. స్పష్టముగా అద్వైతపరములగు వాక్యములు వచ్చినప్పుడు రామానుజాచార్యులవారును మధ్వాచార్యులవారును అటులేచేసిరి. ఉపనిషత్తులు ఒకే విషయమును బోధించుననుట సత్యమే! కాని ఒక మెట్టునుండి మఱొక మెట్టునకు ఎక్కిపోయినట్లు విషయమును క్రమపరిణతముగా అవి నిరూపించుచున్నవి. ఆధునిక భారతదేశమున ఆధ్యాత్మికభావము అంతరించిపోయి బాహ్యకర్మలుమాత్రము నిలిచియుండుటను గుఱించి స్వామివారు విచారమును దెలిపిరి. నేటి ప్రజలు హిందువులు కారు; వేదాంతులును కారు; వారు "నన్ను తాకకు" అను సంప్రదాయమువారై పోయిరి. వారికి వంటయిల్లే దేవాలయము; కూటి కుండలే దేవతలు. ఇట్టి దుర్దశ అంతరింపవలయును. దానిని మనము ఎంత త్వరలో త్యజించిన మన మతమునకు అంత మేలు! ఉపనిషత్తులను వానిస్వకీయతేజస్సుతో ప్రకాశింపనిండు. వేర్వేఱు సంప్రదాయముల మధ్య పోట్లాటలను అంతరింప జేయుడు.

శ్రీవారు జబ్బుగానుండుటచేత ఇంతవఱకు మాటాడుసరికి అలసిపోయిరి. కాబట్టి శ్రీవారు ఒక అరగంటసేపు విశ్రాంతి

తీసికొనిరి. అంతసేపును సభ్యులు ఉపన్యాసముయొక్క మిగత భాగము వినుటకొఱకై చాల ఓపికతో వేచియుండిరి. పిమ్మట శ్రీవారు వెలుపలికి వచ్చి ఒక అరగంట సేపు మరల మాటాడిరి. జ్ఞానమనగా భిన్నత్వమున ఏకత్వమును కనుగొనుటయే యనిరి. ప్రతి శాస్త్రముయొక్క పరమావధియు సర్వవిధభిన్నత్వమునకు వెనుకనుండు ఏకత్వమును కనుగొనుటే. ఈ యంశము భౌతిక శాస్త్రమందెటులో ఆధ్యాత్మికశాస్త్రమునందును అటులే పరమ సత్యము అని తెలిపిరి.



# ఇంగ్లండులో భారతీయాధ్యాత్మిక భావనా ప్రాబల్యము

1898-వ సంవత్సరము మార్చి 11-వ తేది కలకత్తాయందలి స్టార్ థియేటర్‌లో సోదరినివేదిత (మిస్. ఎం. ఇ. నోబెల్) పై విషయమునుగూర్చి ఉపన్యసించిరి. ఆ సభకు అధ్యక్షతవహించిన శ్రీమద్వివేకానందస్వాములవారు మిస్ నోబెల్‌ను సభ్యులకు పరిచయము చేయుచు ఇట్లు ప్రసంగించిరి :

నేను ఆసియాఖండపు ప్రాచ్యదేశములలో పర్యటించు చున్నప్పుడు ముఖ్యముగా ఒక్క విషయమును గాంచి చకితుడ నైతిని. ఆ దేశములలో నెల్ల భారతీయాధ్యాత్మికభావములు నేటికిని మిక్కిలి ప్రచారమునం దున్నవి. చైనా, జపాను దేశము లలో దేవాలయకుడ్యములపై సుప్రసిద్ధములగు కొన్ని సంస్కృత మంత్రములు లిఖింపబడియుండుట చూచినపుడు నే నెంత ఆశ్చర్య పడియుందునో మీ రూహించుకొనవచ్చును. ఆ మంత్రములన్నియు ప్రాచీన వంగభాషాలిపియం దున్నవి. ఈ విషయము మీకు

మఱింత ప్రీతిని కల్గింపగలదు. మన తాత ముత్తాతల మహాశక్త్యుత్సాహములకు స్మృతిచిహ్నములుగా అవి నేటికిని అట్లే నిలిచియున్నవి.

ఆసియా దేశములందే కాక భారతీయాధ్యాత్మిక భావములు సర్వత్ర వ్యాపించియుండె ననుటలో సంశయము లేదు. చివరకు పాశ్చాత్య దేశములందు సైతము నేటికిని వాని ప్రభావపుజాడలు, కొంచెము తఱచిచూడ, నాకు కాన్పించినవి. భారతీయుల ఆధ్యాత్మిక భావములు పూర్వకాలమున ప్రాక్పశ్చిమములకు వ్యాపించెననుట చారిత్రకసత్యము. ప్రపంచము భారతీయాధ్యాత్మికత కెంత ఋణపడియున్నదో, భూత, వర్తమాన కాలములందు ఆ ఆధ్యాత్మికశక్తులకు విశ్వమానవ సమాజముపై ఎంతటి ప్రభావము కలదో ఎల్లరకు తెలియును. ఇవియెల్ల గతించిపోయిన విషయములు. నేను మఱియొక విశిష్టవిషయమునుగూడ గ్రహించితిని. అది నాగరికతా మహాశక్తుల విజృంభణమునకు, మానవతా వికాసమునకు, సాంఘికాభ్యుదయమునకు ఆ ఆంగ్లోసాక్సన్ జాతి—ఆ అద్భుతజాతి—చేసిన మహాకృషి! ఆ ఆంగ్లోసాక్సన్ జాతి అట్టి కృషి సల్పకుండియే యున్నచో మన మీనాడు ఇచ్చట చేరి యీ విషయమును గూర్చి యీ విధముగా చర్చించుటయే సంభవించియుండెడిది కాదని నేను మీకు స్పష్టముగ చెప్పుచున్నాను. మన దేశమునందు సైతము ఈ ఆంగ్లోసాక్సన్ శక్తుల ప్రభావము కానవచ్చుచున్నది. ఆ శక్తులలో కొన్ని లోపములున్నను తమ సహజ విశిష్టలక్షణముల నట్లే నిలుపుకొని సత్ఫలితములనే సాధించినవి. ఆంగ్లేయుల 'వ్యాప్తి', 'అభ్యుదయము', 'ఆత్మవ్యక్తీకరణము' అనెడు భావములు నేడు మనపై నెక్కువగ పనిచేయుచున్నవి. ఈ సందర్భమున మన మొక్క విషయమును జ్ఞప్తియందుంచుకొనవలయును. పాశ్చాత్యుల నాగరకతయంతటికిని గ్రీకు నాగరకతయే ఆధారము. ఆ గ్రీకుల మహానాగరకత యందలి ప్రముఖలక్షణము 'వ్యక్తీకరణము'. ఇక్కడ, భారతదేశమున,

మనము ఆలోచింతము. దురదృష్టవశమున ఒక్కొక్కప్పుడు మన ఆలోచన మతింత తీవ్రమై వ్యక్తీకరించు శక్తి శూన్యమైపోవును. ఇందుచే క్రమముగా లోకమునెదుట మన వ్యక్తీకరణశక్తి అదృశ్యమై పోయినది. తత్ఫలితమేమో తెలియునా? మనకున్న ప్రతిదానిని దాచుకొనుటకే మనము ప్రయత్నించుచు వచ్చితిమి. వ్యక్తులతో ప్రారంభమైన ఈ దాపరికము చివరకు జాతీయ లక్షణముగా పరిణమించినది. తత్ఫలితముగా నేడు మన మొక మృతజాతిగా పరిగణింపబడుచున్నాము. వ్యక్తీకరణశక్తి లేక ఏ జాతిగాని జీవించుటెట్లు? వ్యాప్తి, వ్యక్తీకరణము అనునవి పాశ్చాత్యనాగరకతకు వెన్నెముకవంటివి. ఇప్పుడు ఆంగ్లోసాక్సనుజాతి మనదేశములో భారతజాతి స్వయంవ్యక్తమగునట్లు చేయుచున్నది. భారతదేశమునం దింతకాలముగ గుప్తమైయున్న అపారనిధులను ప్రపంచమునెదుటకు తెచ్చుటకై ప్రయత్నించుచున్నది. ఇందుల కవసరమైన సాధనసంపత్తిని కూడ ఆ జాతియే సమకూర్చుచున్నది. ఆ జాతియే మన హిందూదేశమున కొక భవిష్యత్తును సృష్టించినది. మన ప్రాచీనుల భావరాశి ఇప్పుడెచ్చట వ్యాపించి యున్నదో సులభముగనే దృగ్గోచరమగుచున్నది. నిజమునకు మనపూర్వులు సత్య, నిర్వాణములగూర్చిన తమ సందేశములను దిగంతవ్యాప్తమొనర్చినపుడు వారికే సౌకర్యము లుండినవి? బుద్ధభగవానుడు ఉదాత్తమగు తన విశ్వమానవసౌభ్రాత్రసిద్ధాంతమును ఎట్లు బోధింపగలిగెను? ఆనాడుకూడ మనదేశమున సత్యమగు ఆనందమును పొందుటకు పెక్కుమార్గములుండెను. మనము మన భావములను వ్యాప్తిగావించుటకు అనేక సౌకర్యములుకూడ నుండెను. ఇప్పుడు మనకు ఆంగ్లోసాక్సన్ జాతితోకూడ సంబంధ మేర్పడినది. నేడు మనసందేశములను లోకమెల్ల వినుచున్నది. వినుటయేకాదు, విని స్పందించుచున్నది. ఇంగ్లండుదేశము తన మహామేధావులను కొందఱను మనకు కర్తవ్యనిర్వహణము సాయపడుటకై అప్పుడే పంపినది. ఇప్పుడు ఈ వేదికపై ఆసీను

రాలైయున్న నా మిత్రురాలు మిస్ ముల్లర్‌నుగూర్చి మీ రెల్లరు వినియేయుందురు. మీలో కొంతమందికి ఆమె పరిచితురాలు కూడ నేమొ. ఆంగ్లదేశమున ఒక సత్కుటుంబమున జన్మించి విద్యావతియైన ఈమె మన జాతిపైగల అభిమానముచే మనదేశమును తన స్వగృహముగ, సంసారముగ చేసికొని తన జీవిత సర్వస్వమును మనకొఱకు ధారవోయుచున్నది. ఈ విధముగనే భారతదేశ శ్రేయస్సునకును, భారతజాతి పునరుజ్జీవనమునకును తన యావజ్జీవితమును అంకితముచేసిన మఱొక ఉత్తమాంగ్ల వనితనుగూర్చి నేను మీకు చెప్పనక్కఱలేదనుకొందును. ఆమెయే మిసెస్ బెసెన్ట్. ఈ కర్తవ్యనిర్వహణమునకే కంకణము కట్టుకొన్న మఱి యిద్దఱు అమెరికన్ మహిళామణులుకూడ ఈ సభావేదికపై కూర్చుండియున్నారు. మన నిర్భాగ్యదేశమునకు ఏకొలదిపాటి మంచినైనను చేయుటకై! తమ జీవితమెల్ల కృషి సల్పుటకు వారు సంసిద్ధముగ నున్నారు. ఈ సందర్భమున ఇంగ్లండు, అమెరికాదేశములందు పర్యటించిన మనదేశీయు నొకని గూర్చి మీకు జ్ఞప్తి చేయవలసియున్నది. అతనియెడ నాకు అపారమగు ప్రేమ, భక్తి, విశ్వాసములు కలవు. అత డీసభకు వచ్చియుండెడివాడే. కార్యాంతరముండుటచే రాలేకపోయినాడు. ఉన్నత ఆధ్యాత్మికపరుడగు ఆ వ్యక్తి మనదేశ పురోభివృద్ధికై నిరాడంబరముగా, నిరంతరము కృషిసల్పుచున్నాడు. ఆయనపేరు మోహినీమోహనచటర్జీ. ఆంగ్లదేశము మిస్ మార్గరెట్ నోబెల్ రూపమున ఒక క్రొత్త బహుమతిని పంపినది. ఈమెయెడ నా కెక్కువ గౌరవము కలదు. ఇంక నే నేమియు ఎక్కువ ప్రసంగింపక మిస్ నోబెల్‌ను ఉపన్యసింపవలసినదిగా కోరుచు నా పరిచయవాక్యములను ముగించుచున్నాను.

సోదరి నివేదిత తన గంభీరోపన్యాసమును గావించిన పిమ్మట స్వాములవారు లేచి యిట్లు చెప్పిరి :

నేను చెప్పవలసినది కొంతమాత్రమే ఉన్నది. భారతీయుల మగు మనము ఏదోకొంత సాధింపగలమను భావము మనకున్నది. ఈ భావము వంగదేశీయులకు హాస్యాస్పదముగా నుండవచ్చును. కాని నాకుమాత్రము హాస్యాస్పదముగ గన్పట్టుటలేదు. మీలో ఒకసంచలనము కలిగించుటయే నా జీవితలక్ష్యము. నీవు ద్వైతి వైనను విశిష్టాద్వైతివైనను అద్వైతివైనను లెక్కలోనిదికాదు. కాని ఎల్లప్పుడు విస్మరింపబడుచున్న ఒక్కవిషయమువైపు మీ దృష్టిని మరల్పుడు. — "మానవుడా! ఆత్మవిశ్వాసము కలిగి యుండుము!" ఆత్మవిశ్వాస మున్నప్పుడే భగవంతునిపై మనకు విశ్వాస మేర్పడును. నీవు ద్వైతివి కావచ్చును; అద్వైతివి కావచ్చును. యోగసాధనముపై నీకు నమ్మకముండవచ్చును; లేదా శంకరాచార్యుల పద్ధతియందు నమ్మకముండవచ్చును. వ్యాసవిశ్వామిత్రులలో ఎవరినైనను అనుసరింపవచ్చును. అది యెల్ల అప్రస్తుతవిషయము. ఈ విషయమున భారతీయ దృక్పథము ప్రపంచములోనికెల్ల విభిన్నమైనదని మనము గమనింపవలయును. ప్రపంచములోని ప్రతిదేశమందును, మతమునందును ఆత్మశక్తి నిర్లక్ష్యము చేయబడినది; ఆత్మ శక్తి లేనిదిగను, బలహీనమైనది గను, అచేతనమైనదిగను భావింపబడినది. భారతీయులమగు మనము ఆత్మను శాశ్వతమైనదానినిగా భావింతుము. శాశ్వతమే గాక దోషరహితమనియు పరిపూర్ణత్వము నందినదనియు తలం తుము. ఉపనిషద్వాక్యములనే మన మెల్లప్పుడు ప్రమాణముగ గ్రహింపవలయును.

జీవితమున మీ కర్తవ్యమును విస్మరింపకుడు. భారతీయులు —విశేషించి వంగదేశీయులు—విదేశభావములకు దాసులై మన మతపుటాయువుపట్లనే పెకలించివైచుచున్నారు. ప్రస్తుతము మన మెందుకింత వెనుకబడియున్నాము? మనలో నూటికి తొంబది తొమ్మిదిమంది విదేశభావప్రభావములకు ఎందుకులోనైయున్నారు?

మన మితరజాతుల ప్రమాణమును అందుకొనవలెనన్న ఈ దోష మును తొలగింపవలయును. మనము పురోభివృద్ధి చెందవలయు నన్న పాశ్చాత్యులనుండి నేర్చుకొనవలసిన విషయములుకూడ అనేకములున్నవి. వారినుండి మనము వారి కళలను, శాస్త్రము లను నేర్చుకొనవలయును. భౌతికప్రపంచ సంబంధములగు శాస్త్ర ములను మనము వారినుండి నేర్చుకొన్నట్లే పాశ్చాత్యులు మత మును, ఆధ్యాత్మికజ్ఞానమును నేర్చుకొని జీర్ణము చేసికొనవలెనన్న మనదగ్గఱకు రావలసినదే. హిందూమతస్థులమగు మనము ప్రపం చమునకు ఉపదేశకులమని విశ్వసింపవలయును. రాజకీయపు హక్కులు మొదలగు వానిని పొందుటకు మనము ఆందోళన చేయుచున్నాము, మంచిదే. హక్కులు, అధికారములుమున్నగు వానిని స్నేహభావముచేత మాత్రమే పొందగలము. స్నేహభావ మెప్పుడును సమానులమధ్యనే యుండగలదు. ఇరువురిలో ఒకడు యాచకుడైనపుడు వారిమధ్య ఎట్టి స్నేహముండునో యూహిం పుడు. పరస్పరసహకారము లేనిచో మనము గొప్పవారము కాజాలము. కావున యాచకులుగాగాక మత ప్రవక్తలుగా అమెరికా, ఇంగ్లండు దేశములకు పొండు. ఒకరినుండి ఒకటి గ్రహించునపుడు సాధ్యమైనంతవఱకు దానికిబదులుగా మీకున్న దేదో యిండు. ఐహికజీవితమును సుఖవంతముచేయు మార్గము లను, పద్ధతులను మనము వారినుండి నేర్చుకొనుచున్నప్పుడు శాశ్వతముక్తిపొందు మార్గములను మనము వారికేల బోధింప రాదు? అన్నిటికంటె మానవజాతి పురోభివృద్ధికై ఎల్లప్పుడు పాటుపడుడు. సంకుచితమైన మీ సనాతనాచారమును గూర్చి గర్వింపకుడు. ప్రతివాడు మృత్యుముఖము చొచ్చుట నిజము. ఈ చారిత్రక మహత్తరసత్యమును గుర్తుంచుకొనుడు. భారతీయ వాఙ్మయమున మూర్తీభవించియున్న శాశ్వతసత్యములను గ్రహిం చుటకు ప్రపంచములోని అన్ని దేశములును భారతమాతృ పాద ములు సమాశ్రయింపవలసినదే. భారతదేశమునకు మృతిలేదు.

చైనాకు మృతిలేదు. అట్లే జపానుదేశమునకును మృతిలేదు. కావున ఆధ్యాత్మికతయే మన వెన్నుముకయని ఎల్లప్పుడు జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఇప్పుడు నేను చెప్పుచుండిన మార్గమున పురోగమించుటకు ఒక మార్గదర్శకుడు కావలయును. ఈ విషయ మును మీలో నెవరైన నమ్మనిచో, ఆధ్యాత్మికతయే తన మత మని నమ్మని హిందూబాలు డెవడైన మనలోనున్నచో వానిని నేను 'హిందువు' అని అనజాలను. కాశ్మీరుదేశమున ఒక పల్లె టూరిలో నేనొక ముదుసలి మహమ్మదీయ స్త్రీతో మాటాడు నపుడు నీ దేమతమని అడుగ ఆమె "ప్రభువునకు ధన్యవాదములు. దేవునికటాక్షమువలన నేను ముసల్మానుస్త్రీని" అని ఆమె బదులు చెప్పెను. అట్లే ఒక హిందువును ప్రశ్నించినపుడు తాను హిందువు నని చెప్పెను. ఈ సందర్భమున కఠోపనిషత్తులోని 'శ్రద్ధ' అను పదము నాకు జ్ఞప్తికివచ్చుచున్నది. శ్రద్ధకు నచికేతుని జీవితమొక గొప్ప ఉదాహరణము. శ్రద్ధ - సంపూర్ణవిశ్వాసము - కల్గిం చుటయే నా జీవితలక్ష్యము. మానవజాతికిని, అన్ని మతముల కును, శ్రద్ధయే మూలకందమని నేను నొక్కి చెప్పుచున్నాను. మొదట ఆత్మవిశ్వాసము కలిగియుండుడు. ఒకటి చిన్న బుద్బు దము కావచ్చును, ఇంకొకటి పెద్ద తరంగము కావచ్చును. కాని ఈ రెంటికి వెనుక అనంతసాగరమున్నదని గ్రహింపుడు. కాబట్టి ఎవరుగాని నిరాశ చెందవలసినపనిలేదు. అందఱికి ముక్తియున్నది. ప్రతివ్యక్తియు మొదట మాయనుండి విముక్తి చెందవలయును. స్థిరమైననమ్మకము అకుంఠితప్రయత్నమునకు దారితీయును. ఆ నమ్మకము మనలోనుండెనా? మానవజాతియొక్క పరమాదర్శము లెల్ల బోధింపబడిన వ్యాసార్జునులకాలమునాటి మన జాతీయజీవన మును మనము మరల పొందగలము. ఆధ్యాత్మికదృష్టిలోగాని, భావములోగాని మనము ప్రస్తుతము చాల వెనుకబడియున్నాము. పూర్వము భారతదేశమున ఆధ్యాత్మికతకు కొఱతలేదు. అందు చేతనే నాటిజాతులలో భారతజాతి గొప్పదిగా పరిగణింపబడినది.

సంప్రదాయములు, ఆశలు నమ్మదగినవే ఐనచో ఆ దినములు మరల తప్పక వచ్చును. అది మీపై ఆధారపడి యున్నది. (తరువాత వంగదేశపు యువకుల నుద్దేశించి స్వాములవారిట్లు చెప్పిరి.) మీరు ధనవంతుల, గొప్పవాండ్ర, సాయము నపేక్షింపకుడు. ప్రపంచములో అద్భుతకృత్యములన్నియు బీదలే చేసిరి. బీదవారు ముందుకు వచ్చినచో ఏ కార్యమునైనను చేయవచ్చును. తప్పక చేయవలయును. మీరు దారిచూపితిరా, తరువాత మి మ్మనేకులు అనుసరింతురు. నిశ్చలమును, నిష్కల్మషమును, నిష్కపటమును అగు కార్యదీక్షను గలిగియుండుడు. ఫలితమునుగూర్చి సంపూర్ణ విశ్వాసముంచుడు. వంగయువకులే భారతదేశముక్తికై పాటుపడవలసియున్నది. మీరు నమ్మినను, నమ్మకపోయినను దీనినే మీ లక్ష్యముగ నుంచుకొనుడు. ఈ పని త్వరలో, నేడో, రేపో, పూర్తియగునని తలపకుడు. నా శరీరముపైన, ఆత్మపైన నాకు నమ్మకమున్నట్లే ఇందులోను నాకు నమ్మకమున్నది. కావున నా హృదయము ఎల్లప్పుడు మీకార్యసఫలతనే కోరుచుండును. అంతయు ధనములేని మీపై నాధారపడియున్నది. బీదవారు కాబట్టి మీరు పనిచేయుదురు, నిష్కపటముగా నుందురు; ఉన్న దానిని త్యాగముచేయుటకు వెనుదీయరు. అదియే యిదివఱకు మీకు చెప్పుచుండినవిషయము. దానినే మరలచెప్పి మిమ్ము హెచ్చరించుచున్నాను. ఇది మన జీవితలక్ష్యము. మీ రే మతశాఖకు చెందినను నాకు లెక్కలేదు. మానవులందఱు తుదకు సిద్ధిపొంది తీరగలరను హృదయపూర్వక అచంచలవిశ్వాసము భారతీయులందఱియందును ఉన్నదని నేను చెప్పగలను. ఈ విశ్వాసము నాహృదయమందు గలదు. ఈ విశ్వాసమే సర్వమానవ హృదయములందును నెలకొనుగాక!



# సన్న్యాసము - దానిలక్ష్యము, సాధనము

శ్రీమద్వివేకానందస్వాములవారు రెండవపర్యాయము (19-వ తేది జూన్ 1899) పాశ్చాత్యదేశములకు వెళ్లు సందర్భమున బేలూరు మఠసన్న్యాసులలో పిన్నలు శ్రీవారికి వీడ్కోలు పత్రము సమర్పించిరి. ఆ పత్రమునకు శ్రీవారిచ్చిన సమాధానమున క్రిందిది సంగ్రహరూపము. మఠమునకు సంబంధించిన దినచర్యగ్రంథములో ఇది వివరింపబడినది :

దీర్ఘోపన్యాసమున కిది అదనుకాదు. కాని కొన్ని విషయములను గూర్చి మీకు క్లుప్తముగా చెప్పెదను. వానిని మీ రాచరణలో నుంచవలయునని నా కోరిక. మొదట లక్ష్యమును మనము అర్థముచేసికొనవలయును. తరువాత దానిని ఆచరణలో నుంచు మార్గముల నన్వేషింపవలయును. సన్న్యాసులైన మీరు ఇతరులకు సదా మేలు చేయ ప్రయత్నింపవలయును. సన్న్యాస మనగా అదియే అర్థము. సన్న్యాసమును గూర్చి దీర్ఘోపన్యాసము నిచ్చుటకు వ్యవధిలేదు. కాని మృత్యుప్రేమయే సన్న్యాసముయొక్క ప్రధానలక్షణమని క్లుప్తముగా చెప్పగలను. లౌకికులు జీవితమును అభిలషింతురు. సన్న్యాసి మృత్యువు నభిలషింప వలయును. అయినచో మనము ఆత్మహత్య చేసికొనవలయునా? కాదు కాదు. ఆత్మహత్య గావించుకొనువారందఱు మృత్యువును ప్రేమించువారు కారు. ఏలయన ఆత్మహత్యాప్రయత్న మొకసారి విఫలమాయెనా, తిరిగి వారు తత్ప్రయత్నమును చేయరు. లౌకికానుభవమువలన మన కీవిషయము విదితమగుచున్నది. అయిన మృత్యువును ప్రేమించుట అననేమి? మన మెప్పుడో ఒకప్పుడు చావవలయును. ఇది తప్పదు. అట్టిచో మనము సత్కార్యమునకై ప్రాణము లర్పింతము. మనము చేయు ప్రతి

కార్యమును తినుట, త్రాగుట మొదలగునవన్నియు—ఆత్మ త్యాగమునకు దారితీయుగాక. తినుటచే శరీరము పెరుగును. ఇతరుల మేలుకొఱకై తచ్ఛరీరమును త్యాగము గావింపనిచో దానివలన ఫలమేమి? పుస్తకములను చదివి జ్ఞానమును పెంపొందించుకొందురు. లోకమునకు వినియోగింపకున్నచో లోకహితార్థము నీవు త్యాగము సలుపనిచో ఆ జ్ఞానమువలనకూడ ప్రయోజనములేదు. సమస్త వసుంధర ఒక్కటే. అందు అంతగా ప్రాముఖ్యములేని అంశము నీవు సుమా! కావున స్వార్థమునకై పాటుపడుటకంటె కోట్లకొలది సోదరప్రజానీకమునకు సేవచేయుట మంచిది.

''సర్వతః పాణిపాదం తత్ సర్వతో ఒక్షి శిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥''

సర్వత్ర విస్తరించిన హస్తములతోను, పాదములతోను, ఎల్లెడల గల కన్నులతోను, శిరములతోను, నోళ్లతోను, సమస్త విశ్వమందు విస్తరించిన వీనులతోను అది అన్నిటియందును పరిఢవిల్లుచున్నది. (గీత. 13 వ అధ్యా. శ్లో. 13).

ఇట్లు మీరు క్రమముగా మృత్యుముఖమును సమీపింపవలయును. అట్టి చావులోనే స్వర్గమున్నది. అందే మంచి అంతయు సంచితమై యున్నది. తద్వ్యతిరిక్తమైనదంతయు దుష్టమే, పైశాచమే!

ఇక లక్ష్యముల నాచరణలోనుంచు మార్గములగూర్చి ఆలోచింతము. ఆచరణసాధ్యముగాని ఆదర్శమును మనము గ్రహింపరాదు. అసాధ్యమగు అత్యున్నతాదర్శము జాతిని బలహీనమును, పతితమును నొనర్చును. బౌద్ధ జైన మతములు వచ్చిన తరువాత ఈగతియే పట్టినది. అట్లని సులభసాధ్యమగు ఆదర్శమును గ్రహించుటకూడ దోషమే. మీకు కొంచెమైనను

ఆలోచనాశక్తి లేకున్నచో, మార్గదర్శకమగు ఆదర్శము లేకున్నచో, మీరు కేవలము పశుతుల్యులే. కావున మీ ఆదర్శమును తగ్గించు కొనరాదు. అట్లని అసాధ్యమునకై ప్రయత్నింపరాదు. ఈ రెండును విసర్జనీయములే. మనదేశమున పూర్వమునుండియు ఏదో ఒక గుహలో కూర్చుండి ధ్యానము చేయుచు జీవముల త్యజింపవలయునను భావము కలదు. ఇతరుల విముక్తికై పాటు పడక ఒక్కడుమాత్రమే విముక్తి నొందుట మంచిదికాదు. సోదర మానవుల ముక్తికై పాటుపడనిదే తనకు ముక్తి లేదని మానవుడు గ్రహించు దినములు ఎప్పుడో ఒకప్పుడు వచ్చును. ఉన్నతాదర్శ ముతో ఉత్తమాచరణమును మీ జీవితములో సమన్వయపఱచు టకు ప్రయత్నింపుడు. ఈ క్షణమున మీరు నిశ్చలసమాధిగతు లగుటకు సిద్ధముగ నుండవలయును; మరుక్షణముననే ఇదిగో, ఈ పొలములకుపోయి అందు పనిచేయుటకుకూడ సిద్ధపడవలయును; (అచ్చటి పొలములను చూపుచు స్వాములవా రీ మాటలు చెప్పిరి.) ఈ క్షణమున మీరు శాస్త్రములలోని గూఢార్థములను విప్పిచెప్పుటకు సిద్ధముగ నుండవలయును; ఆ మరుక్షణముననే పండించిన ఈ ధాన్యమును సంతకు తీసికొనిపోయి అమ్ముటకును సిద్ధపడవలయును. ఇచ్చటనే కాదు, ఎచ్చటనైనను మీరు ప్రతి చిన్నకార్యమునకు సంసిద్ధులై యుండవలయును.

జ్ఞాపకముంచుకొనవలసిన విషయము మఱొకటి యున్నది. నిజమైన మానవులను తయారుచేయుటయే ఈ మఠముయొక్క ఉద్దేశము. మీరు కేవలము ఋషులు చెప్పినదానిని నేర్చుకొను టతో తృప్తిపడరాదు. ఆ ఋషులు గతించిరి. వారితో వారి అభిప్రాయములును పోయినవి. ఇప్పుడు మీరే ఋషులు కావల యును. మీరుకూడ ఇదివఱకు జన్మించిన మహాపురుషులవంటి వారే. అంతేకాదు. మీరు అవతారపురుషులవంటివారుకూడ. కేవల పుస్తకజ్ఞాన మేమి చేయగలదు? తపస్సుమాత్ర మేమి

సాధింపగలడు? మంత్ర తంత్రము లేమి చేయగలవు? మీ పాద ములపై మీరు నిలువవలయును. నిజమైన మానవులు తయారగు ఈ క్రొత్తమార్గమును మీ రనుసరింపవలయును. మూర్తిగొన్న బలమును, స్త్రీసహజమగు కోమలహృదయమును గలవాడే నిజమైన మానవుడు. మీ చుట్టుపట్లగల ప్రజలయెడ సానుభూతి గలిగియుండవలయును. దానితోబాటు పరిసరములకు లొంగని ధైర్యమును, బలమును ఉండవలయును. విధేయతగూడ ఉండ వలయును. ఇది అసంబద్ధముగా కన్పట్టుచున్నప్పటికి పరస్పర విరుద్ధములగు ఈ సుగుణములెల్ల మీ కుండవలయును. నదిలో దుమికి మొసలిని పట్టుకొని రమ్మని యజమాని ఆజ్ఞాపించినాడను కొనుడు. అప్పుడు మీ రేమి చేయవలయును? మొదట అతని యాజ్ఞను శిరసావహింపవలయును. తరువాతనే అతనితో వాదిం చుట. ఆ ఆజ్ఞ చెడ్డదే కావచ్చును. మొదట శిరసావహింపుడు. తరువాత వాదించి పూర్వపక్షము చేయవచ్చును. సంఘములలో నొక పెద్దదోషమున్నది. ఎవనికైన నొకనికి భేదాభిప్రాయము గలిగినచో తగిన అదనుకై వేచియుండక వెన్వెంటనే ఒక క్రొత్త శాఖను లేవదీయును. ఇది వంగదేశమున నెక్కువగనున్నది. కావున మీకు సంఘమునెడ గాఢమగు భక్తిగౌరవములు ఉండ వలయును. అవిధేయత కిందు చోటులేదు. నిర్దయతో దానిని నిర్మూలింపుడు. అవిధేయులగు సభ్యు లిందుండరాదు. ఉన్నచో వారిని వెంటనే వెడలిగొట్టుడు. సంఘవిద్రోహు లిందుండరాదు. మీరు గాలివలె స్వేచ్ఛగను, ఈ మొక్కవలె వినమ్రముగను, శునకమువలె విశ్వాసముతోడను ఉండవలయును.



# నే నేమి నేర్చితిని ?

## (ఢక్కా, మార్చి 1901)

ఢక్కాలో శ్రీ స్వాములవారు ఆంగ్లమున రెండుపన్యాసముల గావించిరి. అందు మొదటిది 'నే నేమి నేర్చితిని' అను విషయమునుగూర్చి. రెండవది 'మనము పుట్టిపెరిగిన మతము' అను దానినిగూర్చి. ఈ విషయములను స్వాములవారి శిష్యులొకరు సంగ్రహముగా వంగభాషలో వ్రాసిరి. ఈ క్రిందిది ఆ శిష్యుని సంగ్రహరచనమునకు అనువాదము :

నేను నాగరకములగు అనేక పాశ్చాత్యదేశములను చూచితినిగాని ఈ తూర్పువంగదేశమును చూచు భాగ్యము నా కింతవఱకు కలుగలేదు. ఇప్పు డిచ్చటికివచ్చి ఈ ప్రదేశములో సన్నిహితపరిచయజ్ఞానము పొందు అవకాశముగలిగినందులకు నాకు గలిగిన సంతోషమును మొదట వ్యక్తపఱుపవలసి యున్నది. అంతేకాదు ; నా మాతృభూమియైన వంగదేశములోని ఈ మహానదులు, సారవంతములు విశాలములునగు మైదానములు, అందమైన గ్రామములు మొదలగు వానిని చూచుటచే నాకుగలిగిన సంతృప్తినిగూడ తెలియజేయవలసియున్నది. ఇవన్నియు నే నిదివఱకు చూచినవికావు. వంగదేశములోని భూజలప్రదేశములందలి ప్రత్యణువునను ఇంత అందము, ఆహ్లాదకరభావము ఉన్నవని నా కింతవఱకు తెలియదు. ప్రపంచములోని వివిధదేశములు సంచరించుటచే నాకు మేలే కలిగినది. ఏలయన ఆ దేశములన్నియు సందర్శించినపిమ్మట నా మాతృదేశసౌందర్యము నెక్కువగ గ్రహించి ఆనందింపగలుగుచున్నాను.

మత విషయమునగూడ ఇంతే. మన జాతీయమతమున ఇంత అందము, గొప్పతనము ఉన్నవని తెలియక నేను ఇతర

జాతుల అభిప్రాయములను తమవిగా గ్రహించిన అల్పజాతి ప్రజల నాశ్రయించితిని. అట్లు కొన్నిసంవత్సరములు వ్యర్థముచేసిన తరువాతనే నేను ప్రపంచములోనెల్ల హిందూమతమువంటి సంతృప్తికరమైన మతమింకొకటి లేదని గ్రహించితిని. అందుచేత మతమునెడ అచంచలవిశ్వాసముగల మన దేశీయులలోనేకొందఱు దానియందు నిర్లక్ష్యభావము చూపినపుడెల్ల నాకు విచారము కలుగుచుండును. ఇందులకు కారణముకూడ నాకు తెలియును. ఐరోపీయభావవిధానము మన మాతృభూమిని ప్రవేశించుటచే నేర్పడిన కేవల భౌతికవాద వాతావరణములో వారు జీవితము గడపుటచేత ఈ యనర్థము కలుగుచున్నది.

ప్రస్తుతము మనలో కొందఱు సంస్కర్తలున్నారు. వారు హిందూజాతి పునరుజ్జీవనమునకై మనమతమును సంస్కరించుటకు, వీలైనచో తలక్రిందులు గావించుటకు ప్రయత్నించుచున్నారు. ఆసంస్కర్తలలో ఆలోచనాపరులుకూడ కొందఱున్నారు. కాని తమలక్ష్యమేమో తెలియక ఇతరులను గ్రుడ్డిగ అనుసరించుచు అజ్ఞానములో ప్రవర్తించువా రనేకులు అందుగలరు. ఈ తెగకు చెందిన సంస్కర్తలు ఇతర మతభావములను మన మతమున చొప్పించుటకు మిక్కిలి కుతూహలపడుచున్నారు. వారు 'విగ్రహారాధనము' అను పదమును పట్టుకొని విగ్రహారాధనమును ప్రోత్సహించునది కావున హిందూమతము సత్యమైనది కాదని వాదింతురు. విగ్రహారాధనమనగానేమో, దానివలన మంచిగలుగుచున్నదా, చెడుగుగలుగుచున్నదా అని ఆలోచించుటకు ప్రయత్నింపరు. ఇతరులు చెప్పుమాటలనే ప్రమాణముగాగొని హిందూమతము సత్యమైనది కాదని వాకొందురు. ఇంకొకతెగవారు కొందఱున్నారు. వారు ప్రతి హిందూ ఆచారమునకును, ప్రతి హైందవ కర్మకును నిరాధారములగు ఆధునిక శాస్త్రీయవ్యాఖ్యానములు గావింతురు. వీరెవరో తెలియునా? ఎల్లప్పుడు విద్యుచ్ఛక్తి,

అయస్కాంతము, వాయుతరంగములు మొదలగువానిని గూర్చి మాటలాడువారు. వీరెప్పుడో ఒకప్పుడు దేవుడు విద్యుత్తరంగములు మూర్తిగొన్న ఒక ముద్ద తప్ప వేఱుగాదని నిరూపింపగలరేమో ఎవరు చెప్పగలరు! వివిధమార్గముల, వివిధరూపముల తన కార్యమును సాగించుకొనుచున్న మాతృదేవి వారి నాశీర్వదించుగాక!

పై చెప్పినవారికి విభిన్నముగా సనాతనులు ఉన్నారు. వారిలో కొందఱు "కాకదంత పరీక్షచేయునట్టి మీ వాదములు మాకు తెలియవు. తెలిసికొనుటకు, అర్థముచేసికొనుటకు ప్రయత్నముచేయవలసిన అవసరముకూడ లేదు. మాకు కావలసినది దేవుడు; ఆత్మ. ఏది ప్రకృతికతీతమో, ఎచ్చట సుఖదుఃఖాది ద్వంద్వము లుండవో, నిత్యానంద మెచ్చట ఉండునో అట్టి పరమాత్మయే మా గమ్యము" అనియు, కొందఱు "పూర్ణవిశ్వాసముతో గంగలో మునుగుటచే ముక్తి పొందవచ్చునను నమ్మకము మాకున్నది" అనియు, కొందఱు "శివ, రామ, విష్ణ్వాది రూపములలో ఎవరినైనను అతడే సర్వాంతర్యామియగు దేవుడని నమ్మి అచంచలభక్తి విశ్వాసములతో పూజించిన నీకు తప్పక ముక్తి కలుగును" అనియు చెప్పుదురు. వీరితెగకు చెందినవాడనని చెప్పుటకు నేను గర్వించుచున్నాను.

ఇంకొక తెగవారు కూడ ఉన్నారు. ప్రపంచము, భగవంతుడు—ఈ రెంటిని దృష్టిలో నుంచుకొని ప్రవర్తింపవలెనని వారు చెప్పుదురు. ప్రాచీనఋషులు గొంతెత్తి మనకిట్లు చెప్పుచున్నారు: "భగవత్సాన్నిధ్యమును పొందవలెనన్న కామ కాంచనములను త్యజింపవలయును. ఈ సంసార మనిత్యమైనది, నిస్సారమైనది. దీనిని పరిత్యజింపక ఎంత ప్రయత్నించినను భగవంతుని పొందలేవు. అది చేయలేనిచో బలహీనుడనని ఒప్పుకొనుము. అంతే కాని ఆదర్శమును మాత్రము కించపఱుపకుము; హీనమై, నశ్వర

మగుదానిని ఉదాత్తము శాశ్వతమునగు దానివలె ప్రదర్శించుటకు ప్రయత్నింపకు". కావున వారిదృష్టిలో ఆధ్యాత్మికతను సాధింప వలయునన్నను, భగవంతుని పొందవలయునన్నను మొదట మీ అభిప్రాయములలోని యీ దాగుడుమూతలను, అసత్యమును, భావచౌర్యమును పరిత్యజింపవలయును.

నేను నేర్చినదేమి? ఈ సనాతనులనుండి నే నేమి నేర్చితిని? నేను నేర్చినదిది:

దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహ హేతుకమ్।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః॥

"మానవజన్మము, మోక్షేచ్ఛ, మహాపురుషులతోడి సాహచర్యము—ఈ మూడును దుర్లభములు. ఇవి దైవానుగ్రహము వలననే కలుగును". మనకు కావలసినవానిలో మొదటిది మనుష్యత్వము, మానవజన్మము. ఏలయన మానవజన్మమే మోక్షసాధన కనువైనది. రెండవది ముముక్షుత్వము. శాఖా, వ్యక్తి భేదములను బట్టి భగవత్సాక్షాత్కారమునుపొందు మార్గములు భిన్నములు కావచ్చును. అధికారభేదమునుబట్టి వివిధ వ్యక్తులు దానిని పొందుటకు తమకుగల ప్రత్యేకహక్కులను, సాధనములనుగూర్చి చెప్పవచ్చును. కాని ముముక్షుత్వము లేనిదే భగవత్సాక్షాత్కారము అసాధ్యమని సాధారణముగ, పూర్వపక్ష మగునను భీతిలేకుండ, నొక్కివక్కాణింపవచ్చును. ముముక్షుత్వ మనగా నేమి? మోక్షమును పొందవలయునను అకుంఠితమగు నిచ్ఛయే; సుఖదుఃఖాదులకు అతీతముగ నుండవలయునను కోరికయే; ప్రపంచమునెడ ఏహ్యాభావమే. భగవంతుని చూడ వలయునను కోరిక నీలో ఎప్పుడు కలుగునో అప్పుడు భగవత్సాక్షాత్కారమునకు అర్హుడవగుదువు.

ఇక మహాపురుషులతోడి సన్నిహితసాహచర్యముకూడ అత్యవసరమే. దానిచే తమగమ్యమును పొందిన మహాపురుషుల

జీవితములనుబట్టి మనజీవితములను చక్కదిద్దుకొనవచ్చును. ప్రపంచముపై వైరాగ్యము, మోక్షేచ్ఛ ఉన్నంతమాత్రమున చాలదు. గురూపదేశముకూడ అవసరము. ఎందుచేత? దానిచే తరతరములుగా ఒక గురువునుండి మఱియొక గురువునకు ఎడ తెగక సంక్రమించుచు వచ్చిన ఒక గొప్ప శక్తితో నీకు సంబంధ మేర్పడును. భక్తుడగువాడు అన్వేషించి ఆధ్యాత్మికబోధకుడగు గురువును తనకు ఉపదేశకుడుగా, మార్గదర్శిగా, స్నేహితుడుగా స్వీకరింపవలెను. ఆధ్యాత్మికపథపురోగమనమునకు గురువు అత్యంత ముఖ్యమని చెప్పవచ్చును. అయినచో ఎట్టివానిని గురువుగా స్వీకరింపవలెను? "శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః" వేదపారంగతుడు, దోషరహితుడు, నిష్కాముడు, బ్రహ్మజ్ఞానశ్రేష్ఠుడు గురువుగా నుండదగినవాడు. శాస్త్రపాండిత్యము గలిగినవాడు మాత్రమే కాక వాని సూక్ష్మాతి సూక్ష్మరహస్యములను విప్పిచెప్పగలవాడును, వాని ప్రాముఖ్యమును అనుభవముచే గుర్తించినవాడును అగువాడే శ్రోత్రియుడు. "ఊరక శాస్త్రాదులను చదువుటచే చెప్పినమాటలెల్ల వల్లించు చిలుకవలె తయారగును కాని పండితుడు కాజాలడు. శాస్త్రములలో ఏ ఒక్కపదమును చదువుటచేనైనను దివ్యమగు ప్రేమను ఎవడు పొందునో వాడే పండితుడు". కేవలము పుస్తకజ్ఞానముగల పండితులవలన ప్రయోజనములేదు. భిక్షుకుడు లక్షరూపాయలు దానముచేయదలచినట్లు ప్రస్తుతము ప్రతి ఒక్కడు గురువు కాదలచుచున్నాడు. గురువగువాడు దోషరహితుడుగా నుండవలెను. నిష్కాముడై యుండవలయును. ఇతరులకు మేలుచేయవలయుననుట తప్ప వేఱు ఉద్దేశము అతనికుండరాదు. అకారణ ప్రేమకు సన్నిధియై యుండవలయును. పేరుప్రఖ్యాతులకుగాని, స్వార్థదృష్టితోగాని అతడు ఆధ్యాత్మికబోధ చేయరాదు. బ్రహ్మజ్ఞానము, బ్రహ్మసాక్షాత్కారము కరతలామలకముగా నుండవలయును. ఇట్టివాడే గురువని శ్రుతులు చెప్పుచున్నవి. అట్టి

గురువుతో ఆధ్యాత్మికసంబంధ మేర్పడినపుడు భగవత్సాక్షాత్కారము—దివ్యజ్ఞానము—సులభసాధ్యమగును.

గురూపదేశము పొందిన తరువాత సత్యాన్వేషకుడు తన లక్ష్యముపై ధ్యానముంచి, నిర్ణీతమార్గమున సత్యమును అనుభవమునకు దెచ్చుకొనుటకు అభ్యాసము గావింపవలయును. భగవంతుని సాన్నిధ్యమును పొందవలయునను కోరిక ఉన్నను, గురువు ఉన్నను, అభ్యాసము లేనిదే, నేర్చుకొన్నదానిని ఆచరణలో నుంచుటకు ప్రయత్నింపనిదే దైవసాక్షాత్కారము కలుగదు. ఇవన్నియు మీలో గాఢముగ నున్నపుడే గమ్యమును చేరగలుగుదురు.

కావున ఆర్యసంతతివారును, హిందువులును అగు మీకు చెప్పునదేమన—మన మతముయొక్క, హిందువులయొక్క ఉన్నత లక్ష్యమును మఱవకుడు. ఆ లక్ష్య మేదో తెలియునా? సంసార బంధమునకు దూరముగ నుండుట, ఐహికాముష్మికములయెడ వైరాగ్యముగలిగియుండుట, గుణదోషముల కతీతముగనుండుట. ఇట్లుండుటచే అన్నిటి కతీతులరై తుదకు సచ్చిదానందబ్రహ్మమును పొందగలరు.



# మనము పుట్టి పెరిగిన మతము

1901 సంవత్సరము మార్చి 31-వ తేది ఢక్కాలో ఏర్పాటుచేయబడిన బహిరంగసభలో పై విషయమునుగూర్చి శ్రీ స్వాములవారు రెండుగంటలకాలము ఆంగ్లమున ఉపన్యసించిరి. వంగభాషలో నొక శిష్యునిచే వ్రాయబడిన ఆ ఉపన్యాస సారాంశమున కీ క్రిందిది అనువాదము :

చాలకాలముక్రిందట మన దేశము ఆధ్యాత్మికముగ నెక్కువ పురోభివృద్ధి చెందినది. ఇప్పుడు మన మా ప్రాచీన చరిత్ర నొక్క

సారి మనస్సునకు తెచ్చుకొందము. పూర్వపు ఔన్నత్యమునందు దృష్టినిలుపుటవలన నొక అపాయము కూడ నున్నది. మనము క్రొత్తవిషయములను గూర్చి ఆలోచింపక పూర్వుల ఔన్నత్యమును నెమరుకు తెచ్చుకొనుటచే తృప్తిని గర్వమును మాత్రము పొందుచుందుము. ఈ అపాయమునకు మనము దూరముగ నుండ వలయును. పూర్వకాలమున సత్యమును అనుభవమునకు దెచ్చుకొనిన ఋషులు, మహర్షులు ఉండిరి, నిజమే. కాని వారిని జ్ఞప్తికి తెచ్చుకొనుట నిజముగా ప్రయోజనకారియేమైన మనముకూడ వారివలె ఋషులుగా తయారుకావలయును. అంతే కాదు — చరిత్రవలన మనకు తెలియుచున్న ఋషులకంటెను గొప్పవారము కాగలమను దృఢవిశ్వాసము నాకున్నది. పూర్వము మనము సాధించిన కార్యములు పేర్కొనదగినవే. వానినిగూర్చి ఆలోచించుట నాకు గర్వకారణముగనే యున్నది. కాని ప్రస్తుతపతనావస్థనుచూచి నేను నిరుత్సాహపడుటలేదు. భవిష్యత్తును నా మనోనేత్రముముందు చిత్రించుకొని ఉత్సాహపడుచున్నాను. ఎందుచేత? విత్తనము చెట్టగుటకు ముందు రూపాంతరమును పొందునని, అంతే కాక పూర్తిగా నశించినట్లగపడునని నాకు తెలియును. ఇదే విధముగా తాత్కాలికమైన ఈ పతనావస్థలో మనమతముయొక్క భావిభాగ్యోదయశక్తు లున్నవి. ఇవి సమయము వచ్చినపుడు విజృంభించి మన మతమును ఇదివఱకుండినదానికంటెగూడ ఉన్నతదశకు తీసికొనిపోగలవు.

ఇప్పుడు మనము మనమతములో ఏ విషయములయెడ ఏకవాక్యత గలదో పరిశీలింతము. స్థూలముగ చూచినపుడు మన మతములోని వివిధశాఖల మధ్య భేదమున్నదనుట నిస్సందేహమే. మనమతములో కొందఱు అద్వైతులు, కొందఱు విశిష్టాద్వైతులు, మఱికొందఱు ద్వైతులు ఉన్నారు. కొందఱకు అవతారముల యెడ నమ్మకముగలదు. కొందఱు విగ్రహారాధనమును నమ్ముదురు.

మఱికొందఱు నిరాకారవాదమును గావింతురు. ఆచారములలో గూడ భిన్నత్వమున్నట్లు తెలియుచున్నది. మహమ్మదీయుల తోడను, క్రైస్తవులతోడను వివాహసంబంధములు గావించినను హిందువులలో చతుర్వర్ణములవారికి కులబహిష్కారముండదు. నిరాటంకముగా వారు హిందూదేవాలయములందు ప్రవేశింపవచ్చును. పంజాబులోని పెక్కు గ్రామములలో పందిమాంసమును తినని వానిని హిందువుగనే పరిగణింపరు. నేపాలుదేశములో బ్రాహ్మణుడు చతుర్వర్ణములలో వివాహము గావించుకొనవచ్చును. కాని వంగదేశములో బ్రాహ్మణుడు శాఖాంతరవివాహమైనను చేసికొనరాదు. ఇట్లు ఒక్కొక చోట ఒక్కొక ఆచారమున్నది. ఈ భిన్నత్వములో హిందువులందఱకును ఏకాభిప్రాయముగల విషయమొకటియున్నది. హిందువు అగు వాడెవ్వడును గోమాంసమును తినడనుటయే ఆ విషయము. ఇట్లే మనమతములోని వివిధ శాఖలలో ఏకవాక్యతగల విషయములు పెక్కులున్నవి.

మతగ్రంథములగూర్చి చర్చించునపుడు మనకొక్క విషయము మొదట స్ఫురించును. కొన్ని ప్రమాణగ్రంథములపై నాధారపడిన మతములు శీఘ్రముగ నభివృద్ధిచెందుచువచ్చి ఎన్ని ఆఘాతములు గలిగినను నేటికిని నిలువగలిగినవి. సర్వాంగసుందరమైనను గ్రీకుమతము ప్రమాణమతగ్రంథము లేమిచే నశించినది. కాని యూదుల మతము 'ఓల్డ్ టెస్టమెంటు'ను ప్రమాణముగా గొని నేటికిని శక్తిని గోల్పోక నిలిచియున్నది. ప్రపంచములో అతి ప్రాచీనములగు వేదముల నాధారముగాగల హిందూమతముకూడ ఇట్లే నిలువగలిగినది. వేదములు కర్మకాండమని, జ్ఞానకాండమని రెండుగా విభజింపబడినవి. మేషయజ్ఞములను దక్కనులోని కొందఱు బ్రాహ్మణులు అప్పుడప్పుడు చేయుచున్నప్పటికి కర్మకాండము మనదేశమున ఆచరణమున ప్రస్తుతము లేనట్లే. ఇది మన మంచికి కావచ్చు, లేదా చెడ్డకే కావచ్చు. వివాహశ్రాద్ధా

దుల సందర్భమున చెప్పబడు మంత్రములలో వైదికక్రియాకాండ చిహ్నములు మనకు కొంచెము కానవచ్చుచున్నవి. కాని పూర్వపు స్థితిని పొందగల అవకాశమేమియులేదు. కుమారిలభట్టు ఒకప్పుడు ప్రయత్నించెను కాని ఆయన ప్రయత్నము ఫలప్రదము కాలేదు.

వేదములలోని జ్ఞానకాండము వేదాంతమని చెప్పబడు ఉపనిషత్తులరూపమున నున్నది. ఆచార్యులు ప్రమాణముగా ఎచ్చటనైన ఒక వాక్యము చెప్పిన అది ఉపనిషత్తులలోనిదే అయి ఉండును. వేదాంతమే ప్రస్తుతము హిందువులమతము. హిందూ దేశములో ఏతెగకాని తమభావములను ప్రజలలో ప్రచారము చేయవలయునన్న వేదాంతమును ప్రమాణముగా గైకొనవల యును. ద్వైతులైనను, అద్వైతులైనను, ఎవరైనను సరియే— అట్లు చేయవలసినదే. వైష్ణవులుకూడ తమ సిద్ధాంతములను నిరూపించుకొనుటకై గోపాలతాపని ఉపనిషత్తు నాశ్రయింతురు. ఏ తెగవారుగాని తమ భావముల బలపఱచు ఉపనిషత్తు లేదని గ్రహించినచో వెంటనే ఒకదానిని కల్పించి అది ప్రాచీనగ్రంథమే అని చెప్పుటకైనను వెనుదీయరు. పూర్వమిట్టి సంఘటనలు అనే కములుండెను.

ఇక వేదములనుగూర్చి విమర్శింతుము. వేదము లెప్పుడో పూర్వము మానవమాత్రులచే వ్రాయబడినవిగా హిందువులు తలం పరు. చిరకాలసముపార్జితములగు అగాధ దివ్యజ్ఞాననిధులుగా వానిని భావింతురు. ఈ వేదములు ఒక్కొ-క్క-ప్పుడు అభివ్యక్తములగు చుండును; ఇంకొకప్పుడు అభివ్యక్తములు కాకుండును. సాయణా చార్యులవారు తమగ్రంథములలో నొకచో ఇట్లు చెప్పెను: "యో వేదేభ్యోఽఖిలం జగత్ నిర్మమే" (వైదికజ్ఞానముచే నెవడు అఖిల జగత్తును నిర్మించెనో.) వేదములను వ్రాసిన వానిని ఎవరును చూడలేదు. అట్టివాడు ఒకడు ఉన్నాడని ఊహించుట

కూడ కష్టమే. ఋషులు మంత్రములను కనుగొన్నవారుమాత్రమే. అవి ఆదికాలమునుండి ఉన్నవి. అనంతజ్ఞాననిధులగు ఆ వేదములను వారు ముఖాముఖి దర్శింపగలిగిరి.

ఆ ఋషులెవరు? వాత్స్యాయను డిట్లు చెప్పెను:— "మ్లేచ్ఛుడైననుసరే ఎవడు సత్ప్రివర్తనముచే ధర్మజ్ఞానమునందునో బ్రహ్మసాక్షాత్కారమును పొందునో వాడేఋషి". ఈవిధముగనే జారపుత్రుడగు వసిష్ఠుడు, మత్స్యగంధి పుత్రుడగువ్యాసుడు, దాసీపుత్రుడగు నారదుడు ఇంకను ఇట్టివా రనేకులు ఋషిత్వమును పొందిరి. ఇందుచే నిత్యమగు బ్రహ్మమును కనుగొన్నవారిమధ్య జాతిభేదములు పాటించుట తగదని తేలుచున్నది. పై జెప్పిన వారందఱు ఋషులైనప్పుడు నేటికాలపు కులీనబ్రాహ్మణులు అంతకంటె గొప్ప ఋషులు కావచ్చును. కావున ఆ ఋషిత్వమును పొందుటకు ప్రయత్నింపుడు. గమ్య మందుకొనువఱకు వెనుదీయకుడు. అప్పుడే సర్వప్రపంచము మీకు తలయొగ్గును. ఋషులుగా మాఱిపొండు. అదియే శక్తి రహస్యము.

వేదములు మాత్రమే మనకు ప్రమాణములు. వానిని గ్రహించుటకు ప్రతివానికి హక్కున్నది.

> "యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః।
> బ్రహ్మరాజన్యభ్యాం శూద్రాచార్యాయచ స్వాయ
> చారణాయ ॥"

అని శుక్లయజుర్వేదము చెప్పుచున్నది. ప్రతి వానికి వేదములను చదువు హక్కులేదని వేదమునుండి ప్రమాణము నీవు చూపగలవా? పురాణములు మాత్రము కొన్ని కులములు వేదములు చదువరాదని, కొన్ని కులములు మాత్రమే చదువవలయునని, వేదములలోని కొంతభాగము సత్యయుగమునకు వర్తించునని,

మఱికొంత భాగము కలియుగమునకని చెప్పుమాట నిజమే. కాని వేదములుమాత్ర మట్లుచెప్పుటలేదని గుర్తుంచుకొనుడు. చెప్పునది పురాణములే. సేవకుడు యజమానిని ఆజ్ఞాపింపగలడా? స్మృతులు, పురాణములు, తంత్రములు మొదలగునవి వేదానుసారములైనంత వఱకే గ్రాహ్యములు. వేదవిరుద్ధములగువానిని అప్రమాణములుగా త్రోసిపుచ్చవచ్చును. కాని నేడు మనము వేదములకంటె పురాణముల కెక్కుడు ప్రాధాన్యమిచ్చియున్నాము! వేదపఠనము వంగదేశమున మటుమాయమైనది. ఇలువేల్పగు సాలగ్రామముతో బాటు వేదములనుగూడ పూజావేదికపైనుంచి చిన్న, పెద్ద, ఆడ, మగ అను భేదములేకుండ అందఱు వేదపారాయణము చేయగల దినములకై నేనెంతో ఆశతో ఎదురుచూచుచున్నాను.

వేదములగూర్చి పాశ్చాత్యపండితులు చేసిన సిద్ధాంతములపై నాకు నమ్మకములేదు. వారు నేడు వేదములు ఏదో ఫలానాకాలమునకు చెందినవని నిర్ణయించి రేపు ఇంకొక వేయి సంవత్సరములు ముందుకు తెత్తురు. పురాణములను గుఱించి వేదమార్గానుసారములైనంతవఱకే అవి ప్రమాణములని, కానిచో కావని నే నిదివఱకే చెప్పితిని. పురాణములలో వేదవిరుద్ధములగు విషయములు పెక్కున్నవి. ఉదాహరణమునకు పురాణములలో ఎవరో పదివేలసంవత్సరములు జీవించెనని, మఱియొకరు ఇరువది వేలసంవత్సరములు జీవించెనని చెప్పబడియున్నది. కాని వేదములిట్లు చెప్పుచున్నవి — శతాయుర్వైపురుషః — "మానవుడు వందసంవత్సరములు జీవించును". ఈ విషయములో మనము దేనిని ప్రమాణముగా గ్రహింపవలయును? వేదములనే. ఇట్టి కొన్నివిషయములందు తప్ప నేను పురాణములను తెగడుటలేదు. పురాణములలో మహోపదేశములు, భక్తి, జ్ఞాన, కర్మ, యోగములనుగూర్చి అమూల్యములగు పలుకులు ఉన్నవి. వీనిని

మనము తప్పక గ్రహింపవలసినదే. ఇక తంత్రములనుగూర్చి ఆలోచింతము. తంత్రమను పదమునకు సరియైన అర్థము శాస్త్రము. ఉ. కాపిలతంత్రము. కాని తంత్రమను పదము సంకుచితార్థమున ఉపయోగింపబడుచున్నది. బౌద్ధమతమును స్వీకరించి అహింసా సిద్ధాంతమును ప్రచారము గావించిన రాజులపాలనలో వైదిక యజ్ఞయాగాదులు అంతరించినవి. రాజభీతిచే ఎవడును జంతుబలి చేయ సాహసింపలేక పోయెను. కాని తరువాత బౌద్ధులలోనే మొదట హిందూమత మనుసరించుచుండిన కొందఱు యజ్ఞయాగాదులకు సంబంధించిన కొన్ని ముఖ్యకర్మలను స్వీకరించి రహస్యముగా చేయనారంభించిరి. వీనినుండియే తంత్రములు బయలు దేఱినవి. వామాచారాది కొన్నిదోషములమాట యటుంచి తంత్రములు ప్రజలు అనుకొన్నంత చెడ్డవికావు. ఉదాత్తములగు కొన్ని వైదికభావములు అందున్నవి. తుదకు వేదములలోని బ్రాహ్మణములను కూడ సంస్కరించి తంత్రముల తెగలో చేర్చి యున్నారు. కర్మకాండమునకు సంబంధించిన నేటి పూజ, ఆచారము, ఇత్యాది విధానములు తంత్రానుసారములుగనే యున్నవి.

ఇప్పుడు మన మతసూత్రములను గూర్చి కొంత చర్చింతము. భిన్నాభిప్రాయములకు గుఱియైన విషయములు వివిధశాఖలలోనున్నను, అందఱు అంగీకరించు కొన్ని సామాన్యవిషయములును అందున్నవి.

ఈశ్వరుడు, ఆత్మ, జగత్తు—ఈ మూడువిషయములను అందఱు నంగీకరింతురు. సృష్టిస్థితిలయకారకుడగువాడు ఈశ్వరుడు. సాంఖ్యులు మాత్రము ఈ విషయము నంగీకరింపరు. రెండవది ఆత్మను, ఆత్మయొక్క పునర్జన్మమును గూర్చినది. అసంఖ్యాకములగు ఆత్మలు ఒకశరీరము తరువాత మఱొకశరీరమును గ్రహించుచు వానివాని పురాకృత కర్మమునుబట్టి

జీవన్మరణచక్రమున పరిభ్రమించుచుండునని ఈ వాదము చెప్పు చున్నది. దీనిని సంసారవాదమనియు, పునర్జన్మవాదమనియు అందురు. ఇక జగత్తు ఆద్యంతరహితమైనది. ఈ మూడును ఒక వస్తువుయొక్క రూపాంతరములని కొందఱు, పరస్పరసంబంధ రహితములగు విభిన్నరూపములని కొందఱు, ఇట్లు పలువురు పలు విధములుగా చెప్పుచున్నను పై మూడును ఉన్నవని అందఱు అంగీకరించుచునే యున్నారు.

ఇచ్చట ఒక్కవిషయమును జ్ఞప్తియందుంచుకొనవలయు నని మిమ్ము కోరుచున్నాను. హిందువులు అతిప్రాచీనకాలముననే ఆత్మ, మనస్సుకంటె వేఱని గుర్తించిరి. కాని పాశ్చాత్యులు మనస్సుకంటె దూరముగ ఆలోచింపలేకపోయిరి. పాశ్చాత్యులు విశ్వమంతయు సుఖమయమని తలచిరి. కావున వారికీ లోకము సుఖమనుభవింపగల స్థలముమాత్రమే. కాని ప్రాచ్యులు ఈ సంసారము క్షణక్షణమగు ఈ లోకము దుఃఖమయమని యెంచిరి. అందుచే లోక మశాశ్వతమైనదని, అందుగల అనిత్య ములగు సుఖములను సంపదలను, ఆత్మ నమ్ముకొనుట తగదని వారి యుద్దేశము. ఈ కారణముచేతనే అటు పాశ్చాత్యులు కట్టుదిట్టముగ కార్యమునుచేయుటలో నేర్పరులైయుండ నిటు ప్రాచ్యులు ఆంతరలోక నిగూఢవిషయాన్వేషణపరులై యున్నారు.

ఇక హిందూమత దృక్పథమును తెలిసికొనుటకై ఒకటి రెండు విషయములనుగూర్చి ఆలోచింతము. ఈ మతమున భగవ దవతారములనుగూర్చిన వాదమున్నది. వేదములలో మత్స్యావ తారమునుగూర్చి మాత్రము ప్రస్తావింపబడినది. అందఱును ఈ అవతారవాదమును అంగీకరింతురా లేదా అనుట ప్రస్తుతవిష యముకాదు. అవతారవాదములోని అంతరార్థము మానవారా

ధనయే. మానవునిలో భగవంతుని దర్శించుటయే నిజమైన భగవద్దర్శనము. హిందువులు ప్రకృతిరూపమున భగవంతుని దర్శింపరు. మానవరూపమున దర్శింతురు.

తరువాత విగ్రహారాధనముగూర్చి విమర్శింతుము. శుభకార్యావసరములందు పూజింపబడవలయునని శాస్త్రములు నిర్దేశించిన ఐదుగురు దేవతలు తప్ప మిగిలినవారందఱు వారి దశాంతరములే. ఈ ఐదుగురు దేవతలుకూడ ఒక్క దేవుని వివిధనామములు తప్ప వేఱు కావు. విగ్రహారాధనము పూజావిధానములలోనెల్ల అధమమైనదిగా శాస్త్రములలో చెప్పబడినది. అంతమాత్రమున అదిచేయుట తప్పుకాదు. విగ్రహారాధనములో నేఁడు పెక్కుదోషము లున్నను నేను దానిని నిరసింపను. సనాతనాచారపరుఁడు, విగ్రహారాధకుఁడు అగు బ్రాహ్మణుని పాదధూళియే నాకు సోకకుండిన నే నేమై యుందునో!

విగ్రహారాధనమును దూషించు సంస్కర్తలకు నేనుచెప్పునదేమన "సోదరులారా! మీరెట్టి బాహిరసాధన సంపత్తి లేక దేవుని సూటిగా పూజింపగలిగినచో అట్లే చేయుఁడు. కాని అట్లు చేయలేనివానిని మీరెందుకు దూషింతురు? అతి ప్రాచీనకాలమునకు స్మారకచిహ్నమైన సుందరభవన మొకటి అజాగ్రత్తవల్లనేమి, ఉపయోగమున లేకపోవుటచేనేమి, ధూళిధూసరితమై శిధిలావస్థలో నున్నదనుకొనుఁడు. అందలి కొన్నిభాగములు నేలలో కూడ కలిసిపోయిన వనుకొనుఁడు. దానిని మీరేమి చేయుదురు? తగిన మరమ్మతులుచేసి పూర్వపుస్థితికి తెచ్చుటకు ప్రయత్నింతురా లేక పూర్తిగా పడగొట్టి ఆ స్థలమున అస్థిరమగు నూతనవిధానమున వేఱొకభవనమును నిర్మింపదలతురా? పూర్తిగా పడగొట్టు ప్రయత్నముచేయక శుభ్రముగావించి అవసరమగు మరమ్మతు చేయు ప్రయత్నమునకే పూనుకొనవలయును. అంతటితో దాని

సంస్కారము పూర్తియగును. పునరుద్ధరించిన తరువాత దాని కింకేమి అవసరమున్నది? మీరు చేయగలిగినచో ఆ పనిచేయుడు. లేకున్న ఊరకుండుడు!'' మనదేశమున కొందఱు సంస్కర్తలు ఒక క్రొత్తమతమును స్థాపింపదలచుచున్నారు. ఎట్లైనను వారు మంచిపనియేచేసిరి. భగవంతుడు వారి నాశీర్వదించుగాక! కాని హిందువులైన మీరు సర్వసామాన్యమగు మతమునకు దూరముగా ఏల పోదలచుచున్నారు? మీసర్వస్వమగు హిందూమతమునకు చెందినవారమని చెప్పుకొనుటకు మీరేల సిగ్గుపడియెదరు? ఓ నా దేశీయులారా! ఈ మన భారతనౌక (మనమతము) యుగయుగ ముగా మన నాగరకతను మోసికొనిపోవుచు అందలి ధనముచే ప్రపంచమునెల్ల సంపన్నముచేయుచున్నది. పెక్కు శతాబ్దముల నుండి ఈ నౌక అనేకాత్మలను మోసికొని జీవనసముద్రమున చలించుచు పోయి దుఃఖమునకు దూరముగా ఆవలియొడ్డును చేర్చి నది. మీ అపరాధములచే నేమి, ఇతర కారణములచేనేమి ఆ నౌక భంగము చెందినది. అందున్న మీరు ఇప్పుడేమిచేయుదురు? దానిని నిందించుచు మీలోమీరు కలహింతురా? మీరందఱు ఏకమై దానిని ఆపదనుండి రక్షింపరా? అందులకై మీరు మీ హృదయరక్తమును ధారవోయుడు. ఈ ప్రయత్నమున విఫలుల మైతిమా శాపవృష్టితో గాక ఆశీస్సులతో అందఱము ఒక్కటిగా మునిగి మరణింతము.

బ్రాహ్మణులకు నేను చెప్పున దేమన—''మీ వంశమును గూర్చి, మీ పూర్వులనుగూర్చి మీరు గర్వించుచున్నారు. గర్వ మును పరిత్యజింపుడు. మ్లేచ్ఛ రాజులక్రింద మీరు చాలకాలము జీవించుటచే శాస్త్రోక్తమగు బ్రాహ్మణత్వము మీకు లేదు. మీ పూర్వులవచనములందు మీకు నమ్మకమున్నచో, — బౌద్ధుల నోడించుటకై కొండొక బౌద్ధమతాచార్యుని అంతేవాసియై వారిని వాదమున ఓడించి పెక్కుఱ మరణమునకు కారకుడై, తరువాత

పాపపరిహారార్థము తుషానలమున ప్రవేశించి దేహత్యాగము గావించిన కుమారిల భట్టువలె — తత్క్షణమే మీరును తుషాగ్నిని ప్రవేశించి దేహములను వదలుడు. అట్లుచేయుటకు ధైర్యము లేనిచో మీ బలహీనతను ఒప్పుకొని, విజ్ఞాన కవాటముల నందఱకు తెఱచియుంచి, పతితులైయున్న వారికి చేయూతనొసగి వారికి న్యాయ్యముగా చేకుఱవలసిన హక్కులను, అవకాశములను ఇందు".



# మద్రాసుసభ సన్మానమునకు సమాధానము*

చెన్నపురి మిత్రులారా! అస్మద్దేశీయులారా! సహమతావలంబులారా!

మతరంగములో నా చేసిన యల్పసేవ మీ యామోదము బడసినందుకు మిక్కిలి సంతోషముగా నున్నది. దూరదేశములో నేను చేసిన కృషిని ప్రశంసించినందుకుగాదు; భారతదేశముపై ప్రభంజనమువలె విదేశీయుల దండయాత్రలు పరంపరగా చెలరేగినను, శతాబ్దముల తరబడి మన అశ్రద్ధవలన, మనపై దండెత్తిన వారి తృణీకారభావమువలన ప్రాచీన ఆర్యావర్త వైభవము క్షీణించినను, ఆ వైభవమును సూచించెడి రాజప్రాసాదములు, సుందరమందిరములు, అద్భుతనిర్మాణములును పెక్కు శతాబ్దములందు భారతదేశములో విజృంభించిన మహాప్రవాహములలో కొట్టుకొనిపోయినను—కేంద్రము భద్రముగా నున్నది; ప్రాతిపదిక చెడలేదు. అందుకు నాకు సంతోషము కలుగుచున్నది. భగవన్మహిమను, జీవకారుణ్యమును ప్రతిష్ఠించుటకు పునాదిగా నిలిచి, వాని పరిపోషణకు తోడ్పడిన ఆధ్యాత్మికతత్త్వము చలింపక ఎప్పటివలె సుదృఢముగా నున్నది. ఎవరిసందేశమును భారతదేశమునకు, అఖిలప్రపంచమునకు అందజేయవలసిన భాగ్యము, ఆయన భృత్యులలో బొత్తుగా అనర్హుడనయిన నాకు కలిగినదో అట్టి వ్యక్తిని మీరు సహృదయముతో అవగాహన చేసికొంటిరి.

* వివేకానందస్వామి అమెరికాలో విజయము సాధించినవార్త భారతదేశములో తెలియగానే అనేక సన్మానసభలు ఏర్పాటుచేయబడినవి. అభినందనపూర్వకమైన సన్మానపత్రము లాయన కందజేయబడినవి. ఆయన తన సమాధానమును ప్రప్రథమముగా చెన్నపురి హిందువుల అభినందనపత్రమునకు పంపినారు.

ఆయనలోను, ఆయన సందేశములోను గల ఆధ్యాత్మికశక్తితరంగ ముల తొలి మర్మరధ్వనులను మీరు మీకు సహజమైన ఆధ్యాత్మిక ప్రవృత్తితో గుర్తించితిరి. ఆ యాధ్యాత్మికశక్తి అచిరకాలము లోనే భారతదేశమంతటిపై అప్రతిహతముగా ప్రసరించగలదు. అది అనివార్యము. సర్వశక్తిమంతమైన ఆ యాధ్యాత్మికప్రవాహము దౌర్బల్యము, దోషము గలవానినిగూడ ముందుకు గొనిపోగలదు. అంతట, హైందవజాతి శతాబ్దములకొలది మౌనముతో ననుభవించిన బాధలకు ప్రతిఫలముగా విధివిధానము ననుసరించి యపూర్వమైన కీర్తితో ఉన్నతస్థాయి నందుకొనగలదు. ప్రపంచజాతుల మధ్య తనధర్మమును—ఆత్మోన్నత్యమును ప్రదర్శించగల మానవ జాతివికాసమును సాధింపగలదు.

ఉత్తరభారతములోని ప్రజలు ముఖ్యముగా దక్షిణభారతములోని మీకు కృతజ్ఞతాబద్ధులు. నేడు భారతదేశములో పని చేయుచున్న శక్తులను ప్రేరేపించుచున్న అనేక ప్రవృత్తులు దక్షిణ భారతములో పుట్టినవే. మహాభాష్యకారులు—యుగకర్తలయిన ఆచార్యత్రయము—శంకర రామానుజ మధ్వాచార్యులు దక్షిణ భారతములో ప్రభవించిరి. ఎవరికి లోకములోని ప్రతి అద్వైతవాది ప్రణమిల్లునో, అట్టి శ్రీశంకరభగవత్పాదులు; ఎవరు తన దివ్యస్పర్శచే అణగద్రొక్కబడిన మాల మాదిగల నాళ్వార్లనుగా పరివర్తన మొందించెనో అట్టి శ్రీరామానుజమహాశయులు; ఎవని నాయకత్వమును ఉత్తరభారతములోని ఏకైకప్రవక్త అయిన శ్రీకృష్ణచైతన్యప్రభువు — యావద్భారతమున తనప్రభావము ప్రసరింపజేసిన ప్రవక్త—అనుచరులు సహితము అంగీకరించిరో అట్టి శ్రీమధ్వాచార్య మహనీయులు మీ ప్రాంతమువారే. ఈ దినమునకూడ కాశీక్షేత్రములో దక్షిణభారతము మన్నన పొందుచున్నది. హిమాలయపర్వతములలో బహుదూరమందున్న శిఖరములలోని పవిత్రదేవాలయములను మీ త్యాగశీలమే నిర్వహించు

చున్నది. అట్టి ప్రవక్తల రక్తము మీ నాళములలో ప్రవహించు చున్నది. మీ జీవితము లట్టి ఆచార్యులచే ఆశీర్వదింపబడినవి. కనుక భగవాన్ శ్రీరామకృష్ణసందేశమును సరిగా గ్రహించి అనుసరించుటయందు మీ రగ్రేసరులగుటలో ఆశ్చర్య మేమున్నది?

వేదవిద్య దక్షిణభారతములో భద్రమై యున్నది. అజ్ఞానము పునఃపునః ఎంతగా దుస్సాహసముతో విజృంభించినను హిందూ మతములోని విభిన్న శాఖలకు నేటి కీ శ్రుతియే వెన్నముక.

మానవజాతి విభాగ చరిత్ర కారులకు, భాషాతత్త్వవేత్తలకు వేదములలోని సంహితలు, బ్రాహ్మణములు ఎంత ఉత్కృష్టము లయినను, *'అగ్నిమీ లే లేక ఇషేత్వో ర్జేత్వా లేక శన్నో దేవి రభీష్టయే' యితర యజ్ఞయాగాదిక్రతువులతో కలిసినప్పుడు లభించెడు ఫలితము లెంతగా వాంఛనీయమైనను అదంతయు భోగము నకే మార్గము, దానివలన మోక్షము లభించగలదని యెవ్వరు చెప్పలేదు. అందుచేత మోక్షమార్గమును సూచించు జ్ఞానకాండ, ఆరణ్యకములు, శ్రుతులు ప్రాముఖ్యము వహించినవి. ఇకముందు కూడ అవే ప్రాముఖ్యము వహించి భారతదేశమును నడిపింప గలవు.

''సనాతనమతము''న శాఖోపశాఖ లేర్పడినవి. కర్మకలాపములు పెరిగిపోయినవి. వాటిలో చిక్కుకొనుటవలనను, దురభిమానమువలనను, అపోహవలనను మతములోని యథార్థమును ఆధునిక హైందవ యువకుడు గ్రహింపలేకున్నాడు. నిజమైన

---

* ఓమ్ అగ్నిమీలే పురోహితం యజ్ఞస్యదేవ మృత్విజం
హోతారం రత్నధాతమ్. (ఋగ్వేదము)
ఓమ్ ఇషేత్వోర్జేత్వా వాయవః స్థోపాయవః స్థదేవోవః
సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే. (యజుర్వేదము)
ఓమ్ శన్నోదేవి రభీష్టయే ఆపో భవంతు పీతయే
శన్నోరభి స్రవంతునః. (అథర్వవేదము)

మతము సర్వజనీనశీలముగలది. ఆ శీలము 'అణోరణీయాన్ మహతో మహీయాన్'* అని మతము బోధించు భగవతత్త్వమును ఛాయవలె ననుసరించియున్నదే. కాని, నేటియువకుడు, ఐహికవిషయము తప్ప మరొకటి తెలియని జాతుల దగ్గరనుంచి ఎరువు తెచ్చుకొన్న కొలబద్దతో ఆధ్యాత్మికసత్యమును పరిశీలింపగోరుచు, చీకటిలో తడుముకొనుచున్నాడు. ఆ విధముగా నతడు తన పూర్వుల మతమును దెలిసికొనజాలక పోవుచున్నాడు. తుదకతడు అన్వేషణ చాలించి అజ్ఞేయవాది యగుచున్నాడు. లేదా, సోమరిగా యంత్రప్రాయపు బ్రతుకుతో సంతృప్తి పొందలేక, ప్రకృతిసిద్ధమగు మతప్రేరణలకు వశుడయి నిర్లక్ష్యముగా పాశ్చాత్యభౌతికవాదమునుండి ప్రభవించిన విషయములను ప్రాచ్యపరిమళముతో మిళితముచేసి గ్రహించుచు, శ్రుతివచనమును సార్థకముచేయుచున్నాడు.

'పరియన్తి మూఢా అన్ధో నైవనీయమానా యథాన్ధాః'— (కానని వాని నూతగాగొనిన కాననివానివలె, దారి తెలియక ముందుకు వెనుకకు మూర్ఖులు తొట్రుపడుచుందురు.) నవజీవనము కలిగించు "సద్గురు" ప్రభావముచేత ఎవరిలో ఆత్మావబోధమగునో వారు ఈ స్థితినుండి తప్పుకొనగలరు.

భాష్యకారుడు చెప్పిన చక్కని మాట లివి :

"దుర్లభం త్రయమేవై తత్ దేవానుగ్రహహేతుకమ్।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః"॥

(మానవజన్మ, ముముక్షుత్వము, మహాత్ముల సాంగత్యము— ఈ మూడు దుర్లభము; ఇవి దేవతల కృపవలన కలుగవలసినవే.)

పరమాణు, ద్వ్యణు, త్రసరేణు సిద్ధాంతములకు దారితీసిన వైశేషికుల నిశిత తార్కికపరిశీలనకుగాని, అంతకంటె

---

* సూక్ష్మతమముకంటె సూక్ష్మతరము. మహత్తమముకంటె మహత్తరము.

అద్భుతమైన తర్క-పరిశీలనతో జరిగిన జాతి, ద్రవ్య, గుణ, సమవాయ చర్చలకుగాని, పరిణామ సిద్ధాంతములకు మూలపురుషులయిన సాంఖ్యుల వాదములందుకొన్న నయ్యాయికులలోని పలు తెగలవారికిగాని, ఈ పరిశోధనలన్నిటి ఫలితముగా వెలసిన వ్యాససూత్రములకుగాని—మానవుని మనస్సును గుఱించి జరిగిన ఈ సకల పరిశీలనలకును, సమన్వయ ప్రయత్నములకును మూలాధారము శ్రుతులే. బౌద్ధ, జైనమతముల తాత్త్వికగ్రంథములలో సహితము శ్రుతులసహాయ మెన్నడు నిరాకరింపబడలేదు. కొన్ని బౌద్ధవాదములలోను, పెక్కు జైనవాదములలోను శ్రుతిప్రమాణము పూర్తిగా అంగీకరింపబడినదికూడ. వేదములలో బ్రాహ్మణులు తరువాత దూర్చిన భాగములని వారు భావించినవాటికి "హింసక శ్రుతుల" ని పేరుపెట్టిరి. ఇటీవల మహనీయ స్వామి దయానంద సరస్వతికూడ అట్టి అభిప్రాయమునే ప్రకటించినారు.

భారతదేశములోని ప్రాచీన వాదములకును, అర్వాచీన వాదములకును ఏకీభావము కుదరగల కేంద్రమువంటి భావక్రమమును చూపవలసినదని యడిగినయెడల హిందూమతమునకు, దాని సకల రూపములకు నిజమైన వెన్నుముకవంటిదేదో చూడగోరినయెడల నిరాక్షేపణముగా వ్యాస సూత్రములను చూపవచ్చు.

మనోహరమైన హిమాలయ పర్వతారణ్యములందలి ప్రశాంత వాతావరణమున వియద్గంగాతరంగ మృదంగనాదములతో మేళవించునట్లు అస్తి, భాతి, ప్రియ (సత్ చిత్ ఆనంద) అని అద్వైతకేసరి చేయు మేఘగర్జనలు విన్నను; బృందావనములోని సుందర తరుచ్ఛాయల శ్రావ్యముగా వినబడు "పియ", "పితం" పలుకు లాలకించినను; వారణాసి మఠములలో చేరి నిశ్చలచిత్తముతో ధ్యాననిమగ్నుడయినను; నదియా ప్రవక్త అనుచరులతో కలసి భక్తిపారవశ్యముతో నృత్యముచేసినను;

వడగలి, తెంగలి తదితర ఉపశాఖలతో కూడిన విశిష్టాద్వైతము బోధించు ఆచార్యుని చరణసన్నిధిని ఆసీనుడయినను; మధ్వమత ముపదేశించు ఆచార్యుల ప్రవచనములు శ్రద్ధతో గ్రహించినను; వాగురికిఫతే (గురువునకు విజయము) అనెడి సిఖ్ఖుల సైనిక నినాద మును శిరసావహించినను; ఉదాసీనుల, నిర్మలుల గ్రంథసాహెబ్‌ను గుఱించిన ధర్మోపదేశముల నాలకించినను; కబీరు సన్న్యాసశిష్యు లను "సత్ సాహెబ్" అని నమస్కరించి, వారి భజనలలో పాల్గొని ఆనందించినను; రాజపుత్రస్థానపు దాదు రచనలను దీక్షతో పఠించినను; ఆయన శిష్యుడు సుందరదాసు గ్రంథము లనుగాని, విచారసాగరకర్త నిశ్చలదాసు రచనలనుగాని అధ్యయ నముచేసినను; (గత మూడుశతాబ్దములలో ఏ భాషలో రచింప బడిన గ్రంథమునకుగాని భారతదేశముపై విచారసాగరమున కున్నంత ప్రభావములేదు)—ఉత్తర హిందూస్థానములోని భంగీ మెహతార్‌ను తనలాల్గురు ఉపదేశములను తెలియజేయవలసినదని కోరినను—ఇన్ని వాదములకు, ఇందరు బోధకులకు ప్రాతిపదిక, ప్రమాణము శ్రుతి; దానికి భాష్యమైన భగవద్గీత; శ్రుతిలోని విషయమును క్రోడీకరించి క్రమబద్ధముచేసిన శారీరక సూత్ర ములు. భారతదేశములోని విభిన్న శాఖోపశాఖలు, పరమహంస పరివ్రాజకులదగ్గఱనుండి తృణీకారముతో చూడబడెడు లాల్గురు మెహతార్ శిష్యులవఱకు — అన్నియు ప్రస్థానత్రయములోని బోధల అంశలే.

ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత భాష్యములతో, వాని స్వల్ప సవరణలతో కూడిన ప్రస్థానత్రయము హిందూమతమునకు "ప్రమాణములు". ప్రాచీన నారసాంసి (వేదములలోని సంహితభాగము) ఆధునిక ప్రతిరూపములయిన పురాణములు, ఈ విషయమును గుఱించిన కల్పితకథాసాహిత్య మగుచున్నవి. బ్రాహ్మ ణముల (వేదములలోని కర్మకాండభాగము) ఆధునిక రూపము

లయిన తంత్రములు కర్మకాండను కల్పించుచున్నవి. ప్రస్థాన త్రయము అన్ని తెగలకు ప్రమాణము. పురాణములు, తంత్రములు ప్రతితెగకు ప్రత్యేకము.

తంత్రములు వైదికకర్మల రూపాంతరము, వానిని గురించి ఎవరుగాని విపరీత నిర్ణయములు చేయుటకుముందు వానిని బ్రాహ్మణములతో ఆధ్వర్యుభాగముతో జతపఱచి చదువవలసినదని హితవొసగుచున్నాను. తంత్రములలో ఉపయోగించెడు మంత్రము లనేకము బ్రాహ్మణములలోనుండి యథాతథముగా తీసికొనబడినవి. శ్రౌత స్మార్తకర్మల తరువాత సేతు శీతనగపర్యంతము నేడమలులోనున్న కర్మలన్నియు తంత్రములనుండి తీసికొనబడినవే. శాక్త, శైవ, వైష్ణవ పూజలు తదితర ఉపాసనలన్నిటిని అవి నిర్దేశించుచున్నవి.

అయితే, హిందువులెల్లరకు తమ మత ప్రాతిపదికలను గురించి క్షుణ్ణముగా తెలియునని నేను చెప్పుటలేదు. అసంఖ్యాక ప్రజలు, ముఖ్యముగా దిగువ వంగదేశములోనివారు ఈ శాఖల పేర్లు, ఈ విధానముల పేర్లు సహితము వినియుండలేదు. కాని, తెలిసియో, తెలియకయో ప్రస్థానత్రయములో సూచితమైన ప్రణాళికనే వారనుసరించుచున్నారు.

హిందీభాష వ్యవహారములోనున్న ప్రాంతములందు నిమ్న వర్గములవారికి, దిగువ వంగదేశములోని ఉన్నత వర్గములకు చెందిన పెక్కుమందికంటె, వేదాంతమును గురించి ఎక్కువ తెలియును.

ఎందుచేత?

వంగదేశములోని న్యాయశాస్త్రము హిందూస్థానమంతటను మన్ననతో అధ్యయనము చేయబడుచున్నది. ఇది తొలుత మిథిలనుండి నవద్వీపమునకు కొనిరాబడినది. శిరోమణి, గదాధర, జగదీశప్రభృత ప్రజ్ఞానిధులు దీనిని వృద్ధిపఱచిరి. ఈ తర్క

శాస్త్రము కొన్ని విషయములలో జగత్తులోని తర్కశాస్త్రము లన్నిటికంటెను ఉత్కృష్టమైనది. ఈ శాస్త్రము నిర్దిష్టమైన శాస్త్రీయభాషలో రచింపబడినది. దురదృష్టవశమున వేదాధ్యయనము అశ్రద్ధచేయబడినది. మొన్న మొన్నటివఱకు వంగదేశములో పతంజలి మహాభాష్యము బోధింపగలవారు కఱవైరి. ఒకపర్యాయము మాత్రము మహాప్రతిభాశాలి భగవాన్ శ్రీకృష్ణచైతన్య అవతరించెను. అంతట వంగదేశమున మతవిషయిక మాంద్యము వదలిపోయి, భారతదేశములోని యితర ప్రాంతములలోని మతజీవనముతో సంబంధము కలిగినది.

శ్రీ చైతన్యుడు ఒక భారతివలన సన్న్యాసము స్వీకరించెను. కనుక ఆయనకూడ భారతియే. కాని, ఆయనలో ఆత్మావబోధము తొలుత మాధవేంద్రపురి వలననే కలిగినది. విచిత్రముకాదా?

వంగదేశములో ఆధ్యాత్మికప్రబోధము కలిగించుట పూరీలు తమపనిగా పెట్టుకున్నట్లు తోచుచున్నది. భగవాన్ శ్రీ రామకృష్ణపరమహంసకు సన్న్యాసాశ్రమ మిచ్చినది తోతాపురి.

వ్యాససూత్రములకు శ్రీ చైతన్యుడు వ్రాసిన భాష్యము పోయినదో యేమో గాని యింతవరకు దొరకలేదు. ఆయన శిష్యులు దక్షిణభారతములోని మధ్వులతో కలసిరి. క్రమముగా రూప, సనాతన, జీవగోస్వామివంటి మహాత్ములు వహించిన భారము బాబాజీలపై పడినది. శ్రీ చైతన్యుని ఉద్యమము శీఘ్రముగా క్షీణించుచుండెను. ఇటీవలనే ఈ ఉద్యమమునకు పునరుజ్జీవనము కలుగు సూచనలు కనబడినవి. ఉజ్జీవనోద్యమము సఫలమై పూర్వపుస్థాయిని అందుకొనగలుగుగాక.

శ్రీ చైతన్యుని ప్రభావము యావద్భారతమున గలదు. ఎక్కడెక్కడ భక్తిమార్గము తెలిసికొనబడినదో అక్కడక్కడెల్ల

ఆయన ప్రస్తుతింపబడుచున్నాడు; ఆయన బోధలు శ్రద్ధతో చదువబడుచున్నవి; ఆయన పూజింపబడుచున్నాడు. వల్లభాచార్యుని ఉద్యమమంతయు శ్రీ చైతన్యుడు ప్రారంభించిన శాఖకుపశాఖయేనని నమ్ముటకు నాకు కావలసినంత కారణమున్నది. కాని, వంగదేశములోని ఆయన అనుచరులమని చెప్పుకొనుచున్న వారిలో పలువురకు, ఆయన శక్తి నేటికి ఆసేతుహిమాచలము ఏ విధముగా పనిచేయుచున్నదో తెలియదు. ఎట్లు తెలియగలదు? శిష్యులు మఠాధిపతులైనారు. ఆయన పాదరక్షలు సహితము లేకుండ యింటింటికి పోయి ఆచండాలురను సహితము భగవంతుని ప్రేమింపుడని ప్రబోధించెను.

వంగదేశములో వంశపారంపర్యముగ గురుపీఠము లేర్పడెను. విచిత్రమైన ఈ యాచారము సనాతనమత విరుద్ధము. భారతదేశములోని యితరప్రాంతముల మతజీవనముతో వంగదేశమునకు సంబంధము తెగిపోవుటకు వంశపారంపర్య గురుపద్ధతి మఱొక కారణము.

దీనికంతకు అసలయిన పెద్దకారణ మిది: భారతదేశములోని పరమోత్కృష్టమైన ఆధ్యాత్మిక సంస్కృతికి ప్రాతినిధ్యము వహించగల ఉత్తమ సన్న్యాసమండలినుండి ఎవరును నేటివరకు వంగదేశమునకు వచ్చి యిక్కడి జీవితమును పరివర్తన మొందింపలేదు.

త్యాగము (వైరాగ్యము) నందు వంగదేశములోని ఉన్నత వర్గములవారి కెన్నడు ఆసక్తి కలుగలేదు. భోగములమీదనే వారి యభిలాష అధికమైయుండెను. ఇక ఆధ్యాత్మిక విషయములలోని రహస్యము వారికెట్లు తెలియును? త్యాగేనైకే అమృతత్వమానసుః "వైరాగ్యముచేతనే అమృతత్వము సిద్ధించును." మఱొకవిధమున ఎట్లు సాధ్యమగును?

హిందీభాష వ్యవహారమందున్న ప్రాంతములలో అట్లుగాక, విశేషప్రభావము గలిగి, త్యాగసంపన్నులయిన ప్రతిభావంతులు

పలువురు పరంపరగా బోధకులైనారు. వారి కృషిఫలితముగా వేదాంతము యింటింటికి, గడపగడపకు అందుబాటులోనికి వచ్చినది. ముఖ్యముగా పంజాబులోని రంజిత్ సింగ్ పరిపాలనకాలమున త్యాగశీలమున కిచ్చిన ప్రాధాన్యముతో వేదాంతమునందలి ఉత్కృష్టమైన ఉపదేశములు అధమాధములకు సహితము అందుబాటులోకి వచ్చినవి. పంజాబీ కార్మికబాలిక సార్థకమైన గర్వముతో తన రాట్నముసహితము "సోహం", "సోహం" అని పలుకుచుండునని చెప్పను. హృషీకేశ్ అడవులలో హీనకులజులైన త్యాగులు సన్న్యాసదుస్తులు ధరించి వేదాంత మభ్యసించుచుండుట నేను చూచినాను. ఉన్నతవర్గములకు చెందినవా రనేకమంది సంతోషముతో వారి పాదములదగ్గఱ కూర్చొని నేర్చుకొందురు. ఎందుకు కూడదు? "అంత్యా దపి పరంధర్మ" పరావిద్య తక్కువకులమున పుట్టినవారి దగ్గఱనుండియైనను నేర్చుకొనవచ్చును.

పశ్చిమోత్తర ప్రాంతములోను, పంజాబులోను, ప్రజలలో మతవిద్య వంగ, బొంబాయి, మద్రాసు రాష్ట్రములలోకంటె చాల హెచ్చుగ వ్యాపించినది. నిరంతరము దేశాటనము చేయుచుండెడు వివిధశాఖలకు చెందిన విరాగులు, దశనాములు, వైరాగులు, పంథులు, ప్రతి గృహమునకు మతమును గొనివచ్చిరి. దానిమూల్యము రొట్టెముక్క మాత్రమే. వారిలో పెక్కుమంది ఎంతటి ఉదారులు, నిస్స్వార్థులు! కచుపంథీల (స్వతంత్రులు, ఏ ఒకతెగకు, శాఖకు వారు చెందినవారుకారు.) లోని ఒకసన్న్యాసియుండెడివాడు. అతడు రాజపుత్రస్థానములోని వందలకొలది విద్యాసంస్థలు, ధర్మసత్రములు స్థాపించుటకు కారకుడైనాడు. అత డడవులలో వైద్యశాలలు కట్టించినాడు; హిమాలయ పర్వతములలో అక్కడక్కడ గండ్లపై యినుపవంతెనలు వేయించినాడు. అత డొక్క నాణెమునయినను తాకడు. కంబళి తక్క అతనికి ఆస్తి

పాస్తులేవియు లేవు. అందువలన అతనికి "కంబళి స్వామి" అని పేరు వచ్చినది. తన ఆహారముకొరకు కింటింటికి తిరిగి భిక్షాటనము చేసెడివాడు. తనకు కావలసిన ఆహారమంతటిని ఒకేగృహములో నాతడు భుజించుట నేనెఱుగను. తన భోజనవ్యయ భారమంతయు ఒకరికి కలిగించుట అతనికి సమ్మతముగాదు. అటువంటివారెందరో గలరు. వారిలో అతడొకడు. అటువంటి దివ్యపురుషులు భారత దేశమునందుండి "సనాతన మతము"ను తమ దుర్భేధ్యదైవీగుణ దుర్గముతో సంరక్షించునంతకాలము ప్రాచీనమత మంతరించునా?

ఈ దేశములో* ఛర్చీలలో ఉపాసనలు నిర్వహించు ఆచార్యులు సంవత్సరమునకు ముప్పదివేలు, నలుబదివేలు, యేబదివేలు, తొంబదివేలు వేతనము తీసికొందురు. ఆదివారమునాడు రెండు గంటలసేపు ఉపాసనచేయుటకే అంతవేతనము. సంవత్సరములో ఆఱుమాసములు చేసిన చాలు. ఇక్కడివారు తమ మతమును ప్రోత్సహించుట కెట్లు లక్షలకొలది వెచ్చించుచున్నారో చూడుడు. స్వార్థచింత లవలేశమైనను ఏ కోశమునలేని కంబళి స్వామివంటి వారు సోమరులని, దేశద్రిమ్మరులని వంగదేశములోని యువకులు బోధింపబడుచున్నారు. ఆ యువకులకు నేర్పిన చదువది. "మద్భక్తానాంచయే భక్తాస్తే యే భక్తతమా మతాః—నా భక్తులను పూజ్య భావముతో ఎవరు సేవింతురో వారు భక్తులలో అగ్రశ్రేణికి చెందినవారు."

విశేష ప్రాముఖ్యముగల ఉదాహరణ తీసికొందము: ఏమీ తెలియని విరాగియే ఉన్నాడనుకొందము. అతడు గ్రామములోనికి వెళ్ళినప్పుడు తనకు తెలిసినదేదో తులసీదాసు రామాయణము నుండియో, చైతన్య చరిత్రామృతమునుండియో, దక్షిణభారతము లోని ఆళ్వార్ల చరిత్రనుండియో ఉదహరించి జనులకు నచ్చచెప్పుటకు తనకు చేతనయినంత ప్రయత్నము చేయును. అది కొంత

*యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా.

మేలుచేయుట కాదా? ఇదంతయు పట్టెడన్నముకొఱకు, చిన్న గుడ్డపేలికకొఱకు జరగును. అట్టివారిని నిర్దాక్షిణ్యముగా విమర్శించుటకు ముందు, సోదరులారా! మీరు మీ దేశీయులకేమి చేయుచున్నారో కొంచె మాలోచింపుడు. బాబాజీలు దేశద్రిమ్మరులనుటకు ముందు మీకు చదువుచెప్పినవారికి మీరేమి చెల్లించుచున్నారు! మీ తోడిమానవుల ఖర్చుతో మీరు విద్యాధికు లగుచున్నారు. వారి నణగద్రొక్కియే మీహోదాను నిలుపుకొనుచున్నారు.

వంగదేశములో కొందరు హిందూమతములో పొడసూపిన క్రొత్తమార్పును విమర్శించినారు. క్రొత్తమార్పు అని వా రననూవచ్చు, విమర్శింపనూవచ్చు. ఏలయనగా హిందూమత మిప్పుడిప్పుడే వంగదేశములో ప్రవేశించుచున్నది. ఇంతవఱకు మతమనగా ఆహారపానీయములను, వివాహమును గుఱించిన దేశాచారముల సంపుటియనియే వారి అభిప్రాయము.

రామకృష్ణుని శిష్యులు భారతదేశమం దంతటను హిందూమతమును గుఱించి చేయుచున్న ప్రచారము "సచ్ఛాస్త్రము"లకు అనుగుణమైనదేనా అను విషయము బృహత్తరమైనది. దానిని చర్చించుటకీ వ్యాసములో చోటుచాలదు. కాని, విమర్శకులకు కొన్నిసూచనలు చేసెదను. అవి మా వాదమును సరిగా అర్థము చేసికొనుట కుపయోగపడగలవు.

మొదటివిషయ మేమనగా, కాళిదాసు, కృత్తివాసుల రచనల వలన హిందూమతమును గుఱించి నిర్దుష్టమైన అభిప్రాయము కలుగునని నేనెన్నడు ప్రతిపాదించి యుండలేదు. వారి పలుకులు నిశ్చయముగా అమృతోపమానములే. వానిని విన్నవారు పుణ్యాత్ములే. కాని, మనము వేదములు, దర్శనములు, మహాత్ములయిన ఆచార్యుల రచనలు, దేశమంతటను గల వారి శిష్యుల బోధలను తెలిసికొనవలెను.

సహోదరులారా! మీరు గౌతమసూత్రములతో ప్రారంభించి "ఆప్తులను" గుఱించి అతడు ప్రతిపాదించిన సిద్ధాంతములను వాత్స్యాయనుని భాష్యముయొక్క సాహాయ్యముతో అవగాహన మొనరించుకొని, శబర ప్రభృతులైన భాష్యకారుల సహాయముతో మీమాంసకారుల దగ్గఱకుపోయి, అలౌకిక ప్రత్యక్షానుభూతి (అతీంద్రియానుభూతి) ని గుఱించి వారేమి చెప్పినది తెలిసికొని, ఆప్తులెవరో, ప్రతిజీవి ఆప్త కాగలదో లేదో గ్రహింపుడు. వేదములు, ఆప్తుల ప్రవచనము లగుటచేతనే ప్రామాణికము లగుచున్నవి. ఇంకను వ్యవధియున్న యెడల, యజుర్వేదమునకు మహీధరుడు వ్రాసిన ఉపోద్ఘాతమును కనుడు. అందు వేదములు మానవుని అంతరంగజీవితమునకు సంబంధించిన శాసనము లనిన విషయము వివరముగా చర్చింపబడినది. అందుచేత అవి సనాతనములు.

సృష్టి అనాది అను విషయము—ఈ సిద్ధాంతము హిందూ మతమునకే కాక బౌద్ధ జైన మతములకుకూడ ముఖ్యమైన ప్రాతిపదిక.

ఇపుడు భారతదేశములోని మతశాఖలన్నిటిని జ్ఞానమార్గము ననుసరించునవిగనో, భక్తిపథము ననుసరించునవిగనో స్థూలముగా విభజించవచ్చును. శ్రీ శంకరాచార్యులు రచించిన శారీరక భాష్యమునందలి ఉపోద్ఘాతము చూచినచో జ్ఞానమార్గమునందలి నిరపేక్షతను గుఱించి క్షుణ్ణముగా చర్చింపబడినది. బ్రహ్మసాక్షాత్కారము, మోక్షప్రాప్తి కర్మకలాపములమీద, సిద్ధాంతముల మీద, కులము, రంగులమీద ఆధారపడవను విషయము నిర్ధారణ చేయబడినది. పరిపూర్ణమైన నైతికశిక్షణకు సంబంధించిన సాధన చతుష్టయము నభ్యసించినవారెవరికయినను సరే మోక్షము లభించగలదు.

భక్తుల సంగతి: కులము, జాతి, లింగభేదము, మనుష్య జన్మసహితము మోక్షమున కవసరము కాదని ప్రమాణములు

నిర్దేశించిన విషయము వంగదేశపు విమర్శకులకు తెలియును. మోక్షప్రాప్తికి కావలసినది భక్తిమాత్రమే.

జ్ఞానము, భక్తి సర్వత్ర నిర్నిబంధములని బోధింపబడినవి. మోక్షప్రాప్తికి కులము, సిద్ధాంతము, జాతి అవసరమని చెప్పిన ప్రమాణ మొకటియు లేదు. 'అంతరా చాపి తత్ ద్రష్టే' * ఈ వ్యాససూత్రమును గుఱించి శంకర రామానుజ మధ్వాచార్యులు చేసిన చర్చను చూడుడు.

ఉపనిషత్తులను పరిశీలింపుడు. సంహితలను చూచినను సరే. వానిలో నితర మతములు మోక్షమును గుఱించి చెప్పుచున్న సంకుచితభావములు లేవు. ఇక పరమతసహనము మాట పలు తావుల పేర్కొనబడినది. అధర్వణవేదసంహితలోకూడ—నా జ్ఞాపకము సరియైనదయినచో—నలుబదవ అధ్యాయమందలి మూడవ మంత్రమో, నాల్గవమంత్రమో, అది యిట్లు ప్రారంభమగును. "న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మసంగిణాం" † ఈ భావము అంతటను కానవగును. సంఘనియమములకు లోబడినంత కాలము—తన ఇష్టదేవతను తనకు తోచినవిధముగా ఏరుకొన్నందుకుగాని, నాస్తికుడో, అజ్ఞేయవాదియో అయినందుకుగాని భారతదేశములో ఎవరినిగాని సంఘము బాధించినదా? సంఘము తన కట్టుబాట్ల నుల్లంఘించినవారిని శిక్షించియుండవచ్చును. కాని, ఎవరును—

---

* "ఏ ఆశ్రమమునకు చెందక మధ్యస్థితిలో నున్నవారుకూడ జ్ఞానమున కర్హులే. ఈ మాట శ్రుతియందున్నది." III-4-36. ఒక ఆశ్రమమునకు చెందకపోయినను, ఏ ఆశ్రమమునకు చెందునో నిర్ణయించుట కవకాశము లేక పోవుటవలన మధ్యస్థితియందున్నను బ్రహ్మజ్ఞానము పొందుట కర్హుడే; అట్టి స్థితియందున్నవారు బ్రహ్మజ్ఞానము పొందినట్లు ప్రమాణవాక్యములున్నవి.

(ఛాందోగ్యోపనిషత్తు)

బృహదారణ్యకోపనిషత్తు, III-VI & VIII.

† "కర్మాసక్తుడైన అజ్ఞాని బుద్ధిని జ్ఞాని విచలితమొనరింపరాదు" ఈ మాట గీతలోకూడ కలదు.

అధమస్థితిలోనున్న పతితుడయినను మోక్షమునకు నిరాకరింప బడలేదు. ఈ రెండు విషయములను కలిపి ఒక్కటిగా చూడ గూడదు. మలబారులో ఉత్తమవర్ణుడు నడచిన వీధిలో చండాలుని నడవనీయరు. అతడు మహమ్మదీయుడుగానో, క్రైస్తవుడు గానో మారిపోయినయెడల వాని నెక్కడికయినను పోనిచ్చెదరు; ఈ నియమము హిందువైన ఒక రేలికరాజ్యములో శతాబ్దముల కొలది ప్రాముఖ్యము వహించినది. ఇది విచిత్రముగానే కనబడ వచ్చు. కాని, దీనినిబట్టి తీవ్రప్రతికూలపరిస్థితులలోగూడ పరమత సహన మవలంబింపబడినదని తెలియగలదు.

ఒకవిషయములో హిందూమతమునకు, లోకములోని తక్కినమతములకు భేదము గలదు. అది యిది: ఈ జీవితములోనే మానవుడు దేవుని తెలిసికొని తీఱవలసినదే. ఈ విషయము చెప్పుటకు ఋషులు దాదాపు సంస్కృతభాషలోని పదజాలమంతటిని ఉపయోగించిరి. దీనికి, "దేవుని తెలిసికొనుట దేవుడగుటయే" అని అద్వైత ప్రవచనములు చేర్చుట మిక్కిలి సమంజసము.

దీనిఫలితముగా నిక్కడ దివ్యవాణిని గుఱించిన బహు ముఖ్యమైన ప్రసక్తి రాక తప్పదు. ఈ విషయమై చెప్పినవారు వైదికఋషులే కారు; విదురుడు, ధర్మవ్యాధుడు, ఇంకను అనేక మంది మాత్రమే కారు; ఇటీవల దాదుపంథితెగకు చెందిన త్యాగి నిశ్చలదాసు సహితము తన "విచారసాగరము"లో నిస్సంకోచముగా నిట్లు వక్కాణించినాడు: "బ్రహ్మను తెలిసి కొన్నవాడు బ్రహ్మ అయినాడు. అట్టివాని పలుకులు వేదప్రవచనములే. అవి దేవభాషలోనున్నను, ప్రజలభాషలోనున్నను అజ్ఞానాంధకారమును పోద్రోలగలవు."

ద్వైతులు చెప్పునట్లు బ్రహ్మసాక్షాత్కారము పొందుట, లేదా, అద్వైతులు చెప్పునట్లు బ్రహ్మమగుట—వేదములలోని బోధలన్నిటి లక్ష్యము, చరమఫలితము. వానిలోని యితర ఉప

దేశములలోని ప్రతి యుపదేశము ఆలక్ష్యసాధనలో ఒకానొక దశను సూచించును. వ్యాసుని భావములను శ్రీ శంకరభగవత్పాదులు అత్యద్భుతప్రతిభతో వ్యక్తీకరించిరి.

పరమవస్తువయిన బ్రహ్మమొక్కటే సత్యము; భారతదేశములోగాని, అన్యదేశములలోగాని ఉన్న విభిన్నశాఖలు ఆ బ్రహ్మముయొక్క వివిధ వికాసముల నాశ్రయించుకొని యుండుటచేత సాపేక్షసత్యములు. వానిలో కొన్నిటికంటె మరికొన్ని ఉన్నతస్థాయిలో నుండవచ్చును. ఒకడు తిన్నగా సూర్యునికడకు ప్రయాణమైనాడనుకొందము. అతడు తన ప్రయాణములో అడుగడుగున సూర్యబింబమును క్రొత్త క్రొత్త రూపములలో చూచుచుండును. సూర్యుని చేరుకొనువఱకు పరిమాణము, రూపము, వెలుగు అనుక్షణము వేఱుగా నుండును. మొదట సూర్యుడు పెద్ద బంతిగా కనబడును. తరువాత తరువాత పరిమాణము వృద్ధిపొందుచున్నట్లు కనబడును. సూర్యుడు బంతివలె చిన్నవాడుగా ఎప్పుడు లేడు; ప్రయాణములో దారిపొడవున అతడు చూచినట్లు లేడు. అయినను ప్రయాణీకుడు మొదటినుండి చివరివరకు సూర్యునే చూచినమాట నిజముకాదా? అదేవిధమున ఈ విభిన్న మతశాఖలు నిజమే—మన లక్ష్యమైన 'ఏకమేవా ద్వితీయం' అనెడి సూర్యునికి కొన్ని దగ్గఱగా నున్నవి, మఱికొన్ని దూరముగా నున్నవి.

శుద్ధపరబ్రహ్మమును గుఱించి మనకు బోధించు గ్రంథములు వేదములే. భగవంతుని గుఱించిన యితర భావములన్నియు పరిమితములు, సంకుచితములు నయిన దృశ్యములు. సర్వలోకహితైషిణి *శ్రుతి, జిజ్ఞాసువు చేయిపట్టుకొని ఒక మజిలీనుండి మఱొక మజిలీకి నడిపించును. అతడు ప్రయాణముచేయవలసిన మజిలీలన్నిటిని దాటించి పరమగమ్యమునకు చేర్చును. అన్యమతములన్నియు అంతగా అగ్రేసరములుగాక ఈ మజిలీలలో ఏదోఒక

* అఖిల విశ్వమునకు శుభము గోరువాడు.

దానిని సూచించునవే! చూపెడివే. కనుక ప్రపంచములోని సకల మతములు పేరుగాని, పరిమితిగానిలేక సనాతనమైన వైదికమత ములో చేరియేయున్నవి.

ఎన్ని జన్మలు కృషిచేసినను, ఎన్ని యుగముల కాలము మీ మనస్సును మూలమూలల వెదకినను—ఆధ్యాత్మిక సంపద అనంతముగాగల ఆ ఖనిలో లేని మతవిషయికమైన ఉన్నతభావ మొక్కటిగూడ మీరు కనిపెట్టలేరు.

హిందువుల విగ్రహారాధన మనబడు విషయమా?—మొట్ట మొదట వారిదగ్గఱకు వెళ్లి వారనుసరించుచున్న విధానములను తెలిసికొనుడు. దేవాలయములోనా, విగ్రహములోనా, తమ శరీరాలయములోనా వారు ఉపాసించుచున్నది? వారు చేయు చున్నదేమో పరిశీలించి గ్రహింపుడు—ఆక్షేపకులలో నూటికి తొంబదిమంది కా విషయమే తెలియదు—తరువాత వేదాంతపర ముగా దాని అంతర్యము దానంతట అదే సుబోధకము కాగలదు.

అసలు ఈ కర్మలు చేసితీఱవలెననెడి నిర్బంధములేదు. మనుధర్మశాస్త్రము చూడుడు. వయస్సుచెల్లిన ప్రతివ్యక్తిని సన్న్యాసాశ్రమము స్వీకరించవలసినదిగా అది ఆదేశించుచున్నది. తురీయాశ్రమ స్వీకారము చేసినను, చేయకున్నను అన్ని కర్మలను పరిత్యజింపవలసినదే. "ఈ సకల కర్మలు జ్ఞానమున పరిసమాప్త మగు" నని పెక్కుతావులందు ఉద్ఘాటింపబడినది. కర్మలన్ని యును జ్ఞానే పరిసమాప్యతే!

ఇతర దేశములలోని చదువుకున్నవారికంటె భారతదేశము లోని కర్షకున కెక్కువ మతపరిజ్ఞానము గలదు. నా యుపన్యాస ములలో తాత్త్వికమత భావములకు ఆంగ్లేయపారిభాషిక పదములు వ్యవహరించినందుకు ఒకమిత్రు డాక్షేపించినాడు. సంస్కృతపద ములను ప్రయోగించుట నాకు చాల యిష్టమే. కాని, నేను ఉపన్యసించినది పాశ్చాత్యుల సభలలో. ఆ విషయము మిత్రుడు

మఱచిపోయినాడు. హిందువులు తమ సంస్కృత గ్రంథముల నర్థముచేసికొనగల స్థితిలో లేరని వాని యర్థమును క్రైస్తవప్రచారకులు పరిశోధనచేసి తెలిసికొని చెప్పిరని ఒక భారతీయ క్రైస్తవ ప్రచారకు డనినాడు. కాని, ప్రచారకుల మహాసభలో సంస్కృత వాక్యమొక్కటయినను అర్థముచేసికొనగలిగిన వ్యక్తి నాకు కనబడలేదు. అయినను వారిలో కొందఱు వేదములను, హిందూమత ప్రమాణగ్రంథములను విమర్శించుచు విద్వత్ప్రకర్షతో వ్యాసములు చదువుచుందురు!

ఏ మతమునకుగాని నేను విముఖుడననెడిమాట నిజముకాదు. భారతదేశములో క్రైస్తవమతప్రచారకు లుండుటకు నేను సహించనన్న మాటకూడ అంతటి అసత్యమే. కాని, వారు అమెరికాలో ధనసేకరణకై అవలంబించుచున్న పద్ధతులు కొన్నిటికి నేను ప్రతికూలుడను. స్కూలుపిల్లల పాఠ్యపుస్తకములలో హిందూ స్త్రీ తనబిడ్డలను గంగానదిలోని మొసళ్ళనోటిదగ్గర విసరిపడవేయుచున్నట్లు చిత్రించిన బొమ్మలున్నవి. ఆ బొమ్మలలోని అభిప్రాయమేమి? తల్లి నలుపురంగులో చిత్రించబడినది. బిడ్డకు తెలుపు రంగు పూయబడినది. ఇదంతయు కనికరము కలిగించి, ఎక్కువ డబ్బు వసూలుచేయుటకే కలిపింపబడినది. భర్త తనభార్యను నిండుప్రాణములతో స్వయముగా దహించివేయుచున్నట్లు చిత్రించిన ఆ బొమ్మల కర్థమేమి? ఆవిధముగా చనిపోయిన స్త్రీ భూతముగా మాఱి, భర్తకు శత్రువయి వానిని హింసించునట. పెద్ద రథములు మానవులమీద నడచి వారిని చంపివేయునట్లు వేసిన బొమ్మల అంతర్యమేమి? ఇటీవల ఈ దేశములో పిల్లల పుస్తకమొకటి ప్రచురింపబడినది. ఆ పుస్తకములో ఒకడు తాను కలకత్తాకు వెళ్ళివచ్చినట్లు చెప్పి తన యనుభవములు తెలియజేసెను. కలకత్తా నగర వీథులలో మతమూఢులపై రథమొకటి నడచిపోగా, తాను చూచినట్లతడు వివరించెను. ఇటువంటి వ్యక్తియే ఒకడు

తన మతబోధలో భారతదేశములోని ప్రతిగ్రామములో ఒక చిన్న కొలను గలదని, దానినిండ శిశువుల అస్థికలున్నవని చెప్పుచుండగా నేను వింటిని.

ఈ క్రీస్తు శిష్యులకు హిందువులేమి హానిచేసిరి? హిందువులు "పతితులు" అని, "నిర్భాగ్యులు" అని, అసహ్యాకరమైన పిశాచములవంటివారని క్రైస్తవ బాలబాలికలకు నూరిపోయుటకేమి కారణము? ఆదివారమునాడు పాఠశాలలలో చెప్పు చదువు కొంతవఱకు క్రైస్తవేతరులను ముఖ్యముగా హిందువులను ద్వేషింపుడనియే. అందుమూలమున వారు బాల్యదశనుండియే క్రైస్తవమత ప్రచారమునకు విరాళము లిచ్చుచుందురు. సత్యము కొఱకు కాకపోయినను, తమబిడ్డల నైతిక క్షేమమును కోరియైనను క్రైస్తవమత ప్రచారకు లట్టిపనులు జరుగనీయరాదు. ఆవిధముగా పెరిగిన పురుషులు, స్త్రీలు దయాహీనులయిన క్రూరులగుటలో ఆశ్చర్యమేమి? శాశ్వత నరకములోని చిత్రహింసను, అక్కడి అగ్నిజ్వాలలను ఎవరెంత ఎక్కువగా వర్ణించగలిగినవారి హోదా ఆ మతనిష్ఠాపరులలో అంత ఎక్కువ. నా మిత్రుని సేవకురాలు (ఒక బాలిక) పూర్వోక్తములైన రివైవలిస్టు బోధలు విన్న పాపమునకు ఆమెను ఉన్మత్తచికిత్సాలయమునకు పంపవలసి వచ్చెను. నరకములోని అగ్నిజ్వాలలను గుఱించిన వర్ణనలు ఆమెకు దుస్సహమైపోయినవి. హిందూమతమునకు వ్యతిరేకముగా మద్రాసులో ప్రచురింపబడిన పుస్తకములను చూడుడు. క్రైస్తవమతమును గుఱించి ఆవిధముగా హిందువొకడు ఒక్కవాక్యము వ్రాసిన చాలు, క్రైస్తవమత ప్రచారకులు మండిపడి, పగ సాధింపగలరు.

నా దేశవాసులారా! ఈ దేశములో నేను సంవత్సరమునకు పైగా నున్నాను. ఇక్కడి సంఘజీవనమును, సంఘములోని దాదాపు అన్ని వర్గములవారిని పరిశీలించితిని. మనతో వీరిని

పోల్చిచూచితిని. వీరు లోకమునకు చాటుచున్నట్లు మనము పిశాచములముకాము, వీరు దేవతలుకారు. అవినీతి, శిశుహత్యలు, హిందూవివాహములోని అనర్థములు మున్నగువానిని గుఱించి క్రైస్తవప్రచారకు లెంత తక్కువ ప్రస్తావించిన వారి కంతమంచిది. కొన్ని దేశములలోని పరిస్థితులతో పోల్చిచూచినయెడల వాని ముందు హిందూసంఘమును గుఱించిన క్రైస్తవమత ప్రచారకుల ఊహాచిత్రములు లెక్కలోనివికావు. నా ప్రచారము డబ్బుపుచ్చుకొని దూషణచేయుటకాదు. హిందూసంఘములో లోపములేదని చెప్పుటకు నేను సాహసింపనేరను. అందలి దోషములు దురదృష్ట వశమున శతాబ్దములతరబడి పెరిగిన దురాచారములు నాకంటె గ్రహించినవారు లేరు. విదేశీయమిత్రులారా! నాశనముచేయుటకుకాక సహాయముచేయుటకు మీరు వచ్చెదరా, భగవంతుడు మిమ్మాశీర్వదించుగాక. పడిపోయినజాతిని సమయ సందర్భములు లేక నిరంతరము దూషించుటే పనిగా పెట్టుకొని తన్మూలమున నైతికముగా మీజాతి ఆధిక్యమును నిరూపించుటే మీ లక్ష్యమైనచో, నేనొక్కమాట ఖండితముగా చెప్పదలచుచున్నాను. ఏమాత్రముగాని న్యాయదృష్టితో తారతమ్య పరిశీలనచేసిన పక్షమున హైందవజాతి నైతికముగా యావత్ప్రపంచపు జాతులన్నిటికంటె మహోత్కృష్టమైనదని రుజువుకాగలదు.

భారతదేశములో ఏనాడును మతమునకు శృంఖలములు లేవు. ఇష్టదైవమును నిర్ణయించుకొనుటలో నిర్బంధములేదు. అతనిని తెగను, గురువును ఎవరు కాదనలేదు. అయినను భారతదేశములో మతము వృద్ధిపొందినంతగా మఱే దేశములోను వృద్ధిపొందలేదు. మతమునం దనంతముగా విస్తరించు వైవిధ్యమునకు స్థాయికుదురుటకొక నిశ్చలమైన కేంద్ర మవసరము. సంఘమే అట్టి కేంద్రముగా అంగీకరింపబడినది. తత్ఫలితముగా సంఘజీవనము వికాసములేక ఘనీభవించి స్థాణువయినది. ఏలయనగా వికాసమునకు స్వేచ్ఛ అవసరముగను, పురోభివృద్ధికిని గణనీయమైనది.

పాశ్చాత్యప్రపంచమున అట్లుగాక, సంఘజీవనమున వైవిధ్య ముండెను. మతము చలనములేని దయ్యెను. మతవిధులను నిష్ఠగా అనుసరించుట ఐరోపియనుల మతమునకు ముఖ్యము. నేటికిని అంతే. ప్రతి చిన్నమార్పు రక్తపాతములోగాని సాధ్యముకాలేదు. దానివలన పొందిన ప్రయోజనము బహుస్వల్పము. దీని ఫలిత మాగా సంఘజీవన మద్భుతముగా వికసించినది. మతము స్థూల భౌతిక విషయములను గతించిన భావముల నెన్నడు అతిక్రమించ లేదు.

ఇప్పుడిప్పుడే పాశ్చాత్యప్రపంచము తనకు కావలసినదేదో తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నది. పాశ్చాత్య భగవతత్త్వ వేత్తలు "మానవునిలోని నిజమైన ఆత్మ, ఆత్మతత్త్వము" అత్యంత ముఖ్యముగా గుర్తించుచున్నారు. సంస్కృతములోని తత్త్వ శాస్త్రము నభ్యసించు విద్యార్థికి ఏ దిక్కునుండి గాలి వీచుచున్నది తెలియగలదు. నవజీవనము కలుగుట ముఖ్యము. దానికి కావలసిన శక్తి ఎటనుండి లభించిన నేమి?

భారతదేశములో ఏర్పడిన క్రొత్త పరిస్థితులవలన సంఘ నిర్మాణములో క్రొత్తమార్పు అనివార్యమగుచున్నది. గత ముప్పాతిక శతాబ్దముగా సంస్కర్తలతో, సంస్కరణ సమాజము లతో భారతదేశములో తీవ్రసంచలనము కలుగుచున్నది. అయితే నేమి? పాపము! ఆ ప్రయత్నములలో ప్రతిఒక్కటి విఫలమైనది; వారిలో ప్రతిఒక్కరు విఫలురైనారు. అసలు రహస్యము వారికి బోధపడలేదు. గ్రహించవలసిన మహద్విషయము వారు గ్రహించ లేదు. వేగిరపాటుతో వారు సంఘములోని సకలదోషములను మతమున కారోపించిరి. కథలో చెప్పినట్లు మిత్రుని ముఖముమీద వ్రాలిన దోమను చంపుటకు ప్రయత్నించినవానివలె వారు దోమను, దోమతోపాటు మిత్రుని చంపునంతటి దెబ్బలు కొట్టు చున్నారు. ఈ సందర్భములో వారు, అదృష్టవశమున, చలనము

లేని కొండలను ఢీకొనిరి. అంతట వారే ఆ యాఘాతములవలన తుత్తునియలై పోయిరి. అపసవ్యమార్గమున ప్రయత్నములు చేసిచేసి విఫలురైనను, ఆ ఉదారచరితులు, స్వార్థమెరుగని ఆ మహనీయులు ధన్యులు. ఒడలుతెలియని నిద్రమత్తు పోగొట్టుటకు వారి సంస్కరణ దీక్ష, వారు ప్రదర్శించిన శక్తి అవసరము. అయితే, ఆ ప్రయత్నములు నిర్మాణమునకై కాక నిర్మూలనకే జరిగినవి. అందుచేత అవి విధిగా విఫలమైనవి.

మనము వారి నాశీర్వదించి, వారి యనుభవమువలన గుణ పాఠము నేర్చుకొందము. వికాసము లోపలనుండి వెలుపలకు ప్రసరింపవలసినదేనని వారు తెలిసికొనలేదు. వికాసమనునది అంతకు ముందు జరిగిన సంకోచమునకు వ్యాకోచమేనని గుర్తింపలేదు. బీజము తన చుట్టుప్రక్కల గల ప్రభావములను గ్రహించి, ద్రవ్యములను జీర్ణించుకొనును. కాని, తన ప్రకృతి కనుగుణముగానే వృక్షముగా వికసింపగలదని గ్రహింపలేదు. ఇందుకు భిన్నముగా జరుగవలెనన్నచో, హైందవజాతియే పూర్తిగా నశింపవలెను. క్రొత్తజాతి ఈ దేశము నాక్రమింపవలెను. అదేనాటికిని జరిగెడి పనికాదు—ప్రాచ్యదేశములో నయిననుసరే, పాశ్చాత్యదేశములో నయిననుసరే యత్నించి చూడుడు. భారతదేశ మంతరించినగాని అది ఐరోపా కాజాలదు.

భారతదేశము నశించునా? సమస్త నీతికి, ఆధ్యాత్మికతకు, ఉత్కృష్టతకు వృద్ధజనని ఈ దేశము. ఋషులు నడచిన దేశమిది. నేటికిని ఇక్కడ దివ్యపురుషులున్నారు. ఎథీనియా ఋషిదగ్గర నుండి దీపము బదులుతెచ్చుకొని నీవెంట వచ్చుటకు సిద్ధముగా నున్నాను. సోదరా! ఈ విశాలప్రపంచములోని పట్టణములలో, పల్లెలలో, మైదానములలో, అడవులలో అన్వేషించెదను. ఇంతటి మహాపురుషులను మరెక్కడయిన చూపుడు. చెట్టు సంగతి దాని ఫలములనుబట్టియే తెలిసికొననగునని పెద్దలుచెప్పినమాట నిజము.

భారతదేశములోని ప్రతి మామిడిచెట్టు దగ్గరకు పోండు. క్రిందపడి, పురుగుకొట్టిన పచ్చికాయల నేఱుకొనుడు. వానిలో ఒక్కొక్క దానినిగుఱించి వందలకొలది సంపుటములు పాండిత్య ప్రకర్షతో వ్రాయుడు. అప్పటికిని ఒక్క మామిడిపండునుగుఱించికూడ మీరు చెప్పినట్లు కాదు. చెట్టునపండిన రసభరితమైన ఫలమును కోయుడు. ఇప్పుడు మీకు మామిడిపండును గుఱించి సంపూర్ణముగా తెలిసిన దని గ్రహింపుడు.

ఆ విధముగానే హిందూమతమనగా నేమో ఈ మహాత్ములు తెలియజేయగలరు. అనేక శతాబ్దముల సంస్కృతి గలిగి, సహస్ర వత్సరముల ఝంఝూప్రభంజనములకు తాళి, నేటికిని చెక్కు చెదరక నిత్యయౌవనదార్ఢ్యముతో నిలిచియున్న ఈ జాతి వృక్ష లక్షణములను, సామర్థ్యమును, శీలమును, దీనినుండి ముందు ముందు వ్యక్తముకాగల శక్తులను ఈ మహాత్ములు నిరూపించ గలరు.

భారతజాతి నశించునా? అప్పుడు జగత్తులోని ఆధ్యాత్మిక తయే నశించగలదు; నైతిక పరిపూర్ణత్వమే నశించగలదు; మత మందు అనురాగమాధుర్యమే నశించగలదు; ఆశయములనునవే నశించగలవు. ఆ స్థానమును కామము, భోగము, పురుష, స్త్రీ దేవతలుగా రాజ్యము చేయును. వానికి ధనము పౌరోహిత్యము చేయును. వంచన, దౌర్జన్యము, పోటీ కర్మకలాపము లగును. ఆత్మయే యజ్ఞమైపోవును. అంతటి పని జరగదు. పనులను సాధింప గల శక్తికంటె బాధలను సహింపగల శక్తి గొప్పది. ద్వేషముకంటె ప్రేమశక్తి అనంతముగా మిన్న. ఇప్పుడు హిందూమత పునరుద్ధర ణకు జరుగుచున్న కృషి దేశభక్తి ప్రేరితమని భావించుట భ్రమ.

విచిత్రమైన ఈ దృశ్యమును పరిశీలింతము.

ఆధునిక వైజ్ఞానిక పరిశోధనల ఫలితముగా మూఢవిశ్వాస ప్రధానములయిన పాశ్చాత్యమతముల పూర్వపు కోటగోడలు

కూలిపోవుటలో ఆశ్చర్యములేదు. విశ్వాసము మీదనో, గ్రుడ్డి నమ్మకము మీదనో, ధర్మిసభ్యుల అధికసంఖ్యాకుల వోట్లమీదనో ఆధారపడిన మతవిధానములు, ఆధునికవిజ్ఞానము కొట్టుచున్న సమ్మెటదెబ్బలకు, పింగాణిసామగ్రివలె పొడిపొడి అయిపోవు చున్నవి. ఆధునిక దృక్పథముతో జరుగుచున్న విమర్శలకు నిలబడ లేక, వాని కనుగుణముగా మార్పుచెందలేక పాశ్చాత్య భగవ త్తత్వశాస్త్రము తెల్లమొగము వేయుచున్నది. ఆధునిక భావ పరంపర సాహసముతో దాడిపై దాడి చేయుచున్నది. ఆధునిక భావముల ఒత్తిడి కనుగుణముగా అన్వయించి అర్థముచెప్పుటకు ఇతరమతగ్రంథములన్నిటిలోని వాక్యములకు విఱుపులు, మెలికలు కలిగింపబడినవి. పెక్కుగ్రంథములు మూలబడి బూజుపట్టుచున్నవి. అవి పాతసామానుల గదులలో జేర్చబడినవి. పాశ్చాత్యులలో జిజ్ఞాసువులు చాలమంది ధర్చితో సంబంధమును వదలుకొనిరి. వారు నిరాశాసాగరమున బడి దారి దరితోచక బాధపడుచున్నారు. ఈ పరిస్థితిలో, పరంజ్యోతిచెంత జీవితకాంతిపూరము నాస్వాదిం చిన మతములు—వేదములు—హిందూ బౌద్ధమతములు మాత్రమే పునరుజ్జీవింపబడుచున్నవి.

భావసంక్షోభమునకు గుఱియైన పాశ్చాత్యనాస్తికునకు, అజ్ఞేయవాదికి భగవద్గీతలోనో, దమ్మపదములోనో కుదురు దొరకి శాంతి లభించగలదు.

పరిస్థితులు తారుమారైనవి. గిట్టనివారు తమ ప్రాచీన గృహముపై పెట్టిన చిచ్చు దానిపై వ్యాపించుటను, హిందు వింత వఱకు నిట్టూర్పు విడచుచు, కన్నీరు కార్చుచు చూచుచున్నాడు. ఆధునికవిజ్ఞానము విరజిమ్మిన వెలుగులు గృహము నావరించిన పొగను పోగొట్టి సత్యసందీప్తదృశ్యమును జూపినవి. హిందు విప్పుడు తన గృహమొక్కటే సుదృఢముగా నున్నదని గ్రహించు చున్నాడు. ఇతరుల ఇళ్లు నామరూపములులేక అదృశ్యమైనవో,

వారు వానిని హిందూప్రణాళిక ననుసరించి కట్టుకొనుచున్నారో! అతడు కన్నీరు తుడుచుకొనినాడు. అశ్వత్థమును "ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్" (గీత. 15-1) మొదలంట గొట్టివేయుటకు ప్రయోగింపబడిన గొడ్డలి చికిత్సకుని చేతి కత్తి మాత్రమే అని తెలిసికొనినాడు.

తనమతమును కాపాడుకొనుటకు ప్రమాణగ్రంథములలోని వాక్యములను విఱుచుటకు, మెలిత్రిప్పుటకు శ్రమపడ నవసరము లేదని, మఱేవిధమైన వంచనకు పాల్పడవలసిన పనిలేదని అతడు గ్రహించినాడు. అంతేకాదు. తనగ్రంథములలోని లోపములుగా నున్న అంశములు అరుంధతీదర్శనన్యాయము * ననుసరించి దుర్బలులకు సహాయపడగల నిమిత్తము, ప్రాచీనఋషులు ఉద్దేశపూర్వకముగానే రచించిరనికూడ అతడు చెప్పగలడు. సువిశాలము, సమగ్రము అయిన మతమును కనిపెట్టిన మన పూర్వఋషులు ధన్యులు. ఆ మతమునకు భౌతికప్రపంచములో నింతవఱకు కనిపెట్టిన సకలశాసనములతోను, నికముందు కనుగొనగల శాసనములతోను పొత్తు కుదురగలదు. సంకుచితమైన ప్రతిమతమునకు శత్రువులుగా పరిణమించినను తన పరిశోధనలు - అతీంద్రియానుభూతియందు తనపూర్వులు అనేకయుగములకుపూర్వమే స్వతః స్ఫురణతో కనుగొన్న సత్యములు మనోమయభూమికమీద, ఇంద్రియగోచరమైన ప్రపంచములోను కనుగొనబడినవేనని తెలిసికొని అతడు వానిని క్రొత్తరీతిని అర్థముచేసికొనుచున్నాడు.

---

* వధువును మొదటిపర్యాయము భర్తయింటికి తీసికొనివచ్చినప్పుడు, అత డామెకు అరుంధతీనక్షత్రమును చూపును. ఆ చిన్ననక్షత్రము నామెచేత గుర్తింపజేయుటకు అతడు ముందు చెట్టుకొమ్మగాని, దగ్గఱలోనున్న మఱేదయిన పెద్దవస్తువునుగాని చూపి ఆ మార్గమునే చూపు సారింపుమని చెప్పును. తరువాత ఆ మార్గమున చెట్టుకొమ్మపైన ప్రకాశించుచున్న నక్షత్రమును చూపును. ఈ విధముగా అనేక సూచనల మూలమున అతడు ఆమెచేత అరుంధతీనక్షత్రమును గుర్తించునట్లు చేయును. ఈ పద్ధతికి అరుంధతీన్యాయమని పేరు.

అందుచేత అతడు దేనిని విసర్జింపనక్కఱలేదు. దేనికొఱ కైనను ఎక్కడెక్కడకో పోయి అన్వేషింప నవసరములేదు. తనకు సంక్రమించిన అనంత జ్ఞానభాండారమునుండి తన అక్కఱలకు కావలసినది గ్రహించి, అన్వయించుకొని, ఉపయోగించుకొనిన చాలు. ఆపని కతడు ప్రారంభించినాడు. ఇకముందు అధికాధిక ముగా అట్టి ప్రయోజన మతడు పొందగలడు. ఈ పునరుద్ధర ణోద్యమమునకు కారణ మిదికాదా?

వంగదేశపు యువజనులారా! ముఖ్యముగా మీకు నేను విజ్ఞాపనచేయుచున్నాను.

సోదరులారా! హైందవజాతిని విదేశీయజాతులు దూషిం చుటకు కారణములైన నిజమైన దోషములు మనవలన కలిగినవే. ఈసంగతి మనము లజ్జాపూర్వకముగా గ్రహించితిమి. భారత దేశములోని యితరజాతులపై మిథ్యావాదమును మోపినది మనమే. ఇప్పటికి మనము తెలివితెచ్చుకొనినందుకు ధన్యులము. భగవానుడు మహిమాన్వితుడు. అతని ఆశీర్వాదమువలన మనలను మనము పునీతులము చేసికొనుటేగాక, సనాతనమతములోని ఆశయములను సాధించుటలో యావద్భారతమునకు సహాయపడ గలము.

బానిసనుదుట ప్రకృతి వేసెడిగుర్తు మొదట తుడిచివేసి కొందము. అమచ్చ "అసూయ." ఎవరినీచూచి అసూయపడ వలదు. సత్కార్యము తలపెట్టెడివానికెల్ల సహాయపడుడు. ముజ్జగములలోని ప్రతిప్రాణికి సద్భావమువలన శుభమును సంక ల్పింపుడు.

మనమతములోని ప్రధానసత్యమును ప్రాతిపదికగా తీసి కొందము. హిందూ బౌద్ధ జైనమతముల కది పారంపర్యముగా లభించినది. అది మానవునియందున్న ఆత్మవస్తువు చావు పుట్టు

కలులేనిది, సర్వవ్యాపకమైనది, నిత్యమైనది. దాని మహిమలను ఆమ్నాయములు సహితము సంపూర్ణముగా వర్ణింపజాలవు. దాని మహిమముందు అసంఖ్యాక జ్యోతిర్మండలములతో కూడిన ఈ విశ్వము బిందుమాత్రము. ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ - దేవాది దేవులు మొదలుకొని మనపాదములక్రిందపడి నలిగిపోవు పురుగు వఱకు - సర్వజీవులు సంకోచరూపములోనో, వ్యాకోచరూపము లోనో ఆ యాత్మవస్తువే. భేదమంతయు పరిణామములోనేగాని వస్తు తత్త్వమందు గాదు.

అనంతమైన ఆత్మశక్తి భౌతికపదార్థముమీద పనిచేయుట వలన భౌతికవికాసము కలుగును. మనస్సుమీద పనిచేయుటవలన ధీశక్తి, జ్ఞానము కలుగును. దానిమీదనే అది పనిచేయుటవలన మానవుడు దేవుడగును.

మొదట మనము దేవతలమగుదము. తరువాత ఇతరులు దేవతలగుటకు తోడ్పడుదము. "దివ్యత్వము పొందుడు. కృషి చేయుడు." ఇది మనపథకము. మానవుడు పాపియని చెప్పకుడు. "నీవు దేవుడవు" అని చెప్పుడు. భూతమేదేని ఉన్నను మన విముక్తధర్మము దేవుని సంస్మరించుట, భూతమునుగాదు.

ఈగది చీకటిగానున్న యెడల పదేపదే ఆమాట అనుట చేతను, చీకటినిభావించుటచేతను చీకటిపోదు. దీపము దీసికొని వచ్చుట అవసరము. వ్యతిరేకమైనది, నిర్మూలాత్మకమైనది, విమర్శాత్మకమైనది ఏదియు నిలిచెడిదికాదని మనము గ్రహించుటవసరము. అన్వయపూర్వకమైనది, ప్రతిపాదకపూర్వకమైనది, నిర్మాణాత్మకమైనది అమృతశీలము గలది, ఎల్లకాలము నిలిచెడిది. "మనమున్నాము." "దేవుడున్నాడు." "మనము భగవంతుడు ఒక్కటే", "శివోహం", "శివోహం" అని వక్కాణింతము. వక్కాణించుచు ముందుకు సాగిపోవుదము. కావలసినది భౌతిక

వస్తువుకాదు, ఆత్మవస్తువు. నామరూపాత్మకమైనదెల్ల అదృశ్యము
కాకతప్పదు. ఇది శ్రుతులుఘోషించు శాశ్వతసత్యము. జ్యోతిని
గొనిరమ్ము; అంధకారము దానంతట అదే మాయమగును.
వేదాంతకేసరి గర్జింపవలెను; అంతట నక్కలు పడుగిడి తమ
కన్నములలో దూరును. ఈ అభిప్రాయములు ప్రసారముకానిమ్ము.
ఫలితము దానంతట అదే కలుగగలదు. మనము రసాయనిక ద్రవ్య
ములను మిళితము చేయుదము. స్ఫటికరూపము దానంతట అదే
ఏర్పడగలదు. ఆత్మశక్తిని బహిర్గతముచేయుడు. దానిని భారత
దేశమంతటిపైన వ్యాపింపజేయుడు; దాని ననుసరించి అవసరమైన
దెల్ల దానంతట అదే లభింపగలదు.

నీలోని దివ్యత్వమును ప్రదర్శింపుడు. దానిచుట్టు గల
దంతయు సామరస్యముతో ఏర్పాటుకాగలదు. వేదములలో
ఇంద్ర విరోచనుల ఉదాహరణ మఱచిపోకుడు; ఉభయులకు దివ్య
త్వమును గుఱించి బోధింపబడినది. కాని, విరోచనుడు దేహమే
దేవుడనుకొన్నాడు. ఇంద్రుడు దేవతగావున దివ్యత్వము ఆత్మ
నుద్దేశించి చెప్పబడినదని గ్రహించినాడు. మీరు ఇంద్రునిబిడ్డలు,
దేవతలసంతతివారు. భౌతికవస్తువు మీకు దైవతము కానేరదు;
దేహ మేనాటికిని మీకు దైవతము కానేరదు.

భారతదేశము సముద్ధరింపబడుట తథ్యము. అయితే కండబల
ముతో కాదు; ఆత్మశక్తితో. విధ్వంసకపతాకమును ప్రతిష్ఠించికాదు;
శాంతిప్రేమల పతాకప్రతిష్ఠతో. సన్న్యాసమస్తులతో, ధనస్తోమ
తతో కాదు; భిక్షాపాత్ర మహిమతో. దుర్బలులమని మీరెన్నడు
అనవలదు. ఆత్మ సర్వశక్తిమంతమైనది. శ్రీరామకృష్ణుని దివ్యపాద
స్పర్శచే కార్యక్షేత్రములో ప్రవేశించిన ఆ కొలదిమంది యువకు
లను చూడుడు. వారు దివ్యసందేశమును అస్సామునుండి సింధు
వఱకు, హిమాలయపర్వతములనుండి కన్యాకుమారివఱకు ప్రచా
రము చేయుచున్నారు. కాలినడకను వారు ఇరువదివేల యమగల

కెత్తున మంచుకొండనెక్కి దాటి, టిబెట్టులోని అగమ్య ప్రాంతముల లోనికి చొచ్చిరి. గుడ్డపేలికలు ధరించినవారు భిక్షాటనముచేసి భుజించుచుండిరి. వారిని ప్రజలు బాధించిరి; పోలీసులు అనుమా నించి వెంటబడిరి; వారిని కారాగారమున బంధించిరి. వారమా యకులని ప్రభుత్వము గుర్తించిన తరువాత విడుదల చేసిరి.

నేడు వారిసంఖ్య ఇరువది మాత్రమే. రేపటికి రెండువేలకు వృద్ధిచేయుడు. వంగదేశపు యువకులారా! దేశమున కట్టివా రవసరము. క్షుత్పిపాసలను, శీతోష్ణములను భరింపగలుగునట్లు మీలోని దివ్యత్వమును ప్రదర్శింపుడు. ఆహ్లాదకరమైన వసతులతో కూడిన గృహములలో జీవితభోగములమధ్య కూర్చొని మిడిమిడి జ్ఞానముతో మతమును గూర్చి నాలుగు మాటలు చెప్పుట ఇతర దేశములకు చాలునేమో. కాని, భారతజాతికి యథార్థమును గ్రహింపగల శక్తి సునిశితమైనది. అది ముసుగును ఇట్టె కనిపెట్ట కలదు. మీరు త్యాగశీలురుగా మారవలెను; మహాత్ములుగా మారవలెను. త్యాగము లేక మహత్తరకార్యమేదియు సాధ్యము కాదు. విరాట్పురుషుడే ఈ విశ్వమును సృజించుటకు త్యాగము చేసినాడు. మీ భోగములు, సౌఖ్యములు, పేరుప్రతిష్ఠలు, పదవులు, తుదకు మీప్రాణములు సహితము త్యజింపుడు. మనుష్యు లనెడి గొలుసులతో వంతెన నిర్మింపుడు. ఆ వంతెన మీద లక్షలకొలది ప్రజలు నడచి జీవితసాగరము నధిగమించగలరు. సంఘము కలిగింపగల శక్తులన్నిటిని సమీకరింపుడు. ఏ పతాకము క్రింద మీరు ప్రస్థానము సాగించుచున్నది ముఖ్యముకాదు. మీ రంగు ఆకుపచ్చనా, లేక నీలమా లేక ఎరుపా అనెడి విషయ మనవసరము. అన్నిరంగులు కలిపి దేదీప్యమానముగా ప్రకా శించెడి ధవళవర్ణమును—ప్రేమవర్ణమును సృష్టింపుడు. మనవంతు కృషి, ఫలితములు వాటంతట అవే కలుగును. ఏ సాంఘికసంస్థ గాని మనము దివ్యత్వము పొందుట కాటంకముగ నుండెనేని ఆత్మ

శక్తికి అది లొంగిపోయి దారి సీయగలదు. భవిష్యత్తు విషయమై నే నాలోచించుటలేదు; ఆ విషయమై నాకు శ్రద్ధ లేదు. ఒక్క దివ్య దృశ్యమును మాత్రము నేను చూచుచున్నాను. జీవిత మంత స్పష్టముగా కనుచున్నాను. అది యిది: మన ప్రాచీన జనయిత్రి మఱల మేల్కొనినది. ఆమె తన సింహాసనము నధిష్ఠించినది; అపూర్వమైన శోభతో ఉత్తేజితమైనది. శాంతిస్వరముతో, మంగళవచనములతో ఆమెను గుఱించి జగత్తునకు చాటి చెప్పుడు.

ప్రేమపూర్వకముగా, సేవాపూర్వకముగా
సర్వదా మీవాడను,
వివేకానంద.



# పారిస్‌లో జరిగిన మతచరిత్రకారుల కాంగ్రెస్ సమావేశము*

ఇటీవల పారిస్ నగరములో ప్రదర్శనము జరిగినప్పుడు మతచరిత్రకారుల కాంగ్రెస్ అనేకదినములు వరుసగా సమావేశమైనది. ఏ మతసిద్ధాంతములను గుఱించిగాని, ఆధ్యాత్మికవిషయములను గుఱించిగాని చర్చించుటకు ఆ సమావేశములో అవకాశము కలుగజేయబడలేదు; సుప్రతిష్ఠితములయిన విభిన్నమతస్వరూపములు ఏ తీరున క్రమవికాసము పొందినవో చారిత్రకదృష్టితో పరిశీలించుట, దానితోపాటు అందుకు సంబంధించిన సంఘటనలను తెలిసికొనుట మాత్రమే కాంగ్రెస్ లక్ష్యము. అందుచేత వివిధ మతముల ప్రచారక వర్గములకు ప్రాతినిధ్య మిచ్చెడి విషయము కాంగ్రెస్ యోచింపలేదు. చికాగోలో జరిగిన సర్వ మతమహాసభ మిక్కిలి ఘనమైనది. ప్రపంచములోని అన్ని ప్రాంతములనుండి అనేక మతశాఖల ప్రతినిధులు అందు పాల్గొనిరి. ఈ సమావేశము అటువంటిది కాదు. వివిధమతముల జన్మవృత్తాంతమును గుఱించి, చరిత్రను గుఱించి పరిశోధనచేయు విద్వాంసులు మాత్రమే సమావేశమునకు వచ్చిరి. చికాగో పార్లమెంటుసభలో రోమన్ కాథలిక్కుల ప్రభావము బలీయముగా నుండెను. వారు తమ శాఖ విషయమై కొండంత ఆశపెట్టుకొని సభ ఏర్పాటుచేసిరి. విశేషమైన ప్రతిఘటన లేకుండ ప్రాటెస్టెంటులపై తమ ఆధిక్యమును నిరూపించుకొనగలమని వా రాశించిరి. క్రైస్తవుల, హిందువుల, బౌద్ధుల, ముసల్మానుల, తదితర మతప్రతినిధుల సమక్ష

---

* "ఉద్బోధన" పత్రికకు పారిస్‌నుండి వచ్చిన లేఖకు అనువాదము.

ములో తమ కీర్తిని, బలమును, తమ సిద్ధాంతములోని సుగుణము లను వర్ణించుచు, ప్రొటెస్టెంటుల దౌర్బల్యమును బట్టబయలు చేయుటవలన తమస్థానమును సుస్థిరము చేసికొనవచ్చునని వా రాశపడిరి. కాని, ఫలితము అనుకొనినదానికి భిన్నమైనది. అంతట వేర్వేరు మతవిధానముల సామరస్యము కుదరక క్రైస్తవ ప్రపంచము నిస్పృహ చెందినది. అందుచేత మరల అట్టి సభ జరుపుటకు రోమన్ కాథలిక్కు లిప్పుడు ప్రబలమైన విముఖత్వము వహించిరి. ఫ్రాన్సు రోమన్ కాథలిక్కు దేశము. కనుక అధిపతు లెంతగా కోరినను, రోమన్ కాథలిక్కు ప్రపంచము చూపిన తీవ్ర ప్రతిఘటనవలన మతకాంగ్రెస్ సమావేశము ఏర్పాటుచేయ బడలేదు.

పారిస్‌లో జరిగిన మతచరిత్రకారుల కాంగ్రెస్ సమా వేశము అప్పుడప్పుడు జరుగుచుండెడి ప్రాచ్యవిజ్ఞానవేత్తల కాంగ్రెస్ సభవంటిది. ఆ సభలో సంస్కృతము, పాళీ, అరబిక్ మున్నగు ప్రాచ్యభాషలలో నిష్ణాతులైన ఆంగ్లేయపండితులు పాల్గొను చుందురు. పారిస్ కాంగ్రెస్ సమావేశ విషయములో ప్రాచీన క్రైస్తవవిజ్ఞానముకూడ చేర్చబడినది. అదొకటే విశేషము.

ఈ కాంగ్రెస్ సమావేశమునకు ముగ్గురు జపాన్ పండితులు మాత్రమే హాజరైరి. భారతదేశమునుండి వివేకానందస్వామి వచ్చిరి.

పలువురు పాశ్చాత్య సంస్కృతవిద్వాంసుల యభిప్రాయము ప్రకారము వైదికమతము మనల నాశ్చర్యచకితులను చేసెడి అగ్ని, సూర్యుడు, మున్నగు ప్రకృతివస్తువుల ఉపాసననుండి ఉద్భ వించినది.

ఈ వాదమును ఖండించుటకుగాను వివేకానందస్వామిని పారిస్ కాంగ్రెస్ సమావేశమునకు కొందఱు ప్రముఖులు ఆహ్వా

నించిరి. ఈ విషయమై ఒక వ్యాసము వ్రాసి చదువుటకు ఆయన అంగీకరించిరి. కాని, అనారోగ్య కారణముగా ఆయన ఆపనిచేయలేక పోయినారు. ఎంతో శ్రమతో ఆయన సమావేశమునకు హాజరైనారు. మిక్కిలి ఆదరాభిమానములతో ఆయనకు పాశ్చాత్య సంస్కృతపండితులందఱు స్వాగతమిచ్చిరి. వేదాంతమును గుఱించిన ఆయన యుపన్యాసమును వారప్పటికే విశేషముగా చదివియుండుట చేత ఆయనయందు వారి గౌరవ మినుమడించెను.

కాంగ్రెస్ సమావేశములో జర్మనీదేశ పండితుడు గస్టల్ అప్పర్ట్ సాలగ్రామశిల పుట్టుపూర్వోత్తరములను గుఱించి ఒక వ్యాసము వ్రాసిచదివెను. ఆయన సాలగ్రామపూజకు స్త్రీయందలి ఉత్పత్తికారకశక్తి చిహ్నము ప్రాతిపదిక యని పేర్కొనెను. శివలింగము పురుషునియందలి ఉత్పత్తికారకశక్తి చిహ్నమని ఆయన యభిప్రాయము. శివలింగపూజ, సాలగ్రామపూజ, లింగపూజకు, యోనిపూజకు చిహ్నములని సిద్ధాంతమును చేయుటకు ఆయన సమకట్టెను! వివేకానందస్వామి ఈయభిప్రాయములను ఖండించెను. శివలింగమును గుఱించి అటువంటి హాస్యాస్పదమైన అర్థ వివరణ తాను విన్నమాట నిజమేయనియు, సాలగ్రామశిలను గుఱించిన వాదము క్రొత్తది, వింతది, నిరాధారమైనదనియు ఆయన వచించెను.

యూపస్తంభమనెడి యజ్ఞస్తంభమును గుఱించి అథర్వవేద సంహితయందున్న ప్రసిద్ధస్తవము శివలింగపూజకు మూలమని స్వామిజీ వక్కాణించెను. ఆ స్తవమునందు ఆద్యంతములు లేని స్తంభము, లేక స్తంభమును గుఱించిన వర్ణనగలదు. శాశ్వత పరబ్రహ్మము స్థానమున స్తంభము ఉంచబడినదని తెలియజేయబడెను. తరువాత యజ్ఞమునందలి అగ్ని, ధూమము, భస్మము, జ్వాలలు, సోమలత, యజ్ఞమునకు సమిధలను

చేరవేయు వృషభము ___ వీటినుండి శివుని తనుకాంతి, అతని జటలు, నీలకంఠము, వృషభమువిూద శివుడు స్వారిచేయుట మొదలైన భావములు ఉత్పన్నమైనవి. క్రమముగా యూప స్తంభము శివలింగమునకు చిహ్నముగా పరిణమించినది. శ్రీ శంకరుని దివ్యత్వము దానికి ఆరోపింపబడినది. అధర్వసంహితలో యజ్ఞప్రసాదము సహితము బ్రహ్మగుణములతోపాటు ప్రస్తుతింప బడినది.

లింగపురాణములో ఈ స్తవమే కథలరూపమున విస్తరింప బడినది. ఆ స్తంభము ఘనతను, మహాదేవుని ఆధిక్యమును ప్రతిష్ఠించుట దాని లక్ష్యము.

మఱొకవిషయముగూడ యోచింపవలసియున్నది. బుద్ధుని స్మారకచిహ్నములుగా బౌద్ధులు స్తూపములు నిర్మించుచుండెడి వారు. పెద్ద స్తూపములు నిర్మించలేని పేదలు చిన్నవి నిర్మించి తమభక్తిని ప్రదర్శించెడివారు. అట్టి నిదర్శనములు భారతదేశము లోని కాశీవంటి పుణ్యక్షేత్రములందలి హిందూదేవాలయ ములందు నేటికిని గలవు. పెద్ద దేవాలయములను నిర్మించగల శక్తి లేనివారు. దేవాలయములను పోలిన చిన్న కట్టడములను కట్టింతురు. కనుక, బౌద్ధమతము ఉచ్ఛదశయందున్నప్పుడు ధనికు లయిన హిందువులు బౌద్ధులననుసరించి తమ స్తంభములనుబోలిన స్మారకచిహ్నములను నిర్మించియుందురు. పేదలు తమ శక్తికి తగినట్లు చిన్న కట్టడములు కట్టించియుండవచ్చును. కాలక్రమమున ఈ చిన్న స్మారకచిహ్నములు స్తంభమునకు క్రొత్త చేరిక లయినవి.

బౌద్ధస్తూపములలో నొకదానికి ధాతుగర్భము (లోహ గర్భము) అని పేరు. ధాతుగర్భములోపల సాలగ్రామమువంటి ఆకృతి గలిగి, రాతితో చేయబడిన చిన్న, చిన్న కోశములలో

ప్రసిద్ధ బౌద్ధ బిక్షువుల చితాభస్మము, అస్థికలు మొదలైన అవశేషములు బంగారు, వెండి, తదితర లోహములలో భద్రపఱుపబడినవి. సాలగ్రామశిలలు సహజముగా వాటంతట అవిఏర్పడినవి. అవి బౌద్ధుల ధాతుగర్భములలోని మానవ నిర్మితమైన శిలాకోశములవలె నుండును. వాటిని మొదట పూజించినవారు బౌద్ధులు. అనంతరము బౌద్ధుల ఉపాసనాపద్ధతులు హిందూమతములో ప్రవేశించినట్లే, వారిసాలగ్రామపూజ వైష్ణవమతములోనికి చొచ్చినది. భారతదేశములోని యితరప్రాంతములకంటె నర్మదానదీ తీరములోను, నేపాళదేశములోను బౌద్ధమతప్రభావము దీర్ఘకాలముండెను; నర్మదానదీతీరమున దొరకెడి నర్మదేశ్వరలింగము, నేపాళదేశములో లభించెడి సాలగ్రామశిలలు నితర ప్రాంతములలోనివానికంటె ప్రశస్తమైనవిగా హిందువులు భావింతురు. ఈ యంశము ఈ వివాదపరిశీలనలో ముఖ్యముగా గమనింపదగినది.

సాలగ్రామశిల మర్మావయవచిహ్నమనెడు యభిప్రాయము ఊహాజన్యము. ఈ వాదము మొదటినుండి కడవఱకు యథార్థమునకు దూరమే. శివలింగము మర్మావయవచిహ్నమనెడు వాదముకూడ బొత్తుగా అనాలోచితమైనది. ఇది భారతదేశమధఃపతనమై, బౌద్ధమతము క్షీణించినప్పుడు ప్రారంభమైనది. ఆనాటి హేయమైన బౌద్ధ తాంత్రిక సాహిత్యము ఈనాటికిని నేపాళ, టిబెట్టు దేశములలో విస్తారముగా గలదు; అందలి విధులక్కడ ఆచరింపబడుచున్నవి.

స్వామిజీ చేసిన వేఱొక యుపన్యాసమున భారతదేశములోని మతాభిప్రాయముల చారిత్రక వికాసము విశదీకరింపబడినది. హిందూమతమునకు—అది పొందిన వివిధపరిణామములలోను—వేదములే ఆధారమని ఆయన వచించెను. బౌద్ధమతమునకును, భారతదేశమున పుట్టిన ప్రతిమతవిశ్వాసమునకును వేదమే

మూలము. మతవిషయమై భారతదేశములో శాఖోపశాఖలుగా పెరిగిన భావపరంపర బీజరూపమున వేదములందు నిహితమై యున్నది. బౌద్ధమతము, భారతదేశములోని యితర మతాభిప్రాయములు ఆ బీజముల వికాసము, విస్తృతరూపము మాత్రమే. ఆధునిక హిందూమతము వానినుండి వికసించి అభివృద్ధిపొందినదే. సంఘసంకోచవికాసముల ననుసరించి ఆ బీజము లొకచోట ఎక్కువగాను, మరొకచోట తక్కువగాను వికసించినవి.

శ్రీకృష్ణుడు బుద్ధునకు పూర్వముం డున్నాడన్న విషయమై ఆయన కొలది మాటలు చెప్పెను. విష్ణుపురాణములో వర్ణింపబడిన రాజవంశముల చరిత్రలు ప్రాచీనవిషయపరిశోధనకు సహాయపడగల నిదర్శనములని క్రమక్రమముగా అంగీకరింపబడుచున్నవి; అదేవిధమున భారతీయ సంప్రదాయములన్నియు వాస్తవికతపై ఏర్పడినవే. అందుచేత సంస్కృత పండితులు వింతవింత ఊహలు చేసి వ్యాసములు వ్రాయక సంప్రదాయముల మఱుగున దాగియున్న సత్యములను తెలిసికొనుటకు ప్రయత్నించవలసినదని స్వామిజీ కోరెను.

ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ తనగ్రంథములో నొకచోట పేర్కొన్నట్లు గ్రీకు సంస్కృతికిని, భారతీయ సంస్కృతికిని ఏమేమి పోలికలున్నను, గ్రీసుదేశస్థు డొక్కనికైనను సంస్కృతభాషా ప్రవేశము కలదని ఋజువు కానంతవఱకు ప్రాచీనభారతము, ప్రాచీనగ్రీసుకు ఏ విధముగా గాని సహాయపడినట్లు నిర్ధారించుటకు వీలులేదు. కాని, భారతీయుల ఖగోళశాస్త్రములోని పదములను బోలిన పదములు గ్రీకుల ఖగోళశాస్త్రములో నుండుటచేతను, భారతదేశపు సరిహద్దులలో గ్రీకులు చిన్నరాజ్యమును స్థాపించియుండుటచేతను ప్రతివిషయములో—భారతీయ సారస్వతములో, భారతీయ ఖగోళశాస్త్రములో, భారతీయ గణితశాస్త్రములో—

గ్రీసు సహాయపడినదని పాశ్చాత్యప్రముఖులు నిర్ణయించుట మిక్కిలి చోద్యము. అంతేకాదు; ఒకరు భారతీయ విజ్ఞాన శాస్త్రములన్నియు గ్రీకుల విజ్ఞానశాస్త్రముల ప్రతిధ్వనులే యను సిద్ధాంతముచేయునంతటి సాహసమున కొడిగట్టినారు!

ఈ శ్లోకమును పరిశీలింపుడు :—

మ్లేచ్ఛా వై యవనాః తేషు ఏషా విద్యా ప్రతిష్ఠితా ।
ఋషివతే తే ఽపి పూజ్యంతే...

యవనులందు, మ్లేచ్ఛులందు, ఈ విజ్ఞానశాస్త్రము ప్రతిష్ఠితమై యున్నది. (కాబట్టి) వారు సహితము ఋషులవలె ఆరాధ్యులు. ...అవధులు లేకుండ పాశ్చాత్యు లెంతగా విశృంఖలమైన ఊహాగానమున విలోలులైరి! ఈ శ్లోకమునుబట్టి ఆర్యులు మ్లేచ్ఛుల దగ్గఱ శాస్త్రము నేర్చుకొనిరన్నమాట ఎట్లు నిజమో రుజువుచేయ వలసియున్నది. ఇది ఆర్యగురువులదగ్గఱ విద్యనేర్చుకొనిన మ్లేచ్ఛ శిష్యులను ప్రస్తుతించుట అయియుండవచ్చును. ఆర్యవిజ్ఞానమును తెలిసికొనుటకు మ్లేచ్ఛులను ప్రోత్సహించుట యిట్టి ప్రశంసకు కారణమై యుండవచ్చును.

రెండవ విషయము : ఆర్యుల విజ్ఞానశాస్త్రము లన్నియు బీజరూపములో వేదములయందుండగా, ఆ శాస్త్రములలోని ప్రతి అంశము వేదకాలమునుండి నేటివఱకు గుర్తింపబడినట్లు నిర్దుష్టముగా చూపుటకు వీలయియుండగా ఆర్యులపై గ్రీకుల ప్రభావమున్నదని డొంకతిరుగుడుగా నిర్ణయముచేయుటెందుకు? "తేనె యింటిలో నుండగా కొండలలోనికి పోయి వెదకు టెందుకు?" అని సంస్కృతములో సామెత కలదు.

మఱొక విషయము : ఆర్యుల ఖగోళశాస్త్రములోని గ్రీకు పదములను పోలిన ప్రతిపదము సంస్కృతమునుండి పుట్టినదని చూపవచ్చును. సూటిగా చెప్పదగు వ్యుత్పత్త్యర్థమును విడిచిపెట్టి

ఆ పదములకు గ్రీకుమూలము నన్వేషించుటకు పాశ్చాత్యపండితుల కేమి యధికారము కలదని స్వామిజీ ప్రశ్న.

అదేవిధమున కాళిదాసు, తదితర భారతీయ కవుల నాటకములలో యవనిక (తెర) అను పదమును చూడగనే ఆనాటి నాటకసాహిత్యమంతటిపైన యవనిక (గ్రీకు) ప్రభావము కలదని నిర్ణయముచేసెడి పక్షమున ఆర్యుల నాటకములు గ్రీకుల నాటకములవలె నున్నవా యన్న విషయము ప్రప్రథమముగా పోల్చి పరిశీలించుట అత్యావసరము. పోలిక ఏమైన ఉన్నట్లు తోచిన యెడల అది కేవలము పలవరింతే గాని అందు యథార్థమేమాత్రము లేదని ఉభయభాషలలోని నాటకముల అభినయము, రీతి పరిశీలించినవారు విధిగా అంగీకరింపగలరు. ఆ గ్రీకు బృందగానమేది? గ్రీకు నాటకములలో తెర స్టేజికి ఒకప్రక్క నున్నది. ఆర్యుల నాటకములలో సరిగా దానికి ఆవలిప్రక్క నున్నది. గ్రీకు నాటకములో భావప్రకటన ఒకతీరుగా నున్నది. ఆర్యుల నాటకములో మఱొక తీరుగా నున్నది. ఆర్యుల నాటకములకు, గ్రీకుల నాటకములకు పోలిక యేమాత్రము లేదు; షేక్స్పియర్ నాటకములు భారతీయుల నాటకములను చాలవఱకు పోలియున్నవి. కాబట్టి షేక్స్పియర్ తన రచనలన్నిటికి కాళిదాసుకు, ఇతర ప్రాచీన భారతీయ నాటకకర్తలకు ఋణపడియున్నాడని, పాశ్చాత్య సారస్వతమంతయు భారతీయ సారస్వతమున కనుకరణమని చెప్పవచ్చును.

ఇంకొక సంగతి: ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ నిర్వచించిన తార్కికసూత్రము ననుసరించి ఆయన సిద్ధాంతములకే వ్యతిరేకముగా చూపవచ్చును. ఎప్పుడో ఒక్క హిందువునకైనను గ్రీకు భాషాప్రవేశము గలదని ఋజువుచేయగలుగువఱకు గ్రీకుల ప్రభావము మాట ఎత్తకూడదు.

అదేతీరున భారతీయ శిల్పములో గ్రీకు ప్రభావము గల దనుట పూర్తిగా నిరాధారమైన విషయము.

బుద్ధుని పూజకంటె శ్రీకృష్ణునిపూజ ప్రాచీనమైనదని శ్రీవివేకానందస్వామి వచించెను. మహాభారతరచన, భగవద్గీతా రచన ఒకేనాటిది కాదనినచో నిశ్చయముగా భగవద్గీత మహాభారతమునకు పూర్వపుదేగాని ఎంతమాత్రము తరువాతిదిగాదు. గీతలోని భాషాశైలి, మహాభారతములోని భాషాశైలి ఒకటే. ఆధ్యాత్మికభావములను వివరించుటకు గీతలో ప్రయోగింపబడిన విశేషణము లనేకములు మహాభారతములోని ఆరణ్యపర్వము, తదితర పర్వములందు ప్రాకృతభావప్రకటనలందు ప్రయోగింపబడినవి. ఆ పదములు ఒకేకాలములో ధారాళముగను, విస్తృతముగను వ్యవహారమందున్నగాని అంతటి సామ్యము సాధ్యముగాదు. గీతలోని భావక్రమము, మహాభారతములోని భావక్రమము ఒక్కటే; గీత సమకాలిక మతశాఖలన్నిటి సిద్ధాంతములను గమనించియుండగా బౌద్ధమతము నేల పేర్కొనదు?

రచయితలు మిక్కిలి జాగ్రత్తగా రచించిన గ్రంథములలో కూడ—బుద్ధుని తరువాత జరిగిన రచనలలో బుద్ధుని గురించిన ప్రస్తావన మినహాయింపబడలేదు; బుద్ధుని తరువాత బయలుదేరిన సారస్వతములోనో, చరిత్రలలోనో, కథలలోనో, వ్యాసముల లోనో, ప్రతి గ్రంథములో ఏదో ఒకచోట ఏదో ఒకరూపములో బుద్ధుని గురించియో, బౌద్ధమతమును గురించియో ప్రస్తావన గలదు. గీతలో అట్టి ప్రస్తావన ఎవరైన చూపగలరా? అంతేకాదు; గీత వివిధమతశాఖల సామరస్యమునకు ప్రయత్నించినది. అందేదియు న్యూనతచేయబడలేదు. గీతాకారుని మృదుస్పర్శ బౌద్ధమతమునుమాత్ర మేల నిరాకరించెను? ఈ ప్రశ్న కింతవరకు సమాధానము లేదు.

భగవద్గీత బుద్ధిపూర్వకముగా దేనిని తృణీకరించలేదు. అందుకు కారణము భయమా? అది మచ్చునకైనను అందు లేదు. వేదములను ప్రతిష్ఠించినవాడు, వానికి వ్యాఖ్యానముచేసినవాడు జగత్ప్రభువే. అవసరమైన సందర్భములలో వేదములలోని సాహసోక్తులను మందలించుటకు సహితము శ్రీకృష్ణుడు సందేహింపలేదు. ఇక బౌద్ధమతమును గుఱించి ఆతడు భయపడవలసిన అవసరమేమి?

పాశ్చాత్య విద్వాంసులు తమ జీవితమంతయు ఒక గ్రీకు గ్రంథపరిశోధనకు వినియోగింతురు. అదేవిధమున వారు ఒక సంస్కృతగ్రంథపరిశోధనకు తమజీవితమును వినియోగించినచో లోకమునకు కావలసినంత వెలుగు లభించగలదు. ముఖ్యముగా మహాభారతము భారతదేశచరిత్రలో అమూల్యమైన గ్రంథము; దీని నింతవఱకు పాశ్చాత్యులు సవ్యముగా పఠించనయినా పఠించ లేదనుట అతిశయోక్తిగాదు.

ఉపన్యాసానంతరము సభలోనివారు పలువురు ఈ విషయమై తమ అభిప్రాయములను ప్రకటించిరి. కొందఱు అనుకూలముగాను, మరికొందఱు ప్రతికూలముగాను చెప్పిరి. స్వామిజీ అభిప్రాయములతో చాలవఱ కేకీభవించితిమని వారు తెలియజేసిరి. వెనుకటి సంస్కృతపండితుల అభిప్రాయము లంతరించినవని వారు స్వామిజీకి స్పష్టీకరించిరి. ఆధునిక సంస్కృత పండితుల అభిప్రాయములు చాలవఱకు స్వామిజీ అభిప్రాయములే యని వారు తెలియజేసిరి. భారతదేశ యథార్థ చరిత్ర విశేషముగా భారతీయ పురాణములలోను, సంప్రదాయములలోను కలదనికూడ వారు విశ్వసించిరి.

కడపట అధ్యక్షుడు తన ప్రసంగములో స్వామిజీ అభిప్రాయములనుచాలవఱకంగీకరించెను; మహాభారతరచనాకాలము,

గీతారచనాకాలము ఒకటే అని మాత్ర మాత డంగీకరింపలేదు. అందుకు కారణముగా గీత మహాభారతములోని భాగము కాదని పాశ్చాత్యవిద్వాంసులనేకమంది యభిప్రాయమని ఆయన చెప్పెను.

కాంగ్రెస్ సాధారణ నివేదికలో ఉపన్యాస సారాంశము ఫ్రెంచిభాషలో ముద్రింపబడగలదు.



# భారతదేశము : అందలిమతము, ఆచారములు

## (సాలెం ఈవినింగ్ న్యూస్, ఆగస్టు 29, 1893)

నిన్నమధ్యాహ్నము గాలి వేడిగా వీచుచున్నను థాట్ అండ్ వర్క్ క్లబ్బు సభ్యులు పలువురు తమ అతిథిమిత్రులతో కలిసి హిందూసన్న్యాసి వివేకానందస్వామి యుపన్యాసము వినుటకు వెస్లే చర్చిలో సమావేశమైరి. ఇతడిప్పు డీదేశములో పర్యటించు చున్నాడు. పవిత్రగ్రంథములగు వేదములలో చెప్పబడిన హిందూ మతమును గుఱించి యితని ప్రసంగమును వినుటకే ముఖ్యముగా వారు వచ్చిరి. ఇతడు వర్ణవిభాగము సాంఘికవ్యవస్థమాత్రమే అనియు, అది మతముపై ఆధారపడినదికాదనికూడ చెప్పెను.

అత్యధికసంఖ్యాకప్రజల దారిద్ర్యమును గుఱించి వారు నొక్కి వక్కాణించిరి. యునైటెడ్ స్టేట్స్‌కంటె మిక్కిలి చిన్న దగు భారతదేశములో రెండువందల ముప్పైకోట్ల ప్రజలు కలరు. వీరిలో ముప్పైకోట్లమంది సగటున ఒక్కొక్కరు నెలకు ఏబది సెంట్లకంటె తక్కువగా ఆర్జింతురు. కొన్నికొన్ని సందర్భములలో దేశములోని కొన్ని జిల్లాలలోని ప్రజలు యావన్మంది నెలల తరబడి, సంవత్సరముల తరబడి ఒకానొక చెట్టుపువ్వులు తిని కడుపు నింపుకొందురు. అవి యుడుకబెట్టిన పిమ్మట తినుటకు తగి యుండును.

---

* ఆదినములలో వివేకానందస్వామిపేరు అమెరికన్ వార్తాపత్రికలలో నానావిధముల వర్ణక్రమముతో వ్రాసెడివారు. ఉపన్యాసవిషయములు క్రొత్తవి యగుటచేత తప్పుగా ప్రచురింపబడినవి.

ఇతర మండలములలో జనుల ఆహారము బియ్యమే. స్త్రీలు, శిశువులు గంజిత్రాగి తమ క్షుద్బాధ తీర్చుకొందురు. వరిపంట తిన్నగా పండనియెడల కాటకము తప్పదు. జనులలో సగముమంది ఏకభుక్తములోనే జీవింతురు. తక్కిన సగముమందికి తరువాత భోజనమెక్కడలభించునో తెలియనిస్థితిలో నుందురు. జనులకు కావలసినది యింకను నెక్కువ మతముగాదని, ఘనతర మతముకాదని, "క్రియాపరత్వమే" అని వివేకానందస్వామి చెప్పెను. ఆహారములేక క్షుద్బాధకు గుఱియగుచున్న లక్షల కొలది ప్రజలను గుఱించి అమెరికా ప్రజల కాసక్తికలిగింపగల ననెడు ఆశతో అత డీ దేశమునకు వచ్చెను.

తన దేశీయులస్థితిని గుఱించి, వారి మతమును గుఱించి, అతడు చాలసేపు ప్రసంగించెను. ఉపన్యాసముచేయుచుండగా డాక్టర్ యఫ్. ఎ. గార్డ్నర్, సెంట్రల్ బాప్టిస్ట్ ఛర్చికి చెందిన రెవరెండ్ యస్. యఫ్. నాబ్స్, వివేకానందస్వామిని పదేపదే ప్రశ్నలువేసిరి. అక్కడ క్రైస్తవమత ప్రచారకులకు చక్కని సిద్ధాంతములు గలవని, సదభిప్రాయములతోనే వారు తమపని ప్రారంభించిరని, కాని, జనుల పారిశ్రామికాభివృద్ధికి చేసిన దేమియులేదని అతడు చెప్పెను. అక్కడి ప్రజలను మతవిషయ ములలోను శిక్షితులనుచేయుటకు క్రైస్తవమత ప్రచారకులను పంపుటకు బదులు పారిశ్రామికవిద్యలో శిక్షణ ఒసగుటకై ఎవరి నయినను పంపుట మేలని అతడు సూచించెను.

దుఃస్థితిలోనున్న భారతీయులకు క్రైస్తవులు సహాయపడ లేదా, శిక్షణకై పాఠశాలలు నెలకొల్పి క్రియాపూర్వకముగా తోడ్పడలేదా అని యడుగగా, అప్పుడప్పు డా విధముగా చేసిన మాట నిజమే అని వక్త చెప్పెను. కాని, అటువంటి సమయము లలో జనులపై వారిప్రభావము ప్రసరించుటకు వీలులేకుండ శాస నము నివారించుచుండెననియు, అందుచేత మత ప్రచారకులు

చెప్పుకొన దగిన ఘనకార్యమేమియు సాధింపలేదనియు అతడు నుడివెను.

భారతస్త్రీల దుఃస్థితికిగల కారణములనతడు చెప్పుచు స్త్రీ యందు పురుషులకు గౌరవాధిక్యముచేత ఆమె నిల్లుదాటి బయట అడుగుపెట్టనీయకుండుటే శ్రేష్ఠమని భావింపబడినట్లు తెలియ జేసెను. హైందవస్త్రీలయం దత్యంత పూజ్యభావముండుటచేత వారంతఃపురములోనే యుంచబడిరి. సహగమనమును గుఱించి ప్రస్తావించి స్త్రీ భర్త నత్యధికముగా ప్రేమించెననియు, ఆమెకు భర్తను విడిచి జీవించుట అసాధ్యమయ్యెననియు అతడు చెప్పెను. వివాహమునందు భార్యాభర్తలు ఒక్కరుగా నుండునట్లే మర ణమునందును వారొక్కరుగానుండవలెను.

విగ్రహపూజను గుఱించి, జగన్నాధరథచక్రములక్రింద జనులు పడుటను గుఱించి ప్రశ్నలు వేయబడెను. జగన్నాధరథము క్రిందపడువారు మతోన్మాదులు, విశేషముగా కుష్ఠరోగులు అనియు, ఆ విషయమునకు హిందువులను దూషించుట తగదనియు నితడు చెప్పెను.

పారిశ్రామికాభివృద్ధికి తనదేశములో సన్న్యాసులను సంఘ ముగా ఏర్పాటుచేయుట తన ప్రధానమగు కృషియని అతడు తెలియజేసెను. వారు ప్రజలకు పారిశ్రామికవిద్యను గఱపి తన్మూ లమున ప్రజల స్థితిగతులను చక్కబఱచి, వారి యభివృద్ధికి తోడ్పడగలరు.

నేటి మధ్యాహ్నము వివేకానందుడు భారతీయ బాలబాలి కలను గుఱించి 166 నార్త్‌స్ట్రీటులో ప్రసంగించును. వినగోరు బాలబాలికలుగాని, యువజనులుగాని ఎవరయినను రావచ్చును. మిసెస్ వుడ్స్ దయతో తన తోటలో సభజరుపుకొనుట కనుమ తించినది. వివేకానందుడు అందమైన వ్యక్తి, నలుపురంగు అయినను స్ఫురద్రూపి. అతడు కొంచెము పసుపుపచ్చరంగుతో కలసిన ఎఱ్ఱని

అంగరఖా ధరించును. ఆతనికి నడుముదగ్గఱ పట్టీయుండును. అతడు పసుపుపచ్చని వర్ణముగల పాగా ధరించును. సన్న్యాసి గనుక అత డెవరితో నయినను కలసి ఆహారపానీయములు సేవించును.

* * *

(డెయిలీ గెజెట్, ఆగస్టు 29, 1893)

భారతదేశమునుండివచ్చిన రాజాస్వామి వివేకానంద నిన్న మధ్యాహ్నము వెస్‌లీ ఛర్చిలో సాలెంలోని థాట్ అండ్ వర్క్ క్లబ్బు అతిథిగా నుండెను.

స్త్రీలు, పురుషులు పెక్కుమంది వచ్చి ఆప్రసిద్ధ సన్న్యాసితో అమెరికావారి మర్యాద ననుసరించి కరస్పర్శ కావించిరి. స్వామి నారింజపండురంగు అంగరఖా ధరించెను. ఎఱ్ఱని నడికట్టు, పసుపుపచ్చని తలపాగా ధరించెను. పాగా ఒక కొస ప్రక్కకు వ్రేలాడుచుండెను. దానినతడు చేరుమాలుగా వాడుచుండెను. కాలికి కాంగ్రెస్ కాలిజోడు ధరించెను.

అతడు తనదేశప్రజల పరిస్థితులను గుఱించి, వారి మతమును గుఱించి దీర్ఘముగా ప్రసంగించెను. ప్రసంగముసాగుచుండగా డాక్టర్ యఫ్. ఎ. గార్డ్‌నర్, సెంట్రల్ బాప్టిస్టు ఛర్చికి చెందిన రెవరెండ్ యస్. యఫ్. నాబ్స్ పలుమాఱులు ప్రశ్నలు వేసిరి. క్రైస్తవ మత ప్రచారకులకు చక్కని సిద్ధాంతములు గలవని, సదభిప్రాయములతోనే వారు తమపని ప్రారంభించిరని, కాని, వారు జనులపారిశ్రామికాభివృద్ధికేమియు చేయలేదని అతడు చెప్పెను. భారతీయులకు మతవిషయములో శిక్షణనిచ్చుటకు అమెరికన్ ప్రచారకులను పంపుటకుబదులు పారిశ్రామిక

* అమెరికన్ పత్రికలో బహువిధములగు విశేషణములు స్వామిజీకి వ్యవహరింపబడినవి. రాజా, బ్రాహ్మణుడు, పురోహితుడు వగైరా పదములు వాడబడినవి. ఇందుకు బాధ్యత వారిదే.

విద్యలో శిక్షణనిచ్చుట కెవరినయిన పంపిన బాగుండునని యతడు సూచించెను.

భారతదేశములోని స్త్రీ పురుషుల సంబంధమును గుఱించి ప్రస్తావించి, భర్త లెన్నడును అసత్యమాడి మొఱుగరని, బాధించి మొఱుగరనిచెప్పి, వారుచేయని పాపము లనేకము నేకరువు పెట్టెను.

దుఃస్థితిలో నున్న భారతీయులకు క్రైస్తవులు సహాయపడ లేదా, శిక్షణాపాఠశాలలు నెలకొల్పి క్రియాపూర్వకముగా తోడ్పడలేదా యని ప్రశ్నింపగా, అప్పుడప్పు డాపనులు చేసిన మాట నిజమే అని ఆయన తెలిపెను. కాని, అట్టి సమయములలో వారిప్రభావము జనులపై ప్రసరించుటకు వీలులేకుండ శాసనము నివారించుటచేత వారు చెప్పతగిన కృషి చేయలేదని యతడు వచించెను.

హిందూ స్త్రీల దుఃస్థితికి కారణములను చెప్పుచు, స్త్రీల యందు పురుషుల కత్యంత గౌరవముండుటచేత వారి నిండ్ల నుండి బయటకు పోనీయకుండుటే మేలని భావింపబడెను. హిందూ స్త్రీలయం దత్యంత పూజ్యభావముండుటచే వారి నంతఃపురము లోనే యుంచిరి. భర్తలు చనిపోయినప్పుడు భార్యలనుకూడ కాల్చి చంపివేసెడి పూర్వాచారమును గుఱించి యతడు ప్రస్తా వించి భార్యకు భర్తయందత్యంతప్రేమయుండెడి దనియు, భర్తను విడిచిన బ్రతుకు భార్య కసాధ్యముగా తోచెననియు చెప్పెను. వివాహమందు వారొక్కరై యుండిరి. మరణమునందును వా రొక్కరై యుండవలసినదే!

విగ్రహపూజను గుఱించి, జగన్నాథరథచక్రముల క్రింద జనులు పడిపోవుటను గుఱించి అతనినడిగిరి. మతోన్మాదులు, ముఖ్య ముగా కుష్ఠరోగులు మాత్రమే జగన్నాథరథముక్రింద పడెదువా

రనియు, కనుక ఈ విషయమునకు హిందువులను దూషింపరాదని చెప్పెను.

విగ్రహపూజ విషయమై అతడు మాట్లాడుచు ప్రార్థన చేయునప్పుడు మీరేమి భావించెదివారని యతడు క్రైస్తవులనడిగితినని యు, ఛర్చి గుర్తుకువచ్చునని కొందఱు, దే-వు-డు తోచునని మఱికొందఱు చెప్పిరని తెలియజేసెను. తన దేశీయులు విగ్రహములను గుర్తుకు తెచ్చుకొందురని యతడు తెలియజేసెను. పామరులకు విగ్రహములవసరమే. పూర్వకాలమున వారి మతము పుట్టినప్పుడు స్త్రీలు ఆధ్యాత్మికప్రతిభ, గొప్ప మనోదార్ఢ్యముగలవారుగా గుర్తింపబడిరి. అయినను నేడు స్త్రీలు పతనముచెందిరని అతడంగీకరించినట్లు తోచెను. తినుట, త్రాగుట, ఉబుసుపోవు ముచ్చట్లు, పరదోషకథా కథనము తప్ప వారికి మఱియొక ఆలోచనయే లేదు.

తన దేశములో పారిశ్రామికాభివృద్ధికి సన్న్యాసుల సంఘము నేర్పాటుచేయుట తన ముఖ్యమైన కృషియని వక్త తెలియజేసెను. వారు జనులకు పారిశ్రామిక విద్య బోధించి, తన్మూలమున ప్రజల స్థితిని బాగుచేసి, వారి యభివృద్ధి సాధింపగలరు.

* * *

(సాలెం ఈవినింగ్‌న్యూస్, సెప్టెంబరు 1, 1893)

ఈ నగరములో కొలది దినములుగా గడపుచున్న విద్యాసంపన్నుడగు భారతీయ స్వామిజీ ఆదివారము సాయంకాలము 7-30 గంటలకు ఈస్ట్ ఛర్చిలో ఉపన్యసించును. పూజ్య వివేకానందస్వామి గత భానువారము సాయంకాలము అనిస్క్వామ్‌దగ్గఱ ఎపిస్కోపల్ ఛర్చిలో ఉపన్యసించెను. పాస్టర్, హార్వర్డ్ ప్రొఫెసర్ రైట్ స్వామిని ఆహ్వానించి, విశేషాదరము చూపెను.

సోమవారమురాత్రి స్వామిజీ సారటోగాకుపోవును. అక్కడ అతడు సోషల్ సైన్సు అసోసియేషన్ సభలో నుపన్యసించును. తరు

వాత అతడు చికాగో పార్లమెంటు సమావేశములో ప్రసంగించును. భారతీయ విశ్వవిద్యాలయములలో ఉన్నతవిద్య నభ్యసించిన వారందఱివలెనే వివేకానందస్వామి ఆంగ్లమును సులువుగాను, నిర్దుష్టముగాను మాట్లాడును. గత మంగళవారమునాటి సాయంకాలము భారతదేశములోని ఆటలు, పాఠశాలలు, ఆచారములు, మర్యాదలను గుఱించి అతడు పిల్లలతో జరపిన ముచ్చట అమూల్యమై, ఆహ్లాదము కలిగించినది. ఒకయువతి తన్ను తన ఉపాధ్యాయిని తన "వ్రేలు దాదాపు విఱిగిపోయెడివఱకు ముద్దాడినది" ...... అని చెప్పగా అతని హృదయము ద్రవించినది. సన్న్యాసులందఱివలె వివేకానందుడు కూడ తనదేశమంతట పర్యటించి, సత్యము, ధర్మము, సౌభ్రాత్రము బోధింపవలెను. విశేషశుభముగాని, భీకరమైన అశుభముగాని యతనిదృష్టినుండి మఱుగు కాజాలదు. ఇతరమతస్థులందఱియం దతడు మిక్కిలి సహృదయుడు. అతనితో నేకీభవింపనివారిని గుఱించి యతని నోటినుండి దయారసము నొలికించు మాటలే గాని వేఱు పలుకులు రావు.

*　　　*　　　*

## (డెయిలీ గెజెట్, సెప్టెంబర్ 5, 1893)

భారతీయుడగు రాజాస్వామివివేకానంద ఆదివారము సాయంకాలము ఈస్టుచర్చిలో భారతదేశమతమును గుఱించి, తన దేశ పేదప్రజలను గుఱించి యుపన్యసించెను. సభకు చాలమంది వచ్చిరి. కాని, రసవంతముగా ప్రసంగించిన వక్తకు, విషయ ప్రాముఖ్యమునకు తగినంతమంది రాలేదు. స్వామిజీ తన దేశీయ వస్త్రములు ధరించెను. అతడు నలుబదినిమిషములసేపు ప్రసంగించెను. నేటి భారతదేశము ఏబదియేండ్లనాటి భారతదేశము కాదు. నాటియవసరము నేటి యవసరము కాదు. క్రైస్తవమతప్రచారకు లీనాడు భారతీయులకు మతవిషయములోగాక పారిశ్రామిక,

సాంఘికవిషయములలో విద్యాబోధ చేయుటవసరమని వక్త చెప్పెను. హిందువులకు కావలసినంత మతము వారికి గలదు. హిందూమతము ప్రపంచములోకెల్ల ప్రాచీనతమ మతము. స్వామీజీ చక్కని వక్త. అతడు శ్రోతల నాకర్షించెను.

* * *

## (డెయిలీ సారటోజియన్, సెప్టెంబరు 6, 1893)

......తరువాత హిందూస్థాన్‌లోని మద్రాసుకు చెందిన సన్న్యాసి వివేకానందస్వామి ఉపన్యాసవేదిక నెక్కెను. అతడు భారతదేశమంతటను సంచరించి బోధచేసెను. అతనికి సాంఘిక విజ్ఞానమునం దాసక్తి మెండు. అతడు మేధావి, జనరంజకముగా ప్రసంగించెడి వక్త. భారతదేశములో మహమ్మదీయుల పరిపాలన గురించి అతడు ప్రసంగించెను.

నేటి కార్యక్రమములో కొన్ని ముఖ్యవిషయములున్నవి. హార్ట్‌ఫోర్డ్‌కు చెందిన కర్నల్ జాకబ్ గ్రీన్ "బైమెటలిజం" (వెండి, బంగారు నాణెముల సమవ్యవహారము) గురించి ప్రసంగించును. వివేకానందస్వామి మరల ప్రసంగించును. అత డీ పర్యాయము భారతదేశములో వెండి వినియోగమును గురించి మాట్లాడును.



# హిందువుల విశిష్టత

## (బోస్టన్ ఈవినింగ్ ట్రాన్స్‌క్రిప్ట్, సెప్టెంబర్ 30, 1893)

### (సాయంకాల పత్రికా ప్రతిలిపి)

చికాగో, సెప్టెంబర్ 23 :

ఆర్ట్‌పాలెస్ (కళామందిర) ద్వారమున కెడమప్రక్క ఒక గది కలదు. దానిమీద "నెం. 1—లోపలికి రాకూడదు" అని వ్రాయబడియున్నది. "కాంగ్రెస్ ఆఫ్ రెలిజిన్స్" (మతమహాసభ) లోని వక్తలెల్లరు కొంచెము ముందు వెనుకగా అక్కడకు వచ్చి విశ్రాంతి తీసికొందురు. వారొకరితో నొకరు మాట్లాడు కొనుటకుగాని, ప్రెసిడెంటు బోనీతో మాట్లాడుటకుగాని వచ్చుచుందురు. బోనీ ఏకాంతకార్యాలయము ఆ గదియందొక మూల నున్నది. ఎవరును దగ్గఱకువచ్చి లోపలికి తొంగిచూడ కుండునట్లు తలుపులదగ్గఱ కాపలా ఏర్పాటుచేయబడినది. సాధారణముగా జనులు వచ్చి దూరమునుండి మడత తలుపు రెక్కలో నుండి చూచుటకు ప్రయత్నింతురు. సభకు వచ్చెడి ప్రతినిధులు మాత్రమే లోపలికి ప్రవేశింతురు. కాని, అతిథి ప్రముఖులను కొంచెముసేపు దగ్గఱగా చూచి మాట్లాడుటకు, 'హాల్ ఆఫ్ కొలంబస్'లోని ఉపన్యాసవేదికమీదకంటె అధికమైన అంతరంగ సంబంధము నందుటకు బొత్తుగా వీలులేకపోలేదు.

ఆ గదిలో అందఱికంటె ఎక్కువగా దృష్టి నాకర్షించిన వ్యక్తి వివేకానందస్వామి యను నొక బ్రాహ్మణసన్న్యాసి. అతడు అంగసౌష్టవము గలవాడు. మహిమాన్వితమైన వైఖరి యందు అతడు హిందూస్థానీయులను పోలియుండెను. శుభ్రముగా

క్షౌరము చేసికొన్న నున్నని ముఖము; చక్కగా దిద్దితీర్చిన ముఖ లక్షణములు; తెల్లని పళ్లు; సోయగముగల పెదవులు. అతడు ముచ్చటించునప్పుడు తఱచుగా కరుణరసభరితమగు మందహాస ముచే నవి వేఱుపడుచుండును. సమస్థితియందున్న అతని చక్కని శిరస్సుకు నిమ్మపండు రంగు లేదా ఎరుపు రంగు పాగా చుట్టి యుండును. అతని యంగరఖాకు నడుము దగ్గఱ బెల్టు వంటి పట్టీ యుండును. అంగరఖా మోకాళ్ల క్రిందికి నుండును. అది చిక్కని నారింజపండు వర్ణమో, ముదురుకెంపు వర్ణమో గలిగి యుండును. అత డాంగ్లము మిక్కిలి చక్కగా మాట్లాడును. నిష్కల్మషముగా అడిగిన ప్రశ్నలకెల్ల వెంటనే సమాధానము లిచ్చును.

నిరాడంబరమగు రీతికి తోడు స్త్రీలతో సంభాషించునప్పు డతనియందు కొంత మితత్వము స్ఫురించును. అది యతని సన్న్యాసలక్షణమును సూచించును. "మీ సన్న్యాసధర్మమునకు సంబంధించిన శాసనములేవి" యని యడుగగా, అత డిట్లు చెప్పెను: "నేను నా యిష్టమువచ్చినట్లుండవచ్చును. నేను స్వతంత్రుడను. ఒక్కొక్కప్పుడు నేను హిమాలయపర్వతములలో నివసింతును. ఒక్కొక్కప్పుడు నగరవీథులలో నివసింతును. ఏ పూట నా కెక్కడ భోజనము దొరకునో నా కెన్నడు తెలియదు. నాదగ్గఱ ఎన్నడును డబ్బు ఉంచుకొనను. విరాళములు గొని నే నిటకు వచ్చితిని." అతడు నలుగడలజూచి, అప్పుడక్కడ ఉండుట తటస్థించిన తనదేశీయు లొకరిద్దఱిని చూపి, "నా విష యమై వారు బాధ్యత వహింతురు" అనెను. చికాగోలో తన భోజనపుఖర్చు ఒరులు భరింతురని యతడు సూచించెను. మీ రిప్పుడు ధరించినది సాధారణముగా సన్న్యాసులు ధరించెడి దుస్తు లేనా యని ప్రశ్నింపగా, "ఇవి మంచి దుస్తులు. నేనింటిలో నున్నప్పుడు చిరిగిన బట్టలే కట్టుకొందును. కాలికి జోడులేకుండ

నడతును. నాకు వర్ణవ్యవస్థయందు నమ్మకము కలదా? వర్ణ వ్యవస్థ సంఘవ్యవస్థ; దానికి మతముతో సంబంధము లేదు; నాతో అన్నికులములవారు కలసిపోవుదురు.''

వివేకానందస్వామి రీతి, నడవడి, వైఖరి చూడగా అతడు ఉత్తమవర్ణసంజాతుడను విషయము స్పష్టముగా తెలియుచున్నది. ఇచ్ఛాపూర్వకముగా సంవత్సరముల తరబడి దారిద్ర్యము ననుభవించినను, ఇల్లు వాకిలి లేక సంచారముచేయుచున్నను అతడు తన జన్మహక్కు అగు సౌజన్యమును, సాధుత్వమును కోల్పోలేదు; అతని వంశము పేరయినను తెలియదు; సన్న్యాసజీవితము గడప గోరి వివేకానందుడని పేరు పెట్టుకొనెను. ''స్వామి'' యనునది గౌరవసూచకముగా పేరు చివర చేర్చు పదమే. అతని వయస్సు ముప్పది సంవత్సరములకంటె ఎంతో ఎక్కువ ఉండదు. అతడీ జీవితసాఫల్యమునకు, పరతత్త్వమును గురించిన ధ్యానమునకు ప్రత్యేకముగా నియుక్తుడయినట్లు తోచును. అతని జీవితమునందింతటి పరివర్తనము కలుగుటకు కారణ మేమయి యుండునా యను సందేహ మెవరికయినను కలుగకపోదు.

సన్న్యాసియగుట కతడుచేసిన త్యాగములను గురించిన వ్యాఖ్యల కతడు వెంటనే యిట్లు సమాధానమిచ్చెను: ''ప్రతి స్త్రీయందును నాకు జగజ్జనని మూర్తియే కనబడుచుండ నే నేల వివాహమాడవలెను? నేనీత్యాగములన్నిటిని ఏల చేయుచున్నాను? పార్థివబంధములనుండి, అనుబంధములనుండి విముక్తుడనయి, పునర్జన్మ లేకుండ జేసికొనుటకు. నేను మరణించుటతోడనే భగవంతునిలో లీనమగుటకును, భగవంతునితో నొక్కడనై యుండుటకును వాంఛింతును. నే నొక బుద్ధుడ నగుదును.''

దీనిని బట్టి తాను బౌద్ధుడనని వివేకానందుడు చెప్పుట లేదు. ఏ పేరుగాని, ఏ మతశాఖగాని అతనికంటగట్టుటకు వీలు

గాదు. అతడు ఉత్తమ బ్రాహ్మణధర్మమునకు చెందినవాడు, హిందూతత్త్వముచేత ఉత్తేజితుడయినవాడు. హిందూతత్త్వము బహువిశాలమయినది. అది అతీతవిషయములను గుఱించి తలచుచు స్వప్నమయమగుచుండును; స్వీయ వ్యక్తిత్వమును లయమునుచేసి కొనుచుండును. అతడు సన్న్యాసి, పవిత్రపురుషుడు.

అతడు కొన్ని కరపత్రములు పంచిపెట్టుచుండును. అవి తన గురువరేణ్యుడు హైందవభక్తుడు నగు శ్రీరామకృష్ణపరమ హంసను గుఱించినవి. పరమహంస తనబోధలతో శిష్యులను, శ్రోతలను ఉత్తేజితులనుచేసెను. వారిలో పెక్కుమంది అతని మరణానంతరము సన్న్యాసాశ్రమము స్వీకరించిరి. మజుందారుకూడ ఆసాధుపుంగవుని తన గురువుగా పరిగణించెను. కాని, మజుందారు ఏసునాథుడు చెప్పినట్లు లోకములో పవిత్రతను ప్రతిష్ఠించుటకు కృషిచేయును.

అఖిలమతమహాసభలో వివేకానందస్వామిచేసిన యుపన్యాసము వియత్తలమువలె విశాలమైనది. సమస్తమతములందలి ఉత్కృష్ట విషయమును వ్యక్తమొనరించినది. అందు సర్వజనీన ధర్మలక్షణములన్నియు స్వీకరింపబడినవి.— సర్వమానవులయందు కారుణ్యము అందుగలదు. ప్రతిఫలాపేక్షగాని, శిక్షననుభవింపవలసి వచ్చునన్న భయముగాని లేక కేవలము భగవంతుని యందలి ప్రేమతో సత్కర్మలుచేయుట దానిలక్ష్యము. తన వ్యక్తిత్వాకర్షణచేతను, తాను వెల్లడించిన హృదయరంజకమగు భావములచేతను అతడు మతమహాసభలో అందఱి ఆదరాభిమానములు చూఱగొనెను. అతడు ఉపన్యాసవేదికమీద నిటునుండి అటు పోయినను సభికులు హర్షధ్వానములు చేయుదురు. వేలకొలదిమంది ప్రకటించెడి ఈ యాదరాభిమానముల నతడు స్వాతిశయభావ మేకోశమునను లేక శిశుభావముతో, నిరాడంబరముగా, కృతజ్ఞతాపూర్వకముగా స్వీకరించును. పేదతనమునుండి, నిస్స్వార్థసితి

నుండి యింతటి ప్రసిద్ధికి, ప్రాబల్యమునకు రాగలిగిన ఈ పరివ్రజ మీా నిరాడంబర యువబ్రాహ్మణసన్యాసికి సహితము విచిత్ర మగు అనుభవమే అయియుండగలదు. హిమాలయపర్వతములలో మహాత్ములు కలరని దివ్యజ్ఞానసమాజసభ్యులు కడుదృఢముగా నమ్మెదరు; అట్టి సోదరులను చూచితిరాయని అతని నడుగగా, "నే నొక్కరనయినను కలసికొనలేదు." అని ఆతడు స్పష్టముగా చెప్పెను. "అట్టివారు ఉన్న నుండవచ్చునేమో. హిమవత్పర్వతములు నాకు పరిచితములే. కాని, అట్టి వారిని నేనిక చూడవలసియున్నది." అని యతని భావము.



# వర్ణానుక్రమిక సూచి

